# రామకథా రసవాహిని

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా



S-KRISHNAREDDY 8-5-1978



Sri Rama

On 8-5-1978 Monday, I went to Puttaparti accompanying Sri Ramanna Garden Superinten-dent TTD; who visited the place to advice the formation of Papevaram. As we went there on invitation, Sri Kutumba Rao one of the trustees, exten-ded his courtesy and showed us all the important places. Sri Satya Sai Baba Swamijee was at Brindavan (White field) near Bangalore. So we could not meet him. This book was purchased there on 8-5-78

[signature] 8/5/78

(S. KRISHNA REDDY)
No. 25 'B' Type Qrs
TIRUMALA.
Hlth.

గమనిక :- సీత, రామ, లక్ష్మణ, హనుమంతుల సుందర విగ్రహములను భగవాన్ బాబా సృష్టించి బొంబాయికి చెందిన ఒక రామ భక్తునకు నిత్యపూజకొరకు అనుగ్రహించి యున్నారు. వాటి ఛాయాచిత్రమునే యీ పుస్తకము అట్టపై ముద్రింపబడినది.

ముద్రణ :
విక్టరీ ప్రెస్,
విజయవాడ-1
ఫోన్ : 74432

పబ్లిషర్సు :
శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్
పబ్లికేషన్ ఫౌండేషన్,
ప్రశాంతి నిలయం
(అనంతపురం జిల్లా)

# రామాయణ విశిష్టత

రామకథ సుధారసవాహిని. యుగయుగాంతరములనుంచీ ఈ కథ వేలాది పురుషులకు, స్త్రీలకు, బాలురకూ దుఃఖసమయాలలో ఉపశాంతినీ, చాంచల్యములో స్థిరచిత్తమునూ, నిస్పృహలో ఉత్సాహమునూ, సందిగ్ధస్థితిలో మార్గనిర్దేశమునూ ప్రసాదిస్తున్నది. ఇది ఉత్తేజకరమైన మహామానవ నాటకము. భగవంతుడు ప్రధాన పాత్రగా అవతరించి విశ్వనాటకరంగమున నటించాడు ఈ నాటకంలో. నరులూ, వానరులూ, జంతువులూ, రాక్షసులూ, పవిత్రులూ, అపవిత్రులూ ఆ నాటకంలో భూమికలు ధరించారు. ఈ నాటకంలో తన సందేశంద్వారా, ఆచరణలద్వారా ఆ దివ్యపురుషుడు మనకు ఉత్తమ వివేకం ప్రసాదించుతున్నాడు. ఈ కథ మానవ హృదయ వీణాతంత్రులను మీటి కరుణ, విషాదం, ఆనందం, ఆరాధన, పారవశ్యం, శరణాగతివంటి రసావేశాలు కలిగించి జంతుతత్వంలో, మానవత్వంలో నిగూఢంగా వున్న దివ్యత్వమును వికసింపజేయగలదు.

రామకథ లాలిపాటలుగా, జోలపాటలుగా, కథలుగా, గాథలుగా, నృత్యంగా, నాటకంగా, శిల్పంగా, చిత్రాలుగా, సంగీతంగా, కవిత్వంగా, ఉత్సవంగా, సంకేతంగా వివిధ రూపాలలో ప్రవహించింది. అసంఖ్యాకులైన సాధకులకూ, శోధకులకూ ప్రాణసమానంగా ఆనందనిదానంగా అలరారుతున్నది. రామాయణంలోని పాత్రలను ఆదర్శాలుగా గ్రహించి ఎందరో ఉద్ధారణ పొందినారు. ఉత్తమ సాహసమునూ ఉన్నత ఫలసిద్ధినీ రామాయణంలో పాత్రలలో దర్శించినారు. ఉజ్జ్వల నిదర్శనములైన ఆ పాత్రలు హింసాప్రవృత్తినీ, దుష్టత్వమూ, గర్వమునూ, నీచత్వమునూ దూరం చేసుకునే దారి చూపించగలవు. చంచల మనస్కులకు స్థిరవిశ్వాసమునూ సహనశీలమునూ అలవరచగలవు. మానవులు తమ ఉన్నతాశయములు ప్రకటించుట కొరకు ఎన్నో భాషలనూ, మాండలిక నుడికారములనూ ఏర్పరచుకున్నారు. రామ కథవల్ల వాటికి అసాధారణమైన అవ్యయమైన మాధుర్యం సమకూరింది.

సాయి సంకల్పమే ఈవిశ్వమునకూ, దాని పరిణామమునకూ కారణభూతము. దేశకాలముల రంగభూమిపైన సాగుచున్న ఈమహానాటకమునకు ఆ దివ్యమూర్తియే

ప్రణేత, సంచాలకుడు, నటనసూత్రధారి, ప్రేక్షకుడు, పరీక్షకుడు. ఆ మహా నాటక మందలి ఈ వీరగాథను తానే స్వయముగా మనకు వినిపించుచున్నారు దివ్యమూర్తి. ఆయనే రామపాత్రధారి. త్రేతాయుగమునందు సాయియే రామచంద్రుడై తమ కాలంలో పుట్టినవారికి సన్మార్గం చూపించి ఉత్తేజపూరితులను చేసి సాంత్వన మొసగి సంస్కరించినారు. ఇప్పుడు సాయిరామ రూపధారిగా ఆ మహోద్యమమునే నిర్వహించుచున్నారు. సనాతన సారథి పత్రికలో సుమారు ఏడు సంవత్సరాలపాటు ప్రతినెలా వరసగా రామకథారసవాహిని వెలువడి పాఠకులలో ఆసక్తినీ, ఆనంద మునూ రేకెత్తించినది. అవి చదువుతున్నప్పుడు పాఠకులకు సమకాలిక సంఘటన లనూ, అనుభవాలనూ చదువుతున్నట్లు, ప్రస్తుతకాలపు క్లిష్ట సమస్యలకు అవసర మైన పరిష్కారములను ఆదేశిస్తున్నట్లు అనుభూతి కలుగుతున్నది. ఈ పుటలను చదువుతున్న సమయంలో ఆనాటి అయోధ్యారాముడూ, ఇప్పుడు మనకళ్ళముందున్న సాయిరాముడూ ఒక్కరే అనే అభిప్రాయం కలిగి ఆనందం అతిశయిస్తుంది.

శాస్త్రవిజ్ఞానము ఈనాడు భూగోళమును ఒక చిన్న వ్యోమయాననౌక తయారు చేసింది. సంకుచితమైన ఆ పరిధిలోనే మానవజాతి తన భవితవ్యమునకు రూపురేఖలు దిద్దుకొనవలసిన పరిస్థితిని కల్పించింది. సాయితత్వము ఈ వ్యోమగామి నౌకను సుఖశాంతులకు ఆలవాలమైన ప్రేమమందిరముగా తీర్చిదిద్దుచున్నది. ఇటు వంటి విశ్వప్రేమ వికాసమునకు అవరోధాలు కల్పిస్తున్న దుష్టశక్తుల నిర్మూలనానికి తరుణోపాయం చూపటానికే సాయిప్రభువులు ఈ గ్రంథరచనను సంకల్పించినా రేమో! భయంకరమైన ఇంద్రియ సుఖలాలస, తల్లిదండ్రులనూ, గురువులనూ, ఆధ్యాత్మిక మార్గదర్శకులైన సాధుపురుషులనూ, పెద్దలనూ అగౌరవంగా చూసే వైఖరి, దాంపత్య ధర్మమునూ, కుటుంబ జీవనమునూ, బాంధవ్యములనూ, సాంఘిక మర్యాదలనూ చులకన చేసే శోచనీయమైన ధోరణీ, అధర్మపూరితమైన లక్ష్యాలను సాధించటానికి హింసాప్రవృత్తిని పెంచుకునే రాక్షసతత్వమూ, ఇతరులను బెదిరించి, పీడించి తమకూ, తమముఠాకూ లాభం సాధించాలనే పద్ధతీ—ఇటువంటి దుష్టశక్తులెన్నో ప్రేమతత్త్వ వికాసానికి ఆటంకాలు కలిగిస్తున్నవి.

సాకేత రాముని లీలావిశేషాలను సరళ సుందర మధుర శైలిలో సాయిరాములు

మనకు కథారూపంలో అందించారు. ఈ దివ్యగాథను మన కరములతో గ్రహించి, మనస్సుల నిలుపుకొని హృదయముల హత్తుకొనుట ఎంతటి మహాభాగ్యము! ఈ గ్రంథ పఠనముద్వారా మనలో పరివర్తన కలగాలి. సాయిరామతత్వమే పరమ సత్యంగా ఏకైక సత్యంగా గుర్తించి వర్తించాలి. విశ్వకుటుంబ సంస్థాపన కోసం సాయినాథుడు కొనసాగిస్తున్న మహోద్యమంలో సమర్థములైన శక్తివంతములైన, ఉత్సాహభరితములైన పరికరములుగా మనలను సంసిద్ధము చేసుకోవాలి.

"ఆ రామచంద్రుడే ఆరామచంద్రుడై తన బంటులను కనుగొనగ వచ్చె"

అని ప్రకటించారు సత్యసాయిప్రభువు. అలనాటి తన అనుచరులనూ, సేవకులనూ గుర్తించి ధర్మమును పునరుద్ధరణ చేసి, ప్రశాంతిధామమునకు మానవులను నడిపించు మహోద్యమములో తన సేవకులకు తగిన పాత్రలను దయచేయవలెనని వారి సంకల్పము. మనలో ప్రతి ఒక్కరికీ సముచిత పాత్రను వారు ప్రసాదించి, శాంతిధామస్వరూపదర్శనమును అనుగ్రహించవలెనని వేడుకొనుచున్నాను.

ఎన్. కస్తూరి, ఎం. ఎ., బి. యల్.

ఎడిటర్ : సనాతన సారథి

అనువదించినవారు : అమరేంద్ర.

"చిత్రకూట పర్వతంమీద ఉన్నప్పుడు శూర్పణఖ రావటం లక్ష్మణుడు ముక్కు, చెవులు కోయటం, రావణునితో చెప్పి సీతను లంకకు తీసుకురావటానికి కారణం అయింది శూర్పణఖ. రామాయణంలో మంధర, శూర్పణఖ పేర్లు కొన్ని లైన్లలో మాత్రమే చూపినారు కాని అంతకంటె ఎక్కువ చెప్పలేదు. ఇంత చిన్న శూర్పణఖ, మంధరల ద్వారానే రామాయణమంతా జరిగింది. అయోధ్యలో రాముడు అరణ్యానికి పోవటం, అరణ్యంలో సీత లంకను చేరటానికి ఈ శూర్పణఖ, మంధర కార్యకర్తలుగా ఉంటున్నారు. ఇంతకీ వీరెవరు? శూర్పణఖ కామము, మంధర క్రోధము. వీరిరువురే మన జీవితరామాయణానికి కారకులు. అయితే వీనిని జయించుట యెట్లా? అని నిరాశ పడనక్కరలేదు.

సర్వవిధములైన వాంఛలు భగవద్భావంతో అనుభవించుటతో కొంత ఆనందం కలుగుతుంది. ప్రకృతిని విశ్వసించి పరమాత్మని వేరుచేసినపుడు ఆనందం అందుకోలేం. కామత్యాగాన్ని రామాయణం మనకు నిరూపణ చేసింది. సర్వ సుఖములు త్యజించిన సీత, కామమును త్యాగము చేయుటచేత రామునితో పోవటానికి అవకాశం కలిగింది. తిరిగి త్యాగం కామంగా మారింది. మధ్యలో బంగారు లేడిపై కామం కలిగింది. అపుడు రాముడు దూరమైపోయాడు. ఇట్టి పవిత్ర అంతరార్థాన్ని బోధించింది రామాయణం కాని, అది ఏదో FAMILY FIGHT కాదు. ఉపనిషత్తులు, రామాయణ, భారత, భాగవతాలు పవిత్రమైన అంతరార్థాన్ని బోధిస్తున్నాయి."

—బాబా

# అంతరార్థము

ప్రతి దేహంలోనూ రాముడు అంతర్యామి. రాముడు ప్రతి అంతరంగం లోనూ ఆనందధాముడు, ఆత్మారాముడు. అంతరంగమందలి ఆనంద నిర్ఝరంనుంచి ఎగసివచ్చే రాముని చల్లని ఆశీస్సులు శాంతిసౌఖ్య ప్రదములు. మానవజాతి నంతనూ ఏక సూత్రముతో సంధింపగల ప్రేమకూ, ధర్మమునకూ ఆయన మూర్తీ భావము. రామాయణము రెండు పాఠములను బోధించుచున్నది. నిస్సంగత్వము ఎంతో విలువైనదనీ, ప్రతి ప్రాణిలోనూ దివ్యత్వమును గుర్తింపవలెననీ బోధించు చున్నది. అయోధ్యానగరపు భోగభాగ్యములను విసర్జించుటచేత సీతాదేవి వనవాస కాలమున రాముని సన్నిధి పొందగలిగినది. కాంచన మృగమునుచూచి మోహములో పడుటవలన ఆమె రాముని సన్నిధిని కోలుపోయినది. పరిత్యాగమువలన ఆనం దమూ, మోహబంధమువలన దుఃఖమూ ప్రాప్తించును.

లోకమున జీవించుచున్నప్పటికీ లౌకిక జీవితమున మునిగిపోరాదు. రాముని సోదరులూ, సహచరులూ, అందరూ ధర్మమూర్తులే. దశరధుడు పది ఇంద్రియము లున్న భౌతికకాయము. ఆయన ముగ్గురు రాణులూ సత్వరజస్తమోగుణములు. ఆయన నలుగురు కుమారులూ చతుర్విధ పురుషార్థములు. లక్ష్మణుడు బుద్ధి. సుగ్రీవుడు వివే కము. వాలి దుఃఖము. హనుమంతుడు ధైర్యము. భ్రాంతి అనే సాగరమున సేతు బంధనము జరిగినది. రావణుడు రజస్సు, కుంభకర్ణుడు తమస్సు, విభీషణుడు సత్వ గుణము. జీవితానుభవముల అగ్ని పరీక్షలలో సేకరించుకొనవలసిన బ్రహ్మ జ్ఞానము సీత.

రాముని వైభవమును భావనచేసి హృదయమును నిర్మలముగనూ, శక్తి మంతముగనూ దిద్దుకొనవలయును.

రాముడే ప్రాణాధారమైన సత్యము అను స్థిరవిశ్వాసమును పెంచుకొనవలెను.

—బాబా

# విషయసూచిక

# శ్రీ రామ తత్త్వము

రామనామము వేదసారము. రామచరితము పాలసంద్రము. నాటి మొదలు నేటివరకును యే యితర దేశములందు కాని, ఏ యితర భాషలందు కానీ, ఇంతటి మహాకావ్యము పుట్టలేదనియే చెప్పవచ్చును. అన్ని దేశములకు, అన్ని భాషలకు అంతర్ వాహినిగా ఆధారమై నిలచిన ఈ ప్రధాన కావ్యము భారతీయుల భాగ్యమా అన్నట్లు హిందువుల ఇలవేల్పయి, ఇంటి పేరనో, వంటి పేరనో ఈ రామ రసమును గ్రోలని భారతీయుడు లేడనియే చెప్పవచ్చును. పండితులు మొదలు పామరుల వరకును, కోటీశ్వరుడు మొదలు కూటిపేదవరకును, రోగులు మొదలు యోగుల వరకును, రామాయణము పారాయణ గ్రంథమై ప్రకాశించుచున్నది. సమస్త దోషములను హరించి, పాపములను రూపుమాపి, తనప్రాపును రూపముతో చూపునట్టి సుందర నామము ఈ రామం. సమస్తజలము సాగరమునుండియే పుట్టినటుల, సమస్తజీవులు రామంనుండియే పుట్టుచున్నవి. జలములేని సాగరము, రామ లేని జీవనం, లోకమున లేదు, రాదు. సాగరమునకు, సర్వేశ్వరునకు సన్నిహిత సంబంధము కలదు. సాగరమే సర్వేశ్వరునికి నివాసము. పాలకడలి శయనుడు అను పదమునకు ఇది ప్రధాన ప్రమాణము; కనుకనే ప్రచేతసుని కొమారుడగు మహాకవి వాల్మీకి రామాయణ భాగములకు కాండములని పేరిడెను. కాండమనే జలమనియు, చెరకనియూ మరొక పేరు కలదు. చెరకు యెన్ని వంకరులు తిరిగినను రసమునందలి తీపికి యెట్టి మార్పునూ లేనటుల "రామ కథా రస వాహిని" అనేక వంకరులు తిరిగి ప్రవహించినను అందులోని కరుణారసమున కెట్టి మార్పును లేదు. రామకథాప్రవాహము విచార, విషాద, వింత, హాస్య, అద్భుత, రౌద్ర, శృంగార ఇత్యాది వంకరులతో ప్రవహించినది. దీని అంతర్మర్మము ధర్మ ప్రధానమై యున్నది.

సరయూనది వంటిది రామ కథా రస ప్రవాహము. మానససరోవరమే దీని జన్మస్థానము. లక్ష్మణుడు గంగ వంటి వాడు. ఇది చిత్తమను శిఖర్మున పుట్టినది. రామ వాహిని కరుణారసము, లక్ష్మణ ప్రేమ భక్తిరసము. సరయూనది గంగలో

చేరినటుల కరుణారసము, భక్తిరసమున లీనమగును. రాముడు లక్ష్మణునితో యేకత్వమయినాడు. కరుణా ప్రేమల మిళితమే రామ అభిమతము; అదే భారతీయుల మతము, భక్తుల వ్రతము.

జీవుల పురుషార్థము సగము సత్యము మాత్రమే; అందుకు దైవ కరుణా కటాక్షమను మరిసగము సత్యము చేరినపుడే పూర్ణత్వము కాగలదు. మానవత్వము పురుషార్థముతో పాటు దైవానుగ్రహమును కూడ అందుకొనుటకు తగిన ప్రయత్నములు జరుపవలెను. ఆవలి గట్టును చేరుటకు ఇది ఆధారమైన సేతువు. రామాయణమును అవతార లక్ష్యముతో పారాయణ చేయవలెనే కానీ సామాన్య మానవుల జీవిత లక్ష్యముగా చేయరాదు. రామ ఆదర్శములను మాత్రము ఆచరణలయం దుంచుటకు తగిన కృషి సలుపవలెను. భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వవ్యాపకుడు, సర్వసంపన్నుడు. అట్టివారి ఆటలుకానీ, మాటలుకానీ సామాన్యములు కావు. జీవితోద్ధారమునకు తగిన బాటయే అతని వాక్పూట. రాముడు ఒక సూర్యవంశోద్ధారకుడని కానీ, లేక అయోధ్యాపరిపాలకుడగు దశరథ చక్రవర్తి కుమారుడనికానీ చూడరాదు. అట్టి సంబంధములు నిమిత్త మాత్రములు. నేటి పాఠకులు, పవిత్ర చరిత్రలను పఠించువేళ, వ్యక్తియొక్క సంబంధములను మాత్రమే లక్ష్యమునకు చేర్చుచుండుట పరిపాటయిన ఒక పెద్ద పొరపాటు. ఎట్లన, రాముల తండ్రికి ఇద్దరు భార్యలు. మొదటిభార్య యిట్టిది, రెండవభార్య యిట్టిది, ఆమె చెలికత్తెలు ఇట్టి వికారులు, ఇట్టి ఆకారులు, దశరథుడు చేసిన యుద్ధము లిట్టివి, అట్టివి అని లోకాభిరామాయణములనే లోనికి చేర్చుచుండుటచే, పాఠకులకు ప్రధాన అంశము పట్టు పడుట లేదు. వ్యర్థపు విషయములను వీడి సార్థకమార్గమును వెతకుచే చరిత్రలయొక్క పవిత్రమని తెలిసికొనవలెను. పవిత్రము చరిత్రలలోని అంతర్ ప్రవాహము. అది వెదకిన చిక్కును కాని, పైపై చూపులకు కనుపించదు. భక్తి శ్రద్ధలను అద్దములను మనో నేత్రములకు ధరించి, పరిశీలించిన, శుద్ధమైన జ్ఞానము సిద్ధించును.

పిప్పిని త్రిప్పికొట్టి చెరకునందలి రసమునే మానవులు జుర్రుకొనునటుల పుష్పముయొక్క అందచందములు చూడక, తుమ్మెద అందలి మధువునే గ్రోలినటుల, అగ్ని ప్రమాదమును యోచించక ప్రకాశమునే ఆకర్షించి మిడత దీపమును చేరునటుల, సాధకులు కావ్యమునందలి కరుణారసమునే లక్ష్యమందుంచుకొని మిగిలిన విషయములను విసర్జించవలెను. ఫలమునందలి విత్తనములు తోలు, పిప్పి వేరుచేసి, రసమునే అందుకొనుట లోక సామాన్యము. తోలు, పిప్పి, విత్త

నములు లేక ఫల ముండజాలదు. ఫలమునకు పైకమిచ్చితిమి కదాయని పైతోలు యెట్టివారును భుజింపరు. విత్తనములు మ్రింగి జీర్ణించుకోలేరు. అటులనే రామ ఫలమునందు రాక్షస చరిత్రలు అను తోలును, దానవ ప్రవర్తనలు అను విత్తనము లును లౌకిక విషయములను పిప్పి పొరలు, తెరలు అరలుగా అందులో కూడి యుండును. కరుణారసమునే ఆశించువారు పై వ్యర్థపు విషయరసములను మనసున చేర్పక చరిత్రను పఠించుట ఉత్తమ శ్రవణము. ఒకానొక సమయమున పరీ క్షిత్ మహారాజు శుకునకు నమస్కరించి "స్వామీ ! చాలాకాలము నుండియు నన్నొక సంశయము పీడించుచున్నది. దానిని తమరు తప్ప అన్యులు తీర్చలేరనియును నాకు తెలియును. తమరు వేరుగా తలంచక, ఈ దాసుని సంశయమును నిర్మూలము గావించుము. అది యేమన, నేను మా వంశీయులైన ప్రప్రథమ నాయకుడైన, మనువు మొదలు, నేటి మా తాత తండ్రుల చరిత్రల వరకునూ వింటిని, పఠించి తిని ఎవరి చరిత్రలయందు చూచినను యేదో ఒక మహర్షి రాజుల నాశ్రయించి యుండుటయును, మహా జ్ఞానవృద్ధులైన పండితులు రాజాజ్ఞలలో వారల దర్బారులలో కూడియుండుటయును చేరియుండును. సర్వసంఘపరిత్యాగులైన ఋషులును, లోకము మిధ్యము, బ్రహ్మసత్యమని గుర్తించిన పండితులును, రాజుల నాశ్రయించి యుండుటలోగల అంతరార్థమేమియో ! కారణములేని కార్యము పెద్దలు తలంచరు, చరించరు. కాన, ఈ సంశయమును తీర్చి నన్ను ధన్యుని గావింపుమనగా, శుకులు నవ్వి, రాజా ! సరియైన ప్రశ్న గావించితివి, వినుము. మహనీయులైన ఋషులు పవిత్రులైన పండితులు నిజమైన లోకపాలకులు. తాము గ్రహించిన సత్యములను, ఆచరించిన పవిత్ర కర్మలను, అందుకొన్న దివ్యదైవానుగ్రహమును, తోటి మాన వుల కందించి లోక శాంతులు చేకూర్చవలెనను వాంఛతో పరిపాలనా దక్షులగు రాజులచెంత చేరి రాజుల కిట్టి ఉత్తమ మార్గముల చిత్తములందు చేర్చి శాసనరీతిగా జనరంజకమగు ధర్మ కర్మలను నియమించుచుండిరి. ఆనాటి రాజులే మహాఋషు లను ఆహ్వానించి, పండితులను పిలిపించి, రాజనీతిని తెలుసుకొని దానికి తగినట్లు శాసనములు నిర్మించెడివారు. ప్రజలకు ప్రభువే ప్రధాన రక్షకుడగుటచేత, ప్రభువు సర్వసుగుణ సంపన్నుడై, సర్వ ధర్మ పరాయణుడై, సమస్త విద్యాపారంగతుడై యుండిన ప్రజలయొక్క యోగక్షేమమును, పరిపాలనావిధానమును సక్రమమైన మార్గమున నలుపగలరనియును లోక సుఖశాంతులనాశించి, "సమస్త లోకాస్సుఖినో భవంతు" అను లక్ష్యముతో రాజులను చేరెడివారు. ఇంతియే కాదు, జన సుఖదాయ కుడు, రవికుల నాయకుడు, కౌసల్యాకిశోరుడు, వసుదేవనందనుడు, గోపీజన వల్ల

ఖుడు, గోలోక వాసుడు అగు శ్రీమన్నారాయణుడు రాజ వంశములందు జన్మించునను వార్త వేదశాస్త్రములందు సూచించుటచే, భగవద్దర్శనార్థమై అప్పటి కప్పుడు రాజులను చేరుటకు వీలుగా నుండదనియును, చేరిననూ దైవానందమును మనసారా అనుభవింప సాధ్యముకాదనియును, ఆలోచించి, కొందరు దివ్యదృష్టిగల మహనీయులు ముందుగనే ఆయా రాజుల కొలువు కూటములచేరి దైవరాకకై తపించుచుందురు. అట్టివారే వశిష్ఠ, వామదేవ, విశ్వామిత్ర, గౌతమ, గర్గ, అగస్త్య ఇత్యాది మహర్షులు. వీరిలకేమి కొదువ? త్యాగులు, విరాగులు అయిన ఈ ఋషులు రాజుల చెంత చేరి వ్యర్థ ప్రసంగములు గావించుటకై రాజుల కొలువు కూటముల చేరలేదు. లేదా, వారి కానుకలనందుకొనుటకు కానీ, వారందించు తల భారపు బిరుదులను తగిలించుకొనుటకు కానీ, ప్రభువులను చేరలేదు. విశ్వనాధుని దర్శనమునకును, ధర్మరక్షణ దీక్షకును లోకపాలురలను చేరిరి. వేరు కారణము లేవియును లేవు. ఆనాటి రాజులు కూడను దైవచింతనా తత్పరులై, ప్రజాపరిపాలనకు తగిన మార్గములను పండితుల వలనను, ఋషులవలనను తెలిసికొని తమకు తామే ఆశ్రమములకు వెళ్ళుటయో, లేదా వారిలను రాజభవనములకు రప్పించుటయో జరిపించి, ఆలోచించెడివారు. ఆనాడు స్వార్థరహితులగు ఋషులు, అధికార వాంఛారహితులగు పండితులు, రాజులకు సలహాదారులుగా నుండుటచే ఆనాడు, తిండి గుడ్డలకు కానీ, తీర్థ గృహములకు గానీ, యెట్టి కొరతయూ లేక, నిత్య కల్యాణ పచ్చ తోరణములతో ప్రజాక్షేమమే ప్రభువు దేహముగను, ప్రభువే ప్రజల గుండెలుగను తలంచి, స్మరించి, వరించి, తరించిరి. అని శుకులు మహర్షుల చర్యలను, వాంఛలను నిర్దాక్షిణ్యముగ నిండుసభలో గంటవలే మ్రోయించెను. చూచితిరా! మహనీయులు యే పని చేసినను, యెవరితో చేరినను, లక్ష్యము దైవ తత్త్వముపై నుండుటచే సర్వకర్మలు, ధర్మరూపమును ధరించి, లోకమును ఉద్ధరించెను; పారాయణములు సలుపువేళ, పఠనము గావించువేళ లక్ష్యమును దైవ భావమున చేర్చి, కథలోని వంకరులను వంటిలోనికి చేర్చక, నిశ్చల నిష్ఠతో, నీతి నిజాయితీలను మది యందుంచి, కర్తవ్యమును నిర్వర్తించవలెను.

ధర్మ సంరక్షణార్థమై అవతరించు దైవము, సమస్త ప్రాకృత లీలలను సాధారణ మానవునివలె చేయుచుండును, చేయవలెను. కారణము, లోకులకు ఆదర్శము నందించుటకు, అనుభూతులు కలిగించుటకు, లీలలచూచుటకుసామాన్యమయినటు వంటివిగా కంటికి కనుపించినను అందులోని రసము సరసము సౌందర్యము పుష్టి విశ్వమును మోహింపజేయును, హృదయముల పరితుష్ట పరచును, మనసుల మరిపిం

చును, మాయను వదలించును, మధురత్వమును అందించును. ప్రాకృతములుగా కనుపించు తనలీలలన్నియును అప్రాకృతములే, మాననీయములే, దివ్యములే. రామ చరిత్ర వ్యక్తిచరిత్ర కాదు, విశ్వచరిత్రమనియే చెప్పవచ్చును. రాముడు, సమిష్టి స్వరూపుడు, సర్వ వ్యాపకుడు. రామ చరిత్ర కొంతకాలము మాత్రమే జరిగెనని తలంచరాదు. ఇది అద్యంతరహితమయిన చరిత్ర. రామేచ్ఛ లేక చీమైనను కుట్టదు, ఆకైనను వ్రాలదు. ప్రకృతి యందలి పంచభూతములు రామేచ్ఛవలననే తమ తమ కర్తవ్యములను నిర్వర్తించుచున్నవి. దృశ్య గోచరమగు సమస్త వస్తుజాలము లందు గల ఆకర్షణ శక్తియే ఆ రామచంద్రుడు. ప్రకృతి ఆకర్షణ చేతనే లోకము జరుగుచున్నది. ఆకర్షణే లేకున్న ప్రకృతియే లేదు. అనగా రాముడు లేకున్న లోకమే లేదు.

# రఘువంశము

విశుద్ధమగు సూర్యవంశమున పరమ ప్రతాపుడును, యశస్వియగు దీర్ఘ బాహుడును పుణ్యశ్లోకుడును, అగు కట్వాంగుడను రాజు పృధివిని పాలించుచుం డెను. అతని పరిపాలన ప్రజల కానందము కలిగించుటయేకాక, ప్రజలు ప్రభువునే దైవముగా భావించి, విశ్వసించి గౌరవించుచుండిరి.

మహారాజునకు ఏకైక పుత్రుడు కలడు. అతడే దిలీపుడు. కుమారుడైన దిలీపుడు దిన దినాభివృద్ధి గాంచుచు, మహా తేజోవంతుడై తండ్రితో పాలన విష యాదులందు పాల్గొనుచు దేశమందలి మంచి చెడ్డలను గమనించుచు, విచారించుచు, అతి శ్రద్ధాళుడై ప్రజల మధ్య పెరుగుచుండెను. కుమారుడు పెద్దవాడగుట చూచి యుక్తవయస్సుననే వివాహము జేసి కొంత పరిపాలనా బాధ్యత అతని తలపై పెట్ట వలెనని సంకల్పించి, అన్నింటికీ సరిపడునట్టి కోడలు కావలెనని విచారించి, కడకు మగధ నందినియగు సుదక్షిణ అను కన్యతో అత్యంత వైభవముగా వివాహము జరిపించెను.

సుదక్షిణ మహా గుణవంతురాలు. సాధ్వియును, సరళ హృదయయునై, పతి ననుసరించుచు, ప్రాణసమముగ ప్రేమించి, సేవించుచుండెను. పతియగు దిలీపుడు కూడను, మహా గుణవంతుడగుటచే ఆమెకెట్టి లోటునూ లేక చూచుకొనుచు, పరి పాలనా విషయమున, తండ్రి ననుసరించుచు క్రమ క్రమముగా తండ్రి బాధ్యత లన్నింటిని తానే చూచుకొనుచు, తండ్రికి కొంత విశ్రాంతిని కలిగించు చుండుట, కట్వాంగుడు గమనించి తనలో తాను కుమారుని తెలివి తేటలకును, శక్తి సామర్థ్య ములకును, యెంతో సంతసించుచుండెడివాడు.

ఈ విధముగ కొంతకాలము గడచెను. కట్వాంగుడు సుముహూర్తమును నిర్ణయించి దిలీపునకు రాజ్య పరిపాలనా పట్టము గావించెను. నాటినుండియు దిలీప మహారాజను నామముతో సప్తద్వీపవతియగు వసుంధరకు ప్రభువై ధర్మపాలన జరుపుచుండ, సకాలవర్షము కురిసి, సస్య శ్యామలమై సంవృద్ధిగా పండి, పాడిపం

టలకెట్టి కొరతయు లేక నిత్యకల్యాణములతో వేద పారాయణములలో శాస్త్రసమ్మత మైన యజ్ఞయాగాది క్రతువులతో అన్ని జాతులవారు హాయిగా జీవింపుచుండిరి.

కానీ మహారాజునకు దినములు, సంవత్సరములు గడచుకొలది, తనలో ఏదో అశాంతి అతనిని బాధించు చుండినటుల అతని ముఖవర్చస్సు తెలుపుచుండెడిది. కొన్ని సంవత్సరములు గడచెను. ఆశ నెరవేరునను ఇచ్ఛ దిన దినమునకు నీరసించెను.

ఒకనాడు తన రాణియగు సుదక్షిణతో తనలోని చింతను ఈరీతిగా వెలిబుచ్చెను. "ప్రియా! మనకింతవరకును సంతానము లేకపోవుటచే కొడుకులు లేరను చింత కంటెను, ఇక్ష్వాకువంశ ప్రసారమెట్లు కాగలదను విచారము నన్ను మరింత బాధించుచున్నది. దీనికి నేనొనరించిన యే పాపఫలమో కారణమయి వుండవచ్చును. దాని పరిహారార్థమై యేమి చేయవలెనో నాకు తోచుటలేదు. దైవ కరుణా కటాక్షమును అందుకొనుటకు తగిన మార్గమేదియో మన కుల గురువగు వశిష్ఠుల వారిని అడిగి తెలిసి కొనవలెనని ఈనాడు నా మనసు తత్తర పడుచున్నది. ఇందుకు నీ ఉద్దేశమేమి?" అని దిలీపుడు అడుగ, సుదక్షిణ ఆలశ్యము చేయక, ఆలోచించక, "నాధా! ఇదే ఆలోచన నాలో చాలా దినములనుండి బాధించుచున్నప్పటికిని పతి ఆజ్ఞలేక నా తలంపును బైట పెట్టుట తప్పగునేమో అని నాలో నేను అణచుకొంటిని. తమ ఇచ్ఛ ననుసరించుటకు నేనెల్లప్పుడు సిద్ధమే అనునది తమకు విదితమే కదా. ఇందుకు ఆలస్యమెందుకు" అని రాణి తన అంగీకారమును తెలుపగనే, దిలీపుడు రథమును సిద్ధము చేయించి ఈనాడు నావెంట పరివారము రక్షకభటులెవ్వరును రానక్కరలేదని ఆజ్ఞాపించి తానే రథమును నడుపుకొని గురుదేవులగు వశిష్ఠుల వారి ఆశ్రమము చేరెను.

రథ శబ్దము వినగనే వెలుపలనున్న ఆశ్రమవాసులు లోనికివెళ్ళి గురువుగారికి తెలుప, వశిష్ఠులవారు ద్వారము చెంతకు వచ్చి దిలీపును ఆశీర్వదించి, కుశల ప్రశ్నలు గావించుచుండ, రాణి సుదక్షిణ చెంతనే యున్న అరుంధతీ దేవికి నమస్కరించెను. అంత అరుంధతి ఆమెను ఆశీర్వదించి, ప్రేమతో కుశలప్రశ్నలు గావించుచు లోనికి తీసుకొనివెళ్ళెను. అంత, రాజు కూడను ప్రభు ధర్మము ననుసరించి, "ఆశ్రమ జనులకు కానీ, యజ్ఞయాగాది సత్కార్మలకు కాని, లేక ఆహార విహారములకు కానీ, యెట్టి ఇబ్బందియూ లేక, అరణ్యమునందు, క్రూర మృగముల బాధలు లేక, తమ తమ నిత్యానుష్ఠానములు సక్రమంగా జరుగుచున్నవి కదా?" అని గురువైన వశిష్ఠుల వారిని ఆశ్రమ కుశల

ప్రశ్నలు గావించుచు, అందరు లోనికి వెళ్ళి వారి వారి ఆసనములు వారు స్వీకరించిరి.

అంత వశిష్ఠులవారు అచటున్న ఆశ్రమవాసులను తమ తమ వసతులకు వెళ్ళుమని ఆజ్ఞాపించి, రాజు తన ఆశ్రమమునకు రాణి సమేతుడై వచ్చిన కారణమును తెలుపమని అడుగ, రాజు తనకుగల కొరతను విచారమును, వినయముతో విన్నవించి, తమ అనుగ్రహము తప్ప ఇందుకు అన్య మార్గములేదని ప్రార్థించెను.

ప్రార్థన ఒకవైపు ఆలకించుచు, వశిష్ఠులవారు ధ్యానములో లీనమై కొంత కాలము నిశ్శబ్దమును పూని వుండుటను చూచి రాజు కూడ తన రాణితో దైవ చింతన చేయుచు పద్మాసనాశీనుడై నేల కూర్చొనెను. అంత వశిష్ఠులవారు కన్నులు తెరచి, "రాజా! దైవేచ్ఛకు యెట్టివారికైనను యెదురు తగులుట వీలుకాదు. పుత్రు నొసంగునట్టి శక్తి నాకు లేదు; నేనది చేయజాలను. నీ కొక శాపముకలదు.

అది యేమన: నీవు రాజధానికి వచ్చుచున్న సమయమున కామధేనువు కల్ప వృక్షచ్ఛాయలయందు పరుండి నెమరు వేయుచున్న సమయమున, ధేనువును చూచియు నీవు దానిని లెక్కచేయక విషయలోలుడవై అహంకారముతో రాజ భవనమును చేరుకొంటివి. ఆనాడు కామధేనువు తనకు ప్రభువు గావించిన పరాభవ మునకు విచారించి, రాజే గోవులను గౌరవింపకున్న ప్రజలెట్లు విశ్వసించి గౌర వింతురను ఉద్దేశముతో వేద బ్రాహ్మణ గోవులను గౌరవింపని రాజుల వంశము అభివృద్ధి గాంచిన, లోకమే ధర్మ హీనముగునని తలంచి, ఆనాడు కామధేనువు నీకు వంశోద్ధారకుడగు కుమారుడు కలుగ కూడదనియు, యేనాడు నీవు పుత్రశోక ముతో నీ పొరపాటును నీవు గమనించి, లేదా, పరమ గురువు ఆజ్ఞను శిరసావ హించి, తిరిగి గోపూజ ప్రారంభింతువో, గోవులను గౌరవింతువో ఆనాడు తిరిగి నీ వంశము వృద్ధి గాంచుననియూ కామధేనువు తలంచుటచేత, నీకీ అపుత్రబాధ పీడించుచున్నది. కాన, నేటినుండి నీవు గోపూజ సతీ సమేతముగ, సక్రమమైన మార్గమున సలిపితివేని తప్పక పుత్రప్రాప్తి కలుగును. ఆలస్యము చేయక, సాయం సమయము కావచ్చినది. గోవులు వచ్చు వేళైనది. నా అగ్నిహోత్రముయొక్క నందినీ కామధేనువు వనమునుండి వచ్చుచున్నది, వెళ్ళి ఇప్పటినుండియే గోసేవ చేయుడు. నిరంతరం ధేనువ్రతము గావింపుడు. దానికి తగిన వేళలలో తగిన ఆహార పానీయములు అందించుచు, దానికి స్నాన పానాదులకు సమయమును కని పెట్టి జాగ్రతగా చూచుకొండని అజ్ఞాపించి, ధేను వ్రతమునకు దీక్ష నొసంగి, తీర్థ ప్రసాదములతో వారిని గోసేవకు పంపి, అనుష్టానమునకై వశిష్ఠులవారు నదికి

వెళ్ళెను. నాటినుంచి నందినిని వారి ప్రాణసమముగా ప్రేమించి పూజించుచు సేవింపచుండిరి. ఒకనాడు నందిని మేయుచు అరణ్యమున సంచరించు సమయమున ఒక సింహము నందిని పై బడి భుజింపజూచెను. అది దిలీపుడు గమనించి నందినిని రక్షించుటకు తన సర్వశక్తులూ వుపయోగించి కడకు తన ప్రాణమునైననూ వీడి దేహమును సింహమున కప్పజెప్ప పూనుకొనెను. క్రూర మృగమైనప్పటికిని సింహము పరమ ధర్మనిష్ఠ గలది. నందినీ కామధేనువును రక్షించుటకు రాజు తన కాయమునైనను వీడుటకు పూనుకొనుటచే దయతలచి నందిని రాజును, యెట్టి బాధలు పెట్టక విడచి పోయెను. ఈ సమయమున, తన ప్రాణమును కాపాడిన దిలీపునిపై నందిని అమోఘమైన, కృతజ్ఞతా పూర్వకమైన ఆనందమును తెలుపుచూ "రాజా! నేటికి నీ శాపము విమోచనమైనది. నీకు విశ్వ విజయుడును, ధర్మాత్ముడును, త్రిలోక విఖ్యాతిని జెందువాడును, కులకీర్తిని నిలబెట్టువాడును, అంతేకాక అతని వంశమందే శ్రీమన్నారాయణుడే అవతరించును. అట్టి సుపుత్రుడు అతి శీఘ్రములో ప్రాప్తించునుగాక,"అని ఆశీర్వదించి, రాజుతోకూడి ఆశ్రమమునకు వచ్చెను. గురువు సర్వజ్ఞుడగుటచే వారల మోము చూచిన వెంటనే మీ అభీష్టము నెరవేరినదనియు, ఇక మీరు మీ రాజ్యమునకు వెళ్ళవచ్చుననియూ ఆశీర్వదించెను. అంత దిలీప మహారాజు రాణితో గురువునకు నమస్కరించి, ఆశ్రమవాసుల దగ్గర శెలవు తీసుకొని, నందినికి ప్రదక్షిణ నమస్కారములు గావించి, రాజధానికి చేరిరి. నాటి నుండియే రాణి గర్భమున కుమారుడు పెరుగ మొదలాయెను. పదవమాసమునిండి, ఒక సుముహూర్తమున, పుత్ర రత్నము కలిగెను. ఈ వార్త పురజనులకు తెలియగనే, వీధులకు తోరణముల నలంకరించువారును, నాట్యములు సలుపువారును హారతులెత్తువారును, జయజయ ధ్వనులతో వారల సంతోషములు వర్ణనాతీతమై రాజభవనమునకు సమీపములో బారులు దీరి వేల జనులు చేరుటచేత, దిలీప మహారాజు మంత్రితో ప్రజలకు ఈ శుభవార్త నందింపమని ఆజ్ఞాపించెను మంత్రి రాజభవనమునకు ముందు విశాల ప్రదేశమున చేరిన వేలాది ప్రజలకు, మనకు కుమార రాజా పుట్టెనను శుభవార్త తెలుపగనే కరతాళములచే, జేజేలు చేసి అందరూ వారి వారి గృహములకు వెళ్ళిరి. పదవ దినమున గురువును పిలిపించి, నామకరణ మహోత్సవము గావించిరి. ఆ బాలునకు నక్షత్రము ననుసరించి, రఘువను పేరు పెట్టిరి.

రఘువు దిన దినమునకు పెరుగుతూ పెద్దవాడయ్యెను. ఒకనాటి రాత్రి దిలీపున కేమి తోచినదోకాని, రాణితో మాటలాడుచు "సుదక్షిణా! నేను అనేక ఘన

కార్యములను సాధించితిని. యజ్ఞ యాగాది సత్కర్మలు జరిపితిని. రాజులతో భయంకర యుద్ధములు చేసితిని. రాక్షసులను దునుమాడితిని కడకు భగవత్ కటాక్షమును పుత్ర రత్నరూపమున పొందితిని. ఇక మనకు కావలసినది వేరులేదు. శేష కాలమును దైవారాధనలతో పూర్తి గావింతము. రఘు మహా గుణవంతుడు, యోగ్యుడు. పరిపాలనా బాధ్యత అతని కప్పజెప్పి మనము అరణ్యమున, కంద మూలాదులు భక్షించుచూ మహనీయుల సేవలు సలుపుచూ శ్రవణ, మనన, నిధిధ్యాసాది కర్మలయందు కాలమును పవిత్రము గావింతము. అది యెప్పుడును తామసమునకు స్థానమివ్వక తెల్లవారగనే మంత్రులను పిలిపించి, రఘు పట్టాభిషేకమునకును వివాహమునకును తగిన యేర్పాట్లు గావింతును. ఇందుకు నీ ఉద్దేశమేమి?" అని తీవ్ర వైరాగ్యమున రాణిని ప్రశ్నింప, సుదక్షిణ ఆనంద బాష్పములు రాల్చుచు, "నాథా! అంతకంటే ఈ దాసికి కావలసినది వేరేమున్నది. మీ ఆజ్ఞకు బద్ధురాలను. తగిన యేర్పాట్లు గావింపుడు," అని అరణ్యవాసమునకు ఉవ్విళ్ళూరుచున్నట్లు ఆమె ప్రదర్శించిన దృశ్యము రాజునకు మరింత ఉత్సాహమును కలిగించెను.

దిలీపమహారాజు, మంత్రులను, పండితులను, ఋషులను పిలిపించి, తమ ఉద్దేశమును వారలకు తెలిపి, రఘువునకు పట్టాభిషేకమును, తగిన రాజకన్యను చూచి వివాహమును జరిపించి, రఘువునకు చెప్పవలసిన రాజనీతులను, వేద ఘోషణను, ప్రజాక్షేమమునకు తగిన శాసనములను అత్యంత ప్రధానముగా తెలిపి, భగవత్ కటాక్షమునకై రాణీసమేతుడై దిలీపుడు అరణ్యమున కేగెను. రఘు నాటి నుండి తండ్రి ఆనతి ప్రకారము పండితుల ఆదేశానుసారము, ప్రజా సౌకర్యమును ధర్మ సంరక్షణను తన ఉచ్ఛ్వాస, నిశ్వాసములుగా భావించి, తన కర్తవ్యమును మంత్రులతోచేరి జరుపుచుండెను. చిన్నవాడయినప్పటికివి మహా గుణశాలి. ఎట్టి కఠిన సమస్యలనైననూ అవలీలగా గ్రహించి, వాటికి తగిన మార్గమును కనిపెట్టి పరిష్కారము చేయుటేకాక. ప్రజారంజితముగా ప్రవర్తించెడివాడు. దుర్మార్గమైన రాజులకు చక్కని గుణ పాఠములు నేర్పి వారలను సామ, దాన, భేద, దండోపాయములతో శిక్షించి, ప్రజానుకూలములను ధర్మ రక్షణకు తగిన కర్మలను కలిగించుచుండెడివారు. ఈ విధముగా రఘు మహారాజు పరిపాలన, ఆబాల గోపాలమువరకూ కొనియాడ దొడగిరి. తండ్రికి మించిన బలశాలి, ధైర్యశాలి, గుణశాలి అను సార్థక నామమును సంపాదించెను. అరణ్యమున తపస్సాచరించు మునులకు, సాధువులకు తగిన భద్రతలు కలిగించుచు, వారికి తగిన వసతులను ప్రత్యేకముగా తానే

చూచుకొనుచు, ఋషుల ఆశీర్వాదములకు, కృపకు పాత్రుడగుచుండెను. ఒకనాడు వరతంతువను మహర్షికి కౌత్సుడను గుణవంతుడైన శిష్యుడుండెడివాడు. అతను విద్యాభ్యాసము పూర్తి అయిన తరువాత గురు దక్షిణకై రఘువును ఆశ్రయించి అతనినుండి ధర్మరీతిగా పొందిన ధనమును గురుదక్షిణగా వరతంతువునకుచెల్లించి, రఘు మహారాజు తనకు యెట్టి నీతి మార్గమున ధనమును అందించెనో విచారించి, ప్రజలకు బాధ కలుగక, కావలసిన దానికంటే ఒక్క కాసైననూ అధికముగా ప్రజలనుండి ఆశించక, దైవ కటాక్షమునే ప్రధాన లక్ష్యమందుంచుకొని పాలన సాగించుచున్న రఘు మహారాజుపై కౌత్సునకు అమిత వాత్సల్యము కలిగి నిండు హృదయమున "రాజా! త్వరలో నీకు లోక ప్రఖ్యాతి నొందునట్టి సద్గుణరాశి అగు కుమార రత్నము ప్రాప్తించగలదుగాక" అని ఆశీర్వదించి వెళ్ళిపోయెను. ఆ ఆశీర్వాద ఫలమో అన్నట్లు పదినెలలు దాటగనే రఘువునకు వజ్రమువంటి కాంతి గల కొమారుడు కలిగెను. అతనికి పండిత, పురోహితుల సలహా ననుసరించి, జాతకము ననుసరించి "అజుడను" పేరును పెట్టిరి. అజుడు అతి సుందరుడు. దిన దిన ప్రవర్ధమానుడై పెరుగ జొచ్చెను. అతను విద్యా బుద్ధులు ప్రత్యేక శిక్షణతో గడుపుచుండెను. అన్ని విద్యలయందూ చక్కని తరిబీదును గాంచెను. తండ్రికంటెను మహా విద్యావంతుడను పేరున మారుమ్రోగెను. ఈరీతి గడచుచుండ, రఘు మహారాజు అతని తండ్రి దిలీపుని వలెనే, కొమారునకు వివాహాది మంగళ కార్యములను జరిపి, రాజ్య భారమును అజునకు అందించవలెనను సంకల్పముచే మంత్రులను పిలిపించి, తగిన యేర్పాట్లు గావించి, విదర్భదేశాధీశుడైన భోజరాజు సోదరి యిందుమతిని తన కుమారుడగు అజునకు వివాహముచేసి, రాజ్యబాధ్యతలను అజున కప్పజెప్పి రాణీ సమేతుడై రఘువు తపస్సునకై అరణ్యమున కేగెను. ఇందుమతీదేవితో అజమహారాజు రాజ్యపాలన చేయుచు ప్రజల మన్ననల నందు కొనుచు, తండ్రి ఆజ్ఞను జవదాటక, పృధివిని పాలించుచుండెను. ఇందుమతిని బింబముగను ప్రకృతిని ప్రతిబింబముగను భావించి, అజుడు అత్యంత ఆనందముతో కాలము గడుపుచు, ఇరువురు వనమునకు వెళ్ళి సహజ సౌందర్యమైన ప్రకృతిని చూచుచు, దినములు, వారములు వనములందే గడిపెడివారు. ఇట్లుండ ఇందుమతీ దేవికి నవమాసములు నిండి పుత్రుని గనెను. పుట్టిన పుత్రునిచూచి తలిదండ్రులు ఆనందముతో వశిష్టుల వారికి ఈ వార్తను తెలిపి, జాతకర్మను వ్రాయించి, నామ కరణమునకు తగిన యేర్పాట్లు గావించి, పదవ దినము పండితులను పిలిపించి, దశరధుడను పేరుపెట్టిరి. దశరధుడు అల్లారు ముద్దుబిడ్డడై దాస దాసీలు ఆడించు

చుండ, కేకలు వేయుచు, కాళ్ళుచేతులు ఆడించుచూ, ఆనందమే తన జీవితమా అన్నట్లు దినదినాభివృద్ధి గాంచుచుండ, ఒకనాడు అజుడు ఇందుమతీదేవి వాడుక ననుసరించి, ఉద్యానవనమునకు విహారార్థమై వెళ్ళిరి. ఆనాడు మరింత ఉత్సాహ ముతో ప్రకృతి దృశ్యములను తిలకించుచూ, అతిదూరము వెళ్ళి ఒక చల్లని ఛాయలో ఇరువురూ కూర్చొని కబురులు చెప్పుకొనుచుండ పెద్దగాలి వీచెను. అందు లోని పరిమళము వర్ణనాతీతము ఇంతలో అతి మధురగానము వినిపించెను. ఇరు వురు లేచి, అటూ ఇటూ పరికించుచుండ వాయు మేఘములమధ్య, బ్రహ్మమానస పుత్రుడగు నారదుడు అతి వేగముగ యెచటికో వెళ్ళుచుండెను. ఇంతలో అతని శిఖకు చుట్టుకొన్న సుగంధ పుష్పము గాలికి వూడి కొట్టుకొనివచ్చి ఇందుమతీ శిరమున వ్రాలెను. అజమహారాజు ఈ ఆశ్చర్యము చూచుచుండగనే ఇందుమతీదేవి నేలవ్రాలి శాశ్వతముగా కన్నుమూసెను. ప్రాణసమముగా ప్రేమించి జీవించుచున్న అజుడు, ఈ దృశ్యమును చూడలేక పోయెను. అతని రోదన అరణ్యమంతయు దద్దరిల్లెను. భూమి కంపించెను. వృక్షములు సహితము చైతన్యరహితమై ఆశ్చర్య పడునట్లు కనుపించెను. ఆ ఇందుమతీదేవి దేహముపై పడి అజమహారాజు కన్నీరు కాలువలగునట్లు విలపించుచుండుట, నారదుడు విని క్రిందికి దిగివచ్చి, అజుని వోదార్చి "రాజా! మృత్యువున కాశ్చర్యమెందుకు? శోకము పనికిరాదు. కాయము నకు జనన మరణములు సామాన్యములు. జననమునకు యేమికారణమో, మరణము నకూ అదే కారణము. వీటికి కారణము వెతకుట వెఱ్ఱితనము. దైవ నిర్ణయమునకు కారణములుండవు. వాటిని అర్థము చేసుకొనుటకు సామాన్య మానవులకు అసా ధ్యము. వారి వారి బుద్ధి శక్తుల ననుసరించి కొంతవరకు వూహింతురే కానీ, బుద్ధి కతీతమైన తత్త్వమును యెట్లు తెలుసుకొనగలరు? మరణము ప్రతి కాయమునకును తప్పునది కాదు. అయితే ఈనాటి ఇందుమతీదేవి మరణము కొంత చరిత్రతో కూడినదగుటచే, తెలుపవలసి వచ్చినది" అని అజమహారాజుని దగ్గరచేర్చి, "రాజా! పూర్వము తృణబిందుడను ఋషి ఘోర తప మాచరించుచుండ, అతని తపోశక్తిని పరీక్షించగోరి ఇంద్రుడు హరిణి అను ఒక దేవకన్యకను పంపెను. ఆమె తపో భంగమును గావింప అనేక ప్రయత్నములు చేసెను. అందులకు ఋషి యే మాత్ర మును చలించక, కన్నులు తెరచి "పరమ పవిత్రమైన తపస్సును భంగపరచుటకు పూనుకొన్న నీవు సామాన్య వ్యక్తివి కావ"నియును, "నీవు బహుశా దేవకన్యవై యుందు"వనియు, యెవరైనను నేమి పాపకార్యమునకు పూనుకొంటివి కనుక నీవు దేవలోకమును వీకి మానవలోకమున జన్మించి, మానవత్త్వమును అర్థము చేసు

కొని మెలగుదువుగాక" అని శపించి కన్నులు మూసి తిరిగి తపము ప్రారంభించెను. అంత హరిణి దిగులొంది కంటనీరు కార్చుచూ చేతులు జోడించుకొని అతి దీనయై తన తప్పును క్షమించుమని ప్రార్థించుచూ స్వర్గ భ్రష్టురాలను గావింపక అనుగ్రహించుమని పరిపరి విధముల వేడుకొనెను. అంత ఋషి "అబలా! నావచనములు తిరిగి తీసుకొనుట వీలుకాదు. నీ తలపై యెప్పుడు స్వర్గలోక పుష్పమువచ్చి పడునో అప్పుడు నీవు మానవదేహమును వీడి స్వస్థానమును చేరగలవు" అని తెలిపెను. ఆనాటిదేవకన్యకయే ఈనాటిఇందుమతిదేవి. ఈనాడు నారదునందలి స్వర్గలోక పుష్పము గాలికి వ్రాలగనే ఆమె శాపము విమోచనమైనది. ఇందుకు నీవు విచారించి ప్రయోజనము లేదని రాజనీతులు, దేహనీతులు బోధించి నారదుడు తన మార్గమును తానునసరించెను. అజమహారాజు చేయునదిలేక కాయమున కంత్యక్రియలొనర్చి రాజ్యముచేరి కాలము అతిభారముగాగడుపుచు, దశరధుని చూచుకొని కొంత ధైర్యముచే జీవితమును సాగించుచు దశరధుడు కొంత పెద్దవాడగుటచే రాజ్యభారమును కుమారునకు అప్పజెప్పి, సరయూ తీరమున అనశనవ్రతమను ఒక వ్రతమును జరుపుచూ, తిరిగి భవనమునకు చేరక సరయూ తీరముననే అజుడు కాయము వీడెను. ఈ విషయము దశరధునకు తెలియగనే అతి వేగముగ సరయూ తీరముచేరి తండ్రి కళేబరముచూచి దుఃఖించి, కాయమునకు తగిన దహన కార్యములను అతి త్వరగా గావించి, తన తండ్రి వ్రతనిష్ఠుడై గతించెనను పవిత్ర భావమును కొంత స్మరించి ధైర్యముతో తన కర్తవ్యములు తాను పూర్తిగా వశమందుంచుకొని పాలన సాగించుచుండెను. ఇట్లు కొంత కాలములోనే దశరధుని వ్యాప్తి సూర్యకిరణములవలె వ్యాపించెను. దశరథకుల బలము తన కొక్కనికే కలిగియుండుటచేత అతనికి దశరధుడను పేరుకూడను సార్థకమాయెను. తన రధమునకు యెదురులేదు. సమస్త రాజులు దశరధునికి భయపడి వశమగుచుండిరి. దశరథుడన్న అంతకు మించిన గుణవంతుడు, బలవంతుడు, శక్తియుక్తులు కల మహారాజు మరొకడు లేడనునది ప్రపంచ వ్యాప్తి ఆయెను. ఈ విషయము యెటులనో రావణునికికూడ తెలిసెను. ఆనాటినుండి రావణుడు యెటులైనా యీ దశరధుని అంతమొందింపవలెనను దుర్బుద్ధి అతనిలో దినదినాభివృద్ధి గాంచెను. దశరథునితో పోరాడుటకు యేదియో వక కారణముండవలెను కదా అని రావణుడు ఆలోచించి, ఒకనాడు తన రాక్షస దూతల ద్వారా దశరథునకు కబురంపెను. అది యేమన, దశరథుడు తనకు శుల్కమును దూతలద్వారా పంపమనియును, లేని చెల్లించకున్న యుద్ధము తప్పదనియూ రాజనీతికి విరుద్ధమైన వార్తను తెలిపెను. అది దశరథుడు విని, ఫక్కున

నవ్వి వచ్చిన దూతలు చూచుచుండగనే తీక్షణమైన బాణములను లంకాపట్టణముపై విడచెను. అవిపోయి లంకాపట్టణపు ద్వారములను బంధించెను. అంత వచ్చిన దూతలతో "రాక్షస దూతలారా ! నేనిప్పుడు మీ నగర ద్వారములు బంధించితిని, దానిని మీ రాజైన రావణుడు తెరచిన నేను యుద్ధము చేయకయే మీ రాజునకు శుల్కము నిత్తు"నని చెప్పిపంపెను. రాక్షస దూతలు రావణునికి తెలుపుటకై వెళ్ళిరి. అన్ని ద్వారములు బంధింపబడినవి. రావణుడును తన పరివారమును ద్వారములు తెరచుటకై యెన్నియో శక్తియుక్తుల నుపయోగించి చూచిరి. సాధ్యము కాక పోవుటచే రావణుడు తనకు జరిగిన పరాభవమునకు తలవంచి, వోడిపోతినను భావము హృదయమునతలంచగనే, బాణములు తిరిగి అయోధ్యానగరమునకుచేరెను. ద్వారములు తెరచుకొనెను. నాటినుండియు రావణుడు, సమస్త రాజులను జయించు నట్టి శక్తిని సంపాదించుకొనవలెనని తలంచి, తపస్సు చేయుటకై వనమునకు బయలుదేరెను. తగిన స్థానమును యేర్పరచుకొని ఘోరతప మాచరించెను.

ఆ తపము అతి తీవ్రమైనదగుటచే బ్రహ్మ ప్రత్యక్షమై, "రావణా ! నీకేమి కావలయునో కోరుకొమ్ము ; తప్పక యిచ్చెద" ననెను. అంత దశరథుడు చేసిన పరాభవమును మనసున తలంచి, దశరధునకే యింత బలమున్న తనకు పుట్టునట్టి పిల్లలు యింకెంతటివారు కాగలరో అను భావమును భయమున తలంచి, "స్వామీ ! దశరధుని రక్తమునకు పిల్లలు కలుగుకుండునట్లు వరమనుగ్రహింపుము" అని ప్రార్థించెను.

అంత బ్రహ్మ, "సరి ! యిచ్చితి"నని తెలిపి, అచటనే యుండిన, రావణుడు మరేమైననూ కోరవచ్చునని తలంచి, మరుక్షణమే బ్రహ్మ అంతర్ధానమాయెను.

రావణుడు నిర్భయుడై తన శక్తి సామర్థ్యములను స్మరించుచు గర్వించు చుండ మరొక తలపు వానిలో మెరసెను. దశరథుడు ఇపుడు యుక్తవయస్కుడు ; అతనికి వివాహమే కాకుండునట్లు తగిన ప్రయత్నము జరిపిన, మరింత మంచిదగు నని భావించి, తన రాక్షసశక్తితో తేరిపారచూచి బహుశా కోసలదేశపురాజు పుత్రి కను యితనికిచ్చి వివాహము జరుపవచ్చును కనుక, ఆ పుత్రికనే లేకుండ చేయ వలెనని (వినాశకాలే విపరీత బుద్ధిః అన్నట్లు) విపరీత బుద్ధిపుట్టి, కోసలదేశమునకు మారువేషముతోవెళ్ళి ఆ రాజు కొమార్తెయగు కౌసల్యను దొంగిలించి, ఆ బాలికను ఒక పెట్టెలోపెట్టి సముద్రములో పారవేసెను.

దైవాజ్ఞలేక యేమియూ జరుగదను విషయము రావణుడు తెలిసికొనలేక పోయెను. ఆ వదలిన పెట్టెను బ్రహ్మ తన సంకల్పముచే ఒక గట్టునకువచ్చి చేరు

నట్లు చేసెను. ఆ గట్టు మంచి విహారస్థానమైనది. రెండవదినము దశరథునికి ప్రధానమంత్రి అయిన సుమంతుడు ఆ వనము గట్టునకువచ్చి రాజ్యతంత్రములను ఆలోచించుచుండ, అక్కడ ఒక అందమైన పెట్టె కంటి కగుపించెను. అంత చెంతకు వెళ్ళి తెరచిచూడ అందులో ఒక ఆడబిడ్డ అందమైన కన్నులతో దైవీ తేజస్సుతో మెరయుచుండెను. సుమంతుడు జాలిహృదయుడై తీయనిమాటలతో, "అమ్మా ! నీవెవరు, ఈ పెట్టెలో నుండుటకుగల కారణమేమి ?" అని ప్రశ్నించగా,

"అయ్యా ! నేను కోసలదేశపు రాజపుత్రికను, నా పేరు కౌసల్య. నేను ఈ పెట్టెలో యెందుకున్నానో, యెవరు పెట్టిరో, నాకేమీ తెలియదు ; నేను ఉద్యాన వనములో మా చెలికత్తెలతో ఆడుకొనుచుంటిని; తదుపరి యేమి జరిగినదో తెలియదు" అని సరళమైన సున్నితమైన ఆ రాజకుమార్తె మాటలు అతని మనసును కదిలించెను.

"తల్లీ ! ఇట్టి కిరాతబుద్ధి రాక్షసులకుతప్ప మానవమాత్రులకు సాధ్యము కాదు. నేను నిన్ను తీసుకొనిపోయి మీ తండ్రిగారి కప్పగింతును ; రమ్మా నా వెంట" అని సుమంతుడు రథమందుంచుకొని కోసలదేశమునకు తీసుకొనిపోయి రాజునకు అప్పజెప్పి జరిగిన వృత్తాంతమును తెలిపెను.

అంత కోసలదేశపురాజు సుమంతుని, అనేకవిధముల ప్రశ్నించెను. అతను దశరథమహారాజునకు మంత్రి అనియూ, దశరథునకు ఇంకనూ వివాహము కాలేదనియును తెలిసికొని, సంతసించి, "మంత్రీ ! మీ రక్షణచే లభించిన ఈ కన్యను మీ రాజునకే యిచ్చి వివాహముచేయ తలంచితిని; నీవు సత్వరమే వెళ్ళి మా అంగీకారమును రాజున కెరిగింపుమని పసుపుకుంకుమలతో తమ పురోహితుని వెంటబెట్టి సుమంతుని తగిన రీతిగా గౌరవించి పంపెను.

సుమంతుడు వెళ్ళి జరిగిన వృత్తాంతమును దశరథున కెరిగించెను. దశరథుడు కూడనూ ఇందులకు సమ్మతించినటుల తాను కూడనూ కొన్ని కానుకలనిచ్చి తమ పురోహితుని వెంటబెట్టి, కోసలదేశమున కంపెను. ముహూర్తము నిర్ణయించిరి. దశరథుడు చతురంగబల సమేతుడై మంగళ వాద్యములు మిన్నుముట్ట, అత్యంత వైభవముగా కోసలదేశమునకు తరలిపోయిరి. దశరథ కౌసల్యల వివాహము అతి సుందరముగా, వైభవముగా జరిగెను. అంత కోసలదేశపు రాజు సుమంతుని చేర పిలచి ఈ మంగళకార్యమునకు నీవే కర్తవు. దైవము సర్వ సృష్టికర్త అయినప్పటికిని, ప్రాకృత లోకమున నా కొమార్తెను కాపాడి, ఈ కార్యమును జరుగునట్లు చేసినది నీవే కనుక నీకు నే నేమి కృతజ్ఞతా వందనము లర్పింతును ? నా మాట

విందుచేని నేడే ఆ మంగళ కార్యమును కూడా అత్యంత వైభవముగా జరిపింతు నని తెలిపెను అందుకు దశరధుడూ, సుమంతుడూ అంగీకరించగనే, గర్గకుల సంభూతుడైన వీరదాసుని కొమార్తెను సుమంతునికిచ్చి వివాహము జరిపెను.

రాజు మంత్రుల వివాహములు ఒక విచిత్రమైన చరిత్రగా పురమంతయూ ప్రాకెను. పురమేకాదు, దేశమంతయూ తెలిసి, ఆశ్చర్య ఆనందముల నొందిరి. వివిధ వేడుకలతో మూడు దినములు కోసలపురమున రాత్రి పగలను భేదమే తెలియక వివాహ కార్యక్రమములు జరిగెను. నాలుగవ దినమున దశరధుడు తన రాణియైన కౌసల్యతో, పరివారముతోను సుమంతుడు తన ధర్మపత్నితోను, పరివారముతోనూ బయలుదేరి, వీధులందు అనేక నృత్య గాన వైభవములు జరుపుచుండ అయోధ్యానగరమును ప్రవేశించిరి.

అయోధ్యావాసులు తమ మహారాజునకును, మంత్రిగారికిని వివాహము జరిగిన ఆనందమను పట్టలేక, మైమరచి జేజేలు సలుపుచు మహారాణిగారిని చూచుటకు వీధులలో స్త్రీ పురుషులు బారులుదీరి, సుగంధ పరిమళములతో పన్నీరు చల్లుచూ, మంగళహారతు లెత్తిరి.

రాజు పురమును ప్రవేశించి, తన కార్యక్రమములు తాను యధావిధిగా ఆచరించుచు, రాణితోకూడి అప్పుడపుడు వన విహారము సలుపుచూ ఈరీతిగా కాలము గడుపుచుండెను. దినములు, నెలలు, సంవత్సరములు గడచినవి. రాజునకు కొంత నిరాశ ప్రారంభమాయెను. పుత్రులు లేరను కొరత పీడింప దొడగెను. పండితుల సలహాలను మంత్రుల అభీష్టములను, పట్టపురాణియైన కౌసల్యాదేవి సంతృప్తిని పురస్కరించుకొని, సుమిత్రను వివాహమాడెను

ఆమె పేరుకు తగిన గుణవతి. కౌసల్యా సుమిత్రలు తల్లిబిడ్డలకంటే అధిక ప్రేమలతో ఒకరినొకరు అనుసరించి, సహన, త్యాగ, కరుణలతో మెలగుచుండిరి. ఎంతకాలమయినను రాణులిరువురికీ యెట్టి శుభ సూచనలు కనుపింపకుండుటచే ఇక తమకు పుత్రులు పుట్టరను నిరాశచే వారిరువురి సలహా ననుసరించి దశరధుడు కాశ్మీరదేశపు రాజగు కేకేయి రాజు కూతురు కైక అను సౌందర్యరాశిని పెండ్లాడెను.

ఈ కైకను పెండ్లాడుటకు పూర్వము కేకేయి రాజు కొన్ని నిబంధనలను పెట్టెను. ఒకటి తన కొమార్తెయగు కైకకు పుట్టిన పుత్రునకే రాజ్యాధికారము ఇవ్వవలెననియు, అట్లు వప్పని పక్షమున, తన కొమార్తెను దశరధునకు ఇచ్చుటకు వీలు కాదనియూ గర్గునితో కబురంపగా కైకేయియొక్క రూపు రేఖలను విచిత్ర

ముగా వినియుండుటచేతను అట్టి ఇల్లాలు లేనిచో దక్కవలెననియూ నిండు హృదయముతో ఉవ్విళ్ళూరుచున్న దశరథుని మనోభావములను కౌసల్యా సుమిత్రలు గమనించి, పతి ఆనందముకంటే మాకు వేరేమి కావలెను, అతని అభీష్టమును తీర్చుటే మా విధి అనియును అయోధ్యా చక్రవర్తికి ధర్మవిరుద్ధమైన పుత్రులు పుట్టరనియును, ఈనాడు దశరథుడు మాటిచ్చినను కైకకు పుట్టునట్టి పుత్రుడు మహా ధర్మపరుడగుననియు తలంచి, ఇద్దరూ చేతులు జోడించి, రాజును ప్రార్థించిరి.

'స్వామీ! మీ సంతోషముకంటె మాకు వేరు ఆనందమేమున్నది? కేకేయిరాజు కోరినట్లుననే మీరు అంగీకరించి కైకను వివాహమాడి రఘువంశమును నిలబెట్టుడు! ఇందుకు మీరేమాత్రమును యోచింపనక్కరలేదు." అని వారు తన ఉత్సాహమును మరింత ప్రోత్సహించుటచేత, కేకేయిరాజు పెట్టిన షరతులను తప్పక చెప్పుకొందుననియు వివాహమునకు తర్లి వచ్చుచున్నామనియు కబురుముతో పురోహితులను గురుని వెంట పంప, కేకేయిరాజు అత్యంత ఆనందముతో వివాహమునకు తగిన యేర్పాట్లు అతి వైభవముగా గావించెను.

ఇరువురు రాణులతో దశరథుడు పరివారముతో కేకేయి రాజ్యమునుచేరి కైకను వివాహమాడి మూవురు రాణులతో చుక్కల నడుమ చంద్రునివలె అయోధ్యానగరమున ప్రకాశించుచుండెను.

దశరథుడు మూవురు రాణులను, సమానమైన ప్రేమతో చూచుకొనుచుండెను. రాణులు కూడను యెట్టి భేదములులేక, భయభక్తులతో, ధర్మకర్మలతో, పతియే దైవమను భావముతో, పతి యిష్టములకు అడ్డుచెప్పక అతని ఆనందమునకు అంతరాయము కలిగించక దేహములు వేరైనను ప్రాణము ఒకటిగా అన్నట్లు రాణులు మూవురు అన్యోన్యముగా మెలగుచుండిరి.

# శ్రీరామ జననము

కాలము గడచిన కొలదీ, రాజునకు రాణులకు యువావస్థ దాటదొడగెను. వృద్ధాప్యము ప్రారంభమాయెను. కానీ పుత్రప్రాప్తి సూచనలేవియును కనిపించ కుండుటచే, సర్వసౌఖ్య సదుపాయములతో అంతఃపురము కళకళలాడుచున్నను, రాజు రాణుల హృదయములందు అశాంతి, విచారము తాండవమాడుచుండెను. ఒకనాటిసాయం కాలము రాజు, రాణులు నలుగురును ఒకచోటచేరి అయోధ్యా భవిష్యత్తు పరిపాలకు డెవ్వడా అని పరి పరి విధములా, యెవరికి తోచినటుల వారు యోచించుచూ కడకు దేనినీ నిర్ణయించుకొనలేక, నిరాశా హృదయులై రేపటి తెల్లవారి కులగురువైన వసిష్ఠుల వారిని రప్పించి, కర్తవ్యమును విచారించుట మంచిదని దృఢము చేసుకొని యెవరి వసతులకు వారు భారమైన హృదయములతో బయలుదేరిరి.

మరుదినము తెల్లవారగనే మంత్రులను పండితులను రప్పించి, కులగురువగు వశిష్ఠుల వారిని పిలిపించి, ఈ సప్తద్వీపయుతమగు వసుంధరను పాలించు భవిష్యత్తు రాజెవ్వరా అను అంశముపై చర్చను ప్రారంభించి, మహారాజు నిరాశ మనస్కుడై గురువుల వారిని అనేక రీతుల ప్రార్థించి, ఇందుకు తగిన సలహాను ఆశీర్వాదమును అందించమని కోరెను.

అంత వశిష్ఠులవారు దీర్ఘాలోచన సలిపి, కన్నులు తెరచి, "రాజా ! మీరింత విచారించనక్కరలేదు. అయోధ్యకు పతి వియోగము సంప్రాప్తించదు. నిరంతరం మంగళమునే అందుకొనును. ఈ వసుంధర నిత్య కల్యాణము పచ్చని తోరణము లతో కళ కళ కిల కిల ధ్వనులతో ధర్మరక్షణ సాగించగలదు. వేరు రాజ కౌమ రుని ఈ రాజ్యాధి పతిగా చేయ నే నంగీకరించను. దైవ కటాక్షము అపారము ! మీ ధర్మ వ్రతమే మిమ్ములను పుత్రానందమున ముంచి తేల్చును. ఇక ఆలస్యము చేయక, విభాండక మహాముని కొడుకగు ఋష్యశృంగుని పిలిపించి, అతని చేత, తగిన యేర్పాట్లు గావించి, పవిత్రమగు పుత్రకామేష్టి యాగమును గావింపుడు. తప్పక మీ మనోరథ మీడేరును."

అని వశిష్ఠులవారు నిస్సంశయముతో పలికిన పదములను తెరలో వింటూ వున్న రాణుల హృదయములు ఆనందముతో నిండెను. నూతన ఆశాసుమములు

మొగ్గలు వేయ రాణులు దైవమును ప్రార్థించి లోనికి వెళ్ళిరి. మహారాజు విభాండక మహాముని కొమారుడగు ఋష్యశృంగుని పిలుపించుటకు తగిన వారెవ్వరా అని విచారించి తన బాల్య స్నేహితుడగు లంగదేశపు రాజగు రోమపాదుని పిలిపించి అతనితో తగిన యేర్పాట్లు గావించెను. సరయూ నదీతీరమున యజ్ఞమొనర్చుటకు తగు అందమైన వేదికలు నిర్మించిరి. అయోధ్య యెక్కడ చూచినను తోరణములతో కళ కళ లాడ దొడగెను. అనుకొన్నట్లు ఋష్యశృంగ మహాముని శాంతా సమేతుడై అయోధ్యలో కాలు పెట్టెను.

రాజు వారిని సింహద్వారమున పాదములు కడిగి, ఆ జలమును శిరమున ప్రోక్షించుకొని లోని తోడ్కొనిపోయి ఉన్నతాసనమున ఆశీనునిగావించి, వశిష్ఠుల వారికి నమస్కరించి, తన ప్రార్థనగా యజ్ఞవిధానమును యెట్లు గావింపవలెనో ఋష్యశృంగుని అడుగగోరెను. అంతమంత్రులు, పండితులు, మహారాజు వారివారి ఆసనములపై కూర్చొనుటకు ఋష్యశృంగులవారు ఆజ్ఞాపించి యజ్ఞవిధానములు ఒక్కొక్కటి విపులముగ తెలుపుచుండ, ప్రధాన పండితుడు దానినొక కాగితమున వ్రాసుకొనుచుండెను. ఎవరెవరు యే యే స్థానములందు కూర్చొనవలెనో వాటిని కూడను స్పష్టముగాతెలిపి, రేపటి తెల్లవారి ఏడు గంటలకే యజ్ఞము ప్రారంభించవలెనని నిర్ణయించెను. ఈ వార్త పురమున క్షణములో ప్రాకెను. తెల్లవారి వీధులు పచ్చని తోరణములతో జన సమూహములతో క్రిక్కిరిసి పోయెను. సరయూ తీరము జనమయమాయెను. రాణులతో కూడి మహారాజు స్వస్తి వాచకములు మిన్నుముట్ట జయ జయ ధ్వనులు మంగళ వాద్యములు శుభసూచనలు సలుప ఋష్యశృంగుడు శాంతా సమేతుడై యజ్ఞశాలలో చేరిరి. ఋష్యశృంగుడు బ్రహ్మగా ప్రమాణము స్వీకరించి ఋత్విక్కులను వారి వారి అర్హతల ననుసరించి ఆయా స్థానముల ఆయా పారాయణములు గావింప నియమించెను. అగ్నిహోత్రములు నాహుతులు ఋష్యశృంగుడు వ్రేల్చెను. అతి నిష్ఠతో నిండు భక్తి శ్రద్ధలతో గావించుచున్న ఈ అగ్నిహోత్రమునుండి అందరూ చూచుచుండ మహా తేజోవంతుడై చూపరులకు మించువలె కన్నులు మిరుమిట్లుగొలుప ఒక మహాపురుషు డొక పాత్రను హస్తములందుంచుకొని ప్రత్యక్షమాయెను. ప్రజలు ఋత్విక్కులు, ఆనంద, ఆశ్చర్య, భయ, ఆందోళనలతో దిగ్భ్రాంతులై యెక్కడివా రక్కడ స్తంభించిపోయిరి. రాజు రాణులు భక్తి శ్రద్ధలతో ఆ మహాపురుషునివైపు చూచుచు, ఆనంద బాష్పములు రాల్చుచు చేతులు జోడించుకొని ప్రార్థించుచుండిరి. ఋష్యశృంగుడు దృష్టిని చలించనీక, నిష్ఠను వీడక అగ్నిహోత్రములో నాహుతులు వ్రేల్చుచుండెను. ఇంతలో ఒక

ప్రళయశబ్దమువలే అంతరిక్షమునుండి పలుకులు వినుపించెను. ఋష్యశృంగుడు నాహుతులను ఆపి, విషయమేమిటాయని విన ప్రారంభించగా, "మహారాజా ! నీవీ పాత్రనందుకొని ఇందులోని పాయసమును యదోచితముగ ముగ్గురు రాణులకు విభజింపుము" అని దశరదుని చేతికి ఆ పాయసపు పాత్రనిచ్చి అగ్నిహోత్రమునుండి వుద్భవించిన మహాపురుషుడు అంతర్ధానమాయెను. ఈ మహాద్భుతమును చూచిన ప్రజలు, ఋషులు, పండితులు, రాజులు మహదానందమునొంది పూర్ణాహుతిగావించి, పాత్రను హస్తమందుంచుకొని వూరేగింపుతో రాజభవనమును చేరిరి.

రాణులు గురువాజ్ఞననుసరించి అభ్యంగస్నానము లాచరించి, అతి నిష్టతో, పూజాగృహమును ప్రవేశించిరి. అచట వశిష్టులవారు పూజాదికార్యములు పూర్తి చేసి, అగ్నిదేవుడొసగిన బంగారు పాత్రయందలి పాయసమును బంగరు గిన్నెలలో పోసి సిద్ధముగా యుండెను. ఇంతలో మహారాజును పిలచి "రాజా, ఈ గిన్నెలను మీ పత్నుల కందించుము. మొదలు కౌసల్యకు తదుపరి సుమిత్రకు ఆ తరువాత కైకకు అందించ"మని ఆజ్ఞ చేసెను. అదేరీతిగా రాజు గావించెను. రాణులు ముగ్గురు ఆ గిన్నెలనందుకొని వశిష్టులవారికి నమస్కరించి, దశరదునకు నమస్కరించి లోనికి వెళ్ళుచుండ వశిష్టులవారు ఈ పాయసమును ఇప్పుడే భుజించకూడదనియు ఋష్యశృంగులవారు వచ్చి ఆశీర్వదించురని రాణులను హెచ్చరించెను. అంత వారు లోనికివెళ్ళి తలలకు పొగ వేయుటకు దాసీలు సిద్ధముగా వేచియుండుట చేత కౌసల్య, కైక, వారి పాయసపు గిన్నెలను పూజాగృహములందు భద్రపరచి తలలార్చుకొనుచుండిరి. సుమిత్ర మేడ పైభాగమునకు వెళ్ళి గిన్నె ఒక చోటున ఉంచి వెంట్రుకలు ఆర్చుకొనుచు "పట్టపురాణి అగు కౌసల్యకు పుట్టిన కొమారునకు పట్టము కట్టుట రాజనీతి. అట్లు లేకున్న వివాహమునకు పూర్వము ఇచ్చిన మాట ననుసరించి కైకకు పుట్టబోవు కొమారునికి రాజ్యాధికారమందించుట మరొక ధర్మము. ఈ రెండింటియందు కొంత బాధ్యత కలదు కనుక ఇవి తప్పక జరుగును. ఇక నాకు కొమారుడు పుట్టుటచేత కలుగు ప్రయోజనమేమిటి? వీరిరువురికి వంశోద్ధారము జరిగిన అంతియే చాలును. ఏ బాధ్యతలకు అవ్వడుకాని కొమారుడు నాకు పుట్టుటకంటెను పుట్టకుండుటే మే"లని తలంచుచు, ఆలోచించుచు, కడకు దైవేచ్ఛ కానున్నది కాక మానదు. గురువాజ్ఞ రాజాజ్ఞ అని లోనికె వెళ్ళవలెనని అనుకొనుచుండగనే, యెక్కడనుండి వచ్చెనో ఒక గరుడుడు వచ్చి ఆ బంగరు గిన్నెను తన్నుకొని పోయెను. జరిగిన ఈ అజాగ్రతకు చాలా విచారించి, ఇక చేయునది లేక ఈ విషయము రాజునకు తెలిపిన రాజేమి బాధపడునో, ఇది నా అశ్రద్ధయొక్క

కారణమని తలంచి సరాసరి అక్కడగ్గరకు వెళ్ళి జరిగినది జరిగినట్లు కౌసల్యతో తెలిపెను. ఇంతలో కైక కురులార్చుకొని బంగరు గిన్నె తీసుకొని కౌసల్యా గృహమునకు వచ్చెను. మూవురుచేరి విషయము తెలిసికొని ఒకే ప్రేమతో అక్కచెల్లెండ్రవలె మెలగుచుండుటచేత రాజుకు కష్టము కలుగక, సుమిత్రను నిరాశకు గురికానివ్వకుండుటకై మరొక గిన్నెను తెప్పించి, కౌసల్య పాయసమునందు కొంత భాగమును కైక పాయసమునందు కొంత భాగమును ఆ గిన్నెలో వేసి సుమిత్ర కందించిరి ముప్వురూ పూజాగృహమున పీఠములపై కూర్చొని బైట పండితులు ఆశీర్వచనములు మంత్రరూపముతో అందించుచుండ ఋష్యశృంగముని ఆశీర్వదించ ముగ్గురు రాణులు పాయసమును భుజించి, తీర్థములు స్వీకరించి పూజా పీఠమునకు సమస్కరించి ఋష్యశృంగమునికి నమస్కరించి వారివారి నివాసములకు వెళ్ళిరి. కొంత కాలము గడచెను. ముప్వురు రాణులూ గర్భమును ధరించిరనువార్త పురమంతయూ ప్రాకెను. రాణులయొక్క దేహములు కాంతివంతమై కళకళలాడ దొడగెను. పదవ మాసము వచ్చెను. దాదులు నరుసులు ఇప్పుడో అప్పుడో అని ప్రసవ సమయములకు సర్వసిద్ధములు గావించి రాణులను అతి జాగ్రత్తగా చూచు కొనుచున్నారు. ఇంతలో కౌసల్యకు ప్రసవబాధలు ప్రారంభమయినవని విని దాదులు రాణి మందిరమునకు వెళ్ళుచుండగనే పట్టపురాణిగారికి కొమారుడు కలిగెనను వార్త అంతఃపురమంతయూ ప్రాకెను. రెండవదినము కైకకు ఒక పుత్రుడును కలిగెను మూడవ దినము సుమిత్రకు ప్రసవబాధలు ప్రారంభమయి ఆమె ఇరువురు కొమారులను కన్నదని అంతఃపురమేకాక, పురమంతయూ ఈ వార్త వ్యాపించెను. అందరూ ఆనందించిరి. భూమి సస్యశ్యామలమయ్యెను. సర్వవాద్యములు మ్రోగినవి. మేఘములు ఆనంద జల్లులు పన్నీరు జల్లులవలె పరిమళమైన బిందువులతో రెండు నిమిషములు అంతఃపురము పైన మాత్రమే కురుపించెను. ఈ రీతిగా పుత్రులు పుట్టిన తక్షణమే యెచ్చటచూచిన శుభములే కనుపించెను. దశరథమహారాజు ఆనందమునకు అంతులేదు. కొమరుడు ఒక్కడైనను లేరని విచారించుచున్న సమయమున నలుగురు పుత్రులు ఒకేపరి కలిగిరన్న వార్త వర్ణనాతీతమైన ఆనందము. రాజు బ్రాహ్మణులను పిలిపించి వారలకు సువర్ణ, గో, భూ దానములు గావించెను. బీదలకు తగురీతి ధనమును యిప్పించెను. వసతులు కలిగించెను. వస్త్రములు పంచెను, అన్నము పెట్టించెను. ఎక్కడ చూచినను ప్రజలు జయ, జయ ధ్వనులు గావించు చుండిరి. శుభచిహ్నములకు సభలు, నాట్యములు గావించదొడగిరి. మాకు క్రొత్త ప్రభువులు అవతరించిరను ఆనందముతో ప్రజలు వారింటిలో వారలకు పిల్లలుకలిగి

సంతజానికంటెను యెక్కువగనే ఆనందించుచుండిరి. కొందరు స్త్రీలు తమ రాణులకు కొమరులు కలిగినది భగవత్ కటాక్షమే అని విశ్వశించి భగవంతునకు ధన్యవాదము లన్నట్లు పూజలు గావించిరి.

దశరథుడు కులగురువగు వశిష్టుల వారిని రప్పించి, అతని సలహా ననుసరించి ఉద్దండుడైన సిద్ధాంతిని పిలిపించి జాతకములు వ్రాయించెను. ఉత్తరాయణ వసంతఋతువు చైత్రమాస శుక్లపక్ష, శుద్ధనవమి, పునర్వసు నక్షత్ర, సోమవార సింహలగ్న అభిజిత్కాలమున లోకమంతయూ విశ్రమించువేళ సమశీతోష్ణ సమయమున కౌసల్యకు కొమారుడు కలిగెను. రెండవ దినమున చైత్రశుద్ధ దశమి మంగళవారం, పుష్యమీ నక్షత్ర, గంధయోగ, తైతులాకరణ కైకేయి కొమారుని కనెను. మూడవ దినమున అనగ చైత్రశుద్ధ ఏకాదశి బుధవారం ఆశ్లేష నక్షత్ర వృద్ధియోగ గరజికరణమున, సుమిత్రాదేవి ఇరువురు కుమారులను ప్రసవించెను. ఈ వివరములు సిద్ధాంతికి తెలిపి, వారి జాతక ఫలమెట్టిదో విచారించి, వీరలకు నామకరణము చేయుటకై తగిన ముహూర్తమునుకూడనూ స్థిరపరచి తెలుపమని దశరథుడు కోరగ, రెండు నిమిషములు ఆలోచించి తమ యోగదృష్టిచే భవిష్యత్తును తిలకించి, కులగురువగు వశిష్టులవారు "మహారాజా! నీ కొమరులు సామాన్యులుకారు. పుట్టిన పిల్లలు నిరుపమానులు, వారల కనేక పేరులు కలవు. వారు నిజముగ మానవ మాత్రులు కారు. మానవాకారమును ధరించిన దేవతా అంశములు. దివ్యమూర్తులు. ఇది ప్రజల భాగ్యమనే చెప్పవచ్చును. ఇట్టి పవిత్ర పురుషులకు నామకరణము గావించుట నాభాగ్యమని భావించుచున్నాను. తల్లులు వేరయినను తండ్రి ఒకడే అగుటచేతను కౌసల్యాదేవి ప్రసవముతోనే పురుడు అందరికినీ ప్రారంభమయినది. ఈ మధ్యలో వచ్చిన పురుడు అంత పాటించనక్కరలేదనియును ప్రథమ పుత్రుని జన్మము ననుసరించి, పదవదినము దాటగనే అనగా పదకొండవ దినమున, నామకరణమునకు మంచి సమయమనియును ఆనాటికి తగిన సన్నాహములు గావింపుమనియూ తెలిపి రాజు నమస్కారమును అందుకొని వశిష్టులవారు వెళ్ళిపోయిరి. సిద్ధాంతిగారు కూడనూ దానిని అంగీకరించి నామకరణమునకు తగిన సామగ్రి పట్టీని తయారుచేసి పురోహితుని చేతికిచ్చి రాజు అందించిన కానుకల నందుకొని ఆనందముతో వెడలిపోయెను. ఆనాటినుండియు దశరథుడు తమ బంధు మిత్రులకు, రాజులకు, సామంతరాజులకు, ఋషులకు, పండితులకు నామకరణ వృత్తాంతమును వారివారి స్థానమును అనుసరించి పత్రములను పరివారముతోను, పండితులతోను బ్రాహ్మణులతోను మంత్రులతోను తెలిపి పంపెను.

పది దినములు గడచెను. అయోధ్యాపట్టణమును అత్యంత రమణీయముగ అలంకరించి గంధపుష్పాల గానము చేయుచున్నారా చూచినను అతిరమ్యమైన గానము నాలి రీనము, దేశమంతయూ వ్యాపింపజేయుచున్నదా అన్నట్లు వినిపించెన ధులలో పరిమళము చల్ల దొడగిరి. అయోధ్యా నగరము జనులచే క్రిక్కిరిసిపోయెను. పండితులు, ఋషులు మాత్రమే అంతఃపురమును ప్రవేశించిరి.

మిగిలిన రాజులు ప్రజలకు తగిన వసతులు యేర్పరచి రాజ భవనమునకు ముందుభాగమున అందరూ ఆశీనులగుటకు తగిన పందిళ్ళు వేసియుండుటచే అందులో చేరి, నామకరణ వైభవమును తిలకించుచుండిరి.

ఇంతలో దర్బారుహాలునకు మంగళవాద్యములతో బ్రాహ్మణ స్వస్తివాచకములతో, సుమంగళులు శుభవచనములు పలుకుచుండ, కౌసల్య, సుమిత్ర, కైకేయిలు తమ తమ బిడ్డలను పొత్తిళ్ళలో వుంచుకొని ఒకరివెనుక ఒకరు వరుసగా వచ్చుచుండ, ఆ ముగ్గురు తల్లులు, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను బాలల రూపముతో బాహ్యలోకమునకు యెత్తుకొనివచ్చు దేవతా స్త్రీలవలె కనుపించిరి. వారి ఆనందము, తేజస్సు వర్ణనాతీతము.

ప్రజలు వారలను చూడగనే జే, జేలు చెప్పిరి. స్త్రీలు మంగళహారతులెత్తిరి. ముగ్వురికి మూడు ఉన్నతాసనములు తగినట్లుగా సిద్ధము చేసియుండిరి. అందులో మొదలు కౌసల్య, తరువాత సుమిత్ర, ఆ తరువాత కైక ఆశీనులైరి. కౌసల్యా కుడి ప్రక్కన దశరథుడు ఆశీను డాయెను.

బ్రాహ్మణులు మంత్రములు ప్రారంభించిరి. ఒకవైపున హోమములు మొదలు పెట్టిరి. బంగారు పళ్ళెరములలో బియ్యమును పోసి వాటిపై మెత్తని వస్త్రములు పరచి అందుపై పిల్లలను పరుండబెట్టి వశిష్ఠులవారి యెదుట పెట్టిరి. కౌసల్యా కుమారుడు వశిష్ఠులవారివైపు చూచుచు యేదో పాతపరిచయమున్నట్లు చూపరులకు ఆశ్చర్యము కల్గించునటుల వశిష్ఠులవారిని చెంతకురమ్మని పిలచినట్లు ఆ బాలుడు గంతులు వేయదొడగెను. అంత గురువు ఆ బాలుని చర్యలనుచూచి ఆనందమును పట్టలేక, ఆనందబాష్పములు తుడుచుకొంటూ, అక్షతలు చేతపట్టి "రాజా! కౌసల్యా నందవర్ధనుడు అందరికి ఆహ్లాదము కలిగించును. అతని గుణ రూపములు అందరినీ క్రీడింపజేయును. యోగులే ఇతనిని రమింతురు కనుక నేటినుండీ ఈ బాలుడు "రాముడ"ను పేర బరగుచున్నాడు." అని కౌసల్యానందనునకు రాముడని నామకరణము గావించెను.

అంత ఋషులు భళీ, భళీ, సరియైన నామమని ఆనందించిరి. తదుపరి సుమిత్రా నందవర్ధనులైన ఇరువురు బాలురను తిలకించి, పెద్ద బాలునిచూచి శౌర్య వీర్యములను ప్రదర్శించు లక్ష్మీసంపన్నుడు కాగలడనియు, లక్ష్మీనారాయణుల సేవనే అతని శ్వాసగా భావించి, ఆచరించును కనుక అతనికి లక్ష్మణుడనియు, అతని తమ్ముడు శత్రువులను నాశనముచేసి అన్నల జాడల ననుసరించి, శాంత చిత్తుడై ప్రవర్తించును కనుక ఆ బాలుడు శత్రుఘ్నుడనియు పిలువబడును అని ఆశీర్వదించెను.

తదుపరి కైకేయీ నందవర్ధనుడగు బాలునిచూచి, ఈతడు అందరి అంతః కరణములను ప్రేమానందములతో నింపుటేకాక, ఆశ్చర్యకరమైన ధర్మప్రవృత్తి గలవాడగుననియు, ప్రజలకు భరణపోషణములను గావించును కనుక, అతనికి భరతుడనియు నామకరణము గావించితినని వశిష్టులవారు తెలుపగనే ప్రజలు పిల్లల భవిష్యత్తుకూడా ఇట్టివి కాగలవని విశ్వసించి, ఆనాటినుండి కౌసల్యానందనుని రాములనియు, సుమిత్రానందనులను లక్ష్మణ, శత్రుఘ్నులనియు, కైకేయినందనుని భరతుడనియు పిలువదొడగిరి.

వచ్చిన వారలకు భోజనములు యేర్పాట్లుగావించి అందరినీ సంతృప్తిపరచి, యెవరికి తగిన గౌరవములు వారలకు గావించి దానధర్మములు సలిపి, గోవులు, భూములు, సువర్ణములు పంచిపెట్టి, వచ్చిన వారలందరికి నచ్చినటుల చూచి, చేసి, పంపించిరి.

ఆనాటినుండి పిల్లలు దినదినప్రవర్ధమానులై అమ్మలచెంత పెరుగదొడగిరి. ఇందు ఒక విచిత్రము జరుగుచుండెను : ఏమన, బాల్యమునుండియు లక్ష్మణుడు రాముని, శత్రుఘ్నుడు భరతుని అనుసరించుచుండిరి : అనుసరించుటేకాదు, ఒకరి నొకరు పీడలేని స్థితిలో పెరుగుచుండిరి. ఎట్లన, లక్ష్మణుడు పుట్టిననాటినుండి యెప్పుడు చూచిననూ యేడ్చుచుండెడివాడు. దాదులు, నరుసులు యెన్నియో విధ ముల మందుపూతలు పోతలు గావించిరి. కానీ, దేనికినీ పోరుమానెడివాడుకాడు. లోన యెట్టి బాధకలదో అని అనేక వైద్యములు చేసిరి.

ఈ బాధ వైద్యముతో పోయెడిది కాదని తలంచి, ఒకనాడు సుమిత్ర గురువుగారికి నమస్కరించి, "స్వామీ : పుట్టినది మొదలు లక్ష్మణుడు యెందులకో అతిగా ఏడ్చుచుండును; అందులకు తగిన వైద్యములెన్నియో చేయించితిని; కానీ, దినదినమునకు యేడుపు అధికమగుచున్నదే కానీ, తగ్గుటలేదు. పాలు కూడనూ సరిగా త్రాగుటలేదు. నిద్ర అసలేలేదు. ఈ రీతిగా వుండిన బిడ్డ

అభివృద్ధి యెట్లుగాంచును? దీనికికారణము తెలిపి, ఆశీర్వదించుడు" అని వివరములు తెలుప,

వశిష్ఠులవారు ఆలోచించి, "రాణీ! అతని బాధవేరు; మీరుచేయు వైద్యము వేరు. ఆ ఆరాటము మానవులు గుర్తించుటకు వీలుకానిది; అతనికి దేహసంబంధమైన బాధలేమియునులేవు. నేను చెప్పినటుల చేయుము! ఆ క్షణమునుండియే, బాలుడు యేడుపుమాని సుఖముగ ఆడుకొనును ఇప్పుడే బాలుని తీసుకొనిపోయి కౌసల్యానందనుడైన రాముని ప్రక్కలో పరుండబెట్టుము. దీనికిదియే దివ్యౌషధము" అని ఆశీర్వదించి వెళ్ళెను.

ఆ మాటలువిని సుమిత్ర, యేడుపు తగ్గిన బాలుని ఆనందముతో, కుమారుని తీసికొనిపోయి కౌసల్యానందనుడైన రాముని పడకపై ప్రక్కనే పరుండబెట్టెను. ఆ నిమిషమునుండియూ లక్ష్మణుని యేడుపు మాయమయ్యెను; నవ్వులు, ఆటలు ప్రారంభమయ్యెను. చూచువారలకు గొప్ప ఆశ్చర్యమును కలిగించెను. ఇంతకు పూర్వము నీటికిదూరమైన చేప యే విధముగ తపించునో, అటుల తపించిన లక్ష్మణుడు ఇప్పుడు నీటిలో చేరిన చేప తోకనువిప్పి విచ్చలవిడిగా ఆడినటుల, లక్ష్మణుడు రామునిచెంత తన కాలు చేతులు కొట్టుచు కేకలు వేయుచు, రామసన్నిధిని ఆనందమును గ్రోలుచు, ఆడుచు, హాయిగా నున్నాడు

ఇది ఇట్లుండ, శత్రుఘ్నుడు ఆనాటినుండి పాలుత్రాగలేదు. విచారముగా ఆడుటకానీ, కదలుటకానీ లేక చాలా బలహీనునివలె కనిపించుచుండ సుమిత్ర అదిరిపడి గురువులవారిని రప్పించి, కారణము తెలుపగోరెను. వశిష్ఠులవారు చిరునవ్వులతో, "అమ్మా! మీ పిల్లలు సామాన్యులుకారు వారి జన్మలకు ఇవి లీలా నాటకములు. శత్రుఘ్నుని భరతుని పడకపై పరుండబెట్టుము. అతని నిత్యకర్మలు సక్రమముగా జరుగును; సంతోషముగా నుండును. దీనికి విచారించనక్కరలేద"ని ఆశీర్వదించి వెళ్ళెను.

సుమిత్ర అటులనే చేసెను. ఆనాటినుండియూ లక్ష్మణుడు రామునిచెంత శత్రుఘ్నుడు భరతునిచెంతా పెరుగజొచ్చిరి. వారల ఆనందమునకు అడ్డులేదు; అభివృద్ధికి కొరతలేదు; దినదినమునకు సూర్యకాంతివలె ప్రకాశించుచు పెరుగదొడగిరి.

సుమిత్ర చేయునదిలేక పిల్లల ఆనంద అభివృద్ధులే తన ప్రాణసమముగా భావించుటచేత, కౌసల్యదగ్గర కొంతసేపు, కైకదగ్గర కొంతసేపు పిల్లల సేవలుచేసి, అటూ యిటూ తిరుగుచూ వారలకు తగిన సేవలుచేయుచూ పిల్లలకు దాసివలె పనిచేయుటయేకానీ, తల్లివలె మెలగుటకు అవకాశము లేకపోయెను. "ఇది నా గ్రహచార"

మని, ఒకనాడు ఇటులగుటకు కారణమేమియా అని యేకాంతముగా గురువులచెంతకు పోయి ప్రార్థింపగా, గురువు వశిష్ఠుడిట్లు విన్నవించెను.

"అమ్మా! లక్ష్మణుడు రామ అంశమందలివాడు; శత్రుఘ్నుడు భరతుని అంశమందలివాడు" అని మాత్రము చెప్పుచుండగనే సుమిత్ర, "ఔనౌను! నాకీనాడు బోధపడినది. ధన్యురాలను" అని నమస్కరించి వెళ్ళిపోయెను. ఆనాడు పాయసము గ్రద్ద తన్నుకొనిపోగా, రాజు కోపించునేమో అని కౌసల్యకును, కైకకును తెలుప, వారు సకల సహనహృదయలై ఆమె పాయసమందు కొంతభాగము ఈమె పాయస మందు కొంతభాగము నాకందించిరి. అవియే వారి వారి అంశములు. కాకున్న నాకు మాత్రమే ఇరువురు పుత్రులు కలుగుటకు కారణమేమి. ఇరువురి అంశములను భుజించితిని కనుక ఈ బాలురు ఇట్టి సంబంధమును పొందియుందురు

దైవసంకల్పమెంతటి సూక్ష్మము. అతని శక్తిని గనుగొన నెవరితరము? దానిని మార్చువారెవ్వరు? అని తనలో తాను ఆనందించుచు ఆనాటినుండియు, నవ మాసములు మోసి కన్నది తానుకానీ, తల్లులు మాత్రము వారలే. కౌసల్యా, కైకే యిలే నా బిడ్డల నిజతల్లులు, అని దృఢము చేసుకొని బిడ్డలను కౌసల్యా కైకేయిలకే అప్పజెప్పి, ఆయావలే వారలచెంత పిల్లల పనులు చేయుచుండెను.

దాసీలేకాక, రాజబంధువులు అనేకమంది పిల్లలను చూచుటకై నిత్యమూ వచ్చి పోవుచుండెడివారు. వారందరూ చూచి వెళ్లిన తోడనే, కౌసల్య పిల్లలకు దృష్టి తీయించి పారవేయించెడిది. కౌసల్యకు కొమారులయందుండు అధికమగు ప్రేమచేత, దివారాత్రముల గమనము తెలిసెడిదికాదు; నిమిషము పిల్లలను విడచి వెళ్ళెడిదికాదు. స్నాన, పూజాదులుకూడనూ లక్ష్యమంతయూ పిల్లలయందే వుంచుకొని, అతి శీఘ్ర ముగా పనులు చూచుకొని వచ్చెడిది.

ఒకనాడు రామలక్ష్మణులకు స్నానము చేయించి, పొగలువేసి, బంగారు తొట్లలో పరుండబెట్టి, తానే స్వయముగా పాటపాడి వుయ్యెలనూపి, పిల్లలు నిద్రించ గనే, దాసీలకు పిల్లలను చూచుకొమ్మని తెలిపి లోనికివెళ్లి, పాయసము కాచి పూజాగదికి తీసుకొనిపోయి, నైవేద్యము గావించెను. మరికొంత సేపటికి, నైవేద్య ప్రసాదము తమ పిల్లలకు కొంత పెట్టవచ్చునని బంగరుగిన్నె తీసుకొని పూజా గదిని ప్రవేశించగనే నైవేద్యముంచిన పాత్రను ముందు పెట్టుకొని జుర్రుకొనుచున్న రాములను చూచెను. ఆమె కన్నులను ఆమెయే నమ్మలేకపోయినది.

ఇది నిజమా లేక భ్రమయా! తొట్లయందు నిద్రించు నా బాలుడు ఇచటి కెట్లు వచ్చెను. యెవరు తెచ్చిరి, అని పరుగిడిపోయి తొట్లలో చూడ గాఢనిద్రలో

హచి, ఇది నా భ్రాంతి, అని తనలో తాను సర్దుకొని పాయసము గిన్నెలో వేసుకొనుటకై పాత్రను చూడ, పాత్రలో పాయసము గరిటెడైనను లేక పోవుటచేత, కొమారుని చూచినది భ్రాంతికావచ్చును. పాయసము లేకపోవుట భ్రాంతి యెట్లగును? అని ఒకవైపున ఆశ్చర్యమును మరొకవైపు సంశయమును ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసెను. యెటులనో ఆ గిన్నెలో కొంత ప్రసాదముంచుకొని తొట్లచెంతచేరి బాలుర నిద్రించు మోముల చూచుచుండెను. రాముడు చప్పరించుచూ, కన్నులు మూసుకొని లొట్టలు వేయుచుండ కౌసల్య ఆశ్చర్యముతో చిరునవ్వులతో మోమును తిలకించుచుండ, రాముని మొగమున ఒక నిమిషము బ్రహ్మాండమే తిరిగినటుల కనుపించెను. కౌసల్య దేహమునే మరచి కన్నులువిప్పి రెప్పలు ఆర్పక పిచ్చిగా చూచుచుండుట దాసీలు గమనించి, అమ్మా! అమ్మా! అని అరచిరి; వారల అరుపులు కౌసల్యకు వినిపించలేదు. ఒక దాసి అమ్మ పాదములుపట్టి అమ్మా! దేవీ! అని అనేక విధముల మేల్కొలిపెను. కౌసల్య ఉలిక్కి పడినటుల దేహమును గగుర్పాటు పడినట్లు కదలించి దాసీలవైపు చూచి, ఆశ్చర్యముతో మంచముపై కూర్చొని దాసీ మీరు బాలుని చూచితిరా? అని ప్రశ్నించెను. అవును తల్లీ మేమిక్కడనే యున్నాము, బాలుని చూచుచునే యున్నాము. అని జవాబుచెప్ప, యెట్లు చూచితిరి? బాలునిలో యేమైనా మార్పుకనిపించెనా? అని కౌసల్య ఆతురతతో ప్రశ్నింప, మాకెట్టి మార్పునూ కనిపించలేదు తల్లీ, బాలుడు గాఢనిద్రలో వున్నవాడుకదా? అని జవాబు చెప్పిరి. కౌసల్య తాను చూచిన దంతయూ భ్రమయా? లేక నిజమా? నిజమైనవారలందరికీ యెందుకు కనిపించ లేదని తనలో తాను అనేకవిధముల ఆలోచనలు జరిపి, కడకు పిల్లలు యజ్ఞప్రసాదముచే కలుగుటచే దైవచిన్నెలు ఈరీతిగా కనుపించి యుండవచ్చునని తనకు తానే జవాబు చెప్పుకొని, తిరిగి పుత్రవాత్సల్యములో మునిగి వారలకు తగిన పరిచర్యలు చేయుచూ, శుక్లపక్షములోని చంద్రునివలె దినదినప్రవర్ధమానమగుచుండిన పుత్రులను చూచుచు, ముద్దిడుచూ తల నిమురుచూ, బట్టలు సర్దుచూ ఆనందించుచుండెడిది.

# బాలరాముడు

బాలరాముని చరిత్ర సరసముగను శోభాకరముగను వుండెడిది. అనేక పర్యాయములు కౌసల్య తన నందనుడని మరచి బాలునకు చేతులు జోడించి నమస్కరించెడిది. తదుపరి అయ్యో చిన్నబాలుడు నా కొమరుని దైవముగా భావించుటలో తప్పు లేకపోయినను నమస్కరించుట లోకులు చూచిన నవ్వరా! అవి యెవరైననూ చూచిరేమో అను భ్రాంతిలో తక్షణమే పైకిచూచుచు దైవమును ప్రార్థించినటుల నటనచేసి, స్వామీ కటాక్షించి నా కొమరులను ఆయురారోగ్యవంతులుగా చూచు కొమ్మనియు, నీ మాయను మాత్రము నాపై రానీయక చూచుకోమని పలికెడిది. ఇంతలో కొమరుని మొఖమును చూచి అందునుండి వెలువడుచున్న కాంతులు కన్నులకు మిరుమిట్లు గొలిపెడివి; యెవరికి చెప్పిన, యెవరేమందురో, తననే పిచ్చిదని వూహింతురేమో అని ఇతరులకు చెప్పుటకులేక, లోన భరించుటకుకాక, ఒక్కొక నాటి రామలీలలు, మాహాత్మ్యములుఆమెను ఉన్మత్తురాలుగ చేయుచుండెను. ఒకవేళ తన సన్నిహిత సోదరియైన సుమిత్రతోకానీ, లేదా కైకతోకానీ తెలిపిన, తన కుమారుడు గొప్పవాడని ప్రదర్శించుటకై యిట్టి కథలు కలిపించి మా కొమారులను యేమీ శక్తిలేనివారలుగా చేయుచున్నదని భావింతురేమో అని వారలతో కూడను చెప్పుటకు కౌసల్యాదేవి వెనుకముందాడెడిది. కడకు యెటులనో ధైర్యము చేసుకొని ఒకనాడు దశరధునకు, జరిగిన ఆశ్చర్య, వినోద, వింతలన్నియూ తెలుప, దశరథుడు విని సంతసించి, దేవీ! ఇవన్నియు నీ వ్యామోహములు, పుత్రవాత్సల్యముచే, నిరంతరము కొమారుని దైవముతో పోల్చుకొని చింతించుటచే ఆవిధముగ నీ కంటికి కనుపించుచుండవచ్చునని ఆమెను పూర్తి నిరాశయందు ముంచక, పూర్తి నిజమని తెలుపక, కొంత తృప్తిపడునటుల చెప్పిపంపెను. దశరధుడు యెన్ని చెప్పిననూ కండ్లార చూచిన తల్లికనుక ఆమెకు యేమాత్రమును తృప్తికాక, దశరధుని మాటలను నమ్మలేక సమయమును పురస్కరించుకొని గురువుతో తెలిపెను. గురువు ఆలోచించి, రాణీ! నీవు గాంచినవన్నియూ పరమ సత్యములు. ఇవి భ్రాంతులు కావు. కొమారుడు సామాన్య మానవ మాత్రుడు కాడు, దేవతా

అంశము. ఇది మీ జన్మజన్మల పుణ్యఫలము. లోకోద్ధారకుడు కౌసల్యానందను డగుట అయోధ్యావాసులకే అదృష్టము. అని ఆశీర్వదించి వెళ్లిపోయెను.

కౌసల్యాదేవి వశిష్ఠులవారి మాటలను గ్రహించి, విశ్వసించి కొంత తృప్తి పడి తన కొమారుని అమానుష్య చర్యలను తనలో తాను తిలకించుచు ఆనందించుచు కాలము గడుపుచుండ, రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు దోగాడుట, కూర్చొ నుట ఇత్యాది కొన్ని నూతన అభివృద్ధులు గాంచదొడగిరి. పిల్లలకు కదలి ప్రాక గల శక్తి వచ్చినదని యెక్కడికైనను ప్రాకి, యెత్తునుండి క్రింద పడుదురేమోనని అనుమానముతో పిల్లలను జాగ్రత్తగా చూచుకొనుటకు ప్రత్యేక యేర్పాట్లు గావిం చిరి. అనేక ఆటబొమ్మలను తెప్పించిరి. అమ్మలతోపాటు పిల్లలు, పిల్లలతోపాటు అమ్మలు, వారలతో దాదులు కాలమనునది విచారించక, కంటికి నిద్రలేక కాలమును ఆనందముతో గడుపుచుండ, పిల్లలు దాదుల, అమ్మల వ్రేళ్ళు పట్టుకొని లేచి నిలువ గలిగిరి; గోడలుపట్టి లేవగలిగిరి. తప్పటడుగులు వేయగలిగిరి. ఈ వింతలు అమ్మ లకు మరింత ఆనందముగా యుండెను. తిరిగీ తిరుగని చిలుక పలుకులు ఆ చిన్న పెదవులతో, బోసి నోరులతో పలుకుచుండ అమ్మలు కడుపుబ్బ నవ్వుచుండెడివారు. అమ్మ, అప్ప అని మాటలు నేర్పుచుండెడివారు. నిత్యము తెల్లవారగనే, సుగంధ ద్రవ్యములనూరి తైలమును కలిపి, వంటికి రాచి, నలుగులు పెట్టి, సరయూనది తీర్థముచే అభ్యంగ స్నానములు చేయించి, తలలకు వాసనల పొగలువేసి, కాటుక తీర్చి, దృష్టి చుక్క నమర్చి, నొసటి తిలకమును వింతగా పెట్టి, అనేక రకరకము లైన వస్త్రములతో అలంకరించి, వుూయలయందు వుంచి, జోలపాటలు పాడుచుండ, తల్లులకు వేరే వైకుంఠమున్నదన్నది మరచి అదే వారలకు స్వర్గవైకుంఠములకంటే మిన్నగాయుండెడిది. ఇక ఆభరణములా, అబ్బో! దినమున కొక రకము. కాలి అందెలు, మొలగజ్జలు, కంఠహారములు, అవి గుచ్చుకొనునేమో అని క్రింద మఖు మల్లు వస్త్రమును కుట్టి వంటికి పెట్టెడివారు. బాలుల బాలలీలలు వర్ణనాతీతముగా యుండెను. బాలులు నడువగల వయస్సు కలుగునప్పటికి, పురమందలి ఆయా వయసు పిల్లలను తెప్పించి, వారలను వీరలను కలిపి అనేక ఆటలు ఆడించడము, తిండ్లు పెట్టించడము, వచ్చిన పురప్రముఖుల పిల్లలకు తగిన బహుమతులు, ఆటబొమ్మలు ఇవ్వడం, ఆ పిల్లల తల్లులకు, వెంటవచ్చిన దాదులకు తగిన భోజనసదుపాయములు చేయడము, ఈరీతిగా కౌసల్య, సుమిత్ర, కైకేయిలు తమ తమ దేహములనే మరచి పిల్లలను ప్రాణ సమానముగా చూచుకొంటూ ఆనందించుచుండిరి.

కొంతకాల మీరీతిగ బాలలీలలు తల్లులచెంత అంతఃపురమున జరిపి, మూడు

సంవత్సరములు నిండగనే బాలులందరిని ఆడుకొనుటకై దాదులతో ఆటస్థలములకు, పంపుచు, సకాలమునకు అంతఃపురమునకు పిలుపించుచు తల్లులు అత్యంత జాగరూకతతో చూచుచుండిరి ఒకనాడు దశరథుడు రాణులతో సంభాషణలు జరుపుచు పిల్లలు ఈ విధముగ దాదులతో కూడియుండిన విద్యాబుద్ధులు నేర్వలేరని యోచించి, మంచి ముహూర్తము నిర్ణయించి, గురువులవారిని రప్పించి, అక్షరాభ్యాసము గావించెను. ఆనాటినుండియు, రాజోచితవేషములను విసర్జించి, పిల్లలు సామాన్య గురుకుల ఆశ్రమము ననుసరించి, అంగవస్త్రము పైనె ధరించి, మొలకొక తుండును చుట్టుకొని గురు గృహమును ప్రవేశించిరి. ఇంటియందున్న విద్యనేర్చుటకు వీలు కాదని, గురు గృహమునందే, గురుసేవలు చేయుచు, వారు అందించు ఆహారమును మాత్రమే భుజించుచు, మూర్తీభవించిన బ్రహ్మచారి వేషములతో విద్యను నేర్చుచుండిరి. యెప్పుడైనా పిల్లలను చూడవలెనను ఆశ తల్లులకు కలిగినపుడంతయూ తల్లులే గురు గృహమునకు వెళ్ళి పిల్లలను చూచి వారి విద్యాబుద్ధులను గమనించి ఆనందించి వచ్చెడివారు.

గురువు ఆ పిల్లల శ్రద్ధాభక్తులకు, ధారణా శక్తులకు అత్యంత ఆశ్చర్యమును, ఆనందమును పొందెడివాడు. అందునా రాముని శ్రద్ధ మరింత తీవ్రమై యుండెడిది. గురువు చెప్పిన పాఠములను క్షణములో తిరిగి వప్పచెప్పెడివాడు. రాముని కుశాగ్రబుద్ధికి అచ్చెరువొంది రాముని శ్రద్ధకు అడ్డుచెప్పుట మంచిదికాదని భావించి, లక్ష్మణ, భరత శత్రుఘ్నులను వేరుగా కూర్చొనబెట్టి రాములకు ప్రత్యేకముగా వేదశాస్త్రములు వల్లించ మొదలుపెట్టెను. లక్ష్మణ, భరత శత్రుఘ్నులు కూడను మహాశ్రద్ధతో చదువుచుండినను, నిరంతరం రామ సంయోగమునే ఆశించుచుండెడివారు. నిమిషము రాముడు తమనుండి దూరమైన పాఠములపై కానీ, గురువు ఆజ్ఞలపై గానీ మనసు నిలిచెడిదికాదు. అందువలన వారు ఒకటి రెండు క్లాసులు వెనుకపడుచుండిరి. ఒకొకపరి మాకీవిద్యలక్కరలేదు, రాముడొక్కడు మాతోనున్న చాలు"నని లక్ష్మణుడు నిశ్చయముగా గురువుతో చెప్పెడివాడు. రాముడన్న లక్ష్మణున కమితప్రాణము. వారలిరువురి సంబంధమును అప్పుడప్పుడు గమనించుచు, గురువులవారు తమలోతాము ఆనందించుచుండెడివారు. వారు నిజముగా, నరనారాయణులే అని అనెడివారు వశిష్ఠులవారు.

ఈరీతిగా ఆ దివ్యబాలురు గురు గృహమున సర్వసౌఖ్యములను త్యజించి, గురువాజ్ఞను అనుసరించి, వినయ విధేయతలతో విద్యలను అతిస్వల్పకాలమునందే పూర్తిగావించిరి. ఒకనాటి సాయం సమయమున దశరథుడు మంత్రితోకూడి గురు

గృహమునకువెళ్ళి వేదమును వల్లించుచున్న పుత్రరత్నములనుచూచి, వారి ముఖార విందములనుండి వెలువడు ముత్యములవంటి స్పష్ట పదములను విని పట్టలేని ఆనందమును పొందెను తన కొమరులు ఈ స్వల్పకాలములోనే యింత అభివృద్ధి గాంచిరని సంతసించెను ఇంతలో రాముడు లేచివచ్చి తండ్రికి నమస్కరించెను. అతను చేసినది చూచి మిగిలిన ముగ్గురు సోదరులు తండ్రికి నమస్కరించి విలువ బడిరి. గురువుగారు రాజును సమీపించి, రాజును మంత్రిని తగిన ఉన్నతాసనమైన చర్మాసనములపై కూర్చొనమని కోరెను. రాజు కొమారులు విద్యావిషయమై యెంత వరకు అభివృద్ధిగాంచిరో ఆ విషయములను గురువుతో ముచ్చటించుట ప్రారంభిం చెను. వారి సంభాషణలను వినరాదను సూచనగా రాముడు తమ గ్రంథములను తీసు కొని గురువాజ్ఞనుబడసి, తన గదికి వెళ్లెను ప్రతి విషయమునందును రాములను అనుసరించు సోదరులు కనుక, అతని మనసును గ్రహించి ముగ్గురు సోదరులు వెళ్లిపోయిరి.

వారు తమ సంభాషణలను గ్రహించి అనుసరించిన రామచర్యను, వశి ష్ఠులవారును, దశరధుడును గ్రహించి, పిల్లల క్రమశిక్షణకు యెంతో పొంగి పోయిరి. వశిష్ఠులవారు ఆనందహృదయముతో "మహారాజా ! తమ పుత్రులందరును సమస్త విద్యలందును పారంగతులైరి. రాములకు సర్వశాస్త్రములు కూడనూ తెలి యును. అతను సామాన్యుడుకాడు. నేను వేదశాస్త్రములు చెప్పుటకు మొదలు పెట్ట గనే, తనకు దీనికి పూర్వమే తెలిసినటుల పన్నములను అందుకొనెడివాడు. వేద పురుషులకే ఇది సాధ్యముకాని సామాన్యులకు చేతకాదు. పోనీ వేదము ఒక గ్రంధ మైననూ అయివుండిన యెప్పుడైననూ విరామ సమయమున చదివెనేమో అని తలం చుటకు వేదము గ్రంథము కాదు. గురు శిష్యపారంపరమై ఒకరు చెప్పుచుండ మరొ కరు విని అనుసరించవలసినదే కానీ, చదువునట్టిది కాదు. వినికిడితో నేర్వవలసిన విద్య కనుకనే దీనిని శృతి అని కూడనూ అందురు అట్టి పవిత్ర పరమాత్మ శ్వాస సమానమైన వేదమును, కొన్ని నెలలలో పూర్తిగావించిన వారిని నేను ఇంతవరకూ చూడలేదు చూచుటేమిటి? యే చరిత్రలయందును ఇట్టివారుండిరని వినలేదు. చదువ లేదు. మీ కొమారుని ఇట్టి అమానుష చర్యలు అనేకము, యెన్నని నుడువ గలను.

మహారాజా ! ఇట్టిపిల్లలు నా శిష్యులగుట నా తపఃఫలమే కాని వేరుకాదు. ఇక వారు నేర్వగలిగిన విద్య లేవియును లేవు. రాజధర్మము ననుసరించి, ఇక అస్త్ర శస్త్రవిద్యలు నేర్వవచ్చునే కాని, నా చెంతవుండి తెలిసికొను విద్యలు పూర్తి అయి

నవి ఈనాడు ముహూర్తము కూడను మంచిదిగా యున్నది. వచ్చిన తమరు ఒకేపరి పుత్రులను వెంటపెట్టుకొని వెళ్ళుట మంచిది, అని వశిష్టులవారు తెలవియ్యగనే, తక్షణమే పుత్రవియోగముతో బాధనొందుచున్న దశరథుడు ఆనందమును పట్టలేక నేత్రములనుండి బిందువులు జలజల రాలి ప్రక్కనేయున్న సుమంతునితో తెలిపి రాజ భవనమునకు వెళ్ళి రాణుల కీవార్త తెలిపి, గురు దక్షిణగా పిల్లలు గురువునకు చెల్లించవలసిన కానుకలు తీసికొని రమ్మని పంపెను. సుమంతుడు కూడను ఆనందముతో అతి వేగముగ రాజభవనమునకు వెళ్లి, విషయమును తెలిపి కానుకలు తీసుకొని అనుకొన్నదానికంటెను శీఘ్రముగావచ్చెను. అంతలో పిల్లలను పిలిపించి తమ తమ సామానులు సిద్ధము చేసుకొమ్మని గురువు ఆజ్ఞచేసెను. అన్నియు సిద్ధముగా చేసి రథమునకు పంపిరి. తండ్రి ఆజ్ఞను అనుసరించు రామలక్ష్మణ, భరతశత్రుఘ్నులు గురు పూజచేసి, కానుకలనందించి నమస్కరించి, గృహమునకు వెళ్ళుటకు ఆజ్ఞను కోరిరి. మహాఋషి ఆ పిల్లలను తన హస్తములలో చేర్చుకొని శిరస్సులను ముద్దాడి ఆశీర్వదించి, వారలను వీడలేక వీడలేక కన్నులనీరు తిరుగ, యెటులనో పొంగివచ్చు దుఃఖమును అరికట్టుకొని సెలవిచ్చెను. అంత, పిల్లలు గురువుగారితో రథమువరకూ వచ్చిరి. అందరూ రథములో ఆశీనులయిరి, రథము కదలెను. పిల్లలు హస్తములు జోడించి గురువునకు నమస్కరించుచూ వారుకూడనూ కంటిధారలు కార్చిరి. అది చూచి దశరథుడు గురు శిష్యుల సంబంధమును అర్థము చేసుకొని తనలో తాను ఆనందించుచు భవనము చేరిరి. గురువు భారమైన హృదయముతో గృహమును ప్రవేశించెను. ఎటు చూచినా అతనికి దీపములేని ఇల్లువలే అంధకారము కనుపించెను. దీనిని ఈరీతిగా చూచుచూ విచారించిన ఇది ఒక మోహముగా మారగలదని గ్రహించి, వాటి అనుభూతులను మరచుటకై ధ్యాననిష్ఠుడాయెను. అంతతో బాహ్య భ్రాంతివీడి అంతర్ ఆనందమున మునిగి ఆ బాలుర నలుగురు ధర్మ, అర్థ, కామ, మోక్ష స్వరూపులనియు, లోకమున ఈ నాలుగింటినీ బోధించి నిలబెట్టుటకై అవతరించిన దైవమూర్తులనియు గ్రహించి ఆనందించెను

రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు విద్యాభ్యాసము పూర్తి అయినదని దశరథుడు తలంచి, ఇక రాజవిద్యల నభ్యసింప చేయనెంచి ప్రవీణులైన వీరులను పిలిపించి, వారలకు అస్త్రశస్త్ర విద్యలను నేర్పించ ప్రారంభించెను. సర్వ విద్యా సంపన్నులగు ఆ బాలురకు విద్య నేర్పువారెవ్వరు? మానవాకారమును ధరించుట చేత లోకరీతులవలంబించుచున్నారే కాని, జగన్నాటక సూత్రధారియైన తనకు సూత్రములకూర్చి బోధించువారెవ్వరున్నారు? మాయతో కప్పిన మనసులు మాధ

షని గుర్తించక ఇట్టి ప్రకృతి విద్యలతో ప్రబోధించుటకు ప్రయత్నించిరి. లోక సంరక్షణకై అవతరించినప్పుడు లోకముయొక్క పోకడలనే అనుసరించవలసి యుండును. మానవాతీతమైన ప్రవర్తనలు సలిపిన ప్రజలు వాటిని అనుసరించజాలరు. ప్రజలకు ఆచరణయోగ్యమైన మార్గములందు బోధనలు సలుపుచూ వచ్చిన, సులభముగా ధర్మరక్షణ కాగలదు. అందువలన రాముడు నిప్పురు కప్పిన నిప్పువలే పాచికప్పిన నీరువలె, మేఘములు చుట్టుకొన్న చంద్రునివలె సామాన్య బాలునివలె మెలగుచుండెను. మిగిలిన సోదరులు అన్న అడుగుజాడల ననుసరించుచున్నారు. అస్త్రశస్త్ర విద్యలను నేర్పుటకై నియమించిన ప్రవీణులకు తెలియని శక్తియుక్తులు కూడను రామలక్ష్మణులు ప్రయోగించుట చూచి గురువులు తమలో తాము ఆశ్చర్యమును, భయము నొందెడివారు.

అయితే రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు యేనాడును తమ అస్త్రములచే మృగములనుకాని, పిట్టలనుగాని కొట్టి యెరుగరు. తమ అస్త్రములు అత్యవసర సమయములందు వినా, అన్య సమయములందు ఉపయోగించమని ప్రమాణముచేసి పట్టిన దీక్షకు యెట్టి సమయమునందైననూ విరుద్ధముగ నడచెడివారుకారు. అనేక పర్యాయములు గురువులు విహారార్థమై అడవులకు తీసుకొనివెళ్ళి కొన్ని రకములైన పిట్టలను, మృగములను చూపిన సమయమున రాముడు అందుకు సమ్మతించక,నిరపరాధులైన ఈజీవులను కొట్టుటకు కాదుకదా ఈ అస్త్రము. లోకసంరక్షణకై, ప్రజాసేవకై వినియోగింపవలసిన పవిత్రఅస్త్రములను ఇట్టి చిల్లరమార్గమున వినియోగించి అపవిత్రము చేయుటకు నా మనస్సొప్పుటలేదని గట్టిగా చెప్పెడివాడు. గురువులు కూడనూ మారుమాటాడక వూరకుండెడివారు. రామచంద్రుడు ప్రతిమాటయందును, పనులయందును తన కరుణరసమును కనుపరచెడివాడు. ఒకొకపరి లక్ష్మణుడు కొంత ఉల్లాసముతో, సరదాగా మృగములపై గురిపెట్టిననూ తక్షణము రాముడు అడ్డుతగిలి "లక్ష్మణా! వాటివలన నీకుకానీ, లేక లోకమునకుకానీ గలిగిన అపకారమేమనివాటిని కొట్టపూనుకొంటివి? నిర్దోషుల శిక్షించుట రాజనీతికి పరమవిరుద్ధముకాదాఅని నీతులు చెప్పెడివాడు. మధ్యమధ్య మహారాజు మంత్రుల మధ్య పిల్లలనుచేర్చి పరిపాలనా విధానములు, రాజనీతులు, ధర్మనీతులు, దైవనీతులు చర్చించుచు,పిల్లలకు తెలుపుచు తమ తాతల పరిపాలనను వారు పొందిన ప్రజామన్ననలను దానవులతో దేవతలతో వారలకు కలిగిన పోరాటములను వారలకుగల దైవసంబంధమును అత్యంత ఉత్సాహముతో కథలవలె పిల్లలకు తామే తెలుపుచు ఒకొకపరి మంత్రులతో చెప్పించుచూ బాల్యమునందే బాలురకు తగు క్రమశిక్షణతోపాటు పరిపాలనా దక్షతను కూడను

ప్రబోధించుచుండెను. కాలము గడచుకొలది కాయములు వృద్ధిఅగుచూ వచ్చుచుండుట చూచికుశాగ్రబుద్ధికల ఈబాలురు అతిశీఘ్రకాలమునందే రాజ్యబాధ్యత వహించగలరను తలంపు మంత్రులయందు దృఢమాయెను. వారల పరిపాలనచే, దేశము దివ్యలోకముగా మారగలదని కూడనూ ప్రజలు కలలు కనెడివారు. ప్రజలను చూచిన రాజ కొమరులును, రాజకొమరులనుచూచిన ప్రజలును యెంతో ఆప్యాయముగా పరస్పర బంధువులవలే ప్రీతితో మెలగెడివారు, పలుకరించెడివారు. నిరాడంబర, నిగర్వ, నిర్మల, నిస్స్వార్థ పరులైన ఆ బాలురను ప్రేమించనివారు, చూడనివారు అయోధ్యలో లేరు. అయోధ్య పిల్లల దేహమువలే, పిల్లలు అయోధ్యాపట్టణపు గుండెవలే సంబంధమును కలిగియుండెను.

పిల్లలకు పది పదకొండు సంవత్సరముల వయసు కావచ్చెను. ఒకనాడు దశరధమహారాజు గుణశాలియైన సుమంతుడగు మంత్రిని పిలిపించి, తమ పిల్లలైన రామలక్ష్మణ భరత శత్రుఘ్నులకు ప్రకృతి విద్యలైన అపర విద్యలతోపాటు పరా విద్యలు కూడనూ నేర్పవలసియుండును. పరా విద్యలు తెలియక అపరవిద్యలెన్ని యున్నను ధర్మమునకు తగిన బలము చేకూరదు. ఈ లేతవయస్సుననే ఉత్తమ సంస్కారములు హృదయమున చేర్పవలెను. భవిష్యత్తుయొక్క మంచి చెడ్డలు బాల్యావస్థయందు సంస్కరింపబడిన అనుభూతులపై ఆధారపడియుండును. ఈ అవస్థయే భవిష్యత్తను భవనమునకు పునాది కాన, పిల్లలను రాజ్య సంచారముతో పాటు క్షేత్రయాత్రలు చేయించి, తీర్థరాజములయొక్క పవిత్రతలను క్షేత్రముల యొక్క విశిష్టతలను వివరించి, వాటిని దర్శింపజేయుట మంచిదని తోచు చున్నది. పిల్లలు పెరుగుకొలదీ విషయాసక్తు లగుదురు. దీనికి పూర్వమే దైవానురక్తులుగచేయుట మానవత్వమునకు తగిన కర్తవ్యము. ఇది ప్రభువు లకు అతి ప్రధానము కనుక, గురువులవారితో సంప్రతించి యాత్రకు తగిన ప్రయత్నములు గావింపుమని ఆజ్ఞాపించెను. అంత సుమంతుడు కూడను సంతసించి, తగిన యేర్పాట్లు గావించి పిల్లలతో సుమంతుడు కూడను వెళ్ళుటకు సర్వసిద్ధ మాయెను.

అంతఃపురములో ఈ యాత్రా వార్త తెలిసెను. రాణులు తమ కొమారులు పవిత్రయాత్ర సాగించబోవుచున్నారను ఆనందముతో ప్రయాణములకు తగిన ఆహార విహార సదుపాయములు అన్నియూ సిద్ధము చేయించిరి. వారల వెంట దాదులను, కొంతమంది పుర బాలురను, పంప సిద్ధము చేసిరి. రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు పవిత్ర యాత్ర సలుపుచున్నామని పట్టలేని ఆనందమును ప్రదర్శించుచు, తమతోటి

బాలురను కూడనూ ప్రోత్సహించి, వారలకు తగిన ప్రయాణ సౌకర్యములను తండ్రితో చెప్పి సిద్ధము చేయించిరి.

రెండవదినము సుముహూర్తమునసమీపించగనే తల్లులకుతండ్రికినమస్కరించి, గురుపెద్దలవారికి నమస్కరించి, తల్లులతో హారతులుఅందుకొని, దృష్టిచుక్కలను రక్ష చుక్కలను పెట్టించుకొని, రాజ వేషములు విప్పి, సామాన్యమైన యాత్రావేషము లను అనగా పట్టు ధోవతులు కట్టి, అంగవస్త్రములు కప్పి, రథములలో కూర్చొని జయ జయ ధ్వనులతో. రథములను కదిలించిరి. ముందు వెనుక రక్షక భటుల రథ ములు వాయువేగముతో పరుగెత్తుచుండెను. దినములు, వారములు, నెలలు గడచి పోయెను. ప్రతి క్షేత్రమును ప్రతి తీర్థమును దర్శించి, పూజించి విషయములను విచారించి, అత్యంత ఉత్సాహముతో భక్తిశ్రద్ధలతో అన్యవాంఛలకు చోటివ్వక నిరంతరం క్షేత్రముల విశేష చరిత్రలను సుమంతుడు చెప్పుచుండ, పిల్లలు శ్రద్ధా లురై, ఇంకేమిటి? ఇంకేమిటి? అని క్షేత్ర చరిత్ర విశేషములను విపులముగా అడుగు చుండెడివారు.

వారల శ్రద్ధా భక్తులకు సుమంతుడు యెంతయో ఆనందించుచూ, మరింత విశేషములు తెలుపుచుండెడివాడు.

ఈ రీతిగా కన్యాకుమారి మొదలగు కాశ్మీరువరకు, ఉత్తర దక్షిణ, తూర్పు పడమర సముద్రముల తీరముల వరకునూగల క్షేత్రములను మూడు నాలుగు మాసములు సంచారమునలిపి, మధ్యమధ్య ఆయా రాజ్యములందుగల కొన్ని ప్రజా అనానుకూలములను, యాత్రికుల అనానుకూలములను గుర్తించి, మంత్రితో చెప్పి వాటిని సరిచేయించుచు, దైవ మందిరములకు తగిన యేర్పాట్లు భద్రతలు కల్పించుచు అనేక విధముల యాత్రీకు లకు నీటి వసతులు, వృక్ష ఛాయలను, చలివిందులను, సత్రములను, ఆరోగ్య కేంద్రములను నీమించమని రాముడు తెలుపగా రామ అభీష్టములకు అడ్డుచెప్పక కోరిన వాటినన్నింటిని అతి శీఘ్రములోనే చేయించుచూ, వచ్చుచున్న సుమంతుని చూచి, పిల్లలు తమలో తాము ఆనందించుచూ, మన మంత్రివంటి మంత్రులు లోక మున వుండిన, లోక క్షేమమునకు కొదువరాదని ఒకరికొకరు గుసగుస లాడేవారు.

ఇక అయోధ్యలో కొమారులయొక్క క్షేమవార్తలను అప్పుడప్పుడుమాత్రమే గూఢచారులచే తెలియబడుచుండెను. దూర శ్రవణయంత్రములు ఆనాడు లేకపోవు టచే గూఢచారులే వార్తలను అందించుచుండెడివారు. అందువలన వార్తలు చేరుట ఆలస్యమయ్యెడిది. ఒకొకపరి రాణులు పుత్ర వియోగమును భరించలేక, యెక్క

డున్నారో ఆహార, గాలుల మార్పుచే ఆరోగ్యములు యెట్లున్నవో అని తమలో తాము అనుమానములకు గురియై వశిష్ఠుల వారిని రప్పించి, పిల్లల క్షేమవార్తలను అడిగెడివారు. అతను తమ యోగ దృష్టితో పరిశీలించి, పిల్లలకెట్టి ఇబ్బందియూ లేక ఆనందముగా యాత్రలు సాగించుచున్నారు. అతి శీఘ్రములోనే అయోధ్యను చేరగలరని తెలిపి, రాణులకు ధైర్యానందము లందించి వారల నాశీర్వదించి వెళ్ళుచుండెడివాడు.

రెండవ దినమే గూఢచారివలన రాజకొమరులు రెండుదినములలో అయోధ్య చేరనున్నారని విని యాత్రనుండి దిగ్విజయము అందుకొని దివ్యమూర్తులైన పుత్రులు నలుగురు అయోధ్య చేరుచున్నారని వారలకు మంగళ స్వాగతములకై పుర సింహద్వారమున, దివ్య వైభవములతో యేర్పాట్లు గావించిరి. పురవీధులలో, స్త్రీలు ఇరువైపులా హారతులిచ్చుటకు తగిన వసతులు చేయించిరి.

ధూళిని యెగురనియ్యకుండుటకై వీధులను పన్నీరు జల్లులచే చల్లబరచిరి. అనుకొన్నటులనే రాజ కొమరులు సింహద్వారము ప్రవేశించి, మంగళ హారతు లందుకొని పురవీధులలో పుష్పములు చల్లుచుండ, మంగళ వాద్యములు స్వాగత పదములు పాడుచుండ, బ్రాహ్మణులు ఆశీర్వాదములు చెప్పుచుండ, సుమంత సమేతులై పూర్ణతేజస్సుతో భగవత్ కళలు మెరయుచు రాజభవనము చేరిరి. వారలకు అనేక రకముల దిష్టిని తీయించి లోనికి తీసుకొనిపోయిరి. కొమరులను చూచుటకై కన్నులు కాయలైయున్న తల్లులు వారలకై అంతఃపురమున కాచియుండుటచేత నలుగురు కొమరులు పరుగిడిపోయి తల్లులకు నమస్కరించి వారల హస్తములలో చిక్కుకొని అనుభవించు ఆనందమునకు సాటి వేరులేదు. ఆరునిముషములు స్పృహ లేని కాయములై సాయుజ్యస్థితి అనుభవించిరి. తల్లుల కన్నులనుండి కారు ఆనంద బాష్పములచే పట్టరాని ప్రేమచే తలలు తడిసిపోయెను. కొంతసేపయిన తరువాత, వారి చీర పయిటలతో తలలపై పడిన తమ కన్నీటిని తుడిచి శిరస్సులను ముద్దాడి, పీఠములపై కూర్చొని, తమతమ కొడుకులను వడిలో వుంచుకొని చక్కెరపొంగలి, దద్ధోజనములు తెప్పించి తల్లులు తమ హస్తములతో నోటిలో పెట్టుచుండ, అబ్బా! ఆ తల్లుల ఆనందము వర్ణనాతీతము.

మూడు నెలలు పుత్ర వియోగముచే పొందిన ప్రేమతాపమును చల్లార్చుకొనుటకై కొన్ని దినములు, తమతమ బిడ్డలను రాత్రింపగలూ తమచెంతనే వుంచుకొని మధ్య మధ్య యాత్రా విశేషములను అడుగుచూ, పిల్లలు ఒక్కొక్క క్షేత్రము యొక్క విశిష్టతలను సుమంతునిచే విన్నవన్నియూ తల్లులకు చెప్పుచుండ తల్లులు

కూడనూ యాత్రా ఫలమును అనుభవించిన వారివలె అత్యంత శ్రద్ధాభక్తులతో విను చుండెడివారు.

పిల్లలు యాత్ర గావించి వచ్చినను సంబరముచే దశరధుడు ఒకనాడు దేవతాసమారాధన గావించి, కాశీ, ప్రయాగ తీర్థములను వచ్చినవారలందరికి బ్రాహ్మణులచేత ఇప్పించెను. మృష్టాన్నములు పెట్టించెను. దక్షిణలు పంచి పెట్టెను.

ఈ విధముగా పుత్రులు పుట్టిననాటినుండియూ యేదో ఒక పేరున అయోధ్యలో వైభవములు జరుపుచుండిరి. అయోధ్య నిత్యోత్సవ నిలయమై రాణించుచుండెను. విందులు వినోదములు పట్టణపు వారలనందరిని ఒక కుటుంబీకులుగా మార్చి వేసెను. నెల నెలకు వచ్చు నవమి, దశమి, ఏకాదశిలయందు పిల్లల పుట్టిన పండుగలు అత్యంత వైభవముగా జరిపెడివారు.

గడచిన మూడు మాసములు పిల్లలు అయోధ్యలో భవనమున లేకపోయినను పిల్లలకు చేయు వింతలు తప్ప, మిగిలిన దాన ధర్మ నృత్య గానాది కార్యములు పట్టణములో జరిపించుచునే యుండిరి.

యాత్రనుండి తిరిగి వచ్చిన రాజ కొమరులు మునుపటివలె కాక అత్యంత ఆశ్చర్యకరమైన ప్రవర్తనలతో మెలగుచుండుట తల్లులు గమనించిరి. దినములు గడచిన కొంత అలవాటుచే యేర్పడిన ఈ పద్ధతులు మారవచ్చునని తలంచి దిన దినము కనిపెట్టుకొని యుండిరి. కానీ, యెట్టి మార్పునూ కనిపించలేదు. రాముడు పూర్వమువలె యెక్కువ వెలుపలకు వచ్చెడివాడు కాడు. సకాలమునకు స్నానాదులు చేసెడివాడు కాడు. రాజ దుస్తులను మహా విసుగుగా చూచెడివాడు. మృష్టాన్నములు తినక, బంగరు పీటపై కూర్చొనక, యేదో పరధ్యానముగ నుండునటుల కనుపించు చుండెను. అన్న అట్లుండుటచే మిగిలిన తమ్ములు ముగ్గురును అన్నతోనే వుండెడి వారు. ఆటలకు కానీ, మరే ఇతర స్థానములకు కానీ వెళ్ళెడివారు కారు. నలుగురూ ఒక గదిలో చేరి తలుపులు వేసుకొనెడివారు. వేళ వేళకు అమ్మలు తలుపులు తట్టి వారలకు ఆహారములు పెట్టెడివారు. తల్లులు యెంత బ్రతిమలాడినను, కారణము చెప్పెడివారు కారు. రాముడు మాత్రము ఇది నా సహజము. దీనికి కారణమే మున్నది, అని మాత్రము అనెడివాడు.

ఈ విధముగ పెరిగి పోవుచున్న వీరి మార్పులు మరుగు పెట్టుట మంచిది. కాదని అమ్మలు తలంచి, దశరధునితో తెలిపిరి. దశరధుడు పిల్లలను తన గదికి రమ్మని కబురంపెను దీనికి పూర్వము కబురంపగనే పరుగిడి వచ్చుచున్న బాలురు

ఈనాడు యెంత కాలమైననూ రాకుండుటచూచి, ఆశ్చర్యముతో ఆలోచనతో తానే పిల్లల చెంతకు వచ్చుటకు సిద్ధపడుచుండ ఇంతలో సేవకుడువచ్చి చిన్న ప్రభువులు దయచేయుచున్నారని తెలిపెను. దశరథుడు పట్టలేని ఆనందముతో పిల్లలను నలుగురిని పొట్టకు కరిపించుకొని వారలను ఇరుప్రక్కలా కూర్చొనబెట్టుకొని యెన్నియో వింతలు విశేషములు అడుగ మొదలు పెట్టెను.

పూర్వము ఒకటికి పది చెప్పుచున్న పిల్లలు, పది అడిగిన ఒకటైననూ చెప్పుటకు ప్రయత్నించకుండుట చూచి, రాముని తొడపై కూర్చుండ పెట్టుకొని "నాయనా! నీకేమి కావలెను. ఎందుల కీవిధముగ పలుకక మౌనము వహించితివి. నీ కంటెను నాకు వేరు లోకమున యేమున్నది? నీయిష్టమేదియో తెలుపుము, తప్పక గావింతును. నీవు పూర్వమువలే తమ్ములతో కలిసిమెలసి సరదాగా సంచరించకుండుట తమ్ములకు కూడనూ బాధగా వుండును. కారణము తెలుపుము," అని గడ్డము పట్టి యెంత ప్రతిమిలాడినను, నాకే వాంఛ లేదనియును, నేను ఆనందముగనే యున్నాననియు మాత్రము తెలిపెడి వాడు కానీ మరే జవాబునూ చెప్పెడివాడు కాడు. ఈ వింత చర్యలు చూచి దశరథుడు తలంచని చింత తలను పేరెను. విచారమున కంటి ధారలు కార్చెను.

కానీ పిల్లలలో మార్పేమాత్రము కనిపించలేదు. ఏవో కొన్ని మంచి మాటలాడి, రాజకొమరు లుండవలసిన విధానమును బోధించి, పిల్లలను వారి వసతులకు పంపెను. సుమంతుని పిలిపించి పిల్లలలోని మార్పును విశదముగాతెలిపి, యాత్రలో యేమైననూ పిల్లల యిష్టములకు విరుద్ధము లేమైననూ జరిగెనా? లేక, ఇంకనూ యాత్రలు చేయుటలో వారి ఉత్సాహమునకు భంగము కలిగించి తిరిగి వచ్చితిరా? యేమి జరిగినదో వివరములు తెలుపమని దశరథుడు అడుగు ప్రశ్నలకు సుమంతుడు ఆశ్చర్యమును, భయమును చెందుచూ,

"ప్రభూ! యాత్రలో పిల్లలకు యెట్టి యిక్కట్లు కానీ, వారల ఆశయములకు విరుద్ధములు కానీ జరుగలేదు. పిల్లల ఇష్టముల ననుసరించి దాన ధర్మములు కాని, యాత్రికులకు తగిన వసతులు కాని వారు కోరినటుల మరుక్షణమునందే గావించుచుండెడివాడను. అట్టి క్రియలలో యెట్టి అసంతృప్తియూ వారలకు కలిగినటుల వారు తెలుపలేదు. నేను కూడనూ తలంచలేదు. అని పరిపరి విధముల విచారముతో తెలుపుకొను సుమంతుని చూచి దశరథుడు,

"సుమంతా! నీవు మహా గుణశాలివి, నీవెపుడును రాజ కార్యములందు అశ్రద్ధ కానీ, పొరపాటు కానీ పడవనునది నాకు బాగుగా తెలియును. కానీ, యెందులకో

యాత్రనుండి వచ్చిన తరువాత పిల్లలు చెప్పలేనంతటి మార్పుతో వున్నారు. ఆహార విహారములు అసలే మానిరి.

"ఎన్నివిధముల బ్రతిమిలాడినను కారణము తెలుపక, రాముడు సరిగా మాటాడక, వైరాగ్యమును పూని యుండుటచూడ నాకాశ్చర్యముగనున్నది; రాణులు కూడనూ ముందునకు యేమి జరుగునో అను భయముతో లోలోన కృంగి పోవు చున్నారు;" అని దశరథుడు తెలుపగనే,

తమరు శెలవిచ్చిన, నేనొకపరి పిల్లలతో కలిసి విషయము తెలుసుకొందు నని సుమంతుడు కోరగనే దశరథుడు, "తప్పక వెళ్ళుము; కారణము తెలిసికొనిన దానికి తగిన కార్యములు సులభముగా గావించవచ్చును," అని ఆలస్యము చేయక వెళ్ళుమనెను.

సుమంతుడు ఆతురతతో, ఆవేదనతో పిల్లల వసతికి వెళ్ళి చూడగ, తలుపులు మూయబడియుండెను. ముందు మాత్రము పరిచారకుడు నిలుచుకొని యుండెను. మంత్రి తలుపు తట్టగనే, లక్ష్మణుడు తలుపు తీసెను.

లోనికివెళ్ళి తలుపు వేసికొని పిల్లలతో అనేకరీతుల సంభాషణలు జరిపెను. యేమి చేసిననూ కారణము అంతు చిక్కలేదు. కడకు పిల్లలు యాత్రలో తనతో నున్న చనువునకును, ఉల్లాసమునకును ఇపుడు గదిలో తనతో సలుపు సంభాషణలకూ చెప్పరానంతటి మార్పును గమనించి, కంటిధారలు కార్చి, రాముని యెంతో బ్రతిమిలాడెను.

రాముడు చిరునవ్వులు నవ్వుచూ, "సుమంతా! సహజమునకు కారణములేమున్నవి? నాకెట్టి కొరతయునూ లేదు; యెట్టి కోరికలునూ లేవు; నీవు విచారించకు" అని సమాధానము మాత్రము చెప్పెను.

చేయునదిలేక, సుమంతుడు దశరథుని చెంతకు వచ్చి, రేపటిదినము గురువుల వారిని పిలిపించి ఆలోచనలు జరుపుట మంచిదని మాత్రము తెలిపి, సెలవు తీసికొని తన కార్యములపై తాను వెళ్ళెను.

దశరథుడు లోకమునే మరచి విచారమున మునిగి, పరిపరి విధముల ఆలోచనలు సలిపెను. కడకు ఇది వయసు మారునట్టి సమయము కనుక మదిలోని మార్పును చెప్పుకొనుటకు తెలియక, పిల్లలు ఈరీతిగా ఉన్మత్తములో పడియుందురు కాబోలు. బాల్యావస్థమారి యవ్వనావస్థ ప్రవేశించు సమయము. బహుశా, ఇదే కారణమైయుండునని స్థిరము చేసికొని తాను అనుకొన్నటుల రాణులకు కూడనూ తెలిపి, కొంత శాంతిని పొందెను.

తెల్లవారెను. వశిష్ఠులవారు వత్తురను వార్తతో, రాజు రాణులు సర్వ సిద్ధమయి, పూజామందిరమున వేచియుండిరి. ఇంతలో గురువుగారు రానేవచ్చిరి. అందరూ గురువునకు నమస్కరించి, పిల్లలలోని మార్పుకు కారణములు అడుగ మొదలిడిరి. కంటిధారలు కార్చిరి. రాజు రాణుల విచారములు గమనించి, గురువులు యోగదృష్టిని మరల్చి విషయమేమని పరిశీలించెను. సత్యమును గుర్తించెను.

మరుక్షణమునందే రాజు,రాణులవైపు చూచుచూ "పిల్లలలో యెట్టి దోషమును లేదు. వారు సామాన్యులు కారు. వారలకు లోకవాంఛ లేమాత్రమును లేవు. శుద్ధ మనస్కులైయున్నవారు. మీరు విచారించకుడు, పిల్లలను పిలుపించుడు. ఇక మీరు మీ మీ వసతులకు వెళ్ళుడు," అని ఆజ్ఞాపించెను.

ఆ మాటలతో రాజు రాణులు సంతసించి, పిల్లలకై కబురంపిరి. రాణులు వారివారి వసతులకు వెళ్ళిరి. గురువు పిలుచుచున్నాడన్న వార్తవిన్న లక్ష్మణ భరత శత్రుఘ్నులు సర్వసిద్ధమయిరి. కాని రాముడు యెట్టి ఆతురతయూలేక తనధోరణిలో తానుండుట గమనించి లక్ష్మణుడు అన్నపాదము పట్టి ప్రార్థించి, త్వరగా వెళ్ళుట మంచిది, లేకున్న గురువాజ్ఞ మీరితిమన్న విషయము తలిదండ్రులను అమితముగా బాధించును అని, అనేక రకముల బ్రతిమిలాడి, అన్నతో లక్ష్మణ, భరత, శత్రుఘ్నులు బయలుదేరి పూజా మందిరమును చేరిరి.

గురువునకు నమస్కరించి వినయముతో, యెదురుగా నిలుచుకొనియున్న పిల్లలను చూచి, వశిష్ఠులవారు వాత్సల్య వచనములతో దగ్గరకు వచ్చి కూర్చుండమని సెలవిచ్చెను. అందరూ దగ్గరకువచ్చి కూర్చొనిన, రాములను మరింత దగ్గరకు రమ్మనమని, శిరస్సున హస్తముంచి తల నిమురుచు వీపు తట్టుచు, "రామా! యెందులకు నీవిట్లు నిశ్చేష్టుడై మౌనమును వహించితివి? నీ చర్యలను అర్థము చేసుకొనలేక, అమ్మలు నాన్న అనేకవిధముల బాధపడుచున్నారు. వారల ఆనందమును కూడనూ కొంత యోచించవలెను కదా? "మాతృదేవోభవ! పితృదేవోభవ!' అను మహావాక్యముల అర్థమును కూడనూ ఆచరణలో నిరూపించవలెను కదా?" అని కొన్ని నీతుల బోధింప మొదలు పెట్టిన వశిష్ఠులవారి ముఖమును చూచి, రాముడు చిరునవ్వుతో, "స్వామీ! తల్లి యెవరు? కొడుకెవరు? అసలు దేహమన నేమి? జీవుడన్ననేమి? ఈ ప్రకృతి సత్యమా? పరమాత్మ సత్యమా? ప్రకృతియొక్క ప్రతిబింబమే ఈ కాయము కదా? కాయమునందలి పంచభూతములే లోకమంతటనూ వున్నవికదా? పంచభూత సమ్మిళితమే ఈ ప్రకృతి! భూతములు మార్పు చెందునవి

కదా? అట్టి వాటిని సత్యమని తలంచి, భ్రమించి, పఠించి, సత్యనిత్యమైన ఆత్మను స్మరించకుండుటచే జీవులకు వచ్చు ఫలమేమి?"

అని అనేక రీతుల తత్త్వజ్ఞాన ప్రశ్నలు వేయ మొదలు పెట్టిన రాముని చూడగనే, రామ ముఖమునుండి కాంతి కిరణములు అతివేడిగా ప్రకాశించుచుండుట గురువుగారు గుర్తించిరి. దైవత్వము బైటపడుటకై కలుగు చిహ్నములే ఈ వన్నెలు అని గమనించి, రాముడు అడిగిన ప్రశ్నకు అతనినే జవాబు చెప్పమని వశిష్ఠులవారు తెలుపగనే, రాముడు చెప్పు జవాబులు సాక్షాత్ దైవవాణులే కానీ, వేరు కాదని పూర్తిగా విశ్వసించి వశిష్ఠులవారు,

మదిలో నమస్కరించి, "నాయనా! తిరిగి సాయం సమయమున నేను వచ్చి చూతు"నని అందరి శిరస్సులనుముద్దాడి, ఆశీర్వదించి, దశరథునితో కలువక నేరుగా ఆశ్రమమునకు వెళ్ళిపోయెను.

తదుపరి దశరథుడు పిల్లలను చూడగా, వారలలో యేదో బ్రహ్మ తేజస్సు మూర్తీభవించినటుల ప్రకాశించుచుండెను. విషయము తెలిసికొనుటకు సాయంత్రం వశిష్ఠుల రాకకై కాచియుండిరి. గురువులు పూజా గృహమును ప్రవేశింపగనే, తల్లులు, పిల్లలు, దశరథ సమేతులై వచ్చి గురువునకు నమస్కరించి అందరూ వారి వారి ఆసనములపై చేతులు జోడించుకొని కూర్చొనిరి.

అంత ఉన్నట్లుండి, "జీవుడన్న, దేవుడన్న, ప్రకృతి అన్న, ఈ మూడింటికీగల సంబంధమేమి? ఈ మూడునూ ఒకటియేనా? లేక వేరు వేరా? ఇవి మూడు రూపములు ధరించుటకు కారణమేమి? జీవేశ్వర ప్రకృతిలోని యేకత్వము యేది? ఏకత్వమును వదలి భిన్నత్వమును నిత్యసత్యముగ తలంచిన ఫలించు సఫలమేమి?" అని రాముడు వేయుచున్న ప్రశ్నలను తలిదండ్రులు విని ఆశ్చర్యముతో రాముని చూచిరి.

జ్ఞానమే దివినుండి భువికి దిగివచ్చిన మూర్తులవలె తేజస్సుతో స్పష్టమైన వజ్రములవంటి పదములతో ప్రవహించుచున్న ఆ ప్రశ్నోత్తరవాహినిలో లీనమైరి. కుమారుడను భావమే వారలకు కొంత కాలము మరుగాయెను. ఈ రీతిగా అచ్చపు జ్ఞానమునే, అద్వైతమునే పలుకుచూ, రాత్రి జాములు మారిననూ వాదన మానలేదు.

కడకు గురువుగారు రామచంద్రుని పలుకులు లోకమునకు శాంతి నొసగు అమృత చినుకులని ఆనందించి దశరథ సమేతులైన రాణులను ఆశీర్వదించి వసతికి వెళ్ళిరి.

ఈరీతిగ, రామ వశిష్ఠుల వారికి జరిగిన సంభాషణయే నేడు లోకమున యోగవాసిష్ఠమను పేర సార్థకమగుచున్నది. దీనినే 'రామగీత' అనికూడనూ పిలుతురు.

ఇటుల వేదాంతమున మునిగి సర్వమునూ త్యజించి తనలో తాను వదరుచు చేతులు త్రిప్పుచూ, ఉన్మత్తునివలే అపుడపుడు నవ్వుచూవున్న చర్యలను చూచి దశరథుడు, అతనితో మిగిలిన పిల్లలు కూడనూ యేమగుదురో అని వారలను పేరు పెట్టచూచిన వారలు అంగీకరించక నిరంతరం రామునితోనే కూడి యుండిరి.

రాజు రాణులు దిన దినమునకు విచారముతో కృంగి తాము తలంచిన వన్నియూ స్వప్నదృశ్యము లగునేమో అని మంచి మార్పు యెపుడు వచ్చునో అని నిమిషములు లెక్కించుచు కాలము గడుపుచుండిరి. రాములు కూడనూ ఆహారము సరిగా తీసుకొనకుండుటచే దేహము కొంత బలహీనమైనటుల కనుపించెను.

# యాగ సంరక్షణ

ఆ దినములలో అయోధ్యకు తూర్పు దిశయందున్న అరణ్యములో విశ్వామిత్రమహర్షి ఘోర తపస్సు చేయుచు, ఒక పవిత్ర యాగమును ప్రారంభించెను. ఎన్ని పర్యాయములు ప్రయత్నించిననూ దానికి అసురులు అడ్డుతగిలి విఘ్నములు కలిగించుచుండిరి అపవిత్రము చేయుచుండిరి. ఆప్రదేశములో మాంసప్రముక్కలను తెచ్చి చల్లుచూ, విశ్వామిత్రుని యాగమును నానారీతుల ధ్వంసము చేయుచుండుటచే, విశ్వామిత్రుడు చేయునది లేక దీర్ఘ ఆలోచన సలిపి, సరాసరి ప్రయాణమై అయోధ్యానగరమును చేరెను.

మహర్షి ఆగమనము తెలిసికొని. మహారాజు మంత్రులనంపి, వారినితోడ్కొని రమ్మని ఆజ్ఞ చేసెను. రాజాజ్ఞ ప్రకారము పురసింహద్వారమునకు వెళ్ళి స్వాగత మొనర్చి రాజభవనమునకు తోడ్కొని వెళ్ళిరి.

రాజభవనములో మహర్షిరాకకై సర్వసిద్ధములతోకాచిన మహారాజు దశరథుడు బ్రాహ్మణులు స్వస్తివాచకములు చెప్పుచుండ, మునిపాదములు కడిగి, శాస్త్రీయవిధిని రాజసాంప్రదాయములను అనుసరించి, జలమును శిరస్సున ప్రోక్షించుకొని లోనికి తీసుకొనిపోయి ఉన్నతాసనముపై కూర్చుండబెట్టి,

ఈనా డెంతయో సుదినము! తలవని తలంపుగ మహనీయులు మా భవనమును ప్రవేశించి సేవలుగొనుట మా భాగ్యమని అనేక విధముల మహారాజు విశ్వామిత్రుని రాకను గురించి ఆనందించుచుండ, విశ్వామిత్రుడు రాజునూ, మంత్రులనూ కూర్చొనుట కాజ్ఞాపించెను. ముని ఆజ్ఞను శిరసావహించి వారి వారి ఆసనములపై వారు ఆసీనులైరి.

అంత విశ్వామిత్రుడు దశరథుని కుశల ప్రశ్నలు గావించి పాలనా విధానమున కెట్టి ఇక్కట్టునూ లేక, ప్రజా క్షేమములకు యెట్టి కొరతయూ లేక, రాజ్యము సుఖశాంతి భద్రతలతో సాగుచున్నదా అని రాజ్యస్థితిని, ప్రజాక్షేమములను విచారిం

చెను. అందుకు దశరథుడు దైవానుగ్రహముచేతను, మహర్షుల ఆశీర్వాదములచేతను రాజ్యమున యెట్టి అశాంతియును లేక ప్రజలు తమ తమ కర్తవ్యములను చక్కగా నిర్వర్తించుచున్నారనియును పరిపాలన కూడను ప్రజాక్షేమమునే లక్ష్యమందుంచు కొని తగిన రీతిగ సేవలు చేయుచున్నదనియూ విన్నవించెను.

అంత దశరథుడు రాజోచిత ఉపచారములు గావించి, తమ రాకకు కారణ మేమనియును, మహర్షి అభీష్టమును తీర్చుటలో మహారాజు సర్వ సిద్ధముగా నున్నా డనియును తనవలన మహర్షికి కావలసిన చేయవలసిన సేవ లేవియైననూయున్న శిరసావహించి నెరవేర్పగలనని భక్తి శ్రద్ధలతో పలుకుచున్న పలుకులకు విశ్వా మిత్రుడు తల ఊపుచు చిరునవ్వులతో జవాబిచ్చినాడు.

విశ్వామిత్రుడు రాజువైపునకు దృష్టిమరల్చి, "రాజా! మీరు మహా ధర్మపరు లనియును, అతిథి అభ్యాగతుల నాదరించు భక్తి శ్రద్ధలు మీలో మూర్తీభవించిన వనియును, సర్వవిద్యా పారంగతులనియును, నేను ప్రత్యేకముగ చెప్పనవసరము లేదు. లోకక్షేమమే మీ గుణములకు సరియైన సాక్ష్యము.

పాలకులెట్టివారో ప్రజాలోకమట్టి స్థితినందుకొనును. లోక ప్రశాంతి, అశాం తులు, పాలకుల మంచిచెడ్డలను వ్యక్తపరచును. నేనెక్కడ విచారించిననూ, ప్రజా ప్రీతిగల ప్రభువు, ప్రభుప్రీతిగలప్రజలు ఒక్క అయోధ్యాపాలనమందు మాత్రమే కలరని కర్ణానందకరమైన వార్తలు వినుచుందును.

కాన మీ వాక్యములు హృదయపు మాటలు! మీరు తప్పక నా అభీష్టమును నెరవేర్తురను విషయమున నాకెట్టి సందియమును లేదు. మీరాడినమాట తప్పరు", అని పలుకుచున్న పలుకులు, దశరథుని హృదయమును కదిలించెను.

మహనీయులు లోకోద్ధారకమైనకార్యములేఆచరింతురు. ఏవిచేసిననూ, శాస్త్ర సమ్మతములే! కారణము లేని కార్యమును దైవ నిర్ణయము కాని కార్యమునూ వారు సంకల్పించరు కదా! తమ సేవకై నేనుకానీ, నా పరివారము కానీ, యెల్ల వేళల యందునూ ఆజ్ఞాబద్ధులమై యుందుమని మరిమరి గట్టిగ ప్రతిజ్ఞ చేయుటచే,

విశ్వామిత్రుడు సంతసించి, "రాజా! నీవు పలికినటుల యే కారణమును లేక మహనీయులు కాలుకదల్పరు. నేనొక కార్యనిమిత్తమై నీ చెంతకు వచ్చితిని. నీ మాటలనువిని నీవు నెరవేర్తువన్న ఆనందము నన్ను మరింత పురికొల్పుచున్నది, ప్రోత్సహించుచున్నది. నీ మాటను నీవు నిలబెట్టుకొందువు కదా?" అని కొంత సం శయించినటుల ప్రశ్నించగనే,

దశరథుడు "స్వామీ! ఇట్టిప్రశ్న యితరులదగ్గర వేసినను వేయవచ్చునేమో

కానీ, దశరథుడు ఆడినమాట తప్పువాడుకాడు. ప్రాణములైననూ ఇచ్చి మానమును కాపాడుకొనును. రాజునకు నీతి నిజాయితీలే నిజగౌరవములు, నిజపాలనలు. ఈ రెండునూ కోల్పోయిన, జ్యోతిలేని మందిరమువలె కోతి ఆటలతో రాజ్యము కొరివికి గురియగును, కలహములపాలగును, కల్లోలములుచెలరేగును. కడకు, రాజునకే కీడు సంభవించును అట్టిస్థితులు నారాజ్యమున సంభవించుననునదికలలోకూడను తలంచను.

"నేనేకాదు నా వంశమందే అట్టి దుర్మార్గములు జరుగవనియే, రావనియే నా దృఢము. సంశయించక తమరు తమ సంకల్పమును తెలిపి, ఈ దాసునితో సేవలు చేయించుకొం"డని నమస్కరించెను.

అంత విశ్వామిత్రుడు, "రాజా! నీ మాటలు వినగోరి అట్లు ప్రశ్నించితినే కానీ, ఇక్ష్వాకుల వంశము ఈప్సితముల తీర్పుటలో సర్వవిధములా సంసిద్ధమనునది నాకు తెలియును."

"రాజా! నీ నుండి నేను పొందవలసినది యొక్కటి మాత్రమే. అది ధనము కావి, వాహనములు కాని, గోవులు కావి, సువర్ణమును కాని, లేక మరేవిధములైన సైన్యమును పరివారమును కాని నేకోరుటలేదు. తమ కుమారులైన రామలక్ష్మణులను నాకిచ్చిన చాలును. ఇదే నా వాంఛ, యేమందువు?" అని ముని అడుగగనే, దశరథుడు నిలువునా కూలిపోయెను. మనసు చెదరి పోయెను.

కానీ, ధైర్యమును వహించి, "స్వామీ! ఆ బాలులవలన తమకు కలుగు ప్రయోజనమేమి? ఏ కార్యమును ఆ బాలులచే చేయించుకొన తలచితిరో, అట్టికార్యమును నేనేచేసి ధన్యుడనయ్యెదను. ఆకార్యమేమిటిదో, తెలిపిన సంతసింతును" అని ప్రార్థించగా

"రాజా! ఆ పిల్లలు చేయు ఘనకార్యము మీరెట్టి వారునూ చేయలేరనియే నా దృఢము! నీవుకానీ నీఅనేక లక్షల సైన్యముకానీ చేయలేని, సాధించలేని కార్యమును, ఆ ఇరువురు పిల్లలు మాత్రమే చేయగలరు! అట్టివారు లోకమున నెందునూ పుట్టలేదు; పుట్టరు. ఇది నా నిశ్చయము. వినుము; నేనొక మహాయాగమును తలపెట్టి దానికి ప్రారంభము జరిపినంతనే యెక్కడ నుండియో రాక్షసులువచ్చి దానికి విఘ్నములు కలిపించుచూ, నానా అశుద్ధములూ యేర్పరచుచున్నారు. కాన ఆ రాక్షసుల బారిని తప్పించి నా యాగమును రక్షించి, పూర్తి గావించవలెను.

ఇదియే నా వాంఛ, యేమందువు?" అని గంభీరముగ ప్రశ్నించగనే రాజు, "స్వామీ! ఈ కార్యము ఈ పసిపిల్లలకు చేతకాదు, నేను సర్వసిద్ధము. నా చతురంగబల సమేతముతో తమ ఆశ్రమమును కాపాడి యజ్ఞము నిర్విఘ్నముగా జరుగు

నటుల చూచుకొందును. దేవాసురులతో పోరాడిన పరిచయము నాకు బాగుగా యుండుటచేత, ఇది సులభముగా నెరవేర్తును. ఇపుడే తమ వెంట వచ్చుటకు యేర్పాట్లు గావింతును. సెలవొసంగమని" ప్రార్థించెను.

అంత విశ్వామిత్రుడు, "రాజా! నీవెన్ని చెప్పినను నా మనస్సొప్పుటలేదు. ఇది నీ చేత కాదు. సర్వజ్ఞుడును సర్వతపశ్శక్తి సంపన్నుడనైన నాకే ఇది సాధ్యమగుట లేదు. ఇంక నీకెట్లు సాధ్యమగును? ఆ పిల్లలు సామాన్యులని నీవు తలంచుచున్నావు. ఇది పుత్రవాత్సల్యముచే కలిగిన పొరపాటు. వారు మూర్తీభవించిన దైవశక్తులనునది నాకు బాగుగా తెలియును. సంశయించక మాటను నిలబెట్టుకొనుటకై వారలను తక్షణమే నావెంట పంపుము. లేదా, మాటను నిలబెట్టుకొన లేక పోవుచున్నానని పలికిన, నేను వెళ్ళివత్తును. రెండింటిలో యేదియో యొకటి గావింపుము. కాలహరణము చేయ సమయము కా"దని తీక్ష్ణ వచనములతో పలుకు మునిని చూచి, యేమి ప్రమాదము వాటిల్లునో అని దశరథుడు భయభ్రాంతుడై మంత్రినంపి వశిష్ఠుల వారిని పిలిపించెను. వశిష్ఠులవారు విశ్వామిత్రుని చూచి, పరస్పర నవ్వులతో కృతజ్ఞతలను తెలుపుచూ కూర్చొని, రాజువలన జరిగిన కధనంతయును విపులముగా వినెను. బాలుల సంగతి వశిష్ఠుల వారికి కూడనూ తెలియును కనుక ఇందుల కే మాత్రమును విచారమును వెలిబుచ్చక, దశరథునికి నచ్చ చెప్పుటకు పూనుకొనెను. దశరథుడు, కుమారులు కొన్ని దినములనుండి సరియైన స్థితిలో లేరనియును, రాక్షసులతో యుద్ధము చేయగలిగినట్టి శరీరబలములు కూడను కోల్పోయినారనియును, మొదలే వారలస్థితినిచూచి విలపించుచున్నమాకు గోరుచుట్టుపై రోకటి పోటువలె ఈఘోరకార్యమునకుపంపుటకు,తనమనస్సేమాత్రమును ఒప్పుకొనుటలేదని తమపిల్లలను రక్షించుకొనుటకు తమ ప్రాణములైననూ ఇత్తునని, విలపించుచున్న దశరధునిచూచి, విశ్వామిత్రుడు "రాజా! మీరు ఇంత విలపించుటలో అర్థములేదు ఇంత మాటనిలకడ లేని వాగ్దానములు ముందే చేయకుండిన యెంతయో బాగుండును. విచారణ సలుపక వాగ్దానములు గావించి, విషయమునకు రాగానే వాగ్దానములు సడలించుట పరిపాలకులకు మహాపాప కార్యము. ఇది నీబోటి రాజులకు సరికాదు. విచారముతో చేయు సహాయము నా కక్కరలేదు. హృదయ పూర్వకమైన సహాయము ఎంత చిన్నదయి నప్పటికినీ అది ప్రాణసమానము. అసంతృప్తితో చేయు సహాయము యెంతగొప్పదయిననూ అది అల్పకార్యమేకాగలదు. మిమ్ములను హింసించి, బాధపెట్టి నా కార్యమును సాధించుకొనవలెనని ఆశ నాకు లేదు. మీరు ఆనందముగా నుండుడు. నేను పోయివత్తును," అని విశ్వామిత్రుల

వారు లేచి వెళ్ళుటకు ప్రయత్నింప రాజు పాదములుపట్టి ప్రార్థించి, తమ ఆవేదనకు తగిన సమాధానములు అందించి బోధించి, కార్యమును నెరవేర్చుకొమ్మని కోరెను. అంత, వశిష్ఠులవారు దశరథుని చెంత చేర్చుకొని, "రాజా! పుత్రవాత్సల్యమను వస్త్రము హృదయమున కప్పబడి యుండుటచే, నీవిట్టి ఘనకార్యమునకు అడ్డుపడుచున్నావు.

నీ కుమారుల కెట్టి ఆపదయూలేదు, రాదు. వారు చేయలేని కార్యములు లోకమున లేవు. రాక్షస సంహారార్థమై అవతరించిన మూర్తులు ఆ శక్తులు. కాన విచారించక పిల్లలను పిలిపింపుము. వారి భుజబలములు, బుద్ధిబలములు కావు నీవు చూడవలసినది. దైవబలము వారలయందు తొణుకులు వేయుచున్నది. ఆ బలము కంటే మించిన బలము మరొకటి లేదు."

అని అనేకరీతులు బోధించి, రామలక్ష్మణులను పిలిపించిరి. విశ్వామిత్ర, వశిష్ఠులవారు చేరి తమను పిలిపించుచున్నారన్న వార్త రామలక్ష్మణులు వినగనే క్షణములో వారల చెంతవచ్చి వ్రాలిరి. మొదట తండ్రికి నమస్కరించి తదుపరి వశిష్ఠ విశ్వామిత్రులకు నమస్కరించి వినయముతో నిలచియుండు పిల్లలనుచూచి విశ్వామిత్రుడు చిరునవ్వుతో,

"నాయనలారా! మీరు నావెంట వత్తురా?"అని ప్రశ్నించెను. పిల్లలు ఉల్లాస హృదయములతో తమ రాజ్ఞాపించిన సర్వసిద్ధము, అని జవాబు చెప్పిరి. ఈ మాటలకు దశరథుడు మరింత కృంగిపోయెను. మోము వాడిపోయెను. విచారమున విలపించుచున్న తండ్రినిచూచి రాముడు చెంతచేరి,

"తండ్రీ! మహర్షులవెంట పంపుటకు మీరెందులకింత విలపించుచున్నారో అర్థమగుటలేదు. పరోపకారార్థమై పుట్టిన కాయములను పవిత్రము చేయుటకంటె వేరు పురుషార్థమున్నదా? అందునా మహర్షులకు సేవలు చేసి వారి కార్యములలో పాల్గొని వారలకు సంతృప్తి పరచుటకంటె పవిత్ర కార్యము వేరొకటి యున్నదా? మాకు చేతకానిపని అనునది యొకటిలేదు కదా. ఎట్టి రాక్షసులతో నైననూ పోరాడి, ఋషి అభీష్టమును నెరవేర్తుము. సెలవిచ్చిన ఈ నిమిషముననే వారితో వెళ్ళుటకు సర్వసిద్ధ"మని రాముడు ధైర్య వచనములతో తండ్రిని కొంత కలతనుండి తప్పించెను

దశరథుడు ఎటు చెప్పుటకు వీలుగాని స్థితిలో మునిగెను. రాముని దగ్గర చేర్చుకొని, "నాయనా! రాక్షసులు సామాన్యులుకారు. అందునా సుంద, ఉపసుంద, మారీచ, సుబాహువులు మహా క్రూరులని నే వినియుంటిని. వారు క్రూరత్వమునకు

తగిన భయంకరరూపులు. మీరేనాడునూ అట్టి రూపములు చూచియుండరు. వారలను చూడగనే యెంత భయపడుదురో? అనేక మాయలతోకూడిన ఆ రాక్షసులతో యుద్ధమెట్లు చేయగలరు. ఏనాడు యుద్ధమనుపదమునే మీరువినలేదు. చూడలేదు. అట్టి నా కసికందులగు మీరు రాక్షసులతో పోరాడగలరా, అయ్యో దైవమెంత నిర్దయ చూపుచున్నాడు. నా కొమారులకు ప్రప్రథమమునందే యిట్టి కఠిన పరీక్షయా?"

అని తనలోతాను చింతించుచు, పిల్లలను చెంత చేర్చుకొని విచారముతో కంటిధారలు కార్చుచుండ, లక్ష్మణుడు తండ్రి బలహీనతను గమనించి, "నాన్నా, మేము ఆడపిల్లలము కాము. యుద్ధము మాహక్కు. ధర్మస్థాపన మా కర్తవ్యము. ఋషిసేవ, రాజనీతి మా ఉచ్ఛ్వాస నిశ్వాసములు. ఇట్టి ధర్మకార్యముల కంపుటలో మీరింత విచారించుట ఆశ్చర్యము. లోకులుచూచి నవ్వుదురు.

మీరు ప్రేమతో ఆశీర్వదించి పంపుడు. నేను కూడనూ అన్నతో వెళ్ళి జయలక్ష్మిని చేకొని వత్తును." అని చెప్పెను.

వాత్సల్యోన్మత్తుడై విలపించుచున్న తండ్రిని చూచి రాముడు చెంతచేరి, తండ్రిచేతిని పట్టుకొని, "తండ్రీ! నిన్ను నీవు మరచినట్లున్నది. నీవెవరో? యేవంశమున జన్మించితివో? నీ పూర్వీకుల ఘనకీర్తుల నొకపరి స్మరించుకొన్న నీవిట్లు విలపించి యుండెడివాడవు కావు. నీవు ఇక్ష్వాకుల వంశములో పుట్టితివి. ధర్మము సాక్షాత్తు నీ రూపాన మూర్తీభవించినట్లుగా, ఇంతవరకు ప్రవర్తించినావు. నీవు సువ్రతుడవు, ధర్మాత్ముడవు, ధైర్యసాహసశాలివిఅనిముల్లోకాలను మారుమ్రోగితివి. ఆడినమాట తప్పుటకంటె మించినపాపము మరొకటిలేదని మీరెరుగుదురు. మహర్షికిచ్చిన మాటను నెరవేర్చుకొనుటలో మీరిట్లు విచారించుట మీ కీర్తికి సార్థకము కానేరదు. తండ్రిఅపకీర్తి బిడ్డలు సహించరు. మీ మాటను మీరు దక్కించుకొనలేక పోయిన యజ్ఞ యాగాది క్రతు కార్యములేకాక వాపికూప, తటాకాది ధర్మ కార్యములు నిష్ఫలములు. వేయేటికి, దశరథుడు మాట తప్పెనను మాటలు వినుట మీ పుత్రులమైన మాకు తలవంపులు. ఇది వంశమునకే మాయనిమచ్చగా నిలిచిపోవును. ఒక పుత్ర వాత్సల్యమునకై వంశమునకే తీరని అపకీర్తి వాటిల్లును. విచారణలేని మీ ప్రేమ మమ్ములను శిక్షించునుకాని రక్షించదు. నిజముగా పుత్రవాత్సల్యమే మీలో ప్రధానముగా నుండిన, పుత్రుల సత్కీర్తిని, లక్ష్యమందుంచుకొనవలెనుకదా? మీకు మేము చెప్పునంతటి వారము కాము. మీకు సర్వము తెలుసు. వాత్సల్యమింతటి అయోమయమున కీడ్చుకొని పోయినది. కర్తవ్యమును గుర్తించక చేయుచున్నది. మాకెట్టి భయమును లేదు. విజయలక్ష్మి మమ్ములను వరించును. మీరు

భ్రమించక, ఆశీర్వదించి ఋషి కప్పజెప్పుడు." అని శిరసువంచి నమస్కరించు చున్న రాముని,

దశరథుడు కౌగలించుకొని, శిరమును ముద్దాడి, "నాయనా! నీవు చెప్పిన వన్నియు పరమ సత్యములు. పవిత్ర రత్నములు. నేను వాటిని కాదనునట్టి మూర్ఖుడను కాను. చతురంగ బల సమేతుడనై వెళ్ళి, ఋషి యాగమును రక్షించుటలో నా సర్వస్వమూ త్యాగముచేతును కానీ, అస్త్ర శస్త్ర విద్యలలో ఇప్పుడిప్పుడే తరిఫీదగుచున్న నా పాలబుగ్గల పసిపాపలను ఆ రాక్షసుల చేతికందించుటకు నా మనసు ఒప్పుకున్నది. తెలిసి తెలిసి పులినోటికందించుటకు ఎట్టి తండ్రి అయినమా ఇష్ట పడడు కదా? అనేక యజ్ఞ యాగాది క్రతువులు సలిపి, తపములుచేసి, పొందిన మిమ్ములను ప్రాణసమముగా చూచుచున్న మమ్ముల నిట్లు విషాదాగ్నిలో త్రోయుట పుత్రులకు మాత్రము న్యాయమా? అయ్యో, విధి యెదురు తిరిగినయెవరేమిచేతురు. మా పాపఫల"మని శిరస్సుపై చేయివేసి విలపించును,

ఇది చూచి రాముడు చిరునవ్వు నవ్వుచూ, "నాన్నా! యేమిటీ బలహీనత. తెలిసి తెలిసి పులుల నోటి కందించుచున్నానని అంటిరి. మేము మేకపిల్లలము కామని నీవు తెలిసికొనలేదు. పురుష సింహములమని తలంచి పుణ్యకార్య నిమిత్తమై మమ్ముల నాశీర్వదించి పంపుము. కాలయాపన ప్రభువులకు కర్తవ్యము కాదు." అని కొంత సూటిగా మాటాడుట వశిష్ఠులవారు చూచి, "భేష్, భేష్, దశరథా! వింటివా? సింహగర్జనలు. ఇంకనూ ఈ నక్క అరుపు లెందుకు? లెమ్ము. అంతఃపురమునకు వార్తనంపి రాణులను రప్పించుము. పుత్రులను విశ్వామిత్రున కప్పజెప్పుము." అని ఆజ్ఞ చేయగనే చేయునదిలేక రాణులను తోడ్కొని రమ్మని కబురంపెను.

ఇంతలో రాణులు మేలిముసుగులువేసుకొని ప్రవేశించి మహర్షులకు నమస్కరించి, పిల్లలచెంతనిలుచొని తమబిడ్డల తలలను నిమురుతూతలలువంచుకొని యుండుటను చూచి వశిష్ఠులవారు "అమ్మలారా! మన రామలక్ష్మణులు విశ్వామిత్ర యాగ సంరక్షణకై వెళ్ళుటకు సర్వసిద్ధులైయున్నవారు. వారలను ఆశీర్వదించి, పంపుటకై మిమ్ముల నిచటికి రప్పించితిమి. ఆశీర్వదించి పంపుడు" అని వశిష్ఠులవారు తెలుపగనే,కౌసల్య ఉలికిపడినట్టు తలయెత్తి గురువులవారినిచూచి "యేమీ! ఈకసిగందులు మహర్షి చేయు యజ్ఞమును సంరక్షించుటా? యజ్ఞమును మంత్రములే రక్షించునను వినియుంటిని కానీ మనుష్యులు రక్షించుటేమున్నది? యజ్ఞ బాధ్యతలు ఋత్విక్కుల దీక్షపై ఆధారపడియుండును" అని అన్న కౌసల్య మాటలు

వశిష్ఠులవారికి సత్యములుగా తోచిననూ విషయమును వివరించుట మంచిదని తలంచి,

"అమ్మా! కౌసల్యా! విశ్వామిత్రులవారి యాగము సామాన్యమైన యాగము వంటిది కాదు. దానికి అనేక అంతరాయములు అడ్డు తగిలి అశాంతికి గురిచేయు చున్నవి," అని వశిష్ఠులవా రింకనూ యేమో చెప్పబోవు చుండగనే, కౌసల్యాదేవి అందుకొని, "గురుదేవా! మహర్షులు చేయు పవిత్ర కార్యములకు అంతరాయములు కలుగుచున్నవనుటలో నాకు ఆశ్చర్యముగనున్నది. దివ్య సంకల్పములకు అడ్డు తగులునట్టి యెట్టి శక్తి కూడనూ లేదని నా విశ్వాసము. ఇదియేదియో నిమిత్త మాత్రముగ చేసుకొని, భవిష్యత్తులో మహత్తరమైన కాంతులు వెదజల్లుటకై మహర్షి ఈ ఆధారమును కోరియుండవచ్చును. లేదా మహారాజుల మనస్సును పరీక్షింప గోరి ఇట్లు సంకల్పించియుందురేమో కాని, సర్వశక్తి సంపన్నులగు,మహర్షి చేయు యాగమునకు ముక్కుపచ్చలారని పసిపాపలు రక్షణకర్తలా?" అని కౌసల్య రామలక్ష్మణుల శిరస్సులను నిమురుచూ నుండగా,

అన్నియూ వింటున్న దశరథుడు ఒక విధమైన ధైర్యమును చేసుకొని, "కౌసల్య పలికిన పలుకులు పరమ సత్యములు. ఇవన్నియూ, నన్ను పరీక్షింప గోరి కల్పించెన తమ సంకల్ప ప్రభావములే అని దృఢమగుచున్నది. తమ పరీక్ష లకు నేనెంతటివాడను. తమ అభీష్టమెట్టిదో అట్లు నడచుకొందును" అని గురువునకు నమస్కరించి నిలిచియున్న దశరథుని చూచి, వశిష్ఠులవారు "మహారాజా! ధన్యు డవు. చిరంజీవులు సామాన్యులుకారు, వారి శక్తి సామర్థ్యములు అనంతములు. తెలి సిన వారలకే తెలియును కాని, అన్యుల కర్థముకావు. తెలిసికొనలేరు. వారి సంకల్ప మునకు ఇది ప్రారంభోత్సవము. లోకఖ్యాతికిపునాది. ధర్మరక్షణకు కంకణము. అతి శీఘ్రములోనే విజయలక్ష్మిని చేకొనివత్తురు. చింతిల్లక సంతస హృదయుడవై విశ్వా మిత్రులవారి కప్పజెప్పుము.

"నాయనలారా! ఇటురండి" అని రామలక్ష్మణులను చెంత చేర్చుకొని ఇరు వురి శిరములందు పవిత్ర హస్తములిడి మంగళప్రదము అయిన మంత్రాలతో అభి మంత్రించినాడు. మహదానందముతో రామలక్ష్మణులు గురుదేవులకు, విశ్వామిత్రు నకూ, తలిదండ్రులకూ నమస్కరించి వారల దీవెనలను అందుకొని వెళ్ళుటకు సిద్ధ మైన బాలుర తేజస్సును గాంచి, దశరథుడు పొరలివచ్చు దుఃఖమును ఆపుకొని ఇరువురి పిల్లల భుజములపై చేతులు వేసుకొని విశ్వామిత్రులవారి చెంతకు వచ్చి నమస్కరించి "స్వామీ, వీరిరువురూ నేటినుండి తమ ప్రేమపుత్రులు. వారల యోగ

క్షేమములు తమకు చెందినవి. వీరలకెట్టి ఇబ్బందియూ లేకుండుటకై కొంత పరివారమును కూడనూ పంపవలెనని ఆజ్ఞాపించిన శిరసావహింతును" అని పలికిన దశరథుని పలుకులకు విశ్వామిత్రుడు ఫక్కున నవ్వి,

"వెఱ్ఱిరాజా! యాగసంరక్షకులుగా వెళ్ళుచున్న మహా వీరులను రక్షించువారు వేరొకరుందురా? మహర్షులకే చేతకాని మహాకార్యములను సాధించబోవు సర్వశక్తిమయులకు సహాయార్థ మొకటి యేర్పాటు చేయవలయునా? నీ వాత్సల్యమింత అమాయకుని చేసినదే కాని లేకున్న నీకు మాత్రము తెలియక పోలేదు. మహారాజా! వీరికెట్టి ఇక్కట్టునూ లేక, రాక, కార్యము పూర్తి అయిన వెంటనే నేనే స్వయముగా వెంట తోడ్కొని వచ్చి నీకప్ప జెప్పుదును. చింతిల్లక, నీ పరిపాలనా విధానమున కెట్టి ఇబ్బందియూ లేక చూచుకొనుము." అని విశ్వామిత్రుడు లేచి నిలిచిన తక్షణమే అందరూ హస్తములు మోడ్చి నమస్కరించినారు.

విశ్వామిత్రుడు ముందు రామలక్ష్మణులు ధనుర్ధారులై వెనుక నడుచుచూ వెళ్ళుచుండ రాజభవనము సింహద్వారముల చెంతకు రామలక్ష్మణులు వచ్చినంతనే, దేవదుందుభులు మ్రోగినవి. పూల వర్షము కురిసినది. వీధి పొడవున శంఖాలు పూరించినారు. భేరీలు మ్రోగించినారు. పురవీథుల అటు ఇటు స్త్రీ పురుషులు, బాల వృద్ధులు, ఆశ్చర్య నేత్రులై మహర్షివెంట కాలినడకన కదులుచున్న పిల్లలు మగ సింగము వెంట వెళ్ళుచున్న బాలసింగములవలె కనుపించినారు. విషయము తెలియక నౌకరి కొకరు యెక్కడకు వెళ్ళుచున్నారన్న గుసగుసలు బయలుదేరినవి. మహారాజు ఆజ్ఞ కనుక మంత్రులూ, పురజనులూ పురసింహద్వారము వరకు మాత్రమే వెళ్ళి అక్కడ రామలక్ష్మణులకు వీడ్కోలు నొసంగి వెనుకకు తిరిగిరి.

అక్కడినుండి విశ్వామిత్రులవారు ముందూ, రాముడు వెనుక, అతని వెనుక లక్ష్మణుడు కాలిబాటలో నడచి వెళ్ళుచూ, ఇరు ప్రక్కల అతి సుందరమైన వృక్షములను చూచుచూ, ప్రకృతి సహజ సౌందర్యమును తిలకించుచూ కొంత దూరము వెళ్ళిన తరువాత నిర్జన ప్రదేశమును ప్రవేశించగనే విశ్వామిత్రుల వారి ఆజ్ఞానుసారము మణికట్లకూ, వ్రేళ్ళకూ, ఉడుముతోలు కవచమును తొడుగుకొని భుజముల మీదనున్న ధనుస్సులు తీసి హస్తమున సిద్ధము చేసుకొని చుక్కలవోలు కాంతులతో నిర్జనారణ్యమున, నిశ్శబ్ద వాతావరణమున, దట్టమైన పొదల మధ్యలలో సింగపు పిల్లలవలె చిరునవ్వులు తొలకుచూ, నిర్భయులై విశ్వామిత్రుని అనుసరించుచూ సరయూనది దక్షిణతీరము చేరిరి.

సూర్యాస్తమయము కానున్నందున, విశ్వామిత్రుడు రామలక్ష్మణులను పిలిచి

మృదు మధుర పలుకులతో "నాయనలారా! ఆలస్యముచేయక నదిలో ఆచమింపుడు. సమస్త మంత్రములకు మూలాధారములైన "బల, అతిబల" అను రెండు మంత్రములను మీకు ఉపదేశింతును. ఈ మంత్రములు మహా ప్రభావము కలవై యుండును. ఇవి యెట్టి అలసటనైననూ క్షణములో తీర్చి హాయిని కలిగించును. ఎన్ని పనులు చేసిననూ అలసట కలిగించక, అవి వ్యాధులను రానివ్వక, రాక్షసుల బాధలు కలుగక రక్షించును. ఇంతేకాదు దారిలో నడచుచున్న సమయాలలో ఈ మంత్రములను స్మరించుచూ వెళ్ళిన ఆకలి దప్పులు లేక, ఆనందోల్లాసముల నొసంగి అతి బలమును కలిగించుచూ వచ్చును.

"రామా! "బల, అతిబల" అను ఈ రెండు మంత్రములు సర్వమంత్రములకే కాక సమస్త శక్తులకు తేజోవంతమైనవి." అని ఇంకనూ ఆ మంత్రములకు మహత్తరమైన శక్తిసామర్థ్యములను విశ్వామిత్రులవారు వర్ణించుచుండ, సర్వజ్ఞుడైన రామచంద్రుడు దాని విషయము యేమీ తెలియని వానివలే, తలఊపుచూ ఆశ్చర్యముగా వినునట్లు నటించుచుండ, లక్ష్మణుడు ఇరువురినీ చూచుచూ, తనలో తాను నవ్వుకొనుచుండెను.

ఇచట లోకోపదేశ నిమిత్తమై రాముడు ఒక విచిత్రమైన ప్రబోధ చేసిరి. అదియేమన మాయ యెట్టి వారినైనను క్షణములో తలక్రిందు చేయుననియునూ, దేహాభిమానమున్నంతవరకు మాయ మనుజుని వీడదనియూ ఇది తపస్సులతో, జ్ఞానముతో, పేరుప్రతిష్ఠలతో శక్తిసామర్థ్యములతో తొలగునది కాదనియునూ, తాను ఆత్మ స్వరూపుడనని తెలిసికొని, సమత్వబుద్ధితో జగత్తును చూచుటతో ఈ మాయ మరుగు పడుననియూ ఒక నీతిని నిరూపించిరి. కాకున్న "బల, అతిబల" అతిశక్తివంతమైన మంత్రములు తనచెంత నుండియూ, తాను తపోసంపన్నుడైనప్పటికినీ, యజ్ఞసంరక్షణార్థమై దానికితగిన శక్తిసామర్థ్యము కలవాడు శ్రీరాముడే యని గమనించియూ, రాముడు సామాన్యుడు కాడు లోకరక్షకుడు, అతడు చేయలేని కార్యమంటూ యొకటి జగత్తున లేదని దశరథుని చెంత వర్ణించి, పుత్రవాత్సల్యమే నిన్నింత అమాయకుని చేసినదని బోధించి ఇక్కడ, మాయాబంధితుడై గుణమోహితుడై రామలక్ష్మణులను సామాన్య పిల్లలవలెభావించి, వారలకు మంత్రోపదేశము చేయుటకు పూనుకొనుటలో మాయయొక్క ప్రభావమును నిరూపించుటయే దీని అంతరార్థమని చెప్పక చెప్పుచున్నది. అట్టిమాయను విశ్వామిత్రుని యందు ఆ నిమిషమున ప్రవేశింపచేయకున్న రామ సంకల్ప కార్యము జరుగనేరదు. మహర్షులలో ప్రవేశించిన మాయ కూడను మహత్తర కారణములను చేయించును.

విశ్వామిత్రమహర్షి ఆజ్ఞానుసారము, రామలక్ష్మణులు సరయూ నదిలో ఆచమించిరి. విశ్వామిత్రుడు రాములచెంతకు వచ్చి ఆరెండు మంత్రములను ఉపదేశించెను. మాయామానుష రూపుడై న రాముడు విశ్వామిత్రుడు చెప్పినటులనే పలికి, తలనూపుచూ, శిష్యత్వము అందుకొన్నటుల ప్రదర్శించెను. ఇంతలో చీకటి పడుట చేత రామలక్ష్మణులకు దగ్గరదగ్గరగా లేతగడ్డిపై పరుండుటకు కొంత యేర్పాటు చేసి, వారలకు దగ్గరలోనే మెత్తని గడ్డిపై విశ్వామిత్రుడు కూర్చొని అనేక రకములగు కథలు తెలుపుతూ వచ్చెను. దారిన నడచి అలసి వచ్చినారా అన్నట్లు రామలక్ష్మణులు కొంత నిద్రలో మునిగినటుల కనిపించుటచే విశ్వామిత్రుడు కథలు చాలించి, తనముందు కార్యక్రమములను గూర్చి యోచించుచుండెను.

ఇంతలో తెల్లవార జొచ్చెను. పక్షుల మేలుకొలుపులా అన్నట్లు అనేక రంగులతో చేరిన పక్షులు రామలక్ష్మణులు నిదురించు ఆ పచ్చికపై అటూ ఇటూ యెగురుతూ శ్రావ్యమైన కంఠములతో శబ్దము చేయుచుండెను. అవి గంధర్వుల గానముగా నుండెను. కానీ రామలక్ష్మణులు నిద్రనుండి మేల్కొనలేదు. గాఢనిద్రలో నుండినటుల విశ్వామిత్రుడు గమనించి, రాముల చెంతకు వెళ్ళి, "రామా! తొలిసందె అయినది. మేల్కొమ్ము" అని సంస్కృతమున పలికిన పలుకులు రామ కర్ణ రంధ్రముల చేరి, రాములు దిగ్గున లేచెను. వెంటనే తమ్ముడైన లక్ష్మణుని లేపి ఇరువురూ విశ్వామిత్రునకు నమస్కరించి, సరయూ నదిలో స్నానముచేసి ఆచమించి, అర్ఘ్యమునిచ్చి, గాయిత్రీ జపముచేసి, ప్రయాణమునకు సిద్ధమయి, ఋషి చెంత చేతులు కట్టి నిలిచిరి.

అంతవిశ్వామిత్రుడు, "నాయనలారా! ఇక మన ఆశ్రమమునకు ప్రయాణము సాగించవచ్చును కదా!" అని పలుకగనే రాముడు "తమ ఆజ్ఞకై వేచియున్నాము"ని పలికెను. అంత విశ్వామిత్రుడు ముందూ, రామలక్ష్మణులు వెనుకా నడచుచుండిరి. ఇంతలో సరయూ నది గంగా నదిలో సంగమించే స్థలమునకు చేరిరి. గంగా నదిని ఆనందముతో తిలకించి, నమస్కరించి, అన్నదమ్ము లిరువురూ అటూఇటూ దృష్టిని మరల్చిరి. ఇంతలో ఆ ప్రాంతమున నొక దివ్యమైన ఆశ్రమము కనిపించెను. అది అతి ప్రాచీనమైన ఆశ్రమముగా కనిపించెను.

ఇంతలో లక్ష్మణుడు "స్వామీ, ఈ పుణ్యాశ్రమమెవ్వరిది? ఇందు నివసించు మహనీయుల పేరేమి?" అని అడుగగా, మహర్షి మందహాసముచేయుచూ "నాయనా! వినుము. పరమ శివుడు పార్వతిని పెండ్లి ఆడక పూర్వము ప్రమథ గణాలతో ఇక్కడికి వచ్చెను. దృఢనీమములతో ఇక్కడి లోక కార్యములు పరిపాలన చేయు

చుండగా మన్మథుడు ఇక్కడికి వచ్చి అతని నియమమునకు కొన్ని అంతరాయములు కలిగించగా శివుడు తన త్రినేత్రమును తెరచిచూడ, మన్మథుని శరీరము భస్మస్వరూపమున దగ్ధమాయెను. ఈవిధముగా మన్మథుని సర్వాంగములు భస్మము అయిపోయినందున అప్పటినుండి వాడు అనంగుడు అయినాడు. అందుచే అనగా మన్మథుడు తన అంగాలనన్నింటినీ కోల్పోవుటచే ఈ ప్రాంతమునకు అంగదేశమని పేరు వచ్చినది. ఇది శ్రీమంతమయిన దేశము. ఈ ఆశ్రమ పదము శివునదే. అతని శిష్యులు తర తరములనుండి ఇక్కడనే తపస్సు చేయుచూ దైవములో లీనమగుచున్నారు. పరమ ధార్మికులు మాత్రమే ఇందు నివసించ వీలగును. అన్యుల కసాధ్యము. మీరు ఇష్ట పడిన ఈ రాత్రి యిక్కడ శయనించి రేపు తెల్లవారగనే గంగా స్నానముచేసి మన ప్రయాణము సాగించవచ్చున"ని విశ్వామిత్రుడు తెలుపగనే రామ లక్ష్మణులు పట్ట లేని ఆనందముతో మహదానందమని అంగీకరించిరి గంగా నదీ తీరమునకు వెళ్ళి స్నాన మాచరించిరి. ఇంతలో రామలక్ష్మణులతో విశ్వామిత్రులవారు సమీపమున నున్నారని తెలిసికొని ఆశ్రమవాసులు పరుగిడి వచ్చి విశ్వామిత్రునకు, రామలక్ష్మణులకు స్వాగతము చెప్పి ఆశ్రమమునకు కొనిపోయిరి.

ఆనాటిరాత్రి పరమశివఆశ్రమమున కందమూలఫలాదులుఆరగించిఆశ్రమవాసుల నిత్యానుష్ఠానముల తిలకించి, స్థాణ్వాశ్రమమున విశ్వామిత్రులవారు తెలుపునట్టి పవిత్ర దివ్యకథలను వినుచూ, ఆనందము ననుభవించుచూ కాలమును అవలీలగా గడిపిరి. తెల్లవారగనే స్నాన సంధ్యాదులు ముగించుకొని, ఆశ్రమవాసుల శెలవు తీసుకొని విశ్వామిత్రునివెంట రామలక్ష్మణులు బయలుదేరిరి. గంగానదిని దాటవలసి వచ్చినందున స్థాణ్వాశ్రమవాసులు వారికోసమై అమర్చిన ఒక నావను తీరమునకు తెచ్చి విశ్వామిత్రుల వారిని రామలక్ష్మణులను ఆవల ఒడ్డునకు చేర్చి, విశ్వామిత్రుని సెలవు తీసుకొని స్థాణ్వాశ్రమవాసులు వెనుకకు తిరిగిరి. ఇందులకు విశ్వామిత్రుడు సంతసించి వారిభక్తి ప్రపత్తులను కొనియాడి ఆశీర్వదించి పంపెను.

ఇంతలో ఒక పెద్ద ప్రళయ శబ్దము వినిపించుచుండెను. జలము పెద్ద పెద్ద నురుగు తెప్పలతో నిమిష నిమిషమునకు పొంగుతూ వుండెను. దీనిని రాముడు చూచి, "స్వామీ! ఈ శబ్దమేమిటి? ఈ ప్రవాహము ఇప్పటికిప్పుడే ఇంత పొంగులతో ప్రతిధ్వనించు టేమిటి తెలుపమని" కోరగా, విశ్వామిత్రుడు "రామా! అతి ప్రశాంతముగా ప్రవహించు గంగానదియందు అతివురవడిగా ప్రవహించు సరయూ నది పడుటచేత ఈ ప్రళయశబ్దము యేర్పడినది. అంతేకానీ మరేమీకా"దని ప్రశాంతముగా తెలుపుచూ, "రామా! పూర్వము బ్రహ్మ మనసా సంకల్పించుటచేత కైలాస

పర్వతమున ఒక సరస్సు యేర్పడెను. మనసా యేర్పడిన సరస్సగుటచేత దానిని మానస సరోవరమని దేవతలు నామకరణము చేసిరి. ఆ సరస్సునుండి పొంగి పొరలిన ప్రవాహమే సరయూనది. ఆ సరయూనదే అయోధ్యను ఆవరించి ప్రవహించి ఇక్కడికివచ్చి గంగలో పడుచున్నది. ఇది బ్రహ్మదేవుని మానస సరోవరమునుండి ఉద్భవించుటచేత, ఈ సరయూనది పుణ్యనదిగ సార్థక్య మొందినది."

అటుల నదీ విశిష్టతను వర్ణించుచూ దక్షిణతీరముచేరి ఆగకుండా దట్టమయిన అరణ్యమున ప్రవేశించిరి. అది మహాభయంకరముగా నుండెను. దానిని చూచి రాముడు "స్వామీః ఈ అరణ్యమున మనుష్యులు యేనాడునూ సంచారము చేసిన చిన్నెలు కనుపించుటలే"దనెను ఇంతలో పులులు సింహములు ఇంకనూ అనేక చిల్లర మృగముల అరుపులు భూమి బ్రద్దలగునట్లు గర్జించుచుండుట వినిపించెను. కొన్ని మృగములు ఒకదానితో నొకటి పోట్లాడుచూ రౌద్రముతో పరుగిడు దృశ్యములు గాంచిరి. ఆ అరణ్యమంతయూ యెటుచూచినా ఇనుమద్ది, ఏరుమద్ది,మారేడు, తుమ్మ, రేగుపొదలూ మొదలయినవి క్రిక్కిరిసియుండెను. దారిలేదు, నూతన దారిని వారికి వారే కల్పించుకొనవలసి వచ్చెను.

ఇంతలో లక్ష్మణుడు "స్వామీ, ఈ భీకరారణ్యమెవరిది? దీని పేరేమి?" అని ప్రశ్నించెను. విశ్వామిత్రుడు "లక్ష్మణా, ఇది పూర్వము ధనధాన్య సమృద్ధము అయిన మలద, కరూశాలు అను రెండుదేశాలు ఇక్కడ వుండెడివి. అవి సాక్షాత్ దేవతల దేశాల వలే వర్థిల్లినవి. అసలు దేవతలే ఆరెండు దేశములు నిర్మించిరనవచ్చును. పూర్వము దేవేంద్రుడు, వృత్రాసురుణ్ని సంహారము చేసినపుడు అతనికి అశుచి అయినది. అంతేకాదు, ఆయన ఘోరమయిన ఆకలితో బాధపడసాగెను. అపుడు అతనిని దేవతలు, మహర్షులు ఇక్కడికి కొనివచ్చి, గంగలో స్నానము చేయించి, కడవలు కడవలు గంగాజలమును మంత్ర పూతము చేసి అతని తలపై క్రుమ్మరించిరి. అంతటితో ఆయనకు పట్టిన బ్రహ్మహత్యా పాపము పోయినది. అశుచి కొద్ది ఆకలి మాయమయినదని బ్రహ్మదేవుడు సంతోషించెను. ఈ ప్రదేశమున దోష మలము పోయినది కనుక మలదమనియూ, కారూశము పోయినది కనుక కరూశమనియూ, రెండు దేశములుగా ప్రసిద్ధికెక్కెను. అట్టిజ్ఞాపకార్థమై దేవతలు ఈరెండు పేర్లతో రెండూ ధనధాన్య సదుపాయములతో వర్థిల్లునట్లు సంకల్పించిరి.

"ఇంతలో ఈ దేశముల మధ్య తాటక అను రాక్షసి విజృంభించి సర్వమును ధ్వంసము చేయదొడగెను. అది యక్షిణి, కామరూపిణి. అది పుట్టుట తోడనే వేయి యేనుగుల బలముతో పుట్టినదని వదంతి. ఆమె తిరిగి మారీచుడను కొమరునికన్నది.

వాడు ఇంద్రుడంతటి పరాక్రమవంతుడు. తల్లి కొమరు లిరువురునూ చేరి, ప్రజలను నానా విధముల బాధపెట్ట దొడగిరి. ఆ దుష్టచారిణీ అయిన తాటకి గల అరణ్యమే దీనికి ఒకటిన్నర యోజనాల దూరములో వున్నది.

"ఈ పచ్చని రాజ్యములైన మలద, కరూశ రాజ్యములను నాశనము చేసినదే ఆ తాటకి. పంటలు పండుచున్న భూములలో పండించు ప్రజలు క్షీణించిపోవుటచే మహారణ్యములుగా మారిపోయినవి. ఈ తాటకీ మారీచుల భయములచే ఈ ప్రదేశము నిర్జనారణ్యముగా మారిపోయినది. అంతేకాక అది యెవ్వరికీ చిక్కక తప్పించుకొని పోవుచున్నది. దానిని నొక్కిపెట్టువా డొక్కడైనను నేటివరకూ సిద్ధపడలేదు. ఇట్టి భయంకర శక్తి సామర్థ్యములుకల తాటకిని హతమార్చువాడు నీఒక్కడవు తప్ప అన్యులు నాకెవ్వరునూ ఊహకైనను తట్టుటలేదు. ఈ దుర్మార్గపు మాతా కుమారులే నా యాగాది సత్కర్మలను అపవిత్రముచేయుచున్నారు." అని ఆ రాక్షసులను వారి పరాక్రమ శక్తిని గురించియూ పలుకుచూ దారి నడచుచుండిరి.

విశ్వామిత్రుడు పలికిన పలుకులు రాముని హృదయమును కదిలించెను. కలిగిన భావమును కడుపున దాచుకొనలేక పోయెను. వెంటనే రాముడు వినయ విధేయతలతో "మునిపుంగవా! యక్షులు అల్పవీర్యులని వింటిని. అందులో తాటకి ఆడది! అబల! ఆమెకంతటి బలమెట్లు వచ్చినది? ఇంతటి దేవతలే నిర్మించిన దేశములను యెట్లు నిర్మూలము చేసినది? ఇది చాలా ఆశ్చర్యముగ నున్నది. నమ్మటకూ వీలుకానివిగా వున్నవి." అని పలికెను.

అంత విశ్వామిత్రుడు "రామా! నామాటలు పరమ సత్యములు; వివరింతును వినుము. పూర్వము సుకేతుడను యక్షు డొకడుండెడివాడు. వాడు యెంతటి పరాక్రమవంతుడో అంత సదాచార సంపన్నుడు. కానీ, సంతానము లేకపోవుటచే అతను ఘోరమగు తపస్సు చేసెను. అంత బ్రహ్మ వాని తపస్సునకు మెచ్చి, ప్రత్యక్షమయి మహాబలముతో కూడి శక్తి సామర్థ్యములకు ఇతరులకు దీటురానిదైన ఒక పుత్రిక కలుగునని వరము ననుగ్రహించి పోయెను. పుత్రసంతానమునకు వరమియ్యలేదు. అంతట సుకేతుడు గృహమునకుచని కాలము గడుపుచుండ, అతనికి పుత్రిక పుట్టెను. ఆ బిడ్డ పెరిగి పెద్దదయి అబల అయినప్పటికిని తన శక్తిసామర్థ్యములు కోల్పోక బ్రహ్మనుగ్రహముచే అనేక యేనుగుల బలముతో కన్నుమిన్ను కానక సంచరించుచున్నది.

ఆమె మహారూపవతి. అందుచే తండ్రి సరియైన వాడు చిక్కిన తాటకికి వివాహము చేయవలెనని అనేక విధముల వెతకి, కడకు సుందుడు అను అతనికిచ్చి

వివాహము చేసెను. మూడవ సంవత్సరమున ఆమెకొక కుమారుడు కలిగెను. వాడే మారీచుడు. ఆ స్త్రీయే తాటకి. తల్లీ, కొడుకులు ఇరువురూ యెవరూ యెదిరించలేనంతటి వారలుగా తయారయిరి. ఇంతలో కొన్ని పాపకార్యములు చేయుచూ మహర్షులకు అనేక బాధలు కలిగించు చుండుటచేత, తాటకి పతియయిన సుందుడు అగస్త్య మహర్షి శాపమునకు గురియాయెను. అతను మరణించగనే తన పతిని చంపెనను కోపముతో తాటకి తన కుమారుని వెంటబెట్టుకొని, అగస్త్యుని మీదికి చంపుటకై వెళ్ళినది. పెద్ద పెద్ద అరుపులతో వికార ఆకారమును పూని అగస్త్యుని మింగుటకై పరుగెత్తెను. ఇంతలో వీరి క్రూరత్వమును గమనించి, అగస్త్యుడు మొదలు మారీచుని "నీవు రాక్షసుడవగుదువుగాక" అని శపించెను.

అంతటితో తాటకి మరింత క్రోధముతో కన్నులనుండి రక్తము గ్రక్కునట్లు పెద్దపెద్ద కేకలతో అగస్త్యునిపై బడబోయెను. ఆలస్యము పనికిరాదని గమనించి అగస్త్యుడు ఆ తాటకిని కూడను తన సౌందర్యమును కోల్పోయి వికారమైన ఆకారముతో నరమాంస భక్షణచేయుచూ మహా రాక్షసిగా తిరుగాడుదువుగాక అని శపించెను. ఈ శాపముల కేమాత్రము గొంకక, జంకక అనేక విధముల అగస్త్యుని చంప ప్రయత్నించి, విఫలతగాంచి, అతని నేమీ చేయలేక పోయిన కోపమును చల్లార్చుకొనుటకై అతను సంచరించుచున్న ఈ మలద, కరూశ దేశములను హతమొనరించెను. ఈ రీతిగా అగస్త్యునిపై గల కోపమును తల్లీ కుమారులు తీర్చుకొనుచున్నారు." అని పూర్వ వృత్తాంతమును విశ్వామిత్రులవారు రామునకు తెలుపగనే,

రాముడు అందుకొని "స్వామీ! సరి, బ్రహ్మనుగ్రహముతో పుట్టుటచే తపశ్శక్తినే పొందుటచే, మహర్షుల శాపముచే ఘోరమయిన రాక్షసాకారము కలుగుటచే, మహాబలముతో, పరాక్రమములతో స్వేచ్ఛా విహారము జరుపుచుండ వచ్చును. ఎంత బలశక్తు లుండిననూ తాను అబలయేకదా? స్త్రీ హత్యా పాపము ఘోరమైనది. కదా? అందువలననే అగస్త్యుడుకూడనూ ఆమెను చంపక ఇట్టి వికార రూపము కమ్మనిశాపమొసగెను. లేకున్న పతిని శపించిన మహర్షి సతిని శపించలేకపోయెనా? స్త్రీ హత్యకు పూనుకొనుట పురుష సింహములకు తగిన సార్థకము కానేరదని విని యుంటిని. ఇందుకేమి చేయమందురో? ఆజ్ఞ యొసగుడు" అని తనలోని సందియములను విశ్వామిత్రుని ముందు పెట్టగా,

విశ్వామిత్రుడు కూడనూ సంతసించి, "రామా! స్త్రీ హత్య మహాపాతకమని నాకుమాత్రము తెలియకపోలేదు. అయితే గో, బ్రాహ్మణ, సాధు సంరక్షణ అత్యంత ప్రధానములు. ధర్మము పై మూడింటిలో ఇమిడియున్నది. ధర్మరక్ష

ణకై అధర్మమును నిర్మూలము చేయుటలో యెట్టి దోషమునురాదు. "ధర్మోరక్షతి రక్షితః." అన్న ఆర్యోక్తి నీవెరుగవా? ఇది స్వార్థమునకు సలుపు హింసకానేరదు. లోకరక్షణకై చేయుటలో యెట్టి దోషమూ అంటదనియే నానుడి. అంతియేకాక, సృష్టి, స్థితిలయములు దైవ సంకల్పములు. అవి మానవమాత్రుల కల్పితములు కానేరవు. నీవు దైవాంశ సంభూతుడవు. నీకట్టి అధికారము కలదు. అగ్నికెట్టి మాలిన్యమూ అంటనటుల, దైవమునకు ఎట్టి పాపమూ అంటదు. రక్షించుట కెంత అధికారమో, సృష్టించుట కెట్టి సంకల్పమో శిక్షించుటకూ అట్టి సంకల్ప అధికారములుండును. పాపమునకు తగినశిక్ష యేనాటికైననూ తప్పునదికాదు. ఇంకనూ అనేక పాపములు చేసి పూర్తిగ హీనమగుట కంటె, ఈనాడు నీ హస్తములతో మరణించుట ఆ తాటకి పుణ్యమే అని చెప్పవచ్చును. నీవు దానికిని దేశమునకునూ ఉపకారము చేసినవాడవే అగుదువు. కానీ, అపకారముకానీ పాపముకానీ చేసిన వాడవు కానేరవు.

ఈనాడు నీవు దయతలచి వదలిన, లోకమునకు తీరని లోటు ధర్మమునకు హానికలుగుటయేకాక, ఆ తాటకి పాపమును కూడనూ అధికము గావించినవాడవగుదువు. వేయేటికి దివ్యదృష్టితో నేనెరిగితిని. నీవు రాక్షస సంహారమునకే అవతరించితివి. ఇది నీపని. నేడు చేయునది కానీ నీవు ముస్ముందు చేయునవిగానీ, ధర్మరక్షణ, రాక్షసమర్దన ఈ రెండూ నీ జన్మకు కారణములు. ఈ సత్యమును నే తెలిసికొనియే నీ చెంతకు పరుగిడి వచ్చితిని. లేకున్న నిన్ను ఆశ్రయించ వలసిన పని నాకేమున్నది. మహాఋషులు, సాధు పుంగవులు లోకక్షేమ నిమిత్తమై రాజుల నాశ్రయించు చుందురే కానీ వారి స్వార్థమునకు కాదు. సర్వ సంగపరిత్యాగులై కాయములను కందమూలాదులతో కొంతకాలమునింపి కడకు అట్టి ఆహారమును కూడనూ విసర్జించి, కాయముల నలక్ష్యపరచి కాంతిలో లీనముకానున్న వారలకు పరుల రక్షణెందులకు ఆశింతురు? ఏమి జరిగిన వారి కేమినష్టము? అయితే జ్ఞానులు, తమకు తాము తరించుటేకాక తాము తెలిసికొన్న సత్యమును, లోకులకు తెలిపి, ఆచరించి అనుసరింపజేసి లోకమున జీవులను తరింపజేయ సంకల్పింతురు. లోకముతో మాకేమి పని యని జ్ఞానులు తమ మార్గమునే తాము చూచుకొన్న జీవులు భ్రష్టులయి, ధర్మమును నశింపజేతురు.

ఇట్టి పవిత్ర లక్ష్యమును వక్షమున నిడుకొనియే మహాఋషులు లోకులతో సంబంధమును కలిగియుండిరే కానీ, వారికెట్టి స్వార్థమునూ ఉండదు. వారు జలములోని తామరల వంటివారు. లోకులతో వారు కలసి మెలసి యున్ననూ లోకవాసన

లను వారలలో చేస్తుప లోకోద్ధారము మాత్రమే చూతురు. ధర్మరక్షణ మాత్రమే చేతురు. దైవమును మాత్రమే ఆశ్రయింతురు." అని ఉన్న సత్యమును రామునికి విన్నవింపగనే రాముడు యేమియూ తెలియని వానివలే "స్వామీ! మహాఋషుల అంతర్ భావములు మహా పవిత్రమైన అర్థములతో కూడి యుండుట లోకులు గమనింపరు కదా? వాటి తెలిసికొను నిమిత్తమై తమరిని నేనీ ప్రశ్నవేసితినే కానీ, వేరు భావముకాదు. ఏమైనను ఏదెట్లైననేమి? నా తండ్రి ఆజ్ఞ ననుసరించి నేనడుతును. విశ్వామిత్రులవారు చెప్పినటుల నడచుకొమ్మని నా తండ్రిఅగు దశరథుడు తెలిపెను కనుక పితృవాక్య పరిపాలనమే నావ్రతము. తాము మహాఋషులు, మహా తపస్సంపన్నులు. అట్టి మీరే తాటకి వధ న్యాయమని తెలుపుటచే నాతప్పేమియునూలేదు. అంతియేకాక గోబ్రాహ్మణ హితము కోసము, ప్రజాక్షేమము కోసము, ధర్మరక్షణ కోసము, తామాజ్ఞాపించిన యే కార్యమైననూ చేయుటకు నేను సంసిద్ధుడనని, వింటిని పిడికిటితో పట్టి దశదిశలు మారుమ్రోగునట్లు టంకారము చేసెను.

ఆ శబ్దమునకు అరణ్యమంతయూ దద్దరిల్లునట్లు అందులోని మృగములు బెదరి చెల్లాచెదురుగా పరుగిడ జొచ్చెను. తాటకి దిగ్భ్రమచెంది రోష పూరితయై ఆ మహాధ్వని వినిపించు దిశకు పరుగులు తీసినది. ఒక పెద్ద మదగజమువలె, యొక పెద్ద కొండ కదిలి వచ్చునటుల వచ్చుచున్న తాటకిని రాముడు చూచి చిరునవ్వుతో "తమ్ముడా, చూచితివా? ఆ వికారాకారము! నిజముగా దీని ఆకారము సామాన్య మానవులు చూచి బ్రతుకగలరా! విశ్వామిత్రుడు చెప్పినటుల దీని ఆకారమే భయంకరముగా నుండ దీని బలము చెప్పనక్కరలేదు. ఇంతకూ ఇది ఆడది. చంపుటలో నామనసంత ఒప్పకున్నది. కాళ్ళూ చేతులు తెగద్రెంచిన దీని శక్తి నశించును." అని మాటాడుచుండగనే పొడవైన చేతులు చాచుకొని రాముని అప్పళమువలె మ్రింగనెంచి హాహాకారము చేయుచూ రామునిపై పడినది.

ఈ దృశ్యము చూచుచున్న విశ్వామిత్రుడు కన్నులు మూసి, రామలక్ష్మణుల కెట్టి కీడునూ జరుగకుండుగాక అని ప్రార్థించెను. తాటకి రాముని చెంతకు పోలేక పోయినది. అతనిని సమీపించగనే తనకేదియో కరెంటు కొట్టినటుల బాధకలుగుచున్నది. ఒకటి రెండు పర్యాయములు అతనిపైబడి బెదరిపోయినది. అందువలన ఆ కోపముతో భూమిని చిమ్మి దుమ్ము యెగజిమ్మి ప్రదేశమంతయూ అంధకార బంధురము అయ్యేటట్లు జేసి వేసెను. ఈ దుమారములో రామలక్ష్మణ, విశ్వామిత్రులు క్షణకాలము యేమీ తెలియకుండా సొమ్మసిల్లిరి. ఇంతలో తాటకి మాయచేసి, వారిమీద రాళ్ళవాన కురిపించడము మొదలుపెట్టెను. ఈ చర్యలు గమనించి

రాముడు ఇట్టి దుర్మార్గమైన రాక్షసిని ప్రాణములతో పెట్టుట మంచిదికాదు. ఆడది కదా యని యెంత జాలి తలచిననూ దీనిచేష్టలు మితిమీరు చున్నవి, అని తాటకి సూక్ష్మరూపమున యెచ్చటున్నదో తెలిసికొని అటువైపునకు అంబును వదలెను.

అంత తాటకి తిరిగి వికార రూపమును ధరించి రామునిపై దుముకుచూ రాగా, రాముడు దాని రెండు బాహువులూ తెగత్రెంచెను. తనభుజములు త్రెగిపోవుట చేత, బాధను భరించలేక రొప్పుచు కేకలు పెట్టుచు క్రింద పడిపోయెను. తత్ క్షణమే లక్ష్మణుడు దాని అంగములు విడివిడిగా ఖండించెను. తాటకి కామరూపిణి కనుక అంతకంతకు చచ్చినటుల నటించుచూ, తిరిగి అనేక రూపములతో అటూ ఇటూ కనిపించుచూ, తిరిగి రాళ్ళవర్షము కురిపించుచూ ఈ రీతిగా తన సాహసముల ప్రదర్శించెను. ఇంతలో రామలక్ష్మణులు యేమిచేసిననూ కొంత బాధలకు గురి కావలసి వచ్చెను. అంత విశ్వామిత్రుడు గమనించి సమయము తప్పిన ప్రమాదము సంభవించవచ్చునని యోచించి, "రామా, నీవు ఆలపించకు. ఆడదని దయతలచు టకు ఇది సమయము కాదు. అంగములు తీసిన ప్రయోజనము లేదు. ప్రాణము లున్న రాక్షసు లెన్నిరూపములైనను దాల్తురు. కాన ప్రాణమునే తీయవలెను, సిద్ధ పడుము." అని హెచ్చరించెను.

"సంధ్యాకాలము సమీపించుచున్నది. దీని మాయలు మరింత పెచ్చు పెరుగును. సూర్యాస్తమయము అయిన తరువాత, రాక్షసులతో యెట్టివారై ననూ పోరాడ వీలుకాదు. ఈ లోపుననే దీనిని సంహరించవలెను. లెమ్ము! సిద్ధముకమ్ము!" అని విశ్వామిత్రుడు రక్షణ మంత్రములు చెప్పుచూ హెచ్చరించ జొచ్చెను.

అప్పుడు, రాముడు కూడనూ సత్యము విచారించి, శబ్దవేధిత్వ జ్ఞానముతో, తాటకి యెక్కడ నున్నదో కనిపెట్టి సూటిగా నొక తీవ్రమైన బాణమును విడచెను.

ఆ బాణము తాటకిని కట్టిపెట్టి కదలనీయక చేసెను. అంత, ఆ తాటకి పెద్ద పెద్ద భయంకరమైన శబ్దము చేయుచూ, నాలుక చాచి రామలక్ష్మణులపై వ్రాల ప్రయత్నించెను.

ఇంతలో విదానము చేయుట మంచిది కాదని గమనించి రాముడు యెదలో నొక చురుకైన బాణమును విడచెను.

అంతటితో తాటకి నేలకూలి ప్రాణము వీడెను. ఆ తాటకి క్రిందపడి ప్రాణము వీడు సమయమున, అటూ ఇటూ పొర్లుతూనున్న బలమునకు పెద్ద పెద్ద వృక్షములు విరిగి నేలకూలినవి. భూమి యొక బావివలె గుంత యేర్పడెను. చుట్టూ

క్రొవ్విన మ్రాకులు గుంపులు నేలమట్టమాయెను. కడపటి శ్వాసను విడునపుడు చేసిన ధ్వనితో మృగములు బెదరినవి, కొమ్మలు విరిగినవి.

ఇంతటి బలమైనతాటకి నేలకూలగనే, విశ్వామిత్రుడు రాముని దగ్గరకు పిలచి, తలనిమిరి, "నాయనా! భయపడితివా? సర్వలోకరక్షకుడగు నీకుభయమనునది కలదా? లోకసంరక్షణలో ఇది ప్రధానమైన పునాది. ఇదిభద్రమయినచే ఇక నీకార్యభారమను భవనము భద్రముగా నిలువ గలదు.

అలసిపోతిరికాబోలు! సూర్యాస్తమయమయినది. సంధ్యావందనము చేసి, కొంత శ్రమ తీర్చుకొనుట మంచిది. రండి!" అని నదీతీరమునకు తీసుకొనిపోయి,

"నాయనలారా! ఈ రాత్రికి ఇచ్చటనే విశ్రమించి, తెల్లవారగనే మనము మన ఆశ్రమమునకు వెళ్ళుదము" అని వారలకు అనేక రకములైన కథలను తెలుపుచూ వారి శక్తులను వర్ణించుచూ రాత్రి కాలము గడిపెను

తెల్లవారినది. ఆచమనము గావించిరి. ఇంతలో విశ్వామిత్రులవారు చిరునవ్వుతో, రామలక్ష్మణుల చెంతచేరి మందహాసము చేయుచూ, మృదుమధురమైన మాటలతో "రామా! నీ పరాక్రమమునకు సంతుష్టుడనైతిని. నీ విశ్వస్వరూపము ఆ తాటకితో పోరాడునపుడు గమనించితిని. నిజముగా నేనెంతయో ధన్యుడను" అని ఇంకనూ యేమేమో చెప్పుచూ ఆనందబాష్పములు రాల,

తనచెంతనున్న సర్వ అస్త్రములను మంత్రరూపమున రామచంద్రుని హస్తమున నుంచి ఈఅస్త్రములు ధరించు అధికారము నాకు లేదు. అట్టి అధికారము కాని అస్త్రములు నా చెంతనుండియూ నిరర్థకము కదా, సర్వాస్త్రములకూ నీవే అధికారివి. అవి నీచెంతనుండిన వాటికికూడనూ తృప్తి కలుగును. వాటివాటి కర్తవ్యమును అవి నెరవేర్చును. ఇదిగో! నేటినుండి నా సర్వాస్త్రములు నీ స్వాధీనము చేయుచున్నానని, మంత్రములతో ప్రోక్షించి అర్పితము చేసెను.

తదుపరి కొంత తడవయిన పిదప రాములను పిలిచి దండచక్రమును, ధర్మచక్రమును, కాలచక్రమును అత్యుగ్రము అయిన విష్ణుచక్రమును, ఐంద్రాస్త్రమును, వజ్రాస్త్రమును శివదేవతాకము అయిన శూలాన్ని, బ్రహ్మ శిరాస్త్రాన్ని ఐషీకాస్త్రమును, అన్నింటికంటేఉత్తమమైన బ్రహ్మాస్త్రమును రాములకందించి, తిరిగికన్నులు మూసి, ఇంతలో రామా ఇక ఇవిమాత్రము నాకెందులకు తీసుకొమ్మని మోదకీ, శిఖరీ అనే రెండు బలమైన గదలను అందించెను. అగ్నేయాస్త్రము, క్రౌంచాస్త్రము, నారాయణాస్త్రము, వాయువ్యాస్త్రమూ ఇవి ఆశ్రమము వెళ్ళిన తరువాత చూతము" అని చెప్పి,

"నాయనా! రామా. ఈ అస్త్రములన్నియూ ఇచ్ఛాధీన రూపములు, మహా బలయుతాలు. ప్రపంచమునగల అన్ని అస్త్రాలకంటెను ఇవి అతిశయమయినవి" అని వాటి మంత్రములను కర్ణరంధ్రములద్వారా అందించెను.

అంత ఆ మంత్రదేవతలనందరినీ వశముచేయ అప్పుడే జపమును చేయమని ఆజ్ఞాపించెను.

విశ్వామిత్రుని ఆజ్ఞానుసారము రాముడు జపము ప్రారంభించి ఆయా మంత్ర రూపములను స్వాధీనపరచుకొనెను.

ఆయా మంత్రరూపములు స్వరూపములతో కంటెదుట నిలచి నమస్కరించి, "రామా! నేటిమొదలు మేము తమకింకరుల మని ప్రమాణములిచ్చి అంతర్థానమయిరి. అంత రాముడుసంతసించి విశ్వామిత్రులవారికి నమస్కరించి, "స్వామీ తమ హృదయము త్యాగమయము నిజముగా మీరు మూర్తీభవించిన సాక్షాత్ అపర త్యాగ, యోగదైవాకారులుగా తోచుచున్నది. కాకున్న ఇంతటి విలువైన శక్తివంతమైన అస్త్రములను ఇతరులకందించువారు లోకమున నుందురా? స్వామీ, యే విధముగా అస్త్రములు నా కందించి, వాటిని వశముచేసితిరో అటులనే వాటిని ఉపసంహారము గావించుకొను మార్గమునుకూడనూ తెలిపి నన్నానందపరచు"డని కోరగా, విశ్వామిత్రుడు ఉల్లాసహృదయుడై "నాయనా రామా! సత్యకీర్తి, ధృష్టము, రభసము,ధృతలాభము, సునాభము, దశాక్షము, శతోదరము, పద్మనాభము, కృశనము, వైరాగ్యము, యోగంధనము, విఘాతము, కరవిసికము, రుతరము, పితృసౌమనసము, జృంభకము ఇవి అన్నియూ ఇచ్ఛాధీన రూపములు. వాటికి ఉపసంహార మంత్రములు వినుము" అని కర్ణరంధ్రములద్వారా త్రాపించెను. తిరిగి ఆ మంత్రములను జపము చేయగా ఆయా అధికారస్వరూపములు కన్నెదుట నిలచిరి. వారల నమస్కారము లందుకొని రాముడు వారిని హెచ్చరించి నాకవసరమైనప్పుడు పిలుతును రండనిఆజ్ఞాపించి, మీరు స్వేచ్ఛగా విహరింపవచ్చునని పంపివేసెను.

అంతవిశ్వామిత్రుడు "నాయనలారా! ఇక మన ప్రయాణమును సాగింతము" అనవారు నడువమొదలిడిరి. కొంతదూరము వెళ్ళగనే, యొక పర్వతప్రదేశము చేరగలిగిరి. ఆ పరిసరములలో ఒక సుందరోద్యానవనము కనుపించుటే కాక సుగంధము వారలను స్వాగతించినటుల చుట్టుకొనెను. భయంకరారణ్యమును దాటి సుందరమైన ఉద్యాన వనములు ప్రవేశించుచున్నాము. అని యొకరిలో నొకరు సంతసించి "స్వామీ! ఇది యేదో పుణ్యాశ్రమమువలే కనుపించుచున్నది. ఇది యెవరిదో శెలవిత్తురా" అని రాముడు ప్రశ్నించగనే,

విశ్వామిత్రుడు, "నాయనలారా! ఇది మహామహులైన యోగులు దేవతలు తమ తమ సంకల్పమును సిద్ధింప చేసుకొనుటకై ఈ ప్రదేశమున నివశించెడివారు. కాశ్యపుడు కూడనూ ఇక్కడే తపస్సిద్ధిని పొందెను. అందువలన నిది సిద్ధాశ్రమ మని ప్రసిద్ధిగాంచినది. ఇపుడు నేను భక్తి తాత్పర్యములతో ఈ ఆశ్రమములో నివాసము పెట్టుకొన్నాను. ఈ ఆశ్రమ పదానికే రాక్షసులు వచ్చి యజ్ఞాన్ని విఘ్నము చేయుచున్నారు. ఈ చోటుననే వారిని సంహారము చేయవలసి యున్నది." అని చెప్పుచూ సిద్ధాశ్రమమున అడుగిడిరి. అంత విశ్వామిత్రుడు రాముని భుజములపై చేయివేసి "నాయనా! ఈ ఆశ్రమము ఇప్పుడు నాదెట్లయినదో అటులనే నేటినుండి నీదిగా నిలవగలదు" అని ఆనందబాష్పములతో ఆశ్రమమును ప్రవేశించుచుండగనే సిద్ధాశ్రమవాసులు, అందరూ పరుగిడివచ్చి పాదములు కడిగి రామలక్ష్మణులకు అర్ఘ్య పాద్యములు ఇచ్చి ముందు పూలు చల్లుచూ లోనికి గొంపోయిరి. కొంత ఫలపానీ యములనిచ్చి విశ్రాంతి దీసుకొనుటకు ప్రత్యేకవసతులు గలిపించి రామలక్ష్మణు లను కోరగా, వారు తగినంత విశ్రాంతి తీసుకొని లేచి పాదములను శుద్ధిచేసుకొని, విశ్వామిత్రులవారి దగ్గరకువచ్చి, చేతులు కట్టి నిలచి, స్వామీ రేపటినుండియే తమరు యజ్ఞము ప్రారంభించవచ్చును కదా అని ప్రశ్నించగా, సర్వసిద్ధముగానున్న సిద్ధాశ్ర మములో సిద్ధము చేయవలసినవేమున్నవి, తప్పక తెల్లవారగనే దీక్ష వహింతునని తెలిపి అందుకు తగిన వన్నింటినీ ఆశ్రమవాసులతో చెప్పి సిద్ధము చేయమనిరి.

తెల్లవారెను. యజ్ఞదీక్షను వహించి విశ్వామిత్రులవారు సిద్ధమాయెను. రామ లక్ష్మణులు స్కందవిశాఖులవలే అంబులు ధరించి వారి దీక్షను వారు తీవ్రమైన సంక ల్పముతోపూని నిలిచిరి. యజ్ఞదీక్షనుపూనిన విశ్వామిత్రులవారిని పలుకరించుటఉచితము కాదని ప్రక్కనున్న మహాఋషులతో రామలక్ష్మణులు, సైగలు చేయుచూ రాక్ష సులు యెపుడు వత్తురు, యే దిశనుండి వత్తురని వారలను అడుగుచుండెడివారు. అక్కడివారు చెప్పుటకు వీలుకాదు. రాక్షసులకు కాలభేదమేమాత్రము నుండదు. ఏ నిమిషమునందైననూ వచ్చి వ్రాలవచ్చును. వారిరాకను చెప్ప నెవరితరము అని ఒకొకరొక విధముగ చెప్పుచుండెడివారు. అట్టి మహాఋషుల పలుకులకు సంతసించి యెప్పటికప్పుడు సిద్ధముగానుండుటెంతేనియూఅవసరమనితలంచి తమ్మునకు హెచ్చ రించి నలుదిశలా దృష్టిని ప్రసరింపచేయుచూ, ఏకాగ్రతతో యే చిన్నశబ్దము విని పించిననూ అది రాక్షస శబ్దమా అన్నట్లు జాగరూకతతో వేచియుండుటను చూచి చేరిన మునులు ఈ పిల్లల ధైర్యసాహసములకు ఆనందమును, ఆశ్చర్యమునూ పొందుతూ ఉండెడివారు.

ఈరీతిగా ఐదు అహోరాత్రములు నిద్రపోక ఆ తపోవనిమును. యజ్ఞశాలను కాపాడుచుండిరి. ఆరవదినము పగలుప్రారంభమయినది. విశ్వామిత్రులవారు యజ్ఞము యథాప్రకారముగా సమంత్రకముగా సశాస్త్రీయముగా సాగించుచున్నారు. ఋత్విక్కులు వారివారి పనులలో వారు నిమగ్నులయి దీక్షను సాధించుచున్నారు. ఇంతలో ఆకసము బ్రద్దలయినటుల భయంకర శబ్దమొకటి వినిపించెను. దర్భలూ,పానపాత్రలు, హోమపాత్రలు, సమిధలూ, పూలూ, కుంకుమ అక్షింతలుసహా ఒక్కతూరి అంటుకొన్నవి. భగభగమని మంటలు లేచినవి. వర్షాకాలపు మేఘములవలే అప్పటికప్పుడు మేఘము ఆకసమును ఆవరించి భయంకరమైన చీకటులు క్రమ్మినవి ఆ మాయ మబ్బులు అమితవేగముతో పరువులెత్తుకొని యాగశాల దిశకు వచ్చుచున్నవి. ఆ మేఘములనుండి భయంకరమైన రక్తవర్షము కురియ మొదలు పెట్టెను. ఆ రక్త ప్రవాహము వేదికపై పడబోవుసమయమునకు సరిగా మంటలుమరింతఅధికమగుచూ వచ్చెను. రామలక్ష్మణులు అతి జాగ్రత్తగా ఆ రాక్షసులఆకారములు యెక్కడున్నవా అని వెతుక దొడగిరి. రాముడు దివ్యదృష్టితో తిలకించి మారీచ, సుబాహులున్న దిశకు మానసాస్త్రమును వదలెను. అది మారీచుని గుండెలకు తగిలెను. వెంటనే ఆగ్నేయాస్త్రము వదలగనే అది పోయి సుబాహుని గుండెలపై గ్రుచ్చుకొనెను. అంతటితో వదలక ఆ కాయములు ఆ అరణ్యమున కూలిన, యజ్ఞము అశుభమగునని తలంచగా ఆ అస్త్రములు రెండూ మారీచ, సుబాహుల దేహములకు నూరు యోజనముల దూరము కొట్టివేసి సముద్రమున పడవేయించెను. విలవిల తిరుగుచూ అనేక చేష్టల చేయుచూ సముద్రమున పడిరి. కాని చావలేదు. అంత మారీచ, సుబాహుల అనుచరులు ,అనేకమంది అటూ యిటూ పరుగెత్త సాగిరి. రాక్షసులు యెట్టి వారలైనను విడచుట మంచిది కాదు. నేటి అబలత్వమే రేపటి బలముగా మారును. వీరలను కూడను విడచుట మంచిది కాదు అని లక్ష్మణునికి తెలిపి, వారందరినీ సంహరింపజేసెను. ఈ దృశ్యమును కనులారా చూచుచున్న మహర్షులు, మహదాశ్చర్య ఓత్తులై వీరు సాక్షాత్ పరమ శివుని ఏద్ర భద్రాకారులే అని విశ్వసించి, తమలో తాము వారలకు నమస్కరించిరి. అరణ్యము నిమిషములో ప్రశాంతమైన వాతావరణముతో కళకళలాడ దొడగినది. విశ్వామిత్ర మహర్షి చిట్టు చెదరక కట్టుకదలక వేదిక వీడక తన దీక్షలో తాను నిమగ్నుడై పూర్తి చేసెను. పూర్ణాహూతి అత్యంత వైభవముగా మంగళకరముగా సమాప్తి ఆయెను. అంత విశ్వామిత్రుడు చిరునవ్వుతో రామలక్ష్మణుల దగ్గరకువచ్చి, "యశస్వీ! నా కార్యము దిగ్విజయము గావించితిరి. ఈ సిద్ధాశ్రమ నామమును సార్థకము చేసితిరి. ఇంతియే కాదు. మీవలన నేను

కృతార్థుడనయితిని." అని పలికి ఆనందబాష్పములు రాల్చుచూ వారి శిరస్సులను ముద్దిడుకొని, ఇరువురి భుజములపై చేతులు వేసుకొని, ఆశ్రమములోనికి తీసుకొని వెళ్ళి, వారలకు యజ్ఞప్రసాదమును అందించి, ఇక చక్కని విశ్రాంతి తీసుకొమ్మని కోరగా, వచ్చిన కార్యము నెరవేరిన ఆనందమే వారికి పెద్ద విశ్రాంతి. ప్రశాంతి కలిగించినది. అయిననూ మహామునుల ఆజ్ఞను మీరుట మంచిది కాదని రామ లక్ష్మణులు నిశ్చింతగా నిద్రించిరి. వారి నిద్రకెట్టి భంగము కలిగించకుండుటకై అక్కడ కాపలావారిని పెట్టి వారైవారు మేల్కొనువరకు యెవ్వరూ నిద్రాభంగము గావింపరాదని ఆజ్ఞయొసగి విశ్వామిత్రుడు మరొక పర్ణశాలకు వెళ్ళెను. అక్కడ ఋత్విక్కులతో, పండితులతో, మునులతోకూడి యజ్ఞ విజయమును గురించి, రామలక్ష్మణుల దైవశక్తులను గురించి ముచ్చటించుచూ, వర్ణించుచూ ఆనందపడుచుండిరి.

ఇంతలో రామలక్ష్మణులు మేల్కాంచి, కరచరణములు శుద్ధము చేసుకొని బైటికి వచ్చి ద్వారముదగ్గర కాపలా కాయుచున్న ఋషిశిష్యులను అడుగగా విశ్వామిత్రులవారు మీ నిద్రకు భంగము కలుగకూడదని ఆజ్ఞ ఇచ్చి చెంతనేయున్న పర్ణశాలలో మునులతో సంభాషించుచున్నారని తెలుపగనే, రామలక్ష్మణులు అచటికి వెళ్ళి విశ్వామిత్రులవారికి నమస్కరించి, చేతులు కట్టి నిలుచుకొని "మహఋషీ ! ఈ కింకరులు చేయవలసిన పనేమైననూ ఇంకనూ మిగిలియుండిన తెలిపిన సంసిద్ధుల"మని తెలుపగనే, అందులో ఒకరు లేచి నిలుచుకొని, "రామా! రాక్షస సంహారముతో సర్వకార్యములూ సఫలీకృతమయినవి. ఇంక మిగిలినవేమున్నవి. విశ్వామిత్రులవారి చిరకాలవాంఛ ఈడేరినది. ఇంతకంటే మాకు కావలసిన పని వేరొండు లేదు. మీరిరువురూ సాక్షాత్ శివశక్తులాకారులవలె గోచరించుచున్నారు. మీరు సామాన్యులు కారు. మిమ్ములను చూచునట్టి మహద్భాగ్యము కలిగినందుకు మేమందర మమిత ధన్యులమయితిమి." అని అందరూ నమస్కరించుచుండగా ఇంతలో ఒక ఋషికుమారుడు ఒక తాళపత్రపు కట్టను చేపట్టుకొని వచ్చి, విశ్వామిత్రులవారి కందించెను. విశ్వామిత్రులు దానిని విప్పిచూచి, దానిని మరొక వృద్ధ ముని చేతికందించి, బిగ్గరగా చదివి చెప్పుమనెను. అందులో పరమ ధర్మిష్ఠమయిన మహాయాగము చేయుచున్నట్లును, తాము శిష్యబృందముతో ఆ యాగమునకు తప్పక విచ్చేయవలెననియూ ప్రార్థించినటుల చదువగనే, అందరూ శుభము, శుభము అని ఆశీర్వదించిరి. అంతలో విశ్వామిత్రుడు "నాయనా ! ఇపుడు అరణ్యమున స్వేచ్ఛా సంచారము చేయవచ్చును కనుక ఆశ్రమవాసుల నందరిని తోడ్కొని రేపే నేను మిథిలాపురికి వెళ్ళ సంకల్పించితిని అని తెలుపగనే, రాముడు, "స్వామీ! మహదా

నందము. తమ రాజ్ఞ యిచ్చిన మాపలన కావలసిన పనులేమియూ ఇక లేనందున మేముకూడనూ రేపు తెల్లవాఽగనే అయోధ్యకు వెళ్ళవత్తుమని సెలవు గోరెను. అంత విశ్వామిత్రుడు, "రామా! దశరథునకిచ్చినమాటను నేను దక్కించుకొనవలెను కదా ? నేనే వెంట తోడ్కొని వత్తునని వాగ్దానము చేసితిని కనుక నేను లేక మీరు వెళ్ళ వీలుకాదు. మిథిలాపురములో యజ్ఞము జరుగుచున్నది కనుక నేనుఅయోధ్యకు వచ్చి మిథిలాపురము వెళ్ళుటకు కాలము చాలా తక్కువగుటచే మీరుకూడనూ నా వెంట మిథిలకు వచ్చిన అక్కడ యాగము చూచుకొని అటునుండి అయోధ్యకు వెళ్ళవచ్చును అని వడుదుడుకులు లేక తెలిపిన విశ్వామిత్రుని మాటలకు రాముడు ముందు వెనుక విచారించక, "స్వామీ! పితృవాక్పరిపాలన నా ప్రధానదీక్ష అయి నందున తమకొక విన్నపము చేయవలసి వచ్చినదనెను. అంత విశ్వామిత్రుడు అది యేమొ తెలుపమని అడుగగనే, రాముడు ఈ రీతిగా తెలుప మొదలుపెట్టెను. మా తండ్రి, విశ్వామిత్రి యాగమును సంరక్షించి ఋషిపుంగవునకు ఆనందము కలిగించి దిగ్విజయులై రండి అని ఆజ్ఞాపించిరే కానీ, మిగిలిన యజ్ఞములకు వెళ్ళ మని తెలుపలేదు. మిథిలాపురము వెళ్ళుటకు ప్రత్యేకించి తండ్రిగారి అనుమతి బడయవలయునుకదా ? అని రాముడు తెలుపగనే, విశ్వామిత్రుడు, "రామా! దశ రథుడు అంతమాత్రమే ఆజ్ఞ ఇవ్వలేదు. మీరు వెళ్ళి ఋషిపుంగవులు చెప్పినటుల నడచుకొని వారి ఆజ్ఞను జవదాటక మెలగుడనియూ, తిరిగి "స్వామీ! మీరే మా పిల్లల బాధ్యతలు సర్వమూ చూచుకొని మీరే స్వయముగా తోడ్కొని రండని నాకుకూడనూ తెలుపుట మీరు వినలేదా ? కాన నే చెప్పినటుల విని నా వెంట మిథిలకు వచ్చి అక్కడినుండి అందరూ మా శిష్యబృందముతోపాటు అయోధ్యకు పోదము అని విశ్వామిత్రుడు తెలుపగనే రాముడు ఇందులోని సత్యమునుకూడా గమనించి తమయిష్టమెట్లో అట్లునడచుకొందుమని తెలుపుటచేత తెల్లవారగనే ప్రయా ణమునకుసిద్ధముకండని విశ్వామిత్రుడుఆశ్రమవాసులకుఆజ్ఞయొసగి రామలక్ష్మణులను తోడ్కొని నదీతీరమునకు వెళ్ళి ఆనందోల్లాసముతో ఆ అరణ్యపు విశిష్టతలను, తాము దీనికి పూర్వము యజ్ఞములను చేయ ప్రయత్నించ రాక్షసులవలన కలిగిన ఆటంకములను, తాము అందుకు చేసిన ప్రయత్నముల విఫలతలను వివరించుచూ రాక్షసుల బాధ నేటినుండి ఆశ్రమవాసులకే కాక, చుట్టుపట్ల ప్రజలకును తొలగి చక్కని ఆనందము కలిగినదని వివరించెను.

# సీతా స్వయంవరము

అది ప్రశాంతమైన వాతావరణము! మెత్తని ఇసుక తిన్నెలపై విశ్వామిత్రులవారు రామలక్ష్మణులను చెంత కూర్చొనబెట్టుకొని, మిథిలాపురమున జనకుడు చేయు యాగముయొక్క విశిష్టతను తెలుపుచుండెను.

మాటలమధ్య, జనకమహారాజుచెంత, ఒక ధనూరత్నమున్నదనియును, అది చాలా గొప్పదనియును, దాని తేజస్సు దేదీప్యమానమై తేజరిల్లుచుండుననియు, అది మీరు చూడవలసినదనియూ అట్టిధనుస్సు ప్రపంచమునం దెందునూ లేదనియూ వర్ణించెను.

ఇంతలో రాముడు ఆ ధనుస్సు మిధిలాపురాధిపతికి యెట్లు ప్రాప్తించినదని ప్రశ్నించగనే, విశ్వామిత్రుడు, "నాయనా! వినుము! పూర్వము మిథిలాధిపతి దేవరాతుడు గొప్ప యజ్ఞము చేసెను. ఆ యజ్ఞము సామాన్యుల కసాధ్యము. మహా పవిత్రమైనది. అట్టి మానవమాత్రుల కసాధ్యమైన యజ్ఞమును మిథిలాధిపతి సాధించుటచే, దేవతలు మెచ్చి యజ్ఞఫలముగా ఆ ధనుస్సును రాజున కిచ్చిరి.

అది శివదేవుని ధనుస్సు; దానిని రాజు నిత్యము గంధ పుష్పాక్షతలతో పూజించి, ధూప దీప నైవేద్యాదులతో ఆరాధన చేయుచుండును. దేవ, దానవ, అమర, గంధర్వ, యక్ష, రాక్షసులు ఎవరునూ దానిని యెక్కుపెట్టలేకపోయిరి. అనేక మంది రాజపుత్రులుకూడనూ ప్రయత్నించి విఫలులైరి.

"రామా! మీరు ఆ ధనుస్సును చూడతగినవారు. ఈ యజ్ఞ సమయమున దాని ప్రదర్శనముకూడా యుంచియుండును; కనుక తప్పక ఇది ఒక మంచి అవకాశము" అని దాని అద్భుత శక్తిని విశ్వామిత్రుడు వర్ణించుచుండ,

లక్ష్మణుడు వెళ్ళుదము అన్నట్లు అన్నివైపుల చూచెను. అంత రాముడు, "తప్పక మేము దానిని చూడవలెను!" రేపు మీతో మేముకూడనూ వత్తుమని పట్టరాని ఆనందముతో పలికిన రాముని మాటలకు విశ్వామిత్రుడు సంతసించెను.

చీకటి పడుటచే, అందరూ లేచి సిద్ధాశ్రమమునకు బయలుదేరి పోయిరి. అంత విశ్వామిత్రుడు ఆశ్రమవాసులను పిలిచి, తెల్లవారగనే అందరూ మిథిలాపుర మునకు వెళ్ళుటకు సిద్ధము కండని ఆజ్ఞాపించెను.

అందులో కొందరు, "స్వామీ! ఆశ్రమ నిత్య కార్యక్రమములను నిర్వర్తించు వారెవ్వరూ లేకుండిన యెట్లు?" అని ప్రార్థించగా, యెవరి కార్యక్రమములను వారు నిర్వర్తించుకొనుచుండిన అదియే ఆశ్రమ కర్తవ్యకర్మ కాగలదు! ఆశ్రమ కార్య క్రమములు ప్రత్యేకము లేవుకదా?

ఆశ్రితులుచేరుటచే, ఆశ్రమము అయినది! ఆశ్రితుని కర్తవ్యము ప్రధానము కాని ఆశ్రమము ప్రత్యేకముకాదు! ఇంతియేకాక, నిన్నటినుండి, రాక్షసులబాధ తప్పి నది కనుక ఆశ్రమమునకెట్టి యిబ్బందియూ లేదు, రాదు! సర్వ సృష్టికర్తే మనంద రికి ఆశ్రమము అతనిని ఆశ్రయించిన అతనే అందరినీ ఆదరించును", అని నూతన మైన పలుకులు పలుకుచూ, విశ్వామిత్రుడు "మీమీ నిత్యానుష్ఠాన సామగ్రిని, ఆశ్ర మములోని అన్ని పనిముట్లనూ, మీమీ వెంట తీసుకొని పదండి; ఇక్కడ యేవియూ నుంచనక్కరలేదు", అని తెలుపగనే,

కొందరు శిష్యులు, "స్వామీ! తిరిగి యెంతకాలమునకు తిరిగి వత్తుము? తెలి పిన, దానికి తగినంత మాత్రమే వెంట తెచ్చుకొందుము. అనవసరముగా ఈభారము లెందులకు?" అని ప్రార్థించిరి.

అందులకు విశ్వామిత్రుడు, "కాలము కాయమునకు అధీనము కాదు. కాయమే కాలముయొక్క అధీనమందుండును. కనుక యెప్పుడు అని చెప్ప శక్యము కాదు. తిరిగి నేనిక్కడికి వత్తునో లేదో? సందియము!" అని తెలుపగనే ఆశ్రమ వాసుల గుండెలు ఝల్లుమనినవి. చేతులలోని వస్త్రములు, పనిముట్లు, క్రిందజారి నవి. అందరూ స్తంభించిపోయినారు, మారుమాట రాలేదు.

చేయునదిలేక అడుగుటకు ధైర్యము చాలక ఆజ్ఞ ప్రకారము సామానులు మోయతగినంత మాత్రమ సమిధలు, దర్భ, అగ్ని హోత్రమూ, ఇత్యాది సామ గ్రులు మాత్రమే కట్టలుకట్టి సిద్ధపరిచిరి.

విశ్వామిత్రులవారి మాటలు యెవరికివి అర్థముకాక, వారిలో వారు అనేక యూహలు పడజొచ్చిరి. ఆ రాత్రి గడచెను. తెల్లవారినది. అందరూ సిద్ధమయి, ఆశ్రమమునకు తలుపులు బిగించుచుండ, విశ్వామిత్రులవారు "తలుపులు బిగించకు! తెరచి యుంచుము! ఇది మనది కాదు. ఎవ్వరు వచ్చినను ప్రవేశించవచ్చును. సర్వవేళలా సర్వులకూ స్వాగతించునటులుండవలెను. నేటితో మనకును ఈ ఆశ్ర

తీరినది", అని వెలుపలకు వచ్చి "వనదేవతలారా! మీరిక సుఖముగా వర్ధిల్లుడు. నా కార్యసిద్ధి గావించిన మీకివే కృతాజ్ఞతాభివందనములు

రాక్షసుల బాధకూడనూ తీరినది! మీరిక సుఖముగా పుత్రపౌత్రాభివృద్ధిగాంచి శాంతించుడు. నేడు నేను సిద్ధాశ్రమము వదలిపెట్టి పోవుచున్నాను. ఉత్తరోత్తరా నేను గంగానదికి ఉత్తరాననున్న హిమాలయ పర్వత ప్రాంతమున వసింప సంకల్పించితిని".

అని వనదేవతలకు తెలిపి, నమస్కరించి, రామలక్ష్మణులతోను, సిద్ధాశ్రమ వాసులగు మహామునులతోను బయలుదేరెను. విషయము తెలుసుకొని ఆశ్రమవాసులు విచారముపీడి, మాకు విశ్వామిత్రులవారెక్కడున్న అక్కడుండుటే ప్రధానము కానీ వనములూ, ఆశ్రమములూ ప్రధానము, ఆధారము కావని సంతసించి హిమాలయ పర్వతప్రాంతము వారలకు వాసయోగ్యమని భావించి, వారు కూడనూ వనదేవతలకు, ఆశ్రమమునకూ నమస్కరించి బయలుదేరిరి.

వారందరూ ఉత్తరాభిముఖముగా నడుచుచుండ, వారి వెనుక వేలకువేలు జింకలు, పక్షులు, నెమళ్ళు తోకలెత్తి అరచుచూ, పరుగిడి వచ్చుటను చూచి విశ్వామిత్రుడు, "వనచరములారా! మీ నివాసమైన ఈవనమే మీకుయోగ్యమగు ప్రదేశము కావి, నేను వెళ్ళు ప్రదేశములు మీకు భద్రమైనవి కావు! కాన మీరు విచారించక, మా వెంటపడక మీరిక్కడే వసించుడు, దైవము కటాక్షించును. వెళ్ళుడు!" అని వాటికి కూడనూ వీడ్కోలు చెప్పి పంపివేసెను.

ఆనాడు ప్రయాణము సాగించి, రాత్రికి శోణాకూలము చేరుకొనిరి. ఆ రాత్రి అక్కడే యుండిపోవలసి వచ్చెను. శోణానదములో స్నానముచేసి, ఆచమనము గావించి నదీతీరమున అందరూ విశ్వామిత్రుల వారి చుట్టునూ కూర్చొనిరి.

అంత రాముడు, "స్వామీ! ఈ ప్రాంతము అంతా శోభాయమానముగ కనుపించుచున్నది. ఇది యేప్రదేశమయియుండవచ్చునో తెలుసుకొన గోరుచున్నాను" అని ప్రార్థించగా,

అంతట విశ్వామిత్రుడు, "రామా! బ్రహ్మమానస పుత్రుడగు కుశుడు అను తాపసి పూర్వము బ్రహ్మలోకమునకు వచ్చినాడు. అతడు దృఢవ్రతుడు; ధర్మజ్ఞుడు; శౌర్యసంపన్నుడు. అతడు మహాకులీన అయిన విదర్భ రాజపుత్రిని పెండ్లి ఆడెను. వారిరువురూ ధర్మార్థకామమోక్షచతుర్విధ పురుషార్థములందు నీమము తప్పక నడచుకొనుచుండిరి.

ఇట్లుండ వారలకు కుశాంబుడు, కుశనాభుడు, అధూర్తరజకుడు, వసువూ అను నలుగురు పుత్రులు పుట్టిరి. వారు నలుగురు తండ్రితో సరిసమానముగా సద్గుణములు అలవరచుకొని అమిత తేజోవంతులై పరమధార్మికులై సత్యసంధులై క్షత్రియ ధర్మమును అవలంబించుచుండిరి.

ఇంతలో కుశుడు ఈ భూమిని నాల్గు భాగములుగ జేసి, నలుగురు కొమరులకూ ఇచ్చి, "ఓ పుత్రులారా! మీమీ భూభాగమును మీరు పరిపాలించుకొనుడు" అని తెలుపగనే, తండ్రి మాటను శిరస్సున ధరించి వారి బాధ్యతలను వారు వహించి పరిపాలనా దీక్షను వహించిరి.

నలుగురూ వారివారి రాజ్యమునకు రాజధానీ నగరము ఒకటి యుండవలెనని, దానిని కట్టించుటకు మొదలు పెట్టిరి. కుశాంబుడు కౌశాంబీ నగరమును, కుశనాభుడు మహోదయము అను నగరమును, అధూర్తరజకుడు ధర్మారణ్యము అను నగరమును, వసువు గిరివ్రజము అనే నగరమును కట్టించి పూర్తిచేసిరి.

రామా! ఇపుడు మనమున్న ప్రదేశము, వసురాజు రాజ్యములోనిది. ఈ దేశము చుట్టూ ఐదుకొండ లున్నవి. అందువలననే ఈ రాజధానికి గిరివ్రజము అని పేరు వచ్చినది. మంగళకరమగు ఈ శోణానదమే సుమాగధి అని ప్రసిద్ధికెక్కెను. ఈ నదినుండియే ఈ దేశమును మగధ దేశమనికూడా పిలువజొచ్చిరి. ఈ మాగధీనది ఐదు కొండల మధ్య పూలమాలకు మల్లే శోభాయమానముగ, తూర్పు నుండి పడమటికి ప్రవహించుచున్నది. వసురాజు మహత్యము వలన ఈ జలాలు పారినంతవరకూ భూమి సుక్షేమము అయినది.

ఇక రెండవ కుమారుడు అయిన కుశనాభుడు రాజర్షి ధర్మాత్ముడు. అతనికి అందరూ ఆడపిల్లలే కలుగుటచే వారలకు అనేక రకములగు ధర్మబుద్ధులుగరపి, "క్షమేదానము; క్షమే యజ్ఞము; క్షమే సత్యము, క్షమే యశస్సు; క్షమే సమస్త ధర్మాలకూ మూలము; ఈ జగత్తంతయూ క్షమమీదనే ఆధారపడి ఉన్నది. అని వారలకు ఉగ్గు పాలతో విద్యలు బోధించి, వారినందరిని కాంపిల్యానగరానికి రాజు అయినబ్రహ్మదత్తునకిచ్చి వివాహముచేసి, అతనివెంటపంపగనే, ఇల్లుబోసిపోయెను.

అయ్యో! నిత్యము కళకళలాడుచూ పుత్రికలతో నిత్యోత్సవముగా నున్న గృహము ఈనాడు నిశ్శబ్దమయి, కళాహీనమయి, ఆనందరహితముగా కనుపించుచున్నది. ఆడబిడ్డలెందరున్ననూ యేనాడయిననూ తండ్రిగృహమును వీడిపోకతప్పదు, అదే ఒక పుత్రుడే యుండియుండిన ఈలోటు జరిగియుండెడిది కాదుకదా? అని తలంచి పుత్రేష్టి అయినాడు,

అంతట తండ్రి అయిన కుశుడు ఆ సమయమునకు ఇంటికి వచ్చి కొమరుని విచారమునకు కారణమడుగ ఉన్నది విన్నవించెను. అంతమాత్రమునకే ఇంత బాధ పడుటెందులకు? తప్పక నీయంతటి పుత్రుడు నీకు ప్రాప్తించునుగాక అని ఆశీర్వదించెను.

తండ్రి ఆశీర్వాదముల ప్రభావమన్నట్లు కొమరుడు కలిగెను. అతడే గాధి రాజు. అతడు మహా ధర్మాత్ముడు. కుశవంశములో పుట్టెను కనుక "కౌశికుడని"యూ మరొకపేరు.

కొంతకాలము రాజ్యమునేలి, తదుపరి అక్కలు పతితో స్వర్గమునుపొందగా, ఆ విచారముతో వారలకు ఐహిక ఆముష్మిక ఫలాలను ఇవ్వతలంచి మహానదీరూపమున హిమవత్ పర్వతప్రాంతములో అవతరించి మహాగణ్యమైన కౌశికీనదిగా ప్రవహిస్తూయుంది.

అది పుణ్యనది. స్వర్గమును చేరిన పెద్ద అక్కయగు సత్యవతియే. ఆమె తిరిగి ఈ కౌశికిరూపమున ప్రవహించుటచేత, ఆమెపైగల గౌరవాతిశయమువల్ల ఆ నదీతీరముననే నివసించుచుండెను. ఆ కౌశికుడు యజ్ఞ నియమమువలన ఆప్రదేశము వదలి సిద్ధాశ్రమము రావలసివచ్చెను. రామా! నీ పరాక్రమమువలన నా యజ్ఞము సఫలమయి, నా తపస్సు సిద్ధించినది" అని అన్నాడు విశ్వామిత్రుడు.

అంతచేరినఋషులు మునిశిష్యులు, "ఆహా! యెంతటి ఆశ్చర్యము. నిజముగా నేడు గురువర్యుల పూర్వీకులను గురించి వినుట మహద్భాగ్యము! మహదానందము. కుశవంశముమహాపవిత్రమైనది. బ్రహ్మదేవునితోసమానమయినమహాత్ములు!ధర్మాత్ములకునిలయమైన కుశవంశమున నేడు కాయముతో సంచరించు సత్పురుషుడగు విశ్వామిత్రులవారికి సేవచేయు భాగ్యమబ్బుట మా అందరి పూర్వపుణ్యఫలమని ఆనందించిరి.

అంత విశ్వామిత్రుడు, "రామా! నీవు అడిగినందువలన ఈ దేహసంబంధమైన విషయములను చెప్పవలసి వచ్చెను; కానీ, లేకున్న ఈ దేహసంబంధమైన వంశమును చెప్పనవసరములేదు. ఇప్పటికే రాత్రి కావచ్చినది, మనమిక విశ్రమించుట మంచిది. ఆలస్యముగా నిద్రించిన రేపటి ప్రయాణము కొంత తామసమగును! రామా! చూడుము! చీకటిని పారద్రోలుచూ తాపమును చల్లార్చుచూ చంద్రుడు చల్లని కిరణాలతో చెట్ల కొమ్మల మధ్యనుండి నిన్ను చూచుచున్నాడు! ఇక వెళ్ళి పవళించుడు!" అని తానుకూడ నొక మెత్తని గరికపై తలవాల్చెను.

ఆ రాత్రి అందరూ విశ్వామిత్రులవారి పూర్వీకులను స్మరించుచూ నిద్రించి

తెల్లవారగనే కాలకృత్యములు తీర్చుకొని స్నానసంధ్యాదులు ముగించుకొని ప్రయాణమునకు సిద్ధమయి విశ్వామిత్రుని చెంతకు వచ్చి నమస్కరించి బారులుదీరి నిల్చిరి.

అంత రాముడు, "స్వామీ! నదిని దాటవలెనన్న ఈ శోణనది లోతులేదు. జలము కూడనూ నిర్మలముగా నున్నది. పడవ అవసరములేదు. కాలినడకతో నదిని దాటవచ్చు"నని తెలుపగా విశ్వామిత్రుడు, "నాయనా! యెటు వెళ్ళవలెనో దారి మీకు తెలియదు. కనుక, నేనుముందు నడతును. తరువాత మీరు నన్ననుసరించుడు" అని తాను నడువసాగెను. అందరూ వారివారి మూటలను చంకలకు తగిలించుకొని వెళ్ళుచుండ మట్టమధ్యాహ్న మయినది. అంతలో జాహ్నవీనది కనుపించినది. హంసశారికల కుహూనాదములు వినిపించినవి. మనోహరమైన ఆ నదిని చూచి అందరూ ఆనందించినారు. అందరూ స్నానాదు లాచరించి పితృపిండములు విడిచి అగ్నిహోత్రములు పేర్చి నదీతీరమున కుప్పలు కుప్పలుగా కాచిన వెలగ పండ్లను రేగిపండ్లను కందమూలములను భుజించి అమృతమువంటి జలమును గ్రోలి ఆనందించిరి.

ఇంతలో విశ్వామిత్రుడు కూర్చొన్న వృక్షచ్ఛాయలకు రామలక్ష్మణులు వెళ్ళి చెంత కూర్చొని, "స్వామీ! ఈ గంగానది మూడు పాయలుగా ముల్లోకాలలో యెందుకు ప్రవహించుచున్నది? నదీనదాలు అన్నింటికీ ప్రభువు అయిన సముద్రుణ్ని యెట్లు చేరినది వివరించిన, విని ఆనందింతుము" అని రాముడు కోరగా విశ్వామిత్రుడు, "నాయనా: రామా! సర్వలోకములకూ, సర్వమృగములకూ మూలికలకూ నిలయము హిమాలయము. దానికి ఇరువురు పుత్రికలు. (అనగా దానిలో పుట్టినవి) ఒకదాని పేరు గంగ, మరొక పుత్రిపేరు ఉమ. పెద్దబిడ్డ గంగ, రెండవబిడ్డ ఉమ. వీరిరువురూ జగత్ ప్రసిద్ధులు. సర్వలోక పూజ్యులు. దేవహితము కొరకు గంగను తమకు ఇవ్వవలెనని దేవతలు కోరిరి.

అంత హిమవంతుడు ముల్లోకాల హితమునుకోరి పెద్దపుత్రిక అయిన గంగను దేవతలకు ఇచ్చివేసెను. ఇక మిగిలిన రెండవ కుమార్తెయగు ఉమ మహోగ్ర తపస్సు చేయ నారంభించెను. అంత ఆమె ఈ విధముగా తపస్సున మునిగిన లోక వాంఛలేక సర్వసంగపరిత్యాగి కాగలదని హిమవంతుడు చింతించి ఆమెనెట్లయిననూ గృహస్థాశ్రమమున ప్రవేశింపజేయవలెనని అనేక ప్రయత్నములు జరిపి కడకు రుద్రుని యొప్పించి అతనికిచ్చి వివాహము గావించెను. అప్పటినుండి ఆమె ముల్లోకాలకు పూజ్యురాలయినది. త్రిలోక హితాచరణపరులగు దేవతలు గంగను వెంట

బెట్టుకొని దేవలోకమునకు వెళ్ళిరి. అక్కడ ఆమె దేవలోకములో దివ్యవాహినియై ప్రవహించినది. ఆ త్రిపథగామినియే ఈ గంగ.

విశ్వామిత్రమహర్షి రామలక్ష్మణులతో కొందరి శిష్యబృందముతో తమ పూర్వుల చరిత్రలను, స్థలమాహాత్మ్యములను, రాజులవృత్తాంతములను రేయింబగలు తెలుపుతూ మిధిలాపురికి పయనము చేయుచుండెను.

క్రమక్రమేణా మిథిలాపుర సమీపము చేరిరి. ఆ సాయంత్రము స్నానసంధ్యాదులు ముగించుకొని, గంగానది ఇసుక తిన్నెలపై ప్రసన్నహృదయుడై ఆశీనుడాయెను. ఇంతలో గంగానదినిగురించిన విషయములను రాముడు జ్ఞాపకము చేయగా విశ్వామిత్రుడు అందుకొని,

"రామచంద్రా! ఈ గంగానది భూమిపై దిగుటకు మీ పూర్వీకులే కారణము. వారి పుణ్యము అని, భూమిపై బుట్టిన మానవులు అందులో స్నానసంధ్యాదులాచరించి పునీతులగుచున్నారు. గంగానది పరమ పవిత్రవాహిని. జన్మరాహిత్యమొసర్చు అమృత జలరూపిణి, శివుని జటాజూటమే ఈమె నివాసస్థానము. అందుచే ఈమె మంగళకరిణి. శుభదాయిని అని అనేకరీతుల గంగను కొనియాడుచున్న విశ్వామిత్రుని చూచి, ఆశ్చర్యమున రామచంద్రుడు

"స్వామీ! ఇంతటి అద్భుత ప్రవాహమును మా పూర్వీకులు యే విధమైన శక్తియుక్తులతో ఈ భూలోకమునకు గొనివచ్చిరో విపులముగా తెలిపిన విషయమును తెలిసికొని ఆనందింతును" అని అతి వినయమున అడుగగా,

విశ్వామిత్రుడు "రామా! వినుము. పూర్వము అయోధ్యానగరమును సగరుడను చక్రవర్తి పరిపాలించుచుండెను. అతను ధార్మికుడు. మహాపరాక్రమవంతుడు. అతని గుణగణములకు మెచ్చి విదర్భదేశపురాజు, కేశిని అను తమ ప్రేమపుత్రికను ఇచ్చి వివాహము గావించెను. ఆమెకూడను ధర్మిష్ఠి, సత్యసంభాషిణి.

"అయితే, యెంతకాల మయినను వారలకు సంతానము కలుగనందున వంశాభివృద్ధిని ఆశించి, కేశిని అనుమతిని గూడను పడసి సగరుడు అరిష్టనేమి కూతురయిన సుమతి అను ఒక సుందర, సుకోమల కన్యను రెండవ వివాహమాడెను.

ఆమె కూడనూ సంతానవతి కానందున ఇక లాభము లేదని భగవంతుని కటాక్షమును బడయగోరి ఇద్దరు భార్యలతో కూడి సగరుడు హిమవత్పర్వతములో భృగుమహర్షి వసించు సెలయేటి గట్టుపై చేరి తీవ్రమైన తపస్సు చేయ మొదలిడెను.

అక్కడ అతడు చాలాకాలము తపస్సుచేసెను. ఇట్లుండ ఒకనాటి వేకువ

జామున మహా సత్యసంపన్నుడైన భృగుమహర్షి అతనికి ప్రత్యక్షమై, రాజా! నీ తపస్సు చాలింపుము. నీవు ఈ లోకమున అసమానకీర్తిని సంపాదింతువు. త్వరలో పుత్రానందమును అందుకొందువు, అనిరి. అతని పలుకులువినగనే సగరుడుకన్నులు తెరచిచూచి, భృగుమహర్షికి నమస్కరించి, "స్వామీ, నాకిరువురు భార్యలు కలరు. వారల నమస్కృతుల నందుకొనుము. వారలను స్వయముగా ఆశీర్వదించుము అని తన భార్యల నిరువురిని మహాఋషికి నమస్కరింప పైగజేసెను.

అంత పెద్దభార్య అయిన కేశిని భక్తిశ్రద్ధలతో స్తోత్రము చేయుచు, శిరస్సు వంచి నమస్కరించగ, "అమ్మా! నీకు వంశవర్ధనుడు అయ్యే ఒక్క కుమారుడు కావలెనా, మహా బలవంతులు, కీర్తివంతులు అయ్యే అనేకమంది కొమరులు కావలెనా అని అడుగగా ఆ ఇల్లాలు, స్వామీ! వంశవర్ధనుడు అయ్యే ఒక్క కుమారుడే చాలునని ప్రార్థించెను.

అందులకు భృగువు తథాస్తు అని ఆశీర్వదించి రెండవ సతియైన సుమతి నమస్కరించగా, ఆమెనూ అట్టి ప్రశ్న వేయగా, ఆమె "మహా బలవంతులు, కీర్తివంతులు అయ్యే అధిక కొమరులు కావలె"నని కోరెను. ఆమెకు అటులనే అయ్యెదరని ఆశీర్వదించి, అంతర్ధానమాయెను.

రామచంద్రా! భృగుమహర్షి అమోఘమైన ఆశీర్వాదముల నందుకొని, సగరుడు భార్యలతో తమ పట్టణమును చేరుకొనెను. వరమును మనసున చింతించుచూ కాలము గడుపుచుండ, కొన్ని నెలలకు ఇరువురు భార్యలు గర్భములు దాల్చిరి. క్రమముగా నవమాసములు జరిగిన తరువాత కేశినికి ఒక పుత్రుడును, సుమతికి అనేకమంది పుత్రులు పుట్టిరి.

దినములు గడచినకొలది ఆ పిల్లలు పెరిగి పెద్దవారగుచూ తోడి పిల్లలతో ఆడుతూ, పాడుతూ, పెరుగుతూ, బయట తిరుగాడజొచ్చిరి. సగరుని జ్యేష్ఠపుత్రుడగు అశ్వమంజుడు, అయోధ్యలోని చిన్నపిల్లలను ఆడుకొనుటకు సరయూనది ఇసుక తిన్నెలపైకి గొనిపోయి అక్కడ వారలను సరయూనదిలో పడత్రోసి, ఆ ఊరి పిల్లలు మునిగిపోవుటను చూచి తాను గట్టిగా నవ్వుచుండెడివాడు.

ఈరీతిగా ఊరిపిల్లలను అందరినీ క్రమముగా చంపుచూ మహా ఘోరమైన పనులు చేయుచూ కడకు పరమ దుర్మార్గుడను పేరును అందుకొనెను.

అంత యుక్తవయసు రాగానే సగరుడు తమ పిల్లలందరికి తగిన కన్నెలను తెచ్చి వివాహము చేసెను. అయిననూ అశ్వమంజుడు తన పాపపు పనులను మానక అయోధ్యావాసులకు అనేక దుఃఖములు కల్పించుచుండెను. ఇట్లుండ అయోధ్య

వాసులు ఒకనాడు సగరునిచేరి, తమ బాధలను అతని జ్యేష్ఠపుత్రుడు సలుపు దుర్మార్గపు వృత్తులను తెలిపి గోలగా మొరపెట్టసాగిరి.

అంత తన కుమారుడను ప్రేమను త్యజించి నిర్దయుడై వెంటనే అశ్వమంజుని రాజ్యము విడచి కానల కేగుమని ఆజ్ఞచేసెను. అప్పటికి అశ్వమంజునికి ఒక కొమరుడు కలిగెను. కొమరుని, భార్యను, తలిదండ్రులను వీడి, అశ్వమంజుడు తండ్రి ఆజ్ఞ ప్రకారము అడవులకు పోయెను.

కొన్ని సంవత్సరములు ఇట్లు గడువగా అశ్వమంజుని కుమారుడగు అంశుమంతుడు పెరిగి పెద్దవాడయి సర్వలోక సమ్మతుడూ, సద్గుణ సంపన్నుడూ మహా పరాక్రమశాలిగా పేరు గాంచెను. ఒకనాడు సగరచక్రవర్తి మంచి ముహూర్తమును చూచి, అశ్వమేధయాగము మొదలుపెట్టెను

అని విశ్వామిత్రుడు యాగమును గురించి చెప్పుటకు మొదలిడుచుండగనే, రాముడు అందుకొని "స్వామీ! అశ్వమేధయాగము అయోధ్యయందే జరిపెనా? లేక మరి యే నదీతీరముననైననూ జరిపెనా సగరుడు? దానిని గురించి విపులముగా తెలుపుమని" ప్రార్థించగనే.

విశ్వామిత్రుడు చిరునవ్వుతో, "రామా! యాగమన్న నీకెంతటి శ్రద్ధయో నాకు విదితమగుచున్నది! చెప్పెదను వినుము! హిమవత్పర్వతమునకు ఎదురుగా ఒక పర్వతము కలదు. దానిని వింధ్యపర్వతమని అందురు. ఆ హిమవత్‌పర్వతమూ, వింధ్యపర్వతమూ రెండునూ పరస్పరము చూచుకొనుచున్నట్లుండును. ఆ రెండు కొండలమధ్య ప్రదేశమున యజ్ఞము చేయుటకు తగిన యేర్పాట్లు సలిపెను. ఆ సుందర ప్రశాంత ప్రదేశమున వేత్తలు అయిన ఋత్విక్కులుచేరి మంత్రములు పలుకుచుండ పర్వతములే అదరి బెదరి యేమగునో అనునంతటి ప్రతిధ్వనులతో చేరిన లక్షలాది ప్రజలు ఆయజ్ఞమున నిమగ్నులై యుండు సమయమున అశ్వమును సర్వాలంకారముతో గొనివచ్చి పూజలు గావించి దానిని వదలిరి. దానివెంట మహారథుడు ధనుర్ధరుడు అయిన అంశుమంతుని పంపిరి.

అంశుమంతుడు అశ్వమువెంట తిరిగి దిగ్విజయముగా గుఱ్ఱముతో తిరిగి వచ్చెను. యజ్ఞములో పర్వసమయము ఆసన్నమగుచుండ తెల్లవారి లేచి చూడగా అశ్వము కనుపించలేదు.

ఋత్విక్కులు దిగులుపడి సగరున కీవార్త తెలిపిరి. సగరుడు అశ్వమును వెతకుటకు నలువైపులా పంపెను. ఋత్విక్కులు అశ్వములేకున్న రాజునకు అమంగళమని నుడువుటచేత సగరుడు మరింత విచారగ్రస్తుడై, తన రెండవ భార్య కొమ

రుల నందరినీ సర్వాయుధ ధారాధులై వెతకుటకు పొందని ఆజ్ఞచేయగ, వారు రాక్షసులను దేవతలను నరులను శోధించి, అడ్డుతగిలిన వారలతో యుద్ధములు చేసి, భూమిలో, లోయలలో దాచియుందురేమో అని అనుమానించి భూమినికూడా త్రవ్వుటకు పూనుకొనిరి.

ఈరీతిగా శోధించి యెచ్చటనూ అశ్వము కనుపించనందున తిరిగివచ్చి తండ్రితో తెలుపగా సగరుడుకోపించి ఇట్టి అప్రయోజకులగు కొమరులుండి ప్రయోజనమేమి? గుఱ్ఱములేక వట్టిచేతులతో వచ్చిన మీ ముఖములు చూడనని గర్జించి తిరిగివెళ్ళి వెతకి గుఱ్ఱము చిక్కువరకునూ నన్ను చూచుటకు వీలుండదనితెలుపగా,

సాగరులు తండ్రి మాటలతో రోషపూరిత హృదయులై మహాతీవ్ర పరిశోధనలు సలుపుచూ వెళ్ళిరి. పర్వతములు, గుట్టలు, చెరువులు, నదులు, గుహలు, ఊర్లు అడవులూ వేయేటికి భూమిమీద అడుగడుగూ చూచుచూ వెళ్ళిరి. అట్లు వెతకుచూ వెళ్ళగా ఒక ప్రదేశమున మహామునిగా ధ్యానవిష్ఠుడైన ఒక వ్యక్తిని చూచిరి. అతనికి సమీపముననే గరికను మేయుచున్న యజ్ఞాశ్వమును చూచిరి.

అశ్వమును చూచినంతనే పట్టశక్యముకాని ఆనందమును, మునినిచూచి భరించలేని కోపమును రెండునూ ఒకదానివెనుక ఒకటి వారలను ఉన్మత్తులను చేసెను. ఆ క్రోధముతో బుద్ధులు బెండుబారెను. సాగరులు పలుగులు పైకెత్తి, ఓ దుర్బుద్ధీ! నీవెందులకు మా అశ్వమును దొంగిలించితివి. అని అతనిపై కురికిరి. అంత కపిలుడు కన్నులు తెరచి చూచెను.

కపిలుడు వారిని ప్రశాంత దృష్టితో చూచిననూ సాగరులు వివేకశూన్యులై అతనిని మరింత తూలనాడుచు, అతనిని కొట్ట పూనుకొనిరి. అంత కపిలుడు ఈ మూఢులు మాటలకు లొంగువారలు కారు అని గమనించి, తను వారలతో వాదమునకు దిగుట మంచిది కాదని తెలుసుకొని వారలను నిమిషములో బూడిద గావించెను.

ఎంతకాల మయిననూ సాగరులు తిరిగి రాకుండుటను చూచి విచారించి, యజ్ఞమును ఆపలేక ముందుకు జరుపలేక విచారముతో నుండుటను చూచి మనుమడయిన అంశుమంతుడు తాతకు నమస్కరించి, తాతా ఆజ్ఞ యిచ్చిన గుఱ్ఱమును పినతండ్రులను వెతకి తెత్తునని కోరగా,

సగరుడు ఆశీర్వదించి పంపెను. అంశుమంతుడు రాత్రి పగలు వెతకి అశ్వమున్న స్థానమును చేరెను. అక్కడనే తమ పినతండ్రులు భస్మమయి పడియున్న గుర్తులు కూడనూ గమనించెను. పినతండ్రుల మరణమునకు విచారించి వారలకు జలతర్పణ మొసగుటకు అటూ ఇటూ తిరిగెను.

ఎచ్చటను జలము కనిపించనందున, పాతాళములో మరికొంతదూరము మేగెను. ఆ ఒకమహనీయుడు యెదురేగి, నాయనా విచారింపకుము. లోకహితార్థమై కపిలుడు నీపినతండ్రుల నిర్జించెను. వీరిని దుఃఖించనక్కరలేదు. లోకములోని నీళ్ళతో తర్పణము వదలుటకంటె, గంగాదేవిని ఈ భూమిమీదికి తెప్పించు ప్రయత్నము చేయుము. ఆ పవిత్ర గంగోదకము నీ పినతండ్రుల భస్మముల మీద ప్రవహించినవారు ధన్యులు కాగలరు.

నీవు మొదట ఈ గుఱ్ఱమును గొనిపొమ్ము. తాతగారు సంకల్పించిన యజ్ఞమును పూర్తిగావించి తదుపరి మీ పినతండ్రుల సద్గతికి తగిన ప్రయత్నమును చేపట్టుము అని దీవించగనే, అంశుమంతుడు మునికి నమస్కరించి అతని ఆజ్ఞానుసారము అశ్వమును గొనికొని యజ్ఞశాలను చేరెను.

రాత్రీ పగలూ కన్నులు తెరచి యెప్పుడు అశ్వము వచ్చునా అని చూచుచున్న ఋత్విక్కులు పరిమానందపడిరి. అంతలో సాగరుల విషయము తెలుపుట మంచిది కాదని పూర్ణాహుతి జయప్రదముగా జరిపించి స్నానాదులు సలిపి తీర్థప్రసాదములు వినియోగించిన తరువాత అంశుమంతుడు సగరునకు సాగరుల వృత్తాంతము విశదముగా తెలిపి, గంగను భూమికి తెచ్చు విషయమును కూడను తెలిపెను.

అందుకు సగరుడు ఆనందించి, గంగను భూలోకమునకు తెచ్చు విధానమును సర్వవిధములా సలిపెను. కృతకృత్యుడు కాలేకపోయెను. తన కొమారుల విచారముతో వారలను పునీతులను చేయలేక పోతిని కదా అను దుఃఖముతో కృశించి సగరుడు దివంగతుడాయెను. రామా! సగరుడు కాలధర్మము చెందగనే ప్రజానుమతితో మంత్రులు అంశుమంతునికి పట్టముకట్టిరి. ధార్మిక అధ్యాత్మిక శక్తిసంపన్నుడైన అంశుమంతుడు తన పాలనమునందెట్టి లోపమునూ రాక, లేక, ప్రజలను కన్నబిడ్డల వలె చూచుకొనుచుండెను.

ఈరీతిగ కొన్ని సంవత్సరములు రాజ్యముచేసి వృద్ధాప్యము ప్రారంభించగనే తన కొమారుడైన దిలీపునకు రాజ్యభారమప్పజెప్పి పినతండ్రులను పునీతులను గావించు నుద్దేశముతో గంగను భూమిమీదికి దింపుటకు తగిన తపంబొనరించుటకై హిమాలయమునకు వెళ్ళెను.

కానీ కృతకృత్యుడు కాకుండానే తలంపును నెరవేర్చుకొనకనే కాయమును వీడెను. తండ్రి ఆశయమును తెలుసుకొని దానిని నెరవేర్చుటకు దిలీపుడు ముత్తాతలను ఉద్ధరించే ఉపాయములు అనేకము సలుపసాగెను. అనేక యజ్ఞయాగాది సత్కార్యములు గావించెను.

తండ్రి ఆశయము తీర్చలేనివాడినైతినను విచారముతో కడకొక రోగిగా మారిపోయెను. శరీర మనోబలములు సన్నగిల్లగనే తన కొమరుడైన భగీరథునకు రాజ్యాభిషేకముచేసి, తన ఆశయము నెరవేర్చుమని అతనికి బోధించి, గంగను భూమికి గొనివచ్చుటే తన ప్రధాన ఆశయమని నొక్కిచెప్పి కడకు ప్రాణములు వీడెను.

భగీరథుడు తేజోవంతుడు. తండ్రి ఆశను పూర్తిచేతునని వాగ్దానము చేసెను. రాజ్యమును అతి జాగ్రతతో పరిపాలించుచుండెను. ఎంతకాలమయిననూ భగీరథునకు సంతానముకలుగనందున తానుకూడనూ విచారమగ్నుడై సంతానములేని కొరత ఒక వైపుననూ, గంగను భూమిపైకి గొనితెత్తునన్న తండ్రికిచ్చిన వాగ్దానము మరొక వైపుననూ అతనిని బాధించుచుండ,

సమయమును గమనించి, రాజ్యపాలనము మంత్రుల కప్పజెప్పి గోకర్ణక్షేత్రమునకు వెళ్ళి మండుటెండలో మాసమునకొక పూటమాత్రమే ఆహారము తీసుకొని జితేంద్రియుడై ఘోర తప మాచరించెను. తపమునకు మెచ్చి భగవంతుడు సంతుష్టుడై "నాయనా! భగీరథా! యేమి కావలెనో కోరుకొమ్మని సెలవిచ్చెను.

భగీరథుడు కన్నులు తెఱచి కోటిసూర్యకాంతుని దర్శించి నమస్కరించి "స్వామీ! మాముత్తాతలను పునీతుల గావించుటకై గంగను భూమిపై ప్రవహింపజేయుము. ఇక్ష్వాకుల వంశము నాతో కృశించిపోకుండ వంశాభివృద్ధి ననుగ్రహింపుము అని పాదములపైబడెను. అంత హరి, "నాయనా! మొదటికోరిక మహాదుర్లభమైనది. అయిననూ నెరవేర్తును. ఇక నీకు సుపుత్రుడు పుట్టి వంశాభివృద్ధిని గాంచగలవు. లెమ్ము!" అని ఆశీర్వదించి,

భగీరథా! గంగ మహాతీవ్రగామిని. అది భూమిపై పడగనే భూమి భరించలేదు. భరించునంతటి శక్తి లేకుండుటచే, నీవు భూపతివి కనుక, కొంత యోచించవలెను. గంగ ఒకేతూరి భూమిపై దుమికిన మహాప్రమాదము సంభవించునుగాన హరశిరమున ప్రవేశించి అచటినుండి మెల్లగా భూమిపై ప్రవహించిన భూలోకవాసులకు సుక్షేమమేర్పడునని తెలిపి వెళ్ళెను. అప్పటినుండి భగీరథుడు హరుని గూర్చి తపం బాచరించి హరుని ప్రసన్నుని గావించుకొనెను.

హరుడు తన శిరమునుండి గంగను ఏడు పాయలుగా ప్రవహింపజేసికొనెను. (హ్రాదినీ, నలినీ, పావనీ అను మూడు పాయలు తూర్పునకు ప్రవహించెను. సుచక్షూ, సీతా, సింధూ అనుపేర్లతో పడమటి దిక్కునకు ప్రవహించెను. ఏడవపాయ భగీరథరాజుని వెంట బయలుదేరెను.) భగీరథుడు ఎటువెళ్ళిన గంగ

అటువైపునకు మలుపులు తిరుగుచూ కడకు ముత్తాతల భస్మముపై ప్రవహించి లోకములోని వారలను కూడ పునీతులను జేసి పావన గంగోదకములతో సర్వపాపములనూ పరిహారము గాపింప జేసెను.

భగీరథుడు గంగను భూమిపైకి గొనివచ్చుటచేత గంగకు తండ్రి భగీరథుడని కూడనూ పిలువజొచ్చిరి. గంగను భాగీరథి అని కూడనూ పిలువజొచ్చిరి. ఆ జలముతో భగీరథుడు సగర పుత్రులకు తర్పణములు విడిచి అయోధ్యకుచేరి తన తండ్రి తాతముత్తాతల అభీష్టమును నెరవేర్చగలిగితినను ఆనందముతో రాజ్యమును ఏలుచు, ప్రజల మన్ననల నెందుకొనుచూ కాలమును గడపుచూ కడకు కాయమును వీడెను, అని విశ్వామిత్రుడు రామవంశీయులను గురించి ఘనముగా తెలుపుచుండగా రామలక్ష్మణులు అతి శ్రద్ధతో వినుచుండగా అర్ధరాత్రి ఆయెను. అందరూ శయనించవచ్చునని విశ్వామిత్రుడు ఆజ్ఞ చేయగా అందరూ గురువునకు నమస్కరించి ఇసుక తిన్నెలపై పరుండిరి.

రామలక్ష్మణులు గురువాజ్ఞను మీరలేక వెళ్ళి పరుండిరే కానీ, వారలకు నిద్ర పట్టలేదు గంగను గురించిన అద్భుత చరిత్రను స్మరించుచూ ఉండగనే తెల్లవారెను. అందరూ లేచి స్నానసంధ్యాదులు గావించి ప్రయాణమునకు సంసిద్ధులైరి. పడవ సిద్ధముగా నున్నదని ఋషికుమారుడు చెప్పగనే అందరూ వెళ్ళి పడవలో కూర్చొని పవిత్రనదిని దాటిరి. ఉత్తర దిశకు చేరిరి.

సుందరమైన ఆ వనసౌందర్యమును తిలకించుచూ ప్రయాణము చేయదొడగిరి. కొంతదూరమట్లు నడచుచుండగనే ఒక విశాలపట్టణము, అతి సౌందర్య భవనములతో వారల కగుపడెను. అంత రాముడు విశ్వామిత్రుని జూచి "స్వామీ! ఈ సుందరమైన వనమున అతి విశాలమైన పట్టణము కనిపించుచున్నది కదా! అది యే రాజ్యమయి యుండవచ్చును?" అని యడుగ "రామా! అది మనకు అతిసమీపములో నుండినట్లు కనిపించుచున్నది. కానీ, దానిని చేరుటకు కాలమధిక మగును. బహుశా సాయం సమయము కావచ్చును. సమీపమునకు వెళ్ళిన తరువాత ఆ పట్టణపు పూర్వ వృత్తాంతము తెలుపుదును. మొదలు, దారి నడువుము."

అని చిరునవ్వుతో తెలిపిన మాటలను అతి శ్రద్ధగా విని మారుమాటాడక నడకను సాగించిరి. పల్లమునకు దిగినపుడు అసలు గ్రామ మేమీ కనిపించుట లేదు. కొంతమిట్టకు రాగానే అతి సమీపమునకు వచ్చినట్లు కనిపించును. ఈ రీతిగా నడచి నడచి విశ్వామిత్రుడు చెప్పినటుల సాయం సమయమునకు ఇంకనూ పట్టణములో ప్రవేశింపలేకపోయిరి. ఎటులనో సంధ్యాకాలమునకు సమీపమునకుచేరి స్నాన

సంధ్యాదులు ఆచరించి విశాలమైన ప్రదేశమున గుమిగూడి విశ్రాంతి తీసికొను సమయమున రాముడు ప్రశ్నించెను.

నాయనా! ...ను చేరితిమికదా, పూర్వవృత్తాంతము వివరింతురా?" అని ప్రార్థించగా, విశ్వామిత్రుడు "నాయనా! నేను కూడ దానినే తలంచుచుంటిని. మన పెరిగినవాడవనుట నాకు తెలిసియూ మాయ మధ్యమధ్య అట్లు వికార మార్గమున పడద్రోయును. మనసు స్వాధీనమునందుంచుట అందరికీ సాధ్యముకాదు. నాబోటి వారికేదానిని వశమునందుంచుకొనుట అసాధ్యముగానున్నది. ఇక సామాన్యుల సంగతి చెప్పనవసరము లేదు పూర్వవృత్తాంతము నీవు మరచితివేమోనని తలంచుచుండగనే తిరిగి నీవు దానిని గురించి ప్రశ్నించుట సర్వజ్ఞుడ వనుటకు వేరు ప్రమాణమెందుకు?

"రామా! పూర్వము కశ్యపునకు అదితి, దితి అను ఇరువురు సతులుండిరి. వారిలో దితి పుత్రులు మహా బలవంతులు. అదితి పుత్రులు మహా ధార్మికులుగా నుండి దిన దిన ప్రవర్ధమానులై పెరుగుచుండిరి. వారలను చూచి తలిదండ్రులు అమితానందము నొందుచుండిరి. ఒకనాడు అదితి పుత్రులు, దితి పుత్రులు ఇరువురూ గుంపుగాచేరి వార్ధక్యము, మృతి, అనారోగ్యములు లేకుండా ఉండవలెనన్న దానికి ఉపాయమేమి యని తర్కించుకొనిరి. కడకు పాలకడలిని చిలికిన అందులో అమృతము పుట్టుననియూ ఆ అమృతమును త్రాగిన జరామరణములు లేకుండుననియూ వారు నిశ్చయించుకొని మందర పర్వతమును కవ్వముగను, వాసుకి యను సర్పమును త్రాడుగను చేసికొని, క్షీరసముద్రమును చిలుకుటకు మొదలుపెట్టిరి. అట్లు చాలా కాలము మధించగా వాసుకి మొగమునుండి విషపుబిందువులు కార మొదలుపెట్టెను. అంత వాసుకి బాధను సహించుకొనలేక మహాక్రోధముతో పర్వతమునందలి రాళ్ళను కరువ మొదలిడెను. దానినుండి కారు విషబిందువులు మంటలుగా కనిపించెను.

అంత దితిపుత్రులు ఈ విషజ్వాలలకు మండిపోదుమేమో అను భయముతో దైవమును ప్రార్థించిరి. అంత విష్ణువు ప్రత్యక్షమై నిలిచెను. అంత దితిపుత్రులు "స్వామీ! దీనిని భరించలేము, రక్షించు"మని కోరగా,హరుడుగామారి "నాయనలారా! దేవతలకు అగ్రజుడ నగుటచే క్షీరసముద్రమున మొట్టమొదట పుట్టినదానిని అగ్ర నైవేద్యముగా భావించి స్వీకరింతు"నని తెలిపి నిదానముచేయక హాలాహలమును త్రాగెను.

అంత దితి అదితి పుత్రులు నిర్భయులై తిరిగి మందర పర్వతమును చిలుక మొదలుపెట్టిరి. కవ్వముగానున్న మందరపర్వతము సముద్రములో మునిగిపోవ జొచ్చెను. ఇది గమనించి తిరిగి దైవమును ప్రార్థించిరి. అంత విష్ణుమూర్తి వార

లకు సాక్షాత్కరించి, "నాయనలారా! దిగులొందకుడు" అని అభయమిచ్చి తాను తాబేలు రూపము ధరించి పాలసముద్రమునచేరి మందరగిరి క్రిందిభాగమున తన పీపను ఆనించెను. అంత కశ్యప పుత్రులు సంతసించి విష్ణువును అనేక విధముల స్తుతించిరి. అంత పాలకడలినుండి దండకమండలధారియై ధన్వంతరి పుట్టెను. దితి అదితి పుత్రులు ఆశ్చర్యముగ చూచుచుండగనే ఒక విధమగు రస ముద్భవించెను.

క్రమక్రమముగా ఆ రసము కూడి గోళాకారము ధరించి క్షణములో పగిలెను. అందులోనుండి మహా వర్చస్వినులు అనేకమంది బయలుదేరిరి. అట్లువచ్చిన వారిలో అందరూ కన్నెపడచులే. రసమునుండి పుట్టుటచేత వారలు అప్సరసలు అను పేరుతో పిలువబడిరి. వారు దితిపుత్రులనూ, అదితిపుత్రులనూ పెండ్లాడ అనేక విధ ములప్రార్థించ ప్రయత్నించిరి. కాని వారెవ్వరూ అంగీకరించనందున వారు స్వేచ్ఛా విహారులైరి.

అంతట పాలసముద్రమునుండి వరుణుని కూతురగు వారుణి, సురను తీసు కొని బైటకు వచ్చెను. అంత దితిపుత్రులు ఆ సురను పుచ్చుకొనుట కంగీకరింప లేదు. అదితిపుత్రులు ఆ సుర పుచ్చుకొనిరి. సురనుపుచ్చుకొన్నవారు సురులు, సురను పుచ్చుకొననివారు అసురులు అయిరి.

చివరకు అమృతము ఆ పాలసముద్రమునుండి ఉద్భవించెను. అంత అమృ తమును అందుకొనుటకై దితిపుత్రులు అదితిపుత్రులు పోట్లాడుకొనుటకు సిద్ధ మయిరి. కడకు అదితిపుత్రులు దితిపుత్రుల ననేకమందిని చంపిరి. కులక్షయము అయ్యే అంతటి పోరాటముగా మారెను. ఆ యుద్ధమునకు లోకములే దద్దరిల్లినవి. భయాందోళనలు వ్యాపించెను.

అంత విష్ణువు సుందరమైన స్త్రీ వేషమును ధరించి అందరినీ మోహమున ముంచి అమృతమును అంతర్ధానము చేసెను. దితి పుత్రులం దరూ హతమై పోయిరి. ఈ దుఃఖ వార్త తెలియగనే దితి మహా ప్రళయము సంభ వించినటుల దిగులొంది ఘోరముగా ఏడ్వసాగెను. కశ్యపుడెంత ఓదార్చిననూ ఆమె దుఃఖము శమింపదాయె ఎటులో కశ్యపుడు మంచి మాటలతో బోధనలు సలిపి కొంత శాంత పరిచెను.

దితి దుఃఖమును లోలోన మ్రింగుచూ పతిని చేరి "నాథా! ఇది న్యాయమా? ఇరువురూ మీ పుత్రులేకదా! కడకు నన్ను పుత్రులు లేని దానినిగా చేసితిరే. నా గతి యింతేనా, ఒక పుత్రుడైననూ మిగిలి రాలేదే! అల్పాయుష్కులగు అనేక కొడుకుల

కంటె, చిరంజీవియైన ఒక్క కొడుకుండిన చాలుగదా?" అని గొల్లున యేడ్వగా కశ్యపుడు ఓదార్చి "సతీ! దీర్ఘాయుష్కుడగు పుత్రుడు కావలెనని తపస్సు చేయుము. నిష్ప్రయోజనమైన దుఃఖమును మరచి పొమ్ము" అని ఆదేశించగా, తత్క్షణమే భర్తకు నమస్కరించి ఇంద్రుని జయించునంతటి పుత్రుడు ప్రాప్తించవలెనని తపమునకు బయలుదేరెను.

అంత కశ్యపుడు "దితీ! తపమన్న సామాన్యముకాదు. చివరివరకు శుచిగా వ్రతనిష్ఠను వీడక సలిపిన, దైవము తప్పక ఫలించునటుల అనుగ్రహించును. శుచి, దీక్ష అత్యవసరము. వాటిలో యెట్టిలోటు రానీయక చూచుకొమ్ము, వెళ్ళిరమ్ము," అని ఆజ్ఞ ఇచ్చెను. అంత దితి కుశప్లవము అనే ప్రదేశమును చేరి పతి తెలిపినటుల శుచియై దీక్ష ప్రారంభించెను. ఇంతలో దేవేంద్రుడు ఆమె వ్రతనిష్ఠను పరీక్షింపగోరి వెంటనే పరిచారకుని వలె బయలుదేరెను.

దితి వ్రతము ఫలించెను. దైవానుగ్రహముచే గర్భము తాల్చెను. దినములు నెలలు గడిచెను. మట్టమధ్యాహ్నమున కొంత అలసి నిద్రపట్టినటుల సూచనలు కలుగగనే దితి నిద్రాపారవశ్యమున తలాపిన కాళ్ళు, కాళ్ళకట్టున తల పెట్టుకొని, తల విరియపోసికొని నిద్రించెను. అంత దేవేంద్రుడు తపోనిష్ఠకు, శుచికి భంగము కలుగుటను గమనించి యోగ శక్తితో ఆమె గర్భముననున్న పిండమును ముక్కలుగ జేసెను. అంత పిండములోనుండి రోదన వినిపించుచుండ "మారుదః" "మా రుదః" అనుచూ ఇంద్రుడు ఊరడించుచుండెను. "మా రుదః" అంటే ఏడవకు అని అర్థము.

అంతలో దితి బాధచే మేల్కాంచి చూడగా రక్తము స్రవించుచుండుటను చూచి విలపింపపూనెను. అపుడు ఇంద్రుడు హస్తములు జోడించి, "అమ్మా! క్షమింపుము. వ్రతనిష్ఠాభంగము గావించితివి. తలవిరియపోసికొని, కాళ్ళతట్టున తల పెట్టుకొని నిదురించితివి. అందువలన వ్రతనిష్ఠకు, శుచిభంగము జరిగినది. శత్రువు సందుదొరికినపుడు ఊరకుండునా? నన్ను సంహరించువానిని, నీ గర్భమున నేను మాత్రము ధర్మవిరుద్ధముగా సంహరించలేదు. వ్రతనిష్ఠకు శుచి ప్రధానమన్న విషయము నీకు తెలియును. అది విరుద్ధముగా మారుటచే సమయమును గమనించి నా రక్షణ నేనుగా చూచుకొనుటలో తప్పు లేకుండుటచే అట్లు చేసితిని. గర్భము ఏడు ముక్కలుగా మారెను. కనుక వారు దేవతలవలె ఏడుగురు మరుద్గణాలుగా నుండుటలు గావింతునని వరమిచ్చి వెళ్ళెను.

"రామా! ఇంద్రుడు దితి ఇరువురు ఈ విధమైన ఒప్పందము జరుపుకొన్న

పవిత్ర స్థలమే ఈ స్థలము. ఇక్కడే ఇక్ష్వాకువున్ను ఆ అలంబుసాదేవికిన్ని ఒక కుమారుడు పుట్టెను. అతడే విశాలుడు. ఆ విశాలుడు నిర్మించిన దేశమే ఈ విశాల దేశము. విశాలునికి హేమచంద్రుడు పుట్టెను. అతడు మహాబలవంతుడు.అతనికిసుచంద్రుడుపుట్టెను. అనగా విశాలుని మనుమడు సుచంద్రుడు. సుచంద్రుడు పెరిగి పెద్దవాడై వివాహమాడెను అతనికి ధూమ్రాశ్వుడున్నూ, ధూమ్రాశ్వునికి సృంజయుడున్నూ ఆ సృంజయునికి సహదేవుడున్నూ పుట్టిరి. సహదేవుడు శ్రీమంతుడు, మహాధార్మికుడు, బలశాలి. అతని పరిపాలన చాలకాలము జరిగెను. అతనికి కుశాశ్వుడు అను కుమారుడు కలిగెను. అతని కుమారుడే సోమదత్తుడు.

సోమదత్తునకు కాకుత్స్థుడు పుట్టెను ఆ పరాక్రమశాలి పుత్రుడే సుమతి. ఇప్పుడు ఈ విశాల పట్టణమును పరిపాలించు నతడే సుమతి. ఇతడు మహాగుణశాలి. దేవతలతో సమానుడు. "రామా! ఈనాడు ఈ విశాలపట్టణమున సుఖముగా శయనించి రేపటిదినమున జనక మహారాజు పట్టణమునకు పయనమగుదము" అని తెలుపగా అందరూ ఆనందించిరి.

ఇంతలో విశ్వామిత్ర మహర్షి తమ పట్టణ ప్రాంతమునకు వచ్చినటుల దూతలచే తెలిసికొని సుమతి, తమ పరివారముతో పురోహితులతో వెళ్ళి విశ్వామిత్రుల వారిని, తమ గ్రామములో ప్రవేశించి రాజభవనమును పవిత్రము చేయమని ప్రార్థించెను.

విశ్వామిత్రుడు కూడనూ ఆనందించి కుశల ప్రశ్నలు వేసెను. ఇరువురూ కొంత తడవు పురక్షేమములు మాటాడిన తరువాత రామ లక్ష్మణులను చూచి సుమతి ఈ సింహపు పిల్లలెవరై యుందురు అని విశ్వామిత్రుల వారిని ప్రశ్నించెను.

అందులకు విశ్వామిత్రుడు, "సుమతీ! అది గొప్ప చరిత్ర. సమయములేదు, భవనమునకు వెళ్ళిన తరువాత వివరింతును" అని తెలిపి తమ వెంట వచ్చిన ఋషి శిష్యులను రామలక్ష్మణులను విశాల పట్టణమునకు బయలు దేరుడని తెలిపి తాను కూడను లేచి, సుమతితో కబుర్లు అడుగుచూ నడువ దొడగెను. పురములో ప్రవేశించగనే మంగళవాద్యములు మ్రోగెను. బ్రాహ్మణులు స్వస్తి వాచకములు పలికిరి.

విశాలపురి రాజభవనమును వారు ప్రవేశించిరి. ఆనాడు సుమతి గావించిన విందును ఆరగించి అక్కడ చేరిన పండితులతోను బంధుమిత్రులతోను రామలక్ష్మణుల గూర్చి సిద్ధాశ్రమములో తాను గావించిన యజ్ఞమును గూర్చి దానిని రక్షించిన విధానమునుగూర్చి విశ్వామిత్రుడు విపులముగా తెలిపిన, ఆశ్చర్యకరమైన శక్తి సామర్థ్యములు గల బాలుల చరిత్రను విని, చేరినవారలు అమితానందముతో

రామలక్ష్మణులవైపు జూచుచూ సాక్షాత్కరించిన నరనారాయణులా అన్నటుల భావించి, అందరూ నమస్కరించిరి.

అప్పటికే ప్రొద్దు కావచ్చుటచేత విశ్వామిత్రులకు నమస్కరించి రామలక్ష్మణులు విశ్రాంతి తీసికొనుటకై వారికి ప్రత్యేకముగా అమర్చిన విడిదిగృహమునకు వెళ్ళిరి. తెల్లవారిస్నానసంధ్యాదులుగావించి,విశ్వామిత్రులచెంతకునకాలమునకుచేరిరి.

అక్కడ సుమతికి కృతజ్ఞతను తెలిపి, మిథిలాపురికి బయలుదేరిరి. సుమతి కొంత దూరము వారలతో వచ్చి వీడ్కోలొసగి తిరిగి వెళ్ళిపోయెను. విశ్వామిత్రుడు శిష్య బృందముతో రామలక్ష్మణులతో నడచుచూ మధ్యాహ్నమునకు ఒక సుందరమైన వనమును చేరెను.

అది పూర్వము ఎంతో అందముగా ఉండినటుల కొన్ని కొన్ని శిథిలమైన పర్ణశాలలు, యజ్ఞయాగములు చేయునట్టి అరుగులూ హోమగుండములు రాముని కంటి కగుపడెను. అంత రాముడు చుట్టూ పరికించి ఇది యేదో పూర్వము మహర్షులు సంచరించిన పవిత్ర వనమువలె నున్నదని విశ్వామిత్రులతో హెచ్చరించగనే విశ్వామిత్రుడు చిరునవ్వు నవ్వి, "రామా! ఎంత చక్కగ గమనించితివి. సంతోషము. ఈ ప్రదేశమున ఏ మహనీయుడు నివసించి యుండెనో, ఆ మహనీయుడు ఈ ప్రదేశమును ఎందుకు వీడవలసి వచ్చెనో తెలుపుదును, వినుము.

ఇది గౌతమ మహర్షి ఆశ్రమము. దేవతలు సహితము ఈ ఆశ్రమపదాన్ని ఎంతో ప్రశంసిస్తూ ఉండేవారు. గౌతముడు తన భార్య అయిన అహల్యతో అనేక సంవత్సరములు ఇందు నివసించెను. ఘోరమగు తపస్సు నాచరించెను. అనేక యజ్ఞయాగాది క్రతువులు సలిపెను. ఈ ప్రదేశము నిత్యకళ్యాణముతో కలకలలాడు చుండెను.

గౌతముని భార్యయగు అహల్య మహా గుణవంతురాలు. చక్కని చుక్క. ఆమెను పోలిన స్త్రీలు లోకమున మరొకరు లేకపోవుటచే గౌతముడు అతి జాగ్రత్తగా కాపాడుకొని కనిపెట్టుకొని యుండెను. ఒకనాడు ఆమె సౌందర్యమును చూచుటకు గౌతముడు ఆశ్రమమున లేని సమయమును కనిపెట్టి, ఇంద్రుడు గౌతముని వేషమును ధరించి ప్రవేశించెను. అపుడు గుణవంతురాలైన అహల్య పతిగా భావించి అతనికి ఉన్నతరీతుల సేవలు సలుపుచుండెను. ఇంతలో నిజ గౌతముడు ప్రవేశించగనే ఇంద్రుడు కనుపించెను. గౌతముడు ఉగ్రుడై తన వేషమును ధరించి అహల్యతో సేవలు చేయించుకొనుచుంటివా దుర్మతీ! అని గర్జించగనే దేవేంద్రుడు అంతర్థానమాయెను.

ఆ రౌద్రముతో అహల్యను చూచి ఆశ్రమనాశనమునకు పూనుకొంటివని గర్జించి, ఛీ, ఒక నిమిషమైననూ నేను ఇందుండ తలంచలేను. నీ ముఖము చూడ రాదు. కూడును నీరును లేక గాలిని పీల్చుచు ఇతరుల కంటబడక పొదల చాటున పడియుండుము. నేవెళ్లుచున్నానని గౌతముడు అగ్నివంటి మాటలు పలుకగనే, అహల్య గోడునయేడ్చి, తన దే విధముగనూ తప్పు లేదనియును, తాను, లోతుగా విచారించక వేషమును చూచి పతిగా భావించి సేవలు సల్పితినేగాని అన్యభావము లేదని కాళ్ళమీదపడి ప్రార్థించగా గౌతముడు శాంతించి యదార్థమును గుర్తించి తానన్న మాట తిరిగి వెనుకకు తీసుకొనరానిదగుటచే, తిరిగి అహల్యా! ఆడినమాట తప్పనను వ్రతమున్నది. అది నీకు తెలియును.

కాన నీవిక్కడే పడియుండుము. త్వరలో దశరథ రాముడు ఇక్కడికి రాబో వుచున్నాడు. నిన్ను చూచి కటాక్షించును. దర్శనమిచ్చును. ఆ దర్శన స్పర్శన సంభాషణములతో నీ దోషము పరిహారమగును. నీ యదార్థరూపము తేజస్సు తిరిగి ప్రాప్తించ గలదు. అపుడు నేను తిరిగి నిన్ను చేర్చుకొందును. అని తెలిపి గౌత ముడు ఆశ్రమమును వదలి హిమవత్పర్వత ప్రాంతమునకు వెళ్ళిపోయెను.

అతను వెళ్ళినప్పటినుండియు అహల్య రూపరహితయై గాలిని పీల్చుచూ తన పతిని చేరగోరి ఘోరతపముతో పడియున్నది. ఆశ్రమము ఈ రీతిగా పాడు పడిపోయినది" అని విశ్వామిత్రుడు తెలుపగనే రామచంద్రుడు అమితఆశ్చర్యమును ప్రదర్శించి యేమీ నారాకకై వేచియున్నటుల తెలుపుచున్నారే, పాపము ఆమె ఏ ప్రదేశమున తపమాచరించుచున్నదో తెలిసికొన గోరుచున్నాను, అని రాముడు ముందుకు నడువగనే, విశ్వామిత్రుడు, లక్ష్మణుడు అతనిని అనుసరించిరి. మహారణ్యా మున పొదలను దాటి శిథిలమైన పర్ణశాలలో ప్రవేశించిరి.

అంతవరకూ దేవదానవుల కెవ్వరికినీ చౌరనలవి కాకుండా తపోనిష్ఠలో సర్వమును మరచి నిద్రాహారములు లేక రాయివలె పడియుండిన ఆ అహల్య పొగ మంచులో చిక్కుకొన్న చంద్రునివలె కనిపించెను. ఆమె విగ్రహము ధూమచ్ఛ న్నము అయిన అగ్నిహోత్రజ్వాలలవలె మారియుండెను. రాముడు మరింత సమీ పమునకు వెళ్ళుచుండగనే కాలుసోకెను.

అంత అహల్య తలయెత్తి రాముల దివ్యసుందర విగ్రహము చూచి "ఆహా, ధన్యురాలయితిని," అని పాదములు గట్టిగా పట్టుకొని నాపాప పరిహారము గావింప వచ్చిన పరమాత్మా ! ఈనాటికి దయకల్గెనా యని అనేక విధముల ప్రార్థించెను. తన రూపము మేఘములనుండి తప్పించుకొన్న చంద్రునివలె ప్రకాశింప పైకి

లేచెను. అంత యోగలక్షణ సంపన్నుడగు గౌతముడు క్షణములో అచ్చట వ్రాలెను.

ఆ తపోబల విశుద్ధాంగిని చూచెను. ఇరువురు చేరి రామలక్ష్మణులకు అత్యంతానందముతో నమస్కరించిరి. విశ్వామిత్రుని గౌతముడు తగురీతిగ సన్మానించి గౌరవించెను. అంత విశ్వామిత్ర శిష్యబృందము ఈ ఆశ్చర్యకరమైన వింతను జూచి నేత్రములనుండి కారుచున్న ఆనందబిందువులతో రామలక్ష్మణులను తదేక దృష్టితో చూడ దొడగిరి. ఇంతలో విశ్వామిత్రుడు గౌతముని దగ్గర సెలవు తీసికొని రామలక్ష్మణులను వెంటబెట్టుకొని ఈశాన్యదిక్కుగా పయనము సలిపెను.

సాయంసమయమునకు సరిగా మిథిలాపురిము సమీపించిరి. అదియే మిథిలాపురమని కనిపించు పెద్ద పెద్ద భవనములతో కూడిన విశాల పట్టణమును విశ్వామిత్రుడు రామలక్ష్మణులకు చూపగనే రామలక్ష్మణులు ఋషిశిష్యులు పట్టరాని ఆనందముతో గంతులు వేసిరి. నడక మరింత తీవ్రగతిని చెందెను. దేహములే మరచిరా అన్నట్లు చెండువలె కదలి పోయిరి. మిథిలాపుర సింహద్వారము చేరిరి. ఎటుచూచినను, ఋషులు బ్రాహ్మణులు వేదపఠనములు అన్నికార్యములను జరుగుచుండెను. ఏ చెట్లక్రింద చూచినను యెడ్లబండ్లను నిలిపి అందుండి ప్రజలు గుంపులు గుంపులుగా దిగుచూ, స్త్రీలు పురుషులు, వృద్ధులు, బాలురు, అన్ని వర్గముల వారూ, అన్ని ఆశ్రమములవారూ. అన్ని దేశములవారూ రకరకములుగా కనిపించుచూ, కన్నుల పండువుగా నుండెను. జనులు అటూ ఇటూ తిరుగుచు దారియే తెలియక క్రిక్కిరిసి కిటకిటలాడుచుండిరి.

అట్టి సమయమున ఎక్కడ విడిది చేయవలెనో తెలియక అటు ఇటు చూచి కొంత జనసమ్మర్దము లేని ఒక చెరువుగట్టునకు చేరిరి. అక్కడివారందరూ సామానులు కట్టిపెట్టి స్నానసంధ్యాదులు తీర్చుకొనుచుండిరి. యజ్ఞసమయమున ఆహ్వానము గావించినవా రెవరైనా వత్తురేమో అని ఎక్కడ చూచినను రాజభటులు వచ్చినవారలను వారి వారి వసతుల నిమిత్తము ఎక్కడ నుండి వచ్చినదియు వారు ఏ ఆశ్రమమునకు చెందినదియు వారి నామధేయములను విచారించి వార్తలను రాజునకందించుచుండిరి.

ఈ లోపల ఈ చుక్కలవంటి పిల్లలతో సింహములవంటి దృఢకాయులతో మహాతేజోవంతుడైన విశ్వామిత్రుడు స్నానముచేసి సంధ్యాదికార్యములు సక్రమముగా ఆచరించి చెరువు గట్టుపై కూర్చొని మిథిల వైభవమునుగూర్చి (విశ్వామిత్రుడు) చెప్పుచుండ రామలక్ష్మణులు ఋషిపుత్రులు వినుచుండిరి. ఇంతలో రాజ

భటులు వచ్చి సవినయముతో "స్వామీః తామెవ్వరు? ఎచ్చటనుండి దయచేసితిరి, మేము రాజభటులము. జనకచక్రవర్తి ఆజ్ఞానుసారము మేము మా కర్తవ్యముల నిర్వర్తించుచున్నాము. తమ నామధేయము తెలిపిన శ్రీవారి కెరిగింతుము అని ప్రార్థించగనే విశ్వామిత్రుడు వెంటనే తన నామమును తెలిపెను.

అంత రాజభటులు సరాసరి రాజభవనమునకు వెళ్ళి విశ్వామిత్రుల వారి రాకను గురించి తెలుపగనే జనక మహారాజు తగిన ఏర్పాట్లు గావించెను. కొంత సమయమగుసరికి ప్రధాన బ్రాహ్మణులతో ప్రధాన పురోహితుడైన శతానందుని పంపగా శతానందుడు స్వస్తివాచకములు పలుకుచూ చెరువుగట్టునకు వచ్చుటను జూచి విశ్వామిత్రుడు తమను తోడ్కొనిపోవు నిమిత్తము వచ్చుచున్నారని గమనించి రామలక్ష్మణులను సిద్ధము కండని తెలిపెను. అందరూ సర్వసంసిద్ధులైయుండ శతానందుడు వినయ విధేయతలతో అర్ఘ్యము, పాద్యము, మధుపర్కము విశ్వామిత్రులవారికి సమర్పించి మహారాజుగారి ఆజ్ఞప్రకారము మేము తమకు స్వాగత మిచ్చుటకై వచ్చితిమని తెలిపి వారి సామానులకు ఒక పల్లకి అక్కడుంచి విశ్వామిత్రుని, రామలక్ష్మణ, ఋషికుమారులను మంగళ వాద్యములతో తోడ్కొని పోయెను.

రాజవీధిలో ప్రవేశించగనే అక్కడికి జనక మహారాజు స్వయముగా తమ మంత్రిపరివారముతో ఎదురేగి విశ్వామిత్రులవారికి నమస్కరించి "స్వామీః నేధన్యుడనైతిని. తమరాక మిధిలాపురమునకెంతయో శోభచేకూర్చెను." అని క్షేమసమాచారములు పల్కరించి తమ దృష్టిని పిల్లలైన రామలక్ష్మణులపై ఏకాగ్రపరచెను. ఆ రూపములు సాక్షాత్ సూర్యతేజఃపుంజము వలె కనిపించెను. రాజునకు కొన్ని నెకండ్లు ఏమియూ తోచక, ఎక్కడ నున్నది తెలియక పోయెను. ఎటులో తన చిత్తమును అణచుకొని దిగ్భ్రాంతిగా,

"స్వామీః ఈ పిల్లలెవరు? సాక్షాత్ అశ్వినీ దేవతలవలె కనిపించుచున్నారు. వీరు నా అదృష్టవశముచే ఇప్పటికిప్పుడే నన్ననుగ్రహింపగోరి దేవ లోకము నుండి దిగిన దేవతావిగ్రహములవలె నున్నారు. లేక సూర్యచంద్రులే ఇట్టి రూపములు ధరించి భూలోకమునకు వచ్చిరా అన్నట్లున్నారు. ఇట్టి సుకుమార సుందరులు తమతో పాదచారులై ఎట్లు వచ్చిరి? లేక ఇక్కడెక్కడయినను పరిచయమయి తమను కూడిరా?" అని తనకు తాను తెలియక దేహమునే మరచి మాటాడుచున్నట్లు, ఒకదానిపై మరొక ప్రశ్నను వర్షముగ కురిపించు జనకమహారాజును చూచి విశ్వామిత్రుడు చిరునవ్వుతో,

"రాజా! వీరు అయోధ్యానగర చక్రవర్తియగు దశరథుని పుత్రరత్నములు. వీరిపేర్లు రామలక్ష్మణులు. వీరి బలపరాక్రమములు అత్యంత విచిత్రములు, అద్భుతములు" అని ఇంకనూ ఏమేమో తెలుపవలెనని తలంచి విడిదికి చేరిన తదుపరి మాటాడవచ్చునని అంతటితో ఆ సంభాషణకు స్వస్తిచెప్పి రాజుతో ముందుకు నడచుచూ వచ్చెను.

అప్పటికప్పుడు వారలకై యేర్పరచిన చక్కని విడిది గృహమునకు తోడ్కొని వెళ్ళిరి. అది విశాలమైన తోటలో సుందరమైన మందిరముగా అలంకరింపబడి యుండెను. అక్కడ ప్రశాంతత ఉట్టిపడినదా అన్నట్లు అంతట నిశ్శబ్దమైనదై యుండెను. అది రాజభవనమునకు అతి సమీపమున నుండుటచేత వారల నక్కడకు చేర్చి జనకమహారాజు విశ్వామిత్రుల వారికి సాష్టాంగ నమస్కారములు గావించి, తమరాక రాజునకెంతయో బలమును ఆనందమును అందించినదనియును యెన్నియో జన్మల పుణ్యఫలమే తమకట్టి భాగ్యము నందించినదనియు కృతజ్ఞత తెలిపి, రాజు విశ్వామిత్రుని చెంత సెలవు తీసికొని వెళ్ళుచు "స్వామీ! యజ్ఞము ఇంకనూ పన్నెండు దినములు పట్టునని ఋత్విక్కులు చెప్పుచున్నారు. కాన తమరు ఈ పన్నెండు దినముల కాలము మిథిలయందేయుండి అనుగ్రహించ వేడుచున్నా" నని ప్రార్థించెను.

విశ్వామిత్ర మహాఋషి అందులకెట్టి అభ్యంతరము లేదని అభయమివ్వగనే రామలక్ష్మణులు ఒకరినొకరు చూచుకొని ఇంత కాలమా అన్నట్లు భావించిరి. వారలకు ఆ రాత్రి విశ్రాంతిగా నిద్రించుటకు తగిన ఏర్పాట్లు చేసి వారలకు ఫల, పానీయ, క్షీరములు అందించునట్లు తెలిపి రేపటి ఉదయమున తమ దర్శనము చేసికొందును. ప్రయాణ బడలికచేయున్న తమకు శ్రమ కలిగించుట భావ్యము కాదు. చక్కని విశ్రాంతి తీసికొన ప్రార్థించి, రాజు పురోహిత మంత్రులతో రాజభవనమునకు వెడలిపోయెను. అతడు వెళ్ళిన తోడనే రామలక్ష్మణులు జనకమహారాజుయొక్క భక్తి శ్రద్ధలను వినయ విధేయతలను వర్ణించుచూ అతని ముఖతేజస్సును ఘనముగా పలుకుచూ, గురువుల చెంతచేరి ఫలముల భుజించి విశ్రమించుటకు అనుజ్ఞగొని తమ వసతికి వెడలిరి.

నాటిరాత్రి హాయిగా నిద్రించిరి. తెలతెల వారగనే ద్వారముముందు మంగళ వాద్యములు మ్రోగెను. బ్రాహ్మణులు వేదము పఠించిరి. రామలక్ష్మణులు లేచి, స్నానము నాచరించి సంధ్యావందనములు ముగించుకొని, విశ్వామిత్రుల వారి చెంతకు చేరిరి. అంత విశ్వామిత్రులవారు వారలకు క్షీరము నందించి "నాయనలారా!

జనకుడు వచ్చు వేళయినది. మీరు కొంత ఫలహారము తీసికొని సిద్ధముగా నుండుడని ఆజ్ఞాపింపగనే రామలక్ష్మణులు, ఋషికుమారులు ఫల పానీయములను అందుకొని భుజించి హస్తములను శుద్ధిచేసికొని తిరిగి వచ్చి విశ్వామిత్రుల వారి చెంత కూర్చొనిరి ఇంతలో జనకమహారాజు పురోహిత సమేతుడై వచ్చుచున్నటుల తెలిపెను. శంఖములనూది, నవధ్వనులు వాయించిరి. గంధాక్షతలను హస్తమందుంచుకొని జనకుడును, అర్ఘ్యపాద్యములను ధరించి శతానందుడును పరివారముతో విడిదిలో ప్రవేశించిరి.

జనకుడు, సరాసరివచ్చి విశ్వామిత్రులకు నమస్కరించు స్వామికి యెదురుగా యేర్పరచిన ఉన్నతాసనము చెంత నిలబడెను. విశ్వామిత్రుడు అతనిని కూర్చుండుమని ఆజ్ఞాపింపగనే జనకుడు ఆసనముపై కూర్చుండెను. రామలక్ష్మణులు విశ్వామిత్రునికి కుడివైపున నేలపై పరువబడిన రత్నకంబళముపై ఆశీనులై యుండిరి. ఇంతలో జనకుడు "మహామునీ, తమకు నిరంతరము స్వాగతము. ఇక తమ అజ్ఞ యేమిటో తెలిపిన నేను సంసిద్ధుడనని హస్తములు జోడించుకొనెను. అంత విశ్వామిత్రుడు చిరునవ్వు నవ్వుచు రాత్రి వ్యవధి లేకపోవుటచేత వివరములు తెలుపనైతిని. నీవు వినగోరుచున్న ఈ రామలక్ష్మణుల విషయమును చెప్పబూనుదును. వ్యవధిలేకున్న మరొకపరి తెలుపుదునని తెలుపగనే రాజు "స్వామీ! తమ సంభాషణ భాగ్యము కన్నను నాకు వేరు ప్రధాన కార్య మేమున్నది. ఇది సర్వతపస్సుల సారము, సర్వయజ్ఞముల ఫలము, సమస్త పుణ్యములపుంజము,తమరు తెలుపుదురేని నేనెంతయో ఆనందింతును, మహాభాగ్యమని భావింతును" అని తెలిపెను. తాను దశరథుని దర్శించినది మొదలు తన యాగసంరక్షణ వరకూ జరిగిన విషయమును విపులముగా తెలిపి రాక్షసులతో పోరాడిన ఈ పిల్లల శక్తి సామర్థ్యములను మరింత అద్భుతముగా తెలుపుచూ మధ్య మధ్య ఆనందమును భరించలేక కంటితో ధారలను కార్చుచున్న విశ్వామిత్రులవారి ఆశ్చర్యమును చూచుచు, పిల్లలను చూచుచు, జనకుడు మహాసమాధిలోనున్నటుల తలంచుచుండెను. ఆ పిల్లలను సాక్షాత్ దేవతామూర్తులుగనే తాను భావించుచుండెను. మాటిమాటికి తన దృష్టిని యెంత మరల్చినప్పటికినీ ఆ దివ్యమూర్తులనే చూడగోరుచుండెను. ఆ పిల్లల ముఖ పద్మములపై బ్రహ్మతేజస్సు ఉట్టిపడుచుండెను. ఈ భావములను జనకుడు తనలోతా ననుకొనుచూ అతివినయవిధేయతలతో వారిని చూడగోరెనేకానీ తాను చక్రవర్తిననియూ, వారు వేరొక మహారాజు కుమారులనియు భావించలేదు. వారు సాక్షాత్ దేవలోకమునుండి భువికి దిగిన దివ్యమూర్తులుగ లోలోన తలంచుచుండెను. దానికి తగినటుల విశ్వా

మిత్రులవారు తెలిపిన వీరల పరాక్రమ దృశ్యములతో జనకుని విశ్వాసము మరింత బలపడెను. మహాతపశ్శక్తి సంపన్నుడైన విశ్వామిత్రుని చేత కానట్టి యజ్ఞసంరక్షణ ఈ పసిపాపలచే రక్షింపబడినదన్న వీరు సామాన్యమానవమాత్రులు కాని చెప్పక చెప్పుచున్నది.

ఇంతలో మిథిలాపురమునకు బయలుదేరినది మొదలు ఆ రామలక్ష్మణులచే విశ్వామిత్రుడు ఎంత ఉల్లాసముగా ప్రయాణము జరిపినదియును అతి సమీపమునసే యున్న గౌతమమహర్షి ఆశ్రమమున అహల్యను పునీతురాలుగా జేసినదియును అత్యంత ఆశ్చర్యముతో విశ్వామిత్రుడు తెలుపుచుండగనే శతానందుడు పరమ ఆశ్చర్యముతో యేమి! మా తల్లికి శాపవిమోచనము జరిగినదా? ఈ మహనీయులు నా తల్లిని పునీతురాలుగా చేసి నా తండ్రిలో చేర్చిరా! ఆహా, నిజముగా వీరు సాక్షాత్ దైవ స్వరూపులే, సందియములేదని ఆనందభాష్పములు రాల్చుచు అత్యంత ఉత్సాహముతో నోటిమాటరాక స్తంభించిన శతానందుని చూచి విశ్వామిత్రుడు "నాయనా, ఇంతమాత్రమునకే నీవింత కంగారు పడెదవేల. మునుముందు జరుగు అద్భుత ఆనంద అతీతచర్యలను అతి శీఘ్రములోనే అనుభవింతువు, ఆనందింతువు. మీ తల్లిదండ్రులుకూడ నేడో రేపో మిథిలాపురమునకు రాగలరు. రామలక్ష్మణుల అద్భుత చర్యలు వారిద్వారా విందువు, శాంతించుము." అని బోధించెను.

అంతలో జనకమహారాజు "స్వామీ! ఇట్టి పవిత్ర పుత్రులనుగన్న తలిదండ్రులెంత అదృష్టవంతులో! తలవనితలంపుగా వారలు నా గృహమున కరుదెంచుట ఇది నా భాగ్యము, తమ అనుగ్రహబలము."అని రామలక్ష్మణులవైపునకుతిరిగి, "నాయనలారా! మీకు తగినట్లు వసతులు కల్పించలేకుండిన నన్ను క్షమింపుడు. కోరిన తగిన వసతుల నేర్పరచుటకు పంసిద్ధుడను. లేక పురమును జూడగోరిన తగిన ఏర్పాట్లు గావింతును. క్రొత్తగా భావించక మనస్సు విప్పి తెలిపిన సంతసింతును. అని ప్రేమతో పలుకుచుండిన జనకమహారాజు వాక్యములకు రామచంద్రుడు యెంతో గౌరవభావమును వెదజల్లుచు,

"మహారాజా! మేము పిల్లలము. మా సౌకర్యములకెట్టి అనానుకూలములు లేవు. ఆనందముగా నున్నాము. తమరు మాకొరకై వేరు ప్రత్యేక ఏర్పాట్లు చేయనక్కరలేదు. తమకంతటి వాత్సల్యమేయుండిన, మా వాంఛ నెరవేర్తురని అత్యంత ఆశతో వేచియున్నాము." అని పూర్తిగ విపరింపక, విశ్వామిత్రులవైపు చూచుచూ ఊరకుండెను. ఇంతలో విశ్వామిత్రులవా రందుకొని,

"జనకా! నా యజ్ఞము పూర్తి అయిన వెంటనే వచ్చిన కార్యము జరిగినది,

మేమిక అయోధ్యకు వెళ్ళుటకు సెలవివ్వమని రామలక్ష్మణులు కోరిరి ఇంతలో మీ నుండి యజ్ఞసంబంధమైన ఆహ్వానము వచ్చుటతో నేను ఈ పిల్లలకు తెలిపి మీరు కూడనూ మిథిలాపురమునకు రండని వారిని పిలిచితిని అంత రాముడు తండ్రి ఆజ్ఞ యజ్ఞసంరక్షణ మాత్రమే కాన మిగిలిన ప్రదేశములకు వెళ్ళుటకు తండ్రి అనుజ్ఞ పొందలేదుకదా" అని తెలిపెను.

అంత నేను వారలకు అత్యంత ప్రియమైన అస్త్రములను గురించి తెలుపుతూ మీ యింట ఒక ధనస్సు కలదనియును, దానిని మీరు చూడవలసినదనియు, ఆ ధనస్సును గురించిన మహత్త్వమును తెలిపితిని. అందుపై వీరలు అత్యంతము చూడవలెనను అపేక్షతో ఇక్కడికి నావెంట వచ్చిరి. కాన వారు పురమును జూచుట గాని మరే యితర వింతలూ, వినోదములూ అనుకూలములూ ఆశించుటకానీ లేదు. అస్త్రములన్న వారలకు అత్యంత ప్రీతి." అని విశ్వామిత్రుడు వారలకేమో తెలుపు చుండగ వాటిని జనకుడు వినక,

అటులయిన తక్షణమే ఆ దివ్యాస్త్రమును యజ్ఞశాలకు తెచ్చు యేర్పాట్లు గావింతును. అని శతానందునితో సంప్రదించి ముహూర్తమును చూచి చెప్పు మనెను. శతానందుడు ఆలోచించుచుండగా,

రామచంద్రుడు "మహారాజా! ఆ ధనుస్సు తమ యింటికెట్లు వచ్చెను. ఆ చరిత్రను తెలిపిన విని ఆనందింతు"నని కోరగనే, "నాయనా! మా పూర్వీకుడగునిమి చక్రవర్తి తరువాత ఆరోతరములో దేవరాతుడు అనే ఆయన రాజ్యము నేలు చుండెను అప్పటిలో దేవతలు శివధనస్సును నిక్షేపముగా నిచ్చిరి. అప్పటినుండియూ అది మా గృహమునందే కలదు. ఇది దేవతల వరప్రసాదము. సామాన్య అస్త్రము కాదని మాత్రము నే చెప్పగలను.

కొన్నివేల బారువుల బరువుగలది. దీనిని యింతవరకూ యెత్తి చూచిన వారు లేరు. అనేక పర్యాయములు దీనిని వంచగల శూరులెవరా అని పరీక్షింపగోరి ప్రదర్శించి చూచితిని. రాజులు, రాకొమరులు విఫలురై వెళ్ళిరి వంచలేకపోవుటే కాక అటూ ఇటూ కదిలించలేకపోవుటకూడను జరిగినది. ఒక దినమున నేను యజ్ఞము చేయ తలంచి భూమిని దున్నుచుండగా నాగటిచాలులోనుండి ఒక పాత్ర వెలువడెను దానినితీసిచూడగా అందులో ఒకసుందర స్త్రీ శిశువు కనిపించెను. ఆ శిశువు నాగటిచాలులో దొరికుటచేత ఆమెకు సీత అని పేరు పెట్టుకొని అల్లారుముద్దుగా సాకు చుంటిమి. ఆమె మహా శక్తివంతురాలు. ఒకనాడు తాను తన పరిచారకలతో ఆడు కొనుచుండగా తన ఆటవస్తువు ఈ ధనుస్సుగల పెట్టెక్రిందకు పోయినది. దానిని

తీయుటకు అనేక పరికరములతో దాదులు ప్రయత్నించిరి కానీ అది మరింత లోనికి వెళ్ళెను. అట్టి తరుణమున నా పెంపుడు కూతురైన సీత చిరునవ్వు నవ్వి దాదులను గేలిచేయుచూ ఒక చేతితో ఆ పెట్టెను జరిపి క్రిందఉండిన ఆటవస్తువును అవలీలగా అందుకొనుటజూచి దాదులుఆశ్చర్యపడి ఆవార్త రాణులద్వారానాకుతెలిపించిరి.

అనాటినుండియు నేను ఆమె శక్తికి తగినవారు చిక్కినప్పుడే వారలకు ఆమెనిచ్చి పెండ్లిచేయవలెనని నిశ్చయించుకొంటిని. ఆమె సౌందర్యమును చూచి పెండ్లాడవలెనని అనేకవేలమంది రాకుమారులువచ్చి ధనుస్సును కదలించలేక సిగ్గుతో వెళ్ళిపోవుచున్నారు.

ఇట్లు అల్పపరాక్రమ సంపన్నులు అనేకమంది ధనస్సును కదల్పలేక అపజయులై నిరాశతో వెనుకకు పోయినవారనేకులు పోయి మిధిలానగరముపై ముట్టడి సలిపిరి. అట్టి నిరాశాపరుల ముట్టడి ఒక సంవత్సరము సాగినది. అందుచే నా సైన్య సామాగ్రి సర్వము నాశనమయినది. ఆసమయమున నేను కొంత దిగులుపడవలసి వచ్చెను. వేరుమార్గములేక దేవతానుగ్రహమునకై తపస్సు సాగించితిని. అంత దేవతలు సంతుష్టులై నన్ను అనుగ్రహించి చతురంగబలాలను ప్రసాదించిరి. అనగా వారలు నాకు తోడయి దుర్మార్గులగు అల్పవీరులను చెదరగొట్టిరి. ఇట్లు అల్పజ్ఞులైన రాజులు నన్నేనేకవిధముల హింసించిననూ, పవిత్రధనుస్సు నన్ను కంటికి రెప్పవలె కాపాడినది. ధనుస్సుయొక్క మహత్తర శక్తులను వర్ణింప నలవి కానివై యున్నవి.

రామచంద్రా! నీ అభీష్టమును నేను కాదనను. నీ వంగీకరింతువేని రేపు తెల్లవారగనే సుముహూర్తమునధనుస్సును యజ్ఞశాలకుతెచ్చు ప్రయత్నములుచేయుచేకాక దానిని యెక్కుపెట్టువారెవరైననూ ఉండిన పూనుకొనవచ్చునని ప్రకటింతును."

అని జనకమహారాజా అధికార రీతిగా ఆడిన మాటలకు రామలక్ష్మణులు ఒండొరులను చూచుకొని విశ్వామిత్రుని ఆజ్ఞకై వేచియుండిరి. అంత విశ్వామిత్రులవారు బాలుర శక్తిసామర్ధ్యములను న్యాయముగా తెలిసికొన్నవాడగుటచే, అందులకు అభ్యంతరములేదని పలికిరి.

అంత జనకమహారాజా దానిని యెక్కుపెట్టినవారికి పూర్వపు నిబంధన ననుసరించి తన ప్రేమపుత్రికయైన సీతను ఇచ్చి వివాహము చేతుననికూడననూ వెల్లడిచేసెను. అందుకును విశ్వామిత్రుడు సంసిద్ధమని అంగీకరించగనే, జనకమహారాజా విశ్వామిత్రులవారి సెలవు బడసి రాజభవనమునకు వెళ్లి ధనస్సును యజ్ఞశాలకు తరలింప తగిన ప్రయత్నములు జరిపెను.

యజ్ఞశాలలో ధనస్సును యెక్కుపెట్టునట్టి విషయమునుకూడనూ వెల్లడి చేయించి కొందరు రాజులకు వర్తమానము లంపెను. మంచి బలమైన వారల ననేక మందిని పిలిపించి యెనిమిది ఇనుప చక్రములతోనున్న భూషణమును బయటికి లాగించుటకు ప్రయత్నము జరిపెను.

అయితే వచ్చినవారలతో అదికదలలేకపోయినది. అందుచేమరింతఒడ్డుపొడుగు గలమరికొంతమందిబలాఢ్యులనుపిలిపించి ఇనుపత్రాళ్ళుకట్టిఅతిజాగ్రత్తగాలాగించెను.

దానిని స్వస్తివాచకములతో యజ్ఞశాలకు గొనివచ్చిరి. తెల్లవారెను నవధ్వనులు మిన్నుముట్టెను. శంఖములు పూరించిరి. మంగళవాద్యములు వాయించిరి. జనకమహారాజు పూజాద్రవ్యములను, పురోహితులను వెంటబెట్టుకొని యజ్ఞశాలకు వచ్చెను. అప్పటికే అనేకమంది రాజులు, మంత్రులు, ఋషులు, పండితులు, మంటపము చేరియుండిరి. మహారాజు యజ్ఞమంటపమును చేరగనే అందరూలేచి నిలువబడిరి. ప్రభు మర్యాదలను పాటించిరి. అంత బ్రాహ్మణులు వేదపారాయణము గావించిరి. మంత్రపుష్పములు మిన్నుముట్టునట్లు యేకకంఠముతో బ్రాహ్మణులు పలుకుచుండ ప్రేక్షకులు మైమరచి ఆనందమయులై కనురెప్పవాల్చక చూచుచుండిరి.

జనకుడు ధనుస్సునకు ప్రదక్షిణముచేసి మంత్రపుష్పములను అర్పించి, నమస్కరించి సభవైపునకు మళ్ళి మహాఋషులకు నమస్కారము, సభాసదులకు నా ధన్యవాదములు. అనేక సంవత్సరములనుండీ మా వంశీయులున్నూ ఇతర రాజులున్నూ దైవ యంత్రమైన ఈ ధనుస్సును గౌరవ భావముతో పూజించుచుండుట యెల్లరకూ తెలిసిన విషయమే. అంతియే కాక, సురాసురులుకాని, యక్ష, రాక్షస, గరుడ, గంధర్వ, కిన్నరమహోరగులుకానీ దీనిని ఎక్కుపెట్టలేక సిగ్గుతో తిరిగి వెళ్ళిపోవుట కూడనూ అనేకమందికి తెలిసిన విషయమే.

కానీ తిరిగి ఈనాడు అట్టి ప్రదర్శనమునకు పూనుకొని నేనీధనస్సును ఈ యజ్ఞశాలకు తెప్పించితిని. ఇందులో యెవ్వరైనను సరియే, దీనిని వంచువారుకాని అల్లెత్రాడును ఎక్కించువారుకానీ, దీనిలో బాణమును కూర్చువారుకానీ, లేక దీని భారమును పరీక్షించు వారుకానీ ఉండిన, ఈశివదేవుని ధనుస్సు ఇప్పుడు తమయెదుట నున్నది. కనుక, నిర్భయముగా ముందుకు రావచ్చును అని నమస్కరించి సింహాసనముపై ఆశీను డాయెను. అంత విశ్వామిత్రుడు రామునివైపు నవ్వుచూ చూడగనే, ఆశీనులైయున్న రాముడు రివ్వునవచ్చి మూయబడియున్న ఇనుపమూతను యెడమ చేతితో తెరచి కుడిచేతితో లోనున్నవింటిని అవలీలగాయెత్తి హస్తమునం దుంచుకొని అటుఇటు పరీక్షించి చూచెను.

ఆదృశ్యము చూచుచున్న మహాఋషులు, రాజులు వేల మహాజనులు ఆశ్చర్య పరవశులై కరతాళములను మిన్నుముట్ట వాయించిరి. ఇంతలో ఆవింటికి ఇట్టే అల్లె త్రాడు ఎక్కించినాడు, సునాయాసముగా బాణము కూర్చినాడు. ఆబాణమును వదలుటకు అల్లెత్రాటిని ఆకర్ణాంతముగా లాగినాడు. అంతట ఆ ధనుస్సు ఫెళ్ళున విరిగి పోయెను.

అది విరుగగనే పర్వతములు పగిలినట్లు ప్రళయ శబ్దము సభాసదులను భయభ్రాంతులుగా జేసెను. కొందరు మూర్ఛ పడిరి. కొందరు భీతిచే అరచిరి. కొందరు పరుగులు తీసిరి. ఋషులు దైవమును తలచిరి. వేయేటికి ఆ సభలో జనకుడు, విశ్వామిత్రుడు, రామలక్ష్మణులు తప్ప అందరూ భయపడిరి.

అంత జనకుడు లేచి విశ్వామిత్రునకు నమస్కరించి, "స్వామీ! ఈ భూలోకమున రామునకు మించిన బలవంతుడు వేరొకడులేడు, ఇంతటి శక్తివంతుడు భూలోకమున ఉండడు అని భావించిన నాకు ఇది పరమానందమును కలిగించినది. దీనిని వంచిన వారికి, నాప్రేమ పుత్రికనిచ్చి వివాహము చేతునని పలికినపలుకు పూర్తి గావింతును, తమ ఆజ్ఞ" అని కోరగనే,

విశ్వామిత్రుడు "జనకా! ఈ వార్తను దశరధమహారాజుకు తెలిపి వారిని రప్పించి మంగళకార్యమును జరుపుట మంచిదని నా ఉద్దేశ్యము. కాన దానికి తగిన ప్రయత్నములు చేయుము. పితృకార్యమును ప్రాణసమానముగా భావించు రాముడు తండ్రి ఆనతిలేక వివాహమును అంగీకరింపడు."అని ఆజ్ఞ ఇచ్చిన వెంటనే బ్రాహ్మణుని పిలచిరి మంత్రులను వెంటపోవునట్లు తగిన ఏర్పాట్లను గావించెను.

తెల్లవారగనే మంత్రులు బ్రాహ్మణులు రథములెక్కి మూడహోరాత్రములు ప్రయాణములు జరిపి నాలుగవనాడు ఉదయము అయోధ్యానగరమును చేరుకొనిరి. నిమిషము ఆలస్యము చేయక రాజభవనము సింహద్వారము చెంతకు రధములు తీసికొని వెళ్ళి నిలిపిరి. అంత ద్వారపాలకులు వచ్చి వారలను విచారింపగా తమ రాకను దశరధమహారాజునకు విన్నవించమని మంత్రులు కోరగనే వెంటనే ద్వారపాలకులు రాజునకు తెలిపిరి. వెంటనే రాజానుమతితో బ్రాహ్మణులు, మంత్రులు రాజభవనమున ప్రవేశించిరి.

వృద్ధుడు అయినప్పటికీ దశరధమహారాజు మిథిలాపుర బ్రాహ్మణులకు మంత్రులకు దేవతుల్యుడుగా తేజోవంతుడుగా కనిపించెను. అంతియేగాక అతనిప్రసన్న వదనమును చూడగనే బ్రాహ్మణులకు మంత్రులకు ఎట్టి జంకూ లేక పవిత్రహృదయముతో నమస్కృతులు చేసి "మహారాజా! మేము మిధిలాధిపతి జనకమహారాజు

దూతలము. మా మహారాజు స్నేహపూర్వకముగా తమ కుశలము రాజక్షేమమును అడిగి తెలిసికోమన్నారు. మహారాజా! తమకు అతి ప్రధానమైన విషయమును విన్నవించుటకు విశ్వామిత్ర మహాఋషి అనుమతితోను శతానందోపాధ్యాయులవారి సమ్మతితోను మా మహారాజు మమ్ములను ఇచ్చటికి పంపటమైనది." అని అతివినయముతో రాజగౌరవముతోను విన్నవించుకొనుచున్న మంత్రులను జూచి దశరథ మహారాజు ప్రశాంతవదనుడై చిరునవ్వులు ఉట్టిపడ

"బ్రాహ్మణోత్తములారా! మంత్రులారా! అయోధ్యా పరిపాలనలో ఎట్టిలోటులును లేక అగ్నిహోత్రాది సత్కర్మలకు యెట్టి అవాంతరములు కలుగక ప్రజాక్షేమమున కెట్టి కొరతలేక ధార్మిక ఆధ్యాత్మిక మార్గములకెట్టి ఇబ్బందులు కలుగక సుక్షేమముగా కాలమును గడుపుచున్నారు. మిథిలాపతి రాజ్యాధిపతియైన జనకుల కుశలములను ప్రజాక్షేమములను అగ్నిహోత్రాది సత్కర్మాచరణాదీక్షను వినగోరుదును. ఎట్టి సందియము నొందక వచ్చిన కారణములను తెలుపవచ్చును. విషయమును వినగోరుచున్నానని దశరథమహారాజు మృదుమధుర వాక్యములతో అనుమతి ఇవ్వగనే మంత్రులు బ్రాహ్మణులకు సైగ చేసిరి. అంత ప్రధాన పురోహితుడులేచి "మహాప్రభూ! మా మహారాజగు జనకభూపతి తమ కూతురగు సీతాదేవికి పరాక్రమమే ఓలియని ప్రతిజ్ఞచేయటము అనేకమంది రాజకుమారులువచ్చి నిర్వీర్యులై విఫలులై పోవటము తమకు తెలిసిన విషయమే అయివుండవచ్చును. తమ పుత్రులు రామలక్ష్మణులు విశ్వామిత్రమహర్షి వెంట దైవికముగా మా రాజధాని నగరానికి మా మహారాజు చేస్తున్న యజ్ఞమునుచూడగోరి రావటము, తమ జ్యేష్ఠకుమారుడగు రాముడు మహావీరుడు, సీతాదేవిని సాధించటము జరిగినది

మహారాజా! ఏమని చెప్పుదుము మహర్షులూ, రాజర్షులూ- రారాజులు. రాజరాజులు చూస్తూవుండగా మహా పరాక్రమవంతుడు రాముడు- శివధనుస్సుభాగమును పట్టుకొని లేవనెత్తి యెక్కుపెట్టెను. అంతియేకాక అతి బరువైన కొన్ని బారువులు తూకముగల ఆ శివధనుస్సును మహావీరుడు రెండు ముక్కలుగా అవలీలగ త్రుంచివేసెను. సీతాదేవికి పరాక్రమమే ఓలి అయినందువలన రామునకు సీతాదేవిని ఇచ్చి పెండ్లి చేయుటకు అక్కడ చేరిన ఋషులూ, మహారాజుగారు నిశ్చయించిరి.

అందుకు తమ అనుమతిని బడయుటకై తమకు స్వాగతము తెలుపుటకై బంధుమిత్రులతో, ఉపాధ్యాయులతో, పురోహితులతో, మంత్రులతో, సపరివారముతో మిథిలాపురమునకు ఆహ్వానించుటకై స్వయముగా మేము వచ్చితిమి. మీ దర్శనముచేసి మా మహారాజు తన కూతురైన సీతాదేవికి వివాహము చేయతలచెను.

ఈ విషయమును మనవి చేయుటకే మమ్ములను మా మహారాజు తమ చెంతకు పంపిరి” అని చేతులుకట్టినిలుచున్న మంత్రులను బ్రాహ్మణులను చూచి దశరథుడు, హృదయమున బాగుగ ఆలోచించి, మారు మాటాడక వసిష్ఠ వామదేవాది మహాఋషులను పిలిపించెను. బ్రాహ్మణోత్తములను రప్పించెను. వారందరూ చేరిన తదుపరి మరొకసారి మిథిలాపుర బ్రాహ్మణులతో విషయమును చెప్పించెను. పూర్తిగ వినిన తరువాత వారల అభిప్రాయములను తెలిసికొనగోరి, దశరథుడు వశిష్ఠులవారికి నమస్కరించి, తమ అంగీకారమును తెలుపగోరెను.

అంత వసిష్ఠవామదేవాదులు, శుభం శుభం అని అమితోత్సాహముతో ఇందులకింకనూ యోచించెదరెందుకు మిథిలాపుర ప్రయాణమునకు సర్వసిద్ధము గావించుడని వారు జవాబు చెప్పిరి. మంత్రులు గంతులు వేసిరి. క్షణములో అయోధ్యానగరమంతయూ అంతఃపురమంతయూ రామకల్యాణవిషయమువ్యాపించెను.

పురజనులు జై జైలు చెప్పిరి. పరివారము ప్రయాణమునకు సర్వసిద్ధము గావించిరి. ఆభరణములూ, పట్టు పీతాంబరములూ, బహుమతులూ మితిమీరునట్లు సిద్ధపరచిరి రథములు నింపిరి. రాజు కులగురువులైన వసిష్ఠుడు, పండితులు, బ్రాహ్మణోత్తములు, మంత్రులు వారి వారి రథములు వారు అలకించిరి. అయోధ్యయే కదలివచ్చుచున్నదా అన్నట్లు అందరూ ప్రయాణములైనవారే. అందరికీ అన్ని విధముల దశరథుడు యేర్పాటు చేయించెను.

వాయువేగముతో గుఱ్ఱములుకూడనూ అమిత ఉత్సాహముతో అలసటన్నది యెరుగక పరుగెత్తజొచ్చెను. రెండు రాత్రులు, రెండు పగళ్ళు, ప్రయాణమయి మూడవరాత్రికి మిథిలాపుర సింహద్వారమును ప్రవేశించగనే,

జనకమహారాజు, స్వాగతము చెప్పెను. మంత్రులను, పురోహితులనూ, మహాఋషులనూ తగినరీతుల సత్కరించెను. ఆ రాత్రి వారు పూర్తిగ విశ్రాంతి తీసికొనుటకై తగిన యేర్పాట్లుచేసి వారివారికి తగిన వసతి గృహముల యేర్పరచిరి.

తెల్లవారగనే, దశరథమహారాజు ఋత్విజులూ, బంధువులూ, మంత్రులూ మొదలయిన వారలను పిలిపించెను. ఏ నిమిషమున హాజరుకావలెనో సర్వులూ సంసిద్ధులై యుండవలెనని హెచ్చరించెను. ఇంతలో జనకమహారాజు, దశరథమహారాజు విడిది గృహమునకు వచ్చి వెంటబెట్టుకొని యజ్ఞవాటికకు గొనిపోయెను. గురువులకూ, మంత్రులకూ, మహారాజుకు, పరివారమునకు, వారి వారి హోదాలకు తగినట్లు ఆయజ్ఞవాటికపై ఆసనములను అమర్చియుంచిరి. అక్కడందరు ఆశీనులై యుండ, జనకమహారాజు, దశరథ మహారాజునకు స్వాగతమును తెలుపుతూ,

"మహారాజా! మా భాగ్యమా అన్నట్లు తాము మహర్షులతో బ్రాహ్మణోత్తములతో పరివారముతో మిథిలాపురము రావటము మా పుణ్యపరిపాకమని భావించుచున్నాను. మీ పుత్రుని పరాక్రమ విజయమునకు తాము మనసారా సంతోషించితిరన్నచో వేరు చెప్పనక్కరలేదు. అమిత పరాక్రమవంతులు పుట్టిన, రఘువంశమువారితో ఇప్పుడు వియ్యము అందబోతున్నాను. ఇపుడు నా వంశము మరింత పూజనీయము కాబోవుచున్నది. ఇది మా పూర్వీకుల పుణ్యఫలమనే భావించెదను.

"మహారాజా! రేపటితో మేము సంకల్పించిన యజ్ఞము సమాప్తము అయిపోవుచున్నది. అంతట మహర్షుల సమ్మతితో సీతారాముల వివాహము చేయతలంచితిని. మీ అనుజ్ఞ బడయగోరుచున్నానని జనకుడు తెలుపగనే దశరథమహారాజు పట్టలేని ఆనందములో చిరునవ్వులు ఉలికిపోవ, "రాజా! తాము దాతలు, దానము దాని విశేషమని పెద్దలు తెలుపుదురు. అందువలన తాము ఎప్పుడు ఏది ఇస్తామంటే అప్పుడు అది పుచ్చుకొనుటకు సంసిద్ధులమై యున్నాము" అని అన్నారు.

దశరథ మహారాజు ఇంత చమత్కారముతో తియ్యని మాటలతో హృదయములు కరుగునట్లు మాట్లాడుటచేత జనకుడు పట్టలేని ఆనందముతో ఉప్పొంగిపోయెను. అంత రామలక్ష్మణులు, విశ్వామిత్రులతో వచ్చి తండ్రికి, వశిష్ఠ వామదేవాది మహర్షులకు నమస్కరించి, దశరథుడు కన్నులు కాయలు కాచినట్లు ఇరువురు పుత్రులనూ దగ్గర తీసుకొని శిరస్సులను ముద్దాడి, భుజములపై చేతులు వేసుకొని వక్షస్థలమునకు తనివితీర బిగించుకొని పడుచున్న ఆనందమును, చేరిన బ్రాహ్మణులూ, మంత్రులూ చూచి దశరథునకుగల పుత్రవాత్సల్యమునకు తన్మయులయిరి, ఆశ్చర్యపడిరి.

దశరథ మహారాజు పుత్రులతో ముచ్చటలాడుచూ అయోధ్య వదలినది లగాయతు విశ్వామిత్రమహర్షి యాగసంరక్షణ విశేషములు తదుపరి మిధిలాపురికి విచ్చేసిన వివరములూ రామలక్ష్మణులు చెప్పుచుండ వశిష్ఠ వామ దేవాది మహాఋషులతో భరత శత్రుఘ్న సుమంత మొదలగు వారలతోకూడి దశరథుడు అత్యంత ఆనందముతో వినుచూ ఆ రాత్రి గడిపెను. ఇటు జనకమహారాజు వివాహ ప్రయత్నములలో నిమగ్నుడై నాడు.

తెల్లవారినది. జనకమహారాజు తమ ప్రధాన పురోహితుడైన శతానందుణ్ణి రప్పించి వివాహసంబంధమైన విషయమును కొంత ఆలోచించవలెనని, అతివినయముతో ప్రార్థించినాడు. అంత శతానందుడు "మహారాజా! నేడే యజ్ఞము పూర్తిఅయి

నది. రెండు మూడు దినములలో ముహూర్తములు మంచివిగనే యున్నవి. తాము అనుమతించిన నేను వివరింతు"నని తెలుపగనే,

జనకమహారాజు చేతులుకట్టి, "స్వామీ! నిన్నటి రాత్రి దశరథమహారాజు అనుజ్ఞ పొందగలిగితిని. ఇది నా భాగ్యము. అయితే, నా అనుంగుతమ్ముడైన కుశధ్వజుడు ఇక్కడలేడు. మన యజ్ఞమునకు సంబంధించిన సామగ్రులు తగిన రీతుల అందించుటలో అతి శ్రమపడెను. అతనులేక ఈ మంగళకార్యమును చేయుటకు నా మనస్సొప్పకున్నది. ఈ వేడుకలలో అతను కూడనూ భాగము వహించవలసి యున్నది. కాన నా తమ్ముని రప్పించుటకు తగిన ఏర్పాట్లు చేసితిని. అతను వచ్చిన తదుపరి లగ్నము నిర్ణయించుట మంచిది, అని ప్రార్థింపగనే, శతానందుడు మంచిది మంచిది అమితానందమని వెళ్ళిపోయెను.

జనకుడు నాలుగువైపులా దూతలనుపంపి అతి శీఘ్రములో తన తమ్ముని తోడ్కొని రమ్మనమనెను. అతి వేగముతో పయనించు గుఱ్ఱములపై అనుకొన్న కాలమున కంటే అతి శీఘ్రముగ సాంకాస్యపట్టణము చేరుకొనిరి. కుశధ్వజ మహారాజునకు మిథిలాపుర వృత్తాంతమంతయూ వివరముగా తెలియజెప్పిరి. అంత కుశధ్వజుడు పట్టరాని ఆనందముతో సపరివారముతో కానుకలు కావలసినన్ని రథముపై నుంచుకొని రాత్రికి రాత్రి బయలుదేరి మిథిలాపురము చేరుకొనిరి.

అతనికై నిమిషములు లెక్కించుచున్న జనకుడు తన తమ్ముని చూడగనే తమ్ముని కౌగిలించుకొని ఆనందించెను. కుశధ్వజుడు అన్నగారికి నమస్కరించి తదుపరి శతానందునికి నమస్కరించి, ఉన్నతాసనములపై ముగ్గురూ కూర్చొనినారు. అన్నదమ్ములు ఇరువురూ అన్ని విధములా ఆలోచనలు జరిపిరి. ఒక నిర్ణయమునకు వచ్చిన తోడనే,

శ్రేష్ఠుడైన సుధామనునిపిలిపించి మంత్రినీవువెంటనేవెళ్ళి దశరథమహారాజును వారి మంత్రివర్గమును, పురోహితులతో, గురువులతో, ఇంకనూ వారలకు ప్రధానులయిన వారలను సగౌరవముగాప్రార్థించి ఇక్కడికితోడ్కొనిరమ్ము అనిఆజ్ఞచేసెను.

సుధామనుడు తగినవారలను చేర్చుకొని రథమును తీసికొని దశరథమహారాజుగారి విడిదికిచేరి జనక మహారాజుగారి అభిప్రాయమును దశరథమహారాజునకు విన్నవించి, వినయ విధేయతలతో వారిని ఆహ్వానించిరి. సిద్ధముగనేయున్న దశరథమహారాజు గురువులతో మంత్రులతో పురోహితులతో బయలుదేరి జనకమహారాజు దర్బారు హాలునకు చేరిరి. ఒకరికొకరు తగురీతుల వందనములు సలిపి ఉన్నతాసనముపై కూర్చుండగనే,

దశరథమహారాజు లేచి, "జనకా! వశిష్ఠమహర్షి మా ఇక్ష్వాకువంశీయుల ఇల వేల్పు, మా పరమగురువు సమస్త విషయములకూ అతనే మావక్త. ఆ మహానుభావుడు మా వంశ క్రమాన్ని గురించి చెప్పగలడు," అనిపలికి తాను కూర్చొనెను. వశిష్ఠులవారు లేచి,

"రాజర్షీ! సభాసదులారా! బ్రహ్మ అవ్యక్త ప్రభువు. నిత్యుడు.నిర్మలుడు. అట్టి బ్రహ్మదేవుడు మనసాసంకల్పించి ఈ భూలోకములో మరీచి అనే స్వరూపమును జన్మింపజేసెను ఆ మరీచికి కాశ్యపుడు పుత్రుడుగా కలిగెను. కాశ్యపునకు సూర్యుడు, సూర్యుని కుమారుడే మనువు. ఈమనువునకు వైవస్వతమనువు పుట్టెను. అతనే ప్రజాపాలనమొనర్చి ప్రజాపతి అను సార్థకనామమును అందుకొనెను.

అతని పరిపాలనా సమయమున, అతనికి ఇక్ష్వాకుడు పుట్టెను. అయోధ్యను పాలించిన వారిలో మొదటివా డితడు. అందువలననే అయోధ్యా రాజులకు ఇక్ష్వాకు వంశమువార లనుపేరు శాశ్వతముగా నిలిచిపోయెను. ఆ ఇక్ష్వాకునకు కుక్షియున్నూ, కుక్షికి వికుక్షియున్నూ, వికుక్షికి అమిత తేజోవంతుడున్నూ శౌర్య పరాక్రమవంతుడున్నూ అయిన బాణుడు జన్మించెను. అతనికి అనరణ్యుడున్నూ, అతనికి పృథువున్నూ పృథువునకు త్రిశంకుడున్నూ త్రిశంకువుకు దుందుమారుడున్నూ దుందుమారునకు యువనాశ్వుడున్నూ యువనాశ్వునికి మాంధాతయున్నూ మాంధాతకు సుసంధియున్నూ సుసంధికి ధృవసంధి ప్రసేనజిత్ అనే ఇరువురు పుత్రులున్నూ పుట్టిరి. ధృవసంధికి మహాయశస్వి అయిన భరతుడు పుట్టెను.

అతనికి అసితుడు పుట్టెను. అతడు పరిపాలన చేయుచున్న సమయమున హైహయులూ, తాలజంఘులూ, శశిబిందువులూ దండయాత్ర సలిపి అసితుని ఓడించిరి. అంత అసితుడు ఇరువురు భార్యలతో హిమవత్పర్వతమునుచేరి అక్కడ భృగుప్రస్రవణము అనే ప్రదేశమున నివాసము చేసెను. అతను కొంతకాలమునకు కాలధర్మము నొందెను.

అతను కాయమును వీడునప్పటికి అతని ఇరువురు భార్యలూ నవమాసములతో యుండిరి. వారు ఆ అరణ్యమున ఒంటరి జీవితములు గడుపలేక చెంతనే యున్న భృగుమహర్షి వంశీయులయిన చ్యవనమహర్షి వారి ఆశ్రమమును చేరిరి. అతనికి నమస్కరించి వారల బాధలను అతనికి విన్నవించుకొనిరి.

అంత చ్యవనుడు వారలపై దయతలచి "అమ్మలారా! భయపడకుడు. ఇది మీ గృహము. త్వరలోనే మీ గర్భమున అతితేజోవంతుడు, బలవంతుడు, శ్రీమంతుడు అయిన శిశువు కలుగగలడని ఆశీర్వదించెను. అంత కొంతకాలమునకు పెద్ద

భార్యకు కొమారుడు కలిగెను. అతనే సగరుడు. అతను అయోధ్యా రాజ్యమునకు చక్రవర్తి ఆయెను.

అతనికి అశ్వమంజుడు కలిగెను. అశ్వమంజునకు అంశుమంతుడు, అంశుమంతునకు దిలీపుడున్నూ, దిలీపునకు భగీరథుడున్నూ, భగీరథునకు కకుత్థ్సుడున్నూ, అతనికి రఘువున్నూ, రఘువునకు ప్రవృద్ధుడున్నూ పుట్టెను. అతనికి సుదర్శనుడున్నూ, సుదర్శనునకు అగ్నివర్ణుడు, అగ్నివర్ణునకు శీఘ్రగుడున్నూ, శీఘ్రగునకు మరువున్నూ, మరునికి ప్రశుశ్రుకుడున్నూ, ప్రశుశ్రుకునికి నహుషుడున్నూ, అతనికి నాభాగుడున్నూ, నాభాగుడికి అజుడున్నూ పుట్టిరి. ఆ అజమహారాజు ప్రథమ పుత్రుడే దశరథ మహారాజు.

ఇతని పుత్రరత్నములే శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు. శివధనుస్సును ఎత్తివిరిచిన శ్రీరాముడు ఈతని జ్యేష్ఠపుత్రుడు. రాజర్షీ! వారిది పరమశుద్ధ వంశము. ఈ వంశమున పుట్టినవా రందరూ తేజోవంతులు, మహాధార్మికులు, ఆధ్యాత్మిక చిత్తులు, వీరాగ్రేసరులు. రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు ఈ వంశమునకు కులదీపకులు. ఇంతేకాక, రాములతోపాటు ఏతెంచిన బింబ ప్రతిబింబముగా మెలగిన రామలక్ష్మణుల కిరువురికీ ఒకేపరి మంగళ కార్యము జరిగిన బాగుండునని మా ఉద్దేశ్యము. తమకుగల ఇరువురు బిడ్డలైన సీత ఊర్మిళా ఈ రామలక్ష్మణులకు తగినవారలు. ఇందులకు సంశయించక ఈ శుభకార్యమునకు తగిన నిర్ణయమును గావించుడు. అని వశిష్ఠులవారు అందరినీ ఆశీర్వదించి ఆసనముపై కూర్చొనెను.

అంత వశిష్ఠులవారు ఇక్ష్వాకువంశకర్తలను గురించి చెప్పిన తరువాత జనకుడులేచి ఓ బ్రహ్మర్షీ! కులీనుడు కన్యాదానముచేయ తల పెట్టినప్పుడు తన వంశమును గురించి చెప్పుకొనవలసియున్నది కదా? మా వంశమును గురించి నేనే స్వయముగా తెలుపతలంచితిని ఇది నాకు పరమానందము మా వంశమును ఇతరులచేత వర్ణింపజేయుట నాకంత తృప్తికాదు. ఆ వంశమును ఆ వంశమునకు సంబంధించిన ఈ దేహముతోనే వర్ణించిన నాజన్మ సార్థకము కాగలదు. ఇది నా వంశీయులకు తెలుపవలసిన కృతజ్ఞతగా భావించుచున్నాను. అనుజ్ఞ దయచేయుడు, అని ప్రార్థించెను.

వశిష్ఠులవారు అనుజ్ఞ ఇచ్చుటతోడనే బ్రహ్మర్షీ! గురువర్యులారా! దశరథ మహారాజా! పూర్వము నిమి అను చక్రవర్తి పరమధార్మికుడై మహా బలవంతుడను ప్రసిద్ధిగాంచెను. అతనికి మిథి అను పుత్రుడు పుట్టెను. ఆ మిథియే ఈ మిథిలానగరమును నిర్మించెను. అతనే ఈ రాజ్యమునకు ప్రథమ మహారాజు. అతని పరి

పాలించి ప్రజాహితము పొందకొనెను. అతనికి ఉదావసుడు పుట్టెను. ఉదావసునకు నందివర్ధనుడు, నందివర్ధనునకు సుకేతుడు, సుకేతునకు దేవరాతుడు, దేవరాతుడు మహా బలవంతుడని, ధార్మికుడని, రాజర్షియని ప్రసిద్ధికెక్కెను.

ఆ దేవరాతునకు బృహద్రథుడు, బృహద్రథునకు మహావీరుడు పుట్టెను. మహావీరుడు నిజముగా మహావీరుడే. అతనికి సుధృతి, సుధృతికి ధైర్యవంతుడు అయిన దృష్టకేతుడు, దృష్టకేతునకు హర్యశ్వుడూ అతనికి మరువు.

మరువుకు ప్రతీంధకుడు, ప్రతీంధకునికి కీర్తిరథుడు, కీర్తిరథునకు దేవమీఢుడు, అతనికి విబుధుడు విబుధునికి మహీధ్రకుడు, మహీధ్రకునికి కీర్తిరాతుడు, అతనికి మహారోముడూ, మహారోమునికి స్వర్ణరోముడూ, స్వర్ణరోమునకు హ్రస్వరోముడూ పుట్టెను. అతడు మహామేధావి, మహాత్ముడు, ధార్మికుడు. అతనే మాతండ్రి. అతని జ్యేష్ఠపుత్రుడనని చెప్పుకొనుటకు నేనెంతయో సంతసిల్లుచున్నాను.

నేనే ఈ మిథిలారాజ్యమును పరిపాలించుచున్నానన్నది నాపూర్వీకుల ధార్మిక ఫల విశేషమే అని చెప్పక తప్పదు. ఇట్లుండ నా తమ్ముడైన కుశధ్వజుడు దేవసమానుడు. అతనిని నేను సోదరభావమునకు మించిన భావముతో స్నేహితునివలె స్వాతంత్ర్యము నిచ్చి పెంచి పెద్దవాణ్ణి చేసితిని. కొంతకాలము జరిగిన తరువాత, సాంకాస్యపట్టణమును ఏలుచున్న సుధన్వుడను రాజు మిథిలాపురమును ముట్టడించెను. నా యింటిలోనున్న శివధనుస్సును తనకివ్వమని రాయబారము పంపెను. అందుకు నేను నిరాకరించితిని. ఆ కారణముచేత మా కిరువురికీ ఘోరయుద్ధము జరిగెను. తత్ కారణముగా నేను సుధన్వుణ్ణి హతమార్చితిని.

అపుడు సాంకాస్య పట్టణము నా వశమగుటచేసి ఆ రాజ్యమునకు నా తమ్ముడైన కుశధ్వజుణ్ణి రాజుగాచేసితిని ఆ పట్టణము ఇక్షుమతీ నదీతీరమున శోభాయమానముగా నున్నది. అది దూరమునకు పుష్పకవిమానమువలె కనిపించును. నా తమ్ముడు ధార్మికుడు అతనిప్పుడు సాంకాస్యపట్టణమును పాలించుచున్నాడు. అతని నిప్పుడు ఈ వేడుకలలో పాల్గొను నిమిత్తము రప్పించితిని.

బ్రహ్మర్షీ! తాము నా ఇరువురు కుమార్తెలను రామలక్ష్మణులకిచ్చి వివాహము చేయమని ఆజ్ఞాపించితిరి. చాల సంతోషము. సీతదేవకన్యక కనుక అది వీర్యశుల్క. దానిని రామచంద్రునకిచ్చి వివాహము చేయుటకు నిర్ణయమయినది. నా రెండవ బిడ్డను ఊర్మిళను లక్ష్మణునకిచ్చి వివాహము చేయుటకు తమ ఆజ్ఞను శిరసావహించితిని. కానీ మరొక విషయమును మనవి చేయనెంచితిని. అదేమన,

దశరథమహారాజా! ఈనాడు మఘానక్షత్రము రామలక్ష్మణులకు వివాహము జరుప్పటకు తమరు నాందీకి సిద్ధము కావలెను.

తమకు సల్గురు పుత్రరత్నములు. ఒకే అనుగ్రహముచే కల్గినవారగుటచేత మిగిలిన ఇరువురు అవివాహితులై యుండుట వారలకు కొంత అసంతృప్తి కలిగించి నటులగును. కాన యెల్లుండి ఉత్తరఫల్గుణీ నక్షత్రములో మిగిలిన భరత శత్రుఘ్ను లకు నాతమ్ముడైన కుశధ్వజుని కుమార్తెలయిన మాండవి, శృతకీర్తులను ఇచ్చి వివాహము జరుపవచ్చును. అనుజ్ఞ దయచేయుడని జనకుడు కోరగనే సభాజనులు శుభం శుభం అని కరతాళములు మిన్నుముట్టగొట్టిరి.

జనకమహారాజా అందించిన సలహాను పురస్కరించుకొని భరత శత్రుఘ్నుల వివాహములో వశిష్ఠ, వామదేవ, విశ్వామిత్రాదులు కొంత దీర్ఘముగా ఆలోచించి, దశరథుని యొప్పించి జనకమహారాజాతో ఈ విధముగా తెలిపిరి.

రాజా! ఇక్ష్వాకు విదేహవంశాలు రెండునూ ఎవరునూ ఊహించరానంతటి పవిత్రమైనవి. ఈ రెండు వంశముల గొప్పతనాన్ని ఎవరూ ఇంత అంత అని వర్ణించలేరు. ఈ రెండు వంశములకు సరిసమానమైన వంశములు ఈ జగత్తున యెందునూ లేవనియే మా భావము. ఈ రెండు వంశముల వారికిన్నీ వివాహరూప మయిన ధర్మసంబంధము యేర్పడుచున్నది. ఇది యెంతయో సమంజసముగానూ, వైభవముగానూ, ఘనతగానూ, పవిత్రముగానూ ఉన్నది. ఇంతియేకాక వధూవరులు సరిసమానమయిన రూపలావణ్యులు.

ఓ జనకరాజా! మీ తమ్ముడు కుశధ్వజుడు, ధర్మజ్ఞుడు. ఆయనకూడనూ దశరథమహారాజాతో సంబంధము చేయుట ఉచితము. పరమానందము. అతని బిడ్డలైన మాండవి శ్రుతకీర్తులను మేము భరత శత్రుఘ్నులకు చేసుకొనుటలో సంసిద్ధులము. ఈ రెండు వంశములూ వియ్యము నంది చుట్టరికముతో కట్టుబడి పోవలెననియే మా కోరిక.

అని వశిష్ఠ విశ్వామిత్రులు చెప్పిన సమాధానమునకు జనకమహారాజు. కుశధ్వజుడు అమితానందముతో మహాఋషులకు నమస్కరించి మా పుణ్యము కొలది మా ఇరువురి అన్నదమ్ములకు ఇక్ష్వాకులతో సంబంధము చేయవలెనని మహాఋషులకు సంకల్పము కలుగుట ఇది సామాన్యముకాదు. జన్మాంతర పుణ్యవిశేషము తోడు కాకున్న మహాఋషులకు సంకల్పములు కలుగవు. తమ ఆజ్ఞలను మేమిరువురము శిరసావహింతుము, అని కృతజ్ఞతా పూర్వకముగా నమస్కరించగనే,

వశిష్ఠులవారు లేచి తిరిగి యెల్లుండి యెల్లుండి అను వాయిదాలు వేయక రేపే

మంచి ముహూర్తముకనుక నలుగుర అన్నదమ్ములకు ఒకేసారి వివాహము చేయుట చాలా మంచిదని సలహా యిచ్చెను. అంత జనకుడు మేము ధన్యులము. దశరథమహారాజు నేనాటినుండియో తమకు శిష్యుడై ఆజ్ఞలు పాటించుచున్నాడు. మేము అన్నదమ్ములము. ఇదివరకునూ ఈనాటినుండియూ తమ ఆజ్ఞకు బద్ధులమగువారము. కాని మా మువ్వురి బాధ్యతలను తామే వహించి యేమి చేయవలెనన్న అవి చేయుటకు సంసిద్ధులము చేయించే భారము తమదేనని చేతులు కట్టుకొని నిలువబడెను.

ఇంతలో దశరథమహారాజు లేచి, మిథిలాపతీ! మీ అన్నదమ్ముల సద్గుణములను వర్ణించలేను. ఇంతమంది మహాఋషులను, ఇంతమంది రాజపుంగవులను, ఇంతమంది మహారాజులను ప్రజాకోటిని మీరు కాబట్టి సత్కరించగలిగినారు. నేను ఇపుడే విడిదికి వెళ్ళి నాందీ సమావర్తన కర్మలను యథావిధిగా పూర్తిచేయింతును, సెలవిండని కోరగనే జనకుడు కుశధ్వజుడు వారికి వీడ్కోలు చెప్పి తమ తమ కార్యక్రమములకు లోనికి వెళ్ళిరి.

దశరథమహారాజు నాందీ కార్యాదులు శాస్త్రవిహితముగా యొనర్చెను. తెల్లవారి నలుగురు కుమారులచేతనూ సమావర్తనకర్మ చేయించెను. అనేకవేల గోవులను బంగారు కొమ్ము కుప్పెలతో అలంకరించి, పాలు పిండుకొనువారలకు మంచిపాత్రలను సిద్ధపరచి కుమారులచేత ఆ పాత్రలనూ, గోవులనూ బ్రాహ్మణులకు దానము చేయించెను.

ఆ సుందర దర్శనము కన్నులపండువుగా నుండెను. మిథిలాపుర జనులకు నలుగురు దిక్పాలకుల మధ్య ప్రసన్న తేజోవంతముగా విలసిల్లు బ్రహ్మదేవునివలె దశరథుడు కనిపించెను. ఇట్లు గోదానము జరుగుచుండగనే కేకయ రాజపుత్రుడయిన యుధాజిత్ వేంచేసెను.

అతడు కైక సోదరుడు. భరతుని మేనమామ. ఈ వైభవములుచూచి, కుశల ప్రశ్నలు అడిగిన తరువాత మా నాన్నగారు మనుమని చూడవలెనని చాలా కుతూహలపడుచున్నారు. అందుకొరకై నేను అయోధ్యకువచ్చితిని. అక్కడ రామకల్యాణ వార్తవిని ఇచ్చటికి హుటాహుటి పరుగెత్తి వచ్చితిని. రామకల్యాణవార్త నాన్నగారికి తెలియదు. రామకల్యాణం చూచినట్లునూ, తమరిని దర్శించినట్లునూ మా నాన్నగారికోరిక తెలుపునట్లునూ అన్నియూ, జరుగునని తలంచి నేను మాత్రమే కల్యాణమునకు రాగల్గితిని. అందులకు దశరథమహారాజు యెంతయో సంతసించెను.

ఆ రాత్రి దశరథమహారాజు కొడుకులతోను, బంధుమిత్రాదులతోనూ అనేక

రకముల ఆనంద విషయములను ముచ్చటించెను. విడిదిలో ఎవ్వరును నిద్రించలేదు. ఎప్పుడెప్పుడు తెల్లవారునా మా చిన్న ప్రభువుల కల్యాణము మేమెపుడు చూతుమా అని అమితోల్లాసముతో యెవరికివారు తమ ఇండ్లలో పెండ్లిండ్లు జరుగుచుండినటుల భావించి బ్రహ్మానందము పొందుచుండిరి. మరునాడు ప్రభాతకాలమున సమస్త కర్మలూముగించుకొని మహాఋషులవెంట జనకమహారాజు యజ్ఞశాలకుబయలుదేరెను.

రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు మంగళస్నానములుచేసి, పీతాంబరములు ధరించి తలపాగాలుకట్టి తురాయిలు, వజ్రవైఢూర్యములు పొదిగించబడిన అనేక ఆభరణములను ధరించి దివినుండి దిగివచ్చిన దేవసుందరులవలె తేజోమానులై ప్రకాశించుచూ విజయము అను ముహూర్తములో అనేక మంగళ వాద్యములు మిన్నుముట్టుచుండ ఈ రాకుమారులు యజ్ఞశాలకు నడచినారు. వారివెంట మంత్రులు, సామంతులూ, పరివారమూ, పెండ్లికి కావలసిన సామాగ్రితో, ఆభరణములతో, పీతాంబరములతో, ధనరాసులతో బయలుదేరిరి. వారు వీధివెంట మంటపమునకు వచ్చుచుండ,

మిథిలాపుర జనులు వీధులునిండి రెప్పవాల్చక వారలవైపు చూచుచూ ఆహా ఎంత సుందరులు! వీరు నిజముగా సామాన్య మానవమాత్రులు కారు, దేవలోకము నుండి అరుదెంచినారా అన్నంత ఆశ్చర్యమును పొందిరి. ఒకరితో ఒకరు గుసగుసలు. ఇంతటి చక్కని రాకొమారులను మేమెపుడు చూడలేదని స్త్రీలు అమితానందము నొందిరి- మిద్దెలు కిటికీలు వీధులూ క్రిక్కిరిసిపోయెను. ఇట్టి సుందర విగ్రహాలు మంటపమును చేరిరి.

అంత జనకమహారాజు మందహాసముతో తన తమ్ముడైన కుశధ్వజునితో తమ పుత్రికారత్నములను మంగళ స్నానములు చేయించుకొని పెండ్లికుమార్తెలుగా తయారుచేసి మేలిముసుగులు ధరించి వారివెనుక వచ్చుచుండుట వారలవెనుక వేలాది దాసీలు పెండ్లికి సంబంధించిన ఫలపుష్పాదులు, పసుపుకుంకుమలు, అక్షతలతో, ఆభరణాలతో, పీతాంబరాలతో కదిలివచ్చుచుండ మిధిలాపురము పూర్తికదలివచ్చినట్లుండెను. నలుగురు కన్నియలు నాలుగు దీపములవలె వెలుగుచుండిరి.

ఒకవైపున రామలక్ష్మణులు భరతశత్రుఘ్నులును మరొకవైపున సీత ఊర్మిళ మాండవి శ్రుతకీర్తులును పీఠభూములపై ఆశీనులయిరి. ఇరువురికి మధ్య మంచి మల్లు వస్త్రము అడ్డుపట్టిరి. అయోధ్యవాసు లందరూ దశరధ మహారాజువైపునా మిథిలానగర ప్రజలు జనకునివైపునా ఆశీనులైరి.

పెండి పందిరిని అనేక విలువైన ఆభరణాదులతో అలంకరించిరి. చూచుటకే మిలుమిట్లు గొల్పెను. వచ్చినవారల దృష్టి పెండ్లిపందిరిమీదనే యుండెను. అంత ఆకర్షణీయముగా శృంగారించిరి. వేలాది బంధుమిత్రులు చేరిరి. నిజముగా ఆనాడు మిథిలాపురికే కల్యాణమన్నట్టు తోచెను.

ఇంతలో దశరథుడులేచి ఇంక ఆలస్యమెందుకు అని వశిష్ఠులవారితో మనవి చేయగా జనకమహారాజు చేతులు జోడించుకొని వశిష్ఠులవారిని ప్రార్థించి ఈకార్యము తామే చేయించవలెనని యర్థించెను.

అంత వశిష్ఠులవారు విశ్వామిత్రుని,శతానందుని,తన వెంటపెట్టుకొని పండితులు వేదమంత్రములుమిన్నుముట్టుచుండ అగ్నివేదినిఏర్పరచినారు. గంధపుష్పాలతోనున్న సువర్ణపాలికలను మొక్కలున్న అడుగులేని పాత్రలను మొలకలుఎత్తిన మూకు ళ్ళను ధూపాలను హోమముచేసే స్రుక్సువాలను అర్ఘ్యజల పాత్రలను, పేలాలున్న పాత్రలను వేదికచుట్టూ చక్కగా అమర్పింపచేసినారు. వేదిక మధ్యభాగమున అగ్ని హోత్రము నుంచినారు. హెచ్చు తగ్గులు లేకుండా సరిసమానముగానున్న దర్భలను యథాశాస్త్రీయముగా సమంత్రకముగా పరచినారు. వధూవరుల అభ్యుదయము కోస రము వైదిక మంత్రాలతో హోమము చేయసాగినారు. ఒకదానిపై ఒకటి చేయించ వలసిన వేదవిహిత కర్మలు సక్రమముగా చేయించి కంకణములు కట్టించినారు.

కన్యాదానమునకై తగిన ఏర్పాట్లుచేసి జనకమహారాజుగారిని వశిష్ఠులవారు ఆహ్వానించగా జనకుడు సర్వాభరణధారుడై హోమవేదికకు వచ్చెను.

అంత వశిష్ఠులవారి ఆజ్ఞానుసారము సీత చేతులు తీయించి రాముల దోసిట ఉంచి నారికేళము హస్తమునందుంచి క్షీరమును విడచుచూ జనకమహారాజు నేత్ర ములనుండి ఆనందభాష్పములు కార్చుచూ, రామా ఇదిగో సీత నా కూతురు. ఇక నీకు సహధర్మచారిణి. సమ్మతించవలెను. నీకు శుభము, నీ చేతితో ఈమె చేయి పట్టుకో. ఈమె మహాగుణవంతురాలు, ఇకపై నీవెంట నీ నీడవలె తిరుగుతుంది. అంటూ రాముని చేతిలో సమంత్రకముగా నీరు వదలినాడు. జనకుడు మంత్రోదకా లతో సీతను రామునికి అప్పజెప్పెను.

అంత తిరిగి లక్ష్మణునిచెంతకు వచ్చి, ఓ లక్ష్మణా! నీకు ఈ ఊర్మిళను ఇచ్చుచున్నాను, అంగీకరింపుము. అని మంత్రోదకాలతో ఊర్మిళను లక్ష్మణునకు అప్పజెప్పెను. భరతుని దగ్గరకు వచ్చి, అక్కడకూడనూ మంత్రోదకాలతో మాండ విని భరతునకు అప్పజెప్పెను. తిరిగి శత్రుఘ్నుని దగ్గరచేరి మంత్రోదకాలతో శ్రుతకీర్తిని అప్పజెప్పెను. తదుపరి చేయవలసిన పద్ధతులు పండితులు చేసిరి.

ఆ మంటప మధ్యస్థానమున జనకుడు మెరయుచూనిల్చి "ఓ సౌమ్యులారా! మా కూతుళ్ళు మీకు ఇల్లాండ్రు అవుతున్నారు. ముహూర్తానికి ఆలశ్యములేదు, అని అనుచుండగనే వశిష్ఠులవారి అనుమతితో ఆ నల్గురు అన్నదమ్ములూ ఆ నల్గురి అక్కచెల్లెండ్ర చేతులూ పట్టుకొని అగ్నిహోత్రానికి ప్రదక్షిణముచేసి తదుపరి జనకమహారాజునకు, మహర్షులకు ప్రదక్షిణచేసి నమస్కరించిరి.

వారు నమస్కరించుచుండగా పుష్పవర్షము కురిసెను. మంగళవాద్యములు మ్రోగెను. సభాసదులు అక్షతలు జల్లిరి. మిన్నుమిట్టునట్లు శుభం శుభంఅను శబ్దము కర్ణానందముగా మ్రోగెను. దేవదుందుభులు మ్రోగెను. అప్సరసలు పాడిరి. దాసీలు గౌరికళ్యాణమే అను మంగళగీతమును వివిధ స్వరములతో ఇంపుగా పాడదొడగిరి.

అంత నలుగురు రాకొమరులు తమ తమ సతులతోకూడి సభాసదులకు వందన మొనర్చిరి. అంత మహాసభ మంగళం మంగళమని పలికిరి. తేజోవంతులైన ఆ నలుగురు తమ తమ సతిహస్తములను తాము పట్టుకొని, విడిదికి బయలుదేరుముందు పరదాలలోనున్న తమ తల్లులకు నమస్కరించుటకై లోనికి వెళ్ళి వారల ఆశీర్వాదములు అందుకొని విడిది చేరిరి.

నాటినుండి మూడు దినములు నిత్యమూ యేదో ఒక వైభవము జరుపుతూ అయోధ్యనుండి వచ్చిన వారలకు మిధిలాపురవాసులకు రాత్రి, పగలను భేదము తెలియక పోవునట్లు చేసిరి.

పెండ్లి జరిగిన మరుదినము విశ్వామిత్రులవారు దశరథునిదగ్గరకు వెళ్ళి తాము సంకల్పించిన కార్యము అమితానందముగా పూర్తి అయినదని తెలిపి, రామలక్ష్మణ భరత శత్రుఘ్నులను దగ్గరకుచేర్చి శిరస్సులను ముద్దాడి, ఆశీర్వదించి, తానిక హిమాలయమునకు వెళ్ళుదునని తెలుపగా, రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు నమస్కరించిరి.

అంత విశ్వామిత్రుడు జనకమహారాజు చెంతకు వెళ్ళి తమ కార్యము దిగ్విజయముగా జరిగినదని తెలిపి, జనకుని, సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తులను ఆశీర్వదించి, తానిక హిమాలయమునకు వెళ్ళుచున్నానని తెలుపగా, దశరధ, జనకాదులు, విశ్వామిత్రులవారిని వీడలేక, వీడలేక అనేక వందనములు సలిపి, అతనిని వీడ్కొలిపిరి.

మూడవ దినము దశరథుని ఇష్టప్రకారము, తాము అయోధ్యకు పోవలెనను సంకల్పమును జనకునకు తెలుపగా జనకుడు అడ్డుచెప్పక వారల ప్రయాణమునకు తగిన యేర్పాట్లు తమ కూతుళ్ళవెంట వెళ్ళు దాస, దాసీలను, వారల సామగ్రులను,

అనేక రథములలో యేర్పరచెను. ఏనుగులు, రథములు, గుఱ్ఱములు, గోవులు అనేకముగా తమ బిడ్డలకు బహుమతులుగా ఇచ్చెను.

అల్లుండ్రకు మహా మహా విలువైన ఆభరణములనూ, రథాలను ఇచ్చెను. దాసీలకు పది సంవత్సరములకు సరిపడు వస్త్రములు, ఆభరణములు అనేక రకములైన నిత్యానుకూలములకు వినియోగించు సామగ్రులను ఇచ్చెను.

మూడవదినము తెల్లవారుసరికి రథములు సిద్ధమాయెను. మిథిలాపురమున అంతఃపురమేకాక, పురస్త్రీలందరును కంటినీరు కార్చిరి. సీతను, ఊర్మిళను వీడలేక కొంతమంది వృద్ధదాసీలు, దాదులు, కన్నీరు మున్నీరుగా యేడ్చిరి.

సీత, ఊర్మిళ, మాండవి, శ్రుతకీర్తుల తల్లులు అల్లుండ్ర చేతులు పట్టుకొని తమ బిడ్డలను అతి జాగ్రత్తగా చూచుకొమ్మని, యెట్టి కష్టములు యెరుగరు అని పరిపరి విధముల తెలిపి, కన్నులు వాయునట్లుగా యేడ్చి రథముల దగ్గరకు బురకాలతో వచ్చి వారిని రథములపై యెక్కించిరి.

మూడు దినముల పూర్వము యెంత వైభవమో ఆనాడు అంత విచారము.

రథములు ఒకదాని తరువాత ఒకటి కదలెను.

సీతను వీడలేక ఒకవైపున దుఃఖము పొరలి వచ్చుచున్ననూ, తాను నిగ్రహించుకొనుటకు అనేక ప్రయత్నములు జరుపుచూ, వారిని సాగనంపుటకు జనకుడు దశరథమహారాజుతో కొంతదూరము వెళ్ళెను.

ఇట్లు వెళ్ళుచున్నంతసేపూ జనకుడు తన కుమార్తెయొక్క గుణగణములనే వర్ణించుచూ, కంటినీరు కార్చుచూ, బాగుగా చూచుకొమ్మనమని, వారి క్షేమసమాచారములు మీదమీద తెలుపుమని అనేక పర్యాయములు తెలుపుతూ వెళ్ళుచుండెను.

అందుకు దశరథుడుకూడను, అనేక శాంతవచనములు తెలుపుతూ, జనకా! మా యింటిలో ఆడబిడ్డలు లేనికారణంగా వారే మా బిడ్డలుగా భావింతుము. బిడ్డలయిననూ, కోడండ్లయిననూ, వారేమాకు. వారి క్షేమానందములకు యెట్టి కొరతయూ నుండదు. మీరు విచారించక వెనుకకువెళ్ళుదని అనేక విధములచెప్పి, రథములాపిరి.

అంత జనకుడు తనబిడ్డ, అల్లుడునున్న వేరొక రథము దగ్గరకు వెళ్ళి వారలను అనేక రకముల నోదార్చి ధైర్య వచనములు తెలిపి, ధర్మ సూక్తులు గుర్తుచేసి, అత్తమామల దగ్గర భర్త, బావ, మరదుల దగ్గర నౌకర్ల దగ్గర యెట్లు మెలగవలెనో మరొకపరి జ్ఞాపకముచేసి వారల నమస్కారములు అందుకొని తను వారల శిరస్సులను ముద్దాడి ఆశీర్వదించి వెనుకకు తిరుగలేక బోరునయేడ్చి రథమున కూర్చొనెను.

వారి రథములు అటూ, జనకుని రథము ఇటూ శరవేగముతో బయలు దేరెను. జనకుడు మిథిలకు చేరుకొనెను.

అక్కడ నగరమే చిన్నబోయి యుండెను. అంతఃపురమునకు చేరగనే నిర్జన ప్రదేశముగా కళాహీనమై ప్రశాంతమై యుండుటను చూచి, తాను ఉండలేకపోయి నాడు.

శతానందుని, మంత్రులనూ పిలిపించి, యేదో ప్రొద్దుపోవు మాటలను, అపొంగివచ్చు పుత్రికావియోగమును శాంతపరచుకొనుటకై అనేక విచారములు జరిపెను.

మధ్య మధ్య యెక్కడో యోచించుచూ, యేవో జవాబులు చెప్పుచుండుట చూచి, మంత్రి, రాజా! సీతా వియోగమున తమరికి తీరని విచారముగా ఉండినట్లు తోచుచున్నది. ప్రతి తండ్రికి యిది తప్పినదికాదు. దానము చేసిన తరువాత, మనము క్రమక్రమేణా ఆ సంబంధమును కొంత కొంత నిగ్రహించుకొనవలసి వస్తుంది.

ఈ విషయము తమకు తెలియనిదికాదు.

అందున సీతాదేవి అందరివలె సామాన్యమైన బాలికకాదు. ఆమె దేవతా పుత్రిక. ఆమె యెడబాటు మరింత అధిక విచారమును కలిగించును. మహారాజా! మన బిడ్డలేకాక అల్లుండ్రుకూడనూ సామాన్యమైన పిల్లలుకారు. వారు కూడనూ సాక్షాత్ దేవలోకమునుంచి దిగివచ్చినటుల కనిపించుచున్నారని మన నగరమునందు ఆబాలవృద్ధులు అనుకొనుట నేనే స్వయముగా వింటిని.

ఇట్టి ఈడూ జోడూ, వంశము సాంప్రదాయములు కల సంబంధములు దొర కుట, కుదురుట మహా ఆశ్చర్యము. అందరికీ యిట్లు జరుగదు. మన బిడ్డలు యెట్టి కొరతయూ లేక సుఖింతురు. శుభముగా అభివృద్ధి గాంతురు. అని గడచిన పెండ్లి వైభవాలనే తెలుపుతూ జనకునకు కొంత శాంత వచనములతో కాలమును గడుపు నటుల చేయదొడగెను.

# పరశురాముడు

దశరథుడు కొడుకులతో కోడండ్లతో మహర్షులతో చతురంగబలాలతో సాగి పోవుచుండగా కంటికి యేవో దుర్నిమిత్తాలు తోచుచూ వచ్చెను. అంత దశరథుడు వశిష్ఠుల వారితో "స్వామీ! యేమిటీవింత? ఆకాశమున పక్షులు తిరుగుచూ ఘోర ముగా కూయుచున్నవి. భూమిపైగల జంతువులు మనకు ప్రదక్షిణముగా తిరుగు చున్నవి. జంతువులు రథములకు ప్రదక్షిణగా తిరుగకూడదు కదా! దీనికి కారణ మేమై యుండును. నాకేమో దిగులు కలుగుచున్నది."

అని తెలుపగనే వశిష్ఠులవారు కొంత దివ్యదృష్టిని వినియోగించి, రాజా! మనకు రాబోవు ఒక భయంకరావస్థ నిమిత్తమై ఆకసమున పక్షులు అట్లు భయంకర శబ్దములు చేయుచున్నవి. అయితే భూమిపై మనకు ప్రదక్షిణ చేయుచున్న మృగములను పట్టి చూచిన ఆవచ్చు కీడు నివారణకు చిహ్నముగా నున్నది. కావున మీరేమాత్రము విచారించకండి, అని ధైర్యమును తెలుపుచుండగా,

ఒక భయంకరమైన గాలివీచెను. చూచుచుండగనే పెద్ద పెద్ద వృక్షములు నేల కూలెను. పర్వతములు దొర్లిపోవ దొడగెను. భూమే బ్రద్దలగుచున్నదా అన్నట్లు పిడుగువంటి శబ్దములు వినపడ దొడగెను. ఒకరి రథములు మరొకరికి కనిపించక దుమ్ము రేగెను. గుఱ్ఱములు ఏనుగులు బెదురుకొన మొదలిడెను. సైనికులు మూర్ఛ నొందిరి. కొందరు స్థంభించి పోయిరి.

వశిష్ఠులవారూ, నలుగురు కొడుకులూ, దశరథుడూ తప్ప మిగిలినవారందరూ విచేతనులు అయిపోయిరి. భూమ్యాకాశము లొక్కటిగా చీకటి క్రమ్ముకొనెను. ఆ చీకటిలో మిణిమిణ్లు గొలుపునట్లు కాంతులు కంటికి కనుపించ జొచ్చెను. భయంకర మైన నేత్రములతో ఉగ్రుడైనట్టి ఒక వ్యక్తి వారల కంటెదుట నిలచెను.

అతని తలనిండా దట్టమైన వెంట్రుకలు, భుజముమీద గండ్రగొడ్డలి వ్రేలాడు చుండెను. మెరపువలె మెరయుచున్న బాణములూ, విల్లూ భుజమునకు తగిలి

యుండెను. త్రిపురాసురుని సంహారమునకు వెళ్ళుచున్న ఫాలాక్షుని పగిది వారికి కనిపించెను. ఇంతలో వశిష్ఠులవారు అతను పరశురాముడని కనిపెట్టి, అతని కోప తాపములు ఇంతకు పూర్వమే శాంతించెను కదా! శత్రువులందరినీ హతమార్చి, శాంతిల్లిన పరశురామునకు తిరిగి ఈనాడు కోపము రావటమునకు కారణమేమని యోచించెను.

అర్ఘ్యాదులు తీసికొనిపోయి అతనియెదుట నిలచి ఓరామా! భార్గవరామా! అని మనోహరముగా సంభాషణలు సలిపి అర్ఘ్యమును ఇచ్చెను అతను ఒకవంక అర్ఘ్యాదులను అందుకొంటూ, చింతనిప్పులవలె మెరయుచున్న కన్నులతో రామునివైపు చూడదొడగెను.

అంత శ్రీరామచంద్రుడు చిరునవ్వులతో అతనిని చూడగనే పరశురాముడు మరింత మండిపడి ఓ దాశరథీ ! నీ పరాక్రమములు వేనోళ్ళవింటిని. నీవు శివ ధనుస్సు నవలీలగా త్రుంచిన విషయమును కూడను వింటిని. అవి అన్నియూ విన్నవేకానీ కన్నవికావు. ఈనాడు నీ పరాక్రమాన్ని స్వయముగా చూడగోరే ఇందు వచ్చితిని.

నేనొక పవిత్రమైన విల్లును గొనివచ్చితిని. అది మాతండ్రి అయిన జమదగ్నిది. దీనికి బాణము నెక్కించి నీ బలమును చూపుము. లేకున్న నాతో పోరాడుటకు రమ్మి అని మహోద్రేకమగు మాటలను ఉపయోగ పెట్టెను.

అందులకు రాముడు ఏమాత్రము జంకక, చిరునవ్వులతోనే ఓ భార్గవరామా ! నీకు క్షత్రియుల మీదనున్న కోపము యెప్పుడో తీరిపోయినదని తలంచితిని. వింటిని. తిరిగి ఈ విపరీతమేమిటి? ఈ వికారములేమిటి అని అనుచుండగనే దశరథుడు దీనుడై,"భార్గవా! నీవు బ్రాహ్మణుడవు, మహాయశస్వివి, నా పుత్రులు పసిపాపలు. వారలపై ఈ విధముగా నిష్కారణ ద్వేషమును పూనుట నీబోటి ఉత్తమ వంశీయులకు ధర్మముకాదు. మీ వంశీయులు నిరంతర వేదాధ్యయనము చేయుచూ, చాంద్రాయణ వ్రతాలు సల్పుచుండెడివారు. శస్త్రాస్త్రాలు నేటినుండి వదలిపెట్టుదును. నామనోభీష్టము తీరినది అని దేవేంద్రుని యెదుట ప్రతిజ్ఞచేసి, ధర్మపరాయణుడవై ప్రశాంతచిత్తుడవై ఈ వసుంధరను కాశ్యపునకు దానము చేసితివి.

మహేంద్రపర్వతముపై తపస్సు చేయుచున్న మీరు ఇప్పుడు మా సర్వనాశనమునకు సంసిద్ధులౌట మీమాటలకే విరుద్ధము. మాట తప్పుట మహాపాపము కదా! మాట తప్పిన పిదప యెన్ని తపస్సులు చేసినను యేమి ఫలము? సత్యమునకు మించిన దైవము వేరేలేదు కదా! ఒక్క రామునితో మాత్రమే యుద్ధము చేయుదు

నంటున్నావు. ఆ ఒక్క రామునికు ఏ అపాయము కలిగిననూ మా వంశము నాశన మగును. మేమందరము మరుక్షణముననే ప్రాణములు వీడుదుము. ఇన్ని ప్రాణ ములు తీయుట మీబోటి బ్రాహ్మణులకు పరమ విరుద్ధమేకాక మహాపాపము.

అని చెప్పుచుండ పరశురాముడు దశరథుని మాటలను లక్ష్యము చేయక, వినిపించుకొనక రామునివైపు చూచుచూ, రామా! నీవు విరిచిన విల్లు నేనిప్పుడు తెచ్చిన విల్లు రెండునూ దేవలోకము లోనివే రెండునూ మహాపవిత్రమైనవి. వీటిని రెండింటినీ విశ్వకర్మ నిర్మించెను. ఒకదానిని త్రిపురాసుర సంహారమునకు, మరొకటి విష్ణుమూర్తి చెంత నుంచుకొనెను. త్రిపురాసుర సంహారము అయిన తరు వాత శివుడు ఆ వింటిని బాణముతోకూడ దేవతలచేత విదేహరాజు అయిన దేవరాతు నకు ఇప్పించెను. ఏ కార్యనిమిత్తమై ఆ వింటిని నిర్మించెనో ఆ కార్యము జరిగి పోయినందున బహుశా ఆ వింటిలోని బలము క్షీణించి యుండవచ్చును.

అట్టి, బలహీనమైన వింటిని యెక్కుపెట్టుట ధీరుని లక్షణముకాదు పవిత్రమై ఇంకనూ దీనికి నియమించిన కార్యము పూర్తికాలేదు కనుక, ఇది పూర్ణ శక్తివంత మైనదై యున్నందున దీనిని యెక్కుపెట్టి చూడుము. అప్పుడు నీ పురుషార్ధమును నీవు నిరూపించుకొన్నవాడవు కాగలవు.

అంతేకానీ శివధనుస్సును త్రుంచితినంచు గర్వపడబోకు, ఇదిగో దీనిని త్రుంచి నీపేరు నిలబెట్టుకొనుము అన్నాడు. ఈ విష్ణువిల్లు నాకెట్లు వచ్చినదని సందే హింతువేమో, దీనిని విష్ణుమూర్తి ఋషీకమహర్షికి నిక్షేపముగా ఇచ్చెను. ఆ దివ్య తేజస్వి దీనిని ఆయన కొమారుడైన జమదగ్నికి ఇచ్చెను. ఆ జమదగ్ని నా తండ్రి. అతను మహాతపస్సంపన్నుడు, ప్రతీకారము యెరుగని మహాపవిత్రుడు. అస్త్రసన్యా సము చేసిన మా తండ్రిని కార్తవీర్యార్జునుడు తామసబుద్ధితో చంపివేసెను. అంత దారుణముగా ఇంతవరకూ యెవ్వరూ యెప్పుడూ చేయలేదు, చంపలేదు. అట్టి అధర్మప్రవర్తనకు, రాక్షసకృత్యమునకు పాల్పడు రాజును దయదలచి విడువరాద నియూ అతనేకాక అట్టి అధర్మములకు పాల్పడు ప్రతిరాజును తలనెత్తనీయక హత మార్చవలెనను ప్రతిజ్ఞపట్టి ఆనాటి నుండియూ అధర్మ అన్యాయ క్రూరకృత్యము లకు మరిగిన రాజులను చించి చెండాడవలెనని ఈ పవిత్రవిల్లును ఈ ఆయుధమును పట్టి బయలుదేరితిని. అనేకమంది దుర్మార్గపు రాజులను హతమార్చితిని. ఈ భూలో కమునే వశము చేసుకొంటిని.

అంతటితో నా తండ్రిని చంపిన కోపము కొంత శాంతించి క్షత్రియులపై దండెత్తుటమాని నేనిక యజ్ఞమును ప్రారంభించితిని. ఆ యజ్ఞమున మహాత్ముడు

పుణ్యకర్ముడూ అయిన కశ్యపుని పిలిపించి అతనికి నేను సాధించిన భూభాగాన్ని దక్షిణగా ఇచ్చితిని. అప్పటినుండి మహేంద్ర పర్వతముపై ప్రశాంతమైన కాలమును, ప్రసన్న హృదయుడనై అనుభవించుచున్నాను.

అయితే అట్టి అస్త్రసన్యాసము గావించిన నీవు తిరిగి ఈ అస్త్రప్రయోగమునకు యెందుకు కాలిడుచున్నావని మీ తండ్రిగారు ప్రశ్నించిన ప్రశ్నకు సమాధానము తెలిపెదను వినుము.

రామా! నీవు శివధనుస్సును విరుగగొట్టితివన్న వార్తవిని నీ శక్తి సామర్థ్యములు గొప్పవిగనే భావించి బ్రహ్మ సృష్టి అయిన ఈ రెండు అస్త్రములలో ఒకటి శిథిలమై మరొకటి యుండుటయును, అదియూ అస్త్రసన్యాసము గావించిన నాదగ్గరుండియూ ప్రయోజనము లేదనియునూ తలంచి దీనిని త్రుంచుటయో లేక నాతో యుద్ధముచేసి నీ స్వాధీనము చేసికొనుటయో జరిగిన మంచిదని భావించి కాలమునకు వేచియుంటిని. అది ఈనాడుప్రాప్తించినది, ప్రాప్తించిన కాలమును సద్వినియోగము చేయవలెను కాని దానిని నిరుపయోగము చేయరాదు. యుద్ధమొక సద్వినియోగమా అని తలంచువేమో. లోకకల్యాణము నిమిత్తము లోకవ్యాప్తి నిమిత్తము దుర్మార్గాన్ని అణగద్రొక్కి సత్‌పదార్థాన్ని నిలబెట్టుటలో దీని అంతరార్థము కలదు.

కనుక బాహ్యయుద్ధము మాత్రమే చూచి హింసగా భావించరాదు. దీని ఉద్దేశమును లక్ష్యమందుంచుకొన్న బాహ్యక్రియలు అర్థము కాగలవు. కత్తికి పదును కావాలన్న రాతిపై వేసి నూరవలెనుకదా! నూరుటలో కత్తికి శ్రమయని తలంచము కదా! దేహమునకు బలము రావాలన్న ఆహారమును కఠినమైన దంతముల మధ్యవేసి నమలవలసి వచ్చును. అంతమాత్రముచేత ఆ పదార్థమును బాధించుచున్నామని భావించుట భావ్యముకాదు. అటులనే దేశమును దేహమునకు సాత్విక ధర్మమను బలముచేకూర్చవలెనన్న ఈ విధమైన మర్దన సలుపవలసి వచ్చును.

ఇది మార్గమధ్యము. మాటలతో కాలము గడుపుటకంటె క్రియలోకి దిగుట అత్యవసరము. ఇదిగో ఈ వింటిని విరువుమా లేక ముష్టియుద్ధము నాతో చేతువా అని ఆ వింటిని అందించుటకు పూనుకొనెను.

అంత లక్ష్మణుడు పరశురాముని మాటలకు మండిపడి యేమో మాటలాడుటకు ప్రయత్నించ, రాముడు అతనిని యోదార్చి ఇది నీకు సంబంధించినదికాదు. నన్ను అడుగు ప్రశ్నలకు నేనే సమాధానము చెప్పవలెను. మీరట్లు అడ్డు తిరుగుట క్రమపద్ధతికి విరుద్ధముగా నుండును. అని మంచిమాటలతో లక్ష్మణుని శాంతపర

చెను. కానీ, పరశురాముడు వెగటుగా నవ్వుతూ రాముని అనేక రకముల పరిహాసము జేయుచుండ లక్ష్మణుడు ఓర్చుకొనలేక పోయినాడు.

అంత లక్ష్మణుడు ఓ భార్గవా! శివధనుస్సును విరిచిన రామునకు ఇదొక గొప్పకాదు. దీనిని త్రుంచుటకు రాముడే పూనుకొన నక్కరలేదు.

బ్రాహ్మణ అస్త్రము, దర్భతో సమానము. దీనిని నేనే అవలీలగా త్రుంచగలను! ఈ చిన్నపనికి శ్రీరాము డక్కరలేదని లక్ష్మణుడు రోషముతో పలికిన పలుకులు పరశురాముని మరింత మండింపజేసెను.

కాని రాముడు శాంతముతో చిరునవ్వుతో లక్ష్మణుని మందలించి శాంత పరచెను. పరశురాముడెంత క్రోధమును ధరించెనో రాముడంత శాంతమును వహించుచూ వచ్చెను. కడకు పరశురాముడు శ్రుతిమించి పలుకుటకు పూనుకొనగనే దశరథుడు కొంత అదరెను మిగిలిన పండితులు, చతురంగబల సైన్యము కొంత భయపడిరి. దాస దాసీలు తలలు దాచుకొనిరి. అయితే సీతాదేవి దానిని వినోదముగా చూడదొడగెనేకాని ఆమె యే మాత్రమూ బెదరలేదు, అదరలేదు. నా పురుష సింహముచెంత ఈగుంట నక్కలెంత అని ఆమె మహాధైర్యముతో ఊర్మిళా మాండవి శ్రుతకీర్తులకు ధైర్యము చెప్పుచుండెను.

భరత శత్రుఘ్నులు కూడనూ రాముడు, లక్ష్మణుని మందలించుట చూచి యూరకుండిరి. లేకుండిన వారు కూడనూ కోపోద్రేకులయి రామాజ్ఞకు వేచియుండిరి. వశిష్ఠులవారు త్రికాలజ్ఞానులు కనుక విషయము తెలియును. ఇది భగవత్ లీలానాటకమని తనలో తాను భావించి యేమీమాటాడక, వెరువక చూచుచుండెను.

రామచంద్రుడు శాంతవచస్కుడై పరశురామా! నీవు బ్రాహ్మణుడవు. అందునా క్షత్రియులకు పూజ్యపాదులు అయిన విశ్వామిత్రుల వారికి బంధువుడవు. అట్టి బ్రాహ్మణుని చంపుట మంచిదికాదు. ఈ పవిత్ర అస్త్రమును నీపై విడచుట మంచిదికాదు.

అంతేకాక ఈ బాణము దేవలోకమునదనియును ఇది శత్రు పురాలు అన్నింటినీ జయించినదనియును ఎవరిబలదర్పాలను అయినా నాశనము చేసివేయునదనియు నీవే చెప్పితివి. అట్టి పవిత్రబాణమును నేలపాలు చేయుట వ్యర్థము కాగలదు.

కాన ఈ బాణముతో నీ పాదగమనశక్తిని బంధించవలెనో, లేక నీవు తపోబలముతో సంపాదించిన పుణ్యలోక ప్రాపణశక్తిని హరించవలెనో నీవే తెలుపుమని యన్నాడు రాముడు.

ఈ మాటలు వినగనే పరశురాముడు మరింత ఉగ్రుడై కండ్లెఱ్ఱజేసి రామా!

యేమంటివి? అని ముందుకు వచ్చినతోడనే రాముడు నవ్వుతూ అతని భుజముననున్న ఆ విష్ణు అస్త్రమును లాగి తనచేత పట్టుకొన్నాడు.

అస్త్రము రాముని చేతికి వచ్చిన తక్షణమే పరశురాముడు నిర్వీర్యుడై పోయెను. ఆ అస్త్రమును ధరించిన రాముని చూచుటకు సాధ్యము కాకపోయినది. మహాతేజోవంతుడై అనేకకోట్ల దీపముల వెలుగు ఒకచోట చేరిన యెంత ప్రకాశమో అంత ప్రకాశముగా కనిపించుచున్నాడు, సాక్షాత్ నారాయణుడు.

తన ఆయుధము తనచేతికి సోకగానే ఆ ఆయుధముకూడను మరింత తేజోవంతముగా ప్రకాశించెను. నిజశక్తి యుట్టిపడెను. దీనిని కనిపెట్టి దేవతలు ఆకాశమున సంచరించి పూలవర్షమును కురిపించిరి. మంగళ వాద్యములు వినిపించెను.

ఇంతలో పరశురాముడుమందహాసముతో "రామా! చూచితిని నీ దివ్యశక్తిని, అనుభవించితిని నీ దివ్యతేజస్సును. నేను పూర్వము ఈ భూభాగమును కాశ్యపునకు దానమిచ్చితిని. అప్పుడు నీవిక ఈ దేశములో ఉండకూడదనియు అట్లు వచ్చినచో ఒకరాత్రి అయిననూ నిద్రచేయకూడదనియు శాపమిచ్చెను. కాన ఇప్పుడే చీకటి కాబోవుచున్నది. నేనిక ఈ భూభాగమున నుండరాదు. నేనిక వేగముగా మహేంద్ర పర్వత ప్రాంతమునకు వెళ్ళవలెను.

కాబట్టి నాపాదగతిని బంధించవద్దు, నేను తపోబలముతో అప్రతిమాన లోకాలను జయించితిని. ఆ శక్తిని నీవిప్పుడే ఈ బాణముతో త్రుంచుము. "ఓ రామా! నాలోని సర్వశక్తియు నీదే. ఇదిగో తిరిగి నీ శక్తిని నీకై అందించుచున్నాను. అని రాముని కౌగలించుకొనగనే పరశురామునిలోని మూడు కళల శక్తియు రామునిలో లీనమాయెను.

అంత పరశురాముడు, రామా! లోకమును, దైవత్వమును, సులభముగా అర్థము చేసికొన లేనందున ఇట్టి పరాక్రమ తపోసంపన్నులుకూడనూ తమ తమ యోగ శక్తినే విశ్వసించి విష్ణుమాయను మరచి సంచరించు చుండుట సర్వసామాన్యము. అందు నిమిత్తమై నీ నిజశక్తిని లోకమునందు చాటతలంచి నీవే ఈ దేహమును ఈ రీతుల కొన్ని శక్తులను అనుగ్రహించితివి. తిరిగి నీ విష్ణుత్వమును ఋజువు చేసితివి.

నీవు సాక్షాత్ విష్ణుమూర్తివి. నీవు అసదృశ కర్మదవు. లోకమే నీ నాటకము. నీవు లేనిది, నీవు కానిది లేదు. అంతా నీదే. ఇట్టి మహాపవిత్రమైన నీ అస్త్రము కొంత కాలమయినను నాచెంత యుండుటచేత నాకునూ లోకమున పూజ్యభావము కలిగెను. అదే నా పుణ్యము. ఇదే నా అర్పణమని అంతర్ధాన మాయెను.

రాముడు శాంతవదనుడై చిరునవ్వుతో ఆ వింటిని ఆ అంబును వరుణదేవున కిచ్చెను. అక్కడున్న వశిష్ఠునకు, తండ్రి అయిన దశరథునకు నమస్కరించెను. అంత భయకంపితుడై యే నిమిషమున తన కుమారునకు యేమి ప్రమాదము జరుగునోయని దిగులుతో కృశించియున్న దశరథుడు పట్టలేని ఆనందముతో రాముని అక్కునచేర్చి అనేక రకముల ముద్దాడి తలనిమిరి నోటమాటరాలేక నాయనా! ధన్యుడను. తిరిగి నిన్ను సుక్షేమముగా చూడగల్గితిని. నీ పరాక్రమశక్తి అపారము, అద్భుతము, అని అనేక రీతుల కొనియాడెను.

అంత రాముడు నాన్నా! ధర్మమునకు జయము తథ్యము. కాని ప్రారంభమున కొంత భయకంపితుల చేయును. బలహీనము వెలిబుచ్చును. కొంత అపజయమును కూడ సూచించును. అయితే వాటికి లొంగక క్రుంగక ధర్మమునే దృష్టియందుంచుకొనిన దాని కేనాటికి అపజయము లేదు, రాదు.

కాని మానవులు అంత సత్యమును విచారించక లోతునకు వెళ్ళక, పైపై రీతుల ప్రాకులాడుటచేత అపజయమునకు గురియగుదురు. ఏదో జరిగినది జరిగెను, ఇదంతా మీ ఆశీర్వాదబలమని మరొకతూరి నమస్కరించి చతురంగబలము అయోధ్య పోవుటకు తమ ఆజ్ఞకై కాచుకొనియున్నది. వారికేదైనా సెలవిచ్చుట మంచిదని అనగనే,

దశరథుడు అమితోత్సాహముతో, నాయనా! ఇంక ఆలస్యమెందులకు? సుఖదుఃఖములు ఒకదానివెంట మరొకటి వెంటాడి శరీరమునకు నీరసము కల్గించెను. నగరమునకు వెళ్ళి తగినరీతుల ఆనందము ననుభవించవచ్చును. అని మంత్రిని పిలచి సైన్యము అయోధ్యా నగరమునకు బయలుదేరునట్లు ఆజ్ఞచేసెను.

అంత చతురంగబలములు విజయధ్వనులను మ్రోగించిరి. దారి నడచుటకు మొదలుపెట్టిరి. దశరథ మహారాజు కొడుకులతో కోడండ్రతో గడచిన అద్భుత చర్యలను ముచ్చటించుచూ ప్రయాణము సాగించెను.

నగరమునకు సమీపమునకు వచ్చుచుండగా ముందు కొంత సేనలను పంపి నగరమున తనరాకను తెలుపుమని చెప్పెను. పొందిన విజయమునకు అమితానందమును అనుభవించుచున్న సేనలు శరవేగముతో నగరమునకు చేరి రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు సతీసమేతులై నగరమున ప్రవేశించుచున్నారనియూ, దశరథుడు అమితానందముతో ఈ వార్త పంపెననియూ, తెలుపగనే,

పురజనులు గంతులువేసి నగరమును అనేక రీతుల అలంకరించుటకు సిద్ధమయిరి. వీథులు అలంకరించిరి. అరటి కంబములు పాతిరి. నారికేళములు

రాజ వీధులలో పన్నీరు చల్లిరి. నగరమంతయూ అతిసుందరముగా శృంగారించిరి. మంగళవాద్యములను అనేక గుంపులుగా నియమించిరి. మందుసామాగ్రిని సిద్ధపర చిరి. చెప్పటానికి శక్యముగాని ఆనందముతో పురజనులు క్షణములు లెక్కించుచూ, దారులు కాచిరి. స్త్రీలు కిటికీలలో మిద్దెలపై అనేకమంది బురకాలు వేసికొని పర దాలు కట్టుకొని క్రిక్కిరిసిపోయిరి.

కోదండ్రతోను, కొడుకులతోను దశరథుడు నగరమున ప్రవేశించెను. మంగళవాద్యములు మారుమ్రోగెను. జనులు జైజైలు కొట్టిరి. స్త్రీలు మంగళ హారతు లెత్తిరి. పన్నీరు చల్లిరి, పుష్పములు విసరిరి. చుక్కలవంటి కోదండ్ర మధ్యలో సూర్యులవంటి కుమారులు వీధులలో వచ్చుచుండ అనేకమంది దేహములే మరచి ఆనందించిరి.

ఎంతసేపు చూచుచున్ననూ తనవితీరక వీధులలో కొంత దూరము చూచుచూ వెనుక వెనుక నడచుచూ వచ్చిరి. వీధులుదాటి రాజభవనమును చేరిరి. అంత సింహ ద్వారము దగ్గర బ్రాహ్మణులు స్వస్తివాచకములు పలుకుచుండ, దాదు లనేక రకము లైన దృష్టులు తీయుచుండ, మంగళహారతులు యెత్తి కోదండ్రను కుడికాలు లోపల పెట్టుడని దాదులు పాదములు పట్టి ప్రార్థించగా, కోదండ్రు కుడికాలు లోపలపెట్టి నడచిరి. అంతలో అంతఃపుర ప్రథమ ద్వారముచెంత వేచియుండిన కౌసల్యా సుమిత్ర కైకేయిాలు యెదురువచ్చి గంధములు చల్లి పూవులు ముడిచి కుంకుమలు పెట్టి కోదండ్రను అమితానందముతో ముద్దాడి కోదండ్రను దగ్గర చేర్చి శిరస్సులను ముద్దుపెట్టి ఆశీర్వదించిరి. అంత నల్గురు కుమారులు కోదండ్రు జతలు జతలుగా ముగ్గురు తల్లులకు నమస్కరించిరి అప్పుడు ఆ తల్లుల ఆనందము హద్దులుతెగి పట్టరాని సంతోషముతో వారల కంటినుండి ఆనందబాష్పములు జలజల రాలెను.

ఇంతలో దాదులు క్షీరాన్నమును బంగరు పళ్ళెములలో పెట్టి తీసికొని రాగా, తల్లులు తమ తమ కుమారులకు కోదండ్రకు నోటిలోపెట్టి తినిపించిరి. పాలను అందించిరి. లోనికి తీసికొనిపోయి, పూర్వమే సిద్ధపరచిన అభ్యంగనస్నానములకు తగిన రీతుల యేర్పాటు చేసిరి. ప్రయాణ బడలిక తీరునటుల కుమారులకు మగ వారును కోదండ్రకు ఆడదాదులును ఒడలుపట్టుటకు నియమించి అభ్యంగన స్నాన ములు చేయించిరి. కొంతతడవు విశ్రమించుటకు ఆజ్ఞయొసగిరి.

వారు నిద్రించుచుండగా తలలకు పొగవేయువారు పాదముల నొత్తువారు వింజామరలతో విసరువారూ అమితోత్సాహముతో చేయదొడగిరి. ఆనాడు వారలకు ఆహారాదులను అక్కడకే పంపిరి. బాగుగా విశ్రమించిన తరువాత ఆనాడు సాయం

త్రమునకు అయోధ్యా నగర స్త్రీలను పేరంటమునకు రప్పించిరి. చక్కని వేదికపై వారలకు బంగారు పీటములువేసి సంసిద్ధముగా నుండిరి.

తల్లులైన కౌసల్యా సుమిత్రా కైకేయీలు తమ తమ కోడండ్రను, అతివిలువైన వస్త్రములతో వజ్రవైఢూర్యములు పొదిగింపబడిన ఆభరణములను అలంకరింప ప్రత్యేక దాదులను నియమించిరి. వారును దగ్గరుండి చేయించి కోడండ్రను చేతులు పట్టుకొని వేదికపైకి తీసికొనివచ్చి, పీటలపై కూర్చొనబెట్టిరి.

అంతలో రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు రాజ దుస్తులను ధరించి విలువైన ఆభరణములతో కిరీటములతో వచ్చి, వారి వారి భార్యల కుడిప్రక్కన ఆసీనులైరి. ఆ దృశ్యమును చూచుచూ తల్లులూ పురస్త్రీలూ యెంత వర్ణించిరో యెంత ఆనందించిరో వర్ణనాతీతము.

వారు నలుగురు జరుపుచుండ వీధులలో అనేక ధర్మాలుచేయ మొదలుపెట్టిరి. గోవులు, ధనము, సువర్ణము, భూములు, ధాన్యము ఇత్యాది వస్తువాహనాదులు పంచిపెట్టిరి. బ్రాహ్మణులు వచ్చి ఆశీర్వచనములు చెప్పి అక్షతలు వేసిన తరువాత సుమంగళులు నూటయెనిమిది దీపముల జ్యోతులతో హారతులిచ్చిరి. దృష్టి తీసిరి. అంత కుమారులు తమ తమ భార్యలతోలేచి తల్లులకూ, తండ్రికీ, గురువునకూ నమస్కరించి లోనికి వెళ్ళిరి.

ఇంతలో కేకయ రాజకుమారుడు, భరతుని మేనమామ దశరధుని దగ్గరచేరి, నేను వచ్చి చాలకాలమయినది. నాన్నగారు నా కొరకై కాచుకొనియుందురు. ఈ మంగళ సమయమున నాన్నగారుండిన యెంతో ఆనందపడెడివారు. భరతుని పెండ్లి నాన్నగారికి తెలియదు. తాను లేక తన మనుమని పెండ్లి జరిగినదన్న తానెంతో నిరాశ పడవచ్చును. కాన అట్టి నిరాశకు అవకాశము లేకుండుటకై ఆజ్ఞయొసగి భరతుని తనవెంట పంపిన అక్కడ తిరిగి వైభవమును జరిపి నాన్నగారు తృప్తి పడగలరని ప్రార్థించగనే, దశరథుడు భార్యలతో సంప్రదించి కడకు భరతుని పిలిపించి, "నాయనా! మీ మేనమామ యుధాజిత్ నిన్ను తీసికొని వెళ్ళుటకై వచ్చినాడు. మిథిలాపురమున పంపమని కోరగా నేను అంగీకరింపనైతిని. కాని, మీ తాతగారు నీ కొరకై పరితపించుచున్నట్లు తేలినది, అందువలన అతని వెంట వెళ్లుటకు సిద్ధముకమ్ము," అని ఆజ్ఞాపించెను.

అంత భరతుడు, "నాన్నా! శత్రుఘ్నుడుకూడా తనవెంట వచ్చిన బాగుండు" నని తెలుపగా అతనికిని ఆజ్ఞ యిచ్చెను. ఇరువురూ, భార్యలతోకూడ గిరివ్రజ పురమునకు ప్రయాణమైపోయిరి.

నాన్నగారిపైగల అభిమానముచే భరతుడు మారు మాటాడక, తన భార్యతో బయలుదేరుటకు తగిన యేర్పాటులను గావించెను. భరతుడు మహా బుద్ధిమంతుడు. అంతియేకాదు, జితేంద్రియుడు. భరత, శత్రుఘ్ను లిరువురు తమ తమ ధర్మపత్ను లతోకూడి ఆనందముగా ప్రయాణమును జరిపి గిరివ్రజపురమునకు చేరిరి.

అక్కడ తమ ముద్దుల మనుమని చూచు నిమిత్తమై కాచుకొని యుండిన తాతగారు భరత, శత్రుఘ్నులను చూచి అక్కునచేర్చి ముద్దాడి పట్టరాని ఆనంద ముతో ప్రక్కన కూర్చుండబెట్టుకొని అయోధ్యా క్షేమములు అనేక రకముల విచా రించి, ప్రయాణ బడలికచే అలసిపోతిరని వారలను తగు రీతిగా విశ్రమించుడని, తమ తమ వసతులకు పంపి, నాటినుండియు కన్నబిడ్డలకంటె కడు ప్రీతిగా ఆద రించుచూ, అతిజాగ్రత్తగా చూచుకొనుచుండెను.

తాతగారు ఎన్ని విధములవారి ఆనంద, అనుకూలముల నిమిత్తమై తగిన సదుపాయములు కలిగించిననూ, భరత శత్రుఘ్నులు ఏదో విధముగ అసంతృప్తిగా ఉండినటుల కనిపించుచుండెడివారు. కారణము, వృద్ధుడైన తండ్రిని, ప్రాణ సమాన మైన రాముని విడిచి ఉండలేకపోయినారు. నిరంతరము దశరథుని, రాముని గురించిన మాటలే ముచ్చటించుకొనుచుండెడివారు. మధ్య మధ్య నాన్నగారెట్లున్నారో అన్న విచారము తెలియకుండా వారిని బాధించెడిది.

వీరి భావములిట్లుండ, అయోధ్యలో దశరథుడు కూడనూ భరత శత్రుఘ్ను లను తలవని నిమిషములేదు. వారిని విడచియుండలేకపోయినాడు మధ్య మధ్య వారిని యెందుకు పంపితిని, పంపకుండిన బాగుండెడిది, అని చింతించెడివాడు. దశ రథుడు నలుగురు కుమారులను నాలుగు హస్తములుగా భావించువాడు. ఒకనాడు భరత శత్రుఘ్నులను గురించి విచారించుచున్న దశరథుని, రామచంద్రుడు చూచి, తండ్రి చెంతచేరి, అనేక విధముల మధురభాషణలు సలిపి మనసును సంతోషపరచి నాడు.

# పట్టాభిషేక వార్త

రాముడు పరమశాంతుడు. ఎవరు ఎంత పరుషవాక్యము లాడినను మృదు మధురముగా జవాబు చెప్పెడివాడు. తనకు పరులు లెక్కకెక్కువైన అపకారములు సలిపినను వాటిని తన జ్ఞాపకమునకు తెచ్చుకొనక ఉపకార భావమునే కలిగి యుండెడివాడు. కాలము చిక్కినపుడంతయు సదాచారమును గురించి సత్సంప్రదాయములను గురించి వయోవృద్ధులైన మునులతో బ్రాహ్మణులతో, పండితులతో చర్చించుచుండెడివాడు. వేదాంత రహస్యములను అతిసులభముగా వివరించి అది సరియా కాదా అని సామాన్యమానవునివలె పండితుల సలహాను కోరుచుండెడివాడు. చేరిన ఋషులు వేదాంత, విజ్ఞాన, నిధులు అయిన పండితులు. రామవాక్యములకు అమితానందపడుచూ అతని తెలివితేటలను అనేక విధముల కొనియాడుచుండెడివారు. ప్రజలను తనకుతానే ముందు పలుకరించుచూ, వారి క్షేమసమాచారములను విచారించుచుండెడివాడు అందువలన ప్రజలుకూడను శ్రీరాముని తమ ఆప్తునిగా భావించి గౌరవించి అమితముగా ప్రేమించుచుండెడివారు.

తాను నిరంతరము దృఢ నియమములతో యుండి యెట్టి అనానుకూలము లందైననూ తన నియమములను వీడక పాటించుచుండెడివాడు. ఎవరితో సంభాషించినను చిరునవ్వుతో చిందులుత్రొక్కు పాలబుగ్గలతో ఆకర్షించుచుండెడివాడు. అతని మొగమున కోపము, విసుగు, నిరాశ యేనాడునూ యెవ్వరునూ చూచి యెరుగరు. దయాదాక్షిణ్య, శరణాగత రక్షణాది ధర్మములు అన్నీ రామునిలో మూర్తీభవించినవి. జూదము, ఇత్యాది చెడు భావములు అతని మనసులో ఏనాడు చేర ప్రయత్నించలేదు. అట్టి దుర్గుణాలు రామున కతి దూరముగా నుండెడివి.

అతిభాషకాని చెడుచూపుకాని అతనిలోలేదు. అయితే యెవరైనా యుక్తిగా మాట్లాడిన ఆ యుక్తికి పైయుక్తిగా వారిని నోరు మూయించెడివాడు. యుక్తులకు చోటివ్వక అక్కడికక్కడే వాటిని అణగద్రొక్కువాడు.

అనారోగ్యము అతడు యేనాడు యెరుగడు. ప్రజా భావమును కనిపెట్టి వారలు కోరకమునుపే తను, అనుకూలములు తండ్రితో చెప్పి మంత్రిద్వారా చేయించు చుండెడివాడు. దశరథుడుకూడను వారి అభీష్టముల కెట్టి అడ్డుచెప్పక మరుక్షణమందే ఆ కార్యములు చేయించెడివాడు. ప్రతి చిన్న విషయమును అతిజాగ్రత్తగా తెలిసి కొని అట్టి యిక్కట్లు, సమస్యలు తిరిగి మరొకతూరి రాకుండ, లేకుండా చేయుటకు తగిన చర్యలను తీసికొనుచుండెడివాడు. రామునియందు ప్రత్యేకవిశిష్టత స్పష్టమయ్యే డిది. అది యేమన తన మనోనిశ్చయాన్ని యితరుల కెవ్వరికీ తెలియనిచ్చువాడు కాడు. అతని భావములు ఫలపర్యంతము ఎవరికీ బోధ పడెడివికావు. మరొకటి. అతని కోపము, సంతోషము యెన్నడు వ్యర్థమయ్యేడిదికాదు. ఆలస్యముగాని, ఏమరుపాటుగాని ఎరుగడు.

ఇటువంటి లోకోత్తర గుణములతో రాముడు తేజరిల్లుచుండెను. అయోధ్యలో ఇట్టి కుమారుని చూచుకొంటూ, ప్రజలలో రామచంద్రునకుగల పవిత్రకీర్తిని, ప్రజా విశ్వాసమును, మంత్రులవలనను, పురోహితులవలనను, దశరథుడు వినుచు తనలో తాను ఆనందించుచుండెడివాడు.

ఇట్లుండ ఒకనాటిరాత్రి పానీయమును గ్రోలగోరి నిద్రించు రాణులను నిద్రా భంగముచేయ మనసొప్పక కూజాలోని నీరును ఒక చిన్నగిన్నెలో పోసుకొని త్రాగు సమయమున తన చేతివ్రేళ్ళు పట్టుతప్పుట, హస్తము కొంత అదరుట గమనించి అప్పటినుండియు నిద్రపట్టక తనలో తాను అనేకరకముల ఆలోచనలలో మునిగి కడకు తనకు వార్ధక్యము వచ్చినదనియును, నరముల పటుత్వము తప్పినమీదట రాజ్యపాలన చేయకూడదనియు, ఇంద్రియనిగ్రహము లేని పరిపాలన ప్రజా క్షేమ మునకు విరుద్ధము కాగలదనియు, అట్టి పరిపాలనచే రాజ్యము అస్తవ్యస్తమై కడకు పతనమునకు దారితీయుననియు నిర్ణయముచేసికొని, యెప్పుడు తెల్లవారున్నా,తనలోని నిశ్చయమును మంత్రులకు ఎపుడు తెలుపుదునా అని దశరథుడు నిమిషములు లెక్కించుచుండగా తెల్లవారెను.

అంత తన కాలకృత్యములు తీర్చుకొని స్నానసంధ్యాదులు సలిపి ప్రత్యేక మైన ఒక సభను యేర్పాటు గావించమనియు, పురప్రముఖులను, పురోహితులను, మంత్రులను రప్పించమనియు బంట్రోతులకు ఆజ్ఞ చేసెను. మహారాజు ఆజ్ఞను శిరసావహించి అనుకొన్నవారందరు హాజరయిరి.

అంత దశరథుడు వశిష్ఠులవారికి నమస్కరించి రాత్రి తనలో కలిగిన మార్పును, దానిపై తనకు కలిగిన భావములను స్పష్టముగా విస్మరించి, రాజ్య పరి

పాలనా బాధ్యతను తన కొమారుడైన రామచంద్రునకు అప్పజెప్పనెంచితిననియు, దీనికి అడ్డు చెప్పకూడదనియు, అతి వినయముతో ప్రార్థించి, ఇందుకు తగిన యేర్పాట్లను గావించ అనుజ్ఞ కోరెను.

అంత ప్రధానమంత్రియైన సుమంత్రుడు లేచి సభాసదుల కీ వార్త తెలియ పరచగనే పురప్రముఖులు, మంత్రులు, పురోహితులు ఒకరేమి చేరినవారందరు శుభం - శుభం అంటూ కరతాళములు మిన్నుముట్ట వాయించిరి.

వశిష్ఠులవారు లేచి, "రాజా! దీనికింత విచారించనక్కరలేదు. రామచంద్రుడు దీనికి తగినవాడయినప్పటికిని, కొంతకాలము తీసికొని, తగిన వారందరికి ఆహ్వానములు పంపి, పట్టాభిషేకమును అతి వైభవముగా జరిపించవచ్చును. రామచంద్రుని యువరాజు చేయవచ్చును కనుక, ఒకటి రెండు నెలలు, వేచియుండుట మంచిదని నా తలంపు అని తెలుపగనే,

దశరథుడు మహాత్మా! తమకు తెలియనిది లేదు. తమరు సర్వజ్ఞులు. అంగ పటుత్వము తప్పిన రాజు పరిపాలనకు అర్హుడుకాడు. వార్ధక్యము ప్రవేశించిన ప్రభువునకు పరిపాలనా కాంక్ష ఉండుట మహా ప్రమాదము. అది దురాశాపీడితము కాగలదు. ఇన్ని తెలిసియుండియు నేను తిరిగి అందులో ప్రవేశించుటచే నా కర్తవ్యమును తప్పినవాడ నగుదును. కనుక, నన్ను క్షమించి ఇక గడువు పెట్టక ఈ రెండు మూడు దినములలోనే నా రామచంద్రుని యువరాజును చేయ అనుజ్ఞ యొసగుడని అతి దీనుడై వినయమున మోకరిల్లెను

అందులకు వశిష్ఠులవారు దశరథుని లేవనెత్తి ఆశీర్వదించి, రాజా! రామచంద్రుని వివాహము సహితము అప్పటికప్పుడు ఉట్టిపడినట్లు జరిగిపోయెను. ఆ వైభవమునుకూడను ప్రజలందరు చూచి అనుభవించలేకపోయిరి. పట్టాభిషేకము సహితము, అప్పటికప్పుడు తలంచి నిర్ణయించిన ఇతర రాజులకేగాక తోబుట్టువులైన భరత శత్రుఘ్నులకుకూడ కొంత బాధను కలిగించవలసి వచ్చును. మొన్న మొన్ననే సంబంధము యేర్పరచుకొన్న జనకమహారాజుకూడను రాలేకపోవచ్చును. కాన తమరు యోచించుట మంచిదని సెలవిచ్చెను.

ఇంతలో ప్రధానమంత్రి లేచి, కులగురువులు నన్ను క్షమింతురుగాక! చక్రవర్తి సంకల్పము సర్వజనులకు సమ్మతముగనే యున్నది. సర్వజన సంతాప హరుడు, నిండుచంద్రునివలె సర్వలోక ప్రియుడు అయిన రామచంద్రుని యువ రాజును చేయుటలో కాలహరణము చేయక తగు శీఘ్రకాలముననే తగిన ఆజ్ఞను అనుగ్రహించవలెనని ప్రజల తరపున తాను ప్రార్థించుచున్నటుల కోరెను చక్ర

వర్తి, ముఖ్యమంత్రి ఈ రీతిగా ప్రార్థించగనే వశిష్ఠులవారు చేయునదిలేక అంగీకరించి ప్రజాభిరుచిని కూడను తెలిసికొనవలెనని సలహానిచ్చెను. దశరథమహారాజు ఆ కొలువు కూటములో సమావేశమైన మంత్రులను, మహనీయులను, సదస్యులను, పండితులను, పురోహితులను అందరినీ ఒకతూరి లేచి చూచెను. మేఘగర్జనమువలె సభాభవనమంతా ప్రతిధ్వనిస్తూ ఉండగా అందులో నొక పుర ప్రముఖుడు లేచి మహారాజా! మీ పూర్వీకులైన రాజేంద్రులందరు ప్రజలను తమ కన్నబిడ్డలవలె కాపాడుతూ రాజ్యపాలన చేసిరి.

ఇక్ష్వాకు నరేంద్రునివలననే ఈ కోసలదేశము శుభప్రదమైన రాజ్యమయినది. తమ జ్యేష్ఠపుత్రుడగు శ్రీరాముడు సద్గుణసంపన్నుడు, పరమ ధార్మికుడు. పరాక్రమమున పురంధరుడు. అంతేకాదు, ముల్లోకాలు యేలగల సమర్థుడు. అతని యువరాజును చేయుట మా భాగ్యము. ఇందులకు యే సందియములేదు. అని ప్రజా ప్రతినిధి ఆనందవచనముల నందించగనే,

దశరథుడులేచి సభాసదస్యులారా! నేను మా పూర్వీకుల పంథా ననుసరించి, ఏమరుపాటులేక, నా శక్తికొలది ఇంతవరకు రాజ్యమును కాపాడితిని, ఏలితిని. లోకహితముకోరి ఈ శ్వేతచ్ఛత్రఛాయలలోనే నా వయసు అంతా గడచిపోయినది. నేనిపుడు వృద్ధుడను. ఈ దేహమున అంగముల పటుత్వము తప్పినదని నేను తెలిసికొంటిని.

ఇక ఈ శిథిల దేహమునికి కొంత విశ్రాంతి నివ్వవలెనను సంకల్పము నాలో స్థిరము చేసికొని ఈ నిర్ణయమునకు వచ్చితిని. ధర్మసంస్థాపనా రూపము అయిన రాజ్యభార నిర్వహణము సామాన్యమయిన పని కాదు. జితేంద్రియుడైనవాడే అనేక సాధనలతో ధర్మసంస్థాపన రూపమైన రాజ్యభారము నిర్వహించగలుగుతాడు. నేను ఈ రాజ్యభారమును మోసి మోసి అలసిపోతిని.

ఈ నా యాలోచన మీ కందరికి నచ్చినట్లయిన, నేను యిట్లు చేయుట మీకందరికి ఉచితమని తోచిన నేను ఈ పనికి పూనుకొందును. లేకున్న మీ యభీష్టమునకు నేనెపుడూ విరుద్ధము చేయను. నన్ను సంతోషపెట్టు నిమిత్తమో లేక రాజాజ్ఞను మీరుమెట్లని కొంతఅభిమానముతోనో రామయువరాజ్యాభిషేకమును ఒప్పుకొనవసరములేదు. ఇది మీ స్వేచ్ఛకప్పజెప్పితిని. మీకందరికీ ఇష్టమయిన లేక ఇంకొక పద్ధతి ఏదైనా మీకు తోచిన నిరాక్షేపముగా చెప్పవచ్చును. కాన మీరందరు ఆలోచించి రాత్రికి మీ అభిప్రాయమును తెలుపుడని దశరథమహారాజు మాటలను పూర్తి చేసీ చేయకమునుపే, వర్షించే మేఘములను చూచి నెమళ్ళు చెలరేగి కేకలు

వేసినటుల సభాసదులు అందరూ తమ అభీష్టమే మా అభీష్టము. ఇంతకంటె ఉత్తమ ఆలోచనలకు మేము అర్హులముకాము. శుభం- శుభం అని, రామచంద్ర యువరాజుకు జై, దశరథమహారాజునకు జై అంటూ దిక్కులు పిక్కటిల్లేటట్లు కేకలు వేసిరి.

ఈ శుభధ్వనులు వింటూ దశరథుడు, ఒకవైపున ఆనందమును, మరొక వైపున ఒకవిధమైన అనుమానము అర్థము చేసికొనలేని స్థితిలో స్థంభించిపోయెను. కొంతతడవయిన పిదప తెప్పరిల్లి దశరథుడు సభాసదస్యులను పరికించి, సభాసదులారా! మీ అభీష్టమును నెరవేర్చుటకంటె నాకు ప్రత్యేకకార్యము మరొకటుండదు. తప్పక మీ యిష్టానుసారమే రాముని యువరాజును చేతును. కాని నాలో ఒకవిధమైన అనుమానము నన్ను బాధించుచుండుటచేత దానినికూడను పరిహారము చేసికొనగోరుచున్నాను.

మీరెట్టి భీతికిని తావియ్యక, ఉన్నదున్నట్లు తెలిపి నన్నానందింప చేతురని ఆశించుచున్నాను. అది ఏమన నేను రామపట్టాభిషేక విషయమును మీతో చెప్పి చెప్పకమునుపే మీరందరు తప్పక రామచంద్రుని యువరాజుని చేయమనియును, అతని సమర్థతలు అపారమైనవనియును తెలిపితిరి. దీనిని పట్టిచూడ నా పరిపాలనలో మీకు కొంత అనానుకూలములో లేక మీ అభీష్టమునకు విరుద్ధమైన శాసనములో, అదియునుకాక ధర్మరహితమైన చర్యలో నేను చేసితినా ? లేకున్న నా పరిపాలనను శంకించి రామయువరాజ్యాభిషేకము చేయగోరుచున్నారా ?

అను సంశయము నన్ను కొంత బాధించుచున్నది. కాన నా తప్పులేమైనను ఉండిన నిరాక్షేపముగా మీరు చెప్పవచ్చునని ప్రశ్నించెను.

అంత సభాసదులలో ప్రముఖుడు లేచి, రాముని శక్తిసామర్థ్యములు, గుణగణములు వర్ణనాతీతములు. ఇక మీరు దేవదేవుని వంటివారు. ప్రజాకోరికలను అడిగిన క్షణముననే అందించు శంకరులవంటివారు. రక్షించుటలో విష్ణుమూర్తి వంటివారు. మిమ్ము, మీ పరిపాలనను శంకించినచో మేము మహాక్రూరులమనియే చెప్పవచ్చును. అట్లు శంకించువారు పాపులు. లోకహితముకోరి మిమ్ములను సంతోషపెట్టగోరి మీ ఆజ్ఞను శిరసావహించితిమని తెలిపిరి.

అంత దశరథుడు పట్టరాని ఆనందముతో "బ్రాహ్మణోత్తములారా! వింటిరి కదా ప్రజాభిప్రాయములు! ఇక మీరు ఆలసింపక, పట్టాభిషేకమునకు కావలసిన ఉపకరణాలు సమకూర్చుడు. అందుకు తగిన అరుగులు, హోమగుండములు ఏర్పరచుడు, అని ఆజ్ఞాపించెను.

వశిష్ఠులవారికి నమస్కరించి, "స్వామీ! వచ్చుటకు వీలయినవారు మాత్రమే

వత్తురు. దూరప్రాంతమువారికై నిరీక్షించకుడు, పట్టాభిషేకము జరిగిన తరువాత వారు విని ఆనందింతురు కాన కేకయరాజునకుగాని, జనకునకుగాని తెలుపవలెనను సాకును పెట్టుకొనక, కాలమును పొడిగించక, అతి శీఘ్రముగా ఈ పవిత్ర అభిషేకమునకు అనుజ్ఞ యొసగుడు అని హస్తములు జోడించి ప్రార్థించగనే,

వశిష్ఠులవారు "మహారాజా! నేను సర్వసిద్ధముగానే యున్నాను. రేపటి దినమే అగ్నిహోత్ర గృహములును, పూజాద్రవ్యాదులును, ఓషధులును నూరు కలశములును, సమగ్రమయిన పులితోలును యుంచుటకు ఆజ్ఞాపించి, ఇంతమాత్రమేగాక చతురంగబలములతోను, సర్వశుభలక్షణయుతమైన శత్రుంజయమను ఏనుగుతోను, సర్వాలంకృతమగు ఆబోతుతోను శ్వేతచ్ఛత్రముతోను, ధ్వజముతోను సర్వసిద్ధముగా నుండుటకు యేర్పాట్లు గావించుమని సెలవిచ్చినాను. ముహూర్తము రేపటికే" అని నిర్ణయమయినట్లు వశిష్ఠులవారు తెలిపిన తోడనే,

ప్రజలు పరమానందహృదయులై గంతులు వేసిరి. రాజవీధులు శుభ్రపరచుట, రంగులు వేయించుట, తోరణములు కట్టించుట, పందిళ్ళు వేయించుట, ఇత్యాది అవసర కార్యములు అతి త్వరగా ప్రారంభించిరి. బ్రాహ్మణులు, ప్రజలు కలకలధ్వనులు చేయుచు కిలకిలనవ్వులు వెలిబుచ్చుచు దశరథుని ఆజ్ఞను పొంది సభాభవనమును వీడిరి.

అంత దశరథుడు, కులగురువులైన వశిష్ఠులవారు, మంత్రి, లోనికి వెళ్ళిరి. దశరథ మహారాజు కొలువుకూటమునకు శ్రీరాముని రప్పించి పట్టాభిషేకమునకు సంబంధించిన సర్వపద్ధతులను వివరముగా తెలిపి, రేపటి సూర్యోదయమునకు సిద్ధముగానుండవలసిన విధానములు తెలిపి, అందుకు తగిన యేర్పాట్లదారులను పిలిపించి రామునకు అప్పజెప్పెను.

ఈ వార్తవినిన లక్ష్మణుడు పరమానందముతో పరుగెత్తుకొనిపోయి కౌసల్యాదేవికి తెలిపెను. ఆమె పట్టరాని ఆనందముతో రామరాకకై నిరీక్షించుచుండెను.

కాలము తక్కువయినను అతి శీఘ్రములోనే నగరమంతయు ప్రాకెను. చుట్టుప్రక్కల రాజ్యములకు గ్రామములకు, అతి త్వరగా వ్యాపించెందెను. గ్రామగ్రామములనుండి పరుగిడుచు వచ్చు జనసంఖ్య మితిమీరెను.

ఇవన్నియు వింటున్న రామచంద్రునకు యేమియు తోచక, నోటమాటరాక, ఆనందమును వెలిబుచ్చక, మౌనము వెలిబుచ్చెను. రాముని చూచి దశరథుడు, "నాయనా! పట్టాభిషేకమన్న ఆనందము నీలో యే మాత్రము కనుపించకున్నందుకు కారణమేమి? నీవు యువరాజువగుటకు ఇష్టము లేదా? లేక రాజ్యభారము ఈ

నాటినుండియే నీ తలపై పెట్టతలంచితిమని ఒక విధమైన భయమా? నీ మనోభీష్టము నెఱిగింపుమని అనేక విధముల బుజ్జగించి ప్రశ్నించిన దశరథుని ముఖమును చూచుచూ రామచంద్రుడు,

నాన్నా! మీ రెందుకంత తొందరపడుచున్నారో నా కర్థమగుటలేదు. నా ప్రియమైన సోదరులు భరత శత్రుఘ్నులు నాతో లేరు. ఇక తాతగారు అతి దూరముననుండుటచే వారు రాలేకపోవచ్చును. మామగారుకూడ రాలేకపోవచ్చును. మిగిలిన రాజులు, రారాజులు, సామంత రాజులు యెవ్వరును చేరలేకపోవచ్చును. ఇంత మందికి నిరాశ కలిగించి పట్టాభిషేకమునకు పూనుకొనుటకు నా మనసొప్పకున్నది, అని నమస్కరించి వినయముగా తెలుపుకొనెను.

అంత వశిష్ఠులవారు రామా! ఈ యూహలు మేముకూడను చేయకపోలేదు. అన్నివిధముల ఆలోచించి ప్రజాభిప్రాయములనుకూడను సేకరించి ఈ నిర్ణయమునకు వచ్చితిమి. నీవిక యెట్టి అడ్డును చెప్పక మహారాజుయొక్క అభీష్టమును శిరసావహింపుము. అభిషేకము రేపే జరుగవలెను. ఈనాటినుండియే నీవు నీమమును పాటించవలెను. రాత్రికి పట్టుపరుపులు, మంచములు మాని దర్భశయ్యపై పరుండవలెను. రాత్రికి సీతాసమేతముగా ఉపవాసము చెయ్యవలసి యుండును. తెల్లవారగనే అభ్యంగన స్నానమాచరించి లేత పసుపురంగు వస్త్రములు ధరియించి సూర్యోదయమునకే పుష్యమీ నక్షత్రమునకు పట్టాభిషేకము పూర్తికావలెను. కాన నీవిక బదులుచెప్పక నీ వసతికి వెళ్ళిరమ్ము. అని ఆజ్ఞ యిచ్చినవెంటనే,

రాముడు తండ్రికి గురువునకునమస్కరించి, మారుమాటాడక, సుమంతునితో కలిసి వసతికి వెళ్ళి సీతకీ వార్త తెలిపి అక్కడనుండి తల్లి కౌసల్యా భవనమునకు వెళ్ళి తల్లికి నమస్కరించెను. తల్లి పట్టలేని ఆనందముతో కుమారుని ముద్దాడి అనేక గోవులను సర్వాలంకారముతో సిద్ధముగావించి యుంచిన వాటిని బ్రాహ్మణులకు యిప్పించి, ఇంకా ఇంకా అనేకవిధముల కొమరునిచేత దానములు చేయించెను.

సుమిత్రా లక్ష్మణ సమేతముగా కౌసల్య, రాముని తన సరసన కూర్చుండబెట్టుకొని ఒకవైపున ఆనందభాష్పములు తుడుచుకొనుచు, నాయనా! ఈ సుసమయమును యెప్పుడు చూతునా అన్న నా చిరకాల వాంఛ నేటికి పూర్తి అయినది. నేను ధన్యురాలను. నా బంగారుబిడ్డా! రేపటినుండియు నీవు యువరాజువు. చిరకాలము జీవించు. ప్రజాక్షేమమును దృష్టియందుంచుకొని సత్క్రమపాలన సాగించి సత్కీర్తినార్జించి మన పూర్వీకుల ఘనతను నిలబెట్టుము. మీ తండ్రిగారికంటె గొప్ప పేరును పొందుము. ఆనాడే నా జన్మధన్యము కాగలదు. నా వ్రతములు, ఉపవాసములు సఫలముకాగలవు.

అని తల నిమురుచు అనేక విధముల ఆశీర్వదించుచూ, బోధించుచూ చెప్పిన మాటలను రాముడతి శ్రద్ధగా వింటూ తమ్ముడైన లక్ష్మణునిచూచి చిరునవ్వులు చిందులు త్రొక్కుచు తమ్ముడా నిన్ను ఏ రాజ్యలక్ష్మి వరించినదో తెలుపగలవా అని కొంచెం పరీక్ష వేయగనే లక్ష్మణుడు పట్టరాని ఆనందముతో అన్నా నాకు ఏ రాజ్యలక్ష్మి అక్కరలేదు. నీ రాజ్యమునందే నీ ఆదేశానుసారము పరిపాలనా బాధ్యత చేయగలను, అంతే చాలును. అని అన్నకు నమస్కరించగనే రాముడు లక్ష్మణా! నీవు నా రెండవప్రాణము కనుక అర్ధరాజ్యభారము నీది నాతోపాటు సర్వాలంకృతుడవుకమ్ము. నా బాధ్యతలు, నా భోగభాగ్యములు అన్నింటియందును నీకు అర్ధభాగమునకు అధికారమున్నది నేనేమి అనుభవించినను అందు నీకు అర్ధ బాధ్యత కలిగియుంకును. అని మాటలాడుచుండగా సుమిత్ర కంటిధారలు విడుచుచూ ఇరువురిని ఆశీర్వదించుచూ రామా మీ యిరువురి మధ్యనున్న ప్రేమ నన్నెంతగనో ఆనందపెట్టుచున్నది.

నా కుమారునకు నీ సేవకంటె వేరు అధికారము అక్కరలేదు. నీ ప్రేమ అభిమానములు కలకాలము నా కొమరునిపై యుండిన అంతియే చాలును, అని మాటలు ముగించెను. అంత రాముడు యిరువురు తల్లులకు నమస్కరించి లేచెను. అతనితోపాటు లక్ష్మణుడు కూడను లేచి, అన్నతోపాటు రామవసతికి వెళ్ళెను.

ఆ రాత్రి గురువుగారు చెప్పినటుల ఉపవాసవ్రతములు ప్రారంభించిరి. ఆ రాత్రి దర్భాసనములపై శయనించిరి. తెలతెలవారు చుండెను. ఎక్కడ చూచినను మంగళవాద్యములు, బ్రాహ్మణోత్తముల వేదఘోష ప్రతిధ్వనించుచుండెను. రామునకు, సీతకు అభ్యంగన స్నానములు చేయించుటకై సరయూనది పవిత్రజలమును బంగారు బిందెలతో తెచ్చి పరివారము సంసిద్ధముగా యుండిరి. స్వస్తివాచకములు చెవులకు ఇంపుగా చేరజొచ్చెను.

ఇవి యిట్లు జరుగుచుండ ఆనాటి రాత్రి కైక పనికత్తె అయిన మందర తన నివాసమునకు వెళ్ళుచుండ ఈ అలంకారములు, వైభవములు చూచుచు కారణము తెలియక కొంత విచారణను మొదలు పెట్టగనే, రామచంద్రుని పట్టాభిషేకమని తెలియవచ్చెను. తనతోపాటు పనికత్తెలుగా కౌసల్యా సుమిత్రల దగ్గరుండువారు తెల్లని మల్లెపూలవంటి చీరలుకట్టి అనేక ఆభరణములు ధరించి అటూ ఇటూ తిరుగుచుండుటకూడ కంటికి కనిపించెను.

ఇక తాను అక్కడ నిలువలేక పోయినది. తన ఒంటిపై జెఱ్ఱిలు ప్రాకినట్లయినది. తేళ్ళు కుట్టినటుల బాధపడినది. నేరుగా కైక మందిరమునకు పరుగెత్తుకొని

వచ్చి కైకేయీదేవి మందిరమునకు హుటాహుటిని పోయినది. అప్పటికే కైకేయి తన శయ్యామందిరమునకు వెళ్ళియుండుటచూచి తలుపు చెంతకువెళ్ళి తీక్షణస్వరముతో అమ్మా! అమ్మా! తలుపు తెరువుము, తలుపు తెరువుము, అత్యంత అవసరమైన విషయము. నీ జీవితమే నాశనమగుచున్నది, భూకంపము చెలరేగినది, అని మాటపై మాట వ్యవధిలేక మాటాడుచున్న మందర స్వరమును విని,

తక్షణమే కైకేయి తలుపు తీసి యేమిటా తొందర, యేమి కూలిపోయినది, యెందుకింత విచారముగా నున్నావని చిరాకుగా అడిగెను. అంత మందర కూలిపోయినదా? నాదేమీ కూలిపోలేదు, కాలిపోలేదు. నీ జీవితమే కూలిపోవుచున్నది, వెట్టి రాణివై జీవించవలసి వచ్చుచున్నది. అని అనేక రకముల ఆరాటము చేయుచు కంటిధారలు కార్చుచు విలపించెను.

కైకేయికి ఏమియు తోచలేదు. మహారాజు, రామ లక్ష్మణ కౌసల్యా సుమిత్రాదులు క్షేమమే కదా? వారలు క్షేమముగా నుండిన ఇక యేమైననేమి? నాకెట్టి విచారములేదు. వారలకేమైనా ప్రమాదములు వాటిల్లినవా మందరా త్వరగా తెలుపుమని తల పట్టుకొని గడ్డము పట్టి బ్రతిమాలెను. అంత మందర వారలకెట్టి కీడును లేదు. నీ కొమరుని గొంతుకోయ సంకల్పించినారు. అని భోరున ఏడ్చెను.

అందులకు కైక "మందరా నీవు పొరబడుచున్నావు. మహారాజు కాని రామ లక్ష్మణులుకాని నా అక్కలైన కౌసల్య సుమిత్రాదులుకాని అట్టివారుకారు. నా కుమారుని తన కుమారునికంటె అధికంగా ప్రేమింతురు ఇది నీ బుద్ధి దోషముతప్ప సత్యముకాదు. ఇంతకూ విషయమేమిటియో వివరించు"మని అడిగెను.

విషయమా, రేపటి తెల్లవారి సూర్యోదయ సమయమునకు శ్రీరామచంద్రుని పట్టాభిషేకమట. పట్టపురాణిని పట్ట పగ్గములు లేక, అత్యంత ఆనందముతో తమ దాసీలకు పట్టుపీతాంబరములు, ఆభరణములు పంచిపెట్టుచున్నది. రామునిచేత గోవులను, సువర్ణములను, దానము చేయించుచున్నది. ఇన్ని జరుపుకొంటు నిన్నిట్లు అలక్ష్యముగా విడిచిపెట్టుట నేను భరించలేను, సహించలేను. నీవు యింకా తెలిసికొనలేక పోవుచున్నావు. భర్తకు అయిష్టురాలవయి పోయితివి. నా యంతటి భాగ్యవంతురాలు లేదని నీవు విఱ్ఱవీగుచున్నావు. కానీ,

నిజముగా నీయంతటి దురదృష్టవంతురాలు లేదని చెప్పవచ్చు. నీ భాగ్యము యెండాకాలపు యేటినీళ్ళవలె అడుగంటి పోవుచున్నది. నీవు పతి సవతులకు పనికిరాని దానవయి పోయితివి. ఇంక కొంతకాలములోనే, నిన్ను ఒక దాసివలె వినియోగించు కొందురు. అట్టి దుస్థితి రాకమునుపే కొంత జాగ్రత్త పడుట మంచిది. నిద్ర

నుండి లేచి, నిండు హృదయముతో విచారించుము. నీకు రాబోవు దుర్గతిని తప్పించు కొను ఉపాయమును ఆలోచించుకొనుము.

రాముడే యువరాజైన ఇక రాజ్యమంతయు కౌసల్య హస్తమున నిలువ గలదు. అందరితోపాటు నీవును ఆమె హస్తగతమై ఆమె ఆడించునటులాడవలసి వచ్చును. అని దొంగ ఏడ్పులు ప్రదర్శించి మహా ఉపకారివలె నటించుచున్న మందరను చూచి కైక,

మందరా! నీకేమయినా మతిచెడినదా? రామచంద్రుడు యువరాజు కావటము రాజ్యమునకే మంగళము. ఇట్టి ఆనందవార్త నందించినందుకు యిదిగో నా కంఠహార మును నీకు బహూకరింతును, సంతసింపుము. రామచంద్రుడు రాజుగావటం తన తల్లియైన కౌసల్యకంటెను నాకే అమితమైన ఆనందము. రామచంద్రుడు కూడను తన తల్లికంటె నన్నే అమితముగా ప్రేమించును. గౌరవించును. అట్టి మహా గుణశాలిపై నీవిట్టి అపవాదులు కల్పించుట నేవినజాలను. నీకు మతిచెడినట్లున్నది. అని మంద రను కైక మందలించెను.

మందర మరింత ఆర్భాటము చేయుచు, రాణీ ! నాకు కాదు మతిచెడుట నీకే. రాబోవు ఆపత్తులను యోచించకున్నావు గ్రుడ్డినమ్మకముతో ప్రవర్తించుచున్నావు. నేను నీ క్షేమ గౌరవములను కోరియే, యింత బాధ పడవలసి వచ్చెను వారందరు వట్టి నాటకములాడుచున్నారు. నీవన్న యే మాత్రము గౌరవములేదు. మహారాజునకు పట్టపురాణిపై తప్ప అన్యరాణులపై అంత ప్రేమలేదు. సమయస్ఫూర్తిగా నిన్ను తృప్తిపరచుటకై ఇచ్చకపు మాటలాడుచున్నారేకాని నిజముగా నీపై ప్రేమలేదు.

నిజముగా నీవన్న వారలకు గౌరవప్రేమలేయుండిన రామ పట్టాభిషేక విష యమును నీకేమాత్రమైనా యెన్నడైనా తెలిపిరా? ఎన్ని నెలలనుండియో ఈ ప్లాను వేసికొని యుండుటచేతనే ఈనాడది ఈ రూపమునకు రాగలిగినది. లేకున్న పట్టాభి షేకము అప్పటికప్పు డుట్టిపడునదికాదు కదా! ఇదంతా కౌసల్యాదేవి పన్నిన పన్నా గము.

"ఛీ! మందరా! అక్కగారి కట్టి తలంపేనాడునూ రాదు. లేదు, నేను నమ్మను. మహారాజుగారు అంతకంటే మంచివారు. వారిలో యిట్టి కుచ్ఛితపుబుద్ధులు మచ్చుకైనను కనిపించవు. ఏదో కారణములు లేక అప్పటికప్పుడు ఈ కార్యమును నిర్ణయము చేసియుండరు రామ కల్యాణ మెన్నినెలల ప్రయత్నము. అప్పటి కప్పుడే నిర్ణయమయినటులనే రామపట్టాభిషేకము కూడ నిర్ణయమయి యుండును. దీనికి కారణము మహారాజుగారే తెలుపుదురు నీవు విషయమును తెలిసికొనక

వికారిభావములతో పవిత్ర హృదయములను శంకించుచున్నావు. కొన్ని నిమిషము లలో విషయము తెలియగలదు." అని మందరను మందలించుట చూచి,

మందర తన పన్నాగము పూర్తిగా విఫలమగునేమో అని భయపడి శృతి మించు స్థితికి దిగి, "తల్లీ! నీవు లోతుగా యోచించు. నేను బైటనుండి అనేక విష యములు విన్నాను. అసలు ఈ పట్టాభిషేకము కొన్ని నెలలకు పూర్వమే నిర్ణ యించుకొన్నారు. అందుకనే భరత శత్రుఘ్నులను బైటకు పంపినారు. వారుండిన కొన్ని యిబ్బందులు కలుగునేమో యని భయము.

దానికనేక ఆధారములు కూడను లేకపోలేదు. కాకున్న భరత శత్రుఘ్నులు లేని సమయమున ఈ పట్టాభిషేకమేమిటి? ఇంతమాత్రమైనా నీవు యోచించుకొన లేక పోతివా? పూర్వము నిన్ను వివాహమాడు సమయమున నీకు జన్మించిన పుత్రు నికే పట్టాభిషేకమును చేసెదనన్న దశరథుని వాగ్దానమును నీవు మరచినను నేను మరువను.

భరతుడు ఇప్పటిలో యిక్కడున్న దాని విషయము కొంత విచారణలోకి వచ్చునేమో యన్న భయముతో భరతుని తాతగారి దగ్గరకు పంపటమైనది. పట్టాభి షేకము జరిగిన తరువాత యెవ్వరు యేమీ చేయలేరుకదా!

ఈ యుక్తితో యింత గుట్టుగా పెట్టి నీకు సహితము తెలుపక చేయుటలో నున్న అంతరార్థమేమియో నీవు యోచించుకొనలేక పోవుచున్నావు. తెల్లని వన్నియు పాలే అన్న స్థితిలో నున్నావు. ఇంత అవివేకురాల వగుచున్నావు.

రాముడు రాముడు అని రమించుచున్నావు. పోనీ అంత ప్రీతిగా నున్న రాముడైనను నీకు తెలిపెనా?"

# రెండు వరములు

కుటిల మనస్కురాలైన మందర అనేక యుక్తులు పన్ని, నిర్మల నిస్వార్థ రాలైన కైక మనసును మాలిన్య పరచి, మహారాజుపై కక్షను సాధించుటకు తగిన రీతిగా తయారు చేసెను. ఇంతటితో కైక మనసు పూర్తిగా మారలేదను అనుమాన ముతో మరింత వినయ విధేయతలు ప్రదర్శించుచు చెంతకు వెళ్ళి కైక పాదముల చెంత కూర్చుని కంటి ధారలు విడుచునటుల నటించుచు,

అమ్మా! ఈ అయోధ్యలో మనలను గౌరవించువా రెవ్వరు? నిన్ను లెక్క చేయువా రెవ్వరు? ఎన్నటికైనను వారందరు ఒక్కటియే నీవే పరాయిదానవు. కొన్ని దినములలో నిన్ను అయోధ్యనుండియు పంపవచ్చు. అంత పనికికూడను వారు వెనుదీయరు.

మహారాజు మహామాటకారి. మాయలమారి. నీ చెంతకు వచ్చినపుడు మాత్రమే అల్లి బిల్లి మాటలాడి అతని కార్యమును సాధించుకొని ఆవలకు పోవును. అసలు నీవు దేనియందును ప్రధానస్థానము అందుకొనలేక పోవుచుండుటలోనున్న అంతరార్థమును గుర్తించుకొనలేక పోవుచున్నావు.

అమ్మా! నీకు జ్ఞాపకముండియుండ వచ్చును. అయోధ్యారాజులు కేవలము కామరూపులేకాని ప్రేమ రూపులు కారన్న సత్యము మీ తండ్రిగారు కనిపెట్టియే ఈ వృద్ధునకు నిన్నిచ్చి వివాహము చేయుటకు ముందు అంగీకరించరైరి. తదుపరి అనేక రాయబారములు నడిపి కడకు అనేక నిబంధనలు పెట్టి గర్గఋషిగారి మాటపై నిన్నిచ్చి వివాహముచేయ నిర్ణయించిరి. అందుల కంగీకరించి వారు నిన్ను వివాహ మాడిరి.

ఈనాడు ఆ నిబంధనలను నీటగలిపి నిన్ను మంట గలిపి నీ కొమరునికి ద్రోహము చేయతలచి ఈ నాటక మాడుచున్నారు. లేకున్న భరతుడు రాజ్యమునలేని సమయము కనిపెట్టి పరరాజులెవ్వరు యిందులో భాగము వహించుటకు వీలులేకుండు

నటుల అప్పటికప్పుడు ఉట్టిపడినటుల రేపటికే పట్టాభిషేకమునకు తగిన యేర్పాట్లు గావించుచున్నారన్న యెంతటి కుచ్చితపు బుద్ధియో తామే యోచించుడు. పర రాజు లకు తెలిసిన వారితోపాటు తమ తండ్రిగారు కూడ యిందులో పాల్గొందురు అపుడు నిన్ను వివాహమాడు సమయమున యిచ్చిన వాగ్దానమును తమ తండ్రిగారు జ్ఞప్తికి తేవచ్చును. అందుచే యెవ్వరికీ తెలియక కార్యము పూర్తిగా ముగించిన తరువాత తెలిసినను యెవ్వరూ యేమీ చేయలేరను ఉద్దేశ్యముతో ఈ జిత్తులమారి నక్క యాటల నాడుచున్నారు

ఈ సమయము తప్పిన నీగతి కుక్కగతి కావచ్చును. కాన ఆలసించక చక్కగా యోచించి పట్టాభిషేకము జరుగకుండుటకు తగిన విధానమును విచారిం చుట మంచిది అని రోషమును కూరిపోయుచున్న మందర వాక్యములకు మనసిచ్చి,

"మందరా! నీ మాటలు విన, ఒకదానికంటె మరొకటి పరమ సత్యముగా తెలియుచున్నది. నిజముగా ఆలసించుటకు ఇది తరుణముకాదు. ఇంక యేమి చేయవలెనో దానిని కూడ నీవే నిర్ణయించిన అందుకు తగినటుల నేను దానిని క్రియారూపమునకు తెత్తును". అని కైకేయి అంగీకారమును తెలుపగనే, మందర మరింత పొంగిపోయి ఇక పట్టశక్యముకాని పటుత్వముతో అమ్మా యిందుకు ఆలో చనలు వేరక్కరలేదు. కావలసిన ఆధారములు పరమ సిద్ధముగనే యున్నవి.

ఆనాడు దేవాసుర యుద్ధమున తమ సహాయమును అందుకొని మహారాజు అత్యంత ఆనందముతో తమను రెండు వరములు కోరుకొమ్మని తెలిపెను కదా. ఆనాడు నీవు అతని వలపులకు లొంగి పలుకులను లక్ష్యపెట్టక, నా కిప్పుడెట్టి కోరికలు లేవనియు అవసరము వచ్చినపుడు కోరుకొందుననియు సెలవిచ్చితివి. అవి ఈనాడెంతయో మేలు చేయగలవు. కాన, వాటిని యీనాడు కోరవచ్చును కదా! అని మందర చాల తెలివితేటలుగా పలుకగనే,

కైక ఉలిక్కి పడినటుల తలయెత్తి, "మందరా! నీకెంత తెలివితేటలే, రూప మునకు గూనిదానవైనా, విచారణలో మహా సుందరమైన దానవు. రూపమందు అందము లోపించినా తెలివితేటలలో మహా ప్రవీణురాలుగా కనిపించుచున్నావు. ఈ రెండు వరములు ఈ సమయమున ఎట్లు కోరవలెనో దానినికూడను సూచించ" మని కైక తెలుపగనే,

"అమ్మా! ఒకటి తమ కుమారుని యువరాజుగా చేయుమనియు, మరొకటి రాముని రాజ్యములో నుండకుండునట్లు చేయుమనియు కోరవచ్చును." అని యోచిం చక అతి త్వరగా చెప్పుట చూచి కైక కొంత యాలోచనలో పడి "మందరా! కుమా

రునికి పట్టాభిషేకము చేయుమని కోరుటలో కొంత న్యాయము కలదు కాని రాముని రాజ్యమునుంచి పంపమని కోరుటలో నా మనసొప్పకున్నది. అది నన్నెంతగనో బాధ పెట్టుచున్నది."

అని విచారముగా కూర్చున్న కైకనుచూసి మందర మరింత వెగటుగా, "అమ్మా! ఈ పిరికితనమునకు యిది సమయము కాదు. ఆలసించిన అమృతముకూడ విషముగా మారవచ్చును. ఇందులో తప్పేమీలేదు. ఈ విధమైన కఠినమును వహించకున్న మన కార్యము నేమాత్రమును మనము సాధించలేము. నీ కొడుకు రాజు కావాలని యున్న నీవు రాజమాతవు కావాలనియున్న ఈ రీతిగా నీవు సాధింపుము. లేదా నేనిప్పుడే విషము తీసికొని ప్రాణమును విడుతును. బ్రతికి నీ బాధలు చూడలేను," అని మహాప్రేమ యుండినటుల ప్రదర్శించి, బోరున యేడ్చెను.

అతి బాల్యమునుండి కైకను పెంచి ఆడించి, పాడించి, పెంచిన దాదియగుటచేత, మందరన్న కైకకు మహా యిష్టమగుటచేత, మారుమాటాడక మందరను సమాధానము పరచుచూ, మందరా! నీవు బాధపడకుము. తప్పక నేను నీకానందము నందింతును. ఇపుడేమి చేయుమందువో తెలుపుమనగా,

మందర, రాముని అరణ్యమునకు పంపుటలో నీవే మాత్రము చింతించక కోరుకొమ్మని తొందరపెట్టెను. కైక రాజనీతులు పరిపాలనా విధానములు, పసిగట్టిన దగుటచేత అరణ్యమునకు పంపుటలో కొంతకాలమును కూడను నిర్ణయించుట మంచిదని తలంచి,

ఆనాటి నీమముల ననుసరించి 12 సం॥దాటిన అనుభవముగల వానికే హక్కులు చెల్లునన్న శాసనమును గుర్తించి 14 సం॥ అరణ్యవాసము కోరిన, తదుపరి తన కుమారునికే స్థిరాధికారము యుండునని భావించి ఈ రెండు కోరికలను కోరుటకు సంసిద్ధురాలగుట గమనించి మందర,

"అమ్మా! ఇక ఆలసింపకుము. నీవు ఈ రీతిగానే యుండి కోరికలు కోరుటలో మహారాజు యేమాత్రము నీకు లొంగడు. నీవు మహా క్రోధమును ప్రదర్శించి, శయ్యాగృహమును యధారీతిగా నుంచక, చెల్లాచెదరు చేసి ఆభరణములు అటూ ఇటూ పారవేసి, తలను విరియబోసికొని జీవితముపై ఆశను వదలినటుల నటించుచు కోప గృహమున ప్రవేశించిన, అపుడే నీ కోరికలకు తగిన ఫలము చేకూరును. లెమ్మా. ముందు కార్యమునకు ముందంజ వేయుము."

అని నిర్బంధ పెట్టుటచేత మందర మాటలకు లోబడి యధారీతి గావించెను. క్రోధగృహమున ప్రవేశించెను. మందర యేమియు తెలినుని దానివలె తలుపులు

బిగించి ద్వారము దగ్గర యేడ్చుచుండునటుల నటించుచు కూలబడెను. ఇంతలో మహారాజు కొలువునుంచి చేయవలసిన యేర్పాట్లు అన్నియు గావించి, కౌసల్యా మందిరమునకైనను వెళ్ళక తన నిర్ణయమును మొదట కైకకు చెప్పదలంచి అతి వేగముగా కైక భవనమునకు బయలుదేరి వెళ్ళెను.

దారిలో పూర్తిగ దాసీలు యేదో విచారముగా నుండినటుల కనుపించిరి. వీరలకు రామ పట్టాభిషేకము తెలియదు కనుక ఈ విధముగా నుండియుందురని తలంచి నేరుగా శయ్యాగృహమునకు వెళ్ళెను.

అక్కడ మహారాజు చెదిరిపోయిన నగలతో, పారవేయబడిన బట్టలతో వికారమైయున్న దృశ్యమునుగాంచి ఆశ్చర్యపడి కైక కొరకై అటూ ఇటూ తిరిగి చూచెను. ఇంతలో దాసి వచ్చి మహారాజా! కైకేయీదేవిగారు క్రోధగృహమున కలరని తెలుపగనే,

నిరాశా హృదయుడై అటుదిక్కు నడచిపోయెను కటిక చీకటిలో రోదన చేయుచు నేలపై పడియుండిన కైకను చూచి, "కైకా! యేమిటీ వికారము. ఇంత కోపమునకు కారణమేమి? నిన్నిట్టి స్థితికి తెప్పించినవా రెవ్వరో తెలుపుము. క్షణములో వారిని హతమార్చి వత్తును. నీకు సంతోషమిత్తును. నీ మనోభీష్ట మేదియో తెలుపుము. దానిని నెఱవేర్చుటకు నేను సంసిద్ధముగా నున్నాను. నీ ఆనందమే నా ఆనందము. నీ కంటే మించినది ఈ లోకమున మరొక్కటి నాకు లేదని నీకు తెలియదా! నన్నెందుకు పరీక్షింతువు. లెమ్ము. నీ అభీష్టము చెప్పుము."

అని అనేక విధముల తలనిమురుచు నేలపై బడియుండిన కైకను ప్రశ్నించుచున్న దశరథుని చూచి కైక అతి ఆవేశముతో పండ్లు కొరుకుచూ అతని చేతిని తీసి ప్రక్కకు విసిరి, "చాలు మీ బూటకపు మాటలు. ఇంతకాలము నమ్మి నేనీ స్థితికి వచ్చితిని. మీ మాటలిక నేను నమ్మను. మీరు కపట నాటకమాడుదురని నేనెన్నడు తలంచనైతిని. మిమ్ము నమ్మినందుకిదియా శిక్ష. చాలు చాలు. మీ కిష్టమైనవారి చెంతకే పొండు మనస్సు ఒకచోట, మాటలు మరొకచోట. మనసిచ్చిన వారికే మాటలివ్వండి నేనిక మీ మాటలను నమ్మునట్టి పరిస్థితిలో లేను. అనవసరముగా నన్ను మరింత బాధపెట్టక వచ్చినదారిని పొండు నేనేమైన మీకేమి? దాసినై మరణించుటకంటే రాణినై మరణించుటే మంచిది. నేడే నా జీవితమునకు అంత్యదినము."

అని వెక్కి వెక్కి యేడ్చుచున్న కైకేయి మాటలు అర్థముకాక దశరథుడు

అయోమయ స్థితిలో నాశ్చర్యపడెను. అంతటితో ఊరుకొనక మరింత ప్రేమతో దగ్గర కూర్చుని "కైకా! ఏమిటి ఈ మాటలు. నాకు అర్థమగుటలేదు. కపటపు మాటలుకాని, ఆటలుకాని, నాలో ఏనాటికీ లేవు, రావు. మాట, మనసు రెండు ఒకేచోట నుండునుకాని, వేరువేరుగా యుండుటకు వీలులేదు. ఇంతకాలమైనను నన్ను నీవు అర్థము చేసికొనలేకపోవుటలోగల కారణము నాకు తెలియకున్నది. ఇంతకూ జరిగిన దేదియో తెలుపక, అర్థములేని మాటలతో నన్ను శత్రువధచేయకు. నీవీ విధముగా నుండుటకు కారణమేదో తెలుపుము."

అని బ్రతిమాలెను. కాని ఫలము లేకపోయెను. కైక మాటిమాటికీ దశరథుని మాటలను ఖండించుచు, అలక్ష్యపరచుచు, వెగటుగానవ్వుచు, అతనిమాటలకు విలువ లేక నటించుచున్న ఆమె చేష్టలు మహారాజునకు బాధ కలిగించెను. చేయునదిలేక మందరను పిలిచెను.

మందర అంతకంటె అధికమైన శబ్దము చేయుచు మహారాజా! అమ్మను కాపాడుడు, అని పాదములపైబడి బోరున యేడ్చునటుల నటించెను. మహారాజు, నిర్మలచిత్తుడగుటచేత, వారిరువురు చేయుచున్నది నటనని తలంచక, ఏదియో ప్రమాదము జరిగినదనియును, లేకున్న తన ప్రియురాలు యింత మొండిగా ప్రవర్తించదనియు, తలంచి, మందరను కారణము తెలుపుమని మరొక పర్యాయము అడుగుటచేత,

మందర, "రాజా! నేనేమని తెలుపగలను? నాకు వివరములు యే మాత్రము తెలియవు. అమ్మగారి క్రోధమునకు కారణము యెవ్వరికీ తెలుపుటలేదు. ఉన్నట్టుండి శయ్యాగృహమునుండి అతి వేగముగా క్రోధగృహమునకు వచ్చుచుండుట చూచి నే నిచ్చటికి వచ్చితిని. నేనెన్ని విధముల బ్రతిమాలినను యేమియు తెలుపుట లేదు. తమరికే తెలుపనివారు మాకు మాత్రము తెలుపుదురా! అమ్మగారు పడుచున్న బాధను మేము చూడలేకపోవుచున్నాము. అమ్మగారు యేమి కాగలరో అన్న భయముచేత క్షణక్షణముకాచి, తమకై వేచియున్నాము. తమరు సమాధాన పరుపకున్న అమ్మగారు ప్రమాదస్థితికి రాగలరు. ఇప్పటికే కాలాతీతమయినది. మేమిక వెళ్ళివత్తుము. తమరే కారణము అడిగి తెలిసికొని అందుకు తగిన శాంతిని చేకూర్చవలెనని సెలవుతీసికొని బైటకు వెళ్ళెను.

మహారాజు మందర మాటలు విన్నతర్వాత మరింతగా కంగారు పడుచు కైకా, నాదగ్గర మరుగెందుకు? అని క్రందపడిన కైక తలను యెత్తి, మహారాజు తొడపైన ఉంచుకొని అనేక విధముల కారణమును తెలుపగోరెను.

క్రొంత తడవైన పిదప కైక కొంత సరుదుకొంటూ, రాజా! ఆనాడు మీరు దేవాసుర యుద్ధమున నా కొసగిన రెండు కోరికల సంగతి మరిచిపోలేదుకదా! అని అడిగెను. అందుకు మహారాజు, కైకా ! యింతమాత్రమునకే నీవింత బేలవయ్యెద వేల ? నా ప్రాణమున్నంతవరకు నీకిచ్చిన వరములు మరువను. మరువలేదు. కైక యెంత ప్రాణమో కైకకిచ్చిన వాగ్దానము అంత ప్రాణసమానము.

"దేవీ! నిన్నెవరైనా కష్టపెట్టిరా ? లేక ఆరోగ్యము సరిగా లేదా? ఏ క్రూరులైనా నీ అభీష్టమునకు విరుద్ధముగా నడచిరా ? చెప్పుము! నీ కొరకైనా ప్రాణాపాయమయ్యే పనియైనను వెరువక, ఆనందముగా చేయుదును. నీవు సంశయించకుము. ఓ మంగళాంగీ! నీ వెందుల కిట్లు బాధపడుచున్నావు ?

సమస్తదేశములు నా స్వాధీనమందున్న విషయము నీకు తెలియునుకదా ? ఏ దేశమునందైనను సరే, ఆ దేశ పదార్థములేవైనను కావలయునన్న ఇచ్ఛయే యుండిన, తెలుపుము, క్షణములో వాటిని తెచ్చి నీ కందించి నిన్నానందపరచు ప్రయత్నము చేతును.

నీవు దేనికి భయపడుచున్నావో దేనికి దుఃఖించుచున్నావో సంకోచపడక తెలుపుము. సూర్యుడు మంచును విడగొట్టినట్లు నీ భయమును దుఃఖమును పారద్రోలుదును."

అని అంటూ దశరథుడు కైకను బుజ్జగించుచు బ్రతిమాలుచున్న సమయమును పురస్కరించుకొని కైక మందర చెప్పిన మాటలను మనసున మరువక, ముందు తన భర్తచేత శపథము చేయించనిదే అప్రియము చెప్పకూడదని నిశ్చయించుకొని బూటకపు ప్రేమను ప్రదర్శించుచూ, కంటినీరు తుడుచుకొనుచూ, కామోద్రేకుడైన దశరథుని హస్తములు పట్టుకొని,

"దేవా! నాకు యెట్టికోపమునులేదు. నన్నెవరూ అవమానించలేదు. నిందించలేదు. విదేశ పదార్థములను నేనంతకంటె కోరుటలేదు. కానీ నాకొక చిరకాల కోరిక కలదు. దానిని మీరు చెల్లింతునని ఒట్టు పెట్టుకొనిన ఆ కోరికేమియో మీకు తెలుపగలను."

అంటూ కొంతచిరునవ్వునుప్రదర్శించిన కైకనుగాంచి,దశరథుడుకూడనుకొంత మందహాసముతోమరింతచెంతకువచ్చి తలనిమురుచూ,"ఓసీ!వెఱ్ఱిరాణీ! ఇంతమాత్రమునకే కొంపమునిగినటుల గోలచేయవలయునా? స్త్రీలలో నీకంటే ప్రియులును, పురుషులలో రామునికంటే ప్రియులును ఈ లోకంబున యెవ్వరును లేరు. మీరు ఇరువురూ నాకు ప్రాణ సమానులు. ఇది నీకు బాగుగా తెలియును. ఒక్క దినము

నా రామునీ, నిన్నూ చూడకున్న నే నిలువలేను బ్రతుకలేను; కనుక అట్టి రామునిపై ఒట్టుపెట్టుకొని తెలుపుదును. నీ కోరికేదియో తెలుపుము. తప్పక చేతును."

అని రెండు చేతులు పట్టుకొని దశరథుడు ఒట్టుపెట్టుకొనగనే కైక, అమితా నందముతో లేచి కూర్చుని దశరథుడు అనుకూలుడుగా మారినట్లు సంతోషించి మరింత ప్రేమను చూపుచూ,

"రాజా! రాముని సాక్షిగా మీరు చెల్లించునటుల శపథము చేసితిరి. ఇది నిజమేనా?" అని అడుగుచూ "రాజా! మీరు సత్యసంధులు, పరమ ధార్మికులు. మహా పరాక్రమవంతులు. దేవాసురయుద్ధము మీకు జ్ఞాపకముండకపోదు. అయినను నేను మరొకపరి తమకు హెచ్చరింతును. ఆ రాత్రి శంబరాసురుడు అందరినీ సంహారము చేయగా, మీరు కడ యూపిరితో బాధపడుచుండిరి. ఆనాడు నేనే మీకు సహాయము చేయకున్న, మెలుకువతో కాపాడకుండిన, మీ రేమయి ఉండెడివారో మీకే తెలుసు. అట్టి పవిత్ర త్యాగమునకు మెచ్చి, కైకా! నా ప్రాణమునే కాపాడితివి. అట్టి నీకు నేను ఏమి ప్రత్యుపకారముగా యివ్వగలను. ఏమయినను సరే, రెండు వరములు కోరుకొనుము. తప్పక నేను నీకిత్తును. నా కృతజ్ఞత చెల్లింతును.

అని మీరు నన్ను కోరితిరి. అందుకు నేను, మీరు క్షేమముగా బ్రతికినదే పదివేలుగా భావించి, నాథా! నాకేమియూ అక్కరలేదు. కావలసిన సమయమున కోరుకొందును. ఆ రెండువరములు మీచెంతనే దాచిపెట్టుకొనుడు. నాకవసరమైనప్పుడు యిప్పించుకొందునని అతి వినయముతో ప్రార్థించితిని. అందులకు తమరు కూడ ఆనందించి నా త్యాగమును మెచ్చుకొని నా జీవితములో యెప్పుడు అడిగిననూ నిధివంటి నీ రెండుకోరికలునూ, యెట్టి అడ్డుచెప్పక అందింతునని తమరు సెలవిచ్చితిరి. ఇవి మీకు మదియందుండియే యుండును కదా!

తమరు భూమినేలు ప్రభువులు. ఆడితప్పనివారు. కాన, ఆనాడు నేను మీ చెంత దాచిన రెండు వరములు నాకిచ్చి నన్నానందపరచమని ప్రార్థించుచున్నాను. నేను నూతన కోరికలేమాత్రమునూ కోరుటలేదు. ఆనాడు మీరు నాకిచ్చిన కోరికలనే, నావి నాకివ్వమనియే కోరుచున్నాను. దాచిన ధనమును వెనుకకు యివ్వనివారు, మహా పాపులగుదురన్న సంగతి నేను వేరు చెప్పనక్కరలేదు

అట్లు తమరు వీలుకాదన్న నాకు పరాభవము. ద్రోహము చేసినట్లగును అట్టి పరాభవమును భరించుటకంటె ప్రాణములు వీడుట మంచిది. సతికిచ్చిన మాటలనే పతి చెల్లించకుండిన ప్రజల అభీష్టము నెట్లు చెల్లించగలరు. సతిని నమ్మించి

మోసముచేయు ప్రభువు ప్రజాపరిపాలనకు అర్హుడుకాడు కదా! అట్టివాడు ప్రభువు కాడన్న మను ధర్మము తమరెరుగనిదా!

వేయేటికి ఈనాడు నా కోరికలు నాకు చెల్లింపకున్న సూర్యోదయము లోపలనే కైక ప్రాణములతో ఉండదు అని గోడున యేడ్చుచున్న కైక నటనలకు ఖిన్నుడై, వలనుపన్నిన బోయవాడు కేక వేయగనే జింక పరుగెత్తుకొనివచ్చి వలలో పడినట్లుగా, కైక పన్నిన వలలో దశరధుడు యేమియు తెలియక కామమోహితుడై ఆమె కోరికలకు లొంగి ఉన్మత్తునివలె, ఈ క్షణమునందే నీ రెండు కోరికలను ఇత్తునని కైక హస్తము తీసి తన హస్తముతో ప్రమాణము చేసెను.

ఆ మాట వినగనే కైక ఉత్ఫుల్ల నేత్రాలతో దశరధుని ముఖమునుచూచుచూ, "రాజా! మీరెంత మంచివారో, ఈనాడు నా కర్థమయినది. ఆడినమాట తప్పరన్న సత్యము నేడు సాక్షాత్కరించెను." అని అనేక విధముల వర్ణింప మొదలుపెట్టెను. అందులకు కాముడైన దశరధుడు ఉబ్బి కైకా! ఇంకా కాలహరణ మెందుకు! కోరు కొమ్మని తొందర పెట్టెను.

కైక మాటలు తడబడ, "రేపటిదినము రామునికొరకు యేర్పాటు చేసిన అభిషేక యేర్పాటు వైభవము లన్నింటితో నా కొమరుడగు భరతునకు రాజ్యాభిషేకము చేయించుట మొదటికోరిక; ఇక రాముడు జటాజినములు ధరించి, నార వస్త్రములతో దండకారణ్యమున పదునాలుగేండ్లు తాపసునిగా వనవాసముచేసి రావలెను. ఇది నా రెండవకోరిక. భరతుడు నిరాటంకముగా యువరాజు కావలెను రాముడు యిప్పుడే నాకళ్ళ ఎదుటనే ప్రయాణము కావలెను. ఈ రెండు కోరికలు చెల్లించి, తాము తమ వంశగౌరవమును నిలబెట్టుకొనుడు, లేదా ఈ క్షణములో కైక మరణమునకైనా ఒప్పుకొనుడు."

అని రాక్షసివలె దిట్టముగా లేచి నిలబడెను. ఈ దారుణమైన కఠినపు మాటలకు మహారాజు దద్దరిల్లిపోయెను. ఇది కలయా? లేక నిజమా? ఈ కోరికలు కోరునది కైకయేనా? లేక మరొక పిశాచమా? రెండునూగాక నా చిత్త భ్రమణమా? మనోజాడ్యమా? అని అంతు తెలియనివానివలె కైకా! నీవు కైకవా? లేక కైక రూపమను ధరించిన మహా రాక్షసివా? మొదట తెలుపుము.

అంటూ అవయవములు పట్టుతప్పినవానివలె నోట మాటరాక కదలుటకు దేహము స్వాధీనములో లేక పిచ్చి పట్టినవానివలె అటూ ఇటూ పిచ్చి చూపులు చూచుచూ, కన్నులనుంచి నిప్పుకణములు రాలుస్తూ, కైకవైపు చూచి ఓ దుష్టచారిణీ! ఏమి నీయీ దుర్బుద్ధి. నా వంశమునే నిర్మూలనముచేయ సంకల్పించితివా?

నీ ప్రేమ పుత్రుడగు రాముడు నీకే మపకారము చేసెను? తన తల్లియైన కౌసల్య కంటె అధికముగా నిన్ను ప్రేమించిన నా రాముని కారడవుల కంపుటలో నీ మన సెట్లొప్పెను? ఇంత కాలము నిన్ను రాకొమారివనుకొంటిని. తీక్షణ విషసర్పమును అజ్ఞానమువలన యింటిలో ప్రవేశపెట్టుకొంటిని. నాప్రాణాధారుడైన రాముని సకల ప్రాణికోటియు కొని యాడుచుండగ నీ కెందుకిట్టి పాపబుద్ధి పుట్టెను?

అవసరమైతే రాజ్యమైనా కడకు ప్రాణమునైనా వదలగలనుకాని రాముని వదలలేను, వదలను! నీకు నీ కుమారుడు రాజు కావాలన్న చేసుకో! నేను, కౌసల్యా సుమిత్రాదులతో నా రాముని తీసికొని అరణ్యమునకు వెళ్ళుదును. అంతేకాని రాముని మాత్రము ఒంటరిగా అరణ్యమునకు పంపను, అది వీలుకాదు.

ఈపాపిష్టి కోరికను మానుకో, రామునిపై కోపము వద్దు కైకా! నిజముగా నీవీ కోరికను కోరుచున్నావా? లేక నాకు భరతునిపై, నీపై ప్రేమ యున్నదో లేదో యని పరీక్షింపచూచుచున్నావా? పోనీ, నీ కుమారునకు రాజ్యాభిషేకము చేయవలెనని కోరవచ్చునుగాని, రాముని అడవులకు పంపమని కోరుటలో అర్థములేదు. తమాషాకైనను పరిహాసమునకైనను ఇట్టి కోరిక కోరరాదు. మహా పాపము.

కైకా! రాముడు జ్యేష్ట పుత్రుడు. మహా గుణవంతుడు. అతని పరిపాలనా దినములు మహావైభవముగా నుండును. అటి దినములు నే చూడవలెనని కలలు కంటు న్నానని నీవే అనేక పర్యాయములు నాతో తెలిపితివికదా! ఈనాడు అట్టి రామచం ద్రుని అరణ్యమునకు పంపమని కోరుటలోగల అంతరార్థమేమి?

నాతో పరిహాసమాడుచున్నావా? పరిహాసమే అయిన ఈ క్రోధగృహమున ప్రవేశించుట యేమిటి? ఈ కఠిననేలపై పరితపించుట యేమిటి? పరిహాసమునకు కూడ నొక హద్దు ఉండవలెనుకదా? మితిమీరిన పరిహాసము మతి చెడినదే కాగలదు. ఇట్టిది పరిహాసమునకైనను నేను భరించలేను. రాముని వీడలేను. కైకా! ఇంత వరకు నీవు ఎంత బుద్ధిమంతురాలిగా ప్రవర్తించితివి. ఇప్పుడు నీకు విపరీతపు బుద్ధి పుట్టినది. వినాశకాలము ఆసన్నమగు చున్నందుననే నీకిట్టి విపరీతపుబుద్ధులు పుట్టినవి. మంచివారికి కీడు తలపెట్టుట మహాపాపము. సత్పురుషులను సతాయించుట రాక్షసకృత్యము. అందువలన మంచివారికి ఎట్టి కీడునూ ఉండదు. దుర్మార్గుల దుష్ట బుద్ధులు సన్మార్గుల కీర్తి ప్రకాశమునకు కాగలవు. కాని ప్రస్తుతస్థితిలో చరించుట, కొంత కష్టముగా తోచును.

ఈనాటి ఏ దుష్టతలపులవలన ఇక్ష్వాకువంశమునకే అనర్థము రాబోవుచున్నది.

ఇంతవరకు నీవొక్క అనుచితమైన పనిని కాని అప్రియమైన పనినికాని చేసి యెరుగవు. ఇప్పుడిట్టి కోరికకోరుచున్నావు. నన్ను నేనే నమ్మలేకపోవుచున్నాను. కైకా! నిరంతరము ధర్మభీతి, దైవప్రీతి కలిగిన నీవు ఈనాడు ధర్మభీతిని యెట్లు వదలితివి? దైవప్రీతిని ఏమి చేసితివి? ధార్మికుడైన రాముని పదునాలుగేండ్లు అరణ్యమునకు పంపుమనుటలో నీ యుద్దేశమేమి?

కుసుమకోమల శరీరుడైన రాముడు సుందరాకారుడైన రాముడు కారడవులలో యెండి, పడరాని బాధలు పడుటచే నీకు వచ్చు లాభమేమి? మన రాజభవనములో వేలాది సేవకులు దాసీలు కలరు. అందులో ఒక్కడైనను రాముడిట్టివాడని అతనిలో ఒక్క తప్పునైనను చూపగలడా? పోనీ, మన రాజభవనమటుంచి, మన నగరమున రాముని యందు తప్పు ఒక్కటైనను చూపెట్టగల వానిని తేగలవా? చూపగలవా? అనేక దీనజనులకు తానే ధనమునిచ్చి, ఆదరించి, దరిద్రులను జూచి వారికి గృహ వసతులు కల్పించి, అనేక విధముల ఆదరించి ప్రజాప్రేమను చూరగొన్న రాముని నీవు ద్వేషించుటలో ఎంత కిరాతకురాలవో చెప్పలేకున్నాను.

అనేక విధముల ప్రజలను పీడించి తమ స్వార్థమును లక్ష్యమందుంచుకొని, తమ మంచినే తాము చూచుచూ, ప్రవర్తించే కిరాతకులు నేడు మంచిగా కనుపించుచున్నారు. దీనులను, దరిద్రులను ఆదరించి, అనుకూలములు సలిపి వారల యోగక్షేమములను స్వయముగా విచారించి, ప్రజామేలును, ప్రజాక్షేమమును కోరి ప్రవర్తించువారు చెడ్డవారగుట యుగదోషమా, లేక నా పాప ఫలమా?

సమస్త జనులు రాముని గుణగణములను వర్ణించుచూ, పొలములందు సహితము తమ పనులలో అలసట కలిగినపుడు ఆ బాధను భరించు నిమిత్తమై రామ గుణములను పాటలుగా పాడుచున్నారన్న వార్తలు విని నేనెంతయో సంతోషించుచుందును. అట్టి దయామయునకు ఈ దారుణ శిక్ష నిచ్చుటకు నీకు మనసెట్లొప్పెను?

నేటి సాయంకాలము పురప్రముఖులను, ఋషులను మహనీయులను, మంత్రులను, పండితులను అనేకమంది తెలివితేటలు కలవారిని అందరినీ ప్రోగుచేసి రామాభిషేక విషయమై హెచ్చరించగా చేరిన వారిలో నొక్కడైననూ, అసంతృప్తిని తెలుపక, అనేక రకముల రాముని కొనియాడిరి. అట్టి జితేంద్రియుడు, త్యాగమూర్తి, సత్యవ్రతుడు అయిన రాముడు మా ప్రభువు కావటము మా పూర్వజన్మ పుణ్యమని జేజేలు తెలిపిరి.

అట్టి ప్రజామన్ననలనందుకొన్న నా ప్రేమరాశిని అరణ్యమునకు పంపమని కోరుదువా? నీవేమైనను సరే నేను నా రాముని అడవులకు పంపను. అంతియేకాదు,

రేపటి దినము రామ పట్టాభిషేకము తప్పదు, అని మొండి ధైర్యముతో తెలుపు చున్న దశరథుని చూచి,

కైక, అమిత రౌద్రాకారమును ధరించి, రాజా! నా రెండువరములు చెల్లింతు నని కొన్ని నిమిషములకు పూర్వము తాము అనేక ప్రమాణములుచేసి, ఇప్పుడు నా వరములు చెల్లించుటకు వెనుకంజ వేయుటలో యిక్ష్వాకుల వంశమునకు అపకీర్తి తెచ్చునది మీరా? నేనా? బాగుగా విచారించుకొనుడు. ఆడినమాటలు తప్పనివారే యిక్ష్వాకువంశజులన్న బిరుదునకు మీరే కళంకమును కలిగించుచున్నారు.

ముందు వెనుక యోచించక, తప్పక నీ వరము లిత్తునని తెలిపినట్టి తప్పు మీదేకాని నాది కాదు. ఆనాడు యిచ్చినది, నేడు యిచ్చినది, మీరే. మీరిచ్చిన వాటినే మీరు వమ్ము చేయుటలో మీ ఘనతను మీరే యోచించుకొనుడు.

అబలను మోసపుచ్చుట, ఆడినమాటను తప్పుట; పరిపాలకులకు తలవంపులే కాని గౌరవ ప్రతిష్ఠలు కాజాలవు. ఆడినమాటలను తప్పి అంగనలను వంచించు వారు మహా కిరాతకులేకాని, ప్రభువులు కాజాలరు. ప్రభువులే యిట్టి కిరాతక చర్య లకు పూనుకొన్న ప్రజల కడగండ్లకు అంతుండదు. అట్టి రాజ్యము రాక్షస రాజ్యము నకు సరి.

ఇంతకాలము అనేక విధముల గౌరవ మర్యాదలను సంపాదించుకొన్న మీబోటివారే ఆడినమాట తప్పిరన్నచో, ఆ అపకీర్తి మీకేకాని నాకు కాదు.

పూర్వపు రాజుల వృత్తాంతములు జ్ఞాపకము తెచ్చుకొనుడు! మీ ప్రమాణ మును భంగము గావించుకొనకుండ చూచుకొనుడు! రాజా! బాగా ఆలోచించండి. మీరు చాల దుర్మార్గమునకు ఒడిగట్టుకొనుచున్నారు. ధర్మము తప్పుచున్నారు పోనీ, మీరంత తెలివితేటలు గలవారే అయియుండిన, నా కోరికలేవియో బాగుగా విచా రించి తదుపరి వాగ్దానము చేసియుండవలెను. మీరు కామోద్రేకులై, కన్ను, మిన్ను గానక, ముందు వెనుక చూడక నా మాటలకు కట్టుబడి, వరములిచ్చి యిప్పుడు వాటిని చెల్లించుటలో నాదేతప్పని నన్ను నిందించుటలో మీరెంత పొరబడు చున్నారో, మీరెంత తెలివితక్కువవారో యోచించుడు.

ధర్మభీతి, దైవప్రీతిగల నేను ధర్మమును లెక్కచేయక, దారుణ మార్గమున ప్రవేశించినటుల చెప్పితిరి. కానీ ధర్మవ్రతుడు, దైవసమానుడన్న కీర్తిని ఆర్జించిన మీరు ఆడినమాట తప్పుటలో మీరెంత ధర్మవ్రతులో మొదట మీకు మీరు యోచించుకొనుడు.

ఎదుటివారి తప్పులను మాత్రమే వెతుకుటలోనున్న తెలివితేటలు అంత

ఉత్తమమైనవికావు. తమలోని తప్పులను కూడ తాము వెదికి వాటిని అట్టి పెద మార్గము పట్టనీయక చూచుకొనుటలో తెలివితేటలకు ఘనత చేకూరగలదు. సర్వ మెరిగిన ప్రభువులే యిట్టి విచారణ సలుపక తమ స్వార్థమును మాత్రమే తాము చూచుకొన్న మాబోటి అబలలగతి చెప్పనక్కరలేదు. అట్టి మీరే చేయుచుండిన మేము చేసితిమన్న అందులో తప్పేమియుండదు.

వరము లిచ్చినది సత్యము, ప్రమాణము చేసినది సత్యము, మాటను తప్పి నది సత్యము. ఈ మూడును సత్యములా కాదా? మీరే యోచింపుడు.

పుత్రప్రేమతో, సతీకామముతో, తబ్బిబ్బై మాటను నీటగలిపినది మీరేకాని నేనుగాదు. పుత్రప్రేమ తల్లికి సహజమే. తన కుమారుడు రాజు కావాలని కోరు టలో తల్లి స్థానమందున్న ప్రతిస్త్రీకి సహజమే. అట్టి రాజ్యము స్థిరముగా కాపాడు కొనుటలో అందుకు తగిన ముందు యోచనలు చూచుకొనుటకుకూడ తల్లి అను వారికి కర్తవ్యమే. నేను సహజ కర్తవ్యములనే అనుసరించితిని కాని విరుద్ధమును చేబట్టలేదు.

రామునకు రాజ్యాభిషేకము చేసిన, అతని తల్లి కౌసల్య రాజమాత కాగలదు. నా కుమారుడు రామాజ్ఞలో చేతులు కట్టుకొని చెప్పిన పనులు చేయుచూ, పనివాని వలె నమస్కరించుచుండుట నేను ఒక్క దినమైనను చూడలేను. చూచి జీవించ లేను. ఆనాడు నా కుమారుని దుస్థితిని జూచి జాలిపడుటకన్నా విషము త్రాగి ప్రాణ మును వీడుట మంచిది.

రాజా! నా ప్రాణసమానుడైన భరతునిమీద ఒట్టుపెట్టుకొని చెప్పుచున్నాను. రాముణ్ణి అరణ్యవాసమునకు పంపించడముకన్నా మీరేమిచేసినా నేను తృప్తిపడను.

అని అతి తీక్షణమైన మాటలతో కైకేయి పలికి నేలమీద పడుకొని వెక్కి వెక్కి యేడ్వసాగెను.

అంత దశరధుడు పిచ్చెత్తిన వానివలె తన తల బాదుకొంటూ, కైకా! ఈ అనర్థము నీకు మేలగునని యెవరైనా బోధించిరా? లేక యేదైనా పిశాచము పట్టి నీ విట్లు పీడింబడు చున్నావా? రాముణ్ణి అరణ్యమునకు పంపమని భరతునకు పట్టము గట్టమని కోరుటలో యేమిటి ఈ వికారము? ఎందుకీ విపరీత బుద్ధి? కైకా! నీ భర్తనైన నాకున్నూ, నీ పుత్రుడైన భరతునకును ఈ రాజ్యానికి నీవు మేలు చేయ తలచుకొన్నట్లయితే, ఈ విపరీతపు కోరికలు వీడుము బాగుగా ఆలోచించు కొనుము. లేకున్న, నీవు నేను నీ కొమరుడు నిష్కారణముగా అపకీర్తికి పాలు కావలసివచ్చును.

అంతటితో పోక, రాజ్యము నాశనము కాగలదు. ఇంకా అనేక ప్రమాదములు సంభవింపవచ్చు. నీచురాలా! ఈనాడు నీవు కోరినట్లు నేనంగీకరించినను భరతుడు రాజ్యపట్టాభిషేకమునకు ఒప్పుకొనుననుటలో నమ్మకమేమి? భరతుడు ధార్మికుడు, మతిమంతుడు. రాముణ్ణి అడవుల కంపుటకు కానీ, ఈ రాజ్యమును ఏలుటకు కానీ భరతుడు ఒప్పుకోడు. ఒక్క భరతుడేకాదు మంత్రులు, పురోహితులు, మిత్రులు, జనులు, ఋషులు, అందరు నీ అభీష్టమునకు విరుద్ధులే అగుదురు. ఇందరి అసంతృప్తితో నీవేమి ఆనందించగలవు. చక్కగా యోచించుకో.

పై వారల అంగీకారముతో ఏకాభిప్రాయముంచి, నేటి సాయంకాలము మన జన సభామధ్యమున రామాభిషేకము గావింతునని ప్రకటించితిని. ఈనాడు నా మాటకే నేను అడ్డుతిరిగిన, సేనతో యుద్ధమునకు ప్రవేశించి శత్రుసేనలను చూచి తిరిగి వచ్చినట్లగునుకదా!

రామాభిషేకమునకు సకలమూ సంసిద్ధమే. అందరికీ వార్త లందించితిని. ప్రజలు రేపటియేర్పాట్లు తగినరీతి గావించుచున్నారు. నగరము అప్పుడే జనముచే క్రిక్కిరిసి కళకళలాడుచున్నది.

ఈ సమయములో నేను రాముణ్ణి వనవాసమునకు పంపిన రామాభిషేకం, రాజ్యపరిపాలనం, వనవాసం కావటం, ఒక రాత్రిలో జరిగిపోయెనా అని ప్రజలు నన్ను పరిహసించరా? జన సభామధ్యమున ప్రకటించిన పలుకులు నే నిప్పు డేరీతిగ సమర్థించుకొందును? మహారాజు యింత తెలివితక్కువవాడని ప్రజలు యెంతగా వెక్కిరింతురు. ఇన్ని సంవత్సరములు ప్రజామన్ననల నందుకొనిన దశరథ మహారాజు మహాధార్మికుడు, గుణవంతుడు, శౌర్యవంతుడు అను పేరుగాంచి కడకు యింత తెలివితక్కువగా ప్రవర్తించెనన్న అపకీర్తి నేనెట్లు భరింతును? అని అనేక విధముల తన గౌరవ మర్యాదలనుకూడనూ విప్పి కైకకు తెలియునట్లు తెలుప ప్రయత్నించెను

కానీ కైక మహామారిగా మారి, దశరథుని మాటలను అణుమాత్రమైనను లెక్కచేయక అతని గౌరవప్రతిష్ఠల నాలోచించక, తనపట్టును వీడక క్షణక్షణమునకు తన వాంఛను పెంచుకొనుచు పోయెను. మహారాజు మాటలకు విరుద్ధముగా పలుకుచు అతని వాగ్దానమును సారెసారెకూ అతనికి జ్ఞాపకము చేయుచు వచ్చెను.

అంత దశరథుడు, "కైకా! రాముడు అరణ్యావాసమునకు పోయినపట్ల నేను క్షణమైనను బ్రతుకను. కౌసల్య స్థితి చెప్పనక్కరలేదు. ఈ క్షణమే ప్రాణము వీడును. ఇక సీత తల్లడిల్లక మానదు. రాముణ్ణి వీడి క్షణకాలమైన తాను ఉండలేదు.

ఈ ఘోరమును ప్రజలు చూడలేరు. మహామేధావి, గుణశీలుడైన, రాముని అరణ్యమునకు పంపుచుండ లక్ష్మణుడు ఊరకుండునా ? వేయేటికి ? మరుక్షణమే లక్ష్మణుడు నీ ప్రాణమును తీయును. ఇది సత్యము, కడకు మన రాజ్యమిన్ని అనర్థములకు, అవస్థలకు గురి కావలసి వచ్చును.

నీకు తెలిసి తెలిసి ఈ ముండ బ్రతుకున కెందులకు యింత ప్రయత్నములు జరుపుకొనుచున్నావో అర్థమగుటలేదు. దురాత్మురాలా! నీ చక్కదనమును చూచి నేను మోసపోతిని. బంగారుకత్తికదా అని గొంతు కోసుకొనుటకు ప్రయత్నించు మూఢుడనైతిని. విషము కలిపిన క్షీరమును త్రాగినవాడనైతిని. నన్ను అనేక యిచ్చకాలతో మోసముచేసితివి. కడకు నా వంశమునే మట్టిపాలుచేయసంకల్పించితివి.

ఛీ! నేనెంత మూఢుడను. అనేక యాగములు సల్పి దైవ కటాక్షమున లభించిన పవిత్రపుత్రుని అమ్మకొని స్త్రీ సుఖమును కొనుక్కొనే పాపినా నేను. ఇట్టిది దశరథ మహారాజు చేయతగినదా? ఇట్టిదానికి నే ఒడిగట్టిన, కుక్కలుకూడనూ నన్ను నిందించునుకదా ? ప్రతిబాలుడుకూడను నన్ను చూచి రాలు రువ్వకుందురా? కడకు యిట్టి గతియా దశరథునకు ? ఛీ! యిది నా పురాకృత దుష్కృతము. మెడకు వేసికొన్నది ఉరిత్రాడని తెలియక భద్రపరచి నట్లయినది. ఇంతకాలము రమించినది మృత్యుదేవత ననువిషయము నాకు తెలియకపోయెను. చేతులారా మృత్యువును రమించితిని, వర్ణించితిని. అది నా పాప ఫలము. కాకున్న స్త్రీ సుఖమునకై కన్న కొడుకును కారడవుల కంపునట్టి తల్లిదండ్రులుందురా! అయ్యో! ఏమిటి ఈ విచిత్రము! ఇప్పటికికూడను నేను నమ్మలేకున్నాను.

కైకా! మార్చుకొమ్ము. నీ మూఢతలంపు. రాముడు నా మాటకు మారు మాటాడడు. అసలు ఈ విషయమును వినిన చాలు, చెప్పనక్కరలేదు. అడవికి వెళ్ళుటకు సంసిద్ధుడు కాగలడు. నన్నెందులకు అడవికి పంపుచున్నావనికూడను ప్రశ్నించడు. అట్టి గుణశీలుడు రాముడు రాముడేమిటి నా కుమారు లెవ్వరును నా ఆజ్ఞను మీరరు. భరతుడు నీయీ తలంపును వినిన సహించడు. తల్లి అని కూడను విచారించక యేమైనను చేయవచ్చు. భరతునకు రాముడన్న పంచప్రాణము. నీ కోరికకు విరుద్ధముగా నైనను చేయ సంసిద్ధుడు. అనగా భరతుడే అడవికి వెళ్ళి రామునకు పట్టాభిషేకము చేయవచ్చు. అట్టి గుణశాలి భరతుడు. వాని మనసును కూడను గమనించలేని నీ దుర్బుద్ధి నేమని చింతింతును.

కైకా! వినాశకాలే విపరీత బుద్ధిః అన్నట్లు నీ వినాశమునకే ఈ వికార తలంపులు కలుగుచున్నవి.

ఈ యిక్ష్వాకుల వంశమునకే తీరని అపకీర్తిని తేగోరుచున్నావు. ఇందరిని తీరని దుఃఖములో ముంచి ప్రాణములు తీసిన నీవు మాత్రము ఏమి ఆనందము ననుభవింతువు. ఒకవేళ ఆనందించినను అది ఆనందమా ?

ఛీ! ఛీ! పరుల బాధనుచూచి, ఆనందించువారు మహాపాపులు. రాక్షసులు. పరుల సంతోషమును కోరువారు పరుల ఆనందము నపేక్షించువారు పవిత్రులు.

మహారాణివై, రాజపుత్రివై యింత మాత్రమయినను తెలిసికొనలేకుండిన రాజవంశములకే అపకీర్తికదా! కైకా! నేను కడసారిగా ఒక్క మాటను చెప్ప తలంచుచున్నాను. విను, రాముడు నా ప్రాణము. వానిని వీడి నేను బ్రతుకలేను. నీ కసంతృప్తి పెట్టలేను. ఒకవేళ నీ తృప్తి నిమిత్తమై నేను రాముణ్ణి అరణ్యము నకు వెళ్ళమని నోటితో తెలుపకున్నను ఈ విషయమును విన్న రాముడు పితృ వాక్య పరిపాలకుడు గనుక తండ్రిమాటను నెరవేర్చుటకై తనకుతానే అరణ్యమునకు బయలుదేరి పోవును. దానికి అడ్డుండదు.

ఆ వార్తవిన్న క్షణమునందే నేను ప్రాణమును విడుతును. లక్ష్మణుడు, సీత, కౌసల్య రామునితో అడవులకు వెళ్ళవచ్చును. కారణమేమన కౌసల్య రాముని విడిచి బ్రతుకదు. సీత రాముని అనుసరించక మానదు. లక్ష్మణుడు రాముని అడుగు జాడలను వీడడు. లక్ష్మణుని అనుసరించి ఊర్మిళకూడ వెళ్ళవచ్చును. అట్టి సమయ మున నేను ప్రాణములను వీడిన ఈ కాయమునకు అంత్యక్రియలు సలుపువా రుండరు.

ఈ వార్త కేకయరాజునకు తెలిపి, భరత శత్రుఘ్నులను గొనివచ్చుటకు కాలము పట్టును. అంతవరకూ దీనికెవ్వరూ సంస్కారము చేయరు. ఒకవేళ నేనిట్టి కిరాతకపు చేష్టలకు ఒడిగట్టితినని, నన్ను ప్రజలుకూడ చూడక, కాకుల గద్దల పాల్గావించవచ్చును. అయితే నా ప్రజలు అట్టి స్థితికి పూనుకొనరు. కనుక భరతుడు వచ్చువరకు యేదో ఒక విధముగ ఈ కాయమును పెట్టియుంచుదురు. కానీ రాజ్య పాలనకే భరతుడు ఒప్పుకొనుపట్ల అట్టివాడు నా కాయమును ముట్టుటకు కాని, దహనసంస్కారములు చేయుటకుకాని వీలుండదు. అట్టివాడు అర్హుడుకూడ కాడుగనుక వానిచేత నీ ప్రేతకర్మను చేయించనని వాగ్దానమైననూ చేయుము అనీ అడిగెను.

ఇట్లు నీవు వాగ్దానమిచ్చినను ఇవ్వవచ్చును కానీ ముండగా బ్రతికి జీవించు టలో నీకేమి ఆనందముండునో తెలుపుము. దుష్టచారిణీ! కడకు యింత కిరాతకురాల వైతివా? రఘువంశమునే నేల రాల్చుచున్నావా ? ఇది నీ స్వభావమా ? లేక వైష్ణవ మాయ నీలో ప్రవేశించి నిన్నిట్లాడించుచున్నదా ? అర్థము కాకున్నది. అని దశ

రథుడు బాధపడుచుండగా మూడు ఝాములు గడచినవి. వ్యాధిగ్రస్తునివలె నిట్టూర్పులు విడుస్తూ కుమిలిపోవుచున్నాడు దశరథుడు.

దశరథుడు కైకను యెట్లయినను మంచి చేసికొని, రామపట్టాభిషేకము పూర్తిగ నెరవేరునట్లు చూడవలెనని తలంచి, "ఓ! దేవీ! నీవు మంగళస్వరూపిణివి! నేనింతవరకు నిన్ను ప్రాణ సమముగా చూచితిని; నీవునూ నన్ను హృదయ సమముగా కాపాడితివి. ఈ మిగిలిన కాలములో, ఈ విధమైన అపోహలకు చోటివ్వక, శేషకాలమును శాంతముగా సంతోషముగా గడుప ప్రయత్నింతము.

ఓ! సుశ్రోణీ! నేనిక యెంతోకాలము బ్రతుకను! ఇంతకాలము సత్యవ్రతుడనని పేరుపొంది సర్వమానవ మన్ననల నందుకొని బహిరంగసభలో, రేపటి దినమున శ్రీరామచంద్రునికి పట్టాభిషేకమును గావింతునని శపథము చేసితిని. రేపటిదినమున, ఈ మంగళకార్యము జరపకున్న లోకులు నన్నెంత నిందింతురో! నన్నెంత అవమానపరతురో! నీవే యోచింపుము.

దేవాసుర యుద్ధమున, నన్ను కాపాడి, ఈనాడు నన్ను పరాభవము చేయుట, నీకే మాత్రము న్యాయముకాదు. పోనీ ఈ రాజ్యమంతయూ నీకు వరదానముగా నిత్తును. నీవే రామునికి పట్టాభిషేకము గావించుము! ఇందుకు భరతుడుకూడనూ అమితానంద పడగలడు.

అంతేకాదు! గురువులు, ఋషులు మంత్రులు, ప్రజలు ఒకరేమి లోకమే నిన్ను మెచ్చుకొనును. నీ యశస్సు లోకములో శాశ్వతముగా ఉండిపోగలదు.

అట్లుకాక, ఈనాడు నీవు రామాభిషేకమునకే అడ్డు తగిలిన లోకులంతా నిన్ను నిందింతురు. నీచపరతురు. నీ కొమారుని సహితము తూలనాడుదురు. నీవలన రాజ్యమునకే కాక వంశమునకే అపకీర్తి వచ్చును. నీవు ప్రతి చిల్లరవానిచేతను ఛీ! ఛీ! అని అనిపించుకొనవలసి వచ్చును.

బాగుగా యోచించుకొనుము! శాశ్వతకీర్తినిగోరి ఈ పట్టాభిషేకమునకు అడ్డు తగులక, రేపటిదినము నీ చేతులార రామచంద్రునికి అభిషేకము గావింపుము అని ఆమెనుఆనందపెట్టుటకై అనేకరకముల మృదుమధురమైన మాటలాడుచున్నదశరథుని చూచి, కైక,

రాజా! మీ మాటలు అతి విచిత్రముగానున్నవి. చెప్పిన మాటలను తప్పించుకొను నిమిత్తమై మీరు వేయు పన్నాగములు నన్నేమాత్రమును మార్చజాలవు. ఏమి కావలయునో కోరుకొమ్ము, యిత్తునని, మీరే వాగ్దానముచేసి, చెప్పినటుల చేయక నేడు ఈ విధమైన బాధలను ప్రదర్శించుట మీకు పాడికాదు. మీ గౌరవ

మర్యాదలను మీరే వమ్ము చేసుకొనుచున్నారు. కానీ ఇందుకు నేనేమాత్రము బాధ్యురాలను కాను.

సత్యమే పరమధర్మమని ధర్మవేత్తలు చెప్పు మాటలను జ్ఞప్తికి తెచ్చుకొనుడు. నేనుకూడనూ ఆ ధర్మాన్ని అనుసరించే, మీరు వాగ్దానము చేసిన వరములను చెల్లించమని కోరుచుంటిని. అందులకు మీరునూ, సరే! అని ఒప్పుకొంటిరి.

ఇప్పుడు, నేనేమిటో అన్యాయమునకు ఒడికట్టినటుల, మహాపాపమునకు పూనుకొనినటుల, తమకు తీరని అపకీర్తి తెచ్చిపెట్టినటుల పలుకుచున్నారు; ఇది యేమాత్రమూ న్యాయముకాదు ఇందులో నాది యే మాత్రమూ దోషములేదు.

ముందు వెనుక యోచించక, మీరు మాటలనిచ్చి క్రియారూపమునకు దిగినపుడు తబ్బిబ్బగుట తమలోని దోషమే! వాగ్దానమును చెల్లించలేనివారు వాగ్దానము చేయుట మహాపాపము. చెప్పిన మాటలను చెల్లించితిరా యెట్టి పాపమైనను సత్యవాక్యాచరణముతో నశించగలదు.

మీకు తెలియదా ? పూర్వము శైబ్యుడు అను రాజు ఒక పావురమును కాపాడుదునని మాట యిచ్చుటచే మాటను నిలబెట్టుకొను నిమిత్తము తన దేహములోని మాంసమును కోసి డేగకు యిచ్చెను.

అదేవిధముగా అలర్క మహారాజు మాటను నిలబెట్టుకొనుటకై ఒకానొక బ్రాహ్మణునకు తన రెండు కన్నులను తీసియిచ్చెను. సమస్త నదుల కధిపతి అయిన సముద్రుడు, సత్యవ్రతము వలననే, తన పొలిమేరను దాటిరాలేక పోవుచున్నాడు.

రాజా! వేయేటికి? అన్నింటికీ అందరికీ సత్యమే పరమప్రమాణము; ప్రాధాన్యము; సత్యమే శబ్దము; సత్యమే బ్రహ్మము; అదే ధర్మము. సత్యమొక్కటే అక్షయముగా నుండునది. అట్టి అక్షయపదమును వీడి క్షయమగువాటికై మీరు ప్రయత్నించుట, మీబోటి రారాజులకు తగనిది.

మీరిచ్చిన మాటను నెరవేర్చుకొని శాశ్వతకీర్తిని నిలబెట్టుకొనుడు! అంతేకానీ, పుత్ర వాత్సల్యమునకు, స్త్రీ వ్యామోహమునకు లొంగి రాజనీతిని, ప్రభుకీర్తిని ఉల్లంఘించి యిక్ష్వాకువంశమునకు తీరని అపకీర్తిని తెచ్చిపెట్టకండి! వేరుగా యోచించక, తక్షణమే రాముణ్ణి పిలిపించి అరణ్యమునకు సిద్ధముకమ్మని చెప్పి భరతుని రప్పించుటకు తగిన యేర్పాట్లు గావించుమని మంత్రితో తెలుపుట మంచిది. తెల్లవార వచ్చుచున్నది. ఈ రెండునూ తెల్లవారులోపున జరిగియే తీరవలయును.

మీరెన్ని చెప్పిననూ, నేను తృప్తిపడను. అట్లుగాక మీరు మొండిపట్టుతో రామపట్టాభిషేకముగావింతురా-నిండుసభలోనేను ప్రాణములువీడుదును, ఇదిసత్యము.

అని, అతి తీవ్రముగా మాటాడుచున్నట్టి కైకను చూచి దశరథుడు మహా రౌద్రుడై, కోపమును మ్రింగలేక వెలుపల పెట్టలేక, వామనమూర్తికి మాటయిచ్చి తప్పించుకొనిపోలేని బలిచక్రవర్తివలె దశరథుడు ధర్మశాపబద్ధుడయి పోయినాడు. కన్నులు మబ్బులు క్రమ్మినవి. తల బరువెక్కినది. నేల వ్రాలినాడు.

కడకెట్టులో ధైర్యమును తెచ్చుకొని "పాపీ! నేడు రామాభిషేకము నిల్పిన, నేను ప్రాణములు వీడుట తథ్యము. తరువాత ముండవై ఈ రాజ్యమును నీ యిష్టము వచ్చినటుల యేలుకొమ్మ" అని ఉద్రేకపూరితముగా పలికి,

"హా రామా! నా చేతులారా నిన్ను అరణ్యమునకు పంపవలసి వచ్చెనా? నేను పంపను. నా ప్రాణముల నయిననూ వీడుదును. కాని నిన్ను విడిచి యుండ లేను. ఓ రాక్షసీ! నా సుకుమార సుందరుని కారడవులకంప నీ మనసు యెట్లొప్పెను? ఎంత కిరాతకురాలవైతివి. చండీ! అంటూ మూర్ఛతో పడిపోయెను.

# పితృవాక్య పరిపాలన

తెలతెలవారుచున్నది. నవధ్వనులు వాయించదొడగిరి. రాజవీధులలో పన్నీరు జల్లదొడగిరి. పురమంతయూ సుగంధములతో నిండెను. సువాసనలతో వాయువు ఉత్సాహముగా ఆకసము నంటెను. పుష్యమీ నక్షత్రము ప్రవేశించెను. వశిష్ఠమహర్షి, ఆయన శిష్యబృందముతో సరయూనదిలో స్నానముచేసి, అభిషేక ద్రవ్యాలతో రాజవీధులలో మహాజనము మధ్య, రాజభటులు దారిని విడిపించుచూ రాగా మహర్షి రాజప్రాసాదములోనికి ప్రవేశించెను.

అప్పటికే, అనేకమంది పురోహితులు, రాజులు, ప్రజాప్రతినిధులు ఆవరణములో ప్రవేశించి, వారివారి స్థానములలో ఆసీనులైనారు.

వీధులలో వేదపారాయణము మిన్నుముట్టుచున్నది. ఇంతలో వశిష్ఠులవారు, సుమంతుని పిలిచి, మంత్రీ! మీరు వెంటనే వెళ్ళి ముహూర్తము సమీపించుచున్నదనియును, దానికి పూర్వము గావించవలసిన పనులు అనేకములున్నవనియును, తక్షణమే మహారాజు యిక్కడకు వేంచేయ వలసియున్నదనియును, మహారాజు గారితో చెప్పి రమ్ము. వశిష్ఠులవారు తమ రాకకై నిరీక్షించుచున్నారని కూడనూ తెలుపమని కబురంపెను.

ఏ అంతఃపురమునందయిననూ యథేచ్ఛగాపోయే అధికారము సుమంతునికి యుండుటచేత "సుమంతుడు" అతి వేగముగా నడచి కైకేయీ అంతఃపురమును ప్రవేశించెను.

సుమంతుడు శయ్యాగృహమును ప్రవేశించగనే, సుమంతునికి యేమీ తోచలేదు. నేల పడిన దశరధుని చూచి, తాను ఆశ్చర్యపడి, తాను భ్రమించుచున్నానా అనునట్లు దిగ్భ్రాంతి చెందెను. దగ్గరకువెళ్ళి "రాజా! చంద్రోదయసమయమున సముద్రునివలె సంతోషించవలసిన మీరు, యిప్పుడు ఏల ఈ రీతిగా పడియున్నారో అర్థమగుటలేదు! మహా శుభసమయము ఆసన్నమయినది. వేదవేదాంగ పారంగతులు సంసిద్ధులై తమ రాకకై వేచియున్నారు.

తామిక లేచి, మంగళాలంకారములు చేసికొని కాంతులతో తేజరిల్లుచూ, సభా భవనమునకు రావలెను. వశిష్ఠులవారు మిమ్ము తోడ్కొనిరమ్మని ఆజ్ఞాపించిరి.

అని అనేక విధముల దశరధుని మేల్కొలుపుచున్న పలుకులు దశరధుడు విన్నాడు. దశరధుడు దుఃఖము నాపుకొనలేక పోయినాడు. బోరుమని యేడ్చుచూ,

సుమంతా! నీ స్తోత్రపాఠము నా హృదయమును చీల్చివేయుచున్నది, అని జాలి పుట్టునట్లన్నాడు. ఆ మాటలను విని సుమంతుడు ముందుకు పోలేకపోయినాడు. వెనుకకు నడవలేక పోయినాడు. చేతులు జోడించుకొని, రాజా! యేమి ఈ వింత? యెంతో ఆనంద పడవలసిన ఈ సుసమయమున మీరింత విచారించుటకు కారణమేమి? నాకేమియూ అర్థము కాకున్నది.

అని సుమంతుడు కూడనూ విచారముతో నిలచియున్న సమయమున కైకేయి వచ్చి, ఓ! మంత్రిపుంగవా, రాజు ఈ రాత్రి యంతయూ రాముణ్ణి గురించి చింతించి చింతించి జాగరణ చేసిరి. మీరు వెంటనే వెళ్ళి రాముణ్ణి ఇక్కడికి తోడ్కొని వచ్చిన, విషయములు విశదముగా వెల్లడి యగును. నేను చెప్పుచున్నానని నీవు వేరుగా భావింపక రాముణ్ణి తక్షణమే తోడ్కొని రమ్ము అని తెలిపెను.

ఆమె ఆజ్ఞనే రాజాజ్ఞగా భావించి సుమంతుడు అతి వేగముగా రామమందిరమునకు వెళ్ళుచుండెను మందిరము చెంత సింహద్వారముల కిరుప్రక్కలా, వీధుల లోను కట్నములతో పన్నీరులతో పుష్పగుచ్ఛములతో బారులుదీరిన జనసమూహమును కన్నుల పండువుగా చూచుచు సుమంతుడు వెళ్ళుచున్నప్పటికిని సుమంతున కేదియో కొరత పడినట్లుగా తనలోతాను అయోమయస్థితిలో మునిగినాడు. కొన్ని నిమిషములకు పూర్వమున్న ఆనందము అతనిలో అడుగంట జొచ్చెను.

సుమంతుడు రథమును తీసికొని రామభవనమునకు వెడలుచుండగా, లక్షలాది ప్రజలు చూచి, రామచంద్రుని పట్టాభిషేకమునకు తోడ్కొని వచ్చుటకై సుమంతుడు వెళ్ళుచున్నాడని, మరింత ఆనందముతో ముఖములు వికసింపచేసుకొని రెప్పవాల్పక వీధులలోనికి చూచుచుండిరి.

ఇంతలో సుమంతుడు రామభవనమున ప్రవేశించెను. ఏడు అంతస్తుల అంతఃపురములోనికి యే అడ్డూ లేక ప్రవేశించెను. మహానదగర్భములోనికి ప్రవేశించే మొసలివలే, అతి వేగముగా చేరెను.

అక్కడ రాముని మిత్రులైన కొంతమంది యువకులు ఉజ్వల కుండలకాంతులతో ప్రజ్వరిల్లుచూ రాముని వెంట వచ్చుటకై సంసిద్ధులై యుండిరి. మరింత లోనికి ప్రవేశించగనే, రాముడు, అలంకారముతో, కన్నులు మిఱుమిట్లు గొల్పు కాంతులతో, చిత్తానక్షత్రములోని చంద్రునివలె కనిపించినాడు.

అంత ఆలస్యమునకు చోటివ్వక, "రామా! కైకేయిదేవిగారునూ, నాన్న గారునూ తక్షణమే మిమ్ము కైకేయి మందిరమునకు తీసుకొనిరమ్మని నన్ను పంపిరి. అందు నిమిత్తమై నేనిక్కడకు వచ్చితిని, అని సుమంతుడు తెలిపెను.

ఆ మాటలు వినిన తక్షణమే, రాముడు సీతను చూచి, సీతా! నీకు తెలియును. ఇది యేదో అంతరాయము కలుగు సూచన తప్ప మరేమీకాదు. తండ్రిగారి ప్రీతికై వారి ఆజ్ఞను మీరకూడదనియూ, వారిని బాధపెట్టకూడదనియు, నేను అన్నింటికీ సరిసరి అని అనవలసి వచ్చెను. కానీ, నాకు ఈ విషయము తెలియక పోలేదు.

తెలిసినమూ, నేను కర్తవ్యమును నిర్వర్తించవలసి యుండుటచే, అట్లు ఒప్పుకొనవలసి వచ్చెను. అని ఇంకా యేమేమో చెప్పుచుండగా, సుమంతుని గుండెలో బండబడినటులయినది.

తాను చూచి వచ్చిన దశరధుని పరిస్థితిని, రాముడు చెప్పు మాటలనూ తాను జోడించుకొనుటచే, ఇది నిజముగా యేదో అంతరాయము కలిగించునట్టిదిగానే అతనికి అర్థమయినది.

ఇంతలో సీత, "నాథా! యేమిటి మీమాటలు! ఈ శుభసమయమున మీరిట్లు మాటాడరాదు. ఏవియెట్లయిననూ సరే! మామగారి మాటను నిలబెట్టవలెను. వారి తృప్తియే, మన తృప్తి! వారికై మనము యెట్టి త్యాగమునైననూ చేయవలెను. వారి ఆజ్ఞను జవదాటక తక్షణమే వెళ్ళిరండి.

అభిషేకమైననూ సరే కాకపోయిననూసరే రెండింటికీ మనము సమాన ఆనందమునే పొందవలెను.

కైకేయిదేవికి మనపై అమితమైన ప్రేమ; ఆ దేవి యేమి చేసినా యేమి చెప్పినా మనమంచికే.

కైకేయికంటె అధికముగా మన మేలు కోరువారు ఈ లోకమున లేరు. అట్టి తల్లీ తండ్రీ తక్షణమే రమ్మనమని కబురంపిరన యెంతో ఆనందము!

అని ఆమె కూడనూ ద్వారమువరకూ రామునితో వచ్చి అనేక రకముల రామునికి నచ్చచెప్పి పంపెను.

రాముడు, సీతా! నాకు అంతమాత్రము తెలియదా? రాబోవు గడియలు, ఇప్పుడు జరుగు గడియలు, గడచిన గడియలు అన్నీ నాకు సమానమే. నేనన్నింటికీ ఆనందముతో స్వాగత మిత్తును. తండ్రి కీర్తిని గోరి నేనేమైనను చేతును, ఎక్కడికైనను పోదును. నీవు కూడనూ దీనికి తోడగుట నాకెంతయో ఆనందమని సీతతో

తెలిపి సుమంతునితో బయలుదేరి వీధిలో నిలిపిన రథముపై కూర్చొనగా వీధిలోని ప్రజలు రామచంద్రప్రభువుకు జై జై జై, అంటూ జయ జయ ధ్వానులు గావించిరి.

అంత సుమంతుడు ప్రజలకు నచ్చచెప్పుటకై ఇప్పుడు పట్టాభిషేకమనకు కాదు వెళ్ళుట. మహారాజును చెంతకు వెళ్ళుచున్నాము కనుక కాలవ్యవధి లేనందున రథమును వేగముగా త్రోలవలసి వచ్చినది. తిరిగి కొన్ని క్షణములోనే రాముడు రాగలడు. మీరు తొందర పడకుడని వారలకు అర్థమగునటుల మంచి మాటలతో తెలిపి సుమంతుడు రథమును అతివేగముగా కైకేయీ మందిరమునకు తీసుకొని పోయెను.

దివ్య రథమునెక్కి రామమందిరమునుండి రాముడు పురవీధులగుండా కైకేయీ మందిరమునకు వెళ్ళుచున్నాడు. శూరులు సింహనాదము చేసిరి. వంది మాగధులు మంగళగానము ఆరంభించిరి. వివిధ వాద్యములు మిన్నుముట్టినవి. జన సమూహములనుంచి జయజయ ధ్వనులు చెలరేగినవి. చక్కగా అలంకరించుకొన్న వృత్తమాంగనలు మేడలనుండి కిటికీలనుంచి మంగళ హారతులు యెత్తుతూ, పూల రేకులను చల్లుచుండ, కనుచూపు మేర దాటిపోయిన రథమును మనోనేత్రములతో రాముని విగ్రహమును హృదయాలలో చిత్రించికొని స్తంభించి నిలిచిన జనము విగ్రహములవలె కట్టుకదలక వుండిరి.

కైలాస పర్వత శిఖరములవలే నున్న వర్ధమానము అనే దశరథ మహా రాజు దివ్య భవనములోనికి రథము ప్రవేశించినది; ధనుర్ధరులు కావలికాస్తున్న మూడు కక్ష్యలలో రథము దాటింది. అక్కడ రాముడు దిగినాడు. మరి రెండు కక్ష్యలు పాదచారుడు అయి పోతూ తన వెంట వచ్చుచున్న మిత్రులను, లక్ష్మణుని, అక్కడే ఆగిపొమ్మని తెలిపినాడు.

అక్కడ యేమి జరుగనున్నదో, రాములకు పూర్వమే తెలుసును. తెలిసి నప్పటికినీ తాను సామాన్య మానవునివలే సహజ ధోరణిలో ప్రవర్తించు చుండెను. కడకు అంతఃపురమున ప్రవేశించెను. తండ్రియైన దశరథుడు పాన్పుపై పడి యున్నాడు. తన జుట్టు చెదరి, ముందు దినము వేసిన వస్త్రములలోనే పిచ్చివానివలే సక్రమ మార్గమును వీడి పడియుండుట రాముడు చూచి ఆశ్చర్యపడి దగ్గరకు వెళ్ళి నాడు కైకేయి, పడక ప్రక్కనే నిలుచొని వున్నది. దశరథుడు కళాహీనుడై విల పించుచున్నాడు. తలనెత్తి రాముని చూచినాడు. నోటిలో మాటలు రాలేకపోయినవి, కన్నులధారలు ఏకధారగా కారదొడగెను,

దశరథుడు యేదియో చెప్ప ప్రయత్నించుచుండినప్పటికిని, నోటిమాట రాలేదు. ఇట్టి భయావహరూపమును రామచంద్రుడు ఇంతకుపూర్వ మెప్పుడునూ చూచి యెరుగడు. చాలా కంగారుగా తండ్రి దగ్గరకు వెళ్ళి తండ్రి పాదములు పట్టి, తామింత విలపించుటకు కారణమేమియో తెలిపిన దానికి తగిన రీతుల నేను తమకు సంతోషము నందించుటకు ప్రయత్నింతును. జీవితమునైననూ నేను అర్పించి తమకు ఆనందము చేకూర్తును. కాన, విలపించక కారణము తెలుపమని ప్రార్థించెను. అంత దశరథుడు "రామా" అని ఒక్కమాట మాత్రము పలికి బోరున యేడ్వ సాగెను; మతి తప్పెను.

రాముడు యెంత వోదార్చిననూ క్షణక్షణమునకూ విచారము అధిక మగుచూ వచ్చెనే కానీ శాంతి చేకూరలేదు. అంత రాముడు ధైర్యముతో "నాన్నా! యేమి టిది. మాబోటి చిన్నవారలకు తగినంత ధైర్యము చెప్పునట్టి మీరు ఈ రీతిగా విల పించుట సరికాదు, ఈ సమయమున అభినందించవలసిన మీరు, ఘోరముగాదుఃఖిం చుట పాడియా? దీనికి పూర్వము యెంతో కోపముతోనూ, విచారముతోనూ వుండి నపుడు నన్ను చూచిన తక్షణమునందే కోపమూ, విచారమూలేక ఆనందముగా శాంతముతో నన్ను దగ్గర చేర్చుచుంటిరికదా. ఈనాడు అట్టి దానికి విరుద్ధముగా నన్ను చూచుకొలదీ దుఃఖము అధికమగుచున్నది. ఈ విచిత్రమునకు కారణము తెలిపి నన్ను ఆనందపెట్టరా? మీ విచారము నన్ను మరింత విచారముతో ముంచి వేయుచున్నది.

నా వలన యేమైనా తప్పు జరిగినదా? లేక, నేనేమైననూ చేయవలసినది వున్న, తప్పక నేను చేతును. నా తప్పును తెలిపిన సరిదిద్దుకొందును. విచారించక, సంశయించక, అభిమానము పెట్టుకొనక తెలిపిన నేను శిరసావహింతును. తండ్రీ! మీరిట్లు చింతించుట మీకునూ, నాకునూ, రాజ్యమునకునూ మంచిదికాదు" అని ప్రార్థించుచూ కైకేయి వైపునకు తిరిగిరి.

చేతులు జోడించుకొని, "అమ్మా! నేనేమైననూ అపరాధము చేసితినా? నాన్నగారికి ఇంత దుఃఖమును కలిగించిన పాపి, యెవ్వరు తెలుపుము. నన్ను చూచిన తక్షణమే అక్కునచేర్చి ఆదరించు తండ్రి ఈనాడు నా ముఖమైననూ చూడ కుండుటలో యేమి కారణము? ఒకపలుకైనా పలుకరించక మొఖము త్రిప్పుకొను చున్నాడు. బహుశా నా వలననే అపరాధము జరిగియుండిన నేను యెట్టి శిక్షనైననూ అనుభవింతును. నాన్నగారు ఆనందముగా వుండిన, అంతేచాలును. అట్లుకాక యింటిలో యేమైననూ అస్వస్థత యేర్పడినదా? లేక భరతశత్రుఘ్నులైన తమ్ములు

యేమైనా కబురంపిరా? వారందరూ క్షేమమేకదా? అమ్మలైన కౌసల్యా సుమిత్రలు క్షేమమేకదా?

నాన్నగారి దుఃఖమునకు కారణమేమో తెలుసుకోలేని స్థితిలో నేను బాధపడుచున్నాను. వారిని సంతోషపెట్టుటకు నేనెట్టి కార్యమైననూ చేతును నాన్నగారి ఆజ్ఞను యెట్టిదైననూ శిరసావహింతును. లోకమున యెవరిజన్మకైనా తండ్రే కారణము. అందువలన యెవరికైననూ తండ్రియే ప్రత్యక్షదైవము. నాకు అతని ఆనందముకంటె వేరులేదు, యేమి జరిగినదో దయయుంచి తెలుపుము.

అమ్మా! స్వాభిమానమువలన వారిని నీవేమైనా పరుషముగా అంటిరా? లేక, నా తల్లి యేమైనా తండ్రిగారి మనసుకు విరుద్ధముగా నడచి బాధ పెట్టెనా? కౌసల్య అట్లు యేనాడూ చేయదు. సుమిత్ర అంతకంటే చేయదు. ఒకవేళ వారు చేసిననూ నాన్న యింత విలపించరు. ఇందుకేదియో ప్రధాన కారణము లేకుండదు. దయచేసి, నాన్న చెప్పుటకు కొంత వెనుకాడిన, తామైననూ తెలిపి నా బాధను తీర్చుము", అని వినయముతో ప్రార్థించిన రాముని చూచి, కైక

దయాదాక్షిణ్యమునువీడి పతి మరింత బాధపడునేమో అన్న విచారమును కూడనూ చేయక, ముందు వెనుక యోచించక, ప్రమాదమును గుర్తించక చెప్ప తగినదా, చెప్పతగనిదా అనే నిత్యానిత్య విచారణ సలుపక, ప్రేమను ప్రక్కకు నెట్టి, అభిమానమును అవలబెట్టి,

"రామా! విను! పూర్వము దేవాసుర యుద్ధములో మీ తండ్రిగారు బాణోపహతుడయి బాధపడుచున్న సమయమున నేను అతనిని రెండు పర్యాయములు రక్షించగలిగితిని. అప్పుడు నా త్యాగమునకు మెచ్చి మీ తండ్రిగారు రెండు వరములు కోరుకొమ్మ, ఇచ్చెదను, అని తెలిపిరి. ఆనాడు వారు క్షేమముగా జీవించుటే నా ప్రధాన లక్ష్యముగా వుండుటచేత నేను ఇప్పుడేమీ నాకక్కరలేదు అవసరమొచ్చినపుడు కోరుకొందునని తెలుపగా, అందులకు మీ తండ్రిగారు సరేనని, నీకిష్ట మొచ్చినపుడు ఇష్టమొచ్చిన కోరిక కోరుకొనవచ్చును తప్పక తీర్తును. దీనికొక కాలనియమము కానీ, విషయసంబంధము కానీ వుండదు, యే కాలములోనైనా యే విషయమునైనా, నా జీవితములో, అడిగినపుడు తీర్తునని మాట యిచ్చెను. ఇక్ష్వాకువంశమున ఆడినమాట తప్పరన్న విషయము నీకు తెలియును కదా?

అట్టి విశ్వాసముతో నేను, ఆ రెండు వరములనూ కోరుకొంటిని. ఒకటి, నా ప్రేమపుత్రుడైన భరతునకు పట్టము కట్టమనియూ, రెండవది, నిన్ను పదునాలుగు

సంవత్సరములు దండకారణ్యమునకు పంపమనియూ కోరితిని. ఇంత మాత్రము నకే మీ తండ్రిగారు ఇంత ఆరాటము చేయుచున్నారు.

వేయేటికి? ఈ నా సంకల్పము నేను మానుకోను. మీ తండ్రిగారు సత్య వ్రతుడు అని, నీవు సత్యవ్రతుడవు అని ఋజువు చేయతలచుకొన్నట్లయితే, నీ విప్పుడే జటాజినాలు ధరించి దండకారణ్యము పోవలెను. అక్కడ పద్నాలుగు సంవత్సరములు నివసించవలెను. నీ తండ్రికి నీవన్న ప్రాణమగుటచే, నిన్ను పంపుటకు యిష్టములేక, నీవేమనుకొందువో అని, నీకుచెప్పుటకు సిగ్గయి దుఃఖించు చున్నాడు. అంతేకానీ మరే ప్రళయమూ సంభవించలేదు.

ఇంత చిన్న విషయమునకు కొండంత ప్రమాదము జరిగినటుల విలపించు టలో అర్థము లేనిదిగా వున్నది. రామా! అంతేకాదు; తండ్రి చేసిన వాగ్దానమును అతను తీర్చలేకపోయిననూ తండ్రి ప్రతిబింబముగా పుట్టిన కొమారుడు దానిని తీర్చు టకు పూనుకొనిననే తండ్రి తరించగలడు కానీ, తానూ చేయక కొమారుడూ అట్టి దానిని గమనించకుండిన తండ్రి అధోగతిపాలు కావలసివచ్చును. తండ్రి ఋణమును తీర్చుటే కుమారుని ప్రథమ కర్తవ్యమన్నది నీకు తెలియనిది కాదు" అని ఆమె నిర్దాక్షిణ్యముగా తెలుపు మాటలకు రాముడు చలించక, చిరు నవ్వుతో,

"ఇంత మాత్రమునకే నాన్నగారు ఇంత విలపించుట నిజముగా న్యాయము కాదు", అని ఆనందవదనముతో అంగీకరించినటుల తలవూపినాడు. ఈ మాటలు వినుచుండిన దశరథుని హృదయము కరకరా రంపముతో కోసినటుల అయినది. తల్లడిల్లినాడు. రాముడు కైకేయి వైపునకు తిరిగి, "తల్లీ, నీవనుకొన్నటులనే జరు గును. మా నాన్నగారి శపథమును నేను శిరసావహించుచున్నాను.

అయితే, నాన్నగారు ఒక్కతూరి యెప్పటివలే దగ్గర చేర్చి ఆదరించి ఆశీర్వ దించిన చాలును. అట్టి దానికి కూడనూ నేను నోచుకోలేదని తెలిపిన, అదియును నేను ఆనందముతోనే అందుకొందును. నా తండ్రి యెప్పుడునూ నా మేలుకోరువారే. అతను మహానుభావుడు. వారు నాకు ఒక్క తండ్రియేకాదు, మంచిని బోధించుటలో ఆచార్యులు; అట్టి జనకుడు ఆచార్యుడు అయిన వారిని సంతోషపెట్టుటకంటే నాకు వేరు కర్తవ్యమేమున్నది? అదే నా ముఖ్య ధర్మము.

భరతునకు రాజ్యాభిషేకము చేయుటలో నేనెంతనో ఆనందింతును. పదు నాలుగేండ్లు వనవాసము చేయుటలో మహదానందపడుదును. పదునాలుగేండ్లేకాదు; తండ్రి ఇష్టమయిన యావత్ జీవితమునే అరణ్యములయందు గడుపుటకు కూడా

సంసిద్ధుడను. కానీ నాన్నగారు ఈ రెండు విషయములను, నాతో చెప్పుటకు యెందులకు వెనుకాడుచున్నారు? అదే నాకు బాధగా వున్నది

తాను చెప్పిన, చేయకుందునా? తనమాట కాదందునా? ఈ రాముడు పితృవాక్య పరిపాలకుడు కాని పితృద్రోహికాడు. తండ్రినుండి యేర్పడిన ఈ కాయమును తండ్రికి అర్పించుటకంటే వేరు కృతజ్ఞత కలదా? హృదయపూర్వకమైన ఆనందముతో అర్పింతును. నేను ఒకరితో చెప్పించుకొనువాడను కాను. భరతునికి రాజ్యాభిషేకము చేయవలెనని నీవైననూ నాతో వకపరి తెలుపలేదెందులకు? నాకునూ నా తమ్మునికీ యెట్టి భేదమూలేదు. అట్టి భేదరహిత హృదయుని చెంత నీవెందుకు భేదమును పాటింతువు. ఇది మీ తండ్రి ఆజ్ఞ అని యెందులకందువు: నీ ఆజ్ఞ మాత్రమునే మీరుదునా? మీరను.

నీవు చెప్పినా తండ్రి చెప్పినా నేను ఆనందముతో చేతును. నేడే అయోధ్యనువదలి అరణ్యమున కేగుదును. అమ్మా! భరతుణ్ణి తాతగారి యింటినుండీ రావించడానికి నేడే తగిన దూతలను పంపించుట అందుకు తగిన యేర్పాట్లు చేయించుట మంచిది. ఆలస్యమెందులకు, నా అరణ్యవాసముతోపాటు భరతుని పట్టాభిషేకముకూడా జరిగిన తండ్రిగారికి కొంత శ్రమ తప్పును. తమకూ సంతృప్తి కలుగును. ఆ తరువాత యెట్లుండునో యెవరు చెప్పగలరు" అని రాముడు చెప్పినందు వలన,

కైకేయికి ఒకవైపున ఆనందము ఒకవైపున కొంత సంశయము కలిగి, భరతుడు వచ్చిన యేమి మార్పు కలుగునో, భరతుడు వచ్చునంతలోనే, అనగా, నేడే రాముని అరణ్యమునకు పంపుట మంచిదని తలంచి, "రామా, నీవు చెప్పినటుల భరతుని అయోధ్యకు తెచ్చు యేర్పాట్లు ఇప్పుడే గావింపవచ్చును. అయితే, భరతుడు వచ్చునంతవరకూ నీవు అయోధ్యలో వుండనవసరములేదు.

నీవు యెట్లాగు వనవాసముచేయ నిశ్చయించుకొన్నావు కనుక కాలయాపన యెందుకు? వెళ్ళుటకెంత ఆలస్యముచేసిన తిరిగి వచ్చుటకు అంత ఆలస్యము కాగలదు. ఇప్పుడే సిద్ధమగుట మంచిది.

ఇదంతా నీతో స్వయముగా చెప్పుటకు మీ నాన్నగారు కొంత వెనుకంజ వేయుచున్నారు. చెప్పవలెనన్న భావము హృదయములో వుండియూ, ప్రేమించిన కొమరునికి ఇట్టి ఆజ్ఞ యెట్లుచేతునను సిగ్గు అతనిని కొంత హింసించుచున్నది. తన వాగ్దానము నీతో చెప్పుటకు మనస్కరించక, ఇంత దుఃఖించుచున్నారు తప్ప అంతకంటే అతనికి వేరు దుఃఖములేదు, నీవెంత త్వరగా అయోధ్యను వదలిన

మీ నాన్నగారి దుఃఖము అంత త్వరితముగా తగ్గిపోవును. నీవు అయోధ్య వదలు వరకూ ఆహార స్నానాదులు సహితము చేయరు. కాన మీ నాన్నగారి దుఃఖము యెంత త్వరితముగా చల్లారవలెనని తలంచిన అంత త్వరగా నీవు అయోధ్య వీడుట మంచిది."

అని నిర్దాక్షిణ్యముగా పలికిన కైక పలుకులు, వినుచున్న దశరథుడు పట్ట లేని దుఃఖముతో, మాటలురాని స్థితిలో ఛీ, ఛీ, దుర్మార్గురాలా! అంటూ, రామా! రామా! అని తిరిగీ మూర్ఛపోయినాడు. అంత ఒకవైపున దశరథుని తల తొడపై నుంచుకొని, తండ్రిని వోదార్చుచూ మరొక వైపున కైకతో, అమ్మా! నేను అర్థ పరుణ్ణికాను, లోకులను లోబరుచుకొని రాజ్యము నేలవలెనను కాంక్ష నాకు లేదు. ఋషివలె ఉండవలెనను కోరిక! కేవలము ధర్మమును నిలబెట్టవలెనను కాంక్ష! పూజ్యపాదులైన తండ్రిని సంతోష పెట్టవలెనను దీక్ష తప్ప అన్యములేదు. ఈ మూడింటికి యేపనియైనా చేస్తాను, ప్రాణమునైనా అర్పిస్తాను.

పుత్రుడయిన వానికి పితృసేవ పితృవాక్యము కన్నా, మహత్తరమైన ధర్మము మరియొకటిలేదు. అమ్మా నాన్నగారు నాతో వాచా చెప్పకపోయిననూ వారు ఆజ్ఞాపించినటుల నీవు చెప్పుచున్నావుకదా? అంతేచాలు. ఇంతియేకాక అతని సమక్ష మున నీవు చెప్పుమాటలు, అతను వినుచున్నప్పటికినీ, అతను యేమియూ చెప్ప లేకపోవుటతో, అతని మాటలుగనే అర్థమిచ్చుచున్నది.

కాన, నేను శిరసావహించి వెళ్ళుచున్నాను. అమ్మా! ఈ నా చిన్న వాంఛను నెరవేర్తునని ఆశింతును. యేమన, భరతుడు రాజ్యపాలనముచేస్తూ, నాన్నగారి ఆజ్ఞను శిరసావహించి అతనిని ఆనందపెట్టునటుల చూచు బాధ్యత నీది, నేనుకానీ, భరతుడుకానీ, వేయేటికి, యెప్పుడైననూ తండ్రిని ఆనందపరచుటకంటె తండ్రిని సంతృప్తుని చేయుటకంటే వేరొండు వ్రతములేదు పితృసేవ, పుత్రునకు సనాతన ధర్మము" అని నమస్కరించగా.

వింటూ వున్న దశరథుని గుండెలు బ్రద్దలయినట్లుగా రాముని ధర్మవచన ములు, శాంతభావమును విని, అతనిపైనున్న ప్రేమ మరింత దుఃఖమునందించి, రాముడు ఇక అయోధ్యలో నిలువడను నిశ్చయము చేసికొని, దశరథుడు మానాభి మానములు వీడి విచారించక, బావురుమని అరచి నేలకూలినారు.

ఈ శబ్దము అంతఃపురకాంత లందరూ విని, వారిలో వారు, ఆశ్చర్య దుఃఖము లతో అందరూ యేడ్వసాగిరి. ఇక ఆలస్యముచేయుట మంచిదికాదని రాముడు గ్రహించి తండ్రి పాదములకు నమస్కరించి అంతఃపురమునుండి బయలు దేరెను.

ద్వారము దగ్గర నిలిచి, పైన జరుగు సంభాషణలు వింటూవున్న లక్ష్మణుడు కంటిధారలు కారుస్తూ ఒకవైపున కైకపై ఉగ్రుడై తండ్రిపై క్రోధమును పూని యేమియూ చెప్పలేని స్థితిలో రాముడు వెలుపలకు రాగానే, అతనిని అనుసరించుచూ చేతులు కట్టుకొని కన్నెత్తి చూడక తలక్రిందికి వంచుకొని వెళ్ళెను.

అయితే రాజ్యము పోయిననూ, అరణ్యవాసము ప్రాప్తించిననూ చిమ్మచీకట్లు క్రమ్ముకొన్నా చంద్రుని కాంతి మాసిపోనటుల రాముని ముఖవికాసము ఏమాత్రమూ మాసిపోక మానావమానములు లెక్కచేయక పరమయోగీంద్రునివలే చిత్త వికారము యేమీ లేకుండా, నడచి వచ్చుచున్న రాముని చూచిన, లోపల యేమీ అశాంతి జరుగలేదన్నట్లు తోచును.

అయితే సుమంతుడు లోనయేదో విరుద్ధమయిన మార్పు జరిగినదని అనుమానించెను. అనుమానించుటేమి, జరిగినదనే నిశ్చయము చేసుకొనెను. లక్ష్మణుని చూచిన సుమంతుని గుండెలు ఝల్లు మనెను. దానికి తగినట్లు రాముడు వెలుపలకు వచ్చిన తోడనే, శ్వేతచ్ఛత్రము పట్టినతోడనే అది తనకక్కరలేదనియు వింజామరలు వీచకూడదనియూ వెండిరథము తనకింక అర్హతకాదనియూ చెప్పిన రామ వాక్యములతో సుమంతుడు నీరయిపోయెను. తన తలంపు పరమ సత్యమని నిర్ణయము చేసుకొనెను.

అంతేకాక, స్వజనులతో కానీ పురజనులతో కానీ మాటాడక, తనకు దుఃఖము లేకపోయిననూ, వార్త వినిన ఇతరులు దుఃఖపడుదురన్న భావముతో తనమాటలలో సత్యము తెలుపక తప్పదనియు, తెలిపిన అందరినీ తనమాటలే బాధపెట్టినటుల కావచ్చుననియూ, తలంచి మాటలాడుటకే పూనుకొనక పోవుటలోని అంతరార్థమని చెప్పక చెప్పుచుండెను.

నేరుగా, సీతాంతఃపురమునకు వెళ్ళక, కౌసల్యాంతఃపురమునకు రాముడు కాలినడక సాగించెను. ఎంతో సంతోషముతో మాటలాడుతూ వున్న కౌసల్యాదేవి మందిరమునకు అన్నదమ్ములైన రామలక్ష్మణులు వచ్చుచున్నారన్న వార్త కౌసల్యాంతఃపుర వనితలకు తెలిసి వారందరూ మంగళ హారతులు సిద్ధము చేసుకొని దారులు కాచియుండిరి. అంతఃపుర ద్వారముదగ్గర పరమ పుణ్యులు వృద్ధులు అయిన ద్వారపాలకులు రాముని రాకనుచూచి దిగ్గునలేచి విజయీభవ విజయీభవ అంటూ తలలువంచి నమస్కరించిరి. రాముడు ఆ మందిరములోని రెండవ కక్ష్య వరకూ వెళ్ళగనే బ్రాహ్మణులు ఆశీర్వదించిరి. మూడవ కక్ష్యలోనికి ప్రవేశించగనే, ద్వారపాలకులైన యువతులు అన్నదమ్ములైన రామలక్ష్మణులను చూచి

పట్టలేని ఆనందముతో లోనికి పరుగెత్తుకొనిపోయి కౌసల్యాదేవికి, రాముడు, సోదరుడైన లక్ష్మణునితో వచ్చుచున్నట్లు తెలిపిరి.

అక్కడనుండి కౌసల్యాదేవి పూజామందిరమువరకూ ఇరుప్రక్కలా జ్యోతులు పట్టుకొని హారతులు యెత్తుతూ సుమంగళులు అలంకారములు చేసుకొని అత్యంత రమణీయమైన రామరాకకు యెదురుచూచుచుండిరి. రాముని చూడగనే, మంగళహారతులు యెత్తిరి. కౌసల్యాదేవి రాత్రి అంతయూ జాగరణచేత తెల్లవారుఝామున పూజలు వ్రతములు మొదలుపెట్టి వృద్ధ బ్రాహ్మణులతో హోమాదులు చేయించుచుండెను. ఆ తల్లి పరమానందముతో తన కుమారుని అభిషేకమహోత్సవమును కన్నులారా చూడగల్గుచున్నాననను ఆనందముతో అనేక రకముల పూజలు, దానధర్మాలు గావించుచూ, ఆహారనిద్రలుమాని ఆనంద ఆహారమునే అరగించుచూ,

పరువు లెత్తుకొని రామునకు యెదురుగా వచ్చి, రాముని శిరస్సు ముద్దాడి చేయిపట్టుకొని పూజా మందిరమునకు తీసుకొని పోయెను. జరిగిన విపరీతము ఆమెకేమాత్రము తెలియదు. అమాయకురాలు, నిరపరాధిని అయిన కౌసల్య నిర్మల ప్రేమతో తెల్లని చీరెను కట్టుకొని వ్రతకంకణములు కరమునకు ధరించి అత్యంత ఉల్లాసముగా తిరుగాడుచున్న కౌసల్యకు, రాముని ముఖము పరమ తేజముగా కనుపించెను. అంతలో కౌసల్య తన మనమున నున్న ఆనందమును దాచుకొనలేక,

"నాయనా, రామా! నీ పూర్వీకులు అందరు రాజర్షులు, పరమ ధార్మికులు, మహాత్ములు, వారలందరివలె నీవుకూడనూ దీర్ఘాయుష్మంతుడవు కావలెను. వారివలే కీర్తిమంతుడవు కావలెను. నీ కీర్తి దిగ్దిగంతాలలోనూ వ్యాపించవలెను."

"నాయనా! నీ వంశోచిత ధర్మాన్ని యెప్పుడు యేమరుపాటునైనను మరువక, తప్పక ఆచరించవలెను," అని ఆశీర్వదించుచూ, అక్షితలు శిరస్సున చల్లి ప్రక్కనే బంగారు పీటవేసి, నాయనా, రాత్రి అంతయూ నీవుకూడనూ దీక్షను పూనియుండుటచేతను ఉపవాసవ్రతము చేయుటచేతను కొంత అలసివుందువు.

అందుపై కూర్చుని కొంత ఫలహారము చేయుట మంచిది అని కోరి తట్టలు సిద్ధముగా వుంచి పెట్టియుండిన బంగారు పళ్ళెరమును అందుకొనెను. తల్లి పడుచున్న ఆనందమును,

ఆమె ప్రేమనూ ఒకవైపున గమనించి, ఈ సమయమున ఆమెకు జరిగిన వార్త యెటు తెలుపవలెనని యోచించుచూ, సిగ్గుపడి, తల్లి సంతృప్తికోసము ఆ పీటను తట్టను చేతితో తాకి, "తల్లీ! ఇప్పటినుండియూ నేను సువర్ణమును ముట్ట

రాదు. బంగారు పీటపై కూర్చొనరాదు. తమరు ఆశీర్వదించిన నేనిక నమస్కరించి దండకారణ్యమునకు పోవలెను. అనుజ్ఞకై వచ్చితి"నని తెలుపగా,

కౌసల్యకు అర్ధముకాక, నాయనా! కొన్ని నిమిషములలో పట్టాభిషేకము జరుగుచుండ, దండకారణ్యమనుమాట చెప్పుటలో నాకేమీ అర్ధమగుటలేదు, అని నవ్వులాట లాడుచున్నాడు నా కుమారుడు, అని భావించి,

నాయనా! ఈ శుభసమయమున నవ్వులకైననూ ఇట్టి అశుభ పలుకులు ఆడ రాదు. నా బంగారు తండ్రి అని క్షీరాన్నమును తన వ్రేళ్ళతోతీసి రాముని నోటిలో పెట్టెను.

ఆ ప్రేమను ఆమె ఆనందమునూ చూచుచూ లక్ష్మణుని కంటినుండి తనకు తెలియక కంటిధారలు కారదొడగెను. వాటిని గమనించిన కౌసల్య ఆశ్చర్యముతో నాయనా! లక్ష్మణా! యెందులకంత విచారము అని దగ్గర చేర్చుకొనగనే లక్ష్మణుడు పట్టలేక గొల్లున యేడ్చెను. కౌసల్యాదేవికి యేమియూ అర్థముకాలేదు. రాముని మాటలకూ, లక్ష్మణుని విచారమునకూ తాను అయోమయస్థితిలో మునిగెను.

ఇంతలో రాముడు తల్లి చేతులు గట్టిగా పట్టుకొని అమ్మా! మీరు విచారించ నని మాటయిచ్చిన నేనొక మాట చెప్పుదును, ఇది నాకునూ నీకునూ యావత్ వంశమునకే సత్కీర్తిని తెచ్చునట్టిది. కాన నీవు యే యోచనకూ చోటివ్వక ప్రీతితో అంగీకరించవలసియుండును. నాన్నగారి ఆజ్ఞను నేను శిరసావహించుట నీకునూ పరమ సంతోషమేకదా ? నాన్నగారు తమ్ముడైన భరతునికి పట్టాభిషేకముచేయ నిశ్చయించిరి. నన్ను పదునాలుగు సంవత్సరములు దండకారణ్యమునకు తాపస వేషమున పంపుటకు నిశ్చయించిరి. వారి ఆజ్ఞ నేను అంగీకరించి తమ ఆజ్ఞకై వచ్చి తిని, అని తెలుపగనే

రామా! అని కౌసల్య నేలకూలెను. యేమి ఈ విపరీతము. నా కోమల పుత్రుని కారడవులకు పంపుటయా ? అట్టి అపచారము నా రాముడేమి చేసెను ? ఇది నిజమా ? లేక రాత్రి అంతయూ మేలుకొని ఉపవాసము సలిపియుండుటచేత నాకు పిత్తమై ఈ రకమైన పలుకులు, నానుండియే వెలువడుచున్నావా ? అని తాను పర్దుకొనుచుండగనే కైకేయి మందిరములో జరిగిన విషయము క్షణములో అంతః పురమంతయూ తెలిసిపోయి, దాసీలు రోదనలు చేయుచూ,

యెక్కడ చూచిననూ కంటిధారలు కార్చుచూ, రామచంద్రా! మమ్మ విడచి వెళ్ళకూడదని కౌసల్యా మందిరమునకు వచ్చుచున్న గుంపులను చూచి, కౌసల్యా కేమియు అర్థముకాక ఆశ్చర్యముతో, దిగులుతో, దుఃఖముతో లేవలేని స్థితిలో

స్తంభించిన దేహముతో ఉన్మత్తురాలై యేమీ మాటాడక, విషయమేమి జరిగినదో తెలుసుకొనగోరి

రాముని వడిలో చేర్చుకొని, తలనిమురుతూ, "నాయనా! ఏమిటి ఈ వార్త! అసలు ఏమి జరిగినదో విశదముగా నాకు తెలిపి నా ఈ బాధను చల్లార్చుము." అని అడుగగనే, రాముడు "కైకకు ఏనాడో యిచ్చిన వరములను పురస్కరించుకొని, కైక ఆ రెండు వరములనూ, నేడు కోరినదట.

"అందులో ఒకవరము, తనకుమారుడైన భరతునకు పట్టాభిషేకము. రెండవది నన్ను పదునాలుగు సంవత్సరములు దండకారణ్యము పంపవలెననియూ అడిగినదట. ఇదీ జరిగిన విషయము" అని రాముడు తెలుపగనే,

"కైక అట్టి వరములు కోరినదా! నీవన్న కైకకు అమితమైన ప్రేమకదా! ఆమె యేనాటికీ అట్టి వరమును కోరదని నా భావము. పోనీ, కోరినది! రాజుగారిని పరీక్షించుటకై యుండవచ్చును! అంత మాత్రమునకే ఇంత కంగారా!

ఒకవేళ ఆమె కోరినచో నీతండ్రి నిన్ను అరణ్యము పంపను ఒప్పుకొనునా! నేను నమ్మను. ఒక్కక్షణమైననూ నిన్ను చూడక వుండలేని నీ తండ్రి పదునాలుగు సంవత్సరములు అరణ్యములో పెట్టునా? యేదో ఇదంతయూ నన్ను అయోమయ స్థితిలో పడవేయుచున్నది.

అని, ఆమె జరిగిన సత్యమును నమ్మలేక పోవుట చూచి, రాముడు తిరిగి చేతులు పట్టుకొని, అమ్మా, నామాటను నమ్ము! నాన్నగారు మొదలే ఆమెకు మాట నిచ్చి, తదుపరి ఆమె ఇట్టి వరములు కోరగనే, తన మాటను తాను వెనుకకు తీసుకొనుటకు ఆడినమాటను తప్పుటకు ఇష్టములేక, నన్ను పీడుటకు అరణ్యమునకు పంపుటకూ మనసొప్పక మహాబాధపడుచున్నాడు. ఈ బాధతో అతనిని చూడలేక పోవుచున్నాను. ఇప్పుడు నేనక్కడ నుండియే వచ్చుచున్నాను. అతను ప్రజ్ఞలో లేడు, ఘోరమైన బాధను అనుభవించుచున్నాడు.

ఇది పరమసత్యము. నవ్వులకై నిన్నింత బాధపెట్టుటకు నేను అంతమూర్ఖుడను కాను. పితృవాక్యమును నిలబెట్టుటకై నేను వెళ్ళకతప్పదు. తండ్రి ఆజ్ఞ తీసుకొనే వచ్చితిని. ఇక నీ ఆజ్ఞ కావలెను అని పాదములకు నమస్కరించిన రాముని చూచి కౌసల్య,

"రామా! యేమి ఈ వికారభావము! యెట్టి కిరాతకులైనను ఇట్టి కోరిక కోరుదురా? కొన్ని నిమిషములలో పట్టాభిషిక్తుడు కానున్న నిన్ను కఠిన అడవులకు పంపుట మానవమాత్రులు తలంచని తలపు కాదా?



బ్రతికినంతకాలమూ నాకు బాధలేనా? యెన్నియో వ్రతములుచేసి కడకు కొడుకు లభించెను కదా అని అనుభవించిన బాధలన్నింటినీ మరచి నా ముద్దు బిడ్డను చూచి ఆనందించు చుంటినే. యే సుఖమునూ నేను ఆశించలేదు. నా కొమరుడు నా చెంతనుండిన చాలునని కోరితిని. దానికి కూడనూ నోచుకోలేనిదాననైతి కదా! కారడవులకు పంపుటకే నేను కొడుకును కంటినా? యే తల్లియైనా కొడుకును కారడవులకు పంపుటకు అంగీకరించునా?

నేనే పాపము చేసితిని? యే జన్మములో తల్లి బిడ్డలకు యెడబాటు సలిపితినో కదా? నీకు ఉపనయనము అయినది మొదలు నా కొమరుడు యేనాడు యువరాజు అవుతాడో అన్న భావము నాలో క్షణక్షణమూ ఉత్సాహముతో యెదురు చూచు చుండెను. అట్టి నా కలలు కల్లలాయెనా? నా ఆశలన్నియూ అడియాసలయిపోయెనా? నేను నీ కొరకై చేసిన పూజలు వ్రతములు హోమములు వ్యర్థము లయ్యెనా?

నేనెంత పాపినైతిని! నిజముగా ఈ వార్తవిని నా గుండె పగలకున్న దెందులకు? నేనింకా యెన్ని దుఃఖముల పాలుకావలెనో కదా? నాకు చావు లేదు కాబోలు, ఇంత దుఃఖ వార్త వినియూ నా గుండె ఆడుచున్నది. ఇంతకూ కాలమువస్తేనే చావుకూడనూ వచ్చును. నన్ను చూచి ఆ యముడు కూడనూ వదలి వెళ్ళుచున్నాడు కాబోలు! యమలోకమునకు కూడా నేను అర్హురాలను కాను కాబోలు, అని

హా! రామా! ఎంతటిగతి సంభవించెనని క్రిందపడి పొర్లుచు గుండెలను బాదు కొంటూ విలపించు కౌసల్యను రామచంద్రుడు చూడలేకపోయెను. చుట్టూ చేరిన దాసీల రోదనలు తన చెవులను బ్రద్దలుచేయ దొడగెను. రాముడు యెవ్వరితోనూ పెదవులెత్తి మాటాడలేదు. తల్లిని సమాధానము చేయుచూ తలను సర్దుచూ, నేల లోని మట్టి తల్లివంటికి తగిలియుండగా దానిని శుభ్రపరచుచూ,

సముద్రములో పాతుకొనిపోయిన గండశిలవలె అలలకు కదలక మెదలక వుండినటుల రామచంద్రుడు శోకమునకు కానీ ఆనందమునకు కానీ అతీతుడై నిలిచి యుండెను. పట్టాభిషేకమునకుఎట్టి తేజస్సుతో ఉత్సాహముతోసంసిద్ధుడాయెనో అరణ్య జీవితమును గడుపుటకుకూడా అట్టి ఉత్సాహముతో, తేజస్సుతో సంసిద్ధుడైయున్నాడు.

రాముడు మహా దీక్షాపరుడన్నమాట కౌసల్యకు కూడను తెలుసు. రాముడు ఆడినమాట తప్పడనియూ తండ్రి ఆజ్ఞను జవదాటడని కూడనూ కౌసల్యకు తెలుసు. తానిక యెంత విలపించినను రాముడు వెనుకకు తిరుగడనియూ అరణ్యమునకు తప్పక వెళ్ళుననియూ పూర్తిగా తెలుసుకొని రామునికి అడ్డుచెప్పుటకు తాను యే మాత్రమును ప్రయత్నము చేయక మనసును గట్టి చేసుకొని

నాయనా! మనవ్రాత యిట్లుండ, యొకరిననీ ప్రయోజనముండదు. అన్నియూ మన మేలునకే. దైవనిర్ణయమును యెవరునూ కాదనలేరు. నాకేనాడునూ ఈ అయోధ్యలో అంతఃపురములో సుఖములేదు. నేను అనుభవించనూలేదు. కాన నా కుమారుడుండు స్థానమునందే నా సుఖమున్నది కాన, నేనునూ నీవెంట వత్తును, గొని పొమ్ము అని లేవ ప్రయత్నించెను. అంతలో దాదులు ఆమెను పట్టుకొని ఆనించుకొని వోదార్చుచూ కూర్చొనబెట్టిరి. కౌసల్య మాటలను వింటూ

ఆమె బాధను చూస్తూవున్న లక్ష్మణుడు తన మనసులోని భావములను అణచుకోలేక, మహా ఉగ్రుడై చేతులు కట్టుకొని కౌసల్యాదేవిని చూచుచూ, ఓ పూజ్యురాలా! ఒక ఆడదాని మాటకు లోబడి రాముడు రాజ్యమును వదలుకొని అడవుల పాలు కావటమును నే నంగీకరింపను, సహింపను. తండ్రిగారు వృద్ధుడగుటచేత, మనస్సు స్థిమితములేక, పైగా విషయ లోలుడున్నూ అగుటచేత, కైకేయీ ప్రేరేపణకు దాసుడై మన్మథ పారవశ్యములో పడి ముందు వెనుక యోచించక ఏమైనా ఆజ్ఞాపించగలడు.

అట్టి ఆజ్ఞలన్నింటిని మనము పాటించరాదు. నిత్యానిత్య పరిజ్ఞానములేని స్థితిలోవున్న రాజు రాజు కాజాలడు. అట్టివారి ఆజ్ఞ ఆజ్ఞకాజాలదు. కాకున్న రాజ్యములో కూడనూ వుండక, అడవులకు వెళ్ళగొట్టవలసినంత మహాపరాధము రాముడేమి చేసెను?

రాముని శత్రువులు కానీ అపరాధములు చేసి శిక్ష ననుభవించుచున్న కిరాతకులు కానీ లేరు. అట్టివారు సహితము రాముని చూపునందైననూ దోషారోపణము చేసి ఎరుగరే! ఏ ఒక్కడునూ యే ఒక్క దోషమూ ఎన్నడునూ రామునికి ఆపాదించి ఎరుగరే. అటువంటి నిరపరాధిని నిర్మలచిత్తుని, పవిత్ర పురుషుని అడవులకు వెళ్ళగొట్టుటలో యే రాజుకునూ అధికారము లేదు.

రాముడు ఋజువర్తనుడు, జితేంద్రియుడు. ఎట్టి శత్రువులనయిననూ అతడు ఆదరించును, ఆదరించెను. అట్టి సుపుత్రుని యెట్టి తండ్రి అయిననూ అడవులకు వెళ్ళగొట్టునా? అందులో మహాధార్మికుడు పవిత్రవీరుడు సర్వధర్మప్రవర్తనుడు అయిన రాజు ఇట్లు ఆజ్ఞాపిస్తాడా? దీనిని పట్టిచూడ దశరథునకు మతిభ్రమణ అయి వుండవచ్చును, లేదా మన్మథపరవశుడు అయి వుండవచ్చు.

ఈ రెండు స్థితులలో వున్నవారి ఆజ్ఞ ఆచరణ యోగ్యము కాజాలదు. పిచ్చివానివలె యేమియూ తెలియని పిల్లవానివలె ప్రవర్తించుచున్న రాజు మాటలను మన్నించనవసరములేదు. రాజనీతిని మరచి లోకరీతిని విడచి పుత్రవాత్సల్యమునకు

స్వస్తిచెప్పి ఉన్మత్తుడై చిత్తమును స్వేచ్ఛగా వదలి సంచరించే దశరథుని ఆజ్ఞ ఆజ్ఞగా పాటించుటలో నే నంగీకరింపను, అని లక్ష్మణుడు అంటూ రామునిపై పున తిరిగి చేతులు కట్టుకొని, "రామా! నన్ను మన్నింపుము. ఈ విషయము ఇతరులకు తెలిసే లోపలనే నీవు రాజ్యాన్ని స్వాధీనము చేసుకొనుము. నేను ధనుర్ధరుణ్ణి అయి నీ వెంట వుందును. నా ధనుస్సు పూజించుటకై లేదు, అయోధ్యానగరమున నిన్ను యెదిరించే వారిని దండించుటకే ఈ ధనుస్సు వున్నది.

అట్లు యెదిరించువారు మన అయోధ్యలోనేకాదు, యెందునూలేరు, అట్లు కాక నిన్ను యెదిరించటమే జరిగెనా, నా ఈ తీక్ష్ణ బాణములకు ఈ మహా నగరము నిర్మానుష్యమై పోగలదు.

వేయేటికి? భరతుడు, అతని హితమునుకోరే ఇంకా యెవరైనను కానీ నా మీదికి వచ్చునట్లయిన వారల నందరినీ నాశనము చేతును. కైకేయీ ప్రోత్సాహము వలన దశరథ మహారాజే శత్రుత్వము వహించి మనపై వచ్చెనా, ఆయనను కూడనూ లెక్కచేయను. అతనిని బంధించి చెరసాలయం దుంచుదును. అని యింకా యేమేమో చెప్పబోవుచున్న లక్ష్మణుని చూచి రాముడు,

"లక్ష్మణా, మాటలు మితిమీరుచున్నవి. నా యిష్టమును యెవరునూ కాదన లేరు. నా సంకల్పమును యెవ్వరూ మార్చలేరు. నేను అడవికి వెళ్ళక తప్పదు. నాపై గల ప్రేమతో నీవు నా యెడబాటును భరించలేక ఇట్లు మాట్లాడుతున్నావు. శాంతము సర్వమునకూ రక్ష! నీవు శాంతము వహించు. తండ్రిని కానీ సోదరుడైన భరతుని కానీ ద్వేషించకు. వారు పవిత్రులు, నిర్మలచిత్తులు.

కైకకూడనూ పరమ పవిత్రురాలు, పూజ్యురాలు. ఆమె కోరిన కోరికయందు కూడ యెట్టి దోషమునూలేదు. తన కొడుకైన భరతుని కంటెనూ నన్ను అధికముగా ప్రేమించెను, చెంతచేర్చెను, ఆదరించెను, ఆడించెను, ఆనందించెను అట్టి దేవి ఈనాడు ఇట్టి లోకవిరుద్ధమైన కోరికను కోరినదన్న ఇందులో ఏదో ఒక అంతరార్థము లేకపోలేదు. ఇది దైవనిర్ణయమే కానీ పురుషకార మేమాత్రమునూ లేదు. శాంతము వహించి ముందు జరుగు దానిని విచారించమని బోధించెను.

అంత లక్ష్మణుడు రామునకు నమస్కరించి, రామా! నీకు రావలసిన రాజ్యమును యేహేతువువలన కైకేయీదేవి తన కుమారునకు కట్టపెట్టతలచెను? యే ధర్మమును యే బలమును చూచుకొని అట్లా చేసెను? జ్యేష్ఠపుత్రునికి లేని అధికారము యేపుత్రునకున్నది? మీరుపితృప్రేమచే ఇట్టిమూర్ఖపుఆజ్ఞలను సహితము శిరసావహించు చున్నారు కాని మీరెన్ని చెప్పిననూ నేను సమ్మతింపను. అనికౌసల్యవైపునకుతిరిగి,

ఓ దేవీ! నేను నిజముగా రామానురక్తుణ్ణి, సత్యప్రమాణముచేసి చెప్పు దును. రాముని విడచి నేనొక నిమిషముకూడనూ నిలువను రామునికి ఒకవేళ రాజ్యా కాంక్ష లేక అడవులయందే నివసించుట ప్రీతిగా తోచిన, నేనుకూడా అతనితో వెళ్ళు దును. అతని అడుగుజాడల ననుసరింతును. అతనిని నీడవలే చూచుకొందును. అతడు ఆజ్ఞయేచేసిన, మండుటగ్నిలోనైననూ ఆనందముతో దుముకుదును.

నాకు రామాజ్ఞతప్ప అన్యుల ఆజ్ఞను నేను చెవియందైననూ వేయను. అమ్మా! మీ దుఃఖమును నేచూడలేను. మీకు కుమారుడైన, రామచంద్రుడు నాకు ప్రాణముతో సమానము. అట్టి ప్రాణమును వీడివుండుటకు యెట్టివాడునూ అంగీక రించడుకదా!

అని లక్ష్మణుడు చెప్పుచున్న పలుకులు కౌసల్యకు కొంత శాంతిని చేకూర్చి నవి. లక్ష్మణుని తల నిమురుచూ, కుమారా! నీ ప్రేమ నన్ను యెంతనో సంతోష పెట్టుచున్నది. నాకు నీ వచనములు మహాబలము నందించుచున్నవి. నీబోటి సోద రుడు లోకమున అరుదు. ఇట్టి పుత్రరత్నములను కన్నతల్లులు, మహా పవిత్రులని లోకులు తలంతురుకాని, మేమెంత పాపము చేసితిమో అన్నబాధ మాకు తప్ప అన్యులకు అర్థముకాదు. రాముడు తన పట్టును వీడడు. అతనికి వెళ్ళకతప్పదు. కాన నన్నుకూడా మీతో గొనిపొండు, అని విలపించినది కౌసల్య.

లక్ష్మణుణ్ణి చూస్తూ రామచంద్రుడు, "తమ్ముడా! నీకు నామీద యెంత అను రాగమున్నదో నేనెరుగుదును. నీ పరాక్రమము, బలము, ప్రభావము కూడనూ నాకు తెలియనిదికాదు. సత్య స్వరూపములు తెలుసుకొనలేక తల్లియైన కౌసల్యా మహా దుఃఖమును అనుభవించుచున్నది. అంతియేకాక కన్నకడుపగుట చేత, ఇట్టి బాధ సహజమే. కానీ సకల పురుషార్థములకూ ధర్మమే మూలము, ధర్మము, సత్యము మీదనే నిలచియున్నది. సత్యము లేక ధర్మము నిలువజాలదు.

సత్య ధర్మములు రెండునూ అవినాభావ సంబంధము కలవి. పితృవాక్య పరి పాలనచే నాకు ఇప్పుడు సత్య ధర్మములు రెండునూ సమకూరుతున్నవి. తల్లికికానీ తండ్రికికానీ పెద్దలయిన గురువులకుకానీ మాటయిచ్చిన తరువాత ధార్మికుడైనవాడు ఎవడునూ తప్పడు, తప్పకూడదు. అందువలన పితృ ఆజ్ఞను నేను అతిక్ర మించను.

నన్ను ఆజ్ఞాపించినది కైకేయి కాదు, పిత్రాజ్ఞను ఆమె నాకు అందించినది. అట్లు అందించుట అతని సన్నిధియందే కనుక దానిని శిరసావహించవలసినదే. అట్లు పితృ ఆజ్ఞయే కాకుండిన కైకేయీదేవి పితృ ఆజ్ఞగా నాకు తెలుపుచుండినపుడు

తండ్రి, ఇది నా ఆజ్ఞకాదని చెప్పియుండవచ్చునుకదా. అట్లు చెప్పక, పూరక విల పించుచుండెను. కనుక, అతను అంగీకరించినటులే కాన నేను నా సంకల్పమును మార్చుకొనను, మార్చుకొనుటకు వీలులేదు.

నీవు పూరక భయంకరమైన క్షత్రియ ధర్మముమీదికి నీ బుద్ధిని పోనీయవద్దు. క్రౌర్యమువీడి నా పద్ధతిని అవలంబింపుము. అని లక్ష్మణుని చెంతకువెళ్ళి విచార ముతో క్రుంగిపోవుచున్న అతని వీపును నిమిరి పరమశాంతముతో ప్రేమవచనము లతో వోదార్చుటకు పూనుకొనెను. తరువాత తల్లియైన కౌసల్యవైపున చూచుచూ, అమ్మా! నా తలంపునకు అడ్డుతగిలి నా వ్రతమును భంగపరచవద్దు. నేను యేవి యెట్లు జరిగినను అరణ్యమునకు పోకతప్పదు. నీవు ప్రేమతో అనుమతించి పంపుము, ఆశీర్వదించుము, అని మోకాళ్ళపై వంగి నమస్కరించుచున్న రాముని చూచి తల్లి కుమిలిపోవుచూ, దుఃఖములను మ్రింగుచూ, రాముని వీపున చేతులుంచి బోరున యేడ్చుచుండుట రాముడు భరించలేక, తల్లి పాదములపట్టి, అమ్మా నామాట పరమసత్యము! వనవాసమునందు నాకెట్టి ఇక్కట్లునూ సంభవించవు. అత్యంత ఆనందముగా సుఖముగా ఈ పదునాలుగు సంవత్సరములూ గడిపి తిరిగి నేను తమ సన్నిధికి వచ్చి వ్రాలగలను. తమ అభీష్టమును నెరవేర్చగలను. అమ్మా! దశరథుని ఆజ్ఞను నేనేకాదు, నీవు లక్ష్మణ సుమిత్ర భరతశత్రుఘ్నులు సహితము నెరవేర్చ వలెను. శిరసావహించవలెను. ఇదియే సనాతన ధర్మము.

తల్లీ! మరొక మనవిని మన్నించవలెను. నాకొరకై యేర్పరచిన, సమకూ ర్చిన సంబారములను నీవు సంతోషముగా సమానప్రేమతో భరతుని రాజ్యాభిషేకము నకు ఇచ్చివేయవలెనని ప్రార్థింతును. నాకు అరణ్యరాజ్యమును అప్పజెప్పెను నాన్న గారు. అయోధ్య రాజ్యమును భరతునకు అందించును. ఎవరెవరి బాధ్యతను వారు నిర్వర్తించుటయే పరమధర్మము. కర్తవ్యమును నిర్వర్తించక, కఠినమని తలంచుట పుత్రునకు సరికాదు. తల్లియైన నీవు రాముడన్నను, భరతుడన్నను భేదములేక ఇరువురి బాధ్యతలను సక్రమముగ కొనసాగించుడని కోరి ఆశీర్వదించుటే తమ విధి". అంత కౌసల్యాదేవి రామమాటలను ఆలకించుచూ, భరించలేని దుఃఖముతో నేలకూలి, "నా కొడుకా! శరీర సంబంధమునందును, పెంచి పెద్ద చేయుటయందును నీకు నీ తండ్రి యెంత పూజ్యుడో నేనునూ అంత పూజ్యురాలనే కదా! అంతియే కాక పతికి సతి అర్ధాంగి. అనగా, పతిలోని యెడమ భాగము సతి, సతిలోని కుడి భాగము పతి. ఈ విధముగా ఒకరిలో ఒకరి అర్ధ భాగము సతి పతులయి వుండ నేను దశరథునిలోని అర్ధభాగము అగుట చేతనే నన్నూ అర్ధాంగి అని పిలుచుట నీకు తెలి

యదా! నాడు నీ తండ్రి నాకు ఆజ్ఞ ఇచ్చెనని చెప్పుటలో అర్ధ ఆజ్ఞే కానీ పూర్తి ఆజ్ఞ కాదుకదా! మిగిలిన పూర్తి ఆజ్ఞ కావలెనన్న నేను కూడనూ సమ్మతించినపుడే నీవు పరిపూర్ణఆజ్ఞను పాటించినవాడవగుదువే కాని లేకున్న అట్టిది ఆజ్ఞ క్రింద సమ కట్టుట సరికాదనునది కూడనూ విచారించవలెను.

సర్వ ధర్మములు తెలిపిన నీవు ఈ ధర్మమునుకూడ యోచించవలెనుకదా? తల్లి ఆజ్ఞ లేక యెట్టి ధర్మము పూర్ణరూపమును ధరించదు, కానేరదు. పితృ ఆజ్ఞ కంటే మాతృఆజ్ఞ అతి ప్రధానము. కని, పెంచి, పెద్ద చేయునది తల్లికాని తండ్రి కాదు. నవమాసములు తల్లియే భరించకున్న పుత్రుడే లేడుకదా? అట్టితల్లి వి శోకాగ్నిలో వేసి తండ్రిఆజ్ఞ తండ్రిఆజ్ఞ అని నీవు తండ్రికే ప్రధానము నందించుట నేనేనాటికిని అంగీకరింపను. ఇదినీకుతగినదికాదు. తల్లికి కొడుకునకు మించినధనము వేరులేదు. అందునా నా బోటి తల్లికి, కొడుకే సర్వము. కొడుకు కడగండ్ల పాలు చేసి పితృఆజ్ఞ అని దానిని అంగీకరించిన, నాకు పరలోక ప్రాప్తి, స్వర్గలోకమున అమృతపానము చేయు ప్రాప్తి, లభించియు ఫలమేమి? నేను నరకము ననుభవించి ననూ సరే నా కొమరుడు నా చెంతయుండిన, లేక నేను కొమరుని చెంతయుండిన అంతేచాలు; అదే నాకు సర్వము.

రామా! ఇక్కడుండి మాత్రము నేను చేయునదేమున్నది? నా జీవితములో యేనాడును నేను సంతోష మనుభవించ నోచుకొనలేదు. పుట్టినదిమొదలు తల్లి దండ్రుల ఆజ్ఞలను అనుసరించి, కడకు యెట్టిపతి లభించునో యెట్లుండునో అను విచారముతో కుములుచుండ, పెండ్లి ఆయెను; కొన్ని సంవత్సరములు పుత్రులు లేరను విచారముతో కాలము గడిపి తరువాత సవతులతో పోరుపడితిని; ఆనాటి మొదలు నేటివరకు ఆ బాధలు తప్పలేదు.

యే జన్మనోము ఫలమో, నిన్ను కొడుకుగా వడసితిని. ఇంతలో నీ వియో గము ఈ రీతిగా సంభవించుచున్నది. యేనాడు సుఖము? జీవితమే ఒక దుఃఖ సాగరమయి అందులో పడి గట్టు చిక్కక, ఈదలేక, మునకలు వేయుచున్న నాకు రామాధార మొక పట్టుకొమ్మగా వుండెను? నేడు దానినికూడను పీడిన నా గతి యేమగునో బాగా విచారించుకో, నాయనా.

నేను లేకపోవుటచేత మీ తండ్రికే కొరతయూ వుండదు. అతని ఆనందము కైకతో చేరినదేకానీ, మరెవ్వరూ అవసరముండదు. కాన ఇక్కడవుండి ఈ రీతిగా రాత్రింపగలు కుమిలి తుదకు ప్రాణములు విడుచుటకంటే, నా ముద్దు కొమరుని మోమును చూచుచూ, అరణ్యములో అన్నపానాదులు లేకపోయిననూ పోయిని

అనుభవింతును, అని పరిపరివిధముల విలపించుచున్న కౌసల్యా వాక్యములు రామచంద్రునకు సరియైనవిగా తోచినవి.

మరొకప్రక్క తండ్రి ఆజ్ఞను శిరసావహించక తప్పదన్న శపథము వత్తిడి పెట్టుచుండెను. ఇంతలో లక్ష్మణుడు "అన్నా! తల్లివాక్యములు పరమ సత్యములు. తండ్రికంటే తల్లి ప్రధానము. అందువలననే శాస్త్రము, "మాతృదేవోభవ- పితృదేవోభవ" అని మాతృస్థానమునకు ప్రధానత యిచ్చినది. నీవు అంత పట్టుపట్టి మాతృదేవిని బాధపెట్టుట మంచిదికాదు, అనితెలుపగనే,

రాముడు, "లక్ష్మణా! పుత్రవాత్సల్యముతో పరితపించు తల్లి మాటలనే నీవు పాటించుచున్నావు కాని రాజ్యమునకు, యావత్ ప్రపంచమునకు, ప్రజలకు సంబంధించిన పితృవాక్యమును నీవు విచారము చేయకుండుటలో వున్న అంతరార్థమేమీ బోధపడుటలేదు. ఒక్క ధర్మము వలననే అర్థ కామ మోక్షములను మూడు పురుషార్థములూ సమకూరును. ఇందులో సందేహమక్కరలేదు. భార్య అనుకూలవతి అయి ధర్మానికి అభిమతమయి, కామానికి సుపుత్రఅయి, అర్థాన్ని సమకూరుస్తుంది. అదేవిధముగా ధర్మానుష్ఠానమువలన ధర్మమూ, అర్థమూ, కామమూ, మూడూ యేపనివలన సమకూరవో ఆ పని చేయకూడదు. కేవలము అర్థపరుడయిన వానిని లోకము ద్వేషిస్తుంది. కేవలము కామపరత్వము అప్రశస్తము. అందువలన, ధర్మము సమకూరేపని చేయవలెను.

లక్ష్మణ! అంతేకాదు! దశరథమహారాజు మనకు తండ్రి, గురువు, రాజు. ఆయన కోపమువల్లకానీ, కామమువల్లకానీ, ప్రేమవల్లకానీ, యేమి ఆజ్ఞాపించినా మనము చేసే తీరవలెను. పాపకర్ముడయిన కొడుకు తండ్రి చెప్పినది చేయకపోవచ్చు. నేను అట్లుకాదు. నాన్నగారు యేమిచెప్పినా, నేను శిరసావహింతును. ఇందులో నీకు కొంత సందేహము కలుగవచ్చును. తండ్రి మూర్ఖుడయి కామాంధుడై నిత్యానిత్య పరిజ్ఞానము లేక తన స్వార్థమునే లక్ష్యమందుంచుకొని, పరుల మాటలను నమ్మి కన్నకొమరుని కష్టపెట్టుటలో అనుసరించు అధర్మమునుకూడనూ కొమరుడు విశ్వసించవలసినదేనా అని నీవనవచ్చు తప్పక విశ్వసించవలసినదే. మూర్ఖుడయిననూ అజ్ఞాని అయిననూ అతనికి నీవు కొమారుడవే. దీనిని విశ్వసించినపుడు మిగిలిన వన్నియూ దానికి తగ్గుస్థాయివే కాని అధిక స్థాయివి కావు.

తండ్రి అని విశ్వసించిన కుమారునకు తండ్రి చెప్పు విషయములను కొంత అస్తవ్యస్తమయినవిగా వుండిన వాటిని విపులముగా వివరించి తండ్రికి నచ్చచెప్పవచ్చునేకానీ తాను చెప్పునవి అవివేకమైనవిగా భావించి, తిరస్కరించరాదు. అందునా

దశరథమహారాజు మహామేధావి, శూరుడు, ధార్మికుడు. మాటను నిలబెట్టుకొనుటకై అంత పరితపించుచున్నాడే కానీ కైకకు లొంగికాని, కామాతురత వలనకాని కాదు.

తాను ఆనాడు ఇచ్చిన మాట సత్యము. అంతేకాక నిన్నకూడను, నీ అభీష్ట మేదైననూ సరే నా ప్రాణాపాయమును కలిగించునదైననూ సరే నేను నెరవేర్తునని, వాగ్దానము చేసెను. కాన, దానిని ఓర్చుకొనుటకు మార్గములేక, నన్ను అడవులకు పంపుటకు యిష్టములేక, పరితపించుచున్న తండ్రిని, కామాంధుడని నే నంగీక రింపను. "లక్ష్మణా! దశరథమహారాజు తన పూర్వీకులకంటే ధర్మాత్ముడు; ముల్లోక ములలోనూ అతని పేరు ప్రతిష్ఠలు మ్రోగినవి. ప్రసిద్ధి కెక్కినవి. అతను జీవించి యుండగా అతని పట్టపురాణి అయిన కౌసల్యాదేవి పతిని విడిచి కొడుకుతో అడవికి వెళ్ళవదన్న వార్త లోకమునకు అపమార్గమును చూపించినట్లగును.

బ్రతుకు కొంతకాలము; ఈ అల్పకాలమునకు శాశ్వత కీర్తిని కోల్పోవుట నాకు కానీ, నీకు కానీ మంచిదికాదు. తల్లీ! అని తల్లివైపుకు తిరిగి, దీనముగా ప్రార్థించుచున్న రామవాక్యములు కౌసల్యకు కొంత విచారమును కలిగించినది. స్తంభించిపోయినది. రాముడు ఇక నిలువడని గమనించింది. తననూ నిలుపుటకై చేసిన ప్రయత్నములు అన్నియూ విఫలమయినవి. కడకు సమ్మతించక తప్పదని తలంచినది. తాను విలపించుకొలది, రాముని బాధపెట్టినటులే కాగలదని భావించినది కౌసల్య.

ఇంతలో లక్ష్మణుడు కండ్లెఱ్ఱ చేసుకొని వళ్ళుమరచి పెదవులు వణకుచు నోటిమాటాడక కనురెప్పలు వాల్చక భూమిని చూచుచూ వదలుచున్న కంటిధారలను రామచంద్రుడు చూచినాడు. ఇట్టిస్థితిలోనున్న లక్ష్మణుని వదలి వెళ్ళుట మంచిది కాదని యోచించినాడు.

అంతేకాక తాను వెళ్ళిన తరువాత లక్ష్మణుడు విచారములో యేమైననూ చేసుకోగలడు, యేమైననూ చేయగలడు. అట్టి చర్యలు తన వలననే జరిగినవి కాగ లవు కాన లక్ష్మణుని శాంతపరచుట మంచిదని తలంచి రాముడు లక్ష్మణునితో, "తమ్ముడా! కోపము సర్వపాపములకు ధూపము. దానిని నిగ్రహించుకో. రామ చంద్రునకు ఇంత అవమానము జరిగెనే అని నీవు దుఃఖపడవద్దు. సత్యధర్మములకు మానాభిమానములుండవు. ధైర్యము వహించు. తండ్రిని సేవించి ధన్యుడవుగమ్ము, అని ఆశీర్వదించగా.

లక్ష్మణుడు, అన్నా! నా ప్రాణసమానుడైన రాముడుఅరణ్యమునకువెళ్ళుచుండ జడమైన శరీరాయముతో యెవరిని సేవించగలడు ఈలక్ష్మణుడు?లక్ష్మణునకు రామసేవ

తప్ప అన్యసేవలు అక్కరలేదు. నీ ధర్మములు నీకెటులో నా ధర్మములు నాకట్టివే. కాన నేను తన వెంట వత్తును. నాకు యెవరి ఆజ్ఞయూ అక్కరలేదు. నేను కైకేయి కోరిన వరములలో చేరలేదు. ఒకవేళ చేరినా నేను ఆమె ఆజ్ఞనుకానీ లేక ఆమె అనుచరుల ఆజ్ఞనుకానీ ఆలకించను; నన్ను ఆజ్ఞాపించుటకు ఒక్కరామునకు తప్ప యెవ్వరికీ అధికారములేదు. కాన ఇదుగో ఇప్పుడే నేను కూడా జటావల్కలములు ధరించి సిద్ధమగుదును అని పట్టాభిషేకమునకై చేసుకొన్న అలంకారమును ఆభరణములను తీసి క్రిందపారవేసి కుండలములు చంద్రహారములూ నలుదిశలా పారవేసెను. అన్నతో వెళ్ళుటకు సిద్ధమాయెను.

లక్ష్మణుని త్యాగమును చూచుచున్న రామునికి హృదయము కరిగినది. దగ్గరకు వచ్చి వీపు నిమురుతూ, "తమ్ముడా! ఇట్టి తమ్ముడు నాకుండుట నా ఆనందమునకు అంతులేదు; ఇది నా భాగ్యము. నీవు నాతో వచ్చుటచే తల్లియైనకౌసల్యకూడనూ కొంత శాంతించగలదు. నేను ఈ పదునాలుగు సంవత్సరములు అరణ్యములందు యే రీతిగా జీవితమును గడుపుదునో, కడకు పదునాలుగు సంవత్సరములు పూర్తి గడుపుకొని అయోధ్యకు రాగలనో లేదో అన్న భయము అనుమానము తల్లిలో కలత పెట్టుచున్నది. కాన నీవు తల్లికి తగిన రీతిగా ధైర్యము చెప్పుము.

మనము ఈ రీతిగా కాలము గడుపుచుండిన తండ్రి మరింత బాధపడును. ఇంకనూ బయలుదేరలేదు. కడకు రాముడు అరణ్యమునకు వెళ్ళునో వెళ్ళడో అను అనుమానము కైకలో చెలరేగవచ్చును. కాన నేనుసీతతో ఈవార్తను తెలిపి కైకేయీ మందిరమునకు వెళ్ళి తండ్రికి నమస్కరించి వెళ్ళు లోపల, నీవు మీ తల్లియైన సుమిత్ర అనుమతిని బడసిరమ్ము. అని కౌసల్యకు ప్రదక్షిణచేసి నమస్కరించుచుండ అంతఃపురములోని దాసీలు మిగిలిన రాణులు ఒక్కతూరి ప్రళయము వచ్చినటుల గొల్లున యేడ్చిరి.

"తల్లీ! ఆశీర్వదించమని శిరస్సువంచి నిలుచున్న కొమరుని అక్కునచేర్చి శిరస్సును ముద్దాడి, నాయనా రామా, నీవు పరమ ధార్మికుడవు. పరాక్రమవంతుడవు. నీకు అరణ్యములయందు యెట్టి భయమునూ వుండదు. వనవాసము చేయ నిశ్చయించుకొంటివి. నిన్ను నివారించుట నా చేతకాని పని అయినది. నీకు శుభము. నీవు పితృవాక్యపరిపాలనముచేసి పితృఋణముతీర్చి చరితార్థుడవయి నీకు తిరిగివస్తే అంతే చాలును. నేను ఆనాడే సంతోషింతును. రామా! దైవబలము సామాన్యముకాదు. దైవనిర్ణయమును యెట్టివారునూ మార్చలేరు. ఏ ధర్మమునకై నీవు అడవికి వెళ్ళుచున్నావో ఆ ధర్మమే నిన్ను రక్షించును,

"రామా! పదునాలుగు సంవత్సరములు గడచిన తరువాత జటావల్కాలు ధారివై నీవు ఇప్పుడే కనుపించిన యెంత బాగుండెడిది. అయ్యో నా పిచ్చి. పదునాలుగు సంవత్సరములన్న సామాన్యమా? నాయనా! యేమని ఆశీర్వదింతును? పదునాలుగు సంవత్సరములు పదునాలుగు దినములుగా! కాదు కాదు! పదునాలుగు నిమిషములుగా గడిపి రమ్మా. రాజ్యాభిషిక్తుడవు కమ్మా. ఓ రఘువంశోద్ధారకా! యినకులతిలకా! నా ముద్దుబిడ్డా! యేధర్మరక్షణకై నీవు అడవులకు వెళ్ళుచున్నావో ఆ ధర్మదేవతయే నీ చుట్టూ వుండి రక్షించును. అంతకంటే రక్షకులు మరొకరులేరు.

నీ కొరకై నేను ఈ పదునాలుగు సంవత్సరములు హోమములు చేయుచుందును. నీ పితృసేవ మాతృసేవ గురుసేవలే ఆయురారోగ్యములందించును. నీ సత్యవ్రతమే పరమధైర్యము నందించును. పర్వతములు నదులు పొదలు పుట్టలు పిట్టలు నీ అండనచేరి ఆదరించి ఆనందము నందించును. సూర్యచంద్రాదులు నక్షత్రాది ఉపగ్రహములు సహితము నిన్నే యిక్కట్లకు గురికాక కాపాడును. క్రూరకృత్యాలకువడిగట్టే రాక్షసులు సహితము నీ చల్లని ప్రేమకు వశమై నీకు దాసోహం కాగలరు. అని ఆశీర్వదించుచూ,

పొరలివచ్చే దుఃఖమును దిగమ్రింగుతూ సంతోషమునభినయిస్తూ రాముని తలను వంచి ఆఘ్రాణించింది. అతనిని గట్టిగా కౌగిలించుకొని చెక్కున ముద్దుపెట్టుకొన్నది. అదురుచున్న పెదవులతో, "రామా, క్షేమంగా తిరిగిరమ్మా, ఆనందముగాపొమ్మా," అని పలికింది. రాముడు కూడనూ తల్లి ప్రేమను బాగా అర్థము చేసుకొన్నవాడు కనుక ఆమెను బాధ పెట్టుటకు కూడ తాను ఒప్పుకొనక తప్పినది కానందున పదే పదే తల్లి పాదములకు నమస్కరించుచు,

అమ్మా! నీవు దుఃఖించక,నిద్రాహారములు మానక ఆరోగ్యమును పాడుచేసుకొనక, నిరంతరము చల్లని హృదయముతో నన్ను తలంచుచుండు. నీ తలంపు యెట్టిదిగా వుండునో నా క్షేమము అట్టిదిగా వుండును. కాన నా క్షేమము సుక్షేమంగా సుఖవంతంగా వుండాలన్న నీవు దుఃఖించక ఆశీర్వదించుచుండుము. అని ప్రార్థించి విడువలేక విడువలేక తల్లియైన కౌసల్యను వదలి జనావృతమయిన రాజవీధిలో రాముడు పాదచారుడయి నడువసాగినాడు.

ఆ గుణవంతుని చూచి జనసమూహము కంపించిపోయినది. గాలివార్తగా వచ్చిన రామ అరణ్యవాసము నిజమైనదోకాదోఅన్న ఆందోళనలోవున్న పురజనులు రాముడుపాదచారుడై రావటములో క్రుంగిపోయినారు. పట్టాభిషేకమని పొందినపొంగులన్నియూ క్రుంగి ప్రవహించినాయి. జీవచ్ఛవములవలే వారి ముఖములు వాడినవి.

# అర్ధాంగిని సీత

రాముడు తలయెత్తి చూడక, యెవరితోనూ మాటాడక, సీతాంతఃపురమునకు వెళ్ళుచున్నాడు. కైకేయీ మందిరమున యేమి జరిగినదో తెలియని సీతాదేవి పట్టాభిషేక గడియలు సమీపించుచున్నవే. యింకా రాముడు యెందుకు రాలేదని ద్వారములు చూచుచుండెను. ఉపవాసవ్రతములు పూర్తిచేసి, గంధపుష్పాక్షతాదులు చేతపట్టుకొని రాముడు యెప్పుడెప్పుడు వచ్చునా అని ఉవ్విళ్ళూరుచున్నది. ఆమెతోపాటు అంతఃపురములోవున్న అందరూ సంతోషముతో ఓలలాడుచుండిరి. మంగళాంగనలు, హారతులు సిద్ధము చేసికొనియున్నారు. ఇంతలో అపూర్వముగా అలంకరించి యుండిన ఆ అంతఃపురములోనికి రాముడు తలవంచుకొని వచ్చుటచూచి దిగ్భ్రాంతి చెందిరి. ఇంతలో సీతాదేవి యెదురేగి చూడ ఆమెను ఆమే నమ్మలేకపోయినది.

దేహము గజగజ వణకినది. పెదవులు అదరుచూ ప్రభూ! యేమిటిది? ఇట్లావున్నావెందులకు? ఈనాడు బృహస్పతిదేవతాంకితమయిన దినమని చెప్పిరికదా. శుభకరమైన దినము అని పుష్యమీ నక్షత్రములో మీ యువరాజ్యాభిషేకమని బ్రాహ్మణోత్తములు చెప్పిరి కదా! మీ దివ్యసుందర విగ్రహమునకు జలఫేననిభము, శతశలాకాయుతము అయిన శ్వేతచ్ఛత్రము యెందుకు పట్టలేదు? చంద్రమండలమువలె తళ తళ లాడుతూ హంసలవలే తోచే వింజామరలు మీకు యెందుకు వీచరైరి?

వందిజనులు స్తోత్రపాఠాలు పలుకలే దెందులకు? నాథా! వేదపారంగతులైన బ్రాహ్మణులు మూర్ధాభిషిక్తులు అయిన మీ శిరమున తేనె పెరుగు పెట్టి అభిషేకము చేయలేదెందులకు? మంత్రులు, సామంతులు, శ్రేణీముఖ్యులు మీ వెంట నడచి రాలేదే? నీలమేఘము నేలమీద నడచుచున్నదో, కాక, నల్లటికొండ కదలిపోతున్నదో, అన్నట్లు కనుపించే శత్రుంజయము అను మదపుటేనుగు మీముందు నడచి రాలేదెందుకు?

అని సీతాదేవి ప్రశ్నలవర్షము కురుపించుచుండుటచే రాముడు యేమిచేయు

టకూ తోచక, అంతసులభంగా చెప్పునట్టి విషయము కానందున లోనికివెళ్లి సీతను దగ్గరచేర్చుకొని, సీతా! పూజ్యపాదులు మా నాన్నగారు నన్ను ఇదే ముహూర్తములో అరణ్యమునకు పంపుటకు నిశ్చయించుకొన్నారు. కాన ఇప్పుడే పితృఆజ్ఞ పరిపాలనగావించవలసివున్నది. సీతకు ఈ మాటలు నమ్మరానివై తోచి నది. కారణముచెప్పక విషయమునుమాత్రమే చెప్పుటచే సీతాదేవి,

"నాథా! అరణ్యములకు పంపునట్టి అపరాధము తామేమి చేసితిరి. ధర్మాత్ము డైన దశరథుడు నిష్కారణముగా అట్టి ఆజ్ఞను విధించడు కదా ? తాము అపరాధములు చేయరుకదా! అట్టితరి మీరు వనవాసము చేయుటలోని అంతరార్థ మేమిటి ?"

అని ప్రశ్నించగా, రాముడు చిరునవ్వుతో, "సీతా! పూర్వము ఒకప్పుడు నా తల్లియైన కైకేయిదేవికి మా నాయనగారు రెండువరముల నిచ్చెనట. అవి ఆయన ఇంతవరకూ చెల్లించలేదు. ఈమెయూ కోరలేదు. నేడు ఆమె ఆ రెండు వరములు కోరుటలో ఒకటి భరతునకు పట్టాభిషేకము చేయవలెననియూ, రెండవది నన్ను జటావల్కలములు ధరించి పదునాలుగు సంవత్సరములు వనవాసముచేయ వలెననియూ కోరినది. మాతండ్రి పరమధార్మికుడు; ఆడినమాట తప్పనివాడు; అందువలన తలవొగ్గినాడు. కాన నిన్ను చూచి వెళ్ళవలెనని ఇప్పుడిక్కడికివస్తిని" అని అన్నాడు.

"సీతా! నీవు మహాపూజ్యమైన వంశమునందు జన్మించితివి. నీవు సమస్త ధర్మములూ తెలిసినదానవు. పరమ ధర్మవేత్త జ్ఞాని అయిన జనకమహారాజు మీతండ్రి. ధర్మచారిణివి. నేను ఈనాడే అడవులకు వెళ్ళవలసివున్నది. పరంపరా గతమైన ఈ రాజ్యాన్ని దశరథమహారాజు భరతునికి యిచ్చివేసెను ఇక ఈ దేశా నికి భరతుడు ప్రభువు. పట్టాభిషేకము అయిన వెంటనే అతడు నీకు నమస్క రించుకొనుటకై వచ్చును నీవు నా తమ్మునెదుట నన్ను గురించి శ్లాఘించుట లేక నన్ను యిట్లు అరణ్యమునకు పంపెనను దుఃఖముతో అతనిని తూలనాడుట జరుగ కూడదు.

రాజులు తమను ఆరాధించి, సేవించువారలనే మెచ్చుకొందురు కనుక నీవు నన్ను వర్ణించుటకానీ అతనిని తిరస్కరించుటకానీ చేయకూడదు; దేహరీతిగా నాకు తమ్ముడు, నీకు మరది; అయితే స్థానరీతిగా నీకూ - నాకూ ప్రభువే భర తుడు. అట్టి ప్రభువుకు తగిన గౌరవమును నీవు అందించు; భరతునకు అప్రియ మయ్యే ఆటుల మెలగవద్దు.

ఓ కల్యాణి! నీవు భరతునికేకాక వృద్ధుడైన దశరధుణ్ణి అతని ఆజ్ఞను శిరసావహించి నడచుకో. నా వియోగములో కుమిలిపోవుచున్న తల్లి కౌసల్యకు తగినరీతిగా సేవలనలిపి ఆమెను దుఃఖమునుండి వేరుచేయుటకు తగినటుల చూచుకో.

మిగిలిన ఇరువురుతల్లులూ అనగా కైకేయి సుమిత్రలు నన్ను వక్కామాదిరిగాచూచిరి. కనుక వారి ఆజ్ఞలను కూడా నీవు జవదాటవద్దు. భరత శత్రుఘ్నులు నా ప్రాణ సమానులు; వారల నిరువురినీ నీతోబుట్టువులవలే లేదా పుత్రుల వలే ఆదరించు.

ఓ భూమిసీ! నీవు నేను లేనను ఉద్దేశముతో మిథిలాపురము వెళ్ళవద్దు. అయోధ్యయందేవుండి అమ్మ నాన్నలను వోదార్చుచూ వారలను తగినరీతుల సేవించుచూ వారికి సంతోషము నందించుచుండుము.

రాముడు సీతకు కర్తవ్యములను బోధించుచుండగా సీతకు పట్టరాని నవ్వు వచ్చినది. ఒక వైపున తనకు సిగ్గువేసినది. అంతటితో తాను వూరకుండక, రామా! తాము దశరథమహారాజు పుత్రుడవై, ఇంత చాటుమాటలు చెప్పుట నేనిదివరకెన్నడునూ వినలేదు; తల్లి తండ్రి తోబుట్టు, కొడుకు, కోడలు మొదలయిన వారందరూ వారు వారు చేసుకొన్న పుణ్యపాపములనుబట్టి శుభాశుభముల ననుభవింతురు. భార్య ఒక్కతే భర్త అనుభవించే శుభాశుభములలో భాగమును వహించును, అనుభవించును. దశరధమహారాజు మిమ్ములను అడవికి పొమ్మన్నా డన్న నన్ను కూడనూ పొమ్మన్నటులనే. ఆడదానికి తల్లి, తండ్రి పోషించగలరు; కొడుకు ఆదరించ గలడు. చెలికత్తె సేవించగలదు. అంతేకాని వారు నాకు దిక్కుకారు

మీరు పలుకు పలుకులు నాకు నవ్వు పుట్టించుచున్నవి. పెండ్లి కాక పూర్వమే నాకు నా తండ్రి సర్వధర్మములనూ బోధించెను. నేను అజ్ఞానురాలును కాను; లేక స్వార్ధపరురాలను కాను. అంతకంటే మొండితనము నాకు లేదు. సర్వ ధర్మములూ తెలిసిన నాకు మీరు ప్రత్యేక ధర్మములు చెప్పనక్కరలేదు.

నేనిక్కడున్నకదా అత్త, మామ, మరది, ప్రభువులను యేరీతిగా ఆదరించాలి సేవించాలి అని యోచించవలెను? నేను మీతోనేవుండునపుడు ఇతరులను సేవించవలసిన పని నాకేమున్నది? మీరు చెప్పనవసరమేమున్నది? నేను ఆనందముగా మీతో బయలుదేరి వత్తును.

అరణ్యవాసము చేయవలెనని నాకు యెంతో కాలమునుండి ఒక తీరని ఆశ

కలదు. అది ఈనాడు నా పతిదేవునితోనే ప్రాప్తించుట నా అదృష్టము. మీరు ఈ విషయమున రాకూడదని శాసించినను నేను వినను. నా మాట వినలేదని మీరు కోపగించకుడు. త్రాగి పారబోసిన నీరువలె నన్ను ఇక్కడ విడచి పోవుట మీకు నీతికాదు. నా మాట మీరు నమ్మండి. నేను ఒక్క క్షణమైనా అయోధ్యలో వుండను. మీవెంట తీసుకొని పొండు

అని పాదములుపట్టి ప్రార్థించెను. మీకు పట్టాభిషేకము జరుగలేదే అను చింత నాకేమాత్రమునూలేదు. నాకు మీరు ప్రధానముకాని రాజ్యాభిషేకము ప్రధానము కాదు. మీరొక్కరున్న అదే నా రాజ్యము, అదే నా భాగ్యము, అని బ్రతిమిలాడినది. అంత రామచంద్రుడు, అడవులన్న సామాన్యము కాదనియూ అందులో క్రూరమృగములు, రాక్షసులు, మహాగజదొంగలు చేరియుందురనియూ, అంతేకాక నదులు దట్టమైన పొదలు దాటవలసి వచ్చుననియూ నీవు యేనాడు నడచినదానవు కావు కనుక చాల శ్రమపడవలసివచ్చును అని అనేకరకముల, రాముడు అడ్డుచెప్ప జొచ్చెను.

అంత సీత, ప్రభూ యెట్టి క్రూరమృగములున్ననూ యెంతటి దట్టమైన అరణ్యమయిననూ మీరు వెంటవుండగా అవి నన్నేమి చేయును? అరణ్యములలో ప్రయాణము చేయుట నాకు బాగుగా తెలుసును. అవి నాకేమాత్రమూ బాధనందించవు. నేనేముందు నడచుచూ మీకు దారియేర్పరచవలెనన్ననూ మరింత సంతోషముతో ముండ్లు రాళ్ళు కంపలు ఏరి పారవేసి మీకు హాయిని కలిగింతును. అట్టి సేవచేయుటకైననూ నన్ను మీవెంట గొనిపొండు. ఈ అయోధ్యా అంతఃపురమున నాకిట్టి సేవలభించలేదు, అన్ని సేవలు దాసదాసీలు చేయుచుండ, నేనెంతయో విచారించుచుండెడిదానను.

దాస దాసీలు లేని ఆ అరణ్యమున నా ప్రభుసేవ నేనే చేయవలసి వుండును. అది నా భాగ్యము. అట్టి పవిత్ర అవకాశమును నాకందించి ధన్యురాలను చేయవలెనని, పరిపరి విధముల ప్రార్థించు సీతను చూచి, రాముడు జాలినొంది,

సీతా! నీవు చెప్పినటుల అక్కడ నివసించుటసు కాదు; అనాడు నీవు బాధపడవలసి వచ్చును; యోచించుకొమ్ము అని రాముడు అనేక రీతుల తెలిపెను. అంత సీత, రామా! మీవ్రతమునకు నేనెట్టిభంగమునూ కలిగించను. మీమాటలను పట్టి మీరేదియో దాచుచున్నటుల కనిపించుచున్నది. నా దగ్గర గుట్టెందుకు? మీతో పాటు వనమధుగంధవాసనలు ఆఘ్రాణిస్తూ, కందమూలాదులను భక్షించి నియమముతో బ్రహ్మచారిణీ వ్రతమును పాటింతును.

ఎంతమందినో కాపాడు ఇలకులపతికి నన్ను కాపాడుట చేతకానిదా? నేను నమ్మను; నాకప కావాలి ఇది కావాలని మిమ్ములను బాధింపను. మీకు ఎట్టి శ్రమనూ కలిగించను, అంపెంచను. ప్రభూ! నేను మీతో రాక తప్పదు. మీ పాదముల చెంత పవళింతును. అది నాకు పరమానందము చేకూర్చును రామా! మీరుతప్ప నేను అన్యులను ఎరుగను. మిమ్ములను విడచి నిమిష ముండను? వుండలేను. అట్లుమీరు పట్టుపట్టి నన్ను అయోధ్యలో వదలి వెళ్ళితిరా, మీరు అరణ్యముచేరక పూర్వమే సీత ప్రాణములతో వుండదు; ఇది పరమ సత్యము.

అని కన్నీళ్ళతో కలక పారిపోయినవి అపుడు రాముడు ఆమెను సమాధాన పరచుచూ, ఓసీతా! నీవుమహాకులీనవు. ధర్మిష్ఠవు. నీవు నీ ధర్మము నాచరించుచూ ఇక్కడనే యుండుట మంచిది, నీవు నీకు తోచినటుల చేయకూడదు. నీకు ఇష్ట మొచ్చినటుల చేయకూడదు. నీకు ఇష్టమొచ్చినటుల చేయుటకు స్వాతంత్ర్యములేదు. నేను చెప్పినటులనే వినవలసియుండును. కాన నీవిక ఈ ఆలోచనను వదలుము. నీ మంచికే నేను చెప్పుచున్నాను.

నిన్ను భరించటము నాకు అతి భారము. పెద్ద పెద్ద కొండలనుండి జారిపడే సెలయేళ్ళు, కొండగుహలలో నివసించు క్రూరమృగముల గర్జనలు మహా భయంక రంగా వుండును; సింహశార్దూలాది మృగములు విచ్చలవిడిగా సంచరించుచుండును. నదులు దాటి పోవలసి యుండును. పెద్దపెద్ద గుండ్లూ, బండలనుంచి దుముకవలసి యుండును: ఇట్టిఇబ్బందులన్ని యూయోచించియే నీకుఇంతగట్టిగాచెప్పవలసివచ్చినది.

జటలు ధరించి వల్కలాలు కట్టుకొని ఋషుల జీవితమును గడుపవలసి యుండును. మేము సంధ్యావందనము లాచరించువేళ నీ కెట్టి అపాయము లైనా సంభ వించవచ్చు మేము యెట్టి ఆపదలందునూ ఆ నీమమును వీడ మన్నది నీకు బాగుగా తెలియును. యే సమయమెట్లుండునో చెప్పలేము.

అని రాముడు అనేకరకములు భయపెట్టు మాటలకు సీత యేమాత్రమూ వెరువక, రామా! పల్లెపడుచులకు, శాస్త్రహీనులకూ, అజ్ఞానజడ బుద్ధులకూ చెప్పి నటుల నాకు చెప్పనక్కరలేదు. మీ శక్తి సామర్థ్యములు నేను బాగుగా యెరుగుదును. మీకు చేతకానిదంటూ ఈ లోకమునందేకాదు, పదునాలుగు లోకము లందునూ లేదు. అట్టి మీరు నా వెంటనున్న, నాకు భయమెందులకు? పోనీ! నేను యే క్రూరమృగముల నోటనో పడితినన్న తమసన్నిధిలో ఆనందముగా ప్రాణములు వీడుటకు నేను సంసిద్ధమే. కాని, నీవులేని జీవితాన్ని నేనంగీక రించను.

నాకు ఇష్టమొచ్చినటుల చేయుటకు అధికారము లేదని అంటిరి. ఇది మీకు తెలిసి చెప్పితిరో, లేక నన్ను మోసపుచ్చుటకు ఆడిన మాటలో, నాకర్థమగుటలేదు: మీకు యేయే హక్కులున్నవో అన్నిహక్కులూ నాకునూ వున్నవి. నేను అర్ధాంగిని, మీ దేహములో సగభాగము నా హక్కు. నా దేహములో సగభాగము మీహక్కు. అంతేకాని మీకు మీరు స్వతంత్రులు కారు. నాకు నేను స్వతంత్రురాలను కాను, నా విషయమున నాకంతటి అధికారము కలదు.

అయితే నేను అధికారమును పట్టి వాదించుటలేదు. మీ అండదండలను కోరి ఆడుచున్న మాటలివి. అవి గట్టిగా పలికిన సీతపలుకులకు రాముడు మరింత గట్టిగా,

సీతా: నీవు హక్కుల విషయములలో చిక్కులు పడుచున్నావు. నేను అరణ్యమునకు వెళ్ళుటచేత, వృద్ధులైన నా తల్లిదండ్రులు, నాకొరకై విలపించుచుందురు. అట్టి సమయమున నీవు అత్తమామల మనస్సును కనిపెట్టి వారలకు తగిన సేవలు చేయుచూ, ధైర్యమును తెలుపుచూ వుండుట నీకర్తవ్యము.

సమయమును పట్టి మెలుగుట మంచిది. వారల చెంతనుండి వారిని సేవించు. అదే నాకు ఆనందము, అని రాముడు నిర్ధారణ చేసినటుల శాసించెను. అందుకు సీత చిరునవ్వు నవ్వి, రామా: కన్నకొడుకే అమ్మనాన్నలను కఠినదుఃఖమున ముంచి తనపట్టే భల్లూక పట్టుగా భావించి సర్వమునూ త్యజించి అడవులకు వెళ్ళుచుండ, పరాయి యింటినుండి వచ్చిన కోడలు అత్తమామలను వోదార్చుటలో బాధ్యత ఉండునో, మీరే యోచించుడు: కన్నకొడుకును వీడలేక కారడవులకు తానుకూడా వత్తునని కన్నులు కాయలు కాచునటుల యేడ్చినను ఆమెకు పతి సేవయే ప్రధాన కర్తవ్యమనియూ, కన్నకొడుకు ప్రేమపై, కట్టుకొన్న భర్తనువదలివచ్చుట ఇక్ష్వాకు వంశమునకే తీరని అపకీర్తి అని మహా మహా ధర్మములు కౌసల్యకు బోధించి, ఇపుడు నా చెంతకు రాగానే, నాకు అత్తమామల సేవయే కర్తవ్యమని బోధించుటలో, ఏది సత్యమో మీరే యోచించుడు.

సతికి పతి దైవమన్నది ఒక కౌసల్యకే కాదు. లోకములోని సమస్త స్త్రీజాతికే కలదన్న సత్యమును మరచిరి కాబోలు: కౌసల్యకు చెప్పిన నీతులు నాకు మాత్రము యెందుకు అన్వయింపవో చెప్పరైతిరి.

మీరెన్ని చెప్పినను, నేను పతిజాడను వీడను. మీ మాటను మీరుచున్నావన్న కోపముతో నన్ను వధించిననూ సంతసింతును కాని, మిమ్ము వీడి వుండలేను.

రామచంద్రా: మీరు వనవాసము చేతునని చెప్పిన తోడనే, నా చిన్ననాటి విషయము నాకు తలపుకువచ్చి యెంత వుప్పొంగితినో మీకు తెలియదు. నాకు పెండి

కాక పూర్వము మాతల్లి నన్ను వడిలో కూర్చొనబెట్టుకొని, నా సీతకు యెట్టిభర్త రాగలడు? (నాతల్లి మహా సాధ్వీమణురాలు) అట్టి సద్గుణసంపన్నుడు చిక్కునోలేదో, అని నాతల నిమురుచూ యోచించుచుండ, ఒకానొక తాపసాంగన అంతఃపురమునకు వచ్చి అమ్మను చూడగోరుచున్నదని దాసివచ్చి తెలుపగనే, అమ్మ నన్ను ప్రక్కకు తీసి, లేచివెళ్ళెను. అప్పుడే నేనుకూడనూ అమ్మజతలో వెళ్ళితిని. తాపసాంగనకు నాతల్లి నమస్కరించి, నన్నుకూడనూ నమస్కరించమని కోరెను. అమ్మ ఆజ్ఞను శిరసావహించి నమస్కరించగా, ఆ తాపసాంగన నన్ను మనసారచూచి, అమ్మా! మీబిడ్డ పతితో వనవాసము చేయును, అని చెప్పెను.

అంత మాతల్లి పెండ్లియే కాలేదు. పతితో వెళ్ళుటెక్కడ? అని పక్కున నవ్వగా, కాదు, కాదు, పెండ్లి అయిన తరువాత పతితో కొంతకాలము వనములందు నివసించవలసివచ్చును, అని గట్టిగా చెప్పి వెళ్ళెను.

ఆనాటిమొదలు నేటివరకు పతితో వనములకు వెళ్ళుట యెప్పుడు అని ఉవ్విళ్ళూరుచున్నాను! అట్టి నా చిరకాలవాంఛ నెరవేర్చి నన్నానందపెట్టుడు, అని పాదంబుల పైబడి, ప్రార్థించు సీతను చూచి,

రాముడు జాలిగా, ప్రేమతో సీతను లేవనెత్తి "సీతా! నాలోని రహస్యమును నీకు చెప్పక మరెవ్వరికి తెలుపుదును? వినుము! నీవు చిన్న వయస్సుదానవు. అడవులలో అనేకమంది ఋషులు, మునులు వుండుటచేత నేను వారలను సేవించుటకై వెళ్ళవలసియుండును. అప్పుడు అక్కడికి అనేకమంది రాజపుత్రులు రాజులు వేటకై వచ్చి ఆశ్రమములను సందర్శించుటకు వత్తురు. అట్లు వచ్చినప్పుడు వారల దృష్టి నీపై పడవచ్చును. తదుపరి అందు నిమిత్తమై చేయు ప్రయత్నములు అనేకముగా జరుగవచ్చును. కాన, నేను తాపసవేషముననుండుటచేవారలతో తగవులుపెట్టుకొనుటమంచిదికాదు. ఈకారణముల ననుసరించియైనను నీవుఅయోధ్యలోవుండుము!

అని రాముడు చెప్పుచుండ, సీత "రామా! మీరు సామాన్య మానవులవలె ఇట్టి కట్టు కథలను చెప్పి నన్ను వంచించుట న్యాయముకాదు. మీరు ప్రక్కనుండగా మహేశ్వరుడు సహితము నావంక కన్నెత్తి అయిననూ చూడలేడు. అట్లు చూచెనా, తాను అక్కడనే భస్మమై పోగలడు. ఈ మాటపైననూ నన్ను మీవెంట గొనిపోక తప్పదు. యెందుకన, మీరు నావెంట వుండకుండిన, నేను వంటరిగా అయోధ్యలో వుండిన, అట్టివి సంభవించునేమో? లేదా, నేను ఇతరుల ఆనందమును చూచి, ఓర్వలేక బాధపడుదునేమో? కాన, నన్ను వంటరిగా వదలక జంటగా గొనిపోవుటలో మన యిరువురి పేరు ప్రతిష్ఠలూ జగద్వ్యాప్తి కాగలదు.

అంతేకాదు. "రామా! నీవు రామచంద్రుడవు! నేను సీతాజాతను; అనగా చంద్రునినుండి వెలువడిన చల్లని శీతల వెన్నెలను, చంద్రుడు అరణ్యమందును వెన్నెల అయోధ్యయందును వుండ వీలుండదు కదా! చంద్రునిలో వెన్నెల కూడియే యుండును, కానీ వియోగము సంభవించదు. ఈ రెండింటికీ నిరంతర సంయోగమే కానీ, వియోగము సంభవించదు. సంభవించెనా అది యేదో ప్రళయసమయము అయివుండవచ్చును. లేదా దుష్టసంహారమునకై శిష్టపరిపాలనకై అట్లు జరుగ వచ్చును. ఈనాడు అట్టివేవియూ లేవుకనుక, మన యెడబాటు వీలుకానిది, జరుగ లేనిది, అని దృఢపలుకులు పలికెను, సీతామాత!

సీతా! కటికినేలను ఆవ్వళించి, నారవస్త్రములను కట్టి, కందమూలఫలములను భుజించవలెను. అవియైననూ ప్రతిదినము దొరుకుట దుర్లభము. ఋతు ధర్మము ననుసరించి అవి దొరుకుచుండును. కోటి కపట వేషములు ధరించి మనుజులనే భక్షించు రాక్షసులు, అరణ్యములందు మెండుగా నుందురు.

వనవాస కష్టముల జెప్పుటకు శక్యముకాదు; నీవు వనవాసమునకు తగవు. నీవు నాతో వనవాసమునకు వచ్చినయెడల లోకులు నన్ను అతినీచముగా దూషింతురు. మానస సరోవరములోని అమృతోపమానమగు నిర్మల జలమును త్రాగి జీవించు హంస, లవణ సముద్రములోని నీరును ద్రాగి యెట్లు జీవింపగలదు? నూతనముగా చిగిరించిన తియ్యమామిడితోటలో విహరించు కోకిల, తుమ్మతోటలో యెట్లు విహరించును? ఈ సంగతులు విచారించి నీవు గృహములో నుండుట పరమోత్తమము.

ఈ విధముగ మృదుమధురముగ శ్రీరాముడు పలికిన పలుకులను విని జానకి కన్నీరు గార్చుచూ నేలను చూచుచూ స్తంభించిపోయెను. ఆమె కంటధారలు ధారల వలె నేల పడుచుండగా, రాముడు చూడలేకపోయినాడు. ప్రత్యుత్తర మిచ్చుటకు ఆమె కేమియూతోచక పోయెను. శక్తి నీరసించెను. కడకెట్టులో భరించుకొని, దుఃఖమును మ్రింగి,

ఓ ప్రాణనాథా! మీరు కరుణా సముద్రులు. సకల సుఖములకు నిధులు; మిమ్ముల నెడబాసి యుండినపుడు స్వర్గమయినను నాకు నరకముతో సమానము. తల్లిదండ్రులును, సోదరులును, సోదరీమణులును, అత్తమామలును, సుతులును, గురువులును, బంధువులును వీరందరూ సకలగుణ సంపన్నులయిననూ — సతికి సుఖము నిచ్చువాడు పతియే; పతితప్ప అన్యగతి వుండదు.

నాథా! తనువును, ధనమును, గృహమును, పురమును, రాజ్యమును ఇవి పతి

దూరమైన సతికి దుఃఖమునే ఇచ్చునుగానీ ఆనందమును అందించలేవు. పతిలేని భోగములు రోగమును బోలినవే. నా సర్వసుఖములు మీవద్ద గలవు. శరత్కాల చంద్రబింబమువంటి మీ ముఖారవిందమును చూచుచుండుటయే నాకు సర్వసుఖము.

నేను మీతో నుండినపుడు ఖగమృగములే నా బంధువులు; వనమే పట్టణము; వల్కలములే పట్టుపీతాంబరములు; పర్ణశాలయే సురసదనము, సౌందర్యభవనము; వనదేవతలే నా అత్తమామలు. మీతో నుండినపుడు కుశపల్లవములు మన్మథుని పెజ్జవలేమెత్తగానుండి సుఖమునిచ్చును. కందమూల ఫలములు అమృతోపమానముగ నుండును. పర్వతములు అయోధ్యలోని మేడలతో సమానము. పర్వతముల దిగుడు పైనుండి క్రింది మేడకు దిగునటుల నేను అవలీలగ దిగగలను. నిత్యము మీ పాదారవిందములను దర్శించి సంతోషించుచుందును.

అంతియేకాదు; తమకు సర్వసేవలూ నేనే చేయుటకు ఇది మంచి అవకాశము. ఇట్టి సుసమయమును నేను దూరము చేసుకొని యెట్లుండగలను? ఓ కృపానిధి! నన్ను తీసుకొని వెళ్ళుటకు సర్వాంతర్యాములైన మీకు నేనింత వివరించి చెప్పనవసరము లేదు. నా హృదయమును యెరిగిన మీరు నన్ను ఇట్లు బాధించుట తగదు.

నాథా! నేను దీనురాలను. నన్ను విడచి వెళ్ళిన మీ నామమునకు లోపము వచ్చును. మీరు సకల గుణసంపన్నులు, నామీద దయతప్పుట యుచితమా?

పదునాలుగు సంవత్సరములు మిమ్ము విడచి జీవించగలనా? పదినిమిషములు కూడను నే జీవించజాలను. కరుణించి కనికరముతో అంగీకరించుడు.

నాథా! నేను మీ చెంతనుండిన నన్నెవరునూ ముంగలేరు. అసలు నన్ను చూడలేరు! నక్క, కుందేలు వంటి చిన్న మృగములు కన్నుతెరచి సింహమును చూడగలవా? నేను సుకుమారిని కాదు. మీరే సుకుమారులు. మీరే వనవాసమునకు అర్హులు కారు. భూమి నా తల్లి అగుటచేత, భూమిపై సంచరించుట నాకు తగిన అధికారము కలదు. నిజముగా సుఖించుట మీ వంతు; శ్రమపడుట నావంతు. అట్టి దానిని మీరు విరుద్ధముగా భావించి, బాధించుట న్యాయము కాదు

మీరు చేయలేని కఠిన పనులైనమా నేను అవలీలగా చేతును. యే రాజులూ యెత్తలేని శివధనుస్సును నేను అవలీలగా యెత్తిన సంగతి మీకు బాగా తెలిసియూ, నా బలమును సంశయించుట ఆశ్చర్యము! మీ కెంత శక్తి సామర్థ్యములు కలవో, వాటికి నా శక్తి సామర్థ్యములు తీసిపోవు.

కాన కాలహరణపు మాటలను ఆడక నాకనుజ్ఞ దయచేసి ముందుకు జరగ

వలసిన యేర్పాట్లు ఆనందముగా జరుపుడు— అని వంగి నమస్కరించిన సీతను చూచి,

రాముడు ఇక ఆమెను నిరోధించుట మంచిది కాదని దృఢనిశ్చయము చేసుకొని, "సీతా! విచారింపకుము. నీ యిష్టప్రకారము, నావెంట గొనిపోదును. విచారించుటకు సమయముకాదు. వనమునకు బోవుటకు తగిన ప్రయత్నము శీఘ్రముగ చేయుము"

అని ప్రియవచనములను పలికిన రామచంద్రుని మృదువచనములనువిని, అంతులేని ఆనందముతో, గంతులువేసి సీత "నాథా! వనవాసమునకు ప్రయత్నము లేమున్నవి? నా సర్వాభరణములు సమస్త అనుకూలములు నిరంతరము సంసిద్ధమే! నా పెన్నిధి. మీరుతప్ప అన్యరూపములను ఆశించనన్న సంగతి మీకు తెలియును. ఈ క్షణమునవే మీ వెంట బయలుదేరుచున్నాను"

అని రామచంద్రుని చేయిపట్టుకొని ముందుకు నడుచుటకు పూనుకొనెను. అంత రామచంద్రుడు యోచించి సీతా! పదునాలుగుసంవత్సరములు మనము అయోధ్యలో వుండము కనుక నీ ప్రీతికై గురియైన, చిలుకలు రకరకమైన పక్షులు, నీ వియోగముతో పంజరములందే ప్రాణములు విడువవచ్చునుకాన వాటిని, బంధనల నుండి విడచిపెట్టుము. మిగిలిన గోవులను బ్రాహ్మణులకు దానముచేసి నిత్యజీవితమునకు ఉపయోగించుచుండిన వస్తు వాహనాదులు, బీదసాదల కప్పజెప్పుట మంచిది. లేకున్న పాడయిపోవును; అట్లు పాడగుటకంటే, పరులకు అందించి వారికి అనుకూల పరచుట మంచిది కదా?"

అని సలహా అందించిన తక్షణమే సీత, పంజరముల చెంతకువెళ్ళి, ఒక్కొక్క పక్షినీ ప్రీతిరీతిగా పలుకరించి, మీరును మావలే సహజారణ్యముల స్వేచ్ఛా విహారము సల్పుడు, అని తన హస్తములతో వాటి బంధములను విడిపించెను. ఇక గోవులను,తిండిపదార్థములను, నానావిధములైన ఫలహారములను క్షణములోపంచిపెట్టెను.

ఆ సీతాజనని వికసించిన వదనముతో, మృదుమధుర వచనములతో బ్రాహ్మణులను పలుకరించుచూ, గోవులను అందించుచుండ, చూచువారల హృదయములు కరిగినవి. కంటి ధారలు వరదలుగా ప్రవహించినవి. ఆమె త్యాగము, ఔదార్యము వనవాసములకు పతితో బయలు దేరుటలోవున్న ఆనందము, యెట్టి కవియైననూ వర్ణించజాలకపోయిరి.

ఇంతలో తల్లి అనతి తీసుకొనివచ్చిన లక్ష్మణుని కలసి, సీతారామలక్ష్మణులు రాజమందిరమునకు వెళ్ళుచుండుట వీధులలోని ప్రజలు చూడలేకపోయినారు. ప్రజల

శరీరములు వాడిన మొక్కలవలే వ్రాలదొడగెను. ప్రజల మనసులు దుఃఖముచే వ్యాకులమయ్యెను.

తేనెను పోగొట్టుకొనిన తుమ్మెదలవలె ప్రజలు దీనులైరి. చేతులను నలుపుకొనుచు, శిరస్సులను మోదుకొనుచు రెక్కలులేని పక్షులవలే విలపించిరి. వేలజనులు రాజహజారములో నిలచియుండిరి. వారలవిచారమునువర్ణింపశక్యముకానిదై పోయెను.

ఇంతలో మంత్రిలోనికి వెళ్ళి స్పృహతప్పి పడియుండిన రాజును లేవదీసి కూర్చుండబెట్టెను. సీతారామలక్ష్మణులు తమదర్శననిమిత్తమై వచ్చుచున్నారని తెలిపెను. ఇంతలో రామచంద్రుడు ప్రియ వచనములు పలుకుచు తండ్రిని సమీపించెను. జానకిని లక్ష్మణుని చూచి దశరధుడు అమితముగా దుఃఖించెను. రామచంద్రుని కౌగిలించుకొని పరవశుడై నేలపడెను పొంగి పొరలు దుఃఖముచే మాటలాడని స్థితిలో యెదను బాదుకొనుచున్న దశరథుని అవస్థను సీతా లక్ష్మణులు చూడలేక పోయినారు. లక్ష్మణుడు చెంతనే నిల్చొని తీవిగా చూచుచున్న కైకను క్షణములో ప్రాణము తీయునటుల కండ్లెఱ్ఱచేసి ఉగ్రుడై చూచుచూ, తిరిగి కోపమును చల్లార్చుకొనుచు రామచంద్రుని శాంతవదనమును దర్శించుచుండెను.

ఇంతలో కైక "రామా! నీవు మీ తండ్రిని మరింత దుఃఖమునకు గురిచేయుచున్నావు. ఎంత త్వరగా నీవు బయలుదేరి అరణ్యముచేరిన, మీ తండ్రి అంత త్వరలో శాంతిని అందుకొనగలడు. కాన ఆలస్యముచేయక తండ్రికి నమస్కరించి బయలుదేరుట మంచిదని నిర్దాక్షిణ్యముగా పలికిన పలుకులు దశరథుని కుండలను బ్రద్దలు చేసినట్లయినవి.

ఆ మాట వినగనే "రాక్షసీ! యెంత కఠినవాక్కులాడుచున్నావే," అని మూర్ఛనొందెను. ఆ సమయమును చూచుకొని సీతా రామలక్ష్మణులు, తండ్రి పాదములకు నమస్కరించి, "హే పితాజీ! మమ్ములను దీవించి సెలవు దయచేయుడు! అనిరి. "తమరు విస్మయమును పొందుట" మంచిది కాదు. ఇది సంతోషమునకు సమయము. అతి మోహము అపకీర్తికి మార్గము".

అని తండ్రిని మోహము విడువమని పాదములు గట్టిగా పట్టి మోకాళ్ళపై కూర్చున్న రాముని, కన్నులు తెరచి చూచి, దశరధుడు ప్రయాసతో లేచి కూర్చొని రాముని చేతులు పట్టుకొని, నా బంగారు బిడ్డా! నా మాట వినుము, నీవు నియతాత్ముడవు. ఉచితకార్యములు చేయుట నీకు తగును. అపరాధము చేసినవాడొకడై, దాని ఫలము అనుభవించువాడు. మరొకడని చెప్పుట యుచితముకాదు. విధికృతములు విచిత్రములు. వానిని తెలుసుకొనువా రెవరు?

అని రాముని ప్రయాణమును తప్పించుటకు, రాజు నిష్కపటముగా అనేక విధములు తెలుపుచూ వచ్చెను.

ధర్మధురంధరుడును, చతురుడును, ధీరుడును అగు శ్రీరాముని ముఖలక్షణము లను బట్టి అతడు ప్రయాణమునకు సిద్ధముగా నున్నాడని దశరథుడు గ్రహించెను.

జానకిని దగ్గరపిలిచి, ఆమె శిరస్సును నిమురుచు, వనవాస కష్టములు ఆమెకు తెలుపుచు, అత్తమామలవద్దగానీ లేక తల్లిదండ్రులచెంతకానీ వుండుట మంచిదని రాజు బోధించుచూ, భరించలేని బాధతో దుఃఖించుచూ, కైకను చూచి పండ్లు కొరుకుచూ, నానావిధముల కుములుచున్న రాజును చూచి, సీతాదేవి

పాదములకు నమస్కరించి మామా! నా మనసు రామసేవనే ఆశించుచున్నది. అట్టి సేవాభాగ్యము అరణ్యమున నాకు అమితముగా లభించును. అట్టి ఘన ఫలమును వీడి నేనుండలేను. సతికి, అత్తమామల సేవలూ, తల్లిదండ్రులసేవలూ అంత సంతృప్తిని అందించవు. పతిసేవకు మించిన ఆనందము, సుఖము యెందునూ చిక్కదు. మీరు అడ్డుచెప్పక ఆశీర్వదించి నన్ను రామచంద్రునితో పంపుడని ప్రార్థించిన సీత వాంఛను అర్థము చేసుకొని,

సీతయొక్క గుణములను నానావిధముల వర్ణించి కైకకు తెలిపెను. ఇంతలో మంత్రి భార్యలు, గురు పత్నియు, సీతను చెంత బిలిచి, వనవాసకష్టములను గురించి పలుతెఱంగుల జానకికి బోధించిరి.

గురుపత్ని మరింతచొరవతీసుకొని "సీతా! వనమునకు నిన్నుబొమ్మని చెప్ప లేదు. ఈ విషయములో నీవు అతిదుఃఖములో మునిగిన అత్తమామలను అనుస రించి, వారి బాధలను ఉపశాంతి చేయుటకై అత్తమామలచెంత వుండుటమంచిది. రామునకు అర్ధాంగివగుటచే, రాముడు ఇవ్వలేని తృప్తిని అర్థభాగమైన నీవైనను ఇచ్చి అత్తమామలను దుఃఖములనుండి తప్పించుము.

జ్యేష్ఠపుత్రుడైన రామచంద్రుని అర్ధాంగివగుటచే, రాజ్యపాలనమునకూడా నీకు అధికారమున్నది. కాని పితృవాక్య పరిపాలనకై రాముడు వనవాసముచేసిననూ, నీవు రాజ్యపాలనచేసి, రామకీర్తి అత్తమామల సంతృప్తిని అందించుము. ఇది కూడనూ గుణవతియైన నీకు పరమలక్ష్యము.

అని శరత్కాలములోని చంద్రకిరణములు చక్రవాకమునువలె మృదు మధుర మగు వారి చల్లని హితోపదేశములు జానకిని వ్యాకులము పెట్టెను. ఆమె సంకో చించి ప్రతివచనము చెప్పక వూరకుండెను.

ఇంతలో కైకేయి, నారవస్త్రములను తులసి పూసలను పట్టుకొనివచ్చి వానిని

రామునియెదుట బెట్టి, రామా! రాజునకు నీవు ప్రాణమువంటివాడవు. నీయందుగల వాత్సల్యముచే, వారు నిన్ను విడువలేక, అపకీర్తిని తెచ్చుకొనుచున్నారు. నిన్ను వనమునకు వెళ్ళమని యెప్పటికినీ చెప్పడు. అతని అంగీకారమునకై నీవు కాచిన, ప్రయోజనముండదు.

నీవు తక్షణమే, అపకీర్తిని కోరి రాజ్యము యేలుదువా? నారచీరలు కట్టి వనమునకు వెళ్ళి ఇక్ష్వాకు వంశమునకు శాశ్వత కీర్తిని తెత్తువా? ఈ రెండింటిలో యేదో ఒకదానిని గావింపుము.

అని కైకేయి చెప్పిన మాటలకు శ్రీరామచంద్రుడు సంతసించెను. కానీ ఆ పలుకులు రాజు హృదయమునకు ములుకులవలె నాటెను. ఆహా! యెంత నిర్భాగ్యుడను. ఇట్టి కఠిన మాటలను వినియూ నా ప్రాణములు నన్ను విడిచి పోకున్నవి! అని తిరిగి దుఃఖముతో తెలివి తప్పి నేలకూలెను.

సారె సారెకూ ఈ విధముగా దుఃఖించుచూ మూర్ఛిల్లుచున్న తండ్రిని చూడ లేకపోయినాడు రామచంద్రుడు. కైకేయి మాటలను నడచుకొని యెంత త్వరగా అరణ్యమునకు బయలుదేరిన అంత మంచిదని తలంచి, పినతల్లి తెచ్చిన నారవస్త్రములను రెండింటిని తీసి ఒకటి తాను చుట్టుకొనెను. మరొకటిని సీతకు అందించుటకు ప్రయత్నించెను.

కానీ వాటిని యెట్లు ధరించవలెనో ఆమెకు తెలియక సిగ్గుచే, అటు ఇటు చూచుచు ఆ చిన్నతుండుగా వున్న నారచీరను చేతియందుంచుకొని నిలుచుండెను. ఇంతలో నారవస్త్రమును ధరించిన శ్రీరాముడు సీత చెంతకు వచ్చి అతి మెల్లగా మాటాడదొడగెను.

ఆమె కూడనూ సిగ్గుతో, "నాథా! ఈ నారచీరలను ముని పత్ను లెట్లు ధరింతురో నేనెరుగను. కాన నేనెట్లు ధరించుట? అంతియేకాక ఇది సామాన్య చీరవలె లేక అతి చిన్నదిగా వుండుటచేత నేను సహజ రీతిగా ధరించలేకున్నాను."

అని కొంత మెల్లగా, విచారంగా పలికిన సీత పలుకులకు రాముడు ధైర్యముతో చెంత చేరి తానే స్వయముగా ఆ నారచీరను సీతకు ఈ విధముగా కట్టవచ్చునని ఆమెకు కట్టి చూపుచుండుట అక్కడ చేరిన గురుపత్ని మిగిలిన అంతఃపుర స్త్రీలు చూచి కంటిధారలు కార్చిరి.

ఇంతలో గురువైన వసిష్ఠులవారు వచ్చి, ఈ దృశ్యమును చూచి భ్రమించి నిలిచెను. కైకను చీవాట్లు పెట్టెను. నార చీరలు సీత కట్ట నవసరము లేదనియును కైక కోరిన కోరికలలో భరతునకు పట్టాభిషేకము, రామచంద్రునకు వనవాసము

ఈ రెండే ఆమె విబంధనలనియూ సీత సమస్త సౌకర్యములతో రాజటీవిలో అరణ్య వాసము చేయవచ్చుననియూ, తెలుపుటచే పైన చుట్టిన నారచీరను శ్రీరాముడు తీసి వేసెను.

అంత సీత గురుపునకు నమస్కరించి "స్వామీ! నేను నారచీరలు కట్టుటలో కైక వాంఛకు యెట్టి సంబంధము లేకపోయిననూ నాథుని అనుసరించుటలో నా కర్తవ్యమును నిర్వర్తించవచ్చును కదా? నారచీరలను ధరించిన పతితో, సర్వాభరణ సౌందర్యముతో రాజ గౌరవమునకు తగిన విలువైన వస్త్రములను ధరించి వనవాసము చేయుటలో నాకు గౌరవముకాదు కదా? పతిని అనుసరించు సతికి ఇట్టిది పరమ విరుద్ధము కాన, నా గౌరవ ప్రతిష్ఠలకైననూ నేను ఈ నార చీరలు కట్టుకొనుటకు తమరు అనుజ్ఞ యివ్వవలెనని ప్రార్థించెను.

సీత పలికిన ఈ ధర్మ నీతులు వసిష్ఠులవారి హృదయాన్నికూడనూ కరిగించినవి. వసిష్ఠులవారు మహా విచారముతో, సీతా! సుగుణ శీలవైన నీకు ఇట్టి తలపులు సహజమే. అయితే రాజనీతిని పట్టి కొన్ని హద్దులు కూడా మితి మీర రాదు. మీ అత్తగారైన కైక కుటిలబుద్ధికి తగినటుల మనము కూడనూ కొన్ని బుద్ధులను ఆమెకు తెలుపవలసి వుండును.

నిజముగా నేడు నీ పతియైన రామునకు పట్టాభిషేకము చేయవలసినది. అది కారణాంతరములచేతను కొన్ని పూర్వపు వాగ్దానముల వలననూ అట్లు జరుగక పోయి నప్పటికినీ, భరతునకు పట్టాభిషేకము చేయుట రాజనీతికి విరుద్ధము. జ్యేష్ఠపుత్రునకు తప్ప అన్యులకు అధికారము లేదు. అట్లు జ్యేష్ఠపుత్రుడు మనఃపూర్వకముగా పట్టాభిషేకమును త్యజించిన అతని అర్ధాంగియైన నీకు ఆ రాజ్యాధికారముండును కానీ, మూడవ వానికి యే మాత్రమూ వీలుండదు.

అని కొన్ని ధర్మవచనములు పలుకుచున్న వసిష్ఠులవారి పలుకులకు కైక కొంత దిగులొందినటుల కనుపించెను. అయితే సీత, అట్టి అధికారమును ఆశించ దన్న విషయము కైకేయికి తెలియకపోలేదు. వశిష్ఠులవారు యేది చెప్పిననూ సీత వాటిని తన హృదయమునకు చేర్చక, నారచీరనే ధరించుటకు ప్రయత్నించుచుండెను. ఆ అవస్థను చూడలేక గురుపత్ని నివారించుటకు చేతకాక పోవుటచే, తప్పినది కాదని తానే పూర్వము కట్టిన చీరపై మునిపత్నులు కట్టుకొను రీతిగా చుట్టి కట్టెను.

ఇంతలో లక్ష్మణుడు కూడా సీతా రాములను అనుసరించి నారచీరను కట్టెను. ఆలస్యమునకు సమయము కాదని రాముడు దృఢము చేసుకొని మూవురూ మూర్ఛ

ల్లిన తండ్రి పాదములకు నమస్కరించి చెంతనున్న కైకకు నమస్కరించి గురువైన వసిష్ఠులవారికీ వారి పత్నికి నమస్కరించి వనమునకు బయలుదేరిరి.

మునివేషములతో వీధిలో నడచి వెళ్ళుచున్న సీతారామలక్ష్మణులను చూచి ప్రజలు గొల్లున యేడ్వసాగిరి, మూర్ఛిల్లిరి, తలలు బాదుకొనిరి. రామచంద్రుడు, అంతఃపురము దాటి రాజవీధి సింహద్వారములో నిలిచి, వసిష్ఠులవారికి నమస్కరించి ప్రజలకు పితృ వచనములు తెలిపి వారు దుఃఖింపుట మంచిదికాదనియూ త్వరలో పదునాలుగు సంవత్సరములు గడుపుకొని తిరిగి అయోధ్యకు చేరుదుమనియూ ఇది మీకునూ నాకునూ లోకమునకే కల్యాణకరమైన ఆజ్ఞ అనియూ మృదు మధుర వాక్యములాడి,

యాచకులకు దాన ధర్మములను బ్రాహ్మణులకు తగిన వసతులకు యజ్ఞ యాగాది క్రతువులకు తగిన భూదాన, గోదాన, సువర్ణ దానములను చేయించమని గురువును ప్రార్థించి చేతులు జోడించి, "గురూ! ప్రజలకూ నా తల్లిదండ్రులకూ మీరే తల్లిదండ్రులు, ప్రజలను ఆదరించి పోషించి కన్నబిడ్డలవలే కాపాడునట్లు రాజునకు బోధించి, శాసించుచుండవలెనని పదే పదే ప్రార్థించు రామచంద్రుని వచనములు వింటూ వున్న ప్రజల హృదయములు బద్దలయినవి.

ఇట్టి మహారాజు పరిపాలనను నోచుకోలేని మా ప్రాణము లెందుకని కొందరు గుండెలను బాదుకొన్నారు. కొందరు తలలు కొట్టుకున్నారు. కొందరు క్రిందపడి విలపించినారు.

ఇంతలో రామచంద్రుడు చేతులు జోడించి ప్రజల వైపునకు తిరిగి, ప్రాణ ప్రియులైన ప్రజలారా! మన ప్రభువైన దశరధుడు నన్ను వనపరిపాలన నిమిత్తమై పంపెను ద్వేషమునకు హృదయమున చోటివ్వక రాజు క్షేమమును కోరుచూ రాజాజ్ఞను శిరసావహించి ఆనందములో కాలమును గడుపవలెను. నాపై గల ప్రేమతో మీరు రాజును ద్వేషించరాదు. రాజునకు కీడు కోరరాదు, నేను వనమునకు వెళ్ళిన తరువాతకూడనూ రాజుగారికి సౌఖ్యము కలుగునట్లు ప్రవర్తించువారే నాకు ప్రియులు. అట్టివారే నా మిత్రులు. ఈ వాక్యములను నెరవేర్చి నన్ను ఆనందపెట్టుడనికోరెను.

ఓ జనులారా! నా వియోగముచే నా తల్లియైన కౌసల్య దుఃఖించుచుండును. ఇది ప్రతి మాతృమూర్తికీ సహజమే. మీరు చతురులు కనుక ఆమె దుఃఖము పోవునట్లు తీరునట్లు తగిన ప్రయత్నములు చేయుడు అని ఈ ప్రకారము శ్రీరాముడు కోరి సుమంతుని పిలిచి అతనితో, ఓ సుమంతా నీవిక తండ్రి చెంతకు వెళ్ళి అతనికి అనేక విధములు బోధించి శాంత పరచుము అని కోరెను,

చేయునది లేక కంటిదారలు కారుస్తూ సుమంతుడు మాటలాడలేకపోయినాడు. మహా దుఃఖమును భరించలేక గొల్లున అరచినాడు. ప్రక్కనే నిలచిన తోటి మంత్రులూ బంట్రోతులూ సుమంతుని అనేకవిధముల వోదార్చి వారునూ దుఃఖించి, రాజాజ్ఞ శిరసావహించి లోనికి వెళ్ళిరి.

నగరమంతయూ, శోకార్ణవము లో మునిగి యుండెను. ఇంతలో దశరథుడు మూర్ఛనుండి లేచి, తెలివి తెచ్చుకొని, రామా, రామా అంటూ అరచుచూ లేవబోయి తిరిగి క్రింద బడుచూ ఈ రీతిగా గది అంతయూ తిరుగుచుండెను.

ఆ సమయమునకు సుమంతుడు రాజు గదిలో ప్రవేశించి రాజును ఓదార్పుటకు ప్రయత్నించెను. తనలోనే పర్వతముల వంటి దుఃఖరాజులు ఉప్పొంగుచుండ ఇకదశరథుని యే రీతిగా ఓదార్చగలడు? అయినా రామాజ్ఞను తలంచుచూ, ఉప్పొంగి వచ్చు దుఃఖమును మ్రింగుచూ, కంటిధారలు కార్చుచూ, పలుకలేని స్థితిలో రాజు చెంత కూర్చొనియున్న సుమంతుని కన్నులు తెరచి చూచి, దశరథుడు ఒక్క కేక వేసి రామా అని తిరిగి సుమంతునిపై వ్రాలినాడు. కొంత సమయము ఆ రీతిగా పడి తిరిగి లేచి,

ఓ సుమంతా! రాముడు వనమునకు వెళ్ళెను. కానీ నా ప్రాణములు మాత్రము నా శరీరమును విడచి పెట్టలేదు. నా శరీరము నాశ్రయించి యుండినందున నా ప్రాణములకేమి సుఖము కలుగును, అని పలికి ధైర్యమును తెచ్చుకొని దశరథుడు,

ఓయీ! నీవు రథము తీసుకొని రాముని వెంట వెళ్ళుము. నా ఇరువురు కుమారులూ, అతి సుకుమారులు. కోడలి యెండ కన్నెరుగని కమలరేఖల వంటి పాదములు యెంత బొబ్బలెత్తునో? తక్షణమే రథమును గొనిపొమ్ము.

# అరణ్యమునకు ప్రయాణము

సుమంతా! నా రామచంద్రుడు, ధీరుడు వెనుకకు తిరుగడు. అతని సంకల్పము నెవ్వరూ ఆపలేరు. అతనిని ఆపుటకై చేయు ప్రయత్నములు వ్యర్థములై పోవుటయేకాక, అతనిని శ్రమ పెట్టిన వారమగుదుము. అందులో రాముడు సత్యసంధుడు. ఆలస్యముచేసిన దారితప్పుదురు. తక్షణమే రథమును తీసుకొని పొమ్ము. రాచవీధులలో నా కొమారులు నడచుచూ వెళ్ళుచుండిన ప్రజలు చూచి భరించలేరు. వెళ్ళుము, వెళ్ళుము అని సుమంతుని తొందర పెట్టుచూ ఆ రథములో కొంత దారి బత్తెము, ఆయుధములూ, తీసుకొని పొమ్ము. మరచితి సుమంతా! నీ వెట్లయిననూ బ్రతిమలాడి, నే చెప్పితినని తెలుపుచూ సీతను అయోధ్యకు తిరిగి పంపమని ప్రార్థించుము.

కొంత దూరము నీవు వనములో కూడనూ రథమునందు కూర్చొన బెట్టుకొని ప్రయాణము చేయించుము. వనములు చూచి జానకి కొంత భయపడునటుల తెలిసిన వెంటనే, రామాజ్ఞను గొని మిథిలా కిశోరియగు జానకిని కూడనూ ప్రార్థించి, నా మాటగా ఆమెకు నుడివి అయోధ్యకు తిరిగి రమ్మని ప్రార్థించుము నీవు అయోధ్యలో వుండుటకు అంగీకరించకున్న, మీ తండ్రియైన జనకుని వద్దకు పంపు యేర్పాట్లు మహారాజు గావించునని కూడా నుడువుమని దశరథుడు పదే పదే చెప్పుచుండెను. ఇంతలో మతి తప్పిపడి లేచి, "ఓ సుమంతా! ఇన్నిమాట లెందుకు? నా సీతా రామలక్ష్మణులను ముగ్గురినీ తీసుకొని వచ్చి చూపించుము. అట్టి ప్రయత్నమునకు పూనుకొని నన్నానందపెట్టుము. అని చాలా దీనుడై విలపించుచూ రథమును త్వరగా తీసుకొని పొమ్ము. రథము ముందుకు వెళ్ళలేని ప్రదేశమువరకూ వెళ్ళుము, బహుశా మూడు నాలుగు దినములు రథములో ప్రయాణము సలుపవచ్చు. ఆ తరువాత వారిని దింపి వారు కనుచూపు వరకు వెళ్ళునంతవరకూ వుండి నీవు వారల క్షేమవార్తను గైకొనిరమ్ము. వెళ్ళుము వెళ్ళుము అని తొందరపెట్టెను. దశరథ మహా

రాజు ఆజ్ఞగైకొని సుమంతుడు రాజునకు నమస్కరించి రథమును నడిపించుకొని నగర వీధులలో కాలినడకతో ప్రయాణించుచున్న సీతా రామలక్ష్మణులను కలుసుకొని రాజుగారి వచనముల రామునకు విన్నవించి వారిని రథముపై కూర్చుండబెట్టుకొని రాజవీధులలో నడిపించెను.

సీతా రామలక్ష్మణులు రథము నధిష్ఠించి, ఇరుప్రక్కలా కంటిధారలతో దుఃఖావేశములతో రోదనలు సలుపుచున్న ప్రజలను శాంతించుడని పలుకుచూ నమస్కరించుచూ ప్రయాణమును సాగించిరి. రాజ వీధులు దాటి అయోధ్యానగరమును వీడి కొంతదూరము వెళ్ళిరి. పురజనులు వీధుల పరువులెత్తుచూ వెంట రథమునకు వెనుకలు దుమ్ము గగనమును గ్రమ్మి దారి తెలియనట్లు నిండిననూ యేదో తలచుకొని రథమునకు వెనకాల వృద్ధులు, స్త్రీలు, యువకులు, బ్రాహ్మణులు రామా రామా మమ్ములను నీతో గొనిపొమ్ము అని విలపించుచూ పరువులు తీసిరి.

రాజ వీధులు నిర్జనప్రదేశము లయ్యెను; అయోధ్య నిద్రించుచున్నదా అన్నటుల నిశ్శబ్దముతో చీకటి గ్రమ్మెను. కొందరు ప్రయాణములు సలుపలేని స్త్రీ పురుషులు దారులలో స్తంభించి నిలిచిరి. వీధులలోని తలుపులు బిగించుకొని లోలోన కుములుచూ ఆహార పానీయములు మాని యెక్కడి వారక్కడే నేలపై బడి దొర్లిరి. కొందరు శ్రీరాముడు మనస్సును మార్చుకొని రాత్రి చీకటయిన తరువాత తిరిగి అయోధ్యకు వచ్చునేమో అని దారులు చూసిరి.

ఇంతలో దశరథుడు ఒక రథమును అధిష్ఠించి "రామా! రామా! సుమంతా! సుమంతా! రథమును ఆపు! ఒక్కపరి నా ప్రేమమూర్తిని చూతును!" అని వీధులలో అరచుచూ రథము పరువులు తీసెను. రామరథమునకూ దశరథుని రథమునకూ మధ్య పరువులెత్తి అలసి, దారిలో కూలిన ప్రజలు రాముడే తిరిగి వచ్చుచున్నాడా అన్న ఆశతో తలెత్తి చూచిరి. దారికి అడ్డుతగిలిరి. కానీ దశరథుని రోదనవిని, వారును మరింత విలపించి రథమునకు చోటిచ్చి మహారాజా! త్వరగా వెళ్ళి మా రామచంద్రుని వెనుకకు తీసుకొనిరండి. మా సంకల్పమును నెరవేర్చండి అని ప్రార్థించిరి. యెటులో రామరథము అయోధ్యా ఇసుక తిన్నెలపై వాయు వేగముతో పరువులిడుచున్న దృశ్యమును చూచి దశరథుడు, సుమంతా సుమంతా ఆపుము ఆపుము అని అరచుచూ వెళ్ళెను.

సుమంతుడు వెనుక వేగముతో వచ్చుచున్న రథమును చూచి రామచంద్రా, తండ్రిగారైన దశరథుడు వెంటవచ్చుచున్నాడు. కొంతసేపు నిలిపి వారి ఆజ్ఞను పొందుట మంచిదని కోరగా, రామచంద్రుడు కూడనూ పరువులెత్తుచూ వచ్చుచున్న

ప్రజలను తండ్రి రథమును చూచి, మధ్యమార్గమున ఆపిన ప్రజలు తన్నుచేరి మరింత విలపింతురనియు మన రథమును ఆపిన అలసి సొలసి నేల కూలినవెనుక ప్రజలు కూడనూ తిరిగి పరువులెత్తి వచ్చుటకు ప్రయత్నింతురనియు ఇది ప్రజలకు లేనిపోని శ్రమను కలిగించుటేకాక తన వాగ్దానమునకు కొంత అంతరాయము కలుగుననియూ మార్గమధ్యమున దశరథుడు విలపించుట ప్రజలు చూచిన రాజు గౌరవమునకు భంగము కలుగుననియూ అనేక విధముల తలంచి విచారించి, సుమంతుని రథమును ఆపనక్కరలేదనియూ మరింత శరవేగముగా వెళ్ళుట మంచిదనియూ హెచ్చరించెను. అందులకు సుమంతుడు చేతులు జోడించుకొని రామా! నేనుగూడ నాలుగు దినములు మాత్రమే తమతో వుండుటకు చక్రవర్తి అనుమతి నిచ్చిరి. తరువాత నేను అయోధ్య చేరవలెను కదా? అప్పుడు చక్రవర్తి సుమంతా నా రథమును చూచియూ నా పలుకులు వినియూ నీ వెందులకు రథము నాపవైతివి. అని ప్రశ్నించిన నేనేమని జవాబు నిత్తును.

పోనీ నన్నుకూడనూ మీతో అరణ్యములో వుంచుకొన్న నేనెంతయో ధన్యుడను; అటులన రథము నాపక మీరు చెప్పినటుల వేగముగా పోనిత్తును. దేనికీ తమ ఆజ్ఞను తెలుపుడు అని ప్రార్థించిన సుమంతుని ప్రార్థనను శ్రీరాముడు సరిగా యోచించి సుమంతా రథమును తీసుకొని పొమ్మనియు వారిని అరణ్యమున వదలి రమ్మనియూ ఆజ్ఞాపించినది చక్రవర్తి. ఇపుడు రథమును నిలుపుమని విలపించుచూ వచ్చునది దశరథుడు. నీవు రాజాజ్ఞను వినవలెనే కానీ దశరథుని ఆజ్ఞను విననక్కరలేదు. నీవు రాజునకు రాజ్యమునకు మంత్రివికానీ ఒక్క వ్యక్తిగతమైన దశరథునకు మంత్రివికాదు. వ్యక్తిగతంగా మా యిరువురికి తండ్రి బిడ్డల వాత్సల్య సంబంధము. చక్రవర్తి రీతిగా నీకూ నాకూ చక్రవర్తే కాన ఇరువురికీ సమ సంబంధమైన చక్రవర్తిస్థానము ప్రధానకర్తవ్యము. నీవు నీకర్తవ్యమును నెరవేర్చుము. నామాట వినలేదేమని దశరథులు ప్రశ్నించిన వినలేదని తెలుపుము. తప్పులేదు!

రథమును ఆపక వేగముగా పోనిమ్మని తెలిపిన రాముని వచనామృతము సుమంతుడు ధర్మరసముగా గ్రోలి ఆనందించి రథమును ముందునకు నడుపజొచ్చెను. రథము ఆగకుండుట చూచి దశరథుడు తన రథమును నిలిపి రోదన చేయుచూ వెనుకకు మరలి పోయెను.

ప్రజలు మాత్రము వారి దీక్షను విడువక కాయముల యొక్క అలజడలకు లొంగక ప్రాణములు వీడుటకైననూ సిద్ధముగా వుండిన కొందరు ఆయాసముచే శ్వాసలు తీయుచూ అయోధ్యకు తిరిగి పోవుట కంటె రాముని అనుసరించుచూ

ప్రాణములు పీడుట మంచిదని తలంచి రథము పోయిన మార్గమును అలసి సొలసి ప్రయాణము సలుపుచూ వచ్చిరి. ప్రేమకు వశులై తనను వీడలేక వెంటవచ్చు చుండిన ప్రజలను శ్రీరాముడు చూచి చాలా విచారపడినాడు.

రథమునాపి కరుణతో మృదుమధురమైన వాక్కులతో వారిని పలుకరించి అనేక ధర్మములను వుపదేశించి వారిని యెటులైనా అయోధ్యకు తిరిగి పోవుడని కోరెను. రామ వియోగమును భరించలేమనియూ రాముడులేని అయోధ్యలో మేము క్షణకాలమైననూ నిలువలేమనియూ మా ప్రాణములు వీడుటకైననూ మేము సంసిద్ధముగా వున్నామని పలువురు తెలిపిరి.

యువకులైన మరి కొందరు, "రామా! ధర్మదేవత లేని పురము అరణ్యము కంటే ఘోరము. అట్టి భయంకర వనమున మేము వుండలేము. నీవు నివసించు ఈ అరణ్యమే మాకు ఆనందపురము. కాన మా శ్రమకై మీరేమాత్రమూ విచారించక మీ దీక్షను మీరు కొనసాగించుడు. మా దీక్షను మేము కొనసాగింతుము. పితృవాక్య పరిపాలన మీకెంత ప్రధానమని తలంతురో అటులనే మా హృదయవాసియైన ఆత్మారాముని ఆనతి మాకంత ప్రధానము, ప్రమాణము. కాన మేము నిలువము. వెనుకకు మరలము. మరణమే మాకు శరణ్యము," అని గొల్లున యేడ్చుచున్న ఆ ప్రజలను చూచి వారి దీక్షావచనములు విని రామచంద్రుని హృదయము ద్రవించెను.

సీత కంటిధారలు జలజల రాలెను. లక్ష్మణుడు ప్రజల అభిమానమును గుర్తించి, ఇట్టి అభిమానము కైకకు లేకపోయెనుకదా అని కండ్లెఱ్ఱ చేసుకొని మాటాడలేని స్థితిలో తలవంచి కూర్చొనెను.

రాముడు యెటులో వారికి నచ్చచెప్పి పంపుట మంచిదని తలంచి మరింత ప్రేమతో దయతో వారలను వోదార్చి వారి అగ్నికార్యములకు ఈవిధమైన ప్రయాణము కొంత ఇబ్బంది కలిగించుననియూ మీరు అయోధ్యకువెళ్ళి యజ్ఞయాగాది క్రతువులు చేయుచుండిన కాలము అతి త్వరగా దాటి పోవుననియూ మీరు చేయు క్రతువుల ఫలముగా నేను అరణ్యమున సుఖజీవనముచేసి ఆనందముగా అయోధ్యకు వచ్చి చేరుదుననియూ యెన్నియో విధముల తెలిపెను.

అయిననూ ఆ యువక బ్రాహ్మణులు యే మాత్రమునూ వెనుకకు పోవుటకు అంగీకరించరైరి. తమ తల్లిదండ్రులు వృద్ధులగుటచే వారిని చూచుకొనువారు కూడా ఇండ్లయందు లేరు. కనుక ఇట్టి పట్టును పట్టి వృద్ధులను బాధపెట్టుట మంచిది కాదని ధర్మ బోధలు నీతి సూక్తులూ వేలకు వేలు తెలిపెను అందులకు బ్రాహ్మణ యువకులు రామచంద్రా! మా తల్లిదండ్రులు శక్తిహీనులగుటచేత కొంతదూరము

మాత్రమే వచ్చి రామ వియోగమును భరించలేక దారిని అనుసరించలేక కుమిలి పోవు చున్నారు. మేము రామచంద్రుని అనుసరించలేక పోయినను మీరైనా అనుసరించి అతని అనుగ్రహమునకు పాత్రులు కండని మా తల్లిదండ్రులు ఆనతిని ఇచ్చియే పంపిరి. కనుక తాము చెంత లేమను చింత కంటెను రామ చంద్రుడు అయోధ్యలో లేకపోయెనే అను చింతయే వారలను అమితమైనంతగా బాధించుచున్నది. కనుక మేము రాముని అనుసరించుట మా తల్లిదండ్రులకు ఆనందమే కాని విచారముకాదు. వారిని ఆనంద పెట్టుటకైననూ మమ్ములను మీతో గొనిపొమ్మని బ్రాహ్మణ యువకులు పాదములు పట్టి ప్రార్థించిరి.

రాముని హృదయము కరిగిపోయినది. మారు మాటాడలేక పోయినాడు. యేమి చెప్పుటకూ తోచక తన త్యాగమునకు మించిన త్యాగమును అనుసరించుచున్నారని ఒకవైపున ఆనందము మరొక వైపున సిగ్గునూ అతనిలో కలిగెను. ఇంతలో చీకటి క్రమ్మెను. ఇట్టి కటిక చీకటిలో అయోధ్యకు వెళ్ళమనుట మంచిదికాదని తలంచి అలసిపోయిన వారలకు కొంత విశ్రాంతినిచ్చుట మంచిదని తలంచి వారలను కంద మూలాదులను భుజించి విశ్రమించమనికోరెను. తమ రథమును ఆపి తమసానదిలో స్నానము చేసి సంధ్య వార్చి తానునూ కొంత విశ్రాంతి తీసుకొనునటుల నటించెను. పగలంతయూ పరువులెత్తిన ప్రజలు రామ సన్నిధిలో విశ్రమించుట చేత వారల దేహములు గాఢమైన నిద్రలో మునిగెను. ఇది కనిపెట్టి తెల్లవారిన తిరిగి వారు రాముని విడువరని తలంచి రెండు ఝాముల రాత్రి గతించగనే, రాముడు సుమంతుని లేపి రథము యొక్క జాడలు కనపడకుండా నిద్రించువారికెట్టి నిద్రా భంగము కాని య్యక రథమును నడుపుమని తెలిపెను.

ఇంతకంటే వేరు వుపాయము లేదని తలంచి సుమంతుడు కూడా రథమును యుక్తిగా అటూ ఇటూ త్రిప్పి తిరిగి అయోధ్య వైపునకు వెళ్ళినటుల రథ జాడలు చూపి గాఢమైన అడవిలో ప్రవేశించెను.

అంత ప్రాతఃకాలమయ్యెను. జనులు నిద్రనుండి మేల్కొని లేచి చూచిరి. రథముకానీ, సీతా రామ లక్ష్మణులు కానీ లేకపోవుటచూచి అమితముగా దుఃఖించుచు, ఇంకనూ నిద్రించు వారలను మేల్కొలిపి, రథముపోయిన జాడలను గుర్తు పట్టుటకు అనేక విధములు ప్రయత్నము చేయుచూ, రామా! రామా! అని యెలుగెత్తి ఏడ్వసాగిరి, పరుగెత్తిరి. అందులో ఒకరు, సోదరులారా! మనము పడు చుండిన కాయక్లేశము జూచి రాముడు మనలను విడిచిపెట్టెను, అని ఒకరినొకరు నిందించుకొనుచు జలములోని మీనములను స్తోత్రము జేసిరి. ఆ మీనములు జలము

లేక జీవింపవు. రాముడు మావద్ద లేకపోయిననూ మేము జీవించితిమి. ఛీ! ఎందుకు మన బ్రతుకు? మన ప్రియుడగు రాముని వియోగమును తెచ్చుకొంటిమి కదా? మనమే ఎందుకు మరణమునూ తెచ్చుకొనకున్నాము. అని ఒకరికొకరు చెప్పుకొనుచూ, ఆత్మ శ్రీరాముడే కనుక, ఆత్మహత్య మంచిదికాదు. ఈ వియోగమును మనము కోరితెచ్చుకున్నదికాదు. విధివ్రాత. అటులనే మరణమునూ మనము కోరి తెచ్చుకొనుట మంచిదికాదు. అదియునూ విధి ననుసరించే ప్రాప్తించును కాన, విధినైననూ ప్రార్థించి, ఆ మరణమును తెప్పించుకొనుటమంచిదని మరొకరుబోధించిరి.

ఈ రీతిగా ఒకరిలో ఒకరు తర్కించుకొంటూ, ముందుకు చేయునదేమని విచారించుచూ, రథముయొక్క జాడలను కొంత గుర్తించిరి. ఆ జాడలు అయోధ్యాపురము దిశకు వెనుకకు తిరిగినటుల కొంతదూరము కనుపించి, తరువాత జాడలు కనుపించకపోవుట చేత, జాడలు గుర్తించుట కష్టమగుటచేత, వియోగముతో చేయునదిలేక నగరములో ప్రవేశించిరి. రాముడు తిరిగి రెండు మూడు దినములకైనా మన వియోగబాధను కనిపెట్టి, అయోధ్యకు చేరునేమో అన్న ఆశ కొంతమందికి కొంత ఉపశాంతి చేసెను. ఇండ్లలోని స్త్రీలు రామపునర్దర్శనాపేక్షులై వ్రతోపవాసములు జేయదొడగిరి. సూర్యుడులేని సమయమున చక్రవాక మిథునమును, కమలములును వాడురీతి వారు దీనులై విచారించిరి.

ప్రజల గోలు ఈ రీతిగా వుండ సీతారామ లక్ష్మణులు, మంత్రియైన సుమంతునితో గూడి శృంగిబేర పురమునకు వచ్చిచేరిరి అపుడు రాముడు గంగా నదిని చూచి రథమును ఆపమని సుమంతునకు చెప్పి తాను దిగి గంగానదికి నమస్కరించెను. సీతా లక్ష్మణ సుమంతులునూ రథమును దిగి గంగకు నమస్కరించిరి. సకల సన్మంగళమునకును ఆనందమునకును గంగానది మూలమని రామచంద్రుడు పలికెను. గంగను గురించిన చిత్రవిచిత్ర కథల నెన్నింటినో రామచంద్రుడు వారలకు తెలుపుచూ వచ్చెను. తరువాత అందరూ గంగలో దిగి, స్నానము చేసిరి.

సీత దిగుటకు తగిన వసతిని చూడమని రాముడు లక్ష్మణునకు ఆదేశించెను. లక్ష్మణుడు అరణ్యములో ప్రవహించు గంగకు గట్లు చాలా మెత్తగా వుండును గనుక, సీత దిగుటకు కొంత అనుకూలమైన స్థానమును వెతికి దానికి తగిన రాళ్ళు భద్రపరచి సీతామాతను అక్కడ స్నానము చేయమని కోరెను. ఆమె కూడను జాగ్రత్తగా గంగలో దిగి నమస్కరించి, స్నానము చేసెను. మార్గాయాసముచే అలసియుండుటచేత, లక్ష్మణుడు కొంత తిరిగి అడవి ఫలములు యేరుకొని వచ్చి సీతా రాములకు అందించుటవలన వారు వాటిని భుజించి విశ్రమించిరి.

ఇంతలో కొందరు నావ నడుపువారు అక్కడక్కడ కనుపించిరి. సీతారామ లక్ష్మణులతో రథమును చూచిరి. వారెవరో రాజపుత్రులవలే నున్నారని కనిపెట్టి విహారార్థమై వచ్చియున్నటుల భావించి నిషాదాధిపతియగు గుహునకు ఉతావురిజని ఈ వార్త నందించిరి. వార్తవినగనే మరొక మనిషిని పంపి వారెవ్వరో యేమో తెలిసికొని రమ్మని తెలిపెను. గుహుడు వీరు పరులెవ్వరూ కాదనియూ అయోధ్యా పతియైన దశరథమహారాజ పుత్రులనియూ, మంత్రిసుమంతునితో వున్నారనియూ వివరములు తెలుసుకొని, ఉత్కృష్ట పదార్థము నొక్కడే సేవించుట యుచితము కాదని తలంచి ఈ రామరాక వార్త బంధువులకు, స్నేహితులకూ తెలిపి, ఫలపుష్ప ములను కూర్చుకొని నమ్రుడై రామదర్శనార్థమై గుంపులుగా బయలుదేరి గంగా తీరమునకు వచ్చిరి. వారు తెచ్చిన ఫలపుష్పాదులు రామ పాదములచెంత పెట్టి నమ స్కరించెను గుహుడు. గుహుడు నమస్కరించగనే వచ్చిన బంధుమిత్రులుకూడనూ నమస్కరించిరి. వారల ఆనందమును చూచి రామచంద్రుడు గుహుని దగ్గర చేర్చు కొని కుశల ప్రశ్నలు వేసి, పరిపాలనా విధానమును గూర్చి విచారించెను.

అందులకు గుహుడు, నాథా! రామచంద్రా! మీ చరణములను దర్శించినందున మేమందరము అమితానందమును పడుచున్నాము. దుర్లభమైన మీదర్శనము, మా పుణ్యఫలముచే చిక్కినది; లేకున్న ఈ అరణ్యములోవున్న మాకు మీపవిత్ర చరణ ములు చిక్కునా, దీనికి పూర్వ మెట్లుండిననూ ఇక నేటినుండి మీపాదస్పర్శ జరి గిన ఈ ప్రాంతము సుభిక్షముతో నిత్యకళ్యాణములతో వర్ధిల్లును. అందులో సంది యములేదు. అని రామదర్శన ఫలమునే వర్ణించుచూ ఆనందబాష్పములు రాల్చుచూ వుండిన గుహునిచూచి, లక్ష్మణ, సీతా, సుమంతులు ఆశ్చర్యపరవశులయిరి. ఇంతలో గుహుడు పాదములుపట్టి, రామచంద్రా! అంతయూనీదే, నాకున్న ధనము, రాజ్యము, సంపదా ప్రజయూ అన్నియూ నీ సేవాకైంకర్యములే. నన్ను నీపాదదాసు నిగా భావించి, నగరమున ప్రవేశించి నన్ను కృతార్థుని చేయుము, అని అడుగు కొనెను.

అందులకు రామచంద్రుడు చిరునవ్వు నవ్వుచూ, "గుహుడా! నీవు పరమ భక్తుడవు. గుణశాలివి నీ హృదయము అతి నిర్మలము. కానీ నా తండ్రిగారి ఆజ్ఞాను సారము పదునాలుగు సంవత్సరముల వరకూ మునివేషముతో వనమున సంచరించ వలెను. పట్టణమున పాదము పెట్టకూడదు. తాపస ఆహారమునే సేవించవలెను. తాపస జీవితమునే గడపవలెను. అని తెలిపెను.

పై కారణములచేత, నేను మీ ఆశయాన్ని నెరవేర్చలేక పోవుచున్నాను,

అని రాముడు చెప్ప గుహుడు దుఃఖించెను. సీతారామలక్ష్మణుల దివ్యమంగళ విగ్రహములను చూచి శృంగీబేర పురవాసులు గుసగుసలాడ దొడగిరి.

"ఆహా! వీరి తల్లిదండ్రులెవరో, ఇట్టి మన్మథరతులనే మరపించు బిడ్డలను వనమునకు పంపుటకు వారిమన సెట్లోప్పెనో కదా? నోరెట్లాడెనో కదా?" అని ఒకరు విచారించ, మరొకరు "ఓయి మూర్ఖుడా, వారు ఎంతో మంచిపని చేసిరి. వారే వీరలనుఅరణ్యమునకు పంపకున్న మనమువీరలను కన్నులపండువుగా దర్శించి యుందుమా! ఈనాడు మననేత్రములకు ఉత్సవము కలిగెను" అని మరొకరు తమ ఆనందమును వెలువరచెను.

ఇట్లు అక్కడ వచ్చిన ప్రజలు ఒకరిలో నొకరు వీరి సౌందర్య సుకుమారత్వమును ముచ్చటించుకొనుచుండ, నిషాదపతి అయిన గుహుడు తమ పట్టణమున అడుగు పెట్టునట్టి ప్రాప్తికి నోచుకొనలేదని చింతించి, వారినేత్రమైననూ తమ పట్టణమున పడిన పవిత్రము కాగలదని తలంచి, మనోహరమైన ఒక శింశుపా వృక్షమును జ్ఞప్తికి తెచ్చుకొని రాముని తీసుకొని పోయి ఆ ప్రదేశమును చూపించెను.

ఆ స్థలమును చూచి రాముడు సంతోషించెను. అంత వచ్చిన గ్రామప్రజలు రామచంద్రునకు నమస్కరించి చీకటి పడకమునుపే, వారి గ్రామమును చేరుకొనిరి.

రాముడు సాయం సంధ్యాద్యనుష్ఠానములు నిర్వర్తించెను. ఈ లోపల గుహుడు దర్భలను కోసుకొనివచ్చి కిసలయములతో మృదువగు ఒక శయ్యను సిద్ధపరచెను. గుహుడు పరివారమును పంపి మృదుమధురమగు కందమూల ఫలములను అడవి ఆకుల నిండా పెట్టుకొని తెమ్మని ఆజ్ఞచేసెను. సీతా రామ లక్ష్మణులు సుమంతుడును కందమూల ఫలములను భుజించి విశ్రమించిరి.

రాముడు శయనించునటుల నటించెను. సీతకూడనూ మెత్తని ఆదర్భశయ్యపై పరుండెను. లక్ష్మణుడు రాముని పాదములు వత్తుటకు చెంతచేరెను. తాను మేలుకొన్నటుల వుండిన లక్ష్మణుడు యెంతసేపయినా పాదములు వత్తుచునే యుండునని రాముడుతలంచి, లక్ష్మణునికికూడా విశ్రాంతి నందించిన మంచిదని భావించి, రాముడు గాఢముగా నిద్రించి నటుల నటించిన తోడనే, లక్ష్మణుడు రామునకు నిద్రాభంగము కాగలదని తలంచి పాదములు వత్తుట మాని మెల్లగా అక్కడనుండి లేచి కొంచెము దూరములో వీరాసనము వేసుకొని నలుప్రక్కలా చూచుచూ, క్రూరమృగములో లేక రాక్షసులో వచ్చి రామనిద్రకు భంగము కావింతురేమో అని అతి జాగ్రత్తతో వుండెను.

ఈ దృశ్యమును చూచిన నిషాదపతి రామ నిద్రకు భంగము కలుగ నివ్వక

చూచుకొమ్మని తన విశ్వాసనీయులైన సేవకులకు ఆజ్ఞచేసి తాను స్వయముగా తూణీరము గట్టుకొని లక్ష్మణుని వద్దకు వచ్చి కూర్చొండెను.

రామునియందుగల విశేషప్రేమచేత నిషాదపతి అయిన గుహుండు కంటిధారలు కార్చుచూ అత్యంత భక్తిశ్రద్ధలతో చేతులు జోడించుకొని లక్ష్మణుని ఈ రీతిగా ప్రశ్నించెను: "లక్ష్మణా! దశరథమహారాజుభవనము స్వయముగా దేవేంద్రునిభవనము కంటె అధిక శోభాయమానముగ నుండును. ఆ మందిరములో చిత్రవిచిత్రమగు సుందరములు అమర్చియుందురు. సుగంధ ద్రవ్యములు హంసతూలికా తల్పములు మణిదీపములు ఆనందము కలుగజేయుచుండును. పాలనురుగుతో సమానమైన మృదువగు తెల్లని దుప్పట్లును తలదిండ్లును వుండును. అంత చక్కని మందిరములో శయనించుచుండిన సీతారాములు నేడు దుప్పటి తలదిండ్లు పట్టెమంచములూ లేక దర్భశయ్యపై అలసటచేత గాఢముగా నిద్రించిరని తలంచుచే మహా దుఃఖముగ నున్నది. జననీ జనకులూ దాస దాసీలూ రాములవారిని అనేకరకముల రక్షించుచుండిరి. అట్టి సీతారాములు నేడు అరణ్యమున కఠిన నేలపై పరుండుటచే నా హృదయము బ్రద్దలగుచున్నది. లోక ప్రఖ్యాతిగాంచిన మిధిలాపురి చక్రవర్తి కొమార్తె అయిన జానకి దేవేంద్రుని మిత్రుడు దశరథ మహారాజు కోడలయిన సీతాదేవి, ఈ రాత్రి ఈ విధమైన దర్భలపై పవళించుట ఎవని యెడల విధాత విపరీతముగ లేదు?

సీతారాములు వనవాసమునకు యోగ్యులా? కర్మ ప్రధానమని లోకసూక్తి పరమ సత్యముగా సాక్షాత్కరించుచున్నది. కేకయరాజు కొమార్తె కైకేయి ఇంతటి చెడుపనిని చేయునని యెవ్వరునూ నమ్మరు. మంచి సుఖమును అనుభవించవలసిన ఈ వయసులో సీతారాములకు యిట్టి కష్టములు కలిగించుట యెంతటి పాతకము! పరమ విరోధులకు కూడనూ యిట్టికష్టము రాకూడదు.

కైకేయీదేవి సూర్యవంశవృక్షమును గొడ్డలివలెఛేదించెను. ఆమె స్వార్థము లోకమునే దుఃఖమున ముంచెను. ఆహా! నా పాడుకన్నులు ఈ అవస్థను చూడవలసి వచ్చెను కదా. యే జన్మమున, యే పాపము చేసితినో? యెవరి సుఖములు చూచి నా నేత్రములు మండెనో? ఈనాడు నా ప్రాణ సమానమైన రామచంద్రుని కష్టము ఈ కన్నులు చూడవలసి వచ్చెను" అని పొంగివచ్చు దుఃఖమును ఆపుకొనలేక నోరుమ మూసిపెట్టుకొని తలను బాదుకొంటూ విలపించుచున్న గుహుని చూచి, లక్ష్మణుడు కూడనూ విచారించెను.

లక్ష్మణుడు కొంత ధైర్యమును వహించి, "ఓ! నిషాదపతీ? ఒకరివలన ఒకరికి సుఖము కానీ, దుఃఖము కానీ, హితము కానీ, అహితముకానీ కలుగవు; కలుగు

టకు పీలులేదు. ఎవరు యేయే నిమిత్తమై వత్తురో, వారి పూర్వపు కర్మఫలము, సంకల్ప మహత్తర స్వరూపమూ, వారికి ఈవిధముగా కనుపించును స్వప్నములో భిక్షుడు రాజగును, రాజు భిక్షుడగును. మేల్కాంచిన తరువాత యెవరికినీ లాభనష్టములు లేవు. అటులనే, లోకమంతయూ మిథ్యయని తెలుసుకొనుము. రామచంద్రునకు సుఖదుఃఖములు లేవు, రావు. అవి చూచువారి పాప పుణ్యఫలములను పురస్కరించుకొని ఆయా అవస్థలు సుఖములు, ప్రతిబింబములవలె గోచరించును," అని లక్ష్మణుడు హితబోధ చేయగా, గుహుడు పూర్వము కైకేయిపై రేగిన రోషమును శాంతపరచుకొని "వ్యర్థముగా ఒకరిని నిందించుట, పరిహసించుట మంచిది కాదు.

రాత్రిలో జనులందరూ నిద్రించుచుందురు. అనేక విధములగు స్వప్నములు వారికి వచ్చుచుండును. ఈ సంసారలోపమగు రాత్రి వేళ యోగులు మాత్రము మేల్కొని యుందురు. వారలకు ప్రపంచముతో ప్రయోజనము లేదు. సకల విషయ భోగములనుండి విముఖుడు కానంతవరకు జీవుడు మేల్కొనేదని చెప్పుటకు వీలు పడదు. జ్ఞానము కలిగినందున మోహపాశములు వీడును, శ్రీరాముని చరణములందు అనురాగము పుట్టును." అని తానుతలంచి, ఈ విధమైన రామచంద్రుని మానవాతీత విషయములను సంపూర్ణ ప్రభావమును వర్ణించుచూ ఇరువురూ అనగా లక్ష్మణుడు గుహుడు ఆ రాత్రి పవిత్రముగా గడిపిరి.

ఇంతలో ప్రాతఃకాలమయ్యెను. ఒకరిని వుంచి మరొకరు కాలకృత్యములు తీర్చుకొని స్నానసంధ్యాదులు ఆచరించి వచ్చిరి. ఇంతలో రామచంద్రుడు కదిలి కన్నులు పులుముకొనుచూ నలుదిక్కులు తేరపారచూచి లేచెను.

సీతాదేవిని కూడను మేల్కొలిపి, ఇరువురూ గంగానదికి వెళ్ళి స్నానముల నాచరించి తిరిగి లక్ష్మణుడు గుహుడు వున్న ప్రదేశమునకు వచ్చి తమ్మునకు మఱ్ఱిపాలు తెమ్మని ఆజ్ఞ చేసెను. అన్నమాటను శిరసావహించు లక్ష్మణుడు మారుమాటాడక, కొంతదూరము వెళ్ళి మఱ్ఱిపాలను ఒక దొప్పలో తీసుకొని వచ్చెను.

ఆ తెచ్చిన పాలను తల వెంట్రుకలకు వ్రాసి కొనగా అవి ఒక జడలుగా తయారయ్యెను. వారి చర్యను చూచి సుమంతును గొల్లున యేడ్చెను. కన్నులు మూసుకొనెను. రాముని రాజ్యతిలకమును చూడవలసిన నేత్రము జడాముకుటములను చూడవలసి వచ్చెను కదా అని విచారించెను. హృదయము దహించి పోయెను. చేయు పదిలేక చేతులను జోడించుకొని సుమంతుడు, రామునిముందు నిలచి, "రామచంద్రా! నా అదృష్టముక్షీణించినది. నేనిక అధికకాలములో అరణ్యములో నివసించు ప్రాప్తికి

నోచుకోలేక పోవుచున్నాను. మహారాజా విధించిన ఆజ్ఞ పూర్తిచేసితిని. అరణ్యమున యేదైన ఒక పవిత్రనదీతీరము వచ్చువరకూ వెళ్ళి, అప్రదేశమున సీతా రామ లక్ష్మణులను విడచి, నీవు రథముతో వెనుకకు రమ్మని తెలిపిన వచనములు తమకు విన్నవించుచున్నాను. ముందు తమ ఆనతికి వేచియున్నా"నని తలంచుకొని కంటిధారలు కార్చుచూ అతి దీనుడై నిలిచిన సుమంతుని చూచి, "సుమంతా, నీవు విచారించకుము. మహారాజుయొక్క ఆజ్ఞ పూర్తిచేయుట నీకుమాత్రమే కాదు, నాకు కూడనూ కర్తవ్యము. నీకుఇచ్చిన ఆజ్ఞ నీవు నెరవేర్చినందున నాకెంతయో ఆనందము. ఇక నాకు ఇచ్చిన ఆజ్ఞను నేను శిరసావహించి నేటినుండి నా కర్తవ్యమును నేను ఆచరింతును. నీవు ఇక అయోధ్యకు వెళ్ళుటలో కాలహరణము చేయకుము. నీకొరకై తల్లిదండ్రులు అమితమైన ఆతురతతో కాచుకొని యుందురు. మా ప్రయాణముయొక్క వివరములు వినగోరుచుందురు. కాన నీవు రథమును వెనుకకు మరల్పుము" అని రామచంద్రుడు పలికెను. అంత, సుమంతుడు "ఓ రామచంద్రా! అయోధ్యానగరము అనాథ కాకుండునట్లు చూచుకొనుము. మీరు లేనప్పుడు మహారాజా జీవించుట కష్టము. భరతుడు రాజ్యముజేయుట దుస్తరము" అని బాలునివలె యేడ్చుచూ పాదములపైబడిన సుమంతుని లేవదీసి "సుమంతా, సత్యము కంటె నుత్కృష్టమగు ధర్మము మరియొకటిలేదు. ఈ సంగతి వేద పురాణేతిహాసములలో సుప్రసిద్ధము. అట్టి సర్వోత్కృష్టమైన ధర్మము నాకు సులభముగాలభించినది. దానిని విడచిపెట్టిన యెడల నాకునూ నా వంశమునకునూ మూడు లోకములందు అపకీర్తి వచ్చును. కోటిమరణములకంటే, అపకీర్తి, సంభావితులను దహించును. నీవు నా తండ్రిగారి పాదములమీద పడి నమస్కరించి నావిన్నపములను విశదము చేయుము. నన్నుగురించి సీతా లక్ష్మణులను గురించి వారు చింతింపకుండునట్లు మీరు చూచుకొనుడు." అని పలుకుచున్న శ్రీరామ సుమంతుల సంవాదమును గుహుండును, ఆతని పరివారమును విని వ్యాకులపడిరి.

వారలకు తెలియకనే వారల నేత్రములనుండి ధారలుధారలుగా నీరు కారదొడగెను. ఇంతలో భరించలేక లక్ష్మణుడు కొన్ని కటువు వచనముల బలికెను. కానీ అతని వచనము లనుచితములని రాముడు తెలిసికొని అతనిని నివారించెను. తదుపరి రాముడు మంత్రినిచూచి "సుమంతా! లక్ష్మణుడు బాలుడు. అతని వచనములను మీరు పాటించక, మా తండ్రిగారితో విన్నవింపకుడు. నాపై గల ప్రేమచేతను, సీత పడుచున్న బాధ చేతను అతని మనస్సు ఆవిధముగ బాధపడి, సీతారాములను అడవికి పంపెగదా అని తనలో ఒక విధమైన తప్పు అభిప్రాయపడుటచేత ఈ వచ

నములు వెలువడినవి. సహజముగా లక్ష్మణుడు మహాగుణశాలి. నీకు తగినవాడు"అని లక్ష్మణుని గుణగణములను వర్ణింపజొచ్చెను.

తలవంచుకొని దుఃఖముతో కుములుచున్న సుమంతుడు తలయెత్తి, "స్వామి! జానకి సుకుమారి, వనవాసకష్టముల నోర్వలేదు. ఏ విధమున జానకి నగరమునకు తిరిగి వచ్చునో ఆ విధమున ఆమెకు బోధించుట యుచితము ఆమె అయోధ్యకే ప్రాణము. రాజ్యలక్ష్మి ఒకవేళ ఆమె అయోధ్యకు వచ్చుటకు అంగీకరించని యెడల అయోధ్యావాసులు జలములేని మీనమువలె జీవించుట కష్టము. ఆమె స్వేచ్ఛాను సారము తల్లి వద్దగానీ, అత్తవద్దగానీ సుఖముగా నివసించి యుండవచ్చును. ఇదియే మహారాజుగారు కూడమా తమకు తెలుపుమని పదేపదే నాతో చెప్పిపంపిరి. మీరు పదునాలుగు సంవత్సరములు వనవాసముచేసి అయోధ్యకు చేరునాటికి జానకిని అయోధ్యకు తీసుకొనిరావచ్చును," అని సుమంతుడు రామునితో తెలుపుచుండ, రామ చంద్రుడు సీతనుచూచి, చక్కగా వినుచున్నావా అన్నటుల హెచ్చరించెను.

అంత రాముడు "సీతా! తండ్రిగారి సందేశమును వింటివికదా. నీవు యింటికి వెళ్ళు. నిన్ను చూచి అయినను నా తల్లిదండ్రులు, నా వియోగబాధను కొంత మర తురు. వారలు ఈవృద్ధాప్యమున అమితముగా బాధనుభరింపలేరు కాన నీవు మంత్రితో తిరిగి అయోధ్యకు వెళ్ళుట యెంతైనా అవసరము" అని అనేక విధముల బోధించు చున్న రాముని చూచి, "ప్రాణనాథా! మీరు సర్వజ్ఞులు, సర్వ ధర్మములను యెరి గినవారు. మీకు నేను వేరు చెప్పనవసరములేదు. నా విన్నప మొకింత ఆలకింపుడు. ఛాయ పదార్థము ననుసరించి యుండును కాని విడచి వుండజాలదు కదా. సూర్యుని విడచి సూర్యకాంతి, చంద్రుని విడచి చంద్రకాంతి యెటులుండ వీలుకాదో అదే విధమున రామచంద్రుని విడచి సీతాఛాయవుండజాలదు" అని సమాధానము జెప్పెను.

అంత మంత్రితో, "సుమంతా! నీవు నా తండ్రి మామలతో సమానులు. నా హితకారులు ఆర్యపుత్రులగు నా భర్త పదకమలములు తప్ప తదితర సంబంధ ములతో నాకు ప్రయోజనము లేదు. కన్న కొమరునకంటే, కట్టుకున్న కోడలు అత్తమామలకు అధికముకాదని లోకమునకు విదితమే. నన్ను చూచుకొని కొమరుని వియోగబాధను మరతురన్న మాట అర్థములేనిది. ఇక నా తండ్రిగారి భోగైశ్వర్య ములను పుట్టిన నాటినుండియూ అనుభవించితిని. నా భర్త వినా అవి యన్నియు తృణప్రాయములని నే గ్రహించితిని. నాపతిని విడచిన నాకు వేరు గతిలేదు. కాన మీరు వేరుగా భావించక నన్ను తిరిగి అయోధ్యకు గొనుపోవు ప్రయత్నములను మార్చి పొమ్ము. నా అత్తమామలకు నా హృదయపూర్వక నమస్కృతులను నా విన్న

పములను చెప్పి నన్ను గురించి విచారింపవలదని బోధింపుము. సీత అత్యంత ఆనందముతో ఒనగా అయోధ్యలో వున్న ఆనందమునకంటే మిథిలానగరమున అనుభవించిన వైభవములకంటే యెన్నియో వేల రెట్లు సంతోషముతో సుఖముతో వనవాసమును అనుభవించుచున్నదని తెలుపుము.

నా ప్రాణేశ్వరునితో వారి ప్రియ సోదరుడు వీరాగ్రగణ్యుడైన లక్ష్మణునితో నేను యెట్టి ఇక్కట్లునూ లేక భయ ఆందోళనములూలేక ఆనందముగా వనవాసము చేయుచున్నానని తెలుపుము. మార్గాయాసము యేమాత్రమూ లేక ఇది చాలా అదృష్ట జీవితమని నేను భావించుచున్నట్లు తెలుపుము."

ఇట్లు సీత చెప్పిన మాటలనువిని సుమంతుడు ఆ సీతాదేవిని తలయెత్తి చూడ లేక పోయినాడు. చెవులతో వినలేకపోయినాడు. నోటితో జవాబు చెప్పలేకపోయి నాడు. ఆమె గుణములను ఆమె భావములను తలంచుచు ఇట్టి రాజ్యలక్ష్మిని దూరము చేసుకొన్న ప్రజలు యెంత దురదృష్టవంతులో! యే జన్మమున యే పాపము నొన రించిరో! చిక్కిన అవకాశమును కూడనూ దక్కించుకొనలేక పోతిమికదా అని తనలో తాను చింతించుచూ, రామా అటులయిన నాకు ఒక అనుజ్ఞ దయచేయుడు. నన్ను మీతో ఈ వనమునందు పదునాలుగుసంవత్సరములు వుంచుకొని నాచే సేవలు చేయించుకొనుటకైననూ సెల విప్పవలెనని ప్రార్థించెను.

అందులకు రాముడు "సుమంతా, నీకు రాజనీతి బాగుగా తెలుసు. నీవు దశ రథచక్రవర్తికి మంత్రివికాని నాకుకాదు. నీకు ఆజ్ఞ ఇచ్చునది దశరథుడుకాని నేను కాదు. అంతియేకాక నీవు ఈ సమయమున మహారాజును విడచి యుండుట ధర్మము కాదు. నీవు మహారాజునకు కుడిభుజము వంటివాడవు. కాన నా ఆనందమును కోరుదు వేని నీవు ఆలస్యము చేయక అయోధ్యకు పొమ్ము. ఆ రీతిగా చేసిన నాకునూ నా తల్లి దండ్రులకునూ యెంతయో శాంతిని చేకూర్చినవాడవు కాగలవు." అని ఇంకా యెన్నియో విధముల తెలిపిన రామవచనములను మీరలేక, అయ్యో నావిధి నన్ను విడువకున్నదని ఘోరునయేడ్చి ముగ్గురి పాదములకు నమస్కరించి, పొంగిపొరలి వచ్చు దుఃఖముతో వెనుకకు నడవలేక నడుచుచున్న సుమంతుని చెయ్యిపట్టుకొని రామచంద్రుడు రథమువరకూ తీసికొనివచ్చి, రథములో కూర్చొనబెట్టి, సుమంతుని గుఱ్ఱములనూ ప్రేమతో పలుకరించి, ఇక కదలవలసినదిగా ఆజ్ఞచేసెను.

సుమంతుడు రథమును నడిపించెను. గుఱ్ఱములు సహితము వెనుకకు తిరిగి చూచుచు, యెంత ప్రయత్నించిననూ అవి ముందుకు నడవలేక పోయినవి. సకిలిం చుచూ సారె సారెకూ వెనుకకు లాగుచూవచ్చెను. రాముని వైపున చూచుచూ కంటి

నీరు తుడుచుకొనుచూ తల బాదుకొనుచూ వెళ్ళుచున్న సుమంతుని నిషాదపతియైన గుహుండు చూచుచూ తన శిరస్సును ఒక చెట్టునకు ఆనించి భరించలేని బాధపడ జొచ్చెను. ఈ విధముగా బలవంతముగా రాముడు సుమంతుని పంపి, భార్యయూ తమ్మునితో గూడి గంగాతీరమునకు వచ్చెను.

నోరులేని జంతువులే రామవియోగమును సహించలేక యేడ్చుచున్నవికదా. ఇక రాముని కన్న తలిదండ్రులు, ప్రజలు రామవియోగమును యెట్లు భరింతురు, సహింతురు. అయ్యో! ఆ కౌసల్యాదేవి యెంత దుఃఖించుచున్నారోకదా అని గుహుండు తనలో తాను చింతించుచూ, అమితమైన దుఃఖముతో కుమిలిపోయెను. ఇంతలో సీతారామలక్ష్మణులు గంగాతీరమునకు నడుచుచుండుట చూచి గుహుండుకూడనూ వారిని అనుసరించి ఇవతలి ఒడ్డులోవున్న నావికుని పడవ ఇటువైపునకు తెమ్మని కేకవేసెను.

తమ యజమాని కేకను విని, పడవను నావికుడు రామచంద్రుడున్న స్థానమునకు నడుపుకొని వచ్చెను. ఇంతలో గుహుండు నావికుని చెంతకు పిలిచి దశరథమహారాజు కొమారుడైన శ్రీరామచంద్రుడు సతి, సోదరుని సమేతుడై వనవాసము చేయుచున్నాడు. వారు ఇప్పుడే గంగానదిని దాటి అడవులలో ప్రవేశింతురు. కాన నీవు పడవను శుభ్రపరచుమని ఆజ్ఞచేసెను. దీనికి పూర్వమే రామచంద్రుని చరిత్ర ప్రజలద్వారా విని యుండుటచేత నావికుడు సరేకానీ, ఆనాడు తన పాదము సోకగనే గుండు స్త్రీగా మారెనన్న కథ వినియుంటిమికదా? ఆ రామచంద్రుడేనా యితడు, లేక ఇతను వేరే రామచంద్రుడా అని గుహుని, తమ సేవకుడైన నావికుడు ప్రశ్నించెను. అందుకు గుహుడు, నావికా నీకెంత జ్ఞాపకము, యేనాడో జరిగిన విషయమును నీవు స్మరించి నాకు కూడనూ స్మరణకు వచ్చునటుల చేసితివి అని తక్షణమే రామచంద్రుని వైపునకు తిరిగి, రామా, చూచితివా మా నావికుడు తమ మహత్తర శక్తిని మదియందు మరవక ఈ సమయమున దానిని నాకు జ్ఞాపకము చేయుచున్నాడు. ఆనాడు గౌతముని భార్యఅగు అహల్య శాపమును, నా రాజ్యములో ప్రజలు యెంత చింతించుచున్నారో తమ దివ్యశక్తులను తెలుసుకొను వారెట్టి ధన్యులోకదా అని తమ నావికుని భక్తిశ్రద్ధలను వర్ణించుచుండగనే, రామచంద్రుడు పడవలో కూర్చొనుటకు పడవ చెంతకు బయలుదేరెను.

ఇంతలో నావికుడు దగ్గరవచ్చి, "రామచంద్రా! నాజన్మధన్యమైనది. యేనాడో వినిన నామమును ఈనాడు సాక్షాత్తుగా దర్శించగలిగితిని. తమను, తమదేవిని, సోదరుని గంగానది దాటించునట్టి అదృష్టము నాకు లభించుట అనేకజన్మల పుణ్యఫలము.

అయితే ఒకపరి తమ పాదతీర్థము నా శిరస్సున చల్లుకొని, తదుపరి పడవను నడిపింతును. మొదలు తమ పాదములు నా చేతియందుంచుడు" అని ప్రార్థించెను. ఈ నావికుని మాటలు వినుచున్న గుహుడు, తమ సేవకునకు శ్రీరామచంద్రునిపై ఇంత భక్తిశ్రద్ధలున్నవన్న విషయము తనకు ఇంతకు ముందెన్నడూ తెలియనందున ఆశ్చర్యపడి, ఆహా! నావికుని అదృష్టమెంతటిదని తనలో తాను ఆనందించి, నావికా రామచంద్రుని పడవలో కూర్చొనబెట్టి ఒక పాత్రలో పాదములు కడిగి తీర్థమును స్వీకరించవచ్చుకదా! రాములవారిని నిలబెట్టి, ఈరీతిగా చేయుట గౌరవము కాదు అని మందలించెను అందులకు నావికుడు, "ప్రభూ, తమరు శ్రీమంతులు. నేను అతిపేదను. ఈ కార్యము చేతనే నేను నా సంసారమును పోషించుకొనుచున్నాను, వచ్చు ధనము దినబత్తెమునకే చాలదు. ఇక ఉధిక వ్యక్తులు నాతలపై పడినవారిని నేనెట్లు పోషింతును. కాన తమరు వేరుగా భావించక పడవలో కూర్చొనకపూర్వమే రామచంద్రుని పాదములు కడుగుటకు ఆజ్ఞఇవ్వండి" అని వేడుకున్నాడు.

నావికుడు చెప్పు మాటలు రామునకు అర్థమయి రాముడు సీతను చూచి నవ్వుచూ చూచితివా ఈ నావికుని భయము అని హెచ్చరించినాడు. అయితే గుహునకు యేమీ అర్థముకాక, "నావికా, నీమాటలు నాకేమీ అర్థమగుటలేదు. వనవాసము చేయ సంకల్పించిన రామచంద్రుని గంగను దాటించుటకూ,నీసంసార తాపత్రయము లకూ గల సంబంధమేమి? ఒకవేళ రామచంద్రుని దగ్గర పడవను దాటించుటకు అధికపన్ను చెల్లించమని కోరుచున్నావా? అట్లు కోరుటలో నీ తెలివితక్కువనే చెప్పవచ్చు. లేదా నీ సంసారమునకు అవసరమైన ధనమేమైనా కావలెనన్న నేను చెల్లింతును. రామచంద్రుని ఆశించవద్దు. త్వరగా సిద్ధముకమ్ము" అని నావికుని దండించ జొచ్చెను. అందులకు నావికుడు "ప్రభూ, రామచంద్రుని పాదములో యేదో ఒకవిధమైన శక్తి వున్నదని వింటిని, అతని పాదము సోకగనే రాయి స్త్రీగా మారినదట. నా పడవలో అనేక కఱ్ఱముక్కలున్నవి. ఇవన్నీ స్త్రీలుగా మారిన, నా పడవలో పుట్టిన వారిలో నాకే సంబంధము కానీ ప్రభువుల వారికెట్టి సంబంధమూ వుండదు, కాన మొదలు ఆ పాదములను కడిగిన, నాకు అట్టి భయము పోవును. అంతియేకాక, రామపాద తీర్థము నా శిరస్సుపై చల్లుకొనుటచే నా పాపము నశించును. కాన మీరు నా వాంఛకు అడ్డుచెప్పక సెలవిండని" గుహుని కోరెను.

గుహుడు కొంత యోచించుచున్నప్పటికినీ రామచంద్రుడు చిరునవ్వుతో నావికుని పిలిచి, తన పాదములు నావికుని అరచేతులయందు పెట్టి నాయనా, నీఇష్ట ప్రకారము పాదములను కడుగుమని ఆజ్ఞాపించెను. అంత నావికుడు రామచంద్రుని

పాదములను హస్తములందుంచుకొని గంగా జలముతో బాగుగా వ్రేళ్ళసందులయందు కూడనూ అతిజాగ్రతగా కడిగి ఆ పవిత్రజలమును శిరస్సున చల్లుకొని తన పడవ పూర్తి ఆ జలమును ప్రోక్షించెను. అంత నావికుడు తృప్తితో పరమానందపడి రామచంద్రుని పడవలోనికి చేయిపట్టుకొని యెక్కించుకొనెను. అంత రామచంద్రుడు సీతను తన హస్తములతో పడవలోనికి దాటించుకొని లక్ష్మణుని కూడా తనతో కూర్చొనబెట్టుకొని నావికుని అజ్ఞానమును భక్తినీ ఆనందముతో ఒకరితో నొకరు మాట్లాడుకొనుచూ వుండగా పడవ కదిలెను. గుహునితో అనేక విషయములను తెలుపుచూ కాలమును గడుపుచున్న రామలక్ష్మణులు కాలము తెలియకనే గట్టుచేరిరి.

అంత రామచంద్రుడు ఆ నావికునకు వేతనము నిచ్చుటకు తనచెంత చిల్లిగవ్వయైననూ లేనందున చాల సిగ్గుపడినటుల నటించెను. అంత రామహృదయమును యెరిగిన జానకీ తన వ్రేలియందలి వుంగరమును తీసి రామహస్తముల యందుంచెను. అంత రాముడు, ఓయీ! నావికా, ఇదిగో నీవేతనము, పుచ్చుకొనుమని పలికెను. అంత నావికుడు రామచంద్రుని పాదములపై బడి "రామా! రామా! ఈ నాడు నాజన్మ సాఫల్యమయినది. నా సర్వపాపములూ పటాపంచలయినవి. నా భవ రోగము తీరినది. అనేక జన్మలగా శ్రమపడుచుండిన నాశ్రమకు నేడు నా విధాత నాకు ప్రాప్తించి నా వంశమునే తరింపజేసితిరి. నాథా, మీ అనుగ్రహ మొక్కటుండిన చాలును. తిరిగీ తమరు వచ్చునపుడు నన్ను మరువక ఇట్టి సేవ నాకు కటాక్షించిన ధన్యుడయ్యెదను" అని పాదములపైబడి ఆనంద బాష్పములతో ప్రార్థించెను. అంత రామలక్ష్మణులు పలువిధముల ఆ నావికుని ఓదార్చి బోధించి వేతనమును పుచ్చుకొమ్మని నచ్చజెప్పిరి.

అయితే ఆ నావికుడు స్వామీ! రామచంద్రా, నేను మిమ్ముల నొక్కరినీ ఈ చిన్న గంగానది దాటించినందుకే నేను వేతనము పుచ్చుకొన్న తమరు కోట్లకు కోట్లకు నా తరమువారలను నాతోటి మానవులను సంసార ప్రవాహమును దాటించి మోహసాగరమును దాటించుచున్నారే, ఇందుకు తమరేమి వేతనమును పుచ్చుకొనుచున్నారు? ఈ స్వల్పకార్యమునకు నేనెంతో అదృష్టవంతుడనని ఆనందించుచుండ నా ప్రాప్తిని దూరము చేయుట తమకు భావ్యముకాదు, రామా, అని దీనుడై ప్రార్థించెను. అంత రాముని హృదయము కరిగి అతనిని తొందరపెట్టుట మంచిది కాదని తలంచి హృదయ పూర్వకంగా ఆశీర్వదించి అతనిని దీవించిపంపెను. అంత రామలక్ష్మణులు తమ తమ విల్లులు ఒక వస్త్రముపై నుంచి స్నానము చేసిరి. తదుపరి సీత స్నానముచేసి చేతులు జోడించి గంగను అనేక విధముల ప్రార్థించి నా

నాథునితో తిరిగి పదునాలుగు సంవత్సరములు ఆనందముగా అడవులలో గడిపి నిన్ను దర్శింతును, తిరిగి నీ నిర్మల ప్రేమజలమును నా శిరస్సుస్ప్రోక్షించుకొందు నని చెప్పెను. అంత రామచంద్రుడు గుహుని పిలిచి నాయనా ఇప్పటికే నీ కాల మును నేను అధికంగా వినియోగించుకొంటిని. నీవిక నీగ్రామమునకు వెళ్ళుమని రామ చంద్రుడు ఆజ్ఞచేసెను. ఆ మాటలు వినిన క్షణముననే గుహుని ముఖము వాడిపో యెను. కంటిధారలు కారెను. చేతులు జోడించుకొని, "రామా! నా మాటలు ఆల కింపుము. కొంతకాలము నేను తమతోవుండి ఈ అరణ్యముని మార్గములు తెలిపి తమ సేవను చేసుకొందును, దీనిని కాదనక అంగీకరించుము" అని ప్రార్థించెను.

అంత రామచంద్రుడు గుహుని ప్రేమకు భక్తికి ఆనందించి తనవెంట తీసు కొని వెళ్లెను. కొంతదూరము సీతా రామ లక్ష్మణ గుహులు నడచి సాయంకాలమునకు ఒక విశాల వృక్షచ్ఛాయలో విశ్రాంతి తీసుకొనిరి. ఆవృక్షముక్రింద సీతా రాములు కూర్చొనుటకు యోగ్యమగునట్లు గుహుడూ లక్ష్మణుడూ స్థలమును శుభ్రపరచిరి. వెంతనే రామచంద్రునికి వినియోగమగుటకై ముఖములు వికసించుకొని కాచుకున్నట్లు కనుపించుచున్న ఫలములు రేగిపండ్లు గుహుడూ లక్ష్మణుడూ పెరికితెచ్చి విశాలమైన ఆకులలోవుంచి సీతారాముల కందించిరి. అంత రాముడు, లక్ష్మణా సంధ్యావందనము చేయక ఫలములను ఆరగించవచ్చునా ? అని తెలిపి లక్ష్మణుని వెంటబెట్టుకొని తీర్థ రాజమగు ప్రయాగను సందర్శించి స్నానమాచరించిరి. అంత వెనుకకువచ్చి గుహు నకునూ లక్ష్మణునకునూ తీర్థరాజమైన ప్రయాగయొక్క మహత్తరమైన ప్రభావ మును తెలుప దొడగెను. ప్రయాగయొక్క వైభవము మహత్తరము యెంత వర్ణించినను వీలుకావని, అది సమస్త పాపములను నాశమొనరించునని తెలిపెను.

అంత సీతను దోడ్కొని లక్ష్మణ గుహులతో కలిసి భరద్వాజ ఆశ్రమమును ప్రవేశించిరి. అంత యెంతోకాలముగా రామదర్శనమునకై వేచి యుండినటుల భర ద్వాజ మహాఋషి-ఆశ్రమ ద్వారమునకు యెదురుగా రావటముచూచి రామచంద్రుడు ఆమునికి నమస్కరించెను. అంత భరద్వాజుడు యెంతో ఆప్యాయముగా రాములను కౌగిలించుకొని అతనిని ప్రేమతో తన ఆశ్రమములో ప్రవేశించమని కోరెను.

రామచంద్రుడు అందులకు ఆనందించి ఆశ్రమములోపలవెళ్ళి వారివారి హోదాలకు తగినటుల పూర్వమే సిద్ధపరచిన ఆసనములపై కూర్చొనబెట్టుకొని భర ద్వాజుడు కుశలప్రశ్నలను అడిగి, తన మనోభీష్టము ఈనాటికి ఈడేరినదని ఋషి ఆనందించెను. తమ శిష్యులతో తెలిపి కంద మూలాదులను తెప్పించి సీతా రాఘు లక్ష్మణ గుహులకు ఇవ్వమని తెలిపెను,

ఈ విధముగా ఋషి, శ్రీరాముల సేవలు చేయుచూ ఆ రాత్రి అక్కడ గడి పెను. తెల్లవారి రామచంద్రుడు ప్రయాగస్నానమునకు వెళ్ళుతూ ఋషినికూడనూ రమ్మని కోరగా, భరద్వాజమహర్షి, "స్వామీ! రామచంద్రా! యే దివ్య దర్శనము నకై నే నీ ప్రయాగ ఒడ్డున నివసించి, తపస్సు చేసితినో, యే పవిత్ర స్పర్శకై నేను యజ్ఞ యాగాది క్రతువుల నాచరించితినో, యే సంభాషణల నిమిత్తమై జప ధ్యానములు చేసితినో, ఆ దర్శన సంభాషణ స్పర్శలు నేడు ఫలించెను. ఇక నాకు స్నాన పానాదులు అవసరములేదు. రోగముతీరిన తదుపరి ఔషధము సేవించు మూర్ఖుడనుకాదు. నా భవరోగము తీరెను. భగవంతుని గాంచితిని," అని తనలోని నిజభావమును ఆనందబాష్పములతో రామచంద్రునకు తెలుపుకొనుటచూచి విని, గుహుడు పరమాశ్చర్యమునొంది, "అహో! నేనెంత అదృష్టవంతుడనని తనలో తాను ఆనందించెను.

అంత రామచంద్రుడు తనదైవత్వమును మరుగు పరుచుకొనుచూ, తాను సామాన్య మానవ మాత్రుడుగా భావించునటుల నటించదొడగెను. భరద్వాజమహర్షి, యెన్నివిధముల రామత్వమును వర్ణించిననూ ఆ రాముడు యెవరో వేరే రాము డన్నట్లు తాను వినుచూ, ఓ మునివరా! మీచే నాదరింపబడినవారందరూ గొప్పవారే. అట్టివారందరూ సకల గుణసంపన్నులు కదా? అని జవాబు చెప్పుచున్న రామవాక్య ములకూ, మునివాక్యములకూ ఆశ్రమములో చేరిన బ్రహ్మచారులు, సిద్ధపురుషులూ, యోగులూ, మునులూ వినుచూ ఆనందించుచూ, ఆశ్చర్యమును ప్రకటించుచూ వుండిరి.

అంత ప్రయాగస్నానమునాచరించి, ముని అనుమతిని తీసికొని సీతా రామ లక్ష్మణులు గుహునితోకూడి వనమునకు ప్రయాణమయిరి. అంత భరద్వాజుడు తన ఆశ్రమమువీడి, ప్రయాగవరకూ వచ్చి, రామచంద్రుని కౌగిలించుకొని వీడ్కోలు చెప్పెను. అపుడు రాముడు ముని ఆనతిని కోరి, స్వామీ! మేము యేమార్గమున పోయిన మంచిదో చెప్పుడనెను.

ముని అందులకు నవ్వి "రామచంద్రా! నీకు తెలియని మార్గములు ఈ లోక మున లేవుకదా? మాయామానుష వేషధారివయి, ఇన్ని నాటకము లాడుచున్నావు! సరి! అడిగితివి కనుక చెప్పుట నాకర్తవ్యము." అని ఋషి, శిష్యులను పిలిచి, పలువురిని రామునికి దారి చూపుటకై పంపెను.

ఆ పలువురూ ఈ రూపేణ రామచంద్రునితో ప్రయాణము చేయుట ప్రాప్తిం చినదని, లోలోన ఆనందించిరి. ఇది మా పూర్వజన్మపుణ్యమని తలంచిరి. వారు

దారిని ముందుచూపుతూ, నడచుచూ వెళ్ళుచుండ, సీతా రామ లక్ష్మణులు గుహునితో వెనుక నడవదొడగిరి ఈరీతిగా ఋషి శిష్యులు నలువురూ, యమునాతీరమువరకు వచ్చి రామచంద్రుని ఆజ్ఞ తీసుకొని వెనుకకు వెళ్లలేక వెళ్లవచ్చెనుకదా అని విచార ముతో వెనుకకు తిరిగిరి.

సీతా రామ లక్ష్మణులు ఆ ఋషి శిష్యుల సహాయమునకు ఆనందించి వారిని మనసార దీవించి పంపిరి.

యమునలో స్నానముచేయుటకు సంసిద్ధమయిరి. ఇంతలో యమునాతీరమున నివసించు గ్రామప్రజలు ఈ సుందరవిగ్రహములను చూచి వీరెవరా అని ఆశ్చర్య పడుచూ వీరు యెక్కడనుండి వచ్చిరో, వీరి నామధేయములేమో, అని అడుగుటకు సంకోచించుచూ, వారిలో వారు గుసగుసలాడుచూ వుండిరి. సీతా రామ లక్ష్మణులు యెవ్వరినీ చూడక, వారి కార్యములు వారుముగించుకొని, గట్టునకు వచ్చి, గుహుని పిలిచి, "నాయనా ! నీవు వచ్చి చాలా సమయమైనది. ఇంకా అధిక కాలము మాతో గడుపుట మంచిదికాదు. నీకర్తవ్యములను నీవు నిర్వర్తించుకొనుట మంచిది. నీ నిక గృహమునకు వెళ్ళుమని రాముడు సెలవిచ్చెను.

ఆ మాటలకు గుహుడు మారుమాటాడలేకపోయినాడు. చిక్కిన చింతామణిని దారవిడుచుకొనువా రుందురా ! నేనెంత దురదృష్టవంతుడనో? అని, చింతించి రామా జ్ఞను కాదనలేక సీతా రామ లక్ష్మణులకు నమస్కరించి వారి పాద ధూళిని శిరస్సుపై చల్లుకొని, వీడలేక వీడెను.

గుహుడు వెళ్లిన కొంతసేపటికి సీతా రామ లక్ష్మణులు ప్రయాణమును ప్రారంభించిరి. ఇంతలో నాగలోకమును దేవలోకమును మించినట్లుగా ఒక పెద్ద పట్ట ణము వారి కంటికి కనుపించెను. అది యేమని చింతించుచూ పట్టణమును సమీపిం చిరి. సమీపించు కొలదీ ఆ పట్టణము యొక్క అందమూ, దాని చుట్టూవున్న అతి సౌందర్యమైన వనములూ వారినెంతో ఆనందమున ముంచెను. దగ్గరకు వెళ్లగనే, అది అమరావతీ పట్టణమని తెలిసి మరింత ఆనందించిరి ! నిజముగా ఇందులో నివ సించువారు సురులేకానీ, మానవులు కాదని అనిపించెను.

పట్టణమును కన్నుల విందువుగా చూచుచూ ఒక వృక్షఛాయలో కూర్చొన్న సీతా రామ లక్ష్మణులను ఆ పట్టణవాసులు, అతి విచిత్రముగా చూచుచూ, వీరెవరో? దేవలోకమునుండి దిగివచ్చిరా ? అన్నట్లు ఆశ్చర్య పడుచూ తక్షణమే పట్టణములో ప్రవేశించి ఇట్టివారి రాక మన గ్రామమునకెంతో శోభఅని తెలిపిరి. విన్నవారం దరూ గుంపులు గుంపులు వచ్చి చూచి, పాలందించువారు, ఫలములందించువారు

రెప్పవాల్చక చూచువారు, అనేక విధముల సీతా రామ లక్ష్మణులను దర్శించుచూ నిలుచొనిరి వచ్చిన వారెవ్వరూ వెనుకకు పోవలేకపోయిరి. పోవుటకే మనసొప్పక నిలిచిరి.

అందులో ఒకరు ధైర్యము చేసి ముందునకు వచ్చి, సీతా రామ లక్ష్మణులను చూచి, అయ్యలారా! మీ చక్కని శరీరములు జూడ రాజపుత్రుల లక్షణములు కనుపించుచున్నవి. అయితే మీరు ఈ సుకుమారితోకూడి పాదచారులై ఈ దుర్గమమైన మార్గమున వచ్చుచున్నారు. పర్వతములూ నదులూ దాటి కఠిన ప్రయాణము సలుపుచుండుటలో మీరు సామాన్య మానవులవలే అనుమాన పడవలసి వచ్చుచున్నది. సింహములు, పులులూ, మదగజములూ సంచరించు ఈ కారడవులలో ఈ సుందర సుకుమారితో ప్రయాణము యెట్లు చేయుచున్నారో అర్థమగుటలేదు. మీకు బంధుమిత్రులెవరూ లేరా? లేక, కన్నవారూ, పెంచిన వారైననూ లేకపోయిరా? నిజముగా వారే యుండియుండిన మిమ్ములను వీడియుందురా, మిమ్ముల నిట్లు పంపియుందురా. అని అనేక విధముల రామచంద్రుని ప్రశ్నించిరి.

ఇంతలో ఒక వనిత ముందునకు వచ్చి, ఓ రాజకుమారా! నేనొక విన్నపము చేయుచున్నాను. స్త్రీస్వభావము కనుక అడుగుటకు భయపడుచున్నాను. నా అవినయమును మన్నింపుము. మేము గ్రామస్థులము. మాకు మీ మాటల నేర్పు తెలియదు. మీ దేహములు చూడ కాంతులలో నుండి మరకతమును బంగారమును తమ తమ కాంతుల నెరవు తెచ్చుకొన్నట్లు కనబడుచున్నది. ఒకరి శరీరము శ్యామలము, మరొకరి శరీరము గౌరవర్ణము, మీ చక్కదనము కోటి మన్మధులు సహితము సిగ్గు పడగలరు ఇక ఈ సుముఖి మీకేమి కావలెనో తెలియదు. ఆమె సౌందర్యము సాక్షాత్ రతీదేవి పుట్టి పడినటుల కనుపించుచున్నది. ఆమె గుణగణములు వినయ విధేయతలు పట్టిచూడ మాకెంతయో సిగ్గుగా వున్నది కాన మీరు యెవరో, యెందు నిమిత్తమై ఇటు వచ్చితిరో, తెలిపి మా అనుమానమును తీర్చుడు," అని ప్రార్థించెను. ఈ విధముగా స్త్రీ,పురుషులు అతి విచిత్రముగా వారలను చూచుచూ వారలను వేయు ప్రశ్నలను వింటూ రామలక్ష్మణులు తమలో తాము నవ్వుకుంటూ వుండిరి.

ఇంతలో స్త్రీల వైపు తిరిగి జానకీదేవి, "ఓ చెలియలారా! సహజ స్వభావుడును పచ్చని శరీరము గలవాడే లక్ష్మణుడు. అతడు నా మరది, చిన్నవాడు. ఇక నీలమేఘచ్ఛాయతో లోకమునే మోహింపజేయుచున్న కమలలోచనుడు, నిడుద భుజములు గలవాడు," అని రామునివైపున తిరిగి "అతను నా ప్రాణనాథుడు" అనితెలిపి తల క్రిందికి వంచుకొనెను.

అంత, మరొక యువతి అమ్మా మీ పేరు చెప్పరై తిరికదా అని ప్రశ్నించ, తన పేరు జానకి అని చెప్పగనే, అక్కడచేరిన వారందరూ ఒకరి మొఖమును ఒకరు చూచుకొని, లమ్మా! పార్వతీ పరమేశ్వరులవలే మీ దాంపత్యము అనుకూల ముగా ఆచంద్రార్కము భూమిని శేషుడు ధరించుచున్నంతవరకూ సౌభాగ్యవతిగ నుండుదువుగాక అని యేక కంఠముతో ఆశీర్వదించిరి.

అంత రాముడు చేరిన మగవారితో కుశల ప్రశ్నలు సలిపి తమరాక వనవిహార మనియూ ఈ ప్రయాణము మా కత్యంత ఆనందముగనూ, సుఖముగనూ వున్న దనియూ మాకెట్టి శ్రమలు కూడనూ లేవనియూ తెలిపి వారలతో సెలవు తీసుకొని తిరిగి వనమునకు ప్రయాణము ప్రారంభించెను. ఇక చేయునది లేక, చేరిన స్త్రీ పురుషులు గృహాభిముఖులయిరి.

సీతా రామ లక్ష్మణులు ఆ గ్రామస్థులగు స్త్రీ పురుషులు వేసిన ప్రశ్నలను గురించి మాట్లాడుతూ వారిలో వారు ఆ ప్రియుల యొక్క ప్రేమానురాగములను వర్ణించుచూ దారి నడచుచుండిరి. ఇంతలో సీత మార్గాయాసముచే, బడలికయుండు నటుల రాముడు చూచి, ఒక చల్లని వటవృక్షము క్రింద విశ్రమించెను. ఆ వృక్షము నకు సమీపమున చల్లని ప్రవాహము కలదు. తదుపరి లక్ష్మణుడు వెళ్ళి కొన్ని ఫల ములను యేరుకొనిరాగా వాటిని ముప్వురు భుజించి క్రిందనే విశ్రమించిరి.

ప్రాతఃకాలమున లేచి స్నానసంధ్యాదులు పూర్తిగావించి ప్రయాణమును సాగించిరి. దట్టమైన అరణ్యము భయంకర పర్వతములు వెలయేళ్ళ భయంకర శబ్దముతోవున్న ఆ అరణ్యగర్భమును చేరిరి. అక్కడ కొంతదూరములో యేదో యొక సుందరమైన, పూలమొక్కలతో ఒక ఆశ్రమము కనుపించెను. దాని దగ్గరకు అతివేగముగా నడిచిరి. అది వాల్మీకాశ్రమము ఒక వైపున యెత్తైన పర్వతము; మరొక వైపున లోతైన ప్రవాహము. ఈ రెండింటికీ మధ్య సుందరమైన ఆశ్ర మము. అతి శోభాయమానముగా నుండెను. ఆ మనోహరమగు ఆ ఆశ్రమమును చూచి సీత యెంతయో ప్రశాంతముగా తన హృదయము చల్లబడినటుల భావించెను. వారు ఆశ్రమతోటలో చేరిరన్న వార్త ఋషి శిష్యులద్వారా విని వాల్మీకి లోనుండి బైటకు వచ్చెను.

వచ్చిన ఋషిని సీతా రామ లక్ష్మణులు చూచి నమస్కరించిరి. ఋషికూడా పాతపరిచయము కలవారివలె, చెంతకు వెళ్ళి రాముని కౌగిలించుకొని, లోనికి ముప్వు రినీ ఆహ్వానించెను.

ప్రాణ ప్రియుడగు రాముని, లక్ష్మణుని, సీతను సుఖాసనములపై కూర్చుండ

బెట్టి కందమూలఫలములను దెప్పించి వారి మువ్వుర యెదుట బెట్టించెను. సీతారామ లక్ష్మణులు వాల్మీకి ముని కోరిక ననుసరించి వాటిని భుజించి సంతోషించిరి. వారు యెదుట కూర్చొని భుజించుచుండ, వాల్మీకిమహర్షి కన్నులకరువుతీరా, రామచంద్రుని చూచుచూ తనలోతాను అంతులేని ఆనందమును పొందెను. చిరకాలపు వాంఛ నెర వేరెనని లోలోన ముని పరమానందభరితు డయ్యెను. అంత రామచంద్రుడు, అతి వినయమున మునీశ్వరునితో యిట్లు విన్నవించెను.

"మునీంద్రా! మీరు త్రికాలజ్ఞానులు. నేను యేకారణముచే ఈ అరణ్యమును ప్రవేశించితినో మీకు కరతలామలకమే. అయిననూ నా కర్తవ్యమును నేను నెర వేర్చుకొనుట నా ధర్మము. రాణి కైకేయి తనను వనమునకు పంపిన విషయమును, తండ్రియొక్క వాగ్దానమును, భరతుని రాజ్యాభిషేకమును మొదలయిన విషయము లను వరుసగా విన్నవించెను. అంత, ముని చిరునవ్వులతో తన ఆనందమును వెలి బుచ్చి, "రామా! వారి కోరికలు యే రీతిగా నెరవేరెనో, అటులనే నేడు నా కోరిక కూడా ఫలించెను. మా తపస్సు నేటికి పండెను. కైకకు మా కృతజ్ఞతా పూర్వకమైన ఆనందమును అందింతుము," అని వాల్మీకి, మాటలను ముగించి, కన్నులు మూసు కొని తనలోతాను పొంగిపొరలు ఆనందమును అణగద్రొక్కుకొని, ఆనందబాష్పము లను నేత్రముల నుండి రాల్చెను.

అంత శ్రీరాముడు, "స్వామీ, ఏ స్థలమున మమ్ము నివసింపుమని తాము ఆజ్ఞచేసిన ఆ స్థలమున మేము నివసించెదము. యెవ్వరికి బాధకలుగక, ఋషులకు యెట్టి ఇబ్బందినీ చేకూర్చక, నష్టకష్టములు వాటిల్లక, ఈ సంగతులను తాము విచా రించి మాకు యోగ్యమైన స్థానమును తెలుపుడు. అక్కడ ఒక పర్ణశాలను యేర్ప రచుకొని కొంతకాలము గడుపుదుము. అని నిర్మలాంతఃకరణముతో శ్రీరాముడు పలి కిన ప్రియవచనములను ముని విని, రామునితో నిట్లు చెప్పెను. "ఓ రామా! నేను ధన్యుడను. నీవు రఘుకులమునకు హేతువువంటివాడవు. నీవుయెందులకిట్లు పలుకు చున్నావు. నీవు వేదమార్గములను పాలించువాడవు. రక్షించువాడవు.

జానకి నీ మాయ. నీ యిచ్ఛానుసారము ఆమె జగత్తుల సృష్టి స్థితి సంహార ముల జేయుచుండును. చరాచరముల కాధారభూతుడు, సహస్ర శిరస్సులుగల ఆది శేషుడే లక్ష్మణుడు. ధర్మసంస్థాపనకై దేవతల మనోభీష్టమును సాధించుటకు మీరు నరరూపమును ధరించితిరి. రాక్షస హృదయాలను త్వరలో హతమార్చుదురు, సాధు త్వమును పోషింతురు. ఓ రామా! ఈ లోక వ్యాపారములకు నీవు సాక్షిభూతుడవు. జగత్తు దృశ్యము, నీవు సాక్షివి; దేవతలు సహితము నీతత్త్వమును గుర్తించలేరు.

ఇక సామాన్యులు నిన్ను తెలిసికొన గలరా? యెవరికి నీ వరప్రసాదమైన జ్ఞానము లభించునో, వారే నిన్ను తెలిసికొనగలరు. నిన్ను తెలిసి కొనినవారే నీ సామీప్య మును బొందుదురు.

నీకు వికారములు లేవు. దేవసజ్జన హితార్థము నీవు మనుజరూపమును ధరించి సాధారణ రాజువలే మాటలుజెప్పి, చర్యలజేయుచున్నావు. నీ చర్యలు చూచి మూర్ఖులు మోసపోవుచున్నారు. నీవు చెప్పిన ప్రకారము సంచరించెదవు, నీ మాట లకును క్రియలకును భేదములేదు. నీ వాడించు ప్రకారము మేము ఆడువారమే కాని నిన్ను ఈ రీతిగా చేయమని, ఈ స్థానమందుండుడని శాసించువా రెవ్వరు? రామా! మాటలతో మునులను సహితము మాయలో త్రోయచూచుచున్నావా? ఏమి నీలీల, యేమి నీ నటన? నీవు కపటనాటక సూత్రధారివి. నివాస యోగ్యమగు స్థలమును చూపమని, తెలుపమని నన్ను నీవు కోరుటలోవున్న అర్థమేమో బోధపడుట లేదు.

నేను యే స్థలమును చూపించగలను; నీవులేని స్థలము ఒక్కటి కలదా? దీనికి జవాబు తెలుపుము. అట్టి స్థలముండిన, తప్పక నే చూపుదును," అని రాముని చూచుచూ, ఆనందముతో స్తంభించి పోయెను. ఇట్లు పలికిన మునీశ్వరుని ప్రియవచ నములను రాముడు విని లోలోన నవ్వుకొనెను. పునః మహాముని మందహాసముతో మృదు మధుర వాక్యముల జెప్పనారంభించెను.

ఓ రామా ! నీ నిజ నివాసస్థానము, భక్తుల హృదయము. ఇక నరాకారము నకు ఉత్తమ స్థానము జెప్పెదను వినుము. అచ్చట నీవు సీతా లక్ష్మణులతో కూడి నివసింపవచ్చును. నీ దివ్య చరిత్రములనునట్టి మహానదులు ప్రవేశించుటకు యెవని చెవులు సముద్రమువంటివో, ఎవని చెవులు నిరంతరము నీ కథలతో నిండి యుం డునో, యెవని జిహ్వ నీ నామముతో కదులుచూ కంఠమునుండి నీ మృదు మధుర శబ్దమును చవిచూచుచుండునో, యెవని నేత్రములు చాతకములవలే నీలమేఘము వంటి నీ స్వరూపమును చూచుట కభిలషించి అట్టి రూపమును చూడ నలుదిక్కులా వెతకుచుండునో అన్వేషణ జరుపుచుండునో, అట్టివానిలో మీరు ముగ్గురూ సహా నివ సించవచ్చును.

రామా! ఇంకనూ వివరించి చెప్పగోరుచువేని, ఎవరు అవగుణములను విడచి, సుగుణములను గ్రహించునో, ఎవడు నీతి నిజాయితీల మార్గమున సంచరిం చునో, ఎవడు లోక మర్యాద నొందునో, ఎవడు త్రికరణ శుద్ధిగా సర్వం నీ సృష్టిగా భావించి, లోకమే నీ ఆకారముగా విశ్వసించి ఆచరించునో, అట్టివాని హృదయము నీనివాసము.

అయితే సమయానుసారము నేడు నీవు మానవాకారమున, మాతా పితల ఆజ్ఞను నెరవేర్ప సంకల్పించితివి. కనుక, నీవు ఆ దృష్టితోనే నన్ను అడిగితివి కనుక, నేననూ సామాన్యస్థితిలో తెలుపుచున్నాను. చిత్రకూటపర్వతము మీద నివసించవచ్చును. అన్ని విధములా అచ్చట అనుకూలము. అంతియేకాదు, ఆ పుణ్యస్థలము మనోహరము. అచ్చట సింగములు, గజములు సహితము నిర్వైరముగ విహరించును. వేదములలో చెప్పిన మందాకినీనది అచ్చట ప్రవహించుచున్నది. అత్రి మొదలగు మహామునులు అచ్చట నివసించుచుందురు. నీవు వెళ్లి వారి ఆశ్రమములను కూడనూ పావన మొనర్చుము. ఆ పవిత్ర పర్వతమునకు, పుణ్యపావన నదీమతల్లికి, సార్థకనామమును అందించుము.

అని తెలుపగనే, వాల్మీకిమహాముని ప్రియవచనములను స్వీకరించి, ముని అనుమతిని బడసి సీతా లక్ష్మణులతో కలిసి ప్రయాణమైపోయెను.

అతి శీఘ్రకాలములోనే మందాకిని నదిని దర్శించి, అందులో ముప్వురూ స్నానాదులాచరించి వృక్షఛాయల విశ్రమించి, తదుపరిఫలములను భుజించి, ఆ మనోహరమైన వనమును నలుమూలలో సంచరించి, ఒక స్థానమున, ఓ లక్ష్మణా ఈ మనోహరమైన వనమున, యేదిమంచిది, యేది చెడ్డది అని నిర్ణయించలేక పోవుచున్నాను. ఈ వనమున మనము కొంతకాలము నివసించవచ్చును కనుక, నీవే ఆస్థలమును నిర్ణయించి ఒక పర్ణశాలను నిర్మింపుమని రాముడు లక్ష్మణునకు ఆజ్ఞ ఇచ్చిన తక్షణమే లక్ష్మణుడు భరించలేని బాధతో రాముల పాదములపై వ్రాలి అన్నా ! నేనేమి అపరాధము చేసితిని? ఇది నాపాపఫలమా! లేక పరీక్షించ జూచుచున్నావా? లేక పరిహాసము లాడుచున్నావా? అని చాలా విచారముతో తలక్రిందికి వంచుకొని బాధ పడుచుండెను.

అంత రాముడు ఆశ్చర్యమున, లక్ష్మణుని దగ్గరకు తీసుకొని, "తమ్ముడా ! యేమి జరిగినది? యెందులకంత విచారించుచున్నావు? నాకేమీ అర్థమగుటలేదు, కారణము తెలిపి నన్నానందపరచుము" అని అడిగిన తక్షణమే, "అన్నా ! నేను సర్వవిధములా తమకు అర్పితమైన వాడను. నాకు యిష్టాయిష్టము లన్నవి వేరుగాలేవు. నీ యిష్టమే నా యిష్టము కదా ! అట్టి నా హృదయమును తెలిసికూడను నన్ను నాయిష్ట మెచ్చిన స్థలములో పర్ణశాలను నిర్మించమని కోరుటలో నా హృదయము బ్రద్ధలయినది. తాము యెక్కడ ఆజ్ఞ యిచ్చిన అక్కడ వేయుదును. దయచేసి మరొకతూరి అట్టి పదములను ప్రవేశపరచక, నన్ను అనుగ్రహింపుము. నేను తమ సేవకుడను. సేవ నిమిత్తమే నేను తమను అనుసరించుచున్నాను. తమ యిష్టాను

సారము వన్ను వినియోగించుకొనుము, ఆజ్ఞాపించి కార్యముల జరిపించుకొమ్ము"
అని లక్ష్మణుడు దీనుడై ప్రార్థించెను.

అంత రాముడు లక్ష్మణుని అనేక విధముల సమాధాన పరచి, లక్ష్మణా! ఇంత చిన్న విషయమునకే నీవింత విచారించనక్కరలేదు. నేను సామాన్య స్థితిలో అట్లు నిన్నాజ్ఞాపించితిని. నీ హృదయము నేనెరుగనిది కాదు. రమ్ము నావెంట. నేనే నిర్ణయింతును, అని లక్ష్మణుని వెంటపెట్టుకొని, సీతాసమేతుడై దారినడచెను. అట్లు నడచుచు నడచుచుండ ఒక ప్రదేశమున మందాకినినది ఉత్తర తీరమును జూచెను.

అది ధనురాకారముగా నలువైపుల తిరిగియుండెను. ఆ నదియే ధనువుయొక్క నారి; శమము, దమము, దానము మొదలగునవియే బాణములు; పాపములే వానికి లక్ష్యము; చిత్రకూట పర్వతమే నిశ్చలముగా నిలచియున్న మహావీరుడు, అతడు వెనుదీయడు. అని యిట్లుచెప్పి లక్ష్మణుని ఆ స్థానమున పర్ణశాలను వేయమని ఆజ్ఞాపించెను.

అంత లక్ష్మణుడు రాముని సీతను ఒక వృక్షచ్ఛాయన విశ్రమించమని ప్రార్థించి క్షణములో పర్ణశాలకు తగిన కఱ్ఱలు, ఆకులు, తీగెలు, చెట్టునార పోగుచేసెను. అంత ముప్వురికి తగినట్లు, ఒక చిన్నపర్ణశాలను నిర్మింప గుంతలు తవ్వెను, గుంజలు పాతెను. సీతారాములు చక్కగా విశ్రమించి లేచి చూచిన తక్షణమే సుందరమైన ఒక పర్ణశాల సర్వాంగ సుందరముగా కనుపించెను. లక్ష్మణుడు ఇంత శీఘ్రకాలములో సుందరమైన నివాసము నిర్మించుటచూచి, ఆశ్చర్యపడి తాను కూడా కొంతసహాయము చేయకపోతినికదా అనిలేచి, పర్ణశాల పైభాగములో ఆకులు పేర్చుచున్న లక్ష్మణునికి త్రాళ్లు అందించుట ఇత్యాది సహాయకార్యములో పాల్గొనెను.

ఇదిచూచి సీతమ్మతల్లికూడా ఆకులు, ఇత్యాది చిన్నచిన్న కొమ్మలు వేరుచేసి, రామునిచేతికి అందించెను. సూర్యాస్తమయముకాకమునుపే పర్ణశాల పూర్తి ఆయెను. రాముడు సారెసారెకూ ఆ పర్ణశాలను చూచుచూ లక్ష్మణుని అనేక విధములా మెచ్చుకొనుచూ సీతతో తనతమ్ముని భక్తి శ్రద్ధలను నానావిధముల వర్ణించెను. సీతాదేవికూడా, తాను యెన్నడుకూడనూ ఇంతటి సుందరమైన నివాసమును చూడలేదనియూ, ఇట్టి భవనములో వానముచేయవలెనని యెన్నియో దినములనుండి కోరుచుంటిననియూ ఈనాటికి తన మనోవాంఛ తీరినదని రామునితో తెలుపుతూ, మరదియొక్క శ్రద్ధాభక్తులను తానుకూడా అనేక విధముల పొగడెను.

అంతలో లక్ష్మణుడు క్రిందికి దిగి, నాలుగు వైపులా చక్కగా పరిశీలించి

అన్నతో కలవుతీసుకొని మందాకినీనదికి స్నానమాచరింప వెళ్లెను. కొంతసేపటికి సీతారాములుకూడా మందాకినికివెళ్లి స్నానాదులు ఆచరించి పర్ణశాలచేరుకొని తెల్ల వారి లక్ష్మణుడు తెచ్చిన ఫలముల నారగించి ఆపర్ణశాలలో సుఖముగా నిదురించిరి. రెండవ దినము నుండి, శ్రీరాముడు సీతా లక్ష్మణసమేతుడై వచ్చి చిత్రకూటముపై నివసించుచున్నాడన్న విషయము మునీశ్వరులకు తెలిసెను. అప్పటినుండి గుంపులు గుంపులుగా ఋషులూ, మునులూ, వారి శిష్యులూ, వచ్చి వెళ్ళుచుండిరి; వారంద రితో రాముడు, క్షేమసమాచారములతోపాటు వారి అనానుకూలములను కూడను వినుచూ, తన సేవ అవసరమైన యెట్టి సమయమందైనా, తమ్మునితోపాటు తాను సిద్ధముగా నుందునని ఋషులకు హామీ యిచ్చెను.

వచ్చినవారు యెట్టి సహాయమునూకోరక "రామా, తమ దర్శనమే మా సర్వ ఇబ్బందులనూ దూరము గావించును. మాకెట్టి యిబ్బందియూ లేదు. తమ అనుగ్రహ మొక్కటుండిన చాలు"నని ఆ సుందర మంగళ విగ్రహములను చూచుచూ స్తంభించి పోవుచుండిరి. వచ్చిన ఋషులను యథావిధిగ ఆదరించి సత్కరించెను. రామదర్శ నము, మునులకు చల్లటి పానీయమును గ్రోలినటులై, వారి హృదయములలోని తాపమును శాంతపరచుకొనుచుండిరి.

శ్రీరామునకు ప్రేమయే ప్రధానము. రాముడు వనవాసులందరినీ సంతోష పెట్టెను. మృదుమధురముగా వారలతో ప్రసంగించి వారి మనస్సులకు ఆప్యాయ మును గలుగజేసెను. వచ్చిన మునులకు, కిరాతకులకు తగినరీతుల నీతుల బోధించి పంపుచుండెను. వచ్చి వెళ్ళుచున్న వారందరూ రాముని గుణగణములను చెప్పు కొంటూ, వర్ణించుకొంటూ తమ తమ నివాస స్థానములు చేరుచుండిరి. సీతారామ లక్ష్మణులు వచ్చి వనములో నివసించినది మొదలు వనము సకల మంగళదాయక మయ్యెను. కన్నుల కింపుగను మనసుకు సొంపుగనూ భయాందోళనలు దూరమై ఆనంద భావములు మునుల హృదయముల అంకురించెను. కిరాతకులు సయితము నీతిమంతులై మానవజాతికి వన్నె దెచ్చిరి. చిత్రకూట పర్వతమునకు యింతటి అదృష్టము పట్టినందుకు వింధ్యపర్వతము విచారించెను. ఒక వింధ్యపర్వతమేమి, మిగిలిన పర్వతములు, అందుగల వృక్షములు, లతలు సెలయేరులు సహితము తమ కంతటి ప్రాప్తిలేదని విచారించియే యుండును.

క్షణక్షణము సీతారామ చరణార విందములను చూచుచూ వారికి తనమీద కల వాత్సల్యముచేత లక్ష్మణుడు సర్వమునూ మరచి సచ్చిదానందములో మునిగి తేలు చుండెను. స్వప్నమందైననూ తన తల్లియైన సుమిత్రాదేవియు, భార్యయైన వూర్మి

కయు, మిగిలిన బంధుమిత్రాదులను యెవ్వరనూ కనుపించలేదు. వారలను లక్ష్మ ణుడు స్మరించలేదు.

అటులనే, సీతాదేవియూ తనవారలను కానీ, తల్లిదండ్రులనుకానీ, మిథిలా పురమునుకానీ అయోధ్యానగరమునుకానీ యే క్షణమునందునూ స్మరించలేదు. నిరం తరము రామచంద్రుని ముఖారవిందమును, కన్నులపండువుగా గాంచుచూవచ్చి పోవు చుండు మునులను ముని పత్నులనూ చూచుచూ కాలము గడచిపోవునది కూడా గమ నింపక, రాత్రి పగలను తారతమ్యమును గుర్తించక చంద్రుని చూచిన చకోరముల వలే, రామచంద్రుని చూచుచూ సీతాచకోరము అంతులేని ఆనందమున నుండెను.

తన మరదియైన లక్ష్మణుడు నిర్మించిన ఆ పర్ణశాల అయోధ్యలోని అంతః పురమునూ, మిథిలాపురములోని రాణివాస భవనమునూ మరిపించెను. అదే ఆమెకు దివ్యభవనమువలే తలంచి ఆనందించుచుండెను. మధ్య మధ్య, రాముడు చెప్పు చుండిన పురాణ కథలను తపస్సిద్ధుల మహత్తర, చిత్రమైన విషయములను సీతా లక్ష్మణులు అత్యంత ఉత్సాహముతో వినుచుండెడివారు. మధ్య మధ్య తన తలి దండ్రులను జ్ఞాపకము చేయుచూ వారు తనను గురించి యెంత విచారించుచున్నారో అని పలుకునపుడు మాత్రము సీతకు అత్తమామలు జ్ఞాపకమువచ్చి, కౌసల్యను స్మరించి కంటినీరు కార్చెడిది.

అంతలో రామప్రభువును స్మరించి ధైర్యము నవలంబించి పురుష సింహ ముతోవున్న నేను ఈ వనమున దుఃఖించుటకానీ, విచారించుటకానీ న్యాయము కాద నియూ ఇదంత రామలీలయనియూ తలంచి సర్వమునూ మరచుటకు ప్రయత్నించె డిది సీత. ఈ విధముగా రామలక్ష్మణులతోకూడి పర్ణశాలలో దేదీప్యమానంగా కాల మును గడుపుచుండెను వైదేహి.

కంటికి రెప్పలవలే రామలక్ష్మణులు సీతను కాపాడుచూ యెట్టి భయంకర శబ్దములు ఆమెను చలింపచేయనీయక కాచుచుండిరి. వీరిట్లు చిత్రకూట పర్వత మున చింతలువీడి సంతసముగ కాలము గడుపుచుండిరి.

# రాముడులేని అయోధ్య

రాముని సాగనంపి వచ్చిన నిషాదపతి గంగాతీరమున వృక్షచ్ఛాయలో రథ మును ఆపి, గుఱ్ఱములను చెట్టునకుకట్టి, రథములో వెక్కి వెక్కి యేడ్చుచున్న సుమంతుని చూచెను. తనలో కుములుచున్న దుఃఖము సుమంతుని చూచిన తక్షణమే నిషాదపతికూడనూ ఆపుకొనలేక రామా అని గట్టిగ కేకవేసి పరుగిడి వచ్చి సుమం తుని కౌగిలించుకొని నోటిమాటలు స్తంభించి యిరువురూ రోదనలు గావించిరి. మొదలు నరికిన చెట్టువలే యిరువురూ ఆ వృక్షచ్ఛాయలో నిలువునాపడి, సీతారామ లక్ష్మణులను తలంచుచూ కైకను దూషించుచూ వుండిరి. గుఱ్ఱములు సయితము గడ్డిని తినుటమాని, జలమును గ్రోలుటమాని కంటిధారలు కార్చుచూ సుమంతుడూ, నిషాదపతీ, రామా అన్నపుడంతయూ ఆ గుఱ్ఱములు తలలెత్తి నలువైపులా చూచి, రామ రాకకై యెంతయో చింతపడుచుండెను. ఆ గుఱ్ఱముల దురవస్థలను చూచి, సుమంతుడు మరింత కృంగిపోవుచుండెను. ఈ విధముగా కొన్ని గంటలు జరిగెను.

ఇక విధిలేక నిషాదపతి ధైర్యమును అవలంబించి, "ఓ మంత్రీ! నీవు మహా మేధావివి. గుణవంతుడవు, పరమార్థమును గుర్తెరింగినవాడవు. విధికృతములు విప రీతములైనపుడు వానిని సహింపవలెను కదా. లెమ్ము, అయోధ్యకు వెళ్ళి రామ వార్తకై కన్నులు కాయుచున్న కౌసల్యా సుమిత్రలకు వార్త నందించు," అని బల వంతముగా సుమంతుని లేపి, రథముపై కూర్చొనబెట్టెను.

గుఱ్ఱములను రథమునకు కట్టించెను. నిషాధపతి వాక్యములు పరమ సత్య మని తలంచి, సుమంతుడు మొండి ధైర్యముతో రథమును కదిలించెను. వియోగ దుఃఖముచే అతని శరీరమునకు పటుత్వము తప్పెను. యెంత ప్రయత్నించిననూ రథమును నడుపలేకపోయెను. తూలిపడుచూ లేచుచూ వచ్చెను. యెంతఅదిలించిననూ అశ్వములు సకిలించి వెనుకకు తిరిగి చూచునే కానీ ముందుకు అడుగైననూ వేయ లేకపోయెను,

ఈ విధముగా పరితపించుచూ, ఛీ, ఛీ, రాముడులేని ఈ బ్రతుకు కాల్చనా? యెప్పటికైననూ ఈ శరీరము నశించునదే, యేదో రోగములతో లోకసంబంధమైన విషయములతో నశించుటకంటే, రామవియోగముతో ఈ ప్రాణమును వీడుట యెంత సార్థకము. అంతకంటే వేరుకీర్తి ఈసుమంతున కెందుకు? ఆఒక్కకీర్తిని దక్కించు కొన్న చాలదా? సుమంతా! నీవంతటి అదృష్టవంతుడవై యుండిన రామునితోనే వుండెడివాడవు. అదృష్టము లేనపుడు యేమీ చేసియూ యేమి ఫలము అని తనను తాను నిందించుకొనుచూ, నేను అయోధ్యకు యే ముఖము పెట్టుకొని పోదును. అయోధ్యాపురవాసులు రాముడెక్కడ అని అడిగిన యేమని చెప్పుదును. రాముని విడిచి యెట్లు వస్తివని అడిగిన అంతకంటే అవమానము మరొకటుండునా? ఈ నిమిషమున గుండె యెంత బండ అయినది. ఇంకనూ పగలకున్న దెందులకు అని తనను తాను అసహ్యించుకొంటూ చేతులు నులుపుకొంటూ ఇప్పుడే అయోధ్యలో ప్రవేశించుట మంచిదికాదు. చీకటిపడి అందరూ నిద్రించే సమయమున ప్రవేశించిన కొంత గౌరవముండునేమో అని వూహించుచూ, అయోధ్యప్రజలు నిద్రింతురా? ఇది కల్ల, రామచంద్రుని రాకకై, వార్తకై దారులు చూచుచుందురు. ఎప్పుడు ప్రవేశించిననూ నాకీ అవమానము తప్పదు. రామానుగ్రహమును నోచుకోలేని ఈ దురదృష్టమునకు ఈ విధమైన పరాభవము సరియైనదే. నేను అనుభవించుట కూడనూ మంచిదే. అని తనలో తాను ప్రశ్నా జవాబులు రెండునూ వేసుకొంటూ తీర్చుకొంటూ దారి నడుపుచూ మెల్లమెల్లగా ప్రయాణము జరిపెను.

ఇంతలో తమసానదీ తీరము వచ్చెను. నగరమును సమీపించితిమని తలంచి ప్రొద్దుపోయిన తరువాత అందరూ నిద్రించవచ్చునని అపుడు నగరమున ప్రవేశించ వచ్చునని సుమంతుడు తలంచి ఆ నదీతీరమున గుఱ్ఱములను విప్పి ఒక చెట్టు క్రింద కట్టి కాలము గడిపి, నిదానముగా తిరిగి ప్రయాణము గావించి నగరమున ప్రవేశించెను. రాజవీధులలో ఇతరులకు తెలియక వెళ్ళవలెనని అతి నెమ్మదిగా శబ్దము రానివ్వక యెట్లో గుఱ్ఱములను నడుపుతూ మెల్ల మెల్లగా వచ్చుచుండెను.

నగరమున రాజవీధులలో ప్రవేశించగనే గుఱ్ఱములు పట్టరాని దుఃఖముతో సకిలించుచూ పెద్ద పెద్ద శబ్దములు చేయ ప్రారంభించెను. రామ వార్తకై కన్నులు తెరచుకొని కాచియుండిన ప్రజలు ఈ దృశ్యమును చూచి ఒకరికొకరు చెప్పుకొని లేచి రాజవీధుల ఇరుప్రక్కలా గుంపులు చేరిరి. వారిని చూడగనే సుమంతుడు తల క్రిందవంచుకొనెను. ఈ వికారమును చూచి ప్రజలు శ్రీరాముడు తిరిగి రాలేదని అర్థము చేసుకొని నిలువునా కూలిరి. కొందరు గొల్లున యేడ్చిరి.

దారులు కాచుచున్న రాణివాసపు స్త్రీలు గుఱ్ఱముల సకిలింపులు వినగనే దాసీలను పంపిరి. వారు గుంపులు గుంపులుగా వచ్చి మంత్రిని ప్రశ్నించిరి. మంత్రి మాటలులేని మూగవలే కంటిధారలు కార్చుచు మాటలు తొట్రుపాటుపడెను. చెవులు వినవివానివలే దేనికినీ జవాబుఇవ్వక స్తంభించెను. మహారాజెచ్చట కలడనిమాత్రము వచ్చినవారలనుప్రశ్నించుచుండెను. మంత్రిచేష్టలుగమనించినదాసీలు రాముడురాలేదని గమనించి సీతాదేవిని కారడవులలో దింపివచ్చితిరా మంత్రీ అని గొల్లున యేడ్చిరి.

ఒక దాసీ ధైర్యము చేసుకొని మంత్రిని నేరుగా కౌసల్యామందిరమునకు తీసుకొనిరమ్మనినట్లు కౌసల్య ఆజ్ఞగా తెలిపెను. మరి చేయునది లేక మంత్రి కౌసల్యామందిరమువైపున నడువజొచ్చెను. కళాహీనుడగు చంద్రునివలే ఆ మందిరమున బడియుండిన రాజును చూచెను. నిద్రాహారములులేక, భూషణాది అలంకారములు లేక నేలబడి యుండెను. ఇంతలో మంత్రి పొరలివచ్చు దుఃఖమును ఆపుకొని వణకుచున్న పెదవులతో జయ, జయ అని పలికి నమస్కరించెను.

ఆ మాటలు విని రాజు దిగ్గునలేచి కూర్చొని సుమంతా నా రాముడేడీ? అని అడిగెను. సుమంతుడు రాజునుకౌగిలించుకొనెను. నీటిలో మునుగుచున్నవాడు తృణమును బట్టుకొనినట్లు రాజు మంత్రిని బట్టుకొనెను. ఇరువురూ మహా విషాదముతో యేడ్చుచుండుట చూచి కౌసల్య దుఃఖము చెప్పతరముకాక వూపిరి పీల్చుటకు కూడనూ తగినశక్తి లేనిదై కదలక మెదలక డొక్కలు కొట్టుచుండ కౌసల్యను దాసీలు అనేక రకముల నోదార్చుచూ వారునూ దుఃఖించుచూ సేవలు చేయుచుండిరి.

ఇంతలో దశరథుడు కొంత ధైర్యము నవలంబించి మంత్రిని కూర్చునబెట్టుకొని "సుమంతా; నా సీతారాముల క్షేమములు తెలుపుము. లక్ష్మణు డెట్లున్నాడు. ఆ సుకుమారి నా కోడలు సీత అలసిపోయి వుండును. ఎక్కడున్నారు ఇప్పుడు, వివరములు తెలుపుము" అని అతని భుజములు పట్టి వూపించుచూ ప్రశ్నించుచున్న రాజును చూచుటకు సిగ్గయి తలవంచుకొని సుమంతుడు కన్నీరు కార్చుచూ భూమిని చూచుచుండ, రాజు, ఓ రామా, నీవంటి కొమారుని విడచిపెట్టినమా నా ప్రాణములు శరీరమును విడచి పోలేకున్నవి. లోకమున నావంటి పాపి మరొక్క డుండడు. సుమంతా, ఇప్పుడెక్కడున్నారు నా సీతారామలక్ష్మణులు. తక్షణమే నన్ను వారుండు స్థానమునకు గొనిపొమ్ము. ఈ ఒక్క వుపకారము నాకు చేసి పెట్టుము. సుమంతా: ఈ ఒక్క కోరికను నాకు నెరవేర్చుము. వారిని చూడకున్న నేనిక క్షణమైననూ జీవించజాలను. అని రామా, శ్రీరామా ఒక్కతూరి నిన్ను చూతును, కనుపించవా? అని కేకలు వేయ ప్రారంభించెను.

నిద్రాహారములుమాని మందిరము వెలుపల నిలచియున్న దాసదాసీలు రాజు మాటలను వింటూ వారునూ దుఃఖమున క్రుంగిపోవుచుండిరి. రాజు అవస్థను చూచి సుమంత్రుడు రాజాధిరాజా! మీరు మహాజ్ఞానులు, వీరులు, దురంధరులు. దేవతాంశ సంభూతులు. సాధు సమాజములను సదా సేవించితిరి. కలిమిలేములు, సుఖదుఃఖములు, సంయోగ వియోగములు మొదలగునవి దివారాత్రములవలే నొకదాని తరువాత నొకటి కాలక్రమమున వచ్చుచుండును. సుఖములు వచ్చినపుడు సంతోషించుట దుఃఖములు వచ్చినపుడు విచారించుట మూర్ఖుల పద్ధతి. కానీ పండితులైన మీబోటివారు సమముగా చూచి నిశ్చింతగా నుండవలెనుగదా? మీరు సర్వమును యెరిగినవారు. ధైర్యముగా నుండమని నేను బోధించుటకు అర్హుడనుకాను. హే లోకోపకారీ! నా ప్రార్థనవిని మీరు దుఃఖమును విడిచి పెట్టుడు. మా ప్రయాణవివరములు వివరింతును, ఆలకింపుడు అని సుమంతుడు చెప్పగనే, పడియున్న కౌసల్య కొంత లేచి దాసీల సహాయములతో వారిపై వాలి కూర్చునెను.

రాజా, మొదటి దినము తమసానదీతీరమున నిలిచితిమి. అక్కడ, సీతా రామ లక్ష్మణులు, నదీ స్నానములుగావించి జలమును మాత్రమే తాగి వృక్షచ్ఛాయలో విశ్రమించిరి. రెండవ దినము గంగానదీతీరమును చేరుకొంటిమి. చీకట్లు క్రమ్ముచుండెను. రామాజ్ఞ ప్రకారము రథము నాపితిని. ముగ్గురూ గంగాస్నానము గావించి ఇసుక తిన్నెలపై కొంత విశ్రమించిరి. తెల్లవారగనే, శ్రీరాముడు మఱ్ఱిపాలను తెమ్మని లక్ష్మణునకు ఆజ్ఞచేసెను. క్షణములో లక్ష్మణుడు రామాభీష్టమును నెరవేర్చెను. తెచ్చిన మఱ్ఱి పాలతో స్వయముగా జటామకుటమును బంధించెను.

ఇంతలో రామస్నేహితుడైన నిషాదపతి నావను తీసుకొని వచ్చెను. ఆ పడవలో మొదట సీతాదేవిని కూర్చుండబెట్టి తదుపరి రాముడు కూర్చునెను. తదుపరి రామాజ్ఞనుపొంది ధనుర్బాణధారియై లక్ష్మణుడు పడవలోనికి వెళ్ళెను. లక్ష్మణుడు పడవలోనికి వెళ్ళుటకు పూర్వము నా దగ్గరకు వచ్చి మాతల్లి దండ్రులకు మా నమస్కారముల నందింపుము, మమ్ములను ఆశీర్వదింప మేముకోరినట్లు మనవిచేయుము. తమను ధైర్యముగా నుండుమనుము.

"మామగారికి నా వందనములు అందించి, మా తండ్రిగారు విచారింపకుండునట్లు వారిని వుపదేశింపుదురని మేము కోరినట్లు తెలుపుము," అని సందేశము నంపెను. అని సుమంతుడు తెలిపెను. ఇంతలో రాముడు నన్ను దగ్గరకు పిలిచి మంత్రి పురజనులను రాజబంధువులను పిలిచి నా విన్నపమును జెప్పుడు, నా తండ్రిగారు సుఖముగా జీవించునట్లు ప్రయత్నించువాడే నా హితకారి అని వారికి విన్నవింపుము.

భరతుడు వచ్చిన తరువాత, నా ఆశీర్వాదములు అందించి, రాజ్యాధిపత్యము వహించి నీతిని విజాయితిని విడువక త్రికరణ శుద్ధిగ ప్రజలను పాలింపుమనియు, జననీజనకులను సేవించి నేను లేనికొరతను లేకుండ తండ్రిని సేవింపుమనియు చెప్పుము. వారు మా వియోగ దుఃఖమును మరచునట్లుగా మెలగుమని నేను ఆశించి నట్లు మరీ మరీ తెలుపుము.

ఇంతలో జానకి చిరునవ్వులు చిందులుద్రొక్కుచూ, రామలక్ష్మణులతో ఆనందముగా కాలమును గడుపుచున్నదనియూ, తన హృదయపూర్వక నమస్కారములు అత్తమామలకూ, బంధువులకూ అందించమనియూ, సీతకెట్టి కొరతయూ లేక మహా ఆనందముతో వనవాసము చేయుచున్నదనియూ, అత్తమామలు మా కొరకై వ్యధనొందక ధైర్యముగా వుండి, మమ్ములను ఆశీర్వదించుచుండుమనియూ నేను పదే పదే వారిని కోరినట్లు తెలుపమనెను.

ఇంతలో రాముని మనోభిప్రాయమునుగమనించి నావికుడు మెల్లగా పడవను నడుపుట కారంభించెను. ఈ విధముగ శ్రీరాముడు ప్రయాణమయ్యెను నా గుండెలు రాయి చేసుకొని వారి ప్రయాణమును చూచుచూ నదీ తీరమున నిలిచియుంటిని.

రామాజ్ఞ నెరవేరు నిమిత్తమై నేను వెనుకకు వచ్చితిని కానీ, లేకున్న నేను గంగలో పడి ప్రాణమును కోల్పోయి వుండెడివాడను. రామ సందేశమును మీకందించు నిమిత్తమై నేను బ్రతుకవలసివచ్చెను. రాముడులేని ఈ అయోధ్య మహా అరణ్యముగా కనుపించుచున్నది, అని విచారపడెను. సుమంతుని మాటలు వింటూ రాముడు తెలిపిన మృదుమధుర వాక్యములను స్మరించుచూ రాజు మూర్ఛిల్లెను.

బురదనీటిలోనుండి వూపిరితీయలేక కొట్టుకొను మీనముల వలే రాజు ప్రాణములు కుమారుల వియోగ దుఃఖముచే కొట్టుకొనెను. మహారాణులు గొల్లున యేడ్చిరి. ఆ మహా విపత్తును వర్ణించి చెప్పుటకు శక్యము కాదు. వారి విలాపములు చూచి దుఃఖము సహితము దుఃఖించక మానదు. రాణుల దుఃఖము, రాజు దుఃఖము నగరములోని దాస దాసీల దుఃఖము నగరమంతయూ కోలాహలముగా వ్యాపించెను.

నిశిరాత్రివేళ వనములో పిడుగుపడినపుడు పక్షులువలే నగరవాసులు వ్యాకుల చిత్తులైరి. క్షణక్షణమునకు నీటినుంచి వేరు చేసిన తామరమువలె మహారాజా దేహము వాడిపోవజొచ్చెను. కంఠమునుండి మాట రాక పోయెను. గొంతు యెండి పోయెను. సర్వేంద్రియములు మొద్దుబారెను.

మహారాజుయొక్క అవస్థను కౌసల్యచూచి సూర్యకుల సూర్యుడు అస్థమించు చున్నాడని గమనించెను. కౌసల్య ధైర్యము చేసుకొని దగ్గరకు వచ్చి పతి శిరస్సును

తన తొడపై పెట్టుకొని చల్లని మాటలను మెల్లగా వినుపింప ప్రయత్నించెను. నాథా, త్వరలో సీతారామలక్ష్మణులు వచ్చి మమ్ముల దర్శింతురు. నా మాట విని ధైర్యము నవలంబింపుడు అని తన ప్రార్థనను దీనభావముతో తెలుపజొచ్చెను.

అంత రాజు నేత్రములు విప్పి కౌసల్యనుచూచి, కౌసల్యా! నా రాముడేడీ? నాకు చూపుము. లేక నన్ను రాముని దగ్గరకు గొనిపొమ్ము. నా ముద్దు కోడలు ఈ సమయమున నాచెంత లేకపోయెను. లక్ష్మణుడు కనుపించడయ్యె, అని తిరిగి తల క్రిందికి వాల్చెను.

కొంతసేపటికి జాత్యంధుడు తపశ్శాలియగు శరవణుని తండ్రి పెట్టినశాపము రాజునకుజ్ఞప్తికివచ్చెను.తిరిగిలేచి ఆవృత్తాంతమంతయూకౌసల్యకుచెప్పనారంభించెను.

కౌసల్యా! ఒకసమయమున వేటనిమిత్తము నేను వనమునకు వెళ్ళియుంటిని. నావెంట అనేకమంది సేనలుకూడ వచ్చియుండిరి. మృగములు చిక్కనందున తిరిగి నగరమును ప్రవేశించుట మంచిది కాదని ప్రతిజ్ఞ పట్టి ఆ రాత్రి వేత్రవనమునకు బయలుదేరితిమి. ఒక సరోవరము చెంత తెలతెలవారుచుండగా మేము పొంచియుంటిమి. ఇంతలో సరోవరములో పొదలమధ్య కదలిక కనుపించెను. శబ్దము వినుపించెను. దానిని గాంచి ఒక పెద్ద జంతువని తలంచి శబ్దవేధిని యెరింగినవాడను కనుక నేను బాణమును సంధించి ప్రయోగించితిని

నా బాణము రివ్వునవెళ్ళి ఆ కదలుచున్న ప్రాణికి తగిలెను. అంతలో హా అని కూలిన శబ్దము వినిపించగనే సేనలతో నేను అక్కడికి వెళ్ళి చూచితిని. అది మృగము కాదు. ఒక ఋషి కుమారుడు. దగ్గరకు వెళ్ళి తన పొరపాటును క్షమించ మని నేను ప్రార్థించితిని.

అంతే ఆ ఋషికుమారుడు, "ఓ రాజా! శోకింపకుము. నా ఈ అభీష్టమును నెరవేర్చి నన్ను చంపిన పాప పరిహారము గావించుకొనుము. నేను శరవణుడను; నా తల్లిదండ్రులు అంధులు. వారిని సేవించుచుంటిని. వారివలన నాకు సకల సుఖములూ కలిగెను. దివ్యజ్ఞానముకూడను లభించెను. వారు దాహముచేత కష్టపడు చున్నారు వారికి జలమును తీసికొని వచ్చుటకై నేనిచ్చటికి వచ్చితిని. నన్ను నీవు మృగమని భావించి కొట్టితివి. విధిని ఎవరు దాటగలరు? నేనిక ఈ జలమును నా తల్లిదండ్రులకు అందించలేను. కాన ఈ జలమును త్వరగా తీసుకొనివెళ్ళి ఉత్తర దిశలో ఒక పాకలోవున్న నా తల్లిదండ్రులకు అందించుము. వారు నీరు త్రాగిన తరువాత నాకు జరిగిన ప్రమాదమును వివరముగా తెలుపుము. నీరు త్రాగకమునుపే చెప్పకుము," అని పాత్రను నా చేతిలోపెట్టి ప్రాణములు వీడెను.

కౌసల్యా! ఆ బాలుడు తలిదండ్రులకై యెంత పరితపించెనో, ఆబాలుడు తన ప్రాణములనైన లెక్కచేయక నన్ను దుర్భాషలాడక, పలికిన మృదుమధురమైన పలుకులు ఇప్పటికి కూడా నా చెవులలో గింగురుమనుచున్నవి. ప్రాణములు వీడుటకు పూర్వము మూడు పర్యాయములు ఓం ఓం ఓం అని స్మరించెను.

ఈ దృశ్యమును చూచి ఆ శరవణుని అభీష్టమును నెరవేర్చి నా పాపమును తీర్చుకొందమని శీఘ్రముగా ఆపాత్రను తీసుకొని వెళ్ళి యెట్టిమాటలూ ఉచ్చరించక జలమును వారలకు అందజేసినాను. ఇంతలో ఆ తలిదండ్రులు యేమేమో ప్రశ్నలు వేయుచూ, నాయనా! కొమారా! యెందుకింత ఆలస్యమాయెను అని చేతులు తడుముచూ పట్టుకొనుటకు ప్రయత్నించిరి. అయితే నేను కొంత వెనుకకు వచ్చితిని. ఇంతలో ఆ వృద్ధ తలిదండ్రులు, ఓ కుమారా! నీవెందులకు మారుమాటాడకున్నావు? నీవు మాటాడినగానీ మేము జలమును గ్రోలము అని భూమిపై బడిరి.

ఇంతలో గతించిన శరవణుని కళేబరమును నేను సేనలతో వెంటతెమ్మని చెప్పియుండుటచేత మనసేనలు ఆ కళేబరమును అక్కడికి తెచ్చియుండిరి. ఇంతలో నేను ఆ కళేబరమును తల్లి ముందుంచితిని. ఆమె ఆ కళేబరమును తమ ముందుంచుకొని చాలా విలపించెను. ఆ కఠిన దుఃఖమును నేను చూడలేకపోతిని.

ఆ తల్లి ధైర్యము చేసుకొని ఓ రాజా! మా కొమారుడు లేక మేమిక జీవించి ప్రయోజనములేదు. మేము వృద్ధులము, మమ్మెవరు చూతురు. అతనితోపాటు మమ్ములనూ ప్రాణము తీయుము, లేదా కాష్ఠము సిద్ధము చేయుము, అని ఆ ముదిదంపతులు కోరిరి. వారి ఆజ్ఞానుసారము క్షణములో కాష్ఠము సిద్ధము గావించితిని. తోడనే వారు కుమారుని కళేబరముతో దానిమీద కూర్చుండిరి. వారు యోగాగ్నిచే శరీరమును దహింపజేసిరి.

వారు దహింపబడుటకు పూర్వము నాతో ఒకమాట జెప్పిరి. అది ఇప్పుడు నాకు అక్షరాలా వర్తించుచున్నది. వారి పవిత్రశాపము నేడు సత్య స్వరూపమును ధరించుచున్నది. అని కొంత సొమ్మసిల్లెను.

ఇంతలో కౌసల్య అతనిని అనేకరీతుల వోదార్చి, 'స్వామీ, ఆమాటలేవియో వివరించి నన్ను తృప్తిపరచుము' అని ప్రార్థించెను. కొంత ఓపిక పట్టుకొని, కౌసల్యా! యేమని చెప్పుదును? ఆ వృద్ధ మునిదంపతులు, ఓరాజా! ఇప్పుడు మేము కొమారుని వియోగముచే యెట్లు మా ప్రాణములు విడుచుచున్నామో, నీవునూ పుత్ర వియోగముచే అట్లే ప్రాణములను విడువగలవు. అని చెప్పి ప్రాణములు విడచిరి.

అప్పటికి నాకు కుమారులులేరు, అందువలన ఈ ఋషిపలుకులు యేవిధ

ముగ సత్యము కాగలవు అని ఒకవైపున విచారించితిని. మరొక వైపున ఋషి పలుకులే సత్యమయిన నాకు కుమారులు కలుగగలరు. వారు కలిగినకదా పుత్రవియోగము నాకు ప్రాప్తించును. కాన నాకెట్టి ప్రాప్తి లభించినను పరవాలేదు, పుత్రులు కలిగిన చాలని కొంత సంతసించితిని.

ఈ మర్మమును ఇంతవరకూ నేను నీతో చెప్పనైతిని. ఇప్పుడు ఆ పవిత్ర ఋషి వచనములు పరమ సత్యములని గ్రహించగలిగితిని. నాకిక రామ వియోగ బాధనే అంత్యము; నేనిక బ్రతుకను; శరవణుని కథ జ్ఞప్తికివచ్చెను. ఇక నాకెట్టి ధైర్యమునూ లేదు; రాదు. అని పూర్వపు వృత్తాంతములను స్మరించి విచారించు చుండెను. రామా, రామా, రామా అని మూడు పర్యాయములు స్మరించి దశరథుడు కౌసల్యపై వ్రాలెను. కౌసల్య అతని మార్పును చూచి గొల్లున కేకవేసెను. ఇంతలో దాసదాసీలు గుంపులు చేరిరి. ప్రాణములు విడచిన దశరథ మహారాజును చూచి నగరము అంతా ఒక పెద్ద గోలగా మారెను.

క్షణములో ఈవార్త పురమంతయూ తెలిసెను. అందరూ రాజభవనమును ప్రవేశించిరి. వీధులు క్రిక్కిరిసెను. రోదనలు హెచ్చాయెను. జనులు కైకేయిని స్వేచ్ఛగా దూషించిరి. ఆమె మూలముననే రాజ్యమునకు నేత్రములే కోల్పోతిమని చింతించిరి.

ఇంతలో వశిష్ఠ మహాముని అక్కడికి కరుదెంచెను. సమయోచితముగా అతడు అనేక ఉపశాంతి వచనములు తెలిపి, కౌసల్యా సుమిత్రలను వోదార్చెను. అనేక విధముల పూర్వుల చరిత్రలను ఆదర్శముగా తెలిపి జనన మరణములు ప్రతి ప్రాణి దేహమునకూ తప్పినవి కావని వారలకు నచ్చచెప్పెను.

కళేబరమునకు అంత్యక్రియ లాచరింప పుత్రులెవ్వరునూ చెంతలేనందున, మరొకరు అట్టికార్యమును నెరవేర్చుటకువీలుకానందున, వశిష్ఠులవారి ఆజ్ఞానుసారము మహారాజు దేహము తైలద్రోణిలో నుంచబడెను.

ఒక దూతను పిలిపించి, ఓయీ! నీవు శీఘ్రముగా వెళ్ళి రాజు స్వర్గస్థుడయ్యెనని మాత్రము చెప్పక, గురువుగారు మీ అన్నదమ్ములిరువురినీ శీఘ్రముగా నగరమునకు విజయము చేయుడని చెప్పుము, అని ఆజ్ఞాపించెను.

ముని ఆజ్ఞగైకొని మంత్రిగారి సెలవు తీసుకొని, దూత అతివేగముగా రథమును నడపెను.

అయోధ్యలో అనర్థములు ప్రారంభించినది మొదలు భరతునకు దుస్వప్నములు వచ్చుచుండెను. రాత్రి స్వప్నమున అనేకదుస్వప్నములుచూచి మేల్కొనెను.

ఆ ముందుదినము రాత్రి భరతుడు పూర్తి నిద్రించక దిగులుచెంది, యేదో అనిష్ట ములు కలుగనున్నవని యోచించుచూ, కూర్చొని విచారించుచుండెను. తెలతెల వార గనే స్నానముచేసి, అనిష్టముల పరిహారార్థము అనేకవిధముల దానములు గావించెను. ప్రార్థనలు సలిపెను.

అయిననూ, తనలో యేదో అర్థముకాని ఆవేదన, లోలోన రగులుతునే వుండెను. ఈ విధముగ పదునాలుగు దినములు ప్రతిదినమూ దుస్వప్నములు విడువక వచ్చుచుండుటచే తన ధైర్యము అడుగంటెను.

ఇంతలో అయోధ్యనుండి వెళ్ళిన రాజదూత పదునైదవ దినమునకు కేకయరాజ్యమును చేరెను. సింహద్వారమునుండి తన రాకను భరతునకు తెలుపగా, భరతుడు అతి ఆతురతతో, సమాచారమును తెలుసుకొనుటకై అతి శీఘ్రముగా లోనికి ప్రవేశించమని తెలిపెను. వెళ్ళిన దూత భరతునకు నమస్కరించి, గురువుగారి ఆజ్ఞప్రకారము తాను తమరు అయోధ్యకు విజయము చేయుడని ప్రార్థించెను.

భరతుడు అనేక విధముల యోగక్షేమములు అడిగెను మరేవిషయములూ లేవనియూ, కేవలము గురువుగారి ఆజ్ఞనిమిత్తమై తాను కైకేయి నగరమునకు వచ్చితిననియూ గురువుగారు మిగిలిన వివరములు తనకేమియు నూ తెలుపలేదనియూ దూత తెలిపెను.

దూతలు రాజులదగ్గర అతిగా మాట్లాడరుకనుక రాజుకూడ దూతలను మీద మీద ప్రశ్నించరు; వివరములు, అతనిని అడుగరు; అది ఆనాటి రాజుల అలవాటు దూతల విషయాల్లో.

వెంటనే భరతుడు లోనికివెళ్ళి మేనమామ వద్ద సెలవు తీసుకొని, తమ్ముడైన శత్రుఘ్నునితో కూడి ప్రయాణమై రథమున ఆశీనుడాయెను. రథము అతి వేగముగా నడచెను. పర్వతములు, గుట్టలు, అడవులూ, శరవేగమున దాటిరి. యెంతవేగముగ ప్రయాణము జరుగుచున్నదో అంతవేగముగా భరతునితో అంత దుఃఖము పై కుబికి వచ్చుచున్నది. తనకు అర్థముకాని ఆవేదన తనను కృంగదీయుచుండెను. దేనినీ ముట్టక భుజింపక, నీరైననూ త్రావక అతివేగముగా అయోధ్యను చేరవలెనని వుఱ్ఱూతలూగుచున్న అన్ననుచూచి, శత్రుఘ్నుడు ఆశ్చర్యపడెను. ఒకటి రెండు పర్యాయములు దేనినైననూ పుచ్చుకొమ్మని కోరి నప్పటికినీ దానివేమాత్రమూ గమనించకుండుటచూచి, శత్రుఘ్నుడు కూడా వూరకుండెను. క్షణ క్షణమునకు దుశ్శకునములే యెదురువచ్చెను. నగరమును సమీ

పించుకొలది మరింతగా దుశ్శకునములు కనబడెను. ఆ శుభస్థానమున కూర్చుని కాకులూ, కుక్కలూ భయంకరముగా కూయుచుండెను. ఇంతకాలము యేవిషయమూ తలంచక ధైర్యముగా వుండిన శత్రుఘ్నుని మనస్సుకూడా కొంతకలత జెందెను.

వారిరువురూ నగరసింహద్వారమును చూడగనే, బీడకొట్టినట్లు భయంకరంగా నుండెను. యెన్నడో కట్టబడిన పచ్చని మామిడి తోరణములు యెండి, చిటపట శబ్దాలతో వ్రేలాడుచుండెను. ఇది మరింత అమంగళమునకు నిదర్శనముగా దృఢపరచెను. నిత్యము పచ్చనితోరణములతో కళ కళ కిలకిలలాడుచున్న నగరసింహద్వారము, ఈ రీతిగా పాతతోరణములను తీయక పచ్చనితోరణములను కట్టక వుండుటలోని అంతరార్థమును గుర్తించిరి-సోదరులు.

నగరములో ప్రవేశించినతోడనే, అశ్వశాల, గజశాల మొదలు కనుపించును. వాటిని చూడగనే భరతుడు గుండెలు బ్రద్దలాయెనా అన్నట్లు దిగ్భ్రాంతి జెందెను. అశ్వములూ, గజములూ కదలక మెదలక తలలు వాల్చుకొని కంటిధారలు కార్చుచుండెను. మావటులు రౌతులు ఇత్యాది పరివారలు విచార సూచనలతో తలలు వంచిరి. ఇంకా ముందుకు నడిచిరి. రాజవీధులలో అన్ని గృహములలో తలుపులు మూయబడియుండెను. రాజవీధులు దుమ్ముతో నిండియుండెను. పురజనులు రధమును చూచి అశుభముగా తలలు క్రిందికి వంచిరి. కంటిధారలుకార్చిరి. వజ్రాల బజారులు, మిగిలిన అంగళ్ళు పూర్తిగా మూయబడి యుండెను. వీటికి కారణమేమో యెవరినైనా అడుగుటకుకూడా భరతునకు నోరాడలేదు. స్థంభించి పోయెను. నేరుగా రాజభవనమును చేరెను.

అక్కడ ద్వారపాలకులు, జయజయధ్వనులను పలుకక పతాకములువాల్చి, తలలు క్రిందికి వంచిరి. యేదో అశుభము జరిగినదని పూర్తిగా గ్రహించి లోనికి వెళ్ళెను. కైకేయి తన కొమరుని రాకను గమనించి ఆనందముతో కుమారునకు యెదురేగెను. ఆమెతో వెళ్ళిన దాసదాసీలు, దుఃఖముచేత పీడితులై యుండిరి. వారి ముఖములుచూచి, భరతుడుకూడనూ విచారముతో యేమియూ పలుకక మంచు కప్పిన వానివలే నిలిచెను.

ఇంతలో కైక "నాయనా ! భరతా ! మీ మేనమామలు క్షేమమే కదా?" అని అడుగగా అందులకు యేదో సమాధానము చెప్పి భరతుడు, నాన్న, అన్న, పెద్దమ్మలందరూ క్షేమమేకదా అని తిరిగి తల్లిని అడిగెను. అందులకు కైక వూరకుండుట చూచెను. చుట్టూవున్న దాసదాసీలు కంటినీరు పెట్టుచుండుట చూచెను. తల్లి యేమియో

దాచి పెట్టుచున్నదని తాను గ్రహించి, అమ్మా ! నాన్నగారెక్కడ ? అని అడుగగనే దాసీలు గొల్లున యేడ్చిరి. ఇది గమనించి కైక ఇకదాచుట మంచిదికాదని, తానుకూడనూ కంటిధారలు కార్చుచూ కపటదుఃఖమును ప్రకటించెను. భరతునకేమీ అర్థముకాక యెవరికేమి ప్రమాదము సంభవించెనో యేమో అని వివరములను తెలుపగోరమని దీనుడై తల్లిని ప్రార్థించెను.

అంత కైక నాయనా, యేమందును ? మందర సహాయమున నేను అన్ని కార్యములను సాధించితినికదాఅని, యెంతో సంతోషముగావుంటిని. కానీ ప్రారంభముననే నా కార్యములన్నియూ పతాపంచలమాయెను; దైవముచిన్నచూపుచూచెను. మహారాజు మీ ప్రియమైనతండ్రి స్వర్గస్థులయిరి, అని యేడ్చెను. ఈ మాట వినగనే సింహనాదమును వినిన ఆడయేనుగువలే భరతుడు, హాతండ్రీ అని నేలకూలెను. శత్రుఘ్నుడు మొదలు కొట్టిన అరటి చెట్టువలే నేల వ్రాలెను. వారి గోల వర్ణనాతీతము. భరతుడు, తలను బాదుకొంటూ, తండ్రీ! యేమి మా దురదృష్టము, మీ ప్రాణ ప్రయాణ సమయమున మీవద్ద వుండలేకపోతిమికదా ? మేమెంతపాపాత్ములము. పుట్టిన నలుగురు బిడ్డలలో నలుగురికీ ఒకేప్రాప్తి లేకపోయె కదా. అంత్యసమయమున నీచెంతనుండిన రామలక్ష్మణులే ధన్యులు, అన్నింటికీ అధములు ఈ భరత శత్రుఘ్నులు.

అయ్యో ! మేమెంత దురదృష్టవంతులము. అంత్య సమయమున మమ్ములనెంత పలుకరించితిరోకదా ? మాకు యేమి చెప్పనుంటిరో కదా ? పోనీ మాకు చెప్పవలసిన విషయములు, మా ప్రాణసమానమైన శ్రీరామునితో చెప్పియుందురు. అక్కడికైనను వెళ్ళి కనుగొని కొంతశాంతి నొందుదము తమ్ముడా! రామునిచెంతకు వెళ్ళుదము రమ్ము. అమ్మా! మా అన్నగారైన శ్రీరాముడు ఇప్పుడుయెక్కడున్నాడు? అని ప్రశ్నించెను. రాముడే వుండి వుండిన మీ నాన్నగారు మరణించియుందురా ! రాముడు నగరమున లేడు కదా, అని కైక తెలిపెను.

గాయమునకు విషముతగిలినట్లు భరతునకు మరొక నూతనచింత ఒకటి ప్రారంభమాయెను. అమ్మా ! మా ప్రాణ సమానమైన రాముడు లేక యెక్కడికి పోయెను అని ఆతురతతో అడిగెను. అందులకు కైక వెంటనే, "యెక్కడికా ? అరణ్యమునకు" అని తెలిపెను.

"అరణ్యమునకు వెళ్ళిన రాముడు ఇంతకాలము నగరమునకు రాకుండుటకు కారణమేమి ?" అని ఆతురతతో అడిగెను భరతుడు. నాయనా, ఆ కథ చెప్పుటకు ఇప్పుడు వ్యవధిలేదు. ముందు నీ తండ్రిగారి అంత్య క్రియలు చేయుటకు తగిన

ప్రయత్నములు గావింపకుము. అని కైక జవాబు ఇచ్చెను. ఇది గమనించి, తన తల్లి యేదో దాచిపెట్టుచున్నదని గమనించి, వదినెగారైన సీతాదేవి యెక్కడున్నదిలక్ష్మణు డెక్కడఅనిమీదమీద ప్రశ్నించెను. "వారిరువురు రామునితోఅరణ్యమునకు వెళ్ళిరి. వారికిపదునాలుగు సంవత్సరములవరకు నగరమున ప్రవేశింపరు. ఇది మీతండ్రిగారి ఆజ్ఞ" అని కైక కటువుగా చెప్పిన తోడనే ఇందులో యేదో జరిగినదని భరతుడు బాగా అర్థముచేసుకొని, మరింత విచారగ్రస్తుడై కుములుచున్న భరతుని దగ్గరకు తీసి కైకేయి, "నాయనా! భరతా! మీ తండ్రినిమిత్తమై విచారింప పనిలేదు. వారనేక సత్కార్మలు గావించిరి. కీర్తి ప్రతిష్ఠల నందుకొనిరి. సుఖముగా జీవించిరి. అంతమున స్వర్గమును జెందిరి. తండ్రివలే నీవును కీర్తిని గడించి, సత్కార్మల సలిపి, సుఖముగా రాజ్యము నేలుము. అతని పేరు ప్రతిష్ఠలను నిలుపుము. అని కొడుకును ఓదార్చ ప్రయత్నించెను.

ఈ మాటలు భరతుని హృదయానికి కత్తివలే నాటుకపోయెను. తలపై సుత్తివలే మోదెను. కైక మాటలకు శత్రుఘ్నుని శరీరము మండెను కానీ, అతడు తల్లితో నెదిరించి మాటలాడలేదు. భరతుడులేచి, సత్యమును తెలుసుకొనిన మంచి దని, తనతల్లి తనకు సత్యమును కప్పిపుచ్చి యేమో నాటకమాడుచున్నదని తలంచి, శత్రుఘ్నునితో కలిసి దుఃఖించుచూ కౌసల్యామందిరమును ప్రవేశించెను. కౌసల్యా ధూళిపట్టిన వస్త్రముతో క్రిందపడి, నాథా నాథా, రామా రామా! అని అరచుచూ పడియుండ దాసీలుకూడనూ దుఃఖముతో, కన్నులువాచి దేవికి సేవలు చేయు చుండిరి. ఈ దృశ్యమునుచూచి భరతుడు తల్లీ తల్లీ, అని బావురుమంటూ యేడ్చుచూ, తల్లి పాదములపై వ్రాలెను.

భరత శత్రుఘ్నులనుచూచి కౌసల్యా సుమిత్రలు మరింతవిలపించిరి, మూర్ఛిల్లిరి. ఒకరి నొకరు కట్టుకొని యేడ్చుచుండ, యెట్టి కఠినమైన శిలయైననూ కరిగి యుండెడిది. అట్టి రోదనలతో అందరూ నేలకూలిరి. భరతుడు, "అమ్మా! మా వాన్నను చూపుము, నాన్న మరణమునకు కారణము తెలుపుము. నా ప్రియమైన సోదరులు రామలక్ష్మణులు, సీతాసమేతులై అరణ్యమునకు యెందుకు వెళ్ళిరి? నాకేమీ అర్థమగుట లేదు. నాకు ఈ విషయములను తెలిపి, నా దుఃఖమును చల్లార్చుము," అని కౌసల్య పాదములపై పడి విలపించుచున్న భరతునిచూచి కౌసల్యా కౌగిలించుకొని, "నాయనా, నీరాకతో నాకు కొంత శాంతి చేకూరినది నిన్ను చూచి, నా రామ వియోగమును మరతును. నీవు రామునితో సమానము. నాకు భేదములేదు." అని అంటూ మధ్య మధ్య హాధామా! నేనిక పదునాలుగేండ్లు నిన్ను

చూడక జీవించగలనా! నీ తండ్రివలే నీ చింతనలోనే భస్మము గావింతువా నన్ను? అయ్యో! నే నెంత దురదృష్టవంతురాలను, అని వాపోవుచున్న కౌసల్యా వచనములచే భరతునికి మరింత బాధ కలిగెను.

విషయము తెలియక అనేక విధముల విపరీత భావములు సలుపుచున్న భరతుడు ధైర్యము చేసుకొని, అమ్మా నన్ను నమ్ముము, నా రామచంద్రుడు అడవికి వెళ్ళుటకు నాన్న ప్రాణములను వీడుటకును కారణమేమో తెలిపి నన్ను అయోమయ స్థితినుండి కాపాడుము, అని ప్రార్థించెను.

అంత కౌసల్యా సహజ సరళ స్వభావముకలదికనుక, వెనుకకు వచ్చిన రాముడే వని భరతుని భావించి దగ్గర చేర్చుకొని, కంటినీరుతుడిచి, నాయనా! భరతా! ధైర్యముగా నుండుము. గతించినదానికి వగచి ప్రయోజనముండదు. కాలకర్మముల గతులు అఘటితములు, ఒకరిని దూషించి ప్రయోజనములేదు. దూషించకూడదు. ఇంత దుఃఖమును అనుభవించి జీవించమని నా విధివ్రాత నాకు శాసించినది. అది తప్పినదికాదు. నావిధిని నేను అనుభవించక తప్పదు మీరు చిన్నవారు ప్రాతఃకాల సూర్యునివంటిది మీ జీవితము.

మీ తండ్రి ఆజ్ఞ ప్రకారము నా ముద్దులపట్టి శ్రీరాముడు నారవస్త్రధారియై జటాజూటములు ధరించి అరణ్యమున సంచరించుచున్నాడు. అతని విడచి క్షణమైననూ వుండజాలనని జానకి కూడా అతనితో వల్కలాంబరములను ధరించి వెళ్ళెను. లక్ష్మణుడు రామవనవాసమును తప్పించుటకై అనేక విధముల ప్రయత్నములు సలిపి విఫలుడై, తానులేని అయోధ్య నాకు అరణ్యసమానమని, వెంటనే రామునితో ప్రయాణమై వెళ్ళెను.

ఇవన్నియూ నా కన్నుల యెదుట జరిగెను. నేనెంత పాపాత్మురాలను! ఇన్ని చూచియూ నా ప్రాణములు పోకున్నవి. నేనైననూ వారితో వెళ్ళనైతిని. నా ప్రాణములైనను వారితో పోక పోయెను. నా నిర్భాగ్యపుస్థితిని నేనేమని చెప్పుకొందును? నా హృదయము నిజముగా పాషాణము. ఇట్టి పాషాణ హృదయురాలి గర్భమున కోమల హృదయుడైన రాముడు జన్మించుటచేత రామునికిన్ని గతులు. అయ్యో! రామా, ఆ భీకరారణ్యమున రాత్రింబగళ్ళు యెట్లు కందమూలాదులు భుజించి జీవించుచున్నావో కదా? అని ఒక్క కేకవేసి నేల కూలెను కౌసల్య.

ఈ దుఃఖములను చూచుచూ, వచనములు వింటూ భరతుడు అసలు సంగతేమియో తెలిసికొనలేక, వివరించి అడుగుకొనలేక అయోమయస్థితిలో కుములుచుండెను.

ఇంతలో గురువుగారైన వశిష్ఠులవారు రమ్మని కబురంపినట్లు మంత్రి సుమంతుడు వచ్చెను. సుమంతుడు భరతశత్రుఘ్నులను చూచిన తక్షణమే భోరున యేడ్చి భరతుని కౌగిలించుకొనెను. భరతశత్రుఘ్నులుకూడా వారిలోని దుఃఖమును ఆపుకొనలేక, వారునూ దుఃఖించిరి. ధైర్యమును వహించి, కడకు సుమంతుడైననూ, విషయమును తెలుపునేమో అని, యెన్నియో విధముల భరతుడు ప్రయత్నించెను. సుమంతుడు విషయము భరత శత్రుఘ్నులకు తెలిసియే యుండునని తలంచి తానేమీ ప్రత్యేకించి వివరములు తెలుపలేకపోయెను.

అందరునుకూడి గురువుచెంతకు వచ్చిరి. గురువుపాదముల పైబడి విలపించుచున్న భరత శత్రుఘ్నులను లేవదీసి వశిష్ఠులవారు అనేక రీతుల నీతులను బోధించి, వారలను ఓదార్చెను. ఇప్పటికే కాలాతీతమైనది, ఇక కాలహరణముచేయుట మంచిది కాదనియూ, పితృ అంత్యక్రియలు చేయ సిద్ధము కమ్మని భరతునికి ఉపదేశించెను.

భరతుడు దీర్ఘముగా ఆలోచించి "స్వామీ, ప్రథమ పుత్రుడైన రామచంద్రుడు చేయవలసిన ఈ కార్యము నా తలపై పెట్ట తలంచితిరా, ఇది న్యాయమా? ఇన్ని దినములే పూరబెట్టితిరి. ఇక రెండుమూడు దినములు వుండిన నేను నేడే సోదరుడైన శత్రుఘ్నునితో అడవికి వెళ్ళి నా రామచంద్రుని దోడ్కొనివత్తునని, ఆజ్ఞ దయచేయు"డని ప్రార్థించెను.

అందుకు వశిష్ఠులవారు, "నాయనా! నీవు అమాయకుడవు! రామచంద్రుడు తనకు నేమించిన కాలము గడువక ముందుగా వచ్చుటకు ఇష్టపడడు. ఏకవాక్య పరిపాలుడు. నీవెన్ని చెప్పిననూ రాముడు పదునాలుగు వర్షములు అరణ్యావాసము చేయక అయోధ్యను ప్రవేశించడు. నీవు ఆ ప్రయత్నమునకు పూనుకొనక, తండ్రి అంత్యక్రియలు ఆచరించి తదుపరి నీ యిష్టప్రకారము గావింపుము," అని పదేపదే అనేక విధముల బోధించెను.

చేయునది లేక, భరతుడు సరి అని, వేదోక్త ప్రకారము తండ్రి కళేబరమునకు స్నానము చేయించి, తీసుకొని పోవుటకు తగిన యేర్పాటులు గావించెను.

ఇంతలో తనకేదియో ఒక భావము హృదయమున మొలకెత్తగనే, అంతఃపురమునకు సరాసరి వెళ్ళి కౌసల్య, సుమిత్రల పాదములకు నమస్కరించి, తల్లులారా! మీరు సహగమనమునకు ప్రయత్నింపకూడదనియూ, అట్లు ప్రయత్నించు పక్షమున తాను తండ్రి అంత్యక్రియలను జరుపనేరననియూ, వారలతో మాట ఇప్పించుకొనెను. వారు కొమారుని ప్రేమానురాగములకు సంతసించి, "నాయనా! నీయిష్టప్రకారమే చేయు"మని మాటయిచ్చిన తరువాత, నిండు దుఃఖముతో,

సరయూనదీతీరమున గంధపు చెక్కలతో యేర్పరచిన కాష్ఠమును చేరి, వశిష్ఠులవారు ఆశించినదానికంటే, వేయిరెట్లు అధికంగా వేదోక్తంగా తండ్రిగారి అంత్యక్రియలు భరతుడు గావించెను.

తండ్రి పేరుతో షోడశమహాదానములు చేసెను. గోదానములు, భూదానములు, సువర్ణదానములు, వస్త్రదానములు, అన్నదానములు, గృహదానములు, అశ్వదానములు, గజదానములు, ధనదానములు ఇత్యాది దానములు విరివిగా గావించెను. భరతుడు చేసిన పితృకార్యము ప్రజలు వేనోళ్ళ చెప్పుకొని ఆనందించిరి.

అయితే ప్రజలలో, పండితులలో, రాజులలో రాముడు లేని కొరత తీరలేదు. రామవియోగ బాధలు క్షణ క్షణమునకు వారి హృదయములను బాధించుచునేయుండెను. ఇక చేయునదిలేక, రాముడు ఏకవాక్య పరిపాలుడని వారెరుగుట చేత, యేమి చేసినా రామచంద్రుడు పదునాలుగు సంవత్సరములు దాటువరకు అయోధ్యకు రాడని వారు నిర్ణయముచేసుకొని,రాముడు అయోధ్య వచ్చువరకూ వారు రామదర్శన నిమిత్తము బ్రతికియుండక తప్పదని యేదో ఒక విధముగ హృదయాలను రాళ్ళగా చేసుకొని, కాలమును గడుప నిశ్చయించుకొనిరి.

ఇంతలో గురువుగారైన వశిష్ఠులవారు రాజులను, సామంతులను, మంత్రులను, పురప్రముఖులను, పండితులను, ఋషులను రప్పించి ఒక సమావేశము జరిపెను. అందులో భరతశత్రుఘ్నులకు, ధర్మానుసారముగా రాజనీతులను బురస్కరించుకొని, ఉపదేశములు చేసెను.

ప్రథమమున కైకేయి చేసిన పన్నాగము మొదలు, రాముని వనగమనము వరకు గల కథ నతడు వివరించెను. తరువాత మహారాజుయొక్క సత్యమును ధర్మ పరిపాలనము, శౌర్య, వీర్య-పరాక్రమ బలములను త్యాగ, యోగ, భోగాది కర్మ కలాపములను, యజ్ఞయాగాది క్రమ విశిష్ఠ కార్యదీక్షలను వర్ణించెను. ఆ మహారాజు రామ పట్టాభిషేకమునకు గావించిన ప్రయత్నములు, వాటికి అడ్డుతగిలిన అవాంతరములు, కడకు రామవియోగముతో తన ప్రాణమునే వీడెననియూ తెలిపెను.

ఇంతవరకూ, యెట్టి వివరములూ తెలియని భరతశత్రుఘ్నులకు గురువుగారు తెల్పిన వివరములు వినగనే, భరతశత్రుఘ్నులకు ఒక వైపున పట్టలేని కోపమూ, మరొక వైపున సిగ్గూ, దుఃఖమూ వారలను కృంగదీసెను; నేత్రములవెంట నీరు ధారలై ప్రవాలెను వారల విచారమును సభాసదులు చూడలేకపోయిరి. వశిష్ఠుల వారుసహితము తమకు తెలియకనే కంటిధారలువదలెను. ఆసభమహాశోకముతోనిండెను; యెవ్వరున్నూ మాటాడలేకపోయిరి. కొన్నిక్షణములు సభ నిశ్శబ్దముతోస్తంభించెను.

వశిష్టులవారు యేమి చెప్పుచున్ననూ భరత శత్రుఘ్నులు లక్ష్యముచేయలేదు. వారి మనసు కైక చేసిన పన్నాగములను తలంచుచూ, అట్టి తల్లి కొమారుడనై జన్మించుట యెన్ని జన్మల కర్మమోనని తలయెత్తుటకు సహితము సిగ్గుపడుచూ, యెప్పుడెప్పుడు ఆ సభను వీడి పోదునా అన్న బాధతో తలవంచుకొని వుండిరి.

వారి విచారమును గమనించి వశిష్టులవారు దగ్గరకువెళ్ళి వారిని తగిన ఉపశాంతి పలుకులతో నోదార్చి "నాయనా! విచారించి ప్రయోజనములేదు; జరిగినది జరిగేపోయినది. ముందు జరపవలసిన వాటికి తగిన విచారము సలుపుట మంచిది. అన్ని విధములా మీ తండ్రి అదృష్టవంతుడు. అతని నిమిత్తము విచారించుట వ్యర్థము. నా మాటలను విని మీ తండ్రి ఆజ్ఞను శిరసావహింపుము. మహారాజు నీకు రాజ్యాధిపత్యము నిచ్చెను. తండ్రి వచనములను మన్నించుట ఉచితము.

ఆడినమాటను తప్పలేక మీతండ్రి రాముని వియోగమునకు ఒప్పుకొనెను. అతని యందలి ప్రేమానురాగములచే ప్రాణమునే వీడెను. మాటకై ప్రాణమును వీడెనుమాటలో యెట్టి సందియము లేదు. ప్రాణముకంటె మాటనే ప్రధానమని భావించుటచేత కదా, మాటను తప్పక తనప్రాణమునైననూ వీడుటకు సిద్ధమాయెను? తండ్రి మాటను నెరవేర్చుటకై కదా, శ్రీరాముడు కూడ భార్యతో అడవి కేగెను? కాన ఈ ఇక్ష్వాకుల వంశమున ఆడినమాటను తప్పక కాపాడుట ప్రధాన నీతి. అదే మీ రాజజాతికి జ్యోతి.

కనుక నీవుకూడనూ తండ్రిమాటను నిలబెట్టుటకై, పరిపాలనా బాధ్యతను వహించక తప్పదు. నీకు అన్నివిధములా మంగళమగుగాక; శుభములు చేకూరుగాక; నీపైగల వాత్సల్యముచేతనూ, దయా అనుగ్రహములచేతనే, నేనిన్నివిధముల నీకు బోధింపబూనితిని. లేకున్న ఇంతటి బాధ్యతను నేను నీపై మోపియుండెడివాడను కాను. నీవు నీ తండ్రి కీర్తిని నిలబెట్టగలవు. పరిపాలనా శక్తి, దక్షత నీలో కలదు. సంశయించక, అంగీకరింపుము." అని వీపు నిమురుచూ, ఆశీర్వదించుచున్న వశిష్టులవారి వచనములు విని, దిగ్గున ఆసనమునుండి లేచి వశిష్టులవారి పాదములపై బడి, భరించలేని దుఃఖముతో అదురుచున్న పెదవులతో, కంఠమెత్తి, "స్వామీ! నిజముగా ఈ వచనములు నాపైగల ప్రేమానురాగములకు సూచనలా? నే నమ్మలేకున్నాను! నిజముగా, తమకు నాపై అంతటి ప్రేమానురాగములే వుండియుండిన నాకిట్టి బాధ్యతను భారమును మోపుటకు అంగీకరించెడివారు కారు ఇది నాకు ఒక శిక్షగా విధించుచున్నారు."

"యే రాజ్యము, పవిత్ర పావన పురుషుని అరణ్యమునకు పంపెనో, యే

రాజ్యము ప్రజలను నిరంతరము కంటిధారలు కార్చునట్లు చేసెనో, యే రాజ్యము మహాధర్మాత్ముడైన రాజును కోల్పోయెనో, యే రాజ్యము ఈ ఇక్ష్వాకుల వంశమునకు కళంకము తెచ్చిపెట్టెనో, యే రాజ్యము మహా పతివ్రతామ తల్లులైన కౌసల్యా, సుమిత్రాదులకు వైధవ్యము నందించెనో, అట్టి రాజ్యమును ఈభరతునకు అప్పజెప్పుచూనుట, ఇది నా పాపఫలము. క్రూరాత్మురాలైన కైక గర్భమున జన్మించిన దురదృష్ట ఫలము. నాకు ఈ శిక్షనిచ్చుట కంటే నన్ను నా రామచంద్ర ప్రభువున్న స్థానమునకు పంపి పుణ్యమును చేకూర్చుడు! వారల పాదసేవలు చేయుచు, వారు నడచు దారులను పూడ్చి తరింతును; కాని, ఈ రాజ్యమున క్షణమైననూ నే నిలువ జాలను," అని వశిష్ఠులవారికి నమస్కరించి వనమునకేగ ఆజ్ఞ దయచేయమని కోరెను.

అంత మంత్రులు లేచి చేతులను జోడించుకొని భరతునితో ఇట్లు చెప్ప నారంభించిరి:

"ప్రభూ! రాజులేని రాజ్యము యెంతకాల మీవిధముగ జరుపుట మంచిది కాదు. గురువాజ్ఞను మన్నించి, మీరు పరిపాలనా బాధ్యతను చేపట్టక తప్పదు. శ్రీరాములవారు వచ్చిన తరువాత సమయోచితముగా తమరు ఇష్టానుసారముగా ప్రవర్తించవచ్చును. మా ప్రార్థన అంగీకరింపుము; ప్రజలను పాలింపుము. రాజ్యమును చేపట్టుము" అని చెప్పుకొనిరి.

ఒకపరి మాతృదేవియైన కౌసల్యను దర్శించి వత్తునని భరతుడు కోరగనే, వశిష్ఠులవారు అందులకు సమ్మతించెను. సమావేశమునుండి భరతశత్రుఘ్నులు సరాసరి కౌసల్యా భవనమునకు వెళ్ళి పాదములపై బడి, "అమ్మా! దుర్మార్గురాలైన కైక గర్భమున జన్మించి, ఇన్ని విధముల అవాంతరములకు కారకుడైన ఈభరతుని మొదలు క్షమింపుము. రాజ్య దుర్గతికి ఈ పాడు భరతుడే కారణము. నన్ను వనమునకు పంపుటకు ఆశీర్వదింపుము. అనుజ్ఞ యిమ్ము. నా ప్రభువులేని అయోధ్యలో క్షణకాలము నేను తలయెత్తి తిరుగుటకు వీలుకాదు. ఈ రాజ్యాధికారము జ్యేష్ఠపుత్రుడైన శ్రీరాములదే కానీ, ఈ అల్పునకెట్టి అధికారమూ లేదు. నాకీ భారము వద్దు." అని దుఃఖించుచుండ, కౌసల్య ధైర్యమవలంబించి, "భరతా! కాలగతులు గ్రహించి, విషాదమును విడచిపెట్టుము. ప్రస్తుతము స్థిమితముగా నుండుటకు సమయము కాదు.

శ్రీరాముడు అడవిలోనుండెను. మీ తండ్రి స్వర్గమును చేరెను. నీ తల్లులు, బంధువులు, మిత్రులు, జనులూ పరమ దుఃఖమున మునిగిరి. వారందరికీ ఇపుడు

యైననూ రామవియోగమును భరింతును. నీవునూ అడవికి వెళ్ళిన ఇక మాగతియేమి? నీవు తప్పదని అందునా నన్ను కూడనూ నీతో అడవికి తోడ్కొనిపొమ్ము. నే నెవరి నిమిత్తము అయోధ్యలో జీవించవలెను? పతినికోల్పోయి సుతునకు దూరమై ఈ సతి జీవించుటకంటే, వారి వియోగ బాధలో నా ప్రాణములు లీనమొనర్చుట మంచిది కదా? గురువాజ్ఞను పొంది రమ్ము. మనము అరణ్యమున ప్రవేశించి సీతా రామలక్ష్మణులతో కొంతకాలమైననూ గడిపి నా జన్మమును ముగించుకొందును," అని పలికిన పలుకులు భరతునకు కొంత శాంతినొందించెను. అంత కౌసల్య సుమిత్ర లకు నమస్కరించి, కైకగృహమునకు బయలుదేరెను.

భరతశత్రుఘ్నులు వెనుకాముందూ నడచుచూ, కైక మందర మాటలను నమ్మి ఇంత ఘాతుకచర్యలకు పాల్పడెనని చింతించుచూ తమలో తాము పుపొంగి వచ్చు క్రోధమును అణగద్రొక్కుకొంటూ, కైక భవనద్వారమును ప్రవేశించిరి. ప్రవేశించగనే మందర మంచిగా అలంకారము చేసుకొని ద్వారములో వారల రాకకై కాచుకొనియుండుట చూచి శత్రుఘ్నుడు భరించలేక, మందర కురులను పట్టి క్రింద ఈడ్చి కొట్టెను. మందర అయ్యో అయ్యో అని కేకలు పెట్టగనే, కైక పరుగెత్తు కొని వచ్చి శత్రుఘ్నుని మందలించెను.

అవకాశమును అనువుగా చేసుకొని భరతుడు మండిపడి, ఛీ పాపాత్మురాలా, ఈ దుర్మార్గురాలి మాటలువిశ్వసించి మహాపాపమునకు పాల్పడితివి. ఈ దుర్బుద్ధులు నీ మనసులో పుట్టినపుడే నీ హృదయమేల రెండు ముక్కలు గాలేదు. ఇట్టి కోరికలు అడుగుటకు నీ నాలుక యెట్లు ఆడినది. అది భస్మము కాకపోయెనా? ఏ మొఖము పెట్టుకొని ఈ రాజభవనమున నివసించుచున్నావు, సిగ్గులేదా? ఇట్టి దుర్మార్గురాలైన నీ మాటలపై రాజువకెట్లు నమ్మకము పుట్టెను. రాజు కామాంధుడై కొడుకును అమ్మి భార్యనుకొనుటకు పూనుకొనుటకు నీవు పన్నినపన్నాగములు, మహా సంకుచితమైన విగా తోచుచున్నవి. రాజుయొక్క పవిత్ర హృదయాన్ని పాడుచేసి, రాజ్యమునకు నిప్పుపెట్టి, వంశమును నాశముగావించి రఘువంశమును నిర్మూలమొనర్ప చేరిన కుటిలాత్మురాలవు. నిన్ను తల్లి అని పిలుచుట కూడను మహాపాపము.

పరుల చెడ్డను కోరిన నీ బిడ్డలు బాగు పడుదురని యెట్లు తలంచితివి? నీ బిడ్డలవంటివారు కారా, పరుల బిడ్డలు. పరబిడ్డల కీడును కోరు స్త్రీలు తమ బిడ్డల దుర్గతినే ఆశించినవారు కాగలరను పరమ సత్యమును నీవేల తెలుసుకొనలేక పోతివి. రాజవంశమున జన్మించి రాక్షస గుణములను కలిగియుండుట యేజన్మల కర్మఫలమో; ఇదంతయూ నా దురదృష్టము. అందునా నిర్మల నిస్స్వార్థపరుడైన

నా రామచంద్ర ప్రభువును, మహా సాధ్వీమణురాలైన సీతామతల్లిని అరణ్యమునకు పంపుట యెంత ఘోరము, యెంత కఠినము! ఛీ, ఇట్టి దుర్మార్గురాలవైన నీతో సంభాషించుటకూడా నా పాపఫలము.

నేను కూడనూ యే జన్మలో యే పాపము చేసితినో లేకున్న నీ బోటి కుటిలాత్మురాలి గర్భమున జన్మించియుందునా? పాపులకు పాపులే చేరుదురు కానీ పుణ్యులు చేరరుకదా? సూర్యవంశము హంసవంటిది. నీవు నిజముగా నా తల్లి వంటిదానవే. నీ తల్లి తన మనోభీష్టమును పురస్కరించుకొని తన భర్తను చంపుకొనెను. నీవునూ నీ దురాశను నెరవేర్చుకొను నిమిత్తము నీ పతిని జంపుకొంటివి. వంశాచారమునకు విరుద్ధముగా చిన్నవాడు పెద్దవానిని విడచి రాజ్యము చేయునా? ఈ భావము నీకు ఈనాడు కలిగినది కాదు. ఇట్టి పాడు తలంపు మొదటినుండియూ నీలో బీజరూపముగ నుండియే యుండును. లేకున్న ఈనాడు ఇదింత వృక్షముగా మారుటకు వీలులేదు. ఇట్టి బుద్ధే నీకుండియుండిన నేను పుట్టిన తక్షణమే నన్ను చంపియుండిన ఇంతటి దురవస్థల పాలయ్యేది కాదు ఈ రాజ్యము, వగచి ప్రయోజనమేమి. చెట్టును నరికి కొమ్మలకు నీరు పోసిపెంచే బుద్ధి, మీనములు జీవించవలెనని కోరుతూ సరస్సులోని జలమును తోడివేయుచున్న నీ తెలివితేటలకు నవ్వవలెనో యేడ్వవలెనో అర్థమగుట లేదు.

నీతో సంభాషించి కాలమును అపవిత్రము చేయుటకంటే, నేనిప్పుడే రామునిచెంతకు వెళ్ళి అతనిని అయోధ్యకు రమ్మని ప్రార్థించి తెత్తును. అతను అంగీకరించకున్న నేననూ ఆ ప్రభు సన్నిధిలోనే లక్ష్మణుని వలే సేవలు చేయుచూ అక్కడే నివసింతును. నీ మొఖము చూడను" అని తమ్మునితో వెనుకకు తిరిగెను.

తన తప్పును తలంచుచూ, తనపన్నాగములు కడకిరీతిగా మారెకదా అని చెడ్డ తలంపులు యెట్టివారలకైనా తాత్కాలికపు తృప్తిని అందించును కానీ జీవితములో అవే మన పతనమునకు రాజబాటగా మారునని తలంచి ఇక వేరు మార్గములేక, మాటలురాక, కైక స్తంభించి పోయెను. కైకకు మందరపై విసుగు పుట్టెను. భరతు డన్న మాటలలో అంతరార్థమును సత్యమును గుర్తించెను రాముని పవిత్ర తలంపులకు ఎంతో సంతసించెను. తన పాపపుబుద్ధికి తాను సిగ్గు పడెను.

కైకేయీ మందిరమునుండి భరతశత్రుఘ్నులు, సరాసరి మంత్రులు, గురువు, పురప్రముఖులు ఉండిన సమావేశ స్థానము చేరిరి. వీరలరాకకై యెదురు చూచుచుండిన మంత్రులు యేమి నిర్ణయము గావింతురో అని వినగోరుచు, వారి

ప్రత్యుత్తరమును వినుటకై నిశ్శబ్దముగా ఏకాగ్రచిత్తులై పువ్వొత్తు్నారునట్లు కాచి యుండిరి.

ఇంతలో భరతుడు గురువుగారి పాదములకు నమస్కరించి, గురుదేవా! నేను పరమ సత్యమును తెలుపుచున్నాను, నిష్కపటముగా వివరించగోరితిని. నన్ను, నా మాటలను విశ్వసింతురని ఆశించుచున్నాను.

కారణముకంటె కార్యమే కఠినము. పాషాణములో పుట్టిన లోహము పాషాణముకంటే కఠినమన్నది మీకు తెలుసు. కఠినురాలైన కైక గర్భములో పుట్టిన నేను మరింత కఠినుడను. కాకున్న రామవియోగముచే నా ప్రాణములు నా శరీరమును వీడి పోకున్నవి. కైక సీతా రామ లక్ష్మణులను అడవికి పంపి, పతిని స్వర్గమునకు ప్రయాణముచేసి, ప్రజలను అశాంతిలో ముంచి, కొడుకును అపకీర్తి పాలుచేయగా, రాజ్యమునకు మాయని మచ్చగా నన్ను రాజ్యమునేలమని మీరు శాసించుటలో నాకే మాత్రమూ సంతృప్తిలేదు. నేను అర్హుడను కాదు.

రామచంద్రుడు వనమున సంచరించుచుండ, నేను రాజ్యాధికారిగా సింహాసనముపై కూర్చొనిన లోకులు నవ్వరా. నా పరిపాలన ప్రజలకు హానినే కలిగించును. నీతివిజాయితులు తప్పి అక్రమంగా, ధర్మవిరుద్ధంగా రాజ్యాధిపత్యమును వహించువారిని చూచి ప్రజలెవ్వరూ గౌరవించరు. కారణమేమన, వారిని నేను దండించుటకు అధికారముండదు. నాలో కావలసిన దోషములు గుట్టలుగా పెట్టుకొని పరుల దోషములను చక్కదిద్దుటకు నే నేమొగము పెట్టుకొని చెప్పగలను. కాన నాలోని దోషములు నేను అధికార బలముచేత కప్పిపుచ్చుకొన్ననూ సమయము వచ్చినపుడు ప్రజలు ప్రేలును చూపించకపోరు. నా తల్లియొక్క పాడుతలంపులు నాకు తలవంపులుగా మారెను. సీతారాములను చూడక నేనిక క్షణమైననూ నిలువజాలను, నా ఈ దారుణమగు దుఃఖమును మీకు విన్నవించుచున్నాను.

నా దుఃఖము రామదర్శనముతో చల్లారును తప్ప అన్యబోధనలు నన్ను ఓదార్చలేవు. నేను కౌసల్యా సుమిత్రల ఆజ్ఞలను పొందితిని. రేపటి తెల్లవారి నేను తమ్మునితో కూడి నా ప్రభువును దర్శించుటకు వెళ్ళ నిశ్చయించుకొంటిని. నా పాపము లెన్నియున్ననూ రామప్రభువు చూపుతో భస్మమయిపోవును. తాను పలుకరించక పోయిననూ సరే నేను తనను దర్శించుచూ చెట్ల చాటుననైననూ వుండి కాలమును హాయిగా గడుపుదును.

ఓ మహాజనులారా! మీరందరూ నా శ్రేయస్సుకోరి నన్ను దీవింపుడు. మంత్రులారా! నన్ను రామునివద్దకు వెళ్ళుటకు అనుజ్ఞ దయచేయుడు. నేను రాష

ప్రభు దాసుడను. మనందరికీ అతడే ప్రభువు ఈ పలుకులకు పురప్రముఖులు, మంత్రులు, సామంతులు అందరూ మారు మాటాడలేకపోయిరి. భరతుని బాధను బాగుగా అర్థముచేసుకొనిరి. భరతుడు నిర్మలచిత్తుడనియూ, తల్లి పన్నిన పన్నాగములకు తాను కట్టుబడలేదనియూ తలంచి, భరతుని వచనములలోని పవిత్రతను గుర్తించిరి. పురప్రముఖులలో ప్రధానుడు లేచి, "ప్రభూ, మీతోపాటు మేమునూ బయలుదేరివత్తుము రామవియోగమును మేముకూడనూ భరించలేకున్నాము. ఒకపరి ఆ ప్రభువుని దర్శించిన తదుపరి మా ప్రాణములేమయిననూ ఫరవాలేదు" అని సెలవును గోరెను.

ప్రజలందరూ ఈ కోరికను మన్నించి మమ్మికూడనూ తమవెంట తోడ్కొని పొమ్మనమని కోరిరి. ఈ వార్త కొన్ని నిమిషములలో పురమంతయూ, నగరమంతయూ ప్రాకెను. ప్రతియింటిలోను స్త్రీ పురుష బాల వృద్ధులందరూ మేముకూడా వత్తుము అని ప్రయాణములైరి.

ఎవరు యెవరిని వద్దని నివారించగలరు? రామదర్శనమునకు వద్దని చెప్పు మూర్ఖులు ఆనాడు అయోధ్యలో ఒక్కరును లేకపోయిరి. వారందరితోపాటు తల్లులైన కౌసల్యా సుమిత్రాదులు కూడా, దాసీలతో బయలుదేరిరి. ఇంతలో కైక, తన పొరపాటునకు పాపమునకు పశ్చాత్తాప పడుచూ కౌసల్యకు తన కోరికను తెలియపరచెను. తననుకూడా వనమునకు తోడ్కొని పోగోరెను రాణులతో తన తప్పును క్షమించమని కోరి తనను అయోధ్య చేరుటకు తగిన ప్రయత్నములు కావింతునని ఆశించెను. నిర్మలచిత్తురాలైన కౌసల్య, తనలో యెట్టి మాలిన్యము కూడనూ తలంచక, చేర్చక, తప్పక తనతో రమ్మని కబురంపెను. సాయంత్రమునకు, నగరములో అందరూ బయలుదేరుచున్నట్లు భరతునకు వర్తమాన మందెను. అయితే, నగర సంరక్షణకు, కొంతమందైనా వుండకతప్పదని మంత్రితో తెలిపి, కొందరిని నిలచి పోవునట్లు యేర్పాట్లు చేసెను. రాత్రికే కొన్ని వాహనములు ఒక్కొక్క గృహము చెంతా సిద్ధమాయెను. ఇంచుమించు అన్ని రకములైన వాహనములు సిద్ధము చేసిరి. వారలందరికి ఆహారపానీయములు యేర్పాట్లు గావించిరి. చక్రవాక మిథునము వలే నగరములోని స్త్రీ పురుషులు ప్రాతఃకాలమునకు యెదురు చూచుచుండిరి.

# పాదుకా ప్రదానము

ఆనాటి రాత్రి పురజనులకు మహా సుదినముగా వుండెను. ఎప్పుడెప్పుడు సీతారామచంద్రులను దర్శింతుము అని వువ్విళ్ళూరు చుండిరి. చతురంగ బలము లను సన్నాహము చేసిరి. అగ్నిహోత్రములు చేయుటకు తగిన సామగ్రిని యేర్పాటు గావించుకొనిరి. పండితులు రథములలో వాహనములలో సయితము వేదపారాయణ ములు చేయుచూ వుండవలెనని మంత్రి ఆజ్ఞాపించెను. సుముహూర్తమున, భరత శత్రుఘ్నుల వాహనములు ముందూ, వాని వెంటనే కౌసల్య పల్లకిని పెట్టించిరి. అయితే అందరినీ వారి వారికి నియమించిన వాహనములలో ఆశీనులు కమ్మని భరతుడు ఆజ్ఞాపించెను.

తన రథమును ఖాళీగా నడుపుచుండిరి. భరత శత్రుఘ్నులు పాదచారులై వెళ్ళుచుండిరి. యేదో కొంతదూరము అట్లు నడుతురని తలంచిరి. కాని ఎంత సేపయి నప్పటికిని భరత శత్రుఘ్నులు రథమున కూర్చొనకుండుట చూచి తల్లియైన కౌసల్య భరతుని పిలచి, నాయనా! నీవు ఈ రీతిగా పాదచారివై వెళ్ళుట నా మనసు తరగు కొనిపోవుచున్నది. కొంతసేపయిననూ రథమున ఆసీనుడవుకమ్ము అని కోరెను. అందులకు, అమ్మా! నా పాప పరిహారమునకు ఇది ఒక మార్గము. పాదచారులై పంచరించుచున్న సీతారామలక్ష్మణులకు లేని శ్రమ నాకేమి. వారిదాసుడనై నేను రథమునందు కూర్చొనుట మహాదోషము. తమ ఆజ్ఞను మీరుచున్నానని తలంచక క్షమించి నన్నిట్లే నడచుటకు అనుజ్ఞ ఇవ్వమని కోరెను. ఇంతలో ముందు రథములో ఆసీనులైన గురువుగారగు వశిష్ఠ అరుంధతియూ వారి వాహనమును ఆపి, భరతుని దీక్షను గమనించి, తమ రథమునకు సారథిగానైనా కూర్చొనమని కోరిరి. క్షమించ మని కోరుచూ భరతుడు తాను రామ రథమునకు మాత్రమే నేను దాసుడను. అంత వరకూ యే రథమునూ నేను ఎక్కను, యే గుఱ్ఱములను చేపట్టను, ఇది నా ప్రతిజ్ఞ, అని తెలిపెను. రామప్రేమకు వశిష్ఠులవారెంతయో సంతసించిరి.

మొదటిదినము రాత్రికి తమసానదీతీరమును, రెండవదినము గోమతీతీరమును

చేరిరి. తమసానది ఘోఘ్రానదియొక్క ఉపనది. గోమతి, గంగానది ఉపనది. చీకటిపడిన తోడనే రథములను ఆపి, స్త్రీ, పిల్లలకూ, వృద్ధులకూ తగిన వసతులూ, తిండితీర్థాదులు సక్రమంగా గావించమని మంత్రి సిపాయిలకు ఆజ్ఞ చేసెను. ఎవరెవరికి నిర్మించిన పనులు వారు ఆయా వేళలకు గావించుచు మార్గమధ్యమున యెవ్వరికీ యెట్టి ఇక్కట్లూ కలుగకుండా చూచుకొని పోవుచుండిరి.

మూడవదినము తెల్లవారి బయలుదేరి ఆనాటి రాత్రికి శృంగిబేరపురమునకు వచ్చిరి. భరతుని ఆగమనము విషాదపతి విని విషాదము నొంది, ఈ భరతుడు వనమునకు బోవుటకు కారణమేమి? వెళ్ళిననూ ఇంత సైన్యముతో, చతురంగబలసమేతుడై వెళ్ళుటలోవున్న అంతరార్థమేమి? అని తనలోతాను అనేక విధముల అనుకూల ప్రతికూల భావములను పెంపొందించుకొనెను.

చెట్టు విషమయినపుడు ఫలముమాత్రము విషము కాకుండునా? అని విర్ణయించుకొని, తన జాతివారలను పిలిచి, అన్ని పడవలను నీటిలో ముంచిపెట్టుడు, పడవమార్గమును స్థంభింప చేయుడు. యే చిన్న పడవనుకూడ నడుపకూడదని శాసించెను. ఈ దినము మనము చావునకైననూ తెగించి అన్నిటికినీ సంసిద్ధమైవచ్చువారలు అటువైపున చేరకుండునట్లు చూడవలెనని ఆజ్ఞాపించెను. ఇంతలో విషాదపతి దనుర్బాణములను తెప్పించెను. భరతుడు మహా సైన్యము కలవాడయిననూ రామనిమిత్తమై తన కించిత్‌శక్తిని ధారపోయ తలంచెను.

తన జాతివారినందరినీ అన్ని విధములా యుద్ధమునకు సిద్ధముగా యేర్పరచి, భరతుడు మిత్రుడో, శత్రుడో, మధ్యముడో మొదలు కనుగొనవలెనని రాజును దర్శించుటకు వెళ్ళునపుడు తీసుకొని వెళ్ళదగిన పదార్థములన్నింటినీ సిద్ధపరచుకొని ఫలములను, పుష్పములను, మీనములను, పలలములను ప్రాచీన పాఠీనములను గంపలు గంపలు తెప్పించెను.

కందమూల ఫలములు సత్వగుణము; వానివలన మిత్రుడని తెలియును. ఖరమృగములు, రజోగుణము; వానివలన మధ్యముడని తెలియును. మీనములవలన శత్రువని తెలియును; అవి తమోగుణము.

విషాదపతి ఈ సామగ్రులను వెంటతీసుకొని భరతుని చూచుటకు వెళ్లెను. అప్పుడు మంచిశకున మయ్యెను. దూరమునుండి, వశిష్ఠులవారిని జూచి తనపేరు జెప్పుకొని, గురువునకు దండప్రణామములు ఆచరించెను. అతడు శ్రీరాముని సఖుడని గ్రహించి, గురువు అతనిని దీవించెను; ఇంతలో భరతుని బిలిచి, గురువు, విషాదపతిని చూపి, ఇతడు శ్రీరాముని సఖుడని తెలిపెను.

ఆ మాటలువినిన వెంటనే నిషాదపతిని కౌగిలించుకొని అనేక విధముల క్షేమ సమాచారములు విచారించెను. అంత గుహునితో మాటలాడు సందర్భమున ఒకనాటి రాత్రంతయూ రామచంద్రుడు ఈ నదీ తీరమున, తనతో కాలము గడిపెనని గుహుడు చెప్పగనే, కన్నులు కరువు తీరా, విప్పి చెవులను నిక్కబొడుచుకొని, ఆనాటి రాత్రి రామునితో గడిపిన పవిత్రసమయమును వర్ణించమని, తానెంతో ఆతురతతో ప్రశ్నించెను.

నిషాదపతి రామచంద్రుని యెంతయో కొనియాడి, సీతా రామలక్ష్మణుల విశ్రాంతినిమిత్తమై తాను యేర్పరచిన కుటీరములను చూపుచూ, లక్ష్మణునితో, ఆరాత్రి సంభాషించిన పవిత్ర సంభాషణలను భరతునకు తెలుపుతూవుండ, భరత శత్రుఘ్నులు కంట తడిపెట్టుకొని, పొరలివచ్చు దుఃఖమును అణచుకొనుచూ వుండుటచూచి, నిషాదపతి, భరత శత్రుఘ్నుల భక్తి శ్రద్ధలను అర్థము చేసుకొని, వీరు నిజముగా రామ సోదరులే కానీ, రామ విరోధులు కారని తనలో తాను సమ్మతించెను. సీతారాముల నిమిత్తమై నిషాదపతి యేర్పరచిన కుటీరములను దర్శించుచూ, వాటిని తగిన జాగ్రతతో చూచుకొనవలెనని భరతుడు కోరెను.

తిరిగి గురువాజ్ఞను వడసి, తమ తల్లులతో గంగానది స్నానములాచరించి, తిరిగి నిషాదపతిని పిలిపించుకొని, ఆనాటిరాత్రి రామచంద్రుడు విశ్రమించిన స్థలమును చూపమని కోరగా, నిషాదపతి, పెద్ద వటవృక్షము చెంతకు తీసుకొని వెళ్ళి అక్కడ గాలికి చెదరిపోయివున్న దర్భాసనము చూపి, సీతారాములు ఇక్కడ విశ్రమించిరని తెలుపగనే భరత శత్రుఘ్నులు ఆ పవిత్ర స్థలమునకు నమస్కరించిరి. పట్టుపాన్పులపై పవ్వళించు నా ప్రభువు ఇంతటి కఠిననేలపై యెట్లు పవళించిరో ? ఆ మహాతల్లి సీతామాత యెన్ని శ్రమలు పడెనో ? అని వారికివారు తలంచి, మహాబాధతో అక్కడే కొంతసేపునిలిచి, తిరిగి నా ప్రభువు సంచరించిన స్థానములు చూపించమని భరతుడు కోరగా శింశుపవృక్షమును చూపించి, దానిక్రింద ఫలములుభుజించిరని నిషాదపతి తెలుపగా అక్కడకూడనూ వారు నమస్కరించిరి.

ఈ స్థలములు దర్శించునంతకాలము భరత శత్రుఘ్నులు పడిన బాధ వర్ణనాతీతము. రామ ప్రేమకు నిదర్శనముగా వారుచూపిన వినయ భక్తిశ్రద్ధలు గుహుని హృదయాన్ని కరిగించెను. దశరథమహారాజు కోడలు, జనకమహారాజు ప్రేమ పుత్రిక, శ్రీరామచంద్రుని ధర్మపత్ని అయిన సాక్షాత్ లక్ష్మీదేవియే అయిన ఆ సీతాదేవి యిన్ని విధములైన అనానుకూలముల పాలు కావటము భరతుడు భరించలేకపోయినాడు.

అట్టి మహాపవిత్ర ప్రభుదంపతులను విడచి, అయోధ్యావాసులు వుండ లేకపోవుటచేత, రాముడులేని అయోధ్య అరణ్యముగా యెండబారుటచేత వారి తాపములు చూడలేక, మేమును ఆ అరణ్యమున నివసించలేక సపరివారముగా రాముడున్న ప్రదేశమే అయోధ్య అని తలంచి అందరమూ బయలుదేరి రామసన్ని ధికి వెళ్ళుచున్నామని భరతుడు తెలిపినంతనే, నిషాదపతికి విషయము పూర్తిగా అర్థమాయెను.

లేకున్న రామదర్శనార్థము చతురంగబల సమేతముగా వెళ్ళుటలో అర్థము లేని విషయం అని తలంచి తాను పూర్వముతలచిన భావములను వెలువరచి క్షమించమని కోరెను. అంత భరతుడు అందులో తప్పేమియూ లేదనియూ, తాను మహా కిరాతకుడననియూ, శ్రీరాముల వనవాసమునకు తానే కారణమనియూ, అట్టి కారణభూతుడైన నన్ను వధించిననూ పాపము లేదనియూ తన్నుతాను నిందించు కొనుచుండ, నిషాదపతి క్షమించమని ప్రార్థించెను.

భరతుని ఆగమనమును విని, శృంగిబేరపుర ప్రజలు గుంపులుగుంపులుగా వచ్చి వారిని దర్శించి రామచంద్రుని సోదరులని విని అనేకవిధముల వారిని స్తుతించి నమస్కరించిరి. కైకేయిని దూషించిరి; విధికృతమునకు బ్రహ్మను దూషించిరి. కన్నీరు కార్చిరి; రామచంద్రుని అనేక విధములకొనియాడి, త్వరలో రామ చంద్రుని వెనుకకు తోడ్కొనిరమ్మని స్త్రీ బాల వృద్ధులు యేక కంఠముతో భరత శత్రుఘ్నులను కోరిరి.

వారు రామవియోగముచేత పడుచున్నబాధలను గమనించి భరతుడు మాటాడలేక పోయెను; కంటిధారలు కార్చెను. "ప్రార్థించుట నా వంతు; తదుపరి రామకృప. నేను దాసుడనే కానీ, రాముని నిర్బంధ పెట్టుటకు నేనెంత వాడను? మీరు కూడా మీ మీ హృదయములలో రామచంద్రుడు అయోధ్యకు తిరిగి చేరవలె నని రామునే ప్రార్థింపుడు. ఈ విధమైన మీ ప్రార్థనలు నా ప్రార్థనలకు సహాయ పడును. మన అందరి ప్రార్థనలచేత రామ హృదయము కరుగక మానదు. ఇదియే మన కర్తవ్యము. లోకోద్ధారకుడైన రాముడు లోకుల అభీష్టమును కాదనలేడు కదా, అని ఆ వచ్చిన ప్రజలకు తగిన రీతుల సమాధానములు ఇచ్చెను. ఇంతలో చీకటి పడెను. ప్రజలను వారి వారి గృహములకు వెళ్ళమని నిషాదపతితో తెలిపి, ఆ రాత్రి నిషాదపతి తెచ్చిన ఫలములను భుజించి రాత్రంతయూ రామ విషయములనే మాటలాడుతూ కాలము గడిపిరి.

తెలతెలవారుచుండగనే ప్రజలను మేలుకొలుపమని మంత్రికి తెలిపి,

తమ్మునితో, తల్లులతో పవిత్ర గంగాస్నానము నాచరించి ముందు కొనసాగించ వలసిన ప్రయాణమునకు సిద్ధపడిరి. నిషాదపతి పడవలను తగినన్ని యేర్పాటు చేసి అయోధ్యా ప్రజలను రథములనూ, గుఱ్ఱములనూ అన్నింటినీ దాటించెను. అటువైపున చేరినతరువాత అందరూ వచ్చినదీ లేనిదీ ఒకపరి విచారించి, నిషాదపతి మార్గమును చూపించుచుండ భరతుడు పరివారముతో అతనిని అను సరించెను.

బ్రాహ్మణులు, వసిష్ఠులవారు ఒక గుంపుగా, ప్రజలందరూ ఒక గుంపుగా, కొంతదూరము నడిచిరి. మూడవ యామమునకు భరతుడు పరివారముతో ప్రయా గకువచ్చి చేరిరి.

భరతుడు యేనాడునూ యింతదూరము పాదచారియై ప్రయాణము చేయ నందున పాదములు బొబ్బలుకట్టి చితికి మంటలు పెట్టెను. అయిననూ, వాటిని లెక్కచేయక తన బాధల నన్నింటినీ, రామబాధగా భావించెను. ఈ విధమైన బాధలు రాము డెన్నివిధములుగా అనుభవించెనో అని రామప్రేమను తలంచుచు, తన ప్రేమను మరచెను.

అందరూ పవిత్ర త్రివేణి స్నానము నాచరించిరి. ప్రయాగవాసులైన వైఖానసులు, బ్రహ్మచారులు, గృహస్థులు, ఉదాసీనులు, దిగంబరులూ, యోగులు, ఋషులు మొదలగు వారందరూ భరతుని చూచి ఆనందించిరి. ఇతని వర్చస్సు శ్రీరామచంద్రుని పోలియున్నది. నిజముగా ఇతనే శ్రీరామచంద్రుడా అన్నట్లు వారి కండ్లకు కనుపించెను; చూచిన ప్రతివారు రెప్పలార్పక నిలిచి చూచు చుండిరి.

రాముని సోదరులైన భరతశత్రుఘ్నులు చతురంగబల సమేతులై తల్లులతో, మంత్రులతో ప్రయాగ చేరుకొన్నారన్నవార్త భరద్వాజ ఆశ్రమవాసులకు తెలిసెను. అంత భరద్వాజ మహర్షి తమ శిష్యులను పంపి ఆశ్రమమునకు ఆహ్వానించెను. మహాఋషి ఆజ్ఞానుసారము భరతుడు తమ్మునితో ఆశ్రమమును ప్రవేశించెను. మునిరాజునకు ఇరువురూ నమస్కరించిరి. అంత భరద్వాజ మహర్షి వారలను లేవ నెత్తి యెంతో వాత్సల్యముతో వారలను దగ్గరకు చేర్చుకొని, కొంత చల్లని పానీయ ములను తెప్పించి ఇప్పించెను.

అయితే మహాఋషి తనను యేమి ప్రశ్నించునో? యేమి అడుగునో? అని భరతుడు లోలోన భయపడుతూ, సిగ్గుచే శిరస్సును వంచుకొని, విచారముగా నుండు నటుల కనుపించెను. అంత మహర్షి భరతుని స్థితిని గమనించి, "భరతా! భయపడ

వక్కరలేదు. నాకు సర్వమూ విదితమే. విధికృతములు ఒకరి అధీనములు కావుకదా! నీతల్లి కోరిన కోర్కెను నీవు తలంచి విచారించ పనిలేదు. ఆమెదోషము ఇందులో యేమాత్రమూ లేదు. దైవ సంకల్పమే ఆమె బుద్ధిని ఆరీతిగా మార్చినది; కైకకు శ్రీరాముడన్న మహా ప్రాణము; అట్టి తల్లి ఇంతటి కఠిన చర్యకు పాల్పడవలెనన్న దైవకృతమే కాని మానవమాత్రుల ప్రయత్నములు కావు.

లోకవాదుక ప్రకారము కైక దోషి; వేదాచార ప్రకారము సరస్వతి దోషి; వీరిరువురు పరమాత్మకు సమ్మతమే; ప్రభువు స్వేచ్ఛానుసారము సర్వమూ జరిగెను, భరతా! నీ నిర్మలకీర్తిని గానము చేయుటవలన లోకములకు వేదములకూ గొప్పవచ్చును.

ఏ కొమారునికి తండ్రి రాజ్యము ఇచ్చిన యెడల వాడే రాజ్యమును చేయుట కర్తుడులని లోకసిద్ధాంతము. అదియే వేదవాక్యము. ఆ సత్యసంధుడు, మహాత్ముడు, దశరథమహారాజు నిన్ను బిలిచి నీకు రాజ్యమిచ్చి రాజ్యధర్మముల ననుసరించి ప్రవర్తింపుమని చెప్పెను. శ్రీరాముని వనగమనము సకలఅనర్థములకూ మూలమయ్యెను. అందులకు లోకమంతయూ విచారించెను. ఇప్పుడు నీతల్లి పూర్వము తాను చేసిన పనికి విచారించెను; ఈ విషయములో నీ అపరాధ మేమాత్రమూ లేదు; నీవు రాజ్యమును యేలిననూ ఫరవాలేదు; నీవు రాజ్యము నేలుచున్నావన్న విషయమును విన్న శ్రీరాముడుకూడా సంతసించును.

అంతేకాదు, నీవు ఇప్పుడు పూనుచున్న పని శ్లాఘనీయము. నీ యుద్యమము సర్వోత్కృష్టము. శ్రీరాముని చరణారవిందములయందు అనురాగము కలిగియుండుటయే సకల సన్మంగళములకు మూలము. భరతా! నీ యంతటి గుణశాలి, అదృష్టవంతుడు, వేరొకడు లేడనే చెప్పవచ్చును. రాముని ప్రియతమ్ముడవనుటలో సార్థక నామమును అందుకొంటివి.

శ్రీరామచంద్రుడు వనమునకు వెళ్ళు మార్గమధ్యమున మన ఆశ్రమమును పవిత్రము చేసెను. ఆనాడు అర్ధరాత్రి వరకూ రామప్రభువు నీ గుణములనే వర్ణించెను. వారు ప్రయాగకు స్నానము చేయుటకు నాతోనే వచ్చిరి. స్నానమాచరించు సమయమున కూడనూ నిన్ను తలంచి, అయోధ్యను విడచునపుడు నా సోదరులైన భరత శత్రుఘ్నులను చూడనైతినని యెంతో విచారించెను. రామునకు నీ పైనున్న ప్రేమ ఇంతయని చెప్పలేను.

అంతే కాదు. అతడు ప్రణతార్తిహరుడు. అతనికి లోకమే కుటుంబము. మూర్తీభవించిన శ్రీరాముని వాత్సల్యమే నీవని నా అభిప్రాయము!

యే విషయమును నీవు కళంకమని తలంచుచుంటివో ఆ విషయము నావంటి వారికి ఉపదేశమనే నాఅభిప్రాయము. భరతా! నీవు చింతించకూడదు. చింతామణిని స్వీకరించి దరిద్రమని తలంచుట మంచిది కాదు. సీతా రామ లక్ష్మణులను దర్శించుటయే సకల సాధనములకు ఫలము. ఆ ఫలము నాకు లభించెను. కన్నులార వారిని చూచితిని; సంభాషించితిని; స్పర్శించితిని; ఆతిథ్యము నందించితిని.

అంతో ఇంతో శేషము కొంత వున్నది. నీ దర్శనముతో పూర్తి అయినది. నేను ధన్యుడను. ఇట్టి మునులను పవిత్ర మొనర్చుటకే రామచంద్రుడు వనవాసము చేసెను. ధన్యులము!

ఈ విధముగ భరద్వాజ మహాఋషి భరతుని అనేక విధముల కొనియాడెను. భరద్వాజుని నేత్రములనుండి ఆనందబాష్పములు యేకధారగా నేల రాలెను. భరత శత్రుఘ్నులు రామప్రేమను తలంచుచూ, వారు యెంతటి అదృష్టవంతులమో అన్న భావమును తమలో తాము తలంచి అట్టి ప్రేమ స్వరూపునికి దూరమైతిమి కదా అని భరించలేని బాధను, తెలుపలేని హృదయముతో విచారించిరి.

భరతుడు గద్గదస్వరముతో మహాఋషులవారికి నమస్కరించి స్వామీ! మీరు త్రికాలజ్ఞానులు, మీవాక్యములు పరమసత్యములు, రామచంద్ర ప్రభువు సమర్థుడు, సర్వజ్ఞుడు. అయినమా తమ సన్నిధియందు పరమ సత్యమునే పలుక తలంచితిని. జనుల మనోభిప్రాయములు రామచంద్ర ప్రభువుకు తెలియును. మాతల్లి చేసిన దుర్వ్యాపారమునకు దుఃఖములేదు, లోకులు నన్ను దూషింతురను భయము లేదు, పరలోకము నాకు దక్కదేమో అన్న విచారము కూడనూ లేదు.

మా తండ్రి కీర్తిమంతుడు. మృతజీవుడు, వారి కీర్తి లోకమంతయూ వ్యాపించెను. ప్రియ పుత్రులైన రామలక్ష్మణులు వారి గర్భమున పుట్టిరి. రామ వియోగ దుఃఖమును భరించలేక క్షణభంగురమైన కాయమును క్షణములో వీడిరి. అందుచేత వారిని గురించి విచారించ పనిలేదు. సీతారామలక్ష్మణులు మునివేషములను ధరించి వనములలో పాదచారులై క్రుమ్మరుచుండిరి. కుశపత్రములే వారి ఆసనములు. తరుచ్ఛాయలే వారి నివాసము. యెండల కెండి వానలకు తడిసి చలిబాధల కోర్చి వనములలో వారు తిరుగుచుండిరి కదా! వారి కష్టములన్నింటికీ నేనే కదా కారణము. ఈ దుఃఖమే దివారాత్రములు నన్ను దహించుచున్నది.

కడుపునకు తిండి కంటికి నిద్రా చేరకున్నది. నా తల్లి యొక్క ఈ కుబుద్ధియే నా ప్రాణముల పాలిటి వజ్రాంగి వంటిదైనది. ఆమె నాకు హితమనుకొని చేసిన పనియే నాకు మహా అహితము, అపకారముగా మారినది నా ఈ బాధ యేమి చేసి

చేసినను తీరదు. దీనికి మందే లేదు. యేనాడు రామచంద్రుడు అయోధ్యకు తిరిగి వచ్చునో ఆనాడే నా యీ బాధ తీరును.

ఇంతకంటే మరొక మార్గము నాబాధను తీర్పలేదు.

ఈ మాటకు చేరిన మునులందరును హర్షించిరి. అనేక విధముల వారతని నుగ్గడించిరి. నాయనా భరతా! ఇకపై యిట్టి విచారమును నొందకుము. శ్రీరామ చంద్రుని చరణకమలములను సందర్శించినంతనే నీ విచారములన్నియు పటాపంచలై పోవును. ఈ విధముగ మునులు భరతుని ఓదార్చిరి.

ఇంతలో భరద్వాజ మహాఋషుల వారు తమ శిష్యుని పిలిచి, భరతశత్రుఘ్నులకు కందమూల ఫలాదులను తెచ్చిపెట్టమని ఆజ్ఞాపించెను. రామ సందర్శనాభిలాషులై అనేక ఇక్కట్లకు సహితము ఓర్చుకొని రామ వియోగ బాధతో కుములుచున్న అయోధ్యా ప్రజలకు, మంత్రులకు పరివారమునకు, తగిన ఆహారములు యేర్పాట్లు చేయునట్లును శిష్యులకు ఆనతిచ్చెను.

గురువాజ్ఞను శిరసావహించి క్షణములో పరివారమునకు, ప్రజలకూ, అందరికీ తగిన రీతిగా మృష్టాన్నములు యేర్పాటు చేసిరి. భరతునకు, శత్రుఘ్నునకూ, వారి కుటుంబము వారలకు మంత్రులకు, పండితులకు, బ్రాహ్మణులకు, అత్యంత వైభవముగా విందులు యేర్పాటు గావించిరి. ముని మహాతపోమహిమతో క్షణములో గావించిన అద్భుతమైన యేర్పాట్లకు భరతుడు సంతసించెను.

అయితే ఈ వైభవములు భరత శత్రుఘ్నులకే కాక, అయోధ్యావాసులకు సహితము తృణప్రాయములవలె గనుపించెను. సుగంధ ద్రవ్యములు, పూలగుచ్ఛములు, ఫలములు, వివిధ రకములైన భోజన పదార్థములు, చూచుటకు చాల వింతగా యుండెను. భరత శత్రుఘ్నులకై యేర్పరచిన రెండు ఉన్నత ఆసనాలను వర్ణించ వీలులేకపోయెను. ముని ఆజ్ఞను శిరసావహించి అయోధ్యావాసులు, పరివారము, మంత్రులు, పండితులు, బ్రాహ్మణులూ అందరూ ఆ సుందరమైన మందిరమున ప్రవేశించిరి. వశిష్టులవారికి, వారి ధర్మపత్నికి ప్రత్యేక ఉన్నతాసనము నేర్పరచిరి. అందులో వారు ఆసీనులైరి. ఇక రాణులు వారివారి స్థానములందు పరదాలలో మహా విచారముతో చేరిరి.

ఇంతలో ముని శిష్యులు, భరత శత్రుఘ్నులను ఆశ్రమ మర్యాదలతో వింజామరలు వీచుచూ, వారిని తోడ్కొని వచ్చిరి. ఆ ఆసనముల చెంతకు వచ్చిన తోడనే, భరత శత్రుఘ్నులు శిరస్సు వంచుకొని నమస్కరించి, ముని శిష్యుల హస్తములందున్న వింజామరలను తీసుకొని రెండు ఉన్నత సింహాసనములకు అటు

ఒకరు ఇటు ఒకరు నిలుచుకొని వింజామరలతో ఆ సింహాసనములకు సేవలుసలిపిరి. చేరిన అయోధ్యావాసులు, యెవ్వరూ ఆసీనులు కానట్టి ఆ సింహాసనములకు సేవ చేయుచున్న భరత శత్రుఘ్నులను చూచి ఆశ్చర్యపడిరి.

ఇంతలో ముని వారలను సింహాసనములపై ఆసీనులు కమ్మని కోరగా, భరత శత్రుఘ్నులు మునికి నమస్కరించి, స్వామీ! యీ స్థానములు, సీతారాములవి కానీ మావి కావు. మాకంతటి అధికారము లేదు. ముని ఆశ్రమములందు లక్ష్మీనారాయణ సమానులైన సీతారాములు మాత్రమే ఇట్టి ఆసనములందు కూర్చొను అధికారులు. మేము వారి సేవకులము. మాకు ఈ విధమైన సేవను చేసి యందించుటకు అనుజ్ఞ ఇమ్మని కోరిరి. ఈ విధమైన మాటలతో అందుచేరిన ప్రజలు, ఋషులు, ముని శిష్యులు, పరమానందపడి భరతశత్రుఘ్నులయొక్క రామభక్తిని వర్ణించిరి; ఆనంద బాష్పములరాల్చిరి. వారి విశ్వాసమునకు మునులు కూడనూ పరమానందపడిరి. తెచ్చి పెట్టిన ఫలహారములు పండ్లు కందమూలాదులను ఆ సింహాసనములకే నైవేద్యముగా నొసంగి అందులో సీతారాముల స్వరూపభావములను చిత్రించుకొని, వారి ప్రసాదములుగా భావించి ఒక్క పర్యాయము ఆ ఫలహారములలో అణుమాత్రము త్రుంచుకొని కన్నుల కద్దుకొని భుజించిరి.

సీతారాముల వియోగబాధతో మేమీ విందులను ఆరగింపలేమనియు ముని వర్యులు క్షమించవలెననియూ ప్రజలూ, పరివారము, భరద్వాజ ఋషులవారిని క్షమాపణ వేడిరి. ముని యెంత వైభవముగా విందు యేర్పాటుచేసిరో అంత అలక్ష్యముగా అయోధ్యావాసులు దానిని తిరస్కరించిరి. ఆరగింప మనస్కరింపలేదనియూ, రామదర్శనమే మాకు అమృతపానమనియూ ఆ క్షణమునకై తహతహలాడుచుండిరి. ముని చేయునదిలేక వారి ఇష్టప్రకారమే అనుమతించెను.

తెలతెలవారగనే అందరు ప్రయాణమునకు సిద్ధమైరి. అందరూ మునివర్యులకు నమస్కరించి సెలవు తీసుకొని ఆశ్రమమును వీడిరి. మార్గమును చూపించు సేవకులు ముందు నడచుచుండ మిగిలిన రథములు, పల్లకీలు వారిని అనుసరించెను. ఈ రీతిగా నడచుచూ, మూర్తీభవించిన అనురాగమే అనునట్లు భరతుడు నిషాదపతి మెడమీద హస్తములు వేసి నడచుచుండెను. పాదములకు రక్షలుకానీ, పైన గొడుగు కానీ లేదు, పెట్టనివ్వలేదు, పట్టనివ్వలేదు, అది వారి వ్రతము, ఒక మేఘము తా పిగ్గుపడి నీడనిచ్చెను. భూమి జాలినొంది మృదుమధురముగా మారెను. వాయువు చల్లని పిల్లవాయువులుగా మారి వీచెను.

ఆ దినము సాయంకాలమునకు యమునా తీరమును చేరి అక్కడ విశ్రమిం

చిరి. రాత్రికి రాత్రి లెక్కలేనన్ని పడవలు యమునా నదిలో కనుపించెను. తెల తెల వారగనే యేక కాలముననే అందరూ నదిని దాటిరి. స్నానములాచరించి అటువై నున నదికి నమస్కరించి ప్రయాణము సాగించిరి. అక్కడనుండి భరత శత్రుఘ్నులు సాధువుల వేషమును ధరించిరి. వారి వెంట మంత్రులు, మిత్రులు, సేవకులు, సీతా రాములను స్మరించుచూ నడిచిరి.

మధ్య మధ్య అడ్డుతగిలిన పల్లెలవారు నదీతీరమునకు జల నిమిత్తమై వచ్చిన స్త్రీలు దుత్తలు క్రింద పెట్టి రెప్పవాల్చక వీరలను చూచుచూ మొన్న వెళ్ళిన రామ లక్ష్మణులే వీరుగా వున్నట్లున్నది. ఆనాడు సీతాసమేతులై వెళ్ళిరి. ఈనాడు చతు రంగబలసమేతులై వచ్చుచున్నారు. సీత యెక్కడున్నదో అని ఆమె నిమిత్తమై అటూ ఇటూ చూచుచూ, వారిలో వారు విచారించుచుండిరి. అయితే ఆ స్త్రీల పలుకు లలో యదార్థము లేకపోలేదు.

ఆనాటి రామలక్ష్మణులు రూపవయశ్శీల లావణ్యములతో కళకళలాడుచుండిరి. వీరి ముఖములు ఖేదముతో కూడియున్నవి. అందుచేత వారే వీరు కాకపోవచ్చునని మరొకరు జవాబు చెప్పుకొనుచుండ పరివారములోని గూఢచారులు విని భరతశత్రు ఘ్నులకు తెలిపిరి. ఇంతలో వారు విచారించిరి. ఈ ఇరువురూ శ్రీరామచంద్రుని సోదరులనియూ, వారు శ్రీరామచంద్రుని సందర్శనార్థమై వెళ్ళుచున్నారనియూ తెలి సికొని అందులో ఒక గడుసు స్త్రీ నిర్దాక్షిణ్యముగా ఈ రీతిగా పలికెను. సఖీ! తండ్రి యిచ్చిన రాజ్యమును యేలుతూ, తానే రాజునై తిసిన్న గడుసుతనముతో, రాములను దర్శించుటకు చతురంగబలసమేతుడై వెళ్ళుటకు సిగ్గులేదు అని అన్నది. అంతలో మరొక స్త్రీ, అక్కా! అట్లనకు. మన దశరథమహారాజునకు అట్టి కఠిన బుద్ధులు గల బిడ్డలు పుట్టరు. చతురంగబలసమేతముగా వెళ్ళి రామచంద్రుని ప్రార్థించి, అయోధ్యకు కొనిపోవుటకై వెళ్ళుచుండవచ్చును, అని అనగనే మూడవ స్త్రీ, అవు నవును. యే పుట్టలో యే పామో, యెవరు చెప్పగలరు. ఎవరెవరి భావములు యెట్టి వున్నతస్థాయిలో వుండునో నిర్ణయించ యెవరి తరము.

రామచంద్రుడు సత్యవాక్పరిపాలుడు కదా! పదునాలుగు సంవత్సరములు పూర్తి కాకమునుపే యెవరువచ్చి ప్రార్థించినా తాను అయోధ్యకు వెళ్ళడనే నా ఉద్దే శము, అని ఆమె ఉత్తమ భావములను ప్రకటించెను. ఈ రీతిగా పల్లె పడుచులు మాట్లాడుకొను విషయములన్నియూ గూఢచారుల వలన భరత శత్రుఘ్నులు వినిరి. రామతత్వమును ప్రజలెంత బాగుగా గ్రహించిరన్న విషయమును తలంచి తమలో తాము ఆనందించిరి.

ఈ విధముగ మార్గమధ్యములందు సంభాషించుచు తన గుణములను రాముని గుణములను భరతశత్రుఘ్నులు వినుచు రాముని స్మరించుచూ నడచిరి. వీరికి ఎదురుగా కొందరు బ్రహ్మచారులు, ఋషులు, మునులూ అత్యంత ఆనంద భరితులై రాముని గుణగణములను వర్ణించుకొంటూ వచ్చుచుండిరి. వారిని చూచి భరతశత్రుఘ్నులు నమస్కరించిరి. వారి రాక యెక్కడనుండి అని విచారించిరి.

అందులో బ్రహ్మచారులు ఉప్పొంగి వచ్చు ఆనందమును అణచుకొనలేక మేము సీతారామలక్ష్మణులను సందర్శించి వచ్చుచున్నామని తెలుపగనే భరతశత్రుఘ్నులు వుద్రేపడి ఆనందబాష్పములను రాల్చుచూ మీరెంత ధన్యాత్ములు. నా సీతారామలక్ష్మణులు యెట్లున్నారు. యెక్కడున్నారు. అని ఆతురతతో వారిని నానావిధముల కుశల ప్రశ్నలు వేసి ఆనందించిరి. అయితే యింకా కొంతదూర మున్నదని విని ఆనాటి రాత్రికి అక్కడ నిలిచిరి.

తెల్లవారగనే చిత్రకూట పర్వతమునకు సమీపమునందే వున్నామని తెలిసికొని యెప్పుడెప్పుడు రామలక్ష్మణ, సీతా మాతను చూతుమా అని ఉవ్విళ్ళూరుచూ ప్రయాణము సాగించిరి. మధ్యాహ్న సమయమయ్యేటప్పటికి, మందాకినీనదిశబ్దము వినిపించెను. చిత్రకూట పర్వతము కనిపించెను. ఆ పర్వతమును చూచినతక్షణమే అయోధ్యావాసులు, భరత శత్రుఘ్నులు, సాష్టాంగ నమస్కారములు గావించిరి. మార్గాయాసముచే నడువలేనివారు సహితము ఏనుగంత బలమును పొంది త్వర త్వరగా నడువసాగిరి. వారి దేహములను ఏ మాత్రమూ లెక్కచేయలేదు. పల్లకి మోయువారల పాదములు రక్తములు కారుచున్ననూ, వారేమాత్రమూ లెక్కచేయక రామ సందర్శన నిమిత్తము, జయ జయ నాదములు పలుకుచూ రామా! రామా! అని స్మరించుచూ తీవ్రముగా నడువ ప్రారంభించిరి.

ఆనాటి తెల్లవారక మునుపే రాముడు మేల్కొని, ఈనాడు తండ్రిగారు అమితముగా తలపునకు వచ్చుచున్నారని సీతతో తెలిపెను. అంతలో సీత, నాథా! నాకు స్వప్నములు యేనాడుమా రావన్న విషయము నాకు తెలును. అయితే రాత్రి, చాలా వింతైన స్వప్నము వచ్చెను. అది స్వప్నము కాదనే చెప్పవచ్చు. మీ వియోగ దుఃఖముచేత భరతుడు శత్రుఘ్నుడు కృశించినటులను వారు క్షణమైననూ అయోధ్యలో ఉండుటకు ఇష్టపడక మనచెంతకు వచ్చినటులను, వారితో అయోధ్యావాసులే కాక, రాణులైన కౌసల్యా, సుమిత్రా, కైకేయిలు కూడా మనచెంతకు వచ్చినటులను చూచితిని, అని కన్నీరు కార్చెను.

అంత లక్ష్మణుని పిలిచి తమ్ముడా సీత స్వప్న వృత్తాంతమును వింటివిశధా,

ఇది సుఖసూచన కాదు. మిగిలిన వారందరూ సీతకు కనుపించినారు, తండ్రి మాత్రమే నాకు కనుపించినారు. వీరందరితో సంబంధము లేక తండ్రి వేరుగా వుండినటుల కనుపించుట అశుభముగా వున్నది అని, అశుభమని తలంచిన తక్షణమే మనము స్నానము చేయుట మంచిదని తలంచి ముగ్గురూ స్నానము చేయుటకై నదికి వెళ్ళిరి. ఇంతలో ఆకాశమున పక్షులు గుంపులు గుంపులుగా యెగిరినవి. ఉత్తర దిక్కున ధూళిచే కప్పబడెను. అనేక ఖగమృగములు అరచుచూ అటూఇటూ పరుగెత్త జొచ్చెను. ఇంతలో దీనికి కారణమేమని విచారించి లక్ష్మణుడు యెత్తైన వృక్షమును ఎక్కి చూచెను. యేదో చతురంగ బలసమేతుడై రాజు వచ్చుచున్నట్లు గుర్తించెను. ఆవార్త రామునకు తెలిపెను. ఇది సీత స్వప్నదృశ్యమే అయివుండునని లక్ష్మణునికి తెలిపి త్వరగా పర్ణశాలకు వెళ్ళుట మంచిదని తెలిపెను.

ఇంతలో భిల్లులూ,కిరాతులూ, వనవాసులూ పరుగెత్తుకొనివచ్చి, రామా ఎవరో రాజు చతురంగ బలసమేతుడై వచ్చుచున్నాడనియూ, ఆ రథమునకు ఒక పతాకమున్నదనియూ, ఆ పతాకము అవిశిచెట్టు గుర్తుగా వున్నదనియూ తెలిపిరి. సీతారామలక్ష్మణులు నిస్సంశయముగా అది భరతుని రథమని తెలిసికొనిరి. ఇంతలో లక్ష్మణునికి పళ్ళుమండెను. రామ దర్శనార్థమై మనవాడైనా చతురంగబలసమేతుడై వచ్చునా? ఆదుర్మార్గురాలైన తల్లిమాటలువిని రామునితోపోరాడిరి. శాశ్వతంగా రాముని అయోధ్యలో అడుగు పెట్టనివ్వకుండచేయు నిమిత్తమే వచ్చుచుండునని తనలో తాను తలంచి మండిపోయెను.

కండ్లెఱ్ఱనాయెను. పలుకులు కటువుగా మారెను. రాముడు గ్రహించి "లక్ష్మణా! శాంతింపుము. భరతుడు గుణశాలి, అతనిప్రేమను యెవ్వరునూ వర్ణించలేరు. ఇక్ష్వాకుల వంశమను కొలనుకు భరతుడు తామరపుష్పమువంటి శోభను కలిగించును. అట్టి పవిత్రునిమీద అపవాదులు వేయుట న్యాయముకాదు" అని భరతుని భావములను వర్ణించుచు లక్ష్మణుని శాంతింపజేసెను.

ఇంతలో భరతుడే శత్రుఘ్న సమేతుడై, పరివారముతో రామదర్శనార్థమేతెంచుచుండినటుల అడవి కోయల ద్వారా తెలిసెను. ఆ సుమంగళ వర్తమానము విని రామచంద్రుడు సంతోషించెను. శరత్కాల సరోరుహముల వలే కమలలోచనములు జలపూరితము లయ్యెను.

రామలక్ష్మణులు స్నానసంధ్యాదులు ఆచరించి పర్ణశాలకు వచ్చునప్పటికి భరత శత్రుఘ్నులు వారినిచూచి రామా, రామా అని పరితపించుచూ పరువులిడుచూవచ్చి రాముని పాదములపై బడి విలపించిరి. వారి వియోగపరితాపమును

గమనించిన లక్ష్మణుడు, తను తలంచిన భావములు తప్పనితెలిసికొని తనలోతాను బాధపడెను.

భరత శత్రుఘ్నులతోపాటు తాను కూడనూ కంటిధారలు కార్చుచూ విచారముతో తలవంచుకొనెను. రామచంద్రుడు సోదరులైన భరత శత్రుఘ్నులను ఓదార్చుచూ శాంతింపజేయుచుండగనే, చతురంగబలముతో తల్లి కౌసల్య, సుమిత్ర కైకేయితో మంత్రిలు, గురువుగారైన వశిష్ఠులవారూ, బ్రాహ్మణులూ, పండితులు, రామచంద్రుని చూచినతోడనే, ఒకవైపున దుఃఖమును, మరొకవైపున ఆనందమును భరించలేక ఆనంద దుఃఖ మిశ్రితమైన రోదనలు సలిపిరి. అరణ్యమంతయూ దద్దరిల్లినట్లు, రామా, రామా అన్న పలుకులు మిన్నుముట్టెను.

రామచంద్రుడు అందరినీ క్షేమసమాచారములు విచారించి ఓదార్చి నెమ్మదిగా తల్లుల దగ్గరకు వెళ్ళి అమంగళముగా వున్న దృశ్యములను చూడలేకపోయినాడు. కారణమును తెలిసికొని, తండ్రిలేని కొరతకు కొంత విచారించి, లక్ష్మణుని పిలచి, విషయములను తెలిపెను. అయితే లక్ష్మణుడు విషయమును విపులముగా తెలిసికొనిన మంచిదనితలంచి, సుమంతునితో అయోధ్యా పరిపాలన విషయమును, దశరథుని వార్తలను తెలియజేయుమని కోరెను.

అంత సుమంతుడు పట్టరాని దుఃఖముతో నేలకూలి, "లక్ష్మణా! ఇంకెక్కడి దశరథుడు, మీ వియోగబాధతో భస్మమయ్యెను. అయోధ్య అరణ్యముగా తయారయినది. ఎందుచూచినా విచారమే, యెక్కడచూచినా రోదనే. కేవలము జనులే కాక, పశు, పక్షి, మృగాదులు సయితము మీ వియోగముతో ప్రాణములు విడచినవి. మిగిలినవి మీ రాకకై నిరీక్షించుచున్నవి," అని తెలుపుచుండగనే లక్ష్మణుని కంటిధారలు జలజల వ్రాలెను; స్తంభించిపోయెను.

మారుమాటాడక రామునిచెంతకు వచ్చి ఇంత ఘోరము సంభవించునని కలయందైననూ తలంచనైతిని, తండ్రిని అంత్య సమయమందైననూ చూడనైతిమి, అని బాధపడుచున్న లక్ష్మణునిచూచి, రాముడు "జరిగినదానికి చింతించనక్కరలేదు. కాయములు నీటి బుడగలు. అవి అనిత్యములు. నేడుకాకపోయినా రేపటికైననూ పీడకతప్పదు." అని నీతివాక్యములను బోధించి స్నానమాచరించుటకై నదికి వెళ్ళిరి.

ఇంతలో జానకి అత్తలను దర్శించి పాదములకు నమస్కరించి, గురుపత్ని పాదములకు నమస్కరించి, పురస్త్రీలను ఆదరించి సత్కరించినది. సీతను చూచిన క్షణమే అత్తలు గొల్లున యేడ్వసాగిరి. పురస్త్రీలు కూడను ఆ సుకుమారసుందరి

దుర్దశను చూచి భరించలేని దుఃఖముతో విలపించిరి. దశరథమహారాజు స్వర్గస్థుడైన విషయమును తెలిసికొని జానకి పునః పునః అత్తలకు నమస్కరించుచూ, అయ్యో నేనెంతటి దురదృష్టవంతురాలను, మాపైగల ప్రేమచేకదా మావియోగమును భరించలేక మహారాజు ప్రాణములువీడెను. అనుచు వజ్రమువలే హృదయమును భేదించునట్టి దుర్వార్తను వినిన జానకి రాణులతోగూడి యేడ్వసాగెను. ఆనా డందరూ నిర్జలోపవాసమును మాత్రము జేసి, విచారముతో కాలము గడిపిరి.

అంత రెండవ దినము ప్రాతఃకాలమయ్యెను. అపుడు గురువుగారి ఆజ్ఞ ప్రకారము రాముడు భక్తిశ్రద్ధలతో పితృకార్యమును శాస్త్రోక్తముగా గావించెను.

"గంగేచ యమునేచైవ, గోదావరీ, సరస్వతీ, నర్మదే, సింధు, కావేరి, జలేఽస్మిన్, సన్నిధిం కురు" అని చెప్పుటవలన, తీర్థము పరిశుద్ధమగునట్లు శ్రీరాముడు స్వయముగ జేయుటవలన, పితృకార్యములకు పవిత్రత వచ్చెను.

రామలక్ష్మణులు, భరతశత్రుఘ్నులు, తల్లులతో, సీతామాతతో, పురజనులతో, గురువుగారైన వశిష్ఠమహర్షితో రెండుదినములు కాలము గడిపిరి. రెండు దినములు గడచిన తరువాత శ్రీరాముడు గురువుగారిచెంతకు వెళ్ళి, స్వామీ! ఈ ప్రజలందరూ కందమూల ఫలములు భుజించి, జలము ద్రావి కడుకష్టములు పడుచున్నారు. భరత శత్రుఘ్నులను, తల్లులను చూచినతరువాత నొకనిమిషము ఒక యుగముగ కనుపించుచున్నది. తాము దయయుంచి నగరమునకు వెళ్ళుట మంచిది. తామందరూ ఇచట ఉండిరి. మహారాజు స్వర్గస్థుడయ్యెను; నేను విస్తరించి చెప్పుట భావ్యముకాదు. ఉచితమగునట్లు వ్యవహరింపుడు అని నమస్కరించెను.

అంత వశిష్ఠులవారు "రఘునాధా! ఎందులకు నీవిట్లు పలుకుచున్నావు. రెండు దినములనుండీ ప్రజలు నీ ముఖారవిందమును చూచి యెంత సంతోషించుచున్నారో యోచించవైతివి." అని పలికెను.

ప్రచండవాయువు వీచినపుడు సముద్రముపై పోవుచుండిన పడవ తల్లడిల్లు విధమున శ్రీరామవచనములను విని జనులు వ్యాకులులయిరి. అనుకూలవాయువు వీచినపుడు పడవ నిరుపద్రవముగా పోవునట్లు మునీశ్వరుని మంగళవచనములను విని స్వస్థచిత్తులయిరి. మందాకినీనదిలో త్రికాలములూ స్నానముచేసి, సాత్వికమైన, విరివిగా లభించు వివిధఫలములను భుజించుచూ, సీతా రామ లక్ష్మణులను కన్నులారా చూచుకుంటూ, నిత్యమూ రామ సంభాషణలతో అయోధ్యనేమరచి హాయిగా వున్న జనులకు అయోధ్యకు తిరిగివెళ్ళుటకే మనసొప్పకుండెను.

సీత అత్తలను సేవించుచూ, వారల నోదార్చుచూ, తాను అరణ్యమున సమస్త

సుఖములతో ఎట్టి కొరతయూలేక హాయిగా జీవితము గడుపుచున్నానని అత్తలకు యెంతో ధైర్యమును తెలుపుచూ వర్తించుచున్న సీతపలుకులు అత్తలకు ఆశ్చర్యము కలిగించెడివి, ఆనందము నందించెడివి. సీత గుణగణములు వారికి అమితమైన ధైర్యము నందించెడివి.

భరతునకు రాత్రి నిద్రకానీ పగలు ఆకలికానీ లేదు. ప్రజలెంత రాముని చూచి సంతసించుచున్నారో, భరత శత్రుఘ్నులు రాముని చూచి అంత విచారించు చుండిరి. భరించలేక ఇక కాలమును వృథాగడుపుటకు మనస్కరించక, గురువుల పాదములపైబడి రామచంద్రుని సీతాసమేతముగా అయోధ్యకు వచ్చునట్లు చేయ వలెనని ప్రార్థించుచూ, అనేక విధముల బ్రతిమలాడిరి. వారి వియోగ, విలాస మును గమనించి, గురువులకు శ్రీరాముని తత్వము తెలిసినప్పటికినీ రాముడు పితృ వాక్యపరిపాలనలో యేమాత్రమూ మార్పుచేయడని, ఆడినమాట తప్పడని యెరి గియూ, భరతుని తృప్తికై, రాముని చెంతకు రప్పించుకొని, "ఓ రామా ! భర తుని విన్నపమును ఆలకింపుము.

సాధు సమ్మతమును, లోక సమ్మతమును, రాజనీతి కనుగుణ్యముగను వేద సమ్మతమగునట్లు సంచరింపుము" అని వశిష్ఠులవారు ఆజ్ఞాపించిరి. గురువునకు భరతుని మీదనున్న వాత్సల్యమును రాముడు గమనించెను. మరింత ఆనందముతో, భరతుడు ధర్మదురంధరుడనియు, మనోవాక్కాయ కర్మలచే అతను తన సేవకు డనియూ, తన కనుకూలముగా ప్రవర్తించుననియూ, రామునకు తెలియును. గురువాజ్ఞ ననుసరించి మృదుమధురమగు మంగళవాక్యములను శ్రీరాముడు పలికెను.

"స్వామీ ! మీరేసాక్షి, తండ్రి పదములే సాక్షి ! లోకములో నాకు భరతుడువంటి తమ్ముడు మరొకడు లేడు. గురుని చరణములయందు అనురాగము కలవారు అదృష్టవంతులు. మీకు అతనిమీద యింతదయకలదు కనుక అతని అదృష్టము నెవరు చెప్పగలరు. నాకంటే భరతుడు చిన్నవాడు. అతని ముఖము నెదుట అతనిని స్తుతించుటకు సంశయించుచున్నాను. భరతుడు చెప్పినటుల నడచు కొనుట, యుచితమని నా అభిప్రాయము," అని నమస్కరించి కూర్చొనెను.

అపుడు మునిరాజు భరతునితో నిట్లు పలికెను, "ఓ భరతా! అన్ని సంశయము లను విడచి, ఆ దయాసోదరుడు శ్రీరాముడు, నీ జ్యేష్ఠభ్రాత, నీ మనోభిప్రాయము నతనితో జెప్పుము" అనెను. భరతుడు ముని వచనములను విని రాముని చిత్తమును కనిపెట్టి వారిరువురు తనయందు అనుకూలముగా నుండిరని తెలిసికొని, సంతసించెను.

సభలో అతడు నిశ్చేష్టుడై నిలువబడియుండెను కమలములవంటి అతని నేత్రములనుండి నీరు కారుచుండెను. "చెప్పవలసినవన్నియూ మునివర్యులే చెప్పిరి. నేను ప్రత్యేకించి చెప్పున దేమున్నది ? నా రాముని స్వభావము నాకు తెలియును. అపరాధము చేసినవారిని సయితము తాను కోపించడు. వారికి నా మీద అమితముగా వాత్సల్యము కలదు; దానిని కాదనను. అనురాగముచేతను, సిగ్గుచేతను నే నింతవరకు వారియెదుట నిలిచి, వారితో నొకమాట జెప్పియుండలేదు. అనురాగముచే వారిని చూడగోరుచుండిన నా నేత్రము లింతవరకు వారిని చూచిననూ తృప్తి బొందలేదు.

నా అనురాగమును చూచి, బ్రహ్మ భరించలేక నా తల్లిద్వారా నాకీ కష్టము తెచ్చిపెట్టెను. ఈ మాట చెప్పుట చేత నాకు ఘనతలేదు. నా తల్లిపై నేరమును మోపుటచే నాకేమి గొప్పగలదు ? ఎవరికి వారు నిర్దోషినని చెప్పుకొనుటవలన నిర్దోషి అగునా ? నా తల్లి మందమతిఅనియూ, నేను సాధువుననియూ, బుద్ధిమంతుడనియూ చెప్పుకొనుటకు నా హృదయములో నాకే సందేహము పుట్టుచున్నది.

సరోవరములో నుండిన నత్తగుల్లలో ముత్యములు పుట్టునా ? నా దుఃఖమునకు యితరులను దూషించుట యుచితము కాదు. సముద్రమువలె నా నిర్భాగ్యమపారము. ఇదంతయూ నా పాపఫలము. నేను నలువైపుల మార్గము వెతుకుచుంటిని. ఒక మార్గము తప్ప మరియొకటి కానరాదు.

నా గురువులు వశిష్టులు. నా ప్రభువులు శ్రీ సీతారాములు. కావున పరిణామమున శుభము కలుగునని నా నిశ్చయము. నేను వేరుకోరను. కోరలేను. ప్రభూ! రామచంద్రా! నీ దాసునియొక్క ప్రార్థనను మన్నింపుము!

రామలక్ష్మణ భరతశత్రుఘ్నులు, నలుగురు దశరథ మహారాజునకు కామపుత్రులే. తండ్రి ఆజ్ఞను శిరసావహించుట నలుగురికీ సమానమే. పుత్రవాత్సల్యము తండ్రికి సమానము, కాన తండ్రిఆజ్ఞను వీరే పాలించవలెను. వారే పాలించవలెను, అను నియతికి స్థానము లేదు. కాన, తండ్రి ఆజ్ఞను పాలించుటలో నీవింతవరకూ బాధ్యతను వహించితివి. ఇకపై సీతా లక్ష్మణ సమేతుడై అయోధ్యచేరు. నీ భాగమును నేను, శత్రుఘ్నుడును అరణ్యమున మిగిలిన కాలమును గడుపుదుము." అని పాదములపై వ్రాలెను.

భరతుని ఈ విజ్ఞానమును గమనించి, వశిష్టులవారు ఆనందబాష్పములు రాల్చెను. శ్రీరాముడు, ఈ యుక్తికి చిక్కక, "భరతా! నీ ఆలోచన అంత సముచితమైనది కాదని నాకు తోచుచున్నది. దీనిని తప్ప అన్యమైనదేదైననూ కోరు"మని

సెలవిచ్చెను. అంత భరతుడు, "అన్నా! అటులయిన తమ్మునితోపాటు నేనుకూడా లక్ష్మణునివలే తమ సేవచేసుకుంటూ ఈ పవిత్ర వనవాసమును అనుభవించుటకు అనుజ్ఞ ఇమ్మ"నెను. అందులకుకూడా రాముడు సమ్మతించక, "భరతా! నాకూ నీకూ తండ్రిఆజ్ఞ శిరోధార్యము. నీకుఇచ్చిన ఆజ్ఞను నీవును,నాకు ఇచ్చిన ఆజ్ఞను నేనునూ నెరవేర్చుట అన్నిటికంటె యుత్తమమైన పని" అని, "ఈ విధముగా కాలహరణము చేసి ప్రజలను దుఃఖములపాలుచేయక నీకు అందించిన అయోధ్యను నీవు ధర్మముగ పాలించు; నాకు అందించిన అరణ్యపాలన నేను నీమబద్ధముగా ఆచరింతును," అని మారు మాటాడుటకు చోటులేక ఆజ్ఞాపించెను.

అంత భరతుడు భరించలేని దుఃఖముతో ఏ నాతల్లి శ్రీ సీతారామలక్ష్మణులను శత్రువులని భావించెనో అట్టి తల్లి కుమారుడయిన నన్ను భగవంతుడు విడిచి పెట్టి, మరి యెవ్వని సహింపరాని దుఃఖముల పాలుపెట్టును.

అన్నా! శ్రీ సీతారామలక్ష్మణులు వనవాసము చేయుచున్నారని వినినను, పాదములకు రక్షలులేకయే పాదచారులై వనము వెళ్ళిరనియు శూలములవలే తగులుచుండిన ఈ సమాచారములు వినీ నూ నా ప్రాణములు నిలిచియుండెను. వీనికి నేను కారకుడు కానియెడల నేనితఃపూర్వమే శరీరమును విడచియుందును. నేను రఘురామునికి శత్రువని తలచి, స్నేహముచే, నిషాదపతి నాతో యుద్ధము చేయుటకు సిద్ధపడినపుడుకూడా నా ప్రాణములు పోలేదు! వజ్రముకంటే నా హృదయము కఠినము కనుక వ్రక్కలు కాలేదు!

నేను వినియుండిన సంగతులను ఇపుడు కన్నులార గాంచుచున్నాను; అయినను నా జీవితము కష్టజీవితము కనుక యింత దుఃఖమును సహింపగలిగెను. యే నా తల్లినిచూచి సర్పములు, వృశ్చికములు వానివాని విషమును విడిచిపెట్టునో అట్టి తల్లికి కుమారుడైన నన్ను భగవంతుడేల విడువడు?" అని తనను తాను నిందించికొనుచు, తన జీవితమునే అసహ్యించుకొనుచున్న భరతుని మాటలను వ్యాకులమును, దుఃఖమును, వినయమును,అనురాగము, చాతుర్యమును సఖికులూ, రాణులూ విని తుషారముపై పడిన కమలములవలె శోకసంతప్త మానసులయిరి. అనేకపురాణ కథలను చెప్పి ముని భరతునికి బోధించి వోదార్చెను.

అంత రామచంద్రుడు, తమ్ముడా! వ్యర్థముగా నీవు విచారింపనేల? కర్మగ్గతులననుభవింపకతప్పదు. త్రికాలములలోను, త్రిలోకములలో నూవుండిన పుణ్యశ్లోకులందరు నీ అధీనులని నా అభిప్రాయము. నీవు కుటిలుడవని దూషించువారు ఇహ పరలోకములకు దూరస్థులు కాగలరు. సాధు సమాజములో కాని, గురువుల

వద్ద కాపీ శిక్ష పొందని మూర్ఖుడే మన తల్లిని దూషించును. నీ నామమును స్మరించిన మాత్రమున సకల దుర్గుణములు దూరమగును. నీవి లోకానికి కీర్తియు, పరలోకమునకు సుఖమును అందింతువు.

ఈభూమి నీవలననే నిలవబడుచున్నది. వైరమూ, ప్రేమయు దాచియుంచినమా దాగియుండవు. నీసంగతి నాకు బాగుగా తెలియును. సత్యవాక్యమును విలబెట్టుటకు రాజా నన్ను విడచిపెట్టెను నాయందుగల ప్రేమచేత వారు ప్రాణములు కోల్పోయిరి. అట్టి ప్రియమైన తండ్రి వచనముల నుల్లంఘించుట నీకోటి నాకోటి పుత్రులకు భావ్యముకాదు. నీవుసంశయించక చెప్పవలసిన మాటలేవో చెప్పి, అడుగవలసినవిషయములనుఅడిగి,నీవునీబాధ్యతను నిర్వర్తించుటమంచిదనిగట్టిగా తెలిపెను.

మాటాడుటకు వీలులేక కడపటి కోరికగా ఒకదానిని కోరుటకు భరతుడు నిశ్చయించుకొని, "రామా! ఏరాజ్యము నిన్ను అడవికి పంపెనో, యేరాజ్యము నన్ను అపకీర్తులకు గురిచేసెనో, ఆరాజ్యము నీకక్కరలేదన్న, నాకునూ అక్కరలేదు. నేను నీఆజ్ఞను, నీ సంకల్పమును, యేనాటికినీ కాదనను, కాదనలేను. మీ చిత్తమునకు క్షోభ లేకుండ నన్ను కటాక్షించినట్లయిన నేనెంతయో ధన్యుడను.

ఇంతకాలము తమ సేవజేసి ధన్యుడయినాడు కనుక, లక్ష్మణుని, శత్రుఘ్నుని అయోధ్యకు పంపి, నన్ను తమ పాదములచెంత వుంచుకొనుడు. అపుడు ఇరువురికీ సత్కీర్తి. లక్ష్మణుడు పరిపాలనాదక్షుడు. కనుక, అన్నివిధములా తండ్రిగారి ఆత్మకు తృప్తి కలుగునటుల అయోధ్యను పాలించగలడు. ఈ కోరికను మన్నించి, కాదనక నన్ను కాలదన్నకుడని ప్రార్థింతును," అని పాదములపై బడెను. లేక, మీరు సీతాసమేతులై అయోధ్యలో వుండుడు; మేము ముష్వురన్నదమ్ములము వనమునందు నివసింతుము. ఏ ప్రకారము మీ చిత్తమునకు సమాధానమగునో ఆ ప్రకారము వ్యవహరింతుము. ఇంత భారమును నాపై మోపిన నేను జీవించలేను. తమ పాదములచెంత వుంచుకొని, ఇంతకు వేయిరెట్లు భారమును నా శిరస్సుపై మోపిననూ నేను ఆనందముగా అవలీలగా భరించగలను.

రాజధర్మముగాని, న్యాయశాస్త్రమునుగాని నే నెరుంగను. దుఃఖములో మునిగినవానికి జ్ఞానము శూన్యమన్న విషయము తమకు తెలియనిదికాదు. ప్రత్యుత్తరమివ్వు సేవకునిచూచి సిగ్గుకూడా సిగ్గుపడును! ఓరామచంద్రా! నేను హృదయమును విప్పి పలుకుచున్నాను. లోకమునకు మంగళమగుగాక, మీరు సందేహమునువీడి, ప్రసన్నులై యెవరికి యే విధమైన ఆజ్ఞచేతురో ఆవిధముగ మేము తమ ఆజ్ఞను శిరసావహింతుము."

భరతుడు ఆడిన యీ మాటలు సభికులకు పరమానందము కలిగించెను. హృదయములను కరిగింపజేసెను. భరతునకు రామునియందుగల ప్రేమ, భక్తి విశ్వాసములు, వేనోళ్ళ కొనియాడిరి. ప్రజలందరూ ఒక్కపరి, "ఓ రామప్రభు! భరతుని ప్రార్థనను మన్నింపుడు, ప్రాచీనమగు కుశలమంతయు దశరథ మహారాజు గారిమరణముతోనేగతించెను. అందుచేతలోకముఅనాథయయ్యెను.అయోధ్యానగరము దిక్కులేనిదై విలపించుచున్నది. నాథుడులేని పతివ్రతవలె దుఃఖించుచున్నది" అనిరి.

ఇంతలో కైకేయి నేనేమి చెప్పగలను, ఎవరిపై దోషమును నిరూపించ గలను, అని కుటిలురాలగు రాణి లోలోన విచారించి రాముడు వంటరిగా చిక్కిన తన పాపమును మన్నించమని కోరుకొనుటకు యెన్నోవిధముల వేచెను. రామునకు ముఖము చూపుటకుకూడా సిగ్గుపడెను. తన కొమారునికంటే అధికముగా రాముని ప్రేమించుచుండిన కైకకు ఈవిధమైన విపరీతవాంఛ వచ్చుటలో తన లోపము కాదనియూ ప్రాణసమముగా ప్రేమించిన రాముని అన్నివిధములైన బాధలకు గురి చేసినది యేదోఒక శక్తి తనలోచేరి చేయించినదేకాని, తాను కాదని దృఢముగా తెలిపికొని, తానెంత ధైర్యమును తెచ్చుకున్నను, లోకులు నా మాటలను నమ్మరు కదా, అని తనలోతాను సంశయించుచూ, ముందుకుపోలేక, వెనుకకుతిరుగలేక కృంగి కృశించి పోవుచున్న కైకమనసును గమనించి, రామచంద్రుడు సమయమును చూచి కైకకు నమస్కరించుటకు వెళ్లెను.

అదియే సమయమని తలంచి, కైక రాముని పాదములు పట్టి "నాయనా! నీవు నాకు చిన్నవాడవు. కుమారుడవు, అయిననూ గుణములలో, జ్ఞానములో లోకమునకే అధికారివి ! ప్రభుడవు ! కాన నీ పాదములు పట్టిననూ దోషములేదు. నా పాపమును క్షమించి, నీవు అయోధ్యనేలుము. నాకు సంప్రాప్తమైన అపకీర్తిని నివారింపుము; లేదా భరతుని నీతో వుంచుకొని నీ పాదసేవా భాగ్యము నొసంగుము ! నేనిక జీవించకపోయిననూ నాకు మనశ్శాంతి లభించును.

మహాకిరాతకులు కూడనూ కోరనికోరికను నేను కోరితినన్న నాకే ఆశ్చర్యముగ నున్నది. నిజముగా నేను కేకయ రాజపుత్రినై కోరితినా ? లేక యేదైనా గ్రహమావరించి నానుండి ఆ పలుకలు పలికించెనా ? నాకు తెలియ కున్నది." అని రెండుచేతులు పట్టుకొని కైక విలపిల్లుచుండుట రాముని గుండెలను పిండ గావించెను. అంత శ్రీరాముడు "అమ్మా! ఇందులో నీదే మాత్రము తప్పులేదు. లోకులు కాకులు. సత్యమును గుర్తించక పలువిధముల పలుకుదురు. నీవు బుద్ధిపూర్వకముగా కోరిన కోరికలు కావు.

నా సంకల్పమే ఈరీతి గావించినది. నే నవతరించిన కార్యమునకు నే సంకల్పించిన పనికి, మీ రెంతయో ఉపకారమొనర్చితిరేకాని అపకారముకాదు. ఇందుకు నేను మీకు కృతజ్ఞత చెప్పవలసినది పోయి, మీతో నే నింతగా అడిగించుకొనవలసి వచ్చినందుకు నే నెంతయో చింతించుచున్నాను! మీరు దుఃఖించిన నా కార్యము అశుభమగును. కావున నన్ను అనుగ్రహించి, నాపై వాత్సల్యమును చూపుచు, ఆశీర్వదింపుము" అని రాముడు కైకేయి పాదములకు నమస్కరించెను.

రాముడట్లు చెప్పుటచేత కైకేయికి కొంత శాంతి కలిగెను. వారిరువురి సంభాషణలు చెంతనేవుండి వినుచున్న కౌసల్యా సుమిత్రలు ఇందులో కైకదే మాత్రము దోషము లేదనియూ ఇది దైవసంకల్పమేననియూ గ్రహించి చెల్లెలైన కైకను అనేకవిధముల ఓదార్చిరి. అయిననూ కైక పట్టు విడువక "రాముడు మహారాజు, సీత మహారాణి కాకతప్పదు. నా కొమారులు భరత శత్రుఘ్నులు, లక్ష్మణ సమేతులై సీతారాములకు సేవలు చేయుచుండ ఈ కన్నులతో చూచి ప్రాణము విడువవలె" నని పదే పదే పలుకుతూ వచ్చెను.

ఈ విధముగ, ఒకరినొకరు ఓదార్చుకొనుచూ విలపించుచూ, రాముని అయోధ్యకు రమ్మని ప్రార్థించుచూ రేయిపగలనక రామపాదముల చెంత అడవిలో అయోధ్యావాసులు నాలుగుదినములు కాలము గడిపిరి. కడకు రాముడు అయోధ్యావాసులను అయోధ్యకు తీసుకొనిపొమ్మని గురువునకు, భరతునకు ఆజ్ఞ చేసినటుల ప్రజలు, స్త్రీ పురుషులు, పండితులు విని, భరించలేని బాధతో, "మనము సీతారాములను అయోధ్యానగరమునకు తీసుకొని వెళ్ళినగాని వుచితముగ నుండును; లేక, సీతారాములతో కూడి వనవాసము చేయుటయే కోటి స్వర్గములకంటె సుఖదాయకము. ఎట్టివారైనను సీతారామలక్ష్మణులను విడచి నగరమునకు వెళ్ళ ఇచ్ఛగించరు. అట్లు ఇచ్ఛగించిరేని వారియెడల విధాత ప్రతికూలుడుగా నుండెనని తలంచవలెను. ఆహా! మందాకినిలో స్నానము, మధురమైన ఫలముల ఆహారము, కన్నులకింపైన సీతారాముల సుందర దర్శనము, ఇంతకంటె వేరు స్వర్గమెందుకు అని ప్రజలలో ఒకరికొకరు చెప్పుకొనుచు, రాముని అయోధ్యకే గొనిపోవలెనని దృఢము చేసుకొనిరి;

ఈ ప్రకారము ప్రేమపూర్వకమగు వచనములతో, వారి వారి మనోరథములు చెప్పుకొని, ఈ అరణ్యములో శ్రీరామ సన్నిధిలో ఇట్టిశుభము, ఇంతటి సుఖము అనుభవించుటకు మనకు యోగ్యతయుండిన, భాగ్యముండిన, రామచంద్రుడు మన అభీష్టము నంగీకరించును; అట్టి ప్రాప్తియే లేకున్న, మన దుర

దృష్టమే రామచంద్రుని మనసును కఠినపరచి, మనలను తిరిగి అయోధ్యకు వెళ్ళ గొట్టుము. రాముడే అనుగ్రహించకున్న, ఇక అనుగ్రహించువా రెవరు ? అతని చెంతనే కాలము గడుపని జీవితం, మరెక్కడుండిననేమి ? యేమైననేమి ? బ్రతికి చచ్చినవారలతో సమము, అని ఒక పెద్ద వృద్ధ బ్రాహ్మణుడు పలికిన ఈ పలుకులకు అందరూ "నిజమే. నిజమే ! ఈ మాటలు పరమ సత్యములు" అని బలపరచిరి........

కులగురువైన వశిష్టుడు పంపిన దశరథుని మరణవార్త, జనకునికి అందిన క్షణమే, మహారాణిసమేతుడై అయోధ్యకువచ్చెను. అక్కడ విషయములన్నియూ విశదమాయెను. ఇంతలో భరతుడు వచ్చి, రాణులు, గురువు, ప్రజల సమేతుడై, చిత్రకూట పర్వతమునకు రామసందర్శనము గావించుటకై వచ్చుచుండగా, వారితో జనకుడు తన రాణితో చిత్రకూటమునకు వచ్చెను. సమయమును చూచుకొని, సీతా రాములతో మాట్లాడ వేచియుండిరి.

ఇంతలో సీతాదేవి తల్లి చెలికత్తెను పిలిచి కౌసల్యాది మహారాణుల సమయమును చూచి రమ్మని పంపెను. అంత చెలికత్తె కౌసల్యాది రాణులను చూచుటకు వెళ్ళెను. జ్యేష్ట శుద్ధ యేకాదశినాడు మహారాణులు కలుసుకొనిరి. కౌసల్యాదేవి జనకమహారాజు భార్య అయిన సునయనను సన్మానించి, ఆదరించి సమయోచితముగ ఆసనముపై కూర్చుండబెట్టెను.

ఆ మహారాణులను సునయన చూచుట మొదటిసారి కనుక, అనగా సీతా కల్యాణ సమయమున రాణులెవ్వరునూ మిథిలాపురమునకు వెళ్ళలేదు; మిథిలాపుర రాణి అయోధ్యకు రాలేదు. అందుచే వారిరువురూ ఒకరి నొకరు గుర్తించుటకు వీలు లేకపోయెను. అయోధ్యానగర రాణులైన కౌసల్య, సుమిత్ర, కైకేయీలను చూచి సదే, వారల సరసోక్తులను, సౌశీల్యమును, స్నేహమును చూచి కఠినమగు వజ్రము సహితము నీరగును. వారి శరీరములు పులకరించి శిథిలమయ్యెను. వారు కన్నీరు కార్చుచూ నేలను చూచుచూ దుఃఖించుచుండ, సీతారాముల గుణగణములను వారు వర్ణించుచూ పొంగివచ్చు దుఃఖమును ఆపుకొనలేక ఘోరున యేడ్వసాగిరి.

అంత సునయన, యేమి చెప్పుటకు తోచక అమ్మా, విచారించి ప్రయోజనమేమి; విధాతబుద్ధి వక్రమముగా వెళ్ళెను. పాలసురుగును భేదించుటకు వజ్రమును వలె ఉపయోగించెను. అమృతమును వినియున్నాము కాని చూచియుండలేదు; గరళమునే చూచుచున్నాము. కాకులు, కొంగలు, గ్రద్దలు, గుడ్లగూబలను మాత్రమే చూచుచున్నాము కాని, మానస సరోవరములో రాజహంసలు కలవని వినుచున్నాము.

దేవీ ! విధి కృతములు విపరీతములు, విచిత్రములు, విధికృతములు బాలుని చర్యల వలెవున్నవి, అని సునయన ఓదార్పు మాటలతో తానుకూడనూ దుఃఖించ దొడగెను.

అంత కౌసల్య, "అమ్మా ! సునయనా ! ఇది యొకరి దోషముకాదు. సుఖ దుఃఖములు, లాభనష్టములు కర్మాధీనములు. (అవశ్యమేవ భో క్తవ్యం కృతం కర్మ శుభాశుభం) కఠిన కర్మగతులు భగవంతునకు తెలియును. శుభాశుభ కర్మలకు తగిన ఫలము నతడిచ్చును. ఈశ్వరాజ్ఞ శిరస్సు నధిష్ఠించి యుండును. దేవీ, మోహమునకు వశ్యులమై వ్యర్థముగా విచారింతుమేకాని మన పూర్వజన్మ పుణ్యపాపములు యెందుకు దయతలచును. అనాదికాలమునుండీ ఈ ప్రకారము జరుగుచున్న సృష్టి క్రమము మన కొరకై మారునా ? పిచ్చి," అని నిట్టూర్పులు విడచెను.

అపుడు సునయన "అమ్మా మీ రెంతయో పుణ్యాత్ములు. లోకమున దశ రథునికి మించిన పుణ్యాత్ముడు మరొకరు కనుపించరు. అట్టి దశరథునకు అర్ధాం గులై, ధర్మమూర్తి, ప్రేమమూర్తి, విశాలహృదయుడు, సుగుణశీలుడు అయిన శ్రీరాములకు తల్లులై, లోకఖ్యాతిని అందుకొంటిరి. మీమాటలు పరమ సత్యములు. ఎట్టి వారికైనా కష్టసుఖములు కావిడికుండలు. కష్టమే లేకున్న సుఖముయొక్క సుఖము తెలియదుకదా. "న సుఖార్లభ్యతే సుఖం" సుఖము నుండే సుఖమురాదు. లేదుకదా" అని బదులు చెప్పెను.

"సీతారామలక్ష్మణులు వనవాసముచేసిన యెడల నంతమున శుభములు కలుగును, కానీ రాముని వియోగము భరించలేము. భరతుడు జీవించలేడు. సీతా రామ లక్ష్మణులకంటే, భరతునిచూచి నాకు మరింత దుఃఖము అధికమగుచున్నది. భయ మగుచున్నది." అని కౌసల్యగద్గదస్వరముతో పలికెను. ఆ మాటలువిని సుమిత్రా కైకేయీలు "నిజము ! నిజము !" అని వారునూ దుఃఖించిరి.

అంత సుమిత్ర అక్కా ! మీ ఆశీర్వాదముతో మన కొడుకు కోడలును, గంగవలే నిర్మలులు. ఇదివరకు రాముడు తోడని చెప్పియుండలేదు, ఇపుడు రాముడు తోడని సత్య భావముతో చెప్పుచున్నాను. భరతుని గుణశీలమును, వినయమును, వుదారబుద్ధియు, భ్రాతృవాత్సల్యమును, భక్తి శ్రద్ధలను, ధైర్య స్థైర్యములను యంథార్థముగా వర్ణించిచెప్పుటకు సరస్వతి సహితము సంశయించును. నత్తగుల్లలు సముద్రమును తరచనగునా ? సదా భరతుడు కులదీపకుడని తెలిసికొనుట అందరికి సాధ్యముకాదు.

పరీక్షవలన రత్నములును, పారదమణి వలన బంగారమునువలే సమయము వచ్చినపుడు మనుజుని పరీక్షింపవలెను. ఈ సమయముననే ఇటు పలుకుట మంచిది

కాదు. శోకముచేతను, పుత్రవాత్సల్యముచేతను నా బుద్ధి తక్కువయ్యెను, అని కన్నులనీరు తుడుచుకొనుచుండ, సునయని, "అయోధ్యారాణులు, ఒకరికంటే మరొకరు మహాపవిత్ర హృదయులనియూ, నిజముగా తమ స్వంత కొమారునైనా వర్ణించక, సవతిబిడ్డలను ఇన్ని విధముల వర్ణించి మెచ్చుకొనుట లోకవిరుద్ధము. బాధారహితులయిన ఈ రాణులు లోకమునకు ఆదర్శ గృహిణీమణులు, ఆహా యెంత విశాల భావములు. యెంత నిస్వార్థపలుకులు." అని తనలో తాను ఆశ్చర్యపడుతూ ఆనందించుచుండెను.

అంత కౌసల్య ధైర్యముతెచ్చుకొని, ఓ మిథిలాదేశపు మహారాణీ ! జ్ఞాన సముద్రుడైన జనకచక్రవర్తి భార్యవు నీవు. నీకు యెవరు వుపదేశించ సాహసింతురు. మా పలుకులు అజ్ఞానపు పలుకులు. అయినను, మా మాటలు క్షమించి సమయమునజూచి చక్రవర్తితో ఈనామాటను జెప్పుము. యేమన, లక్ష్మణుడు ఇంత కాలము రామునితో నివసించెను కనుక, కొంతకాలము భరతుని రామునితో నివసించునట్లును, లక్ష్మణుని అయోధ్యలో పనులు చూచుకొనునట్లును లక్ష్మణునకు శత్రుఘ్నుడు తోడుగా వుండునట్లునూ నా ప్రార్థనగా చక్రవర్తి రామునకు నచ్చజెప్పుమనుము. ఈ మాటలకు సమ్మతించిన యెడల మిగిలినవి అన్నియూ వాటికవే సరిపోవును.

భరతుని విషయములోనే నాకు చాలా భయముగా వున్నది. భరతుని ప్రేమ గంభీరమైనది. రాముని విడచి జీవించనొల్లడు. చక్రవర్తి స్వర్గస్థులయిరి. రాముడు వనవాసమువీడడు, భరతుడు యేమైనా రామవియోగమును భరించుకొనలేక గతించిన దేశమే జీవచ్ఛవము కాగలదు. ముమ్ముందు యేమి ప్రమాదము రానున్నదో నాకు చాలా ఆందోళనగా వున్నది, అని సునయన చేతులు పట్టుకొని జనకమహారాజును తగిన రీతిగా నచ్చజెప్పి ఈపని యెట్లయిననూ నెరవేరునట్లుచేసి మమ్ముల నానంద పెట్టుమని ప్రార్థించినటుల చెప్పెను.

కౌసల్యయొక్క స్నేహధర్మమునకు సంతసించి, సునయన, "దేవీ, వినయములు, సుగుణములు నీ కుచితములు. అగ్ని ధూమమును ధరింపదా ? పర్వతములు తమ శిరస్సుపై తృణములను ధరింపవా ? మనోవాక్కర్మములచే చక్రవర్తి మీ సేవకుడు, మీకు సదా సహకారులు. దీపపు సహాయమున సూర్యునకు శోభకలుగునా ?

దేవకార్యమును సాధించుటకు రాముడు వనమునకు వచ్చెను. అతడు తిరిగి వచ్చి అయోధ్యా రాజ్యమును నిశ్చలముగా పరిపాలించును? రాముని బాహుబలముచే నర్వ, దేవ, నాగులు సుఖించి, వారి వారి నిజస్థానముల పొందగలరు. ఇవన్నియును

మున్నే యాజ్ఞవల్క్య ఋషి చెప్పియుండెను. ఋషివాక్యములు యేనాటికి అసత్యములుకావు అని విన్నవించి, కౌసల్యాపాదములకు నమస్కరించి సెలవుగైకొని సీతను చూచుటకు పర్ణశాలదిశకు వెళ్ళతగిన యేర్పాట్లు గావించుకొని వెళ్ళెను. తల్లి లోనికివెళ్ళి కూతురు సీతను చూడగనే పట్టలేనిదుఃఖమును ఆపుకోలేక కౌగిలించుకొని భోరున యేడ్వసాగెను. సీత తల్లిని అనేకవిధముల ఓదార్చి ధైర్యవచనములు బోధించి, తల్లి పాదములకు నమస్కరించి నిలుచుకొనెను. జానకి ధరించిన తపస్విని వేషమును చూచి సాక్షాత్ పార్వతీదేవిగా కనుపించిన సీతతో, అమ్మా నీవు నా సీతవా లేక సాక్షాత్ శంకరుని ధర్మపత్నివా ? అని ప్రశ్నించి, ఆశ్చర్యముతో ఆమెను యెగాదిగా చూచి పరమానంద పరవశముతో ఇట్లు ప్రారంభించెను.

ఓ సీతా ! నీ మూలమున తల్లిదండ్రుల వంశము, అత్తమామల వంశము రెండునూ పవిత్రమయ్యెను. నీ కీర్తి లోకవ్యాప్తి కాగలదు తల్లీ, నీ కీర్తి అను నదికి పై రెండు వంశములును రెండు గట్లు. గంగానదికి భూలోకమున మూడు పుణ్యతీర్థములు మాత్రమే కలవు. హరిద్వారము, ప్రయాగ, సాగరసంగమము. అయితే నీ కీర్తి బ్రహ్మాండ ప్రవాహమై సర్వుల హృదయ క్షేత్రములందూ తీర్థరూపమున సార్థకమును గాంచుతువు గాక అని ఈ విధముగ వాత్సల్యముచే పలికిన తల్లి సత్యవాక్కులను సీతవిని సిగ్గుపడినటుల నటించుచు తల్లీ ! యెంతటి మాట, యెక్కడి సంబంధము ? పవిత్ర గంగకూ, నాకూ పోలిక యేమిటి ? అని భక్తి శ్రద్ధలతో గంగకు నమస్కరించునటుల ప్రదర్శించి నిలిచెను. అంత తల్లి కౌగిలించుకొని శిరస్సును ముద్దాడి సీతా ! నీ గుణములు లోక గృహిణీమణులకు ఆదర్శములు అని చెప్పుచుండ, సీత, అమ్మా నేను కాలమును అధికంగా మీతో గడుపుటచే రామచంద్రుని సేవాకార్యములు కొంతతడవు కావచ్చును. కాన నేనిక సెలవుతీసుకొనుటకు అనుజ్ఞ ఇమ్మనెను. అంత తల్లి జానకి మనసును కనిపెట్టి సీత మనోభీష్టమునకు అడ్డుతగులుట మంచిదికాదని తలంచి అనేకపర్యాయములు సీతను ముద్దాడి, అమ్మా నీ ఇష్టప్రకారము శ్రీరామ సేవకై వెళ్ళుమని సెలవిచ్చెను. అంత సీత తల్లికి నమస్కరించి రామసన్నిధికి వెళ్ళెను.

సునయన తన కొమార్తె యొక్క పతిభక్తినీ ఆమె గుణములను తనలో తాను స్మరించుచూ ఆనందించుచూ సీతనే చూచుచూ ఆమె లోనికి వెళ్ళువరకూ అక్కడే నిలిచియుండెను. ఇంతలో సునయన చెలికత్తె అమ్మా సీతమ్మగారు లోనికి వెళ్ళిరి. మనమిక మనస్థానమునకు వెళ్లుట మంచిదని హెచ్చరించగనే, సునయన కంటిధారలు తుడుచుకొనుచూ, ఇక విధిలేక అక్కడనుండి వెనుకకు తిరిగి తన విడిది

స్థానమునకు చేరినది. ఇంతలో సూర్యాస్తమయముకావటముచేత రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు స్నాన సంధ్యాది కర్మనిష్ఠలను ఆచరించుటకై నది కేగుచున్నారని పండితులు, విప్రులు, రాజులు, మంత్రులు అందరూ వారలతో నదీతీరమునకు వెళ్లి స్నాన సంధ్యాదులు ఆచరించి కందమూలాది ఫలములను భుజించి వారి వారి విడిది వృక్షముల క్రింద నిశ్చింతగా నిద్రించిరి.

తెల్లవారి నిత్య కార్యక్రమములు ముగించుకొని అందరూ పర్ణశాలచుట్టూ చేరిరి. శ్రీరామచంద్రుడు వారలందరినీచూచి చిరునవ్వుతో వారల యోగక్షేమములు విచారించుచూ రాగా, భరతుడు రామునకు నమస్కరించి, స్వామీ ! నా మనస్సున నొక అభీష్టము మొలకెత్తినది. భయము చేతను, సంకోచము చేతను, దానిని చెప్పు కొనలేక పోవుచున్నా ననెను. అంత శ్రీరాముడు అతని తలనిమురుచు నాచెంత సం కోచ మెందుకు, తప్పక తెలుపుమనెను.

అన్నా ! ఈ చిత్రకూట పర్వతమునగల ఋషి ఆశ్రమములను పవిత్ర తీరములను, వనమును, వన మృగములను, సరోవరములను, సెలయేళ్ళను జలధార లను సందర్శించ కుతూహలపడుచున్నాను. అందందు తమ పాద చిహ్నములను దర్శించి రావలెనను కుతూహలము అయోధ్యావాసులను సహితము రేకెత్తించినది అని ప్రార్థించెను.

అంత రాముడు, "తమ్ముడా, నీ అభిరుచి చాలా ఉత్తమమైనదేకాని, నీవు అత్రిమహాముని అనుజ్ఞగైకొని నిర్భయముగ వనములో సంచరించవచ్చును" అని చెప్పెను. రాముని వచనములను భరతుడు విని సంతసించి ముని చరణములకు నమ స్కరించి, రామునకు నమస్కరించి, శత్రుఘ్నునితోపాటు మంత్రులతోపాటు వన సంచారము, ఆశ్రమ సందర్శనము గావించెను.

అట్లు సందర్శించుచూ రాగా పర్వతసమీపమున నొక కూపము కనుపించెను. సకల పుణ్యతీర్థముల పవిత్రజలములు దానిలో గలవు. ఆ జలము నిర్మలము, అక్కడికి వెళ్లెను. అక్కడ అత్రిమహాఋషి శిష్యుడు భరతునకు ఆ పవిత్రజల మును గురించి వివరించెను. అంత భరతుడు ఆ పవిత్రజలమును శిరస్సునందు ప్రోక్షించుకొని, నమస్కరించి అందులోపడిన చెత్తనూ మట్టినీ తీసి ఆ స్థానమును తన హస్తములతో పరిశుభ్రపరచెను. అదే నేడు "భరత కూపము" అను పేరుతో చెలిచి లోకఖ్యాతి నందుకొనుచున్నది.

అరువదినం ప్రాతఃకాలమున స్నాన సంధ్యాదుల ననుష్ఠించి, శత్రుఘ్ను నితో పరివారముతో భరతుడు సమావేశమై, రాముని ముఖలక్షణములను గమ

వించుచు, దిగ్గున లేచి నిలువబడి, ధైర్యము నవలంబించి దండప్రణామమును చేసి చేతులను జోడించుకొని భరతుడు ఇట్లు విన్నవించెను. "హే ఇక్ష్వాకుకుల తిలకా! అన్ని విధముల మీరు నాకోరికలు నెరవేర్చితిరి. నా నిమిత్తమై మీరు సకల దుఃఖములు బడుచుంటిరి, సకల కష్టములు బడుచున్నారు. ఓ నాథా! మీ ఆజ్ఞను దయ చేయుడు. పదునాలుగు సంవత్సరములవరకు మీ ఆగమనమును నిరీక్షించుచు నేను నగరములో మీసేవ చేయువాడను. అవధిదాటిన తరువాత మీ చరణార విందములను దర్శించుటకు మార్గము చూపుము. ఈ పదునాలుగు సంవత్సరముల వరకు నాకేవిధమయిన ధైర్యము నిలిచియుండునో బోధింపుడు.

రామా! మీ పురజనులు, మీ కుటుంబము, ప్రజలు, అత్యంత సరసులు, పరమ పవిత్రులు, బ్రాహ్మణులు, పండితులు, మీయందు బద్ధానురాగులై యుందురు. ఈ సంసార దుఃఖములను, తాపములను మీ నిమిత్తమై భరించువాడ. మీ పరోక్షమున పరమపదమైనను నాకు వ్యర్థము. మీ సేవకుల మనోభిప్రాయములు, వారి భావములు, వారి కోరికలు మీకు విశదము. ఉభయ లోకములలోను మీరే నన్ను నిర్వహించగలరు. ఇదియే నాకుగల మనోధైర్యము. అందుచేత నాకీదుఃఖమంతయూ తృణప్రాయముగా కనబడును. ఇంతవరకూ నా దుఃఖమును పట్టలేక నాతలకు తగనట్లు ప్రసంగించితిని. నా లోపాలోపములను క్షమించి వెనుదీయక తగినట్లు నన్ను శిక్షింపుము," అని భరతుడు చెప్పిన విన్నపములను సభికులువిని హర్షించి, ఆమోదించి అతనిని కొనియాడిరి. నీరములనుండి క్షీరమును విభజించు హంసవలె అతడు సత్యము నసత్యమునుండి విభజించి చెప్పెను.

నిర్మలాంతఃకరణముతో భరతుడు చెప్పినమాటలు దీనబంధువు రాముడువిని దేశకాల సమయానుసారముగ అతనితో ఇట్లు చెప్పెను: "తమ్ముడా, భరతా, గృహములో వున్న నీ యొక్కయు, వనములోయున్న మా యొక్కయు, సకలజనయోగక్షేమమును చూచుకొనువారు యెవరో వారు చూచుకొనుచుందురు. లోకరీతిగా గురువులైన వశిష్ఠులవారును, జనక చక్రవర్తులును నీకు తోడుగా వుందురు. స్వప్నమందైనను నీకును, నాకునూ కష్టములన్నవి కనుపించుటకు వీలులేదు, కనుపించవు కూడను. మన తండ్రిగారి ఆజ్ఞను పరిపాలించుటయే పరమ పురుషార్థము, సర్వశ్రేయోదాయకము, శాశ్వతకీర్తి ప్రదాయకము, వేదసమ్మతము. ఎవరు గురువాజ్ఞను, తండ్రి ఆజ్ఞను, తల్లిఆజ్ఞను మన్నించి సన్మార్గమున సంచరించెదరో వారి పాదములు తప్పు మార్గమున పడవు.

ఈ సత్యమును గుర్తించి దుఃఖమును దూరముత్రోసి ఆనందముతో నీతి

విజాయితులతోడ, పదునాలుగు సంవత్సరములు, రాజ్యమును నడుపుము. రాజు ముఖమువలె మండవలెను; భోజనపానములు ముఖము చేయును. సకలాంగముల నది యధావిధిగ పుష్టిచేయును. అటులనే రాజులద్వారా రాజ్యాంగములకు పుష్టివచ్చును. సకల మనోరథములు మనసులో నిమిడియున్నటుల, సకల రాజధర్మములును రాజ నీతులును రాజులలో దాగియుండును." ఈ ప్రకార మనేకవిధముల రాముడు తమ్మునకు బోధించెను.

కానీ మనసు నిలుచుటకు ఆధారము లేకపోవుటచేత, భరతుని మనస్సునకు శాంతిలేకపోయెను. శ్రీరామునియందుగల ప్రేమకు వశ్యులై మంత్రులును, గురువులును, తల్లులును, పండిత పామరులును, భరతునివలె యేకాభిప్రాయులై సంశయించి యూరకుండిరి. అపుడు రామప్రభువు కటాక్షించి తన పాదుకలను తీసి భరతున కిచ్చెను.

సాదరముగ భరతుడు పవిత్ర పాదుకలను తన హస్తములతో తీసుకొని శిరస్సుపై ధరించెను. రెండు నేత్రములనుండి గంగా యమునలవలే ఆనందజలము ప్రవాహముగా కారదొడగెను. భరతుని నోటమాట రాలేకపోయెను. ఇవి కరుణా సముద్రుడు ధరించిన పాదుకలుకావు. సకల జనుల ప్రాణములు రక్షించు రక్షలు, భరతుని స్నేహరత్నమును కాపాడునట్టి సంపుటము, రఘుకులమును రక్షించు రెండు కవాటములు, ఇవి సుకర్మలు చేయునట్టి రెండు హస్తములు. ఇవే లోకనేత్రములు, ఈ రెండు పాదుకలు మనవెంటవచ్చు సీతారాముల చిహ్నములు, అని వర్ణించుచూ గంతులు వేయుచున్న భరతుని ఆనందమును యెవ్వరున్ను వర్ణింపలేకపోయిరి.

అందరూ ఒకపరి రామపాదుకలకు నమస్కరించి, రాముని అనుగ్రహమును కొనియాడిరి. అంత రామునకు నమస్కరించి ప్రయాణమునకు సెలవివ్వమని ప్రార్థించిరి. రాముడు భరతుని తృప్తికి మెచ్చి, ఒకపరి ప్రేమతో భరతుని గట్టిగ కౌగిలించుకొనితలనిమిరి విజయీభవఅని ఆశీర్వదించెను. శత్రుఘ్నుడు నమస్కరించెను. అతనిని రాముడు కౌగిలించుకొని అతనికి చెప్పవలసిన ధర్మసూత్రములను తెలిపి, భరతుని రాముడుగా భావించి తోడుగాయుండి రాజ్య కల్యాణమునకు తగిన రీతిగావించుమని తెలిపెను. అంత భరత శత్రుఘ్నులు లక్ష్మణుని కౌగిలించుకొని నీభాగ్యమే భాగ్యము. నీయంతటి అదృష్టవంతు డేలోకమునను వుండడని లక్ష్మణుని కొనియాడి అతనినుండి సెలవును తీసుకొనిరి.

అంత లక్ష్మణుడు భరత శత్రుఘ్నులను చెంతచేర్చి రామచంద్రుని పాదుకలు సకల మంగళములకు మూలములు, కాన అట్టి భాగ్యమును అందుకున్న మీకంటే

ధన్యులు మరొకరుండరని, అట్టిభాగ్యమును భద్రముగా కాపాడుకొనుటే, మీకర్తవ్య మని హెచ్చరించెను.

తదుపరి భరతశత్రుఘ్నులు సీతాదేవి దగ్గరకువెళ్ళి ఆమె పాదము పైబడి దుఃఖమును భరించలేక భోరున యేడ్చిరి.

ఆమె వారలను అనేక విధముల నోదార్చి రామ రక్షకంటే వేరొకటున్నదా లోకమున నాయనలారా! మీరు ధన్యులు, ఈ పదునాలుగు సంవత్సరములు పదునాలుగు నిమిషముల వలె అతి శీఘ్రముగా జరిగిపోయి, రామ ఆగమనముతో రాజ్యము కళకళ, కిలకిలలాడును. ఓపికతో రామాజ్ఞను జవదాటక మీ అభీష్టములను ఫలసిద్ధి గావించుకొని ఆనందింతురు, అని దీవించెను.

అంత భరతశత్రుఘ్నులు నేరుగా జనకమహారాజు దగ్గరకువచ్చి వారిపాదములకు నమస్కరించి, ఓరాజా! మాపై గల దయా ప్రేమానుగ్రహములచేత, తాము మా తండ్రి మరణవార్తయు, రామచంద్రుని వనవాస వార్తయు విని అయోధ్యకువచ్చి మా పరిస్థితులను స్వయముగా గుర్తించి, మమ్ము అనేకవిధముల వోదార్చి ధైర్యమునకు తగిన సలహాలనందించి, మా అభీష్టమును పురస్కరించుకొని తిరిగి మీరు ఇన్ని శ్రమలకోర్చి మాతో అరణ్యమునకు కూడనూ దయచేసి, రామునకు విన్నవించవలసిన విషయములలో మాకెంతయో తోడ్పడి, కడకు మాదుఃఖ పరిహారమునకు తగిన సలహాలనందించి రామానుగ్రహమును పొందినట్టి వ్యక్తులుగ మమ్ము గావించితిరి; మీకనేక ధన్యవాదముల నర్పించుచున్నాము. ఇంతకంటే మేమేమి చేయగలము, తమ ఆశీర్వాదబలమే మాకీనాటికింత తృప్తి చేకూర్చెననిరి. భరత శత్రుఘ్నులు, వారి కృతజ్ఞతా పూర్వకమైన వందనముల నందుకొన్న జనకుడు ఆ పిల్లలయొక్క ప్రేమ వాక్యములను హృదయపూర్వకముగ అందుకొని, వారల గుణములను తనలోతాను యెంతయో మెచ్చుకొని, వారలను చెంతచేర్చుకొని, శిరస్సులను ముద్దాడి నాయనలారా! రామచంద్రుని ఆజ్ఞానుసారము మీరు మెలగి అతని అనుగ్రహపాత్ర లగుదురుగాక. నేనిక్కడనుండియే మిథిలకు వెళ్ళుచున్నానని, తన పరివారము తరపున తానే భరత శత్రుఘ్నులచెంత సెలవు పుచ్చుకొని, జనకుడు సతితో, తన పరివారముతో మిథిలకు ప్రయాణమయ్యెను.

ఇక మంత్రులు, సామంతులు, ప్రజలు, బ్రాహ్మణులు, ఋషులు, ఒకరి తరువాత ఒకరు సీతా రామలక్ష్మణుల దగ్గర సెలవుతీసుకొని భారమైన హృదయంతో విడువలేక విడువలేక అయోధ్యకు తిరిగి వెళ్ళుటకు అన్నివిధముల సిద్ధమయిరి.

సీతారాములు తల్లులైన కౌసల్య, సుమిత్రా, కైకేయిల దగ్గరకు వెళ్ళి వార

లకు నమస్కరించి, వారల విషయమై మీరేమాత్రమునూ విచారించక, మీ మీ కర్తవ్యములను మీరు సక్రమముగా నిర్వర్తించుచూ, తండ్రియైన దశరథుని అభీష్ట ముల ననుసరించి ధన్యులగుదురని ప్రార్థించిరి. మేము ఎట్టి బాధలకు గురికాక ఆనందముగా పదునాలుగు సంవత్సరములు పదునాలుగు క్షణములవలే గడిపి, తిరిగీ అయోధ్య చేరుకొందుమనియూ, తండ్రిగారి ఆజ్ఞను నెరవేర్చుటే పుత్రుని పరమ లక్ష్యమనియూ ఆ నిమిత్తమై మేము ఈ పవిత్ర వనమున ఆనందముగా కాలము గడుపుదుమనియూ, తల్లులకు ధైర్యము చెప్పిరి.

అంత కైకకు నమస్కరించి, తాము అరణ్యమున నివసించుటకు ఆమె ఏ మాత్రమూ కారణము కాదనియూ, ఆమె మాకు నిరంతరము పూజనీయురాలే కాని కీడొనర్చినది కాదనియూ ఆమె మేలును మరువలేమనియూ, మా నిమిత్తమై మీరే మాత్రమూ విచారించక భరతునికి తోడుగా ధైర్యము తెలుపుతూ అతనిని చక్కగ కాపాడుకొనుచుండవలెననియూ, యేదో ఉదుటుర క్తముతో, తండ్రి మరణమును, నా వియోగమును భరించలేక తల్లియైన మిమ్ములను అనేకవిధముల తూలనాడినా డనియూ, అది భరతుని తప్పుగా భావించక, అతనిని క్షమించవలసినదనియూ సీతా రాములు కైకను వేడుకొనిరి.

ఇట్టి పవిత్రవచనము లనుచున్న రాముని ముఖమును కైక సిగ్గుతో చూడలేక పోయినది. ఇంతటి విశాలభావమును పవిత్ర హృదయమునుగల బంగరువంటి నా రాముని నేనింతగా బాధపెడితినికదా! ఈ భయంకర అరణ్యమున జీవితము గడుపు టకు నేనే కారణముకదా, ఛీ, నేనెంత కిరాతకపు పని గావించితిని.

నిజముగా నేను చేసితినా లేక రామ సంకల్పమే నన్నీరీతుల ఆడించెనా! ఏ దెట్లయిననేమి. నేను మహాపాపిని అని తనలోతాను నిందించుకొని సీతను దగ్గ రకు చేర్చి ఆనాడుచేసిన నాతప్పును క్షమించమని కోరి, తన రెండు హస్తములు గట్టిగాపట్టి ఇంతటి పవిత్ర నారీమణికి పడరానిపాట్లు కల్పించిన నన్ను మీరు క్షమించుట న్యాయముకాదు అని కైక యెంతో విలపించెను. తనతప్పును తాను హృదయపూర్వకముగ తెలిసికొని బాధపడెను.

ఈ విధముగా అందరూ వారివారి స్థానముల ననుసరించి సీతారామలక్ష్మణుల చెంత సెలవు తీసుకొని వారివారి రథములందు వారు ఆశీనులైరి. అంత సీతారామ లక్ష్మణులు ప్రతి రథముదగ్గరకూ వెళ్ళి, అందరినీ మరొకతూరి పలుకరించి ధైర్యముచెప్పి, ఒక్కొక్క రథమునే కదిలించుచూ వచ్చిరి.

గురువగు వశిష్ఠులవారి పాదములకు సీతారామలక్ష్మణులు నమస్కరించి

తమకు తమ ధర్మపత్నికి మావలన చాలా శ్రమకలిగెను. ఈ అడవిలో తమసేవలు చేయవలసినంతగా చేయలేకపోయినందుకు క్షమించమని, వారిక నిలచుటకు సెలవు దయచేయుమని ప్రార్థించిరి. అంతట ఋషి, జ్ఞానిఅయిన బ్రహ్మఋషిఅయిన వశిష్ఠుల వారికి కూడా వారి భక్తిశ్రద్ధలను, ధర్మమార్గమును వర్ణించుటకు సాధ్యముకాలేక పోయెను. వారిని విడచి ముందుకు పోలేకపోయినారు. ముప్పురూ ఒకచోట నిలుచు కొని హస్తములు జోడించి కదలిపోవు రథములవారికి నమస్కరించుచున్న దృశ్యము ఎట్టి కఠిన బండలనైనా కరిగించగల వన్నట్లు తోచినది అరుంధతి, వశిష్ఠులవారికి.

తదుపరి నిషాదపతిని అతని పరివారమునుచూచి శ్రీరాముడు అతనిని సోదరుని కన్నను మిన్నగా కౌగలించుకొని అతని వియోగ దుఃఖమును అనేకవిధముల వోదార్చుచూ బోధను గావించి నంత గుహుండు చేయునదిలేక రామపాదములకు నమస్కరించి గుండెలను బండలుగాచేసుకొని వెనుకకుతిరుగుచూ పయనముగావించెను.

వారందరు వెళ్ళునంతవరకు సీతారామలక్ష్మణులు ఒక వృక్షచ్ఛాయయందు నిల్చొని వుండిరి. ఇంతలో జనకమహారాజు తన పరివారముతో వారునూ బయలు దేరిరి. అంత రామలక్ష్మణులు, అత్తమామలకు నమస్కరించినతోడనే, సీత తల్లి దండ్రులకు నమస్కరించెను. ఆమెను తల్లిదండ్రులు కౌగలించుకొని శిరస్సును ముద్దాడి, "అమ్మా నీ సాహసము, నీ పతిభక్తి మాకు కీర్తి తెప్పించినవి. నీవల ననే మావంశము పావనమైనది. ఇట్టి పుత్రికను కన్నందుకు మేమే జన్మమున యే నోమునోచితిమో. దానిఫలమే ఈనాడిట్టి కీర్తిని అందుకోగలుగుచున్నా"మని ఆమెను అనేకవిధముల వర్ణించి, "నీకెట్టి కొరతయూ వుండదు. రామచంద్రుడు నీకు ప్రాణము. అతని ఛాయలయందుండు నీకే కొరతయూ వుండదని మాకు తెలుసు. అయినను ఉపాధిభేదముచే ఇట్టి సమస్యలు అప్పుడప్పుడు కలుగుట దైవలీల." అని అనేకవిధముల వేదాంతమును బోధించి, వారునూ, వారిపరివారమును బయలుదేరిరి.

ఈవచ్చిన రెండు రాజ్యముల పరివారములు పూర్తిగా బయలుదేరి కొంత దూరము పోవువరకునూ సీతారామలక్ష్మణులు ఆ వృక్షచ్ఛాయయందే నిలుచుండి వారు అక్కడనుండి పర్ణశాలకువచ్చిచేరి భరతశత్రుఘ్నుల భక్తిశ్రద్ధలను వారి ప్రేమ ఆదర్శములను గురించి, ప్రజలయొక్క అభిమానములను గురించి అనేక విధములుగా రాముడు చెప్పుచుండ, సీతా లక్ష్మణు లతిశ్రద్ధతో ఆలకించుచూ వారి యెడబాటునకు కొంత యోచించుచూ మధ్యమధ్య తమ తండ్రియైన దశరథుని మరణవార్తను హెచ్చరించుచూ, కొంత కృతజ్ఞతా రూపమైన ప్రేమను అర్పిం

చుచూ కంటనీరు పెట్టుచుండిన సీతా, లక్ష్మణులను చూచి, రాముడు చిరునవ్వుతో వారలకు జీవితరహస్యములను బోధించుచూ ఈరీతిగా ఆనాడు కాలమును గడిపిరి.

మునులు, బ్రాహ్మణులు, ఋషులు, భరతశత్రుఘ్నులు, కౌసల్యా, సుమిత్రా, కైకేయాది రాణులు, మంత్రులు, ప్రజలు, రాముని వియోగమును సహించలేక చింతాక్రాంతులై గడచిన అయిదుదినములలో రామలక్ష్మణ సీతాది త్రిమూర్తులు చూపిన ఆదర్శమును, వారిప్రేమ, కరుణ, దయారసమును, వారి వాగామృతమును తలచుకొంటూ, ఆహార నిద్ర అన్నది మరచి రాత్రి పగలని తలంచక మార్గమునం దెందునూ నిలువక ప్రయాణము సాగించుచూ, రెండవదినమున గంగానదిని దాటిరి.

అక్కడ నిషాదపతి, ఆ పరివారమునకు తగినభోజనాదులు యేర్పాటుచేసెను. కానీ రామలక్ష్మణ సీతా వియోగమున దుఃఖించుచున్న వారగుటచే యెవ్వరునూ యేమీ ఆరగించలేదు. ఏదో గుహుని తృప్తి నిమిత్తమై అందరూ ముట్టి పార వేయుచూ వచ్చిరి.

కడకు గుఱ్ఱములు సహితము మేతమేయలేదు. నీరు త్రావలేదు. ఈ దృశ్య మును గమనించిన వశిష్ఠులవారు, శ్రీరాముడు సర్వభూతాంతరాత్మ, తానే సర్వ భూతములందు ప్రజ్ఞాన స్వరూపుడై చైతన్యము నందించుచున్నాడని అందరికి బోధించుచూ వచ్చెను.

తిరిగి వారెక్కడను విశ్రాంతితీసుకొనుటకు అంగీకరించక సరాసరి అయో ధ్యకు చేరవలెనని భరతుడు సంకల్పించుటచేత, రామచంద్రుని పవిత్ర పాదుకలను ప్రజలకుచూపి ధన్యులను గావించవలెనను ఇచ్ఛచేత ప్రయాణమును కొనసాగించిరి. మూడవదినము సరయూనదినీ, గోమతిని దాటి నాలుగవదినము అయోధ్యానగర మును సమీపించిరి.

ఎప్పుడు భరతశత్రుఘ్నులు, రామలక్ష్మణ సహితముగ అయోధ్యను ప్రవే శింతురా అని కన్నులు కాయలుగాచినట్లు కాచుకొన్న ముసలి బ్రాహ్మణులు, స్త్రీలు, పిల్లలు, వారి రథముల శబ్దములు వినగనే వీధులలో ప్రవేశించి "రామచంద్రప్రభు వెక్కడ, యెక్కడ" అని ఆతురతతో అన్ని రథములనూ చూచుచూవచ్చిరి. కానీ కొంత చీకటి పడటముచేత, తెల్లవారి చూడవచ్చునను ఆశతో కొండంత ప్రేమతో కాచుకొనియుండిరి. తెల్లవారి లేచినతోడనే సీతా రామ లక్ష్మణులు రాలేదనియూ వారి పాదుకలుమాత్రమే అయోధ్యను చేరినవనియూ విని కొంతఆశ, కొంతనిరాశ చింతకు గురిఅయిరి.

ఇంతలో భరతుడు గురువుగారిని మంత్రులను రప్పించి రాజ్యసూత్రముల

నప్పగించి తగినరీతిగ వారికి నచ్చచెప్పి, శత్రుఘ్నుని పిలిచి తల్లుల సంరక్షణార్థం, నీవు తగిన చర్యలు తీసుకొనవలెనని బోధించెను. బ్రాహ్మణులను, పండితులను పిలిపించి చేతులు జోడించుకొని నమస్కరించి, "మీ ఆజ్ఞప్రకారము నేను నడచు కొందును. గొప్పవయినను చిన్నవయినను మీరు సంశయించక మీ కోరికలను తెలు పుడు. వాటిని నేను నెరవేర్తును," అని తెలిపెను.

ప్రజలను పిలిపించి దేశీయులను సమావేశపరచి తగినట్లు వారికి తెలిపి, రాముని సంభాషణల సారాంశమును ప్రజలకు వినిపించి ఈ పదునాలుగుసంవత్సర ములు మనము రామపాదుకలే మన అందరి రక్షగా భావించి, పాదుకలే పరిపాలన చేయుచున్నవన్న లక్ష్యమును అందరి హృదయములందు తలంచి మనము రామ చింతనతో జీవించవలెను. తదుపరి శ్రీరాముడు మనకు ప్రభువుగా నిలచి ప్రత్యక్ష పరిపాలన కొనసాగించును. ఆ ప్రియదినమునకై మనము కాచుకొనుటే మన కర్తవ్యమని తెలిపెను. గురువు, పండితులు, ఋషులు, పురోహితులు, మంత్రులు, పురప్రముఖులు, ప్రజలు అందరి ఆనందమును పురస్కరించుకొని అందరి అభి ప్రాయములను అందుకొని రామ పాదుకలను సింహాసనమున ప్రతిష్ఠించుటకు తగిన ముహూర్తమును నిర్ణయించుకొని ఆ ఉత్సవమునకు తగిన యేర్పాట్లు మహా వైభవ ముగా గావించెను. ఆ వైభవమును పూర్తిచేసుకొని తల్లులైన కౌసల్యకు, సుమిత్రకు, కైకకు నమస్కరించి, పాదుకలను శిరస్సునదాల్చి, తన సర్వ బాధ్యతలు పాదుకలే పరిపాలించుననినమస్కరించి, గురువు అనుమతినిపొంది, నందిగ్రామమునకువచ్చెను.

ఆ ధర్మదురంధరుడు, ఆ ధైర్యశాలి ఆ గ్రామములో ఒక చిన్న పర్ణశాలను నిర్మించుకొని, రామలక్ష్మణులు ధరించినట్లుగా జడలను ధరించి మునుల వల్కలము ధరించి భూమిలో ఒక చీకటి బిలమును త్రవ్వుకొని ఆహారపానీయములందును, వస్త్రధారణయందును, మునులవలె కఠిన వ్రతమును పూనెను. దేవేంద్రుడుకూడ కొనియాడెడి అయోధ్యా నగర భోగములను, కుబేరుడుకూడ కొనియాడెడి భాగ్య మును, తృణప్రాయమని తలంచి భరతుడు వైరాగ్యముతో ఆ పల్లెయందు ఆ పర్ణ శాలలో ప్రకాశించి పరులకు కనుపించక, రామచంద్రుడు అయోధ్యకు చేరునరకు తానెవ్వరిని చూడనని ప్రతిజ్ఞ పూని రామచంద్రుని రాకకై తాను రామచింతనే చేయుచు కాలము గడుపజొచ్చెను. అతని దేహము అనుదినము దుర్బలమయ్యెను. అతని తేజస్సు, బలము అధికమయ్యెను. ముఖవర్చస్సు దేదీప్యమానమయ్యెను. రామభక్తి దినదిన ప్రవర్ధమానమయ్యెను. మనస్సు పరిశుద్ధమైన పాలుగా మారెను. తారాగణములు హృదయాంతరాళమున ప్రకాశించెను.

# చిత్రకూటము

భరతుడు ఈ రీతిగా నంది గ్రామమున రామచింతనాయత్తుడై యుండ, చిత్రకూట పర్వతముపై నివసించుచున్న సీతారామలక్ష్మణులు, భరతుని భక్తిప్రపత్తులను కొనియాడుతూ కాలము గడుపుచుండిరి. ఇట్లుండ, చీమ సముద్రపు లోతును చూడవలెనని ఆశించినట్లుగా, ఒక మూర్ఖుడు జడుడు అయిన జయంతుడు రామచంద్రుని శక్తిని కనిపెట్టవలెనని ప్రయత్నించి, కాకి రూపమును దాల్చి, రామచంద్రునికి సమీపమున కూర్చొని ప్రకృతి సౌందర్యమును తిలకించుచున్న సీత పాదమును సూటిగా ముక్కుతో పొడిచి గాయము చేసెను. అంత సీత పాదము నుండి రక్తముకార ప్రారంభించెను. దీనిని చూచి రాముడు, ఒక గరికపోచను పెరికి ఆ కాకిపై విసరెను.

అపరాధము లేక రాము డొకరికి హింసచేయడు. సమయ మొచ్చినపుడు రాహువు చంద్రునికూడా మ్రింగును. కానీ, రాముడు నిరపరాధుల నే నాడును హింసించడు. ఆ విసరిన గడ్డిపోచ, మహా అగ్నిరూపముతో జయంతునిపై బడెను. అతనిని వెంటతరుముతూ పోయెను. అంత జయంతుడు భయపడి నిజరూపమును ధరించి "రామా, కాపాడుము" అని పాదములపైబడి ప్రార్థించెను. రాముడు రక్షించెను. ఆ జయంతుడు ఇంద్రుని కొడుకు. తన కుమారుడు రామద్రోహి అని తెలిసి తండ్రికూడను చాలా విచారించెను.

జయంతుడు రామపాదములపైబడి నేనొక మూర్ఖుడను, నన్ను క్షమింపుము అని ప్రార్థించగా రాముడు వాని దైన్యమునుచూచి జాలిపడి వానిని యేకాక్షునిగా జేసి విడిచిపెట్టెను. అగ్నిరూపమైన ఆ గడ్డిని తాను ఉపసంహరించుకొనెను. రామచంద్రుని అల్పశిక్షతో తనను వదలెనను కృతజ్ఞతను చూపుచూ ఆ జయంతుడు చాలాకాలము సీతారామలక్ష్మణులు నివసించు చిత్రకూట పర్వతముపైననే నివసించుచూ వచ్చెను. రాముడు మార్గశీర్షశుద్ధ దశమినాడు ఆ జయంతుని పిలిచి, దక్షిణ దిశకు ప్రయాణము కమ్మని ఆజ్ఞ చేసెను.

అంత సీతా లక్ష్మణులు రామాజ్ఞ శిరసావహించి, ముగ్గురు చిత్రకూట పర్వతము విడచి అత్రి మహాముని ఆశ్రమము చేరిరి. అంత వీరి రాకను శిష్యుల ద్వారా తెలుసుకొని అత్రి మహామునియెదురేగి వారిని తన ఆశ్రమమునకు తోడ్కొనిపోయెను. రామ ఆగమనముతో అత్రి మహాఋషి, ఆనందమును భరించలేక కంట ధారలు కార్చుచూ తనజన్మ పావనమైనదని అనేక విధముల చేసిన తపస్సు నేటికి ఫలించినదని ప్రార్థించి, రాముని స్తుతించెను.

ఆనాటి సాయంకాలము అత్రి మహాఋషి తన శిష్యులను చేర్చి, రామునకు ఉన్నత ఆసనమును యేర్పరచెను. అత్రి మహాముని భార్య అనసూయ సీతకు తగిన యేర్పాట్లుగావించి సీతకు తగినసేవలు చేయుచు యేనాటి నోమో నేటికి పండినదని తానునూ ఆనందించగా అచట కూడిన శిష్యులకు అత్రిమహాముని సీతా రామ లక్ష్మణుల పవిత్ర శక్తులను, అవతారములను వర్ణించి ప్రబోధించెను.

అంత అనసూయ తన పతిభక్తి నీ, స్త్రీ ధర్మమును అనేక విధముల సీతకు తెలుపుతూ ఆమె ఆదేశములను అందించమని ప్రార్థించుచూ, సీతయొక్క గుణ గణములను వేనోళ్ళ కొనియాడెను. అంత సీత లోకమున జన్మించిన ప్రతి ప్రాణి, ప్రతి జీవి, ప్రతి భూతము స్త్రీ తత్వము కలవారనియూ, జగన్నాటక రంగమునకు స్త్రీ పురుషులుగా కనుపించిననూ బలతత్వాలలో, భావరాగాలలో, కష్టసుఖాలలో అందరూ స్త్రీలేననియు, తన భర్తయైన రాము డొక్కడే పురుషుడనియు, ఆయన యందు ద్వంద్వభావములు యేనాటికి లేవు, రావు అనియు, అతడు అభయ స్వరూపు డనియు, ప్రకృతికే పురుషుడై ప్రకృతిని వరించినాడనియు వివిధ నామరూపము లతో గోచరించెడి ఈ జగత్తు యేకాత్మ స్వరూపమేననియూ అనసూయకు రామ తత్వమును చక్కగా ఉపదేశించెను.

సీతారామలక్ష్మణులు అత్రి మహాముని ఆశ్రమమున ఆనందముగా కాలమును గడిపి, ఆశ్రమవాసులకు ధర్మమార్గమును ప్రబోధించి, మహాఋషి అనుమతిని తీసు కొని వనసంచారమునకు బయలుదేరిరి. ఆశ్రమవాసులు, రామచంద్రుని విడువలేక కంటిధారలుకార్చిరి. విధిలేక ఆశ్రమమున వుండవలసివచ్చెనే కాని లేకున్న అందరూ రామచంద్రుని వెంటనే వుండుటకు అమితముగా ప్రయత్నించిరి. ఈరీతిగా హృదయేశ్వరుడైన రాముడు సీతాలక్ష్మణులతో ఆశ్రమమును వీడి, అడవిలో ప్రవే శించెను.

భీకరారణ్యమున క్రూరమృగముల గర్జనలు భయంకరముగా వినిపించుచుండ, వివిధ జాతులైన పక్షులు, విచిత్రములైన, వినోదకరమైన ధ్వనులు చేయుచుండ,

అదొక విధమైన లోకముగా నుండెను. ఇట్లు ప్రయాణము సలుపుతూ సలుపుతూ ఉండగా అందులో ఒక సుందరమైన మందిరముతో కూడిన ఆశ్రమమొకటి కంట బడెను. దానిని సమీపించుటకై నూతనమైన దారులు అడ్డముగా తిరిగి లక్ష్మణుడు ఆ పొదలను ముండ్లను కొంత చిక్కులు వదలించి సీతారాములకు కొంత అనుకూల పరచుచూ వెళ్ళెను.

ఆశ్రమమును సమీపించుకొలది, నలువైపులా, రసాల సాల పున్నాగ పూల వృక్షములు, ఫలవృక్షములు ఉండెను. ఆ విధమైన ప్రకృతి సౌందర్యమును తిల కించి సీత సర్వస్వమునూ మరచి, నేత్రానందములో లీనమై రామజాడను అనుస రించెను. ఇంతలో ఆశ్రమము చేరిరి. వీరి రాకను గమనించి ఆశ్రమవాసి పరుగెత్తు కొని వెళ్ళి తమ గురువునకు నివేదించెను. అంత గురువులవారు ఆశ్రమ సింహద్వార మున నిలిచి సీతారామలక్ష్మణులకు ఆనందబాష్పములతో సుస్వాగతము చెప్పెను. వారిని యథావిధిగా సత్కరించి, లోనికి గొంపోయి చల్లని పానీయమును, కంద మూల ఫలములను అందించెను. సీతారామలక్ష్మణులు అమితానందముతో వారి సేవ లను అందుకొని ఫలములనారగించి కొంత విశ్రాంతి తీసుకొని, సాయం సమయమున స్నానసంధ్యాదులు ఆచరించి మునీశ్వరుడు ఏర్పరచిన వేదికపై ఆశీనుడై ఆశ్రమ వాసులతో అనేక విధములైన ధర్మములను గురించి ముచ్చటించెను.

తదుపరి ఆశ్రమవాసులకుగల సంశయములను, శాస్త్రార్థములను అడుగు టకై అనుమతి నిచ్చెను. అంత ఋషులు వారి వారి అభీష్టములను అమితమైన ఉత్సాహముతో అడుగ దొడగిరి. అన్నింటికీ అన్ని విధములైన సమాధానములు, అతి సులభముగా గోచరమగునటుల రామచంద్రుడు తెలిపెను.

ఆనాడు ఆ ఆశ్రమవాసులకు స్వర్గము వేరొకటికదా? రామసన్నిధియే నిజమైన స్వర్గము కాదా, అన్నట్లు వారు తమ తమ అనుభూతులను ముచ్చటించుకొంటూ కాలము గడిపిరి. తెల్లవారగనే, స్నాన సంధ్యాదులు పూర్తి చేసుకొని ఆశ్రమ వాసులు ఎంతగా ప్రార్థించిననూ తన నీమములకు అడ్డు తగులకూడదని రామ చంద్రుడు తలంచి వనమునకు ప్రయాణము సలిపెను. ఈ విధముగా ఒక రాత్రి కంటే అధికముగా ఏ ఆశ్రమమునందునూ నిలువక భయంకరారణ్యమున, రాముడు సీతాలక్ష్మణులతో వనమున సంచరించెను.

ఈ ప్రయాణ మధ్యమార్గమున ఒకనాడు ఒక భయంకరాకారమున విరాధు డను రాక్షసుడు కర్ణకఠోరముగా గర్జించుచూ వీరిపైకి పరుగెత్తుకొని వచ్చెను. ఆ దౌర్జన్యమును చూచి సీత ఒకవైపున భయముతో మరొకవైపున పురుష సింహుడైన

రామునిచెంత వుంచుకొని ఈ గుంటనక్కల గర్జనలకు వెరచుచెందులకని ధైర్యముతో రాముని చాటున నిలబడి చూచుచుండెను.

అంతలో లక్ష్మణుడు వానిపై బాణములు భేదించెను. ఆ అంబుల బాధకు తాళలేక మరింత క్రోధతామ్రాక్షుడై ఆకర్ణాంతముగా త్రిశూలమును పట్టుకొని కాలుని వలే నిలిచి లక్ష్మణునిపై ఆ రాక్షసుడు యెదురు తిరిగెను. ఈ దృశ్యమును చూచిన రాముడు తన తమ్ముడైన లక్ష్మణుడు అలసిపోవుచున్నాడని గుర్తించి అర్ధచంద్రాకార బాణమును ప్రయోగించెను. ఆ బాణము ఆ రాక్షసుని త్రిశూలమును చూరు చూరు చేసి తదుపరి వాని శిరస్సును ఖండించెను. ఆ బాణము కంఠమునకు తగిలిన తక్షణమే వాడు నేలపైబడెను. అంత వాని దేహమునుండి ఒక దివ్యరూపము వెడలి వచ్చెను. పూర్వము ఇతడొక గంధర్వుడు. కుబేరుని శాపముచేత వీని కా రాక్షసత్వము ప్రాప్తించెను. రామబాణముచే వాని శాపము విమోచనమాయెను. ఆ వచ్చిన దివ్య స్వరూపము శ్రీరాముని పాదములపైబడి అనేక విధములుగా స్తుతించి, రామాజ్ఞ తీసుకొని స్వధామమునకు తిరిగి వెళ్ళెను.

రామచంద్రుడు నేలకూలిన ఆ రాక్షస కళేబరమును భూమిలో పాతిపెట్టి అంత్యక్రియలు గావించెను. ఈ రామచంద్రుని చర్యలకు దేవతలుకూడా ఆనంద బాష్పములు విడిచిరా అన్నట్లు చల్లని వర్షబిందువులు పడెను.

రామచంద్రుడు అక్కడినుండి శరభంగమహాముని ఆశ్రమమును ప్రవేశించెను. అక్కడ దానికి పూర్వమే రాముని గురించిన వృత్తాంతములు, సంభాషణలు జరుగుచుండెను. ఆ సమయమునకే సీతా లక్ష్మణ సమేతుడైన రామచంద్రుడు అక్కడ ప్రవేశించగనే ఋషులు సత్యమును గుర్తించిరి.

రాముని దివ్యమంగళ విగ్రహమును చూచి శరభంగుడు ఇది నిజమా లేక కలయా లేక ఒక విధమైన సమాధి స్థితియా అని భ్రమించెను. కొంతసేపటికి సాక్షాత్ రామచంద్రుడే అని గుర్తించి అమితానందముతో ముగ్గురినీ సత్కరించి, ఆదరించి, తమ తపఃఫలము ఈ రీతిగా సాక్షాత్కరించినదని భావించి, "రామా! ఋషి మానస సరోవరములందుసంచరించే రాజహంసవు. ఆహా నేటికి నాజన్మ ధన్యమయినద"ని అనేక విధముల స్తుతించెను.

"రామా! నేనెట్టిసాధనలు యెరుగను. కేవలమొక్క ప్రేమతో మాత్రమే నిన్ను పొందగలిగితిని. నిన్ను చూచిన ఈ నేత్రములు, మరొక దానిని చూడనొల్లకున్నవి. నీవు ఋషి అభీష్టములను నెరవేర్తువని ఆనాడు మాట యిచ్చియుంటివి. నీ ప్రతిజ్ఞను నీవు నిలబెట్టుకొమ్ము. నేను ఈ శరీరమును విడచిపెట్టు నంతవరకూ

నీవు నా యెదుట నిలచియుండుము. నిన్ను చూచుచూ ఈ కాయమును చాలింతునని, క్షణములో క్షితి పేర్చి అందులో చిరునవ్వులు చిందులు త్రొక్క రెప్ప వాల్చక సీతారామ లక్ష్మణులను చూచుచూ కాయమును భస్మ మొనరించుకొనెను.

ఈ ప్రకారము శరభంగుడు రామ ప్రేమరసమును హృదయపూర్వకముగ ఆరగించి రామచంద్రుని ప్రత్యక్ష ఆశీర్వాదములను అందుకొంటూ నీలమేఘచ్ఛాయను తన హృదయ సరోవరమున చేర్చుకొని అదృశ్యములోనే లీనమై పరమపదవిని చేరెను. ఆశ్రమవాసులు గురువియోగమునకు చింతించినన్నూ, తరువాత తమ గురువునకు ఇట్టి పవిత్రస్థితి చేకూరెనని, సాక్షాత్ శ్రీమన్నారాయణుడే సాకారరూపుడై వచ్చి గురువును తనలో చేర్చుకొనెనని అమితానందముతో రాముని స్తుతించుచూ, తమ జన్మలు సార్థకమయినవని తలంచిరి. జయ, జయ ధ్వనులు సలుపుచూ తమ గురువు కళేబరపు భస్మమును నొసట ధరించిరి.

ఇంతలో ఈ వార్తనువిని చెంతనున్న ఆశ్రమవాసులు పరుగిడి వచ్చి రామచంద్రుని పాదములపై బడి, "హేనాథా, శరభంగుడెంతటి ధన్యుడో కదా! మిగిలిన ఋషులు రాక్షసుల నోటబడి ప్రాణములు విడుచుచుండ, శరభంగుడు పరమాత్మ కంటబడి, కాయమును పరమాత్మకే అంకితము గావించుకొనెను. దేవా! మమ్ములను రాక్షసుల బారినుండి కాపాడి, మా సాధనకు తపస్సునకూ యెట్టి ఇక్కట్లూ రానీయక అంత్యమున మా తపః ఫలితముగా తమ సాన్నిధ్యమును అనుగ్రహించుమ"ని ప్రార్థించిరి.

అంతలో సుతీక్ష్ణుడను ముని వచ్చి రామచంద్రుని పాదములపై బడెను. అతను అగస్త్యమహాముని శిష్యుడు, రామచంద్రుని అమితముగా ప్రేమించినవాడు. ప్రేమ చేతనే పరమాత్మను బడయవలెనను సంకల్పము అతనిలో తీవ్రముగా నుండెడిది. అన్య రూపములను అతడు స్వప్నమందైనను వూహించేవాడు కాడు. అతడు రామ ముఖ పద్మమును రెప్ప లార్పక చూచుచూ, ఓ నాథా! నన్ను కటాక్షించుటకే ఇటు వచ్చితివా? నన్ను నీ ప్రేమలో చేర్చుకొనవా? ప్రత్యక్షముగా సాకారుడై కూడను, నన్ను నిరాకారారాధనలో వుండమనుట నీ కిష్టమా? ఎట్టి యజ్ఞ యాగాది క్రతువులూ నాకు తెలియవు. నీ ప్రేమ స్వరూపమును పొందగోరు పరితాపమే నా తపస్సుగా భావించి ప్రేమించుచున్నాను, ఇది చాలదా?

ఓ భవమోచనా! శ్రీవారిని ప్రేమతో సేవించుటకంటే అధికమగు భజన యొకటి లేదు కదా; నీ గుణగణములను గానము చేయుచూ, చింతించుచూ, ఆనందముతో పరవశమగుటకంటే వేరానందమున్నదా, అని మునీశ్వరుడు అనేక విధముల

ప్రార్థించుచూ, యెక్కడ వున్నాడో యేమి చేస్తున్నాడో యేమి పలుకుచున్నాడో తెలియని స్థితిలో అటూఇటూ దిక్కు తోచని రీతి పిచ్చివానివలె కంటిధారలు కారుచుండగ, సీతారామలక్ష్మణులను చూచుచూ వుండ, శ్రీరాముడు అతని నిశ్చల భక్తిని కనిపెట్టి చెంతచేర్చి అనేకవిధముల ఓదార్చి, ఆలింగనము గావించుకొన, మునీశ్వరుడు తనసుతాను మరచి, రామహస్తములలో పరమానందముతో సమాధి నిష్ఠు డాయెను.

ముని ఒక బొమ్మవలె కదలా మెదలక నిలచి పోయెను. కొంతసేపటికి శ్రీరాముడు ఆ మునిని అనేక విధముల మేల్కొలుపగా, ముని ప్రజ్ఞ తెచ్చుకొని రాముని పాదములపై పడి, సాష్టాంగ నమస్కారము సలిపి హస్తములు జోడించుకొని,

నాథా ! మోహమనునట్టి దట్టమగు అరణ్యమును దహించుటకు నీవు పావకుడవు ! సజ్జనులనునట్టి పద్మములను వికసింపజేయుటకు నీవు సాక్షాత్ సూర్యుడవు. రాక్షస కుంజరములను సంహరించుటకు నీవు మృగరాజువు. సంసారమనునట్టి పక్షి నెగుర గొట్టుటకు నీవు డేగవంటి వాడవు. ఓ నాథా ! నీ నేత్రములు రాజీవములు, నీ దివ్యమంగళ విగ్రహమును చూడ ఈ రెండు నేత్రములు చాలవు. జానకి నయనచకోరములకు నీవు చంద్రుడవు. ఋషుల మానస సరోవరములందు నివసించు రాజహంసవు, సంశయ సర్పములను భక్షించుటకు నీవు గరుత్మంతుడవు. కాష్ఠవాదము విషాదము, కర్కశము నీ కటాక్షమువలన భస్మమైపోగలవు. అని ఇంకా అనేకవిధముల రామచంద్రుని వర్ణించుచూ, తనివితీర రాముని దర్శించుచూ కాలము తెలియక కాయమును మరచి కంటి రెప్పలు ఆర్చక స్తుతించు మునీశ్వరుని చూచి రామచంద్రుడు లేవనెత్తి, సుతీక్ష్ణుడా! నీవు సకల గుణసంపన్నుడవు. నీ కేమి కావలెనో కోరుకొమ్ము. అనుగ్రహింతును అని పలుక, ముని, ఓ దీనబంధూ ! సీతాలక్ష్మణులతో గూడి ధనుర్ధనుడవై నా హృదయాంతరాళమున సదా నివసించుము అని ప్రార్థించెను. తథాస్తు అని రాముడు సీతా లక్ష్మణ సమేతుడై మునిని వెంటబెట్టుకొని అగస్త్యుని ఆశ్రమమునకు ప్రయాణమయ్యెను.

కొంతదూరము నడువగనే ఒక నది శబ్దము వినబడెను. అంత ఆ నదిని వెతుకుచూ వెళ్ళగా ఆ నదికి పై భాగమున ఎత్తైన పర్వతమొకటి కనిపించెను. ఆ రెండింటికీ మధ్యను సుందరమైన పూలతోటలు, వాటిమధ్య కొలను మధ్య నున్న తామర పుష్పమువలే అగస్త్యుని ఆశ్రమమును చూచిరి. ఆ ఆశ్రమ మెంత మనోహరముగా కనుపించెనో చెప్పవీలుకాక పోయెను. కొన్ని నిమిషములు దానిని

చూచుచూ సీతారామలక్ష్మణులు స్తంభించిపోయిరి. ఆ వాతావరణము వర్ణనాతీతము. జలచరములు, భూచరములు సహజవైరమును విడచి అత్యంత మైత్రితో నివసించెను. సిద్ధులు, మునీశ్వరులు ఆ నదీతీరమున నిశ్శబ్దముగా తపస్సు ఆచరించుచుండిరి.

ఆశ్రమమును సమీపించగనే, సుతీక్ష్ణుడు ముందుగా ఆశ్రమములోనికి పరుగెత్తి గురువు పాదములపై పడి నమస్కరించి ఓ దయాళూ! అయోధ్యాపతి కుమారుడు, ఆ జగదాధారుడు, సీతాలక్ష్మణ సమేతుడై మనఆశ్రమమును ప్రవేశించినాడు; మీరు దివారాత్రములు ఎవరిని ధ్యానించుచున్నారో, వారే ప్రత్యక్షముగా మీ చెంతకు వచ్చుచున్నారు. ఆహా! ఎంతటి సుదినము. యెంతటి భాగ్యము, అని మైమరచి సుతీక్ష్ణుడు ఉప్పొంగిపోయెను.

అంత అగస్త్యుడు దిగ్గున లేచి వెతకబోయిన తీగ కాలికే చుట్టుకున్నట్లు తనలో భావించి, వేగముగా వెలుపలికి నడచెను. ఎదురుగా వచ్చుచున్న సీతారామలక్ష్మణులను చూచి అగస్త్యుడు కంటధారలు కార్చుచూ, నాథా నాథా! అని పరుగెత్తుక వెళ్ళి రాములను గాఢముగా కౌగిలించుకొనెను. అట్లే కొన్ని క్షణములు వృక్షమునకు అల్లుకొనిన లతవలె నిలిచిపోయినాడు.

భరించలేని ఆనందమును అందుకొని అగస్త్యుడు సీతారామ లక్ష్మణులను ఆశ్రమములోనికి తీసుకొనివెళ్ళి ఉన్నతాసనములపై కూర్చొనబెట్టి, ఫలపానీయముల తెప్పించి అందించెను. కుశలప్రశ్నలు వేయుచుండ అగస్త్యుడు కన్నులుమూసుకొని చిరునవ్వులు చిందులుద్రొక్క ఆనందబాష్పములు రాల్చుచు, "నాథా! నాకంటే అదృష్టవంతుడులేడని భావించుచున్నాను. సాక్షాత్ నారాయణుడు నాచెంతకు వచ్చుట నా ఆశ్రమమున నివసించుట నిజముగా ఇది కలయా, లేక సత్యమా అని అనుపించుచున్నది," అని వేయివిధముల తన సంతోషమును వెలిబుచ్చెను.

అంత రామచంద్రుడు, మునిరాజా! మీవద్దనాకు దాపరికములేదు. నేను వనమునకు వచ్చుటకు కారణము మీకు విశదమే. అందుచేత నాసంగతి నేనుప్రత్యేకముగా ప్రకటించుకోలేదు. ఏప్రకారము ఋషులకు, మునులకు, తపఃభంగము కలిగించు రాక్షసులను సంహరింపవలెనో, దైవదాసులను రక్షించవలెనో తమరు సెలవిచ్చిన ఆ రీతిగా చేతునని పలికెను. ఓ మునీ! హేమంతఋతువులో కమలములు నశించు విధమున, నేడు మునిద్వేషులు నశించుటకు సమయమాసన్నమైనది," అని రాముడు తెలుపగనే, అగస్త్యుడు చిరునవ్వుతో, "ఓనాథా! మీకు సర్వము విదితము, ఇట్లేల నన్నే ప్రశ్నించుచున్నారో అర్థమగుటలేదు. ఇది నన్ను అనుగ్రహించుమాటలో లేక

పరీక్షించు పలుకులలోకూడ నిర్ణయించుకోలేక పోవుచున్నాను. అయితే మీదర్శన స్పర్శన సంభాషణల ప్రభావముచే మీ భావమును కొంతవరకూ తెలుసుకోగలిగితిని. అదియూ తమకటాక్షమే. మీమాయ మీపాదాక్రాంతురాలై మీభ్రుకుటీ విలాసమును వీక్షించుచుండును. ఆ మాయయే మీ ప్రభావముచేత సమస్త దేవగణములను సృజించుచున్నది.

మీమాయఅజేయురాలు. మీమాయ జీవుల నెంత కష్టపెట్టుచున్నదో ఆసంగతి లోకప్రసిద్ధము. కటాక్షించి నావిన్నపము నాలకించు. మీమాయ బొడ్డచెట్టువంటిది. దాని పండ్లవంటివి మాయాకల్పితములగు బ్రహ్మాండకటాక్షములు, ఈబ్రహ్మాండము లోని చరాచర జంతుజాలము లా పండ్లలోని పురుగులు వంటివారు. వానియందము పైపై జూడ చిత్రముగ నుండును. కానీ వాటిపొట్టవిప్పి చూడ పురుగులు లెక్కకు మిక్కుటము ఈబ్రహ్మాండ ఫలమునం దాసక్తి కలవారు కాలస్వరూపులగు మిమ్ము చూచి భయపడుచుందురు.

రామా! మీరు లోకారాధ్యులు. మనుజమాత్రునివలె మీరు నన్ను ప్రశ్నించుట, ప్రశంసించుట, ఇది యోగ్యముగా వున్నదా. నాకేదీ అక్కరలేదు. సీతాలక్ష్మణ సమేతుడై మీరు నా హృదయమున నివసించుము. ఈ ఒక వరమును నాకనుగ్రహింపుము. మీ సుగుణరూప ధ్యానమే నాకు అభిమానము. అదే నామతము, అభిమతము, వ్రతము. కాన కటాక్షింపుము, కరుణింపుము.

మీ దాసులకు గొప్పతనమిచ్చుట మీరు అమాయకులవలె యేమీ తెలియని పామరునివలే ప్రక్కకుతొలగుట, మీ ఘన లీలలలో ప్రధానమైన లీల కాన వేరు నన్ను ప్రశ్నించకు. తమ అభీష్టమును అనుసరించుట నా కర్తవ్యము. సారెసారెకు నన్ను నీమాయలోదింపి పరీక్షించకు తండ్రీ," అని ప్రార్థించెను. అంత, రామచంద్రుడు, మునివర్యా! ఈప్రాంతములు మీకు సహజపరిచయము కనుక యెక్కడ నేను సీతాలక్ష్మణులతో నివసించుటకు యోగ్యమో నీవు నిర్ణయించుటలో తప్పేమున్నది. ఇది లోకప్రవృత్తి కదా! అని జవాబివ్వగా అగస్త్యుడు నాథా! అడిగితిరి కనుక ఆజ్ఞను జవదాటక తెలుపనెంతును.

అతి సమీపమున పవిత్ర గోదావరి ప్రవహించుచున్నది. ఆ మహానది యుగములు తరబడి సజీవమై ప్రవహించునట్టిది. దాని సమీపమున దండకారణ్యము కలదు. ఆ దండకారణ్యమును పవిత్రముచేసిన ఋషులకు సమస్తసుఖములు చేకూర్చినవారగుదురు. కారణమేమన ఆ వనము మునిరాజు శాపముచే తపించుచున్నది. అంత రాముడు, అగస్త్యా! ఆ శాపవృత్తాంతము సీత వినగోరుచున్నది. విపు

లముగా తెలుపుమని కోరగా, అగస్త్యుడు, "ఓ నటన సూత్రధారీ! ఒక సమయమున పంచవటీ తీరమున దుర్భిక్షమువచ్చెను. అపుడు మునులందరు గౌతమఋషిని ఆశ్ర యించిరి. అతడు తపో మహిమతో విశేషకాలము ఆశ్రయించిన మునులను పోషిం చెను. దుర్భిక్షకాలము తీరగనే ఋషులందరూ తమతమ స్వస్థానములకు పోతలంచిరి.

అయితే వేషధారులైన కొందరు ఋషులు, గౌతమముని శక్తిసామర్థ్యములను చూచి వోర్వలేక కొన్ని కుట్రలుపన్ని అతనిని యేరీతిగానైనా నిందలపాలు చేయ వలెనని భావించి ఒక్క-గోవును వెతికి, కొన్ని క్షణములలో ప్రాణములు వీడునట్టి దానిని తీసుకొనివచ్చి ఆశ్రమములో పచ్చగా ఆకర్షణీయముగావుండు ప్రదేశమున ప్రవేశింపజేసిరి.

గౌతముడు బయటకువచ్చి చూచునరికి పచ్చని గోఛాయమానమైన పూల మొక్కలను, లేవలేక తినలేక, ప్రాణములు వీడుటకు సంసిద్ధముగావున్న ఆగోవును చూచి, పూలమొక్కలు పాడుచేయుచున్నదని తలంచి దానినిలేపి బైటకు త్రోయు టకై ప్రయత్నించగా ఆ ప్రయత్నములలోనే, అనగా స్పృశించిన తక్షణమే ఆగోవు అక్కడే ప్రాణములు వీడెను. అంత కుట్రలుపన్నిన వేషధారి ఋషులు గౌతమునిపై గోహత్యాపాపమును అంటగట్టిరి, పుట్టించిరి. అతనిని దూషించిరి. అంత గౌతముడు గోవు ప్రాణములు వీడుట యోచించి అది సకాల వర్తితమా లేక తనచే ప్రాణములు వీడటమా అని కొంత ధ్యాననిష్ఠుడై సత్యమును గమనించెను.

ఇది ఋషులు పన్నిన కపట నాటకమని తెలుసుకొని, ఆ వనమున ఇట్టి కపట ఋషులు నివసించకూడదని తలంచి ఈ వనము భ్రష్టమగుగాక. ఈ వనమున రాక్షసులు మాత్రమే నివసింతురుగాక అని శపించెను.

ఇక దండకుడను రాజు గురు పుత్రికను బలాత్కారముగ చెరబెట్టెను కనుక, ఆమె భృగుమహాముని బిడ్డ అగుటచేత ఆమె తండ్రికి విన్నవించగా తండ్రియైన భృగుమహర్షి కోపించి, అతని రాజ్యముపై ధూళివర్షమును కురిపించెను. అందు వలన మట్టిమయమై ఈ రాజ్యము వనముగా మారెను; దండకుని రాజ్యము వనముగా మారుటచేత, దండకారణ్యమని పేరు వచ్చెనని తెలిపెను.

ఓ రఘువంశ తిలకా! తాము ఆ వనమున నివసించిన, అందులోని రాక్ష సులు నశింతురు. ప్రదేశము శాప విముక్తిని పొందును. ఋషులకు సత్సంకల్ప ములు పెరుగును. అనేక విధముల లోకోపకారము కలుగును. ఋషుల శాపములు తీరుటచేత, శపించిన ఋషులకుకూడా ఆనందము కలుగును. అని అగస్త్యుడు కోరగా సరి, చాలా సంతసిదని అగస్త్యునితో సెలవు తీసుకొని సీతాలక్ష్మణులతో

దండకారణ్యమునకు రామచంద్రుడు బయలుదేరెను. అంత అగస్త్యుడు రామచంద్రునకు నమస్కరించి యెంతో కాలమునుండి తన చెంత నుంచుకొనిన కొన్ని అస్త్రములు తానుపయోగించుటకు వీలుకానందున వాటిని రామచంద్రునకు అందించి నా సర్వబలము తామే. ఈ అస్త్రబలములు నన్ను రక్షించవు. రామానుగ్రహబలమే నిజబలము. నిజరక్ష అవి తలంచి వాటిని గైకొనుమని ప్రార్థించెను.

అగస్త్యుని ప్రార్థనలను మన్నించి రాముడు ఆ అస్త్రములను అందుకొని ఆశ్రమమును వీడెను. సీతారామలక్ష్మణులు దండకారణ్యము ప్రవేశించిన తరువాత అంతవరకూ యెండబారిన వృక్షములు చిగుళ్ళుపెట్ట మొదలిడెను. మొద్దుబారిన లతలు పుష్ప గుచ్ఛముల వేసెను. అరణ్యము పచ్చగా రంగులు రంగులుగా, ప్రకృతి సౌందర్యమును చేసుకొనెను. అందులో నివాసయోగ్యమయిన ప్రదేశమును వెతుకుతూ పంచవటీ తీరమునకు వచ్చి చేరిరి.

అక్కడ వృద్ధుడైన జటాయువును చూచిరి. అతను పూర్వము దశరథుని మిత్రుడు, గృధ్రరాజు. అందువలన అతనికి దశరథుని మరణవార్తను శ్రీరాముడు తెలిపి అతనిని శాంతపరచి, తన పరిచయమును తనకు తాను చేసుకొనెను. గోదావరి తీరమున ఒక పర్ణశాలను నిర్మించుటకు నిర్ణయించిరి. జటాయువు మైత్రి దినదినమునకు అధికమగుటచేత అక్కడి వాతావరణము ప్రదేశములయొక్క స్థితిగతులు చక్కగా తెలుసుకొని ఆ రాత్రి అక్కడే వృక్షముక్రింద కాలము గడిపిరి.

# పంచవటీ క్షేత్రము

పంచవటీ తీరమున కొంతకాలము అధికంగా నివసించాలని తలంచి, సీతా రాములు ఒక చల్లని ఛాయయందు విశ్రమించుచు, రాముడు లక్ష్మణుని పిలిచి, తమ్ముడా! ఈ ప్రాంతమున అన్నివిధముల అనుకూలమైన ఒక చక్కని ప్రదేశ మును నిర్ణయించి నీ కిష్టమైన రీతి ఒక పర్ణశాల నిర్మించమని ఆజ్ఞ చేయగా, ఆ పదములు లక్ష్మణునకు మహా కత్తిపోటులవలె తోచి భరించుకోలేకపోయెను. రామా, ఇంతటి కఠిన మాటలు వినుటకు నేనే దోషము చేసితినో తెలుపుము అని పాదములపై బడి ప్రార్థించెను.

అందులకు సీతారాములు ఆశ్చర్యమున లక్ష్మణా! యెందులకింత విచారపడు చున్నావో అర్థమగుటలేదు. నానోట కఠినపుమాట నేనాడైనను వినియుంటివా? కఠినపు మాటలాడుటకు నాకేమైనా పిచ్చి పట్టినదా? ప్రాణసమానముగా చూచుకొంటూ నా ఆశయాలను శిరసావహించి ఆచరించుచున్న నిన్ను నేను కఠినపు మాటలాడుటలో అర్థములేనిది. నేనేమంటిని, నీ కిష్టమైన స్థానమును ఒకటి నిర్ణయించి పర్ణశాల నిర్మించమంటిని. అంతేకదా!

తిరిగి లక్ష్మణుడు, రామ, రామ. నే నీ మాటలను వినలేను అని చెవులు మూసుకోవటము చూచి, రాముడు మరింత ఆశ్చర్యపడి చూచుచుండ, లక్ష్మణుడే హస్తములు కట్టుకొని, స్వామీ! నా సర్వస్వము సీతారాములే అని తలంచితిని నా అనువారు లేరు, నా కిష్టము రామాజ్ఞయే అని దేనినీ లెక్కచేయక రామాజ్ఞను నడచుకొనునట్టి దాసుడుగా నేనుండ, నాకిష్టము వేరొక్కటున్నటుల తాము పలికిన, నే నెట్లు వినగలను. నా ఇష్టమే వేరొకటుండిన, రామసేవకు అర్హుడ నగుదునా? నేను రామసేవకు అనర్హుడనగుదునుకదా. దానికే అనర్హుడైన నేనిక లోకానికే అపర్హుడను, వ్యర్థుడను, నిరర్థక జీవిని, అని వెక్కి వెక్కి యేడ్వనారంభించెను.

అంత సీత విషయమును చక్కగా గమనించి, సోదరా! నీ హృదయము

మహా పవిత్రము. ఏదో లోక సామాన్యముగా మీ అన్న అట్టి మాటలు ఉపయోగించెను కానీ నీ హృదయము మీ అన్న యెరుగకపోలేదు. ఇంత మాత్రమునకు నీవింత దుఃఖించకు, లెమ్ము. అని ఓదార్చెను.

రాముడందులకు నవ్వుచూ, తమ్ముడా! నీ సూక్ష్మతకు నాకెంతయో ఆనందము. నీ భావములు సున్నితములు, అతి పవిత్రములు. ఇక ఇట్టి మాటలతో నిన్ను బాధించను. లోకసామాన్యముగా నేను ఆడినమాటలే కానీ వేరుకాదు. రమ్ము పోయి చూతము అని తమ్ముని వెంటబెట్టుకొని కొంత ప్రదేశముచూచి ఇక్కడ పర్ణశాల నిర్మించుమని చెప్పినతోడనే ఆహా నేను ధన్యుడను, ఇట్టి ఆజ్ఞను నెరవేర్చుటమే నా కర్తవ్యము కానీ, నేనే నాయిష్టమని ఒక దానిని సృష్టించుకొను అధికారము నాకు లేదు, నేను నీవాడను, నీదాసుడను, అని అన్నకు నమస్కరించి పర్ణశాలకు కఱ్ఱలు, ఆకులు కొట్టుటకు ప్రారంభించెను.

లక్ష్మణుడు అంత సూక్ష్మబుద్ధి కలవాడని సీతారాములు తెలుసుకొని, అతని శ్రద్ధాభక్తులకు వారిలోవారు యెంతో ఆనందించిరి. లక్ష్మణునివంటి తమ్ముడు వారి వెంట వుండుటచే, అరణ్యవాసము, మహా హాయిగా యెట్టి అనానుకూలములూలేక అయోధ్యలోకంటె సుఖముగా జీవించుచున్నామని సీత పదేపదే, రామునకు తెలుపుతూ వచ్చెను.

అతిసుందరముగా, మనోహరముగా, అనుకూలముగా నిర్మించిన ఆ కుటీరమును సీతారాములుచూచి చాలా ఆనందించిరి. అందులో సీతాదేవి పరమాశ్చర్యముతో చూచుచు, మరిదియొక్క శక్తియుక్తులను కొనియాడెను. అందులో చాలా సుఖముగా కాలము గడుపుతూవచ్చిరి. శ్రీరామచంద్రుడు పంచవటీ తీరమున పర్ణశాల నిర్మించుకొని వున్నాడని తెలుసుకొని దినము అనేకమంది మునులు, ఋషులు, వారి శిష్యకోటితోచేరి వచ్చి దర్శించి, సంభాషించి రాములను వర్ణించుచూ వెళ్ళెడివారు. మరికొందరు శాస్త్ర, ధర్మ, మర్మములను తెలుసుకొనగోరి రామచంద్రుని అనేకవిధముల ప్రశ్నల నడుగుచుండెడివారు. కొందరు తాముచేయు తపస్సు సక్రమముగా వున్నదా లేక అందులోని దోషములేమైన వుండిన తెలుపగోరుచున్నామని రాముని ప్రార్థించెడివారు. సర్వధర్మ ప్రవీణుడుకనుక, సర్వశాస్త్రములను యెరిగినవాడుకనుక, రామచంద్రుని బహువిధముల వినియోగించుకొంటూ ఋషులు, మునులు, పరమానందపడుచుండిరి.

ప్రశ్నలు అడుగుటకు నాలుగుకారణము లుండును. 1. తుచ్ఛము, 2. కనిష్ఠము, 3. మధ్యమము, 4. ఉత్తమము, అని నాలుగు కారణములు. ఇందులో :—

1) వివాదార్థము, ఒకరిని ఓడించుటకు ప్రశ్న వేయుట; ఇది తుచ్ఛము 2) వాక్చాతుర్యము జూపించుటకు ప్రశ్న వేయుట; ఇది కనిష్ఠము. 3) బుద్ధిచాతుర్యము చూపించుటకు ప్రశ్నించటము; ఇది మధ్యమము 4) సందేహములను నివృత్తిచేసుకొనుటకు ప్రశ్నించుట; ఇది ఉత్తమము. అయితే అనేకమంది ఋషులు 4వ కారణమునకు చేరియుండిరి. ఇట్టి ఋషులను చూచి రామలక్ష్మణులు అమితానంద పడుచుండెడివారు. కొందరు రామచంద్రుడు తెలుపు అతిసులభమైన, ఆచరణయోగ్యమైన శాస్త్రసమ్మతమైన ధర్మవిరుద్ధముకాని, ఆ జవాబులకు మునులు మురిసిపోయి, "ఓ నాథా! త్రికాలజ్ఞాన సంపన్నుడా! మీకంటే వేరు ప్రభువు మాకెవ్వరు? ఋషిమానస సంచారులైన మీరు మా తపఃఫలముగా మాకు చిక్కితిరి; మేమెంత ధన్యులమో" అని ఆనందబాష్పములు రాల్చుతూ విడువలేక, వెనుకకు పోయెడివారు. కొందరు అక్కడక్కడే వృక్షచ్ఛాయలక్రింద పరుండి కందమూలాదులను భుజించి వారివారి ఆశ్రమములు కూడనూ వీడి, మరచి, అప్పుడప్పుడు రామచంద్రుడు వెలుపల సంచరించుచుండ చెట్లచాటులనుండి దర్శించుకొంటూ ఆనందముగా కాలము గడిపెడివారు.

ఈ విధముగా రాముడు మునుల చిత్తములను అపహరించి, వారిని వున్మత్తులుగా గావించి సమస్త సాధనలు మాని రామచింతనే వారి నిజతపస్సుగా వారివారి భావములను కలిగించి, రాత్రి, పగలు, ధర్మబోధనలు సలుపుచూ, అప్పుడప్పుడు లక్ష్మణునితో "తమ్ముడా నాపని ఇదియే. ఇట్టి పవిత్ర కార్యనిమిత్తమై నేనువచ్చి, అయోధ్యలో కూర్చొని లోకాభిరామాయణములను పెంచుట యెట్లు సాధ్యమగును? నా సంకల్పకార్యము, నారాకలక్ష్యము ఇవియే. సాధుసంరక్షణ, లోక కంటకచర్యలను హతమార్చి, ధర్మాచరణను అభివృద్ధిగావించుట. అది ప్రారంభమైనది." అని అనేకవిధముల తన సంకల్పములను తన అవతార తత్వమునూ తెలుపుచుండెడివారు.

ఒక్కొక్కపరి లోకకల్యాణ నిమిత్తము లక్ష్మణుని ఆధారముగా అనగా నిమిత్తమాత్రునిగా భావించి, అనేక నీతులను తెలిపెడివారు. లక్ష్మణా, దేహమునందభిమానము, పదార్థములందు దాసక్తి, నీవూ నేనూ అను మమకారము, ఈషణత్రయములను మొదలగునవి మాయా కల్పితములు. మాయయొక్క స్వరూపములు అతిగోప్యము, విచిత్రము, అద్భుతము. మాయయే చరాచర ప్రపంచమును, జంతుజాలమును తన వశము చేసుకొనియుండును. ఇంద్రియములు పదియు వానివాని అధిష్టానస్థానములు నాశ్రయించి, అధిష్టాన దేవతలచే భోగముల ననుభవించును. అయావిషయభోగములన్నియూ మాయాకృతములు.

ఈమాయకు రెండుపేర్లుగలవు. ఒకటి విద్యామాయ; రెండవది అవిద్యా మాయ. వీటిలో రెండుభేదములు గలవు. అవిద్య మహాదుష్టురాలు. ఆమెమూలమున అమిత దుఃఖములు కలుగును. దానికి వశులైన జీవులు సంసారకూపమున మునిగి యుందురు. విద్యారూపియగు మాయ ప్రభు ప్రేరణవలన అనేక బ్రహ్మాండములను రచించెను. ఆమాయకు స్వతంత్రశక్తి లేదు. పరమేశ్వరుని సన్నిధిని వుండిన మాత్రమున ఆ మాయ త్రిగుణాత్మకమయిన ప్రపంచమును సృష్టించును వర్ణాశ్రమ ధర్మములను విడచి సర్వము బ్రహ్మస్వరూపమని తలంచి భేదబుద్ధిని విడచినవాడే జ్ఞాని అని తెలుపును. "సర్వంకలవిధం నేహనానాస్తికించన" అని ప్రమాణము.

ఈజగత్తు బ్రహ్మస్వరూపమనియూ, నానావిధ పదార్థము లొకటి అనియు తెలుసుకొనువాడే జ్ఞాని అనియూ. ఓలక్ష్మణా! రజోగుణము బ్రహ్మయందును, సత్వ గుణము విష్ణువునందును, తమోగుణము ట్రుద్రునియందును సిద్ధించెను. ఈమూడు గుణములే ప్రపంచమునకు కారణములు. ఈమూడును తృణప్రాయములని తెలుసు కొని వాటిని విసిచిపెట్టినవాడే విరాగి కాగలడు. అతనే వైరాగి అను పదమునకు అర్హుడు అని లక్ష్మణునకు తెలుపుచుండెడివారు.

ఒక్కొక్కపరి సీతాలక్ష్మణులను చెంత చేర్చుకొని జీవుడు తనకును, మాయ కును, పరమాత్మకునుగల సంబంధమును యెంతవరకుతెలుసుకొనలేడో అంతవరకూ జీవుడు జీవుడుగానే వుండునని తెలిపెడివారు. అంతేకాక ఆ జీవుడు మాయకు లోబడి వుండెడివాడు. ఎపుడు జీవుడు తనకును పరమాత్మకును భేదములేదనియు, పరమాత్మ యొక్క ప్రతిబింబమే తాననియు గ్రహించునో అపుడు జీవుని మాయ విడిచిపోవును. అదియే ఆత్మజ్ఞానము. జీవాత్మకును, మాయకును, పరమాత్మకునూగల సంబంధ మును తెలిసికొనుట అత్యవసరము. స్వధర్మమువలన విరక్తిపుట్టును. యోగము వలన జ్ఞానము కలుగును. జ్ఞానమే మోక్షప్రాప్తికి చివరిమెట్టు. పరమాత్మునియందు అత్యంత ప్రేమ కలిగియుండుటే భక్తి. అట్టి భక్తునకే నేను ప్రసన్నుడనగుదును.

భక్తులకు నాప్రేమను సుఖమును అందింతును. భక్తిస్వతంత్రము; పరాధీ నము కాదు. జ్ఞానవిజ్ఞానములు దాని అధీనములు. నిరుపమానమగు సుఖమునకు భక్తి మూలము. సత్పురుషుల కటాక్షమే ఈ భక్తిభావములు కలుగుటకు ఆధారము. ఈ మార్గముననే జీవులు నన్ను త్వరగా చేరగలరు, అని ప్రబోధించెడివారు.

ఈ విధమైన వాక్యములు సీతారామలక్ష్మణులు ఆనందముగా శ్రవణము చేయుచూ, యెక్కడున్నాము అను భావమునే మరచి తమలోతాము లోదృష్టిని చేరెడి వారు. ఇట్లు ఆత్మస్వరూప లక్షణములను ప్రబోధించి, రామచంద్రుడు కొంత

విశ్రాంతి తీసుకొను సమయమున లక్ష్మణుడు, బైట కాపలాకాయుచూ ఊరకుండుటకు మనసొప్పక, రామ వాక్యములను స్మరించుచూ, అటునిటు తిరుగుచుండ, ఆ వృక్షచ్ఛాయలో ఒక నిమ్మమొక్క కనుపించెను.

దానినితీసి పర్ణశాలకు సమీపమున ప్రత్యేక రక్షణను కలిగించు నిమిత్తమై పాదు తీయుచుండ ఇంతలో రావణుని సోదరియైనశూర్పణఖ అనునీచురాలు, దుర్మార్గురాలు, పరుగెత్తుకొనివచ్చెను. లక్ష్మణుని చూచిన తక్షణమే, ఆచక్కదనమునుచూచి అతని దేహవర్చస్సునుచూచి మోహించెను; నోటిమాటరాలేకపోయెను. తన వికారపు స్వరూపమును మార్చుకొనెను. సుందరదేహమునుధరించెను; కామవృత్తులు ప్రదర్శించెను. కానీ లక్ష్మణుడు ఆరూపమునైననూ గమనించక, లెక్కచేయక, తనపని తాను చేయుచుండెను.ఇక భరించలేక శూర్పణఖ లక్ష్మణునిసమీపించి,"నాథా! నన్నేల నిరాశకు గురిచేయుచున్నావు. నాతాపమునుచల్లార్చి, మీ చల్లనిదృష్టిని నాపై ప్రసరింప చేయుము" అని దీనయై ప్రార్థించుచుండ, దానినికూడనూ వినీవిననట్లు నటించుచూ, ఆరాక్షసి మొగమునైననూ చూడక తనలోతాను నవ్వుకొనుచూ, దాని ప్రవృత్తులను గమనించుచుండెను.

ఇక తాళలేక శూర్పనఖ అతనిపై పడుటకు ప్రయత్నింప, లక్ష్మణుడు మొదట శాంతవచనములతో "అమ్మా! నేను శ్రీరాముని దాసుడను. నేను స్వతంత్రుడను కాను; కాన యేచిన్న కార్యమయినా రామాజ్ఞలేక నేచేయను; చేయవూనను" అని సంభాషణ ప్రారంభించెను. ఈ సంభాషణను విని సీతారాములు వెలుపలకు వచ్చి చూచుసరికి మాయామోహితురాలగు శూర్పణఖ అని రాముడు గమనించి, తగిన జాగ్రత్తలో వుండెను. ఇంతలో శూర్పణఖ లక్ష్మణుని పిరికిపందవంటివాడు అని అయోగ్యుడని అనేకవిధముల రోషమైన మాటలను ప్రారంభించి, కొంత హాస్యమాడుటకు పూనుకొనెను

అంతవరకూ ఆమె శ్రీరాముని చూడలేదు. దృష్టిఅంతయూ లక్ష్మణునిపై లగ్నమైనది. "ఓ సుందరుడా! నన్ను వివాహమాడుము. నేను నీకు కావలసిన సుఖమునిత్తును. ఆదరింతును." అని అనేకవిధముల బ్రతిమిలాడుచున్న ఆమె వచనములకు చోటివ్వక "ఓ సుందరీ! నేను దాసుడను, దాసుడైన నన్ను నీవు వివాహమాడిన నీవు దాసురాలు కావలసివచ్చును కనుక, ప్రభువైన రాముని వివాహమాడిన నీకు నేను దాసుడనగుదును; కాన అతనిని వివాహమాడుము" అని హాస్యవచనములు లక్ష్మణుడు ప్రదర్శించెను.

[illegible] భావించి అటుఇటుచూడ, పర్ణశాల ముందుభాగమున, ఒక

సుందరమైన స్త్రీతో నవ్వుచున్న మహా సుందరమైన విగ్రహమును చూచెను; ఇక అక్కడ వుండలేకపోయినది. సరాసరి అక్కడికివచ్చి, ఓ మన్మధుడా! నన్ను పీదానగా చేసుకొమ్మ అని దీనయై విలపించుచూ ప్రార్థించెను.

కానీ రాముడుకూడా కొంత ఆ రాక్షసికి బుద్ధిచెప్పతలంచి, కొంత నిరాశ కలిగింపనెంచి తమాషాగా, హాస్యమాడ ప్రారంభించెను. "ఓసుందరీ, నన్ను వివాహమాడుటకు వీలుకాదు, నేను ఏకపత్నీ వ్రతుడను. నా తమ్ముడగు లక్ష్మణునకు సతి చెంతలేదు. కనుక అతనిని వివాహమాడుటలో నీకు శాంతి చేకూరును.

కాన, అతడు అన్ని విధములా సరియైనవాడు కనుక అతనినే వివాహమాడుము" అని తెలుప, ఆమె తిరిగి లక్ష్మణుని చెంతకువచ్చి మీ అన్నగారి అనుమతి అయినది కాన ఇకనీవు కాలహరణము చేయకూడదు, అంగీకరింపుము. అని వినయ విధేయతలు ప్రకటించుటచూచి లక్ష్మణుడు మరింత సిగ్గుపడి, ఆమెను మరింత నిరుత్సాహపరచుటకు హాస్యమును శ్రుతిమించునట్లు గావించెను. రాముడు లక్ష్మణుని చెంతకు, లక్ష్మణుడు రామునిచెంతకు పంపుటలో శూర్పణఖ మనసు విసుగెత్తి, ఇక భరించలేక, కామాంధురాలై, కన్నుమిన్ను కానక, దుర్బుద్ధికి గురియాయెను. ఈస్త్రీ వుండుటచేతకదా రాముడు నన్నొల్లకున్నాడు. కాన ఈ స్త్రీని చంపి మ్రింగిన రాముడు తప్పక నన్ను మోహించునని తలంచి సీతపై రుద్రురాలై దుమికెను.

అది చూచి లక్ష్మణుడు మండిపడి, రామాజ్ఞకై అతని ముఖవర్ణమును గమనించుచూ నిలచెను. అంత రామచంద్రుడు మితిమీరిన రాక్షసి యెంతటికైనను సంసిద్ధురాలు కావచ్చునని తలంచి, గోటితో పోవువాటికి గొడ్డలినెందు కుపయోగించుట అని భావించి, తన హస్తమును మీదికిచాపి బొటనవ్రేలుతో మిగిలిన నాలుగు వ్రేళ్ళను లెక్కించెను.

ఈ సంజ్ఞ కర్థమును గమనించి సూక్ష్మబుద్ధి గల లక్ష్మణుడు నాలుగు వ్రేళ్ళు నాలుగు వేదములనియు, వీటికి శృతులనియును శృతి అనగా చెవులనియును, హస్తమును మీదికి చాచుటచేత మీద ఆకాశ సంజ్ఞ అని భావించి ఆకాశము, అనగా శబ్దమే బ్రహ్మమనియూ అదే స్వర్గమార్గమనియూ, స్వర్గమునకు నాకము అని మరొక అర్థము కలదనియూ, నాకమనగా ముక్కు అని భావించి వేదములకు శృతి, స్వర్గమునకు నాకము, శృతులకు చెవులు, నాకము ముక్కు అని అర్థముండుట చేత. తక్షణమే కత్తిని తీసి ఆ దుర్మార్గురాలి గర్వమణచుట మంచిదనితలచి ఆమె ముక్కు చెవులు కోసివేసెను.

ఆ ముక్కు చెవులు కోయుటచేత, అరణ్యము దద్దరిల్లునట్లు రోదన చేసి

శూర్పణఖ రౌద్రాకారముధరించి దుఃఖించుచూ, మోహించి చెంతకువచ్చిన స్త్రీని ఈ రీతిగా చేయుట న్యాయమా అని పలుకుచూ, నా అన్న అయిన రావణుని తీసుకొని వచ్చి మీకు తగినరీతి గావింతునని శపథము చేసి వేగముగా వెనుకకు తిరిగెను.

శూర్పణఖ సరాసరి ఖరదూషణాదులవద్దకువెళ్ళి సోదరికిట్టి పరాభవము సంభవిల్లగా మీరెట్లు భరించుచున్నారు. ఓ తమ్ముడా ! మీ భుజబలములు ఎందు నిమిత్తము, కాల్పనా ? మీరు పురుషులు కారా ? అని రోదనచేయుచుండ విషయమేమిటో ఖరదూషణాదులకు బోధపడక, "చెల్లీ ! యేమిటీ వికారము, ఎవ్వరు నిన్నిట్లు వికార పరచిరి, విషయములను తెలుపుము, తదుపరి మా బలపరాక్రమముల చూడగలవు" అని వారునూ అత్యంతాతురతతో ప్రశ్నింప, అపుడు అధిక కాలము రామలక్ష్మణుల రూపసౌందర్యములనే వర్ణించుచూవచ్చెను. అందులకు సోదరులు, యేమి జరిగినదో తెలుపమన వారి వర్ణనలతో కాలము వృధాపరచుచున్నావని కోపించిరి. అంత, అడవిలో జరిగిన వృత్తాంతమంతయూ ఆమె సోదరులకుతెలిపెను.

అంత ఖరదూషణాదులు, తమ సోదరిముక్కు చెవులు కోసిన రామలక్ష్మణాదులపై పదునాలుగు వేల రాక్షసవీరులను వెంట బెట్టుకొని దండెత్తిరి; నిజముగా బయలుదేరిన వీరులు స్వప్నమందైననూ పరాభవము పొందజాలరు, వెనుదీయరు. రెక్కలుగల పర్వతములవలే అందరూ భూమి దద్దరిల్లునట్లు గుంపులు గుంపులుగా పరుగులు తీసిరి. నానా విధ ఆయుధములను ధరించి ముక్కు చెవులులేని విధవ ముండ నడువ, ఆమెను వీరందరూ అనుసరించుచూ వచ్చిరి.

వారి జయమునకు ప్రప్రథముననే అపశకునము, అశుభసూచన, విధవ రక్తమును కార్చుకొనుచూ, అంగహీనురాలై ముందు నడచుట అశుభమని రాక్షసులకు తెలియదు. రాక్షసులు తమ భౌతికబలములను రాక్షస దుష్టశక్తులను మాత్రమే లక్ష్యమందుంచుకొందురు. కానీ శుభాశుభములను వారు యోచించరు; ఇది రాక్షస లక్షణము. అందువలననే వారలకు అమితబలము, శక్తులు వుండియూ, దైవమును, ధర్మమును జయించలేక పోయిరి.

ధర్మబలముకంటే మించిన దానవబలము, దైవబలముకంటే మించిన శక్తి బలము మరొకటి లోకమునలేదు. కానీ దైవమును ధర్మమును వారు చింతించక, కేవలము, వారి వారి భుజబలములను వర్ణించుకొంటూ, పొగడుకొంటూ రణభేరీలను మ్రోయించుకొంటూ గంతులు వేయుచూ, పలువిధములైన వికారపు కేకలు వేయుచూ సింహములవలే, యేనుగులవలే గర్జించుచూ దారిని నడువజొచ్చిరి. చిన్నపిట్ట వేగతో పోరాడుటకు బయలుదేరి వట్లుండెను వారి ఉత్సాహము.

దూరమునుండి శూర్పణఖ రాముని పర్ణశాలను తన సోదరులకు చూపుచూ సైన్యమునకు ఉత్సాహము కలుగునట్లు ఆ ఇరువురు అన్నదమ్ములను చంపుడు, పట్టుడు, హతమార్చుడు అంటూ కేకలు వేయించెను. ఖరదూషణాదులు, ఓరీ దుర్మార్గుడా, దౌర్భాగ్యుడా, మా సోదరిని పరాభవము గావించితివా ! ఇక నీ ప్రాణములు కాపాడుకొమ్ము అని గర్జించుచూ పర్ణశాలను చుట్టుముట్టిరి.

ఆకాశమంతయూ ధూళిచే కప్పుకొనెను. ఈ దృశ్యమును శ్రీరాముడు ముందుగనే కనిపెట్టి లక్ష్మణుని పిలిచి సీతను గుహయందుంచుకొని నీవు ఆమెను కాపాడుచుండుము. నాకు అణుమాత్రమైననూ భయములేదు. లేశమాత్రమైన నాకు కీడు వాటిల్లదు, అని తెలిపినతోడనే లక్ష్మణుడు రామశక్తిని యెరిగినవాడగుట చేత, భయపడక, సీతను వెంటబెట్టుకొని ధనుర్బాణములు ధరించి గుహలో ప్రవేశించెను.

రాముడు కోదండము నెక్కుపెట్టి చిరునవ్వుతో పర్ణశాల ముందు నిలిచి యుండెను. రెండుచేతులతో శ్రీరాముడు తన జడలను సవరించుకొనుచుండ, ఆ జడలు కోటానుకోట్లు మెరుపులవలే రాక్షసుల కన్నుల దృష్టిని మబ్బు గావించెను. రాక్షసులు ఆ తేజస్సును కన్నులుతెరచి చూడలేకపోయిరి. రాములయొక్క హస్తములు మహా విశాలమైన సర్పముల వలె కనుపించెను. మద గజములను చూచి సింహము కోరలు గీకుచుండిన విధమున, ఈ రాక్షసగజములను చూచి పురుష సింహమైన రాముడు వారల రాక్షసత్వమును హతమార్చుటకు సంసిద్ధమై యుండెను. వారిలో "ఇతనే సోదరికి ముక్కు చెవులు కోసిన దుర్మార్గుడు, పట్టుకొనుడు పట్టుకొనుడు" అని అరుపులు మాత్రము వినుపించుచూవచ్చెనే కానీ ఒక్కడైనా దగ్గరకు రాలేకపోయిరి. ఎన్ని ప్రయత్నములు చేసిననూ రాముని సమీపించునట్టి ధైర్యము వారిలో ఒక్కరికైననూ లేకపోయెను.

రాక్షసుల అరుపులకు దండకారణ్యములోని క్రూర మృగములు అదరి, బెదరి పరువులు తీయుచు ప్రాణరక్షణ నిమిత్తము చిక్కక గుహలలో ప్రవేశింపజూచుచుండెను. అట్లు బెదరిన మృగములు కొన్ని సీతాలక్ష్మణులుగల గుహలో కూడ ప్రవేశించెను. వాటిని సీతాలక్ష్మణులు అదిరించక, తమవలే వాటికి కూడ అందులో స్థానమిచ్చి వాటిని రక్షించుచూ వచ్చిరి.

ఇక రాముని చుట్టు ముట్టడించిన రాక్షసులు, రాముని సుందర విగ్రహమును సౌందర్య ఆనందమును చూచుచూ వర్ణించుచూ, మోహించుచూ, స్థంభించి నిలిచిరే కానీ ఒక్కడైన ఆయుధములను యెక్కు పెట్టుటలో లేక బల్లెములను పైకి తీయుటలో యేమాత్రము జరుగలేదు. ఈ సందర్భమున శూర్పణఖ, "సోదరా ! ఇంతటి

చక్కని సౌందర్య స్వరూపమును నేనింతవరకు యెక్కడనూ చూడలేదు. వీరిని సంహరించక, నాకప్పుజెప్పుడు" అని ప్రార్థించెను. ఆ మాటలు విన్న ఖరదూషణా దులు కూడను, "సోదరీ ! ఇంత చక్కని రూపలావణ్యముగల వ్యక్తిని మేము కూడనూ ఇంతవరకు చూడలేదు. అతనిని సమీపించుకొలది మాకును మోహమే ఆవరించుచున్నది; కానీ ద్వేషమో, క్రోధమో, యే మాత్రము కూడనూ కలుగుట లేదు. అతనిని చూచుచూ వుండిన యెంతో హృదయము వుప్పొంగి పోవుచున్నది. ఆనందమన్న ఇదియే కాబోలు" అని వర్ణించుచూ వచ్చిరి. ఇంతలో తానే తాను రామునితో సంప్రతింపులు జరుపుటకు ఇష్టపడక, ఖరుడు ఒక దూతతో అతను యెవ్వరో అతని పేరేమో, యెక్కడనుండి వచ్చి ఈ అరణ్యమున ప్రవేశిం చెనో, ఈవృత్తాంతములనన్నింటిని వివరముగా తెలిసికొనిరమ్మని చెప్పి పంపెను.

ఖరుని ఆజ్ఞ ప్రకారము ఆ దూత వచ్చి, ఖరుడు చెప్పిన పలుకులను వివ రించెను. అందులకు శ్రీరాముడు చిరునవ్వుతో "ఓరీ ! నేను క్షత్రియుడను, మీ వంటి మృగములను సంహరించుటకు ఈ అరణ్యమునకు వచ్చితిని. కాలునకు కూడనూ వేను వెరువను. మీకు బలమున్నదా నాపై యుద్ధమునకు సిద్ధముకండు, లేకపోయెనా మీ మీ గృహములకు మీరు క్షేమముగా చేరుడు. యుద్ధమునకు విము ఖులైన వారిని నేను సంహరింపను," అని చెప్పిన మాటలను దూత వెళ్ళి ఖర దూషణాదులకు తెలిపెను.

అంత రాక్షసులైన శూర్పణఖ సోదరులు మండిపడి పరశువులను, శూలము లను, త్రిశూలములను, కృపాణములను, శస్త్రాస్త్రములను ధరించిరి. యుద్ధమునకు సిద్ధమన్నట్లుగా, శబ్దములు ఘూనభోంతరాళములు నిండెను. రామునిపై శస్త్రాస్త్రము లను వర్షించిరి. వాటన్నింటిని రాముడు ఒక బాణముతోనే ఖండించుచూ వచ్చెను. రాముడు విడచుచున్న బాణములు ఒక్కొక్కటి సర్పములవలే, మంచు వలే, వారల పైకి వెళ్ళుచుండ, అమ్మా, అబ్బా, అయ్యో అను శబ్దములుచేయుచూ, వీరాధి వీరులు వెనుకకు వురుకుచూ వెళ్ళిరి.

వారలనుచూచి ఖరుడు, దూషణుడు, త్రిశిరుడు ముప్వురు అన్నదమ్ములూ, రాక్షసులారా ! యుద్ధమునుండి మీరు పారిపోకూడదు. అట్లు పారిపోవువారిని మా హస్తములతోనే సంహరింతుము అని భయపెట్టుతూ వచ్చిరి. అందుచే రామ హస్త ముల చేతనైనా చచ్చుటమంచిదని తలంచి వెనుకకువెళ్ళు రాక్షసులు, రామ బాణములకు గురియగుటకు ఉత్సాహముతో ముందుకు వచ్చిరి. వచ్చిన సైనికులు రాముని మోహించి అతనినే చూచుచూ ఆనందించిరి.

ఇంతలో రాముడు సమ్మోహనాస్త్రము ప్రయోగించెను. దానితో వారిలో వారికి అందరూ రామునివలె కనుపించిరి. అట్లు కనుపించగనే వీడుగో రాముడు, వాడుగో రాముడు అని వారిలో వారినే రాముడుగా భావించుచూ, వారిని వారే చంపుకొనుచూ వచ్చిరి. ఆ ప్రదేశమంతయూ, ముక్కలు ముక్కలుగా అంగములు వేరు వేరుగా కనుపించెను అరణ్యమంతయూ రక్తప్రవాహమాయెను. కాకులు, గ్రద్దలు, వేలకు వేలు చేరెను. రాక్షసులు పదునాల్గు వేలు, రాము డొక్కడు. ప్రతి రాక్షసుడు రామ, రామ, రామ అనుచూ అరుచుచూ క్రింద పడెను.

ఈ ప్రకారము ఖరదూషణాది చతుర్దశ సహస్రరాక్షసులను క్షణమాత్రములో రాముడు సంహరించెను. ఈ ఘోరదృశ్యమును కండ్లారచూచిన ఋషులూ, మునులూ, రామశక్తిని గుర్తించి తప్పక రావణునికూడా క్షణములో హతమార్చునని తమలో తాము ఆనందించిరి. రాక్షససంహారముగావించి లోకానికి కళ్యాణము చేకూర్చు పరమేశ్వరుడే శ్రీరాముడని దృఢవిశ్వాసులయిరి. ఈ ఘోర సంగ్రామము శాంతిపడిన తోడనే సీతాలక్ష్మణులువచ్చి శ్రీరామునకు నమస్కారము చేసిరి. తమ్ముడైన లక్ష్మణుని కౌగిలించుకొని తమ్మునకు ఈ రెండు ఘడియలలో రాక్షసులతో పోరాడిన వివరములు చిరునవ్వు చిందులుద్రొక్క ముచ్చటించెను. సీత పరమానందములో రాముని దేహమున కెందైనా గాయము తగిలినదా అన్నట్లు అతని ప్రతిఅంగమునూ గుర్తించుచూ వచ్చెను.

రెండవదినము అనేకమంది తాపసులు ఈ మంగళవార్తను విని పంచవటీ తీరమునకు శిష్యబృందములతో గుంపులు గుంపులుగా వచ్చి రామచంద్రుని కొనియాడిరి. కానీ అందులో కొందరు దివ్యదృష్టిగల మహనీయులు, రామచంద్రునితో, "ఓ నాథా! ముందు ముందు కొంత జాగ్రత వహించవలసియుండును. రాక్షసులు నీతి, నిజాయితీలకు అతి విరుద్ధులు, తమ పాపభావములను తాము యోచించరు. పరుల కపకారముచేయుటే వారి నిత్యవ్రతము. తమ స్వార్థమును తాము సాధించుకొనుటే పరమోద్దేశము. వారికి రావణుడను మహోక మహాశక్తివంతుడైన అన్న కలడు. అతను లక్షల సైన్యమును కలిగియుండును. ఈ జిత్తులమారి నీచరి శూర్పణఖ చెప్పి వానికి తెలుపక వుండదు. వాడు రాక మానడు" అని వారి వారికి తోచిన భవిష్యత్తుయొక్క భద్రతలను వహించు విషయములను రామలక్ష్మణులకు తెలిపిరి.

రాముడు చిరునవ్వుతో, అవును. అవును ఇదినాకు తెలియనిదికాదు. నేవచ్చినదే అందునిమిత్తము. ఆ శుభసమయమునకై కాచియున్నా ననునట్లుగా తలపూపుచూ, యేమీ తెలియని వానివలె నటించుచూ, తమ్మునితో లక్ష్మణా వింటివికదా! అని

రాబోవు అభ్యంతరాలకు తాను సంసిద్ధముగా వుండినట్లును మీరేమాత్రము విచారించ నక్కరలేదనియు, వాగ్దానమునిచ్చి, ఆనంద వచనములు బోధించి, ఉత్సాహవంతులను గావించి వారి వారి స్థానములకు పంపెను.

ఇది యిట్లుండ రాముడు, మునులు తలంచినట్లుగనే, శూర్పణఖ విలపించుచు హుటాహుటి రావణుని సమీపించెను. ఆమె రోదనను లంకలో రాక్షసులందరు పరమాశ్చర్యముతో విని లంకకేమి ప్రమాదము వాటిల్లినదో అన్నట్లు వీధులలో గుంపులు గుంపులు కూడిరి. చేరిరి. రావణుని దర్బారుహాలులో ప్రవేశించి, పరమ రోషమును కలిగించు మాటలను వ్యవధి లేకుండ పలుకుట కారంభించెను. రూపమా వికారము, దేహమా రక్తమయము, మాటలు మహాక్రోధముతో కూడియుండుట చూచి రావణుడు, ఈమెకు యెవరో యేదో కీడుచేసిరని గమనించి, సోదరీ, విషయమేమిటో వివరింపుము అని రావణుడు గర్జించెను.

అంత శూర్పణఖ, అన్నా! నీవు నిజముగా రాక్షసుడవే అయిన, నీ తపశ్శక్తియే భద్రమయినదైన, నీవు నిజముగా వీరుడవే అయిన నీ ధైర్య, పరాక్రమ, వీర్యములను ప్రదర్శించు సమయము ఆసన్నమయినది. నీవు నీకు ముందు రాబోవు ప్రమాదములను గుర్తించక మద్యపానమున మత్తుడవై సర్వమును మరచి నిద్రించుచున్నావు పంచవటీ తీరమున యేమి జరుగుచున్నదో యెవరు అక్కడికి వచ్చి చేరిరో, వారు యేవిధమైన దీక్షను సాధించుటకు పుట్టిరో కొంతైన విచారించకున్నావు. రాక్షస సంహారకులగు రాజకొమారులు దండకారణ్యమున ప్రవేశించినారు. లక్షల సైన్యమును సయితము క్షణములో నేలకూల్చుచున్నారు.

సోదరులైన ఖరదూషణాదులను కండలు కండలు గావించిరి. వేల సైన్యమును కన్నుమూసి తెరచునంతలో అదృశ్యముచేసిరి. వారి పరాక్రమము వర్ణనాతీతము. వారి రూపములా అబ్బా! అని కన్నులు మూసుకొని కొన్ని క్షణములు మాటలాడక నిలిచెను.

ఈ విషయములు వింటున్న రావణుడు రౌద్రుడై పండ్లు పటపట కొరికి, తొడలను కొట్టి, యేమీ ఆ దుర్మార్గులు ఖరదూషణాదులను ఖండించిరా? నా పేరు నైనను తలంచరైరి కాబోలు. నా ప్రతాపమును యెన్నడు వినియుండరు కాబోలు. అని అనేక విధముల తన ప్రభావమునే వర్ణించుకొనుచూ వచ్చుటచూచి శూర్పణఖ, "ఓరీదౌర్భాగ్యుడా! నెత్తిపై శత్రువు వచ్చి నృత్యము చేయుచుండ నీప్రతాపమును నీ శౌర్యమును నీవు వర్ణించుకొనుచూ పిరికిపందవై ప్రగల్భములాడుట రాజలక్షణముకాదు. పాంగత్యము వలన సన్యాసులును కుమంత్రులవలన రాజులును,

మానము వలన జ్ఞానమును, మద్యము వలన సిగ్గునూ్న నశించునను విషయము నీకు తెలియదు కాబోలు. ఓరీ సోదరా ! అగ్ని, రోగము, శత్రువు, పాము, పాపము ఇవి చిన్నవని విరసింపకుము. ఇవే ప్రబలినయెడ యెంతటి ప్రమాదమునకైనా వెను తీయవు. కాన త్వరపడుము, త్వరపడుము" అని శూర్పణఖ మహారోషముమ నూరి పోసెను.

ఇంతలో కుంభకర్ణుడు సోదరీ నీ శ్రోత్రము నాసికను త్రుంచినవా రెవరు? అని మందహాసమున ప్రశ్నించ, ఈ దుశ్చర్యను ఆ రాజకుమారులే గావించిరి అని విలపించెను. అంత రావణుడు ఆమెను కొంత సమాధాన పరచి సోదరీ ! ముక్కు వున్నది ఒక స్థానము, చెవులున్నది మరొక స్థానము, రెండునూ ఒకపరి త్రుంచ వీలుకాదు కదా ? ఒక్కొక్కటి ఒకొకపరి త్రుంచుచుండ నీవు నిద్రించుచుంటివా ? ఇది పరమాశ్చర్యముగ నున్నదే, అని సభాసదులకు తెలిపెను.

ఇంతలో శూర్పణఖ కన్నులు తెరచి, "అన్నా, వారి మృదు మధురమైన హస్తములు, నా దేహమునకు సోకిన తక్షణమే నా దేహమునే, అసలు దేశమునే మరచితిని. కన్నులతో సమీపించిన ఆ సుందర మోహన ముఖమును చూచుచుండ, యేమి త్రుంచిరో, యేమి చేసిరో నాకు తెలియదు. వారల దర్శనమే అంత తన్మయత్వము గావించెను. వారి స్పర్శ మైమరపించెను. వారితోటి సంభాషణ ఇకచెప్ప తరముకాదు. వారిలో యెట్టి సమయమునందైననూ చిరునవ్వు తప్ప అన్యభావములు గోచరించవు. పురుషులు కూడను వారిని చూచి మోహించక వుండరు. వారు సాక్షాత్ మన్మథులే. అట్టి సౌందర్యవంతులను నేనింతవరకూ చూచియెరుగను. మన రాక్షసశక్తులు క్షుద్రములు. మన రూపములు మహావికారములు, అసహ్యములు.

నీవు ఒకతూరి వారిని చూచితివా, నీకే తెలియును. గతించిన ఖరదూషణాది సోదరులు సహితము, వారితో యుద్ధము చేయుటకు అంగీకరించకపోయిరి. సోదరీ, యిట్టి దివ్యమంగళ విగ్రహములతో యే విధముగా విరోధము పెట్టుకొనుటకు మా మనస్సంగీకరించకున్నది, అని పదేపదే తెలిపెడివారు" అని ఈ విధముగా రామలక్ష్మణుల రూపలావణ్యములను వర్ణించుచూ శూర్పణఖ ఆ సభాసదులను ఆనందపరచెను.

శూర్పణఖ చెప్పుచున్న మాటలు, రావణునికూడా భ్రమింపజేసెను. ఆ మాటలు వినుటకెంతయో హాయిగనుండెను. లోలోన రావణుడుకూడా ఆ సుందర విగ్రహములను దర్శించవలెనను కుతూహలముతో వువ్విళ్ళూరుచుండెను. తనలో చెలరేగిన క్రోధాగ్ని చల్లబడుతూ వచ్చెను.

శాంతముగా వారిని సమీపించి విషయమేమో తెలుసుకొనుట మంచిదని తనలో తలంచెను. ఇంతలో వున్నట్లుండి రావణుడు సోదరీ! వారిరువురు రాజకొమారులు మాత్రమే పంచవటియందు నివసించుచున్నారా? లేక ఇంకా వారి పరివారమేమైనా కలదా? అని ప్రశ్నించెను.

అందులకు శూర్పణఖ "అన్నా! పరివారమూ, బంధు బలగమూ యెవ్వరూ లేరు. వారిలో పెద్దవాడవబడు శ్రీరామునికి, అతిలోక సౌందర్యవతియైన ఒక స్త్రీ వున్నది. ఆమె వారిని మించిన సౌందర్యరాసి, సాక్షాత్ రతియే. ఆమెతో వారిరువురూ పంచవటియందు విచ్చలవిడిగా, నిర్భయముగా సంచారము చేయుచున్నారు. నిజముగా అట్టి స్త్రీని నీవెన్నడూ యే లోకముననూ చూచి వుండవని తలంతునని ఆశ్చర్యముగా తెలిపెను.

# మాయామృగము

శూర్పణఖ పలుకులు వినగనే, కామాంధుడైన రావణుడు, దౌర్భాగ్యపు బుద్ధికి బద్ధుడై రామ లక్ష్మణాదులపై ద్వేషమునువీడి, సీతాపహరణమునకు చిత్ర విచిత్రములైన పన్నాగములు యోచించ మొదలుపెట్టెను. నిద్రాహారములు సంయి తము మాని ఒకే విచారమున మునిగెను.

ఆసభలో రామలక్ష్మణుల సౌందర్య గుణగణములను సోదరియైన శూర్పణఖ చెప్పుచుండ, అత్యంత ఆనందముతో వినుచూ, ఆనందబాష్పములు రాల్చుచు, మైమరచిన విభీషణుడు, ఆ సుందర దివ్యమంగళ విగ్రహములను తన హృదయ మున ప్రతిష్ఠించుకొని, వారిని ప్రత్యక్షముగా యేనాడు చూతునో? తరింతునో? వారిని పర్శింతునో? అని చింతించుచూ, వీరు సాక్షాత్ దైవస్వరూపులే. కేవలము రాక్షస సంహారార్థమై అవతరించిన నరరూపులు అని దృఢము చేసుకొని వారికి తన సర్వస్వమును అర్పిత మొనరించి, ఆనాటినుండి, వారినే స్మరించుచూ జీవించ ప్రారంభించెను.

రావణుడు యోగభ్రష్ఠుడగుటచేత రాక్షసాకారుడై, రాక్షస నాయకుడై సంచ రించుచున్నాడే కానీ, తాను పరమాత్మని పరమభక్తుడు, శ్రీమన్నారాయణుని తత్వము తనకు తెలియనిదికాదు. శ్రీరాముడు సాక్షాత్ నారాయణుడేనని గుర్తించి, దేవతలకు ప్రీతినొసంగ, లోకమున రాక్షసత్వమును హతమార్ప ఈ రూపమున వచ్చెనని తనకు తెలియకపోలేదు. అయినా అతను నారాయణుని పొందుమార్గము వేరొకటి లేకపోవుటచేత, ఈ విధమైన హఠమును పూని, వారితో విరోధమును బలపరచుకొని, వారి బాణములతోనే తాను చావవలెనని ఆశించి, ఈ తామస శరీర ముతో అతనిని భజించి, భవసాగరమును దాటవలెనని అతని స్థిరసంకల్పము.

ఇంతలో, రాక్షసబుద్ధి ప్రభావముతో పుట్టిపెరిగిన కాయమగుటచేత, దైవ భావమును మరచి దానవ తత్వమును విచారించ పూనుకొనెను. క్షణము దైవత్వమ్ము,

క్షణము దానవత్వము; ఈరీతిగా అస్థిరభావము కలవాడగుటచేత వాఁడెవరో రాజ పుత్రులై వుందురనియూ, ఆ రాజపుత్రులను సంహరించి ఆస్త్రీని గొనితెత్తుననియూ తన సోదరికి వాగ్దానము చేసెను.

అంతటితో సభ చాలించి రథమును తెమ్మనమని భటులకు ఆజ్ఞాపించి వంట రిగా ఆ రథమున కూర్చొని సముద్రతీరమున నున్న మారీచునిగృహమునకు వెళ్లెను. అక్కడ జరిగినవృత్తాంతమును మారీచునికితెలిపి మారీచుని తనకార్యములో భాగము వహించవలెనని ఆజ్ఞాపించెను. అయితే మారీచుడు రామలక్ష్మణుల శక్తిసామర్థ్యము లను తాను ఇదివరకే అనుభవించితిననియూ, వారు సామాన్యులు కారనియూ, ఈ విధమైన ప్రయత్నమునకు సాహసించుట మంచిది కాదనియూ, అనేకవిధముల రావణునితో తెలిపినను, కామాంధుడైన రాక్షసునకు కర్తవ్యమును గుర్తించే శక్తి సామర్థ్యములు శూన్యమగుటచేత, మారీచుని శిక్షించుటకు ప్రయత్నించగ, మారీచుడు తనలోతాను ఈ రాక్షసుని చేతులలో చచ్చుటకంటె, రామ హస్తములలో నైనా ప్రాణములు వీడుట మంచిదని తలంచి రావణుని ఇష్టమునకు వొప్పుకొన్నాడను.

దండకారణ్యమునకు రావణుడు మారీచుని వెంటబెట్టుకొని వెళ్లెను. మధ్యలో తాను వేసిన పన్నాగములను వివరించి మారీచునికి తెలిపెను. తన రాక్షసశక్తిచేత మారీచుని ఒక సుందరమైన బంగారుజింక రూపమును ధరించమనిచెప్పి, సీతా రామ లక్ష్మణులు నివసించు పర్ణశాలముందు అతి విచిత్రమైన ఆటల నాడుచుండుమని ఆజ్ఞాపించెను. మారీచునకు వేరు మార్గములేక అంగీకరించెను; తదుపరి రాముడు నిన్ను పట్ట తరుముకొని వచ్చుననియూ, నీవు దూరప్రాంతములకుపరుగిడి, అక్కడ సీతా లక్ష్మణులు వినునట్లు, "హా సీతా, హా లక్ష్మణా" అని రామకంఠస్వరముతో గర్జించుము; తదుపరి జరుగవలసినదంతయూ నేను జరిపింతునని చెప్పి దూరమున రథమును నిలిపి, వారి నాటకమును వారు ప్రారంభించిరి.

ఇవి యిట్లుండ చిత్రకూట పర్వతమున పర్ణశాలలో సీతా రామలక్ష్మణులు, తాము యేతెంచిన కార్యము ప్రారంభించినదన్నట్లు, శ్రీరాముడు కందమూల ఫలము లను తీసుకొని వచ్చుటకు లక్ష్మణుని వనమునకు పంపెను. ఇదే సమయమని తలంచి సీతతో ఈవిధముగ రాముడు సంభాషణ ప్రారంభించెను:

సఖీ; నీకన్నియూ తెలుసును. మనము ఏ కార్యము నిమిత్తమై ఈభూలోక మునకు వచ్చితిమో మన ఇరువురకూ విదితమే. వచ్చినపని ప్రారంభమయినది. నీ గుణశీలములు మహా పవిత్రము, మనమీ కాయము ధరించినది అగ్నిహోత్రాది కర్మఫలమున; అవగా అగ్నిదేవుడు తెచ్చిన పాయసముచే నా కాయమును, యజ్ఞ

క్రతువునకు అగ్నిహోమములు ప్రతిష్ఠించు ప్రదేశమును నాగలికట్టి దున్నుచుండ, జన్మించిన కాయము నీ కాయము. అన్నింటికి అగ్ని కారణము. కాయము నిలుచు నది ఆ వేడిమి కాయము నందుండుటచేతనే, కాన నీవిక నీ దివ్య విభూతులు, అన్ని టిని దాచి, నీవు సామాన్య మానవ స్త్రీవలె ప్రవర్తించు.

నేనును, సామాన్య మానవమాత్రునిగా ప్రవర్తించి నీకొరకు విరహ శోకా దులు చూపుచూ ప్రవర్తింతును. ఈ వినోదము చూచు లోకులు సామాన్య లక్ష ణాదులనే దృష్టియందుంచుకొందురు; అవి లోకాధార వృత్తులుగా స్వీకరింతురు. మన మొనర్చు ప్రతి చిన్నకార్యము, సంసారికి ఆదర్శవంత మైనట్టిదిగా వుండవలెను. సతిపతుల సభ్యతలకు యెట్టి అవాంతరములు వాటిల్లక, సత్యధర్మములకు విరుద్ధము కాక, శాస్త్ర సమ్మతమైన మార్గమును వీడక, సామాన్య మానవమాత్రులకు ఆదర్శ వంతమైన జీవితమును అందించుచూ, రావణ, రాక్షస సంహారము వరకు మనమీ నాటకము నాడవలసి వుంటుంది. అంతవరకు నీ దివ్యరూపమును అగ్నిలో ప్రవేశ పెట్టి, సామాన్య మాయా మానుష విగ్రహధారివై సంచరించు, కారణము లేని కార్యము లోకవిరుద్ధము. నిష్కారణముగా రాక్షస సంహారమైనప్పటికినీ, ధర్మ విరుద్ధము కాని కారణమును చూపి, కార్యమును నిరూపించవలెను.

కార్యకారణాదులు అవినాభావ సంబంధములు; నిన్ను రావణుడు తీసుకొని పోయినట్లు చూపి, వాని కామవృత్తులను లోకానికి వ్యక్తపరచ వలసియుండును. అంతేకాక వాని భక్తి ప్రపత్తులు ఉత్తమమైనవి కావనికూడా ఆస్తిక లోకానికి అం దించటము అత్యవసరము. చిత్తశుద్ధి లేని ఆచార వ్యవహారములు అల్పకార్యము లనియూ, కామవృత్తిచే యెట్టి భక్తిని ప్రదర్శించినను అది వట్టి చెత్తతో సమాన మనియు, శక్తినిమిత్తమై తపస్సులు యజ్ఞయాగాది క్రతువులు ఘోరముగా ఆచరించినను అవి క్షుద్ర సాధనలనే సత్యాన్నికూడా లోకానికి చాటుట అత్యవసరము. రాక్షస వృత్తులను వీడక దైవకార్యము లెన్నిచేసినా అవి కాల మును అపవిత్రము గావించునవే కాగలవనికూడా రావణుని ఆదర్శమును నిరూ పించవలెను.

ఈ అన్నింటికీ పైన వానికి యిచ్చిన శాపముకూడా మరొకవైపున భిన్నము కాకుండ చూచుకోవలసి వుండును. రావణుని వినాశకాలము ప్రారంభమైనది. నేడో రేపో ఇక మన వియోగము ప్రారంభముకూడా. మనకే నాటికీ వియోగములేదు. రాదు. కానీ లోకవ్యవహారమున అట్లు నిరూపించవలసి వచ్చినది. తక్షణమే వెళ్ళి శీఘ్ర నీ దివ్యరూపమును అగ్నిని ప్రవేశింపుము. లక్ష్మణుడుకూడా ఫలములతో

తిరిగివచ్చు వేళఅయినది. రావణుడుకూడా వికారబుద్ధులతో సర్వసిద్ధముగావున్నాడు" అని రాముడు తెలిపినారు.

అత్యంత రహస్యమును మరొకదానిని రాముడువెల్లడిచేసెను. నీవు అగ్నిలో ప్రవేశించి రాక్షస సంహారమున నీవును నా కార్యములో భాగము సహించవలసి వుంటుంది. నీవు నిమిత్తమాత్రముగా సామాన్య రూపములో రావణుని అధీనములో వుండినా, నీశక్తి అగ్నియందుండుటచేత, ఆ అగ్నిరూపమైన నీవు లంకనుభస్మము గావించవలసి వుండును. లంకను అగ్నికాదు భస్మము గావించుట, నీవే. అనగా సీతయే లంకను కాల్చెను. రాముడే రావణుని చంపెను. అన్న సత్యమును లోకానికి అర్థమగునట్లు చేయవలసి వున్నది. ఈ చమత్కారములు లక్ష్మణునికి సహితము తెలియరాదు. లక్ష్మణుడు మన పరికరమేతప్ప అన్యశక్తికి సంబంధించడు.

ఈ కార్యము పూర్తిఅయి అయోధ్యకు ప్రవేశించే కాలమున నిన్ను అగ్ని నుండి స్వీకరింతును. అదియూ లోకానికి ఒక విధమైన పరీక్ష లక్ష్యమున ఆదర్శ మును నిరూపింతును. మన నాటకము నేటినుండి ప్రారంభమగుచున్నదని, యిరు వురూ ప్లాను వేసుకొని రావణుని రాకకై సంసిద్ధముగా వుండిరి. ఆనాటినుండి సీతా రాములు గావించు లౌకిక వియోగ తాపత్రయములు, శోకములు, వేదనలు కేవలము నాటకములే కాని సత్యములుకావు. వారి యిరువురకూ వియోగమే లేదు, రాదు. వియోగముతో మానవులకు ఒక విధమైన నీతిని ప్రకటించ పూనుకొనిరి.

ఇంతలో లక్ష్మణుడు ఫలములతో ప్రవేశించెను. అందరూ ఆ ఫలములను ఆరగించి చల్లని నీరును త్రావి ప్రకృతి సౌందర్యమును, రాక్షసుల ప్రవర్తనలను గురించి మాట్లాడుతూ, అరణ్యవాసమెంతో ఆనందదాయకము అన్నట్లు ఆనంద ముతో ముచ్చటించుచూ వుండిరి. సమీపించిన రావణ మారీచులు, వారిలో వారు యే రీతిగా ఆశ్రమమును ప్రవేశించవలెనన్న విషయమును చర్చించుచూ వుండ, మారీ చుడు దుష్టుడైన రావణుని గుణములకు అసహ్యపడుతూ, అతనిని యెదిరించుటకు శక్తిలేక, వాని చేతులలో చచ్చుటకు యిష్టము లేక యేమీ చేయలేని స్థితిలో రావ ణుని ఇష్టానుసారము అనుసరించ నంగీకరించెను.

ఒక సుందరమైన, సీతారాములకు ఆకర్షవంతమైన రూపము ధరించి మారీ చుడు తనలో తాను, ఆహా ! ఈ దినమెంత సుదినమో కదా ? కొన్ని నిమిషములలో అతి లోకసుందరులైన త్రిమూర్తులను దర్శించబోవుచున్నాను. సీత దృష్టి తనపై గాఢముగా ప్రసరించబోవుచున్నది. ఆ తరువాత రాముడు ధనుర్బాణధారియై నన్ను తరుముతూ నా వెంట రాబోవుచున్నాడు. రాములను అనుసరించవలసిన ధానుదను.

రాముడే నన్ను అనుసరించుచూ వచ్చుచున్నాడవిన నేనెంత ధన్యుడనో. నేను చేయు నది మహా పాపమయినా అది నా బుద్ధి పూర్వకము కాదు. ఇది ఒక విధమైన బల ప్రయోగము-కనుక నా తప్పు కాదు. ఏ తప్పైనను రామబాణము, రామ హస్త ముతో, నా కాయమును కోతను. అప్పుడు ఈ మాయాదేహమును వీడుదును. అదే నా మహాప్రాప్తి. ఇది అందరికీ సాధ్యమా; అంతేకాక, నేను కాయమును వీడు నప్పుడు నా కన్నులు రాముని చూచుచుండును. ఆ సుందర విగ్రహమే నా ముందు, ఆ మంగళ నామమే నా నాలుకయందు, ఆహా ! యెంత ధన్యుడను ! నాకంటే పుణ్యా త్ముడు మరొక డుండడుకదా. అని తనలోని మధురభావములను తాను మంచిరీతిగా తలంచుచూ పర్ణశాల సమీపమునకు నడువ ప్రారంభించెను. సర్వజ్ఞుడైన రాముడు సర్వజ్ఞురాలైన సీత వారిరాకకై నిరీక్షించుచున్నారు.

ఇంతలో పర్ణశాల ముందు కపట మృగము అదురుతూ బెదురుతూ అటుఇటు పరుగెత్తుతూ, దృష్టిని మాత్రము సీతా రాముల వైపునకు మరల్చి, వారి ముందు నిలిచి వారినే చూచుచూ, మరి పొదలలో దూరుచూ, ఈ విధముగ అనేకమైన ఆటలాడ దొడగెను.

సీతారామలక్ష్మణులు చిరునవ్వులతో ఆ మృగముయొక్క సౌందర్యమును వర్ణించుచూ దాని చర్మము సువర్ణముగలదై వుండుటచేత, ఇది ఒక విధమైన నూతన జాతికి చేరియుండునని తమలో తాము వర్ణించుచూవుండ, కొంతసేపటికి, సీత "నాథా ! ఎంత సుందర విగ్రహము. ఈ మృగమును మనము చెంత పెట్టుకొనిన, నేనెంతయో ఆనందముగా కాలము గడుపవచ్చు కదా !

ఒక్కొక్కపరి మీరిరువురు అనివార్య కార్యములందు నిమగ్నులయినపుడు నేనీ మృగముతో ఆడుకుంటూ కాలమును గడుపవచ్చు కదా ? దయచేసి ఆ మృగ మును పట్టింతురా ? నా వినోదార్థము ఈ చిన్న సహాయమును చేయలేరా ? అని యెంతో ప్రీతిని ప్రదర్శించుట చూచి లక్ష్మణుడు, తల్లీ నేను గొనితెత్తునని లేచెను.

అయితే రాముడు లక్ష్మణుని ఆపి, వాని కపట నాటకము లక్ష్మణునికి తెలి యదు కనుక, ఆ లేడి అతనికి చిక్కదని తనలో తాను తలంచి, "తమ్ముడా ! దానికి యెట్టి గాయములు తగులక, యెట్టి ప్రమాదములకు అది గురికాక పట్టవలసి ఉండును, కనుక నేనే దానిని పట్టవలెను. సీత అభీష్టములను నేనే నెరవేర్చవలెను." అనుపదములతో లక్ష్మణుని తృప్తిపరచి, అతనిని అక్కడే వుండుమని ఆజ్ఞా పించెను.

అంతేకాదు ! రాబోవు జరుగబోవు నాటకము సీతారాములకు తెలుసును తినుక గుట్టుగా లోనుంచుకొని, "లక్ష్మణా, ఈ అడవి రాక్షసుల నివాసము రెండు దినములకు పూర్వమే జరిగిన ఖరదూషణాదుల వధ తమ లక్ష్యమందుంచుకొని తిరిగి వారి బంధుమిత్రులు, మన పర్ణశాలపై దండెత్తవచ్చు. కాన నీవు సర్వసిద్ధముగ బాణములను యెక్కు పెట్టి నలుదిశలా కావలాకాయవలసి యుండును. సీతను కని పెట్టుకొని యుండుము. ఎట్టి సమయమునందైనా సీతను వంటరిగా విడచి వెళ్ళకుము. ఈ మృగము చిక్కక ఒకవేళ కొంతదూరము పరుగెత్తవలసి వచ్చును. ప్రాణముతో పట్టవలెనుకనుక కొంత శ్రమపడి ఆలస్యముగా దొరకవచ్చును; కాన జాగ్రతగా సమయోచితముగ బుద్ధిబలమును, దేహబలమును వుపయోగించి, సీతను కాపాడుచుండుము" అని చెప్పి రాముడు మాయామృగమును తరుముచూ వెళ్ళెను.

రాముడు ఆ మృగమును తరుముచుండ, ఆ మృగము ముందు చూడక తన దృష్టిని రామునిపై మరల్చి, ముందుకు పరుగిడుట రామునికెంతో ఆనందము కలిగించెను. అతడు మారీచుడని రామునకు తెలుసు. తాను పరమ భక్తుడు, రామతత్వమును, రామశక్తిని పూర్వమే అనుభవించినవాడు; అందువలన రాముడు కూడనూ మారీచుని వైపునే దృష్టి వుంచుకొని వినోద రీతిగా దానిని తరుముచూ వెళ్ళుచుండెను. ఒక సమయమున రామునకు చిక్కినట్లు సమీపించును; మరొక సమయమున అది దూరముగా పరుగిడును. ఈ విధమైన ఆటలనుచూచి రాముడు చాలా వుల్లాసముగా దానితో ఆడుకొంటూ వుండినటుల ఆనందమునందుచుండెను. అతి దూరముగా వెళ్లగనే రాముడు అమోఘాస్త్రమును ప్రయోగించెను: అది తగులగనే ఆ మాయామృగము "హా ! లక్ష్మణా" అని గట్టిగ అరచినేలపడెను. ఆ ప్రశాంత వాతావరణమున ఆ శబ్దము సీతాలక్ష్మణుల చెవిని బడెను.

విని వినక పూర్వమే సీత, "లక్ష్మణా వింటివా, మీ అన్నగారి కంఠ స్వరము; నిన్ను పిలుచుచున్నారు. తక్షణమే వెళ్లి అతనిని కాపాడుము. ఈ రాక్షసులు మాయాధారులు. కపట వేషములు ధరించి అనేక కడగండ్లకు గురిచేతురు." అని ఆతురతను ప్రకటించుచు లక్ష్మణుని పంపుటకు ప్రయత్నించెను. కానీ బుద్ధిశాలి కనుక రామాజ్ఞనే ప్రధానముగా, ప్రాణ సమానముగా పాటించువాడగుటచేత, "తల్లీ ! రామచంద్రునకెట్టి కష్టములు రావు. రాముని యెట్టి రాక్షసుడైననూ యేమీ చేయజాలడు. వేలాది రాక్షసులను క్షణకాలములో వధించిన దృశ్యమును రెండు మూడు దినములకు పూర్వమే మీరు చూచితిరి కదా. మీరు కంగారు పడక ధైర్య

ముగా వుండండి. త్వరలోనే క్షేమముగా పర్ణశాల ప్రవేశింతురు" అని సీతకు ధైర్య మును తెలుపుచూ లక్ష్మణుడు కదలక వుండెను.

ఇంతలో మరొకతూరి, 'హా సీతా ! హా లక్ష్మణా' అను పలుకులు విని పించెను. అపుడు సీత మరింత ఉలిక్కిపడినటుల కంగారు పడి, "లక్ష్మణా, నీ వెందుకింత మొండిగా ప్రవర్తించుచున్నావు. నీ భావము నా కర్థమగుటలేదు. త్వరగా వెళ్లుము, మీ అన్నకు సంభవించిన చిక్కును తీర్చుము, సహాయపడుము. వెళ్ళుము. వెళ్ళుము" అని అనేక విధముల కంగారును ప్రదర్శించెను.

రామునకు ఎట్టి ప్రమాదము జరుగదని సీతకు కూడా తెలుసును. కానీ, ముందు జరుగబోవు నాటకమునకు ఇవన్నియూ పునాదులుగా తాను తలంచి, ఈ విధ మైన అమాయకురాలి వలె ఆమె నటించుటకు పూనుకొనెను. లక్ష్మణుడు ఎన్ని విధములైన ధైర్యవచనములు చెప్పినను, సీత అతని మాటలను పెడచెవిని పెట్టు టను గమనించి, "తల్లీ ! రామాజ్ఞ నాకు ప్రాణ సమానము, సీతను కాపాడుకొనుచు, యెట్టి సమయమునందైనను సీతను వీడి పోవద్దను రామాజ్ఞను నీవు వింటివికదా ? కనుక నేను ఇక్కడినుండి యేమి జరిగినను ఒక అడుగైన వెనుకకు పోను" అని గట్టిగా తెలుపుటచేత,

అతనిని యెట్లయినను ఇక్కడనుండి పంపి రావణుని రప్పించి, ముందు రాక్షస సంహారమునకు తగిన మార్గమును, రాముడు వేసిన ప్లాను కనుక, రామసంకల్ప మును నెరవేర్చనెంచి సీత కూడ తన పట్టును వీడక, అనేక కఠిన వార్తలను కూడను ప్రవేశపెట్టును.

లక్ష్మణుడు చెవులు మూసుకొని, "తల్లీ! నేను నీబిడ్డను. తల్లి యేమన్నను నేను సహింతును" అని ప్రార్థించెను. కానీ మరింత కఠిన వాక్యములు పలుకుచూ నీవు వెళ్ళకున్న నేనే వెళ్ళుదునని సీత సాహసించగా, విధిలేక, మాటలు వినలేక, సీత అడవిలో పయనము చేయుటకు అంగీకరించక, తాను భారమైన హృదయముతో పర్ణశాలను వీడి, రాముని వెతకుచూ వెళ్ళెను.

లక్ష్మణుడు పర్ణశాలను వీడునపుడు సీతను లోనికి వెళ్ళమని తాను బైటకు రాక, లోనే తలుపులు బిగించుకొని వుండమని అనేకవిధముల భద్రములుచేసి, చాలా ప్రార్థించి కదలలేక కదలెను. వనదేవతలను ప్రార్థించెను. పర్ణశాలకు ముందుభాగ మున నాలుగుగీతలు గీచి, మంత్రశక్తిని అందులో యిమిడ్చి జానకికి నమస్కరించి, ఈ గీతలు యెట్టి పరిస్థితియందైనా దాటి వెలుపలకు రావలదని దీనుడై వేడుకొనెను. లక్ష్మణుడు మహా గుణవంతుడు, రెండు విధములైన ఆజ్ఞలలో తాను దేవినీ వీడు

టకు మనస్కరించక లోలోన పరితపించెను. రాముని ఆజ్ఞ మీరినందుకు, సీత యేకాంతమునకు భయపడుతూ వెనుకకు చూచుచూ, చూచుచూ నడవలేక నడచెను.

ఇదే సమయమున, అదేపనిగా సమయమునకు కాచియుండిన రావణుడు మాయారూపధారియై ఋషిరూపమును ధరించి, సురాసురులు కూడను అతని పేరు చెప్పిన గడగడ వణకుదురో అట్టి శక్తివంతుడైన రావణుడు, పదార్థమును దొంగలించుటకు వచ్చిన కుక్కవలే, నలువైపులజూచి ఆశ్రమమున ప్రవేశించెను. నేరుగా తలుపులు తీయుటకై సమీపించగా లక్ష్మణుడు గీచినగీటు అతనికి మంటలవలె కనపించెను. అంత తాను గమనించి గీటుదాటిన తన కార్యమునకు భంగము జరుగుటయే కాక యెట్టి ప్రమాదము వాటిల్లునో అని తలంచి గీచినగీటుకు ఆవల నిలచి, "భవతీ భిక్షాందేహి" అని భిక్ష మడిగెను.

సీత గమనించి వీడు రావణుడే అని తలంచి కందమూలాదులను హస్తమందుంచుకొని అతిధికి అందించవలెనని తలుపులుతీసి వెలుపలకువచ్చి నిలిచెను. రావణుడు అక్కడికి వెళ్ళుటకు భయపడి, నేను ఆశ్రమ ద్వారమును సమీపించను, ఇది నా దీక్ష అని మాయమాటలాడి, సీతనే తనదగ్గరకువచ్చి భిక్షమందించమని కోరెను. సీత, "అతిధీ! నామరది గీచినగీటు నే దాటలేను, నీవే లోనికిరమ్ము" అనగా మాయావేషధారి భయపడి, "అమ్మా! నేను గీటునుదాటి లోనికిరాను, గీటు కటువైపుమండి యిచ్చిన భిక్ష నే స్వీకరించను. ఇది మాబోటి తాపసులకు మంచిది కాదు." ఆకలి ఆకలి అని తాను అనేక ఆడంబరములు చేయుట గమనించి సీత గీటుదాటి భిక్ష వేయుటకు పూనుకొనెను.

ఇదంతా క్షణములో జరిగెను. ఆమె గీటు దాటెనోలేదో రావణుడు ఆమెను చేపట్టిలాగి యెత్తుకొనిపోయి, రథమునందుంచుకొని ఆమె యెన్నివిధముల విలపిల్లుచున్నను లెక్కజేయక అతి వేగముగ రథమును నడిపించెను. సీత, "హా రామా! లక్ష్మణా! త్వరగావచ్చి నన్నీ దురాత్ముని బారినుండి తప్పించుకొనుడు." అని కేకలు వేసెను. ఈ కేకలు వినుచున్న పంచవటీ తీరమున నున్న ఋషులు, వనచరులు చేయునదిలేక ఈ మహాపకారమునకు దుఃఖించిరి కాని తప్పించలేకపోయిరి.

అరణ్యమంతయూ దుఃఖమున వాడినట్లాయెను. ఓరామా! ఓనాథా! నన్ను కటాక్షింపుము, రక్షింపుము. ఈ దుర్మార్గుని రూపుమాపుమని విలపించుచున్న ఆ దీనాలాపముతో చరాచర జంతుజాలము సహితము విలపించెను. ఓరావణా! నీ వినాశము నకు నీవే రాజబాట వేసుకొనుచున్నావు. నీరాజ్యము, నీ ప్రజలు సర్వులూ రాక్షస వంశము సంపూర్ణముగా నాశము గావించుకొనుచున్నావు. నేడు నవ్వుతూ చేయు

చున్న ఈ దురాచారమునకు త్వరలోనే యేడ్చుచు అనుభవించ బోవుచున్నావు. నీచుడా! నీబోటి తపస్సంపన్నునకు ఇది మేలుకాదు, అని రావణుని చెడు తలంపుకు అనేక బుద్ధి వాక్యములను తెలుపుతూ మధ్యమధ్య రాముని పిలుచుచూ వెళ్ళు చున్న రథమును గృధ్రరాజు (జటాయువు) గుర్తుపట్టెను, సీత విలాపములను గమ నించెను.

ఆమె శ్రీరాముని భార్యఅని తెలిసికొని, "అయ్యో, నేను వార్ధక్యము ననుభ వించుచున్నాను. ఈనాటి నాబలము ఆ దుర్మార్గునితో పోరాడునట్టి శక్తివంతముగా లేదు. యేమిచేతు. చూచుచూ వూరకుండుట మంచిదికాదు మంచికార్యమున, పరస్త్రీ అపహరణను రూపుమాపుటలోగల పవిత్రత మరొకటి వుండదుకదా! కాన ఈపవిత్ర కార్యములో నా ప్రాణములు బోయిననూసరే నాశక్తికొలది సీతకు సహాయముచేయు టకు పూనుకొందును." అని, "ఓ సీతా! భయపడకుము, ఈ దుర్మార్గుని రూపుమాపి నిన్ను విడిపింతును. రామునకు అప్పచెప్పుదును" అని అరచుచు, రావణుని రథము నకు అడ్డుగావెళ్ళి తన వాడియైన ముక్కుతో రావణుని అనేకవిధముల హింసించి రథమును ధ్వంసము చేయుటకు తన శక్తినంతయూ వినియోగపరచి పోరాడ మొదలు పెట్టెను.

జటాయువు అనేకవిధముల రావణునికి ఉపదేశము చేసెను. "రావణా, ఇది నీకు మంచిదికాదు. సీతను విడచి నీవు నీ గృహమునకు చేరుకొమ్ము; లేకున్న అగ్నిలో పడిన శలభములవలె నీవును నీ వంశమంతయు, రామ క్రోధాగ్నిలోపడి నశింతురు. నీ బొంగరుబోతుతనము నిన్నే హింసించును. పరస్త్రీని అపహరించుట మహాపాపము. పాపచిత్తుడే పరస్త్రీలవెంట తిరుగును. కుక్కనక్కలకంటే హీనుడే, ఇట్టి పరస్త్రీని కోరుదురు; ఇంతకంటే వేరు చండాలపుపని మరొకటున్నదా. నీ తలి దండ్రులు చేసుకొన్న పాపము, నీవు కామాంధుడవై కన్నుమిన్నుకానక, ముందు రాబోవు కీడును యోచించక పూర్తి ఉన్మత్తునివలె ప్రవర్తించుచున్నావు. నీ బల మును, ధనమును, జనమును చూచుకొని విఱ్ఱవీగుచున్నావు.

ఇది అన్నింటిని భస్మము గావించును. నీ తపశ్శక్తికూడా క్షణములో అదృశ్యమగును. నీసతులను పరరాక్షసులు అపహరించిన, ఆశించిన, నీవు ఊర కుందువా? నిజముగా నాసతి పరసతి అను సత్యమును గుర్తించిన మానవమాత్రుడు ఇట్టి దౌర్భాగ్యమునకు పూనుకొనడు" అని అనేకవిధముల బోధించుచూ రథముతో పాటు తానుకూడ అతివేగముగా యెగురుచూ వెంటాడెను. జటాయువు పలుకులు, నీతులు సీతకు యెంతో శాంతిని అందించెను. మనసున సీత ఆనందించెను.

వృద్ధుడైన జటాయువు రథమునాపి సీతను రథమునుండి దింపి ఒకవృక్షము క్రింద కూర్చొనబెట్టి రావణునితో పోరాడెను. పాపము వృద్ధాప్యమగుటచేత కొంత సేపటికి అలసిపోయెను. రావణుని కిరీటమును వాని శిరోజలముల నూడబెరికెను. దేహమునంతా పొడిచి రక్తపుముద్ద గావించెను. రావణుడు ఎంత బలమును ఉపయోగించినను తనముక్కు, రెక్కలద్వారా వాటినన్నింటిని ఖండించెను. రావణుడు చేయునది లేక తన ప్రాణరక్షణ నిమిత్తము చక్రాయుధము తీసి, దానిచే జటాయువు రెక్కలను త్రుంచెను. జటాయువుకు రెక్కలే ప్రాణము; అందువలన చేయునది లేక రామా, రామా, అని పలుకుచూ క్రిందకూలెను. స్వామికార్యమున నాప్రయత్న లోపములేక పోరాడితిని, కానీ ఫలితము లేకపోయెను. ఇది రామసంకల్పమే. దీనిచే లోకమునకు ఏ ఉపకారము గావించబోవుచున్నాడో రాముడు. లేకున్న సీతాపహరణ మన్న రామ సంకల్పము లేక జరుగదు. కాన నేను యోచించి ప్రయోజనముండదు.

ఈ వార్తను రామునకు అందించునంతవరకైనా నా ప్రాణములు నిలుపుకొనుటకు అతనినే ప్రార్థింతును. ఇంతకంటె నేను చేయునట్టిది వేరొకటి లేదని కన్నులు మూసుకొని రాముని ప్రార్థించెను. ఇంతలో రావణుడు తిరిగి సీతను రథముపై తీసుకొని బఱ్ఱున బయలుదేరెను. కంటితో చూచుచూ సీత విలాపము వింటూ యేమీ చేయలేనివాడై జటాయువు కంటిధారలు కార్చుచూ రాముని ప్రార్థించెను.

మృత్యువు సమీపించు కాలమున, వినాశకాలము రాబోవు సమయమున, విపరీతపు బుద్ధులు పుట్టుట సహజము. అటులనే రావణుని వినాశకాలము సమీపించినది. రాక్షసవంశము నాశము గాబోవుచున్నది. అంటూ రావణుని రాబోవు దుస్థితిని చింతించుచూ, రామరాకకై నిరీక్షించుచూ కదలలేని స్థితిలోపడెను.

ఇక పంచవటీతీరమున, మాయలేడినిచంపి, వెనుకకు తిరిగివస్తూ, తనలో తాను జరగవలసినదంతా జరిగియుండును. ఇది నాసంకల్పమే అయినా జనసామాన్యులకు ఇది దైవత్వమని అర్థము కాకుండుటకై నేను సామాన్య మానవమాత్రునిగా ఇకపై ప్రవర్తించవలసియుండును. అనితలంచుచూ వెనుకకు వస్తూవుండగ కొంత దూరములో లక్ష్మణుడు యెదురువచ్చుచున్నట్లుగ్రహించి లక్ష్మణునకుకూడా నా మర్మము తెలియనివ్వకూడదు, అని దృఢముచేసుకొని, చింతాక్రాంతుడై వచ్చుచున్న లక్ష్మణునిజూచి, తమ్ముడా! నామాటను నిరాకరించి సీతను వంటరిగా విడిచివచ్చుటకు నీ మనసెట్లులొప్పెను. నిత్యము జరుగుచున్న రాక్షసకృత్యములను నీవు చూచుచూ ఆశ్రమములో వంటరిగా సీతను విడచుట మంచిదా, "అయ్యో, సీతగతి యేమయియుండునో నాకు అనుమానముగనున్నది. పర్ణశాలలో సీత లేనట్లుల సాక్ష

తోచుచున్నది. ఇక యేమిగతి! అని విచారము వెలిబుచ్చి రాముని పాదములపై బడి లక్ష్మణుడు, అన్నా! నామనసు నీకుతెలుసు, యెట్టి సమయమునందైనాసరే నా ప్రాణములనైనా సవ్వుతూ మీ పాదములకు అర్పితముగావింతును గానీ, ఆజ్ఞ మీరుదునా? మీరను. అయితే సమయమట్టిది, ఇది నా విధి. విధాత విరుద్ధబలముయొక్క చేత. మాయామృగము అరచిన అరుపులు, హాసీతా! హాలక్ష్మణా అన్న పదములు పర్ణశాలకు వినిపించెను. వినినంతనే తల్లి సీతాదేవి భయపడి తక్షణమే మీ సోదరునకు ప్రమాదము వాటిల్లినది. వెంటనే వెళ్ళమని నన్ను అనేకవిధముల తొందరచేసెను.

ఈ రాక్షసమాయలు నాకు తెలుసును కనుక నమస్కరించి యెన్నియో విధముల ప్రార్థించితిని, వేడుకొంటిని. రామునికెట్టి ప్రమాదము జరుగదు. ఇది కేవలము రాక్షసమాయలని తెలుపుకొంటిని. మరీ రెండవపర్యాయము హాసీతా! హాలక్ష్మణా! అన్న పదములు, మీ కంఠస్వరమువలె వినిపించెను. దానితో సీత తన తత్వమునే తాను మరచి, వావి వరుసలనే లెక్కచేయక, అనరాని, వినరాని మాటలను ఉపయోగించుటచేత నేను భరించలేక, చెప్పవలసిన వన్నియూచెప్పి, చేయవలసిన భద్రము లన్నియూ చేసి పర్ణశాలవిడచి రావలసివచ్చెనని, జరిగినవన్నియూ విన్నవించి, శిక్షకైనా, కక్షకైనా నేను సంసిద్ధమేనని నమస్కరించెను. అంత రాముడు, లక్ష్మణా యేమైననూసరే నీవు ఒంటరిగా వదలి వచ్చియుండకూడదు. ముమ్మాటికీ సీత పర్ణశాలయందువుండదనే నావుద్దేశము. వనమునకువచ్చి సీతను రాక్షసులకప్పజెప్పుటలో మన పురుషార్థమేమున్నది. ఒక భార్యను కాపాడుకొన లేకపోయెను. రాముడన్న వాక్యము నీవు భరింతువా? సహింతువా? అయ్యో! సీతా వియోగమును నేనేరీతిగా భరింతును. అని అనేక విధముల అమాయకునివలె ప్రకటించుచూ అతివేగముగ పర్ణశాలకు వచ్చి చేరిరి.

అందులో రాముడు తెలిపినటుల జానకి కనుపించలేదు. ఇక రాముడు తాళ లేని వానివలె వ్యాకులత పడెను. లక్ష్మణుడు నిలువునా కూలిపోయెను. ఈ అపరాధము. ఈ విధమైన దురవస్థ తన వలననే జరిగినదని, తన ప్రాణములు వుండుటకు కూడా ఇష్టపడలేదుకానీ, సీతా లేదు. తానూ ప్రాణత్యాగము చేసుకొన్న ఈ సమయమున రాముని అనేక చిక్కులపాలు చేసినట్లగుననియూ రామునకు అపకారము గావించువాడనగుదుననియూ, ఈ కారడవులలో రాముడు యేకాకియై తిరుగుననియూ, తనకు ఫలపానీయములైనా ఇచ్చుటకు సహాయమెవ్వరూ వుండరనియూ తలంచి జీవచ్ఛవముగానిలిచి రాముని వ్యాకులతను చూడలేక పోయెను. నోటిమాట రాక పోయెను. సీతా వియోగముతో తన ప్రాణముమ కోల్పోయినట్లు

తలంచెను. కొంత ఆలోచించి ఇదంతా రామసంకల్పమే తప్ప అన్యము కాదనియూ రాముడు సామాన్య మానవమాత్రుడు కాదనియూ, ఇది లోక కల్యాణ నిమిత్తమై యేర్పడిన, కల్పించిన, నాటకమనియూ లక్ష్మణుడు తెలిసికొనెను.

పరుల దుఃఖముల నపహరించు పవిత్రుడు, లేశమైనా దుఃఖము నెరుగని లోకపాలకుడు భార్యా వియోగమునకు సాధారణముగ మానవమాత్రులు విలపించు నటుల విలపించుచున్నాడనిన, ఇది నాటకమని లక్ష్మణుడు క్షణములో గ్రహించెను. సీతయొక్క నిస్స్వార్థము నిష్కళంకము, నిరుపమశీలము లక్ష్మణునకు తెలుసు. అట్టి సద్గుణ, సచ్ఛీలవతికి యిట్టి విపత్తు కలిగినదంటే ఇది కూడ రామకార్యములోని ఒక భాగము అని తెలుసుకొన్నాడు. రామాజ్ఞ లేక యే చిన్నకార్యమును కూడా యెవ్వరూ చేయ వీలుకాదు. అయితే లోకమున మానవమాత్రుడుగా అవతరించి మానవులకు నీతి, నిజాయితీ, త్యాగ, శీల, ధర్మ ప్రపత్తులను నిలబెట్టుటకై తాము ఆచరించి, ఆదర్శమును అందించు ప్రయత్నమునకై సీతారాములు, ఈ విధమైన నాటకమాడుచున్నారని దృఢముచేసుకొని ఆ నాటకములో తానూ ఒక పాత్ర ధారుడు కనుక, తనకందించిన పాత్రను తాను కూడా సక్రమముగా నటించవలెనని నిర్ణయించుకొని, ధైర్యమున రాముని చెంతచేరి, పాదములు ముట్టి, "అన్నా ఓ నాథా ! నీవు జగన్నాటక సూత్రధారివి, నీకు తెలియనివి, చేతకానివి యేవియునూ లేవు. అంతా నీ సంకల్పమునందే యిమిడియున్నది. నీకు తెలియక, ఇన్ని జరుగుటకు వీలుకాదు; నేను నమ్మను. ఇదంతా యేదో లోకకల్యాణ నిమిత్తము. రాక్షస నాశ మొనరించుటకై తామే ఈ నాటక మాడుచున్నారని నా మనసు నిస్సంశయముగా నన్ను ప్రేరేపించుచున్నది. ఇది పరమ సత్యమయి వుండును. నిజము తెలిపి నన్ను శాంతచిత్తుని గావింపు" మని ప్రార్థించ, రాముడు చిరునవ్వునవ్వి "లక్ష్మణా, నీవు నా అంగమగుటచేత నీ దగ్గర దాపరిక మేమున్నది.

నీ సంకల్పము సత్యము. ధర్మసంరక్షణార్థమై అవతరించిన నేనుధర్మమును ఆచరించి అందించుటలో నేనెన్ని విధములైన లీలలు గావించవలసి యుండును. ఏడ్చువట్టి చంటిబిడ్డను ఆడించి, పాడించి, లాలించి, ఆట వస్తువులను అందించి, కట్టుకథలు చెప్పి, పాలను త్రాగించి యేడ్పును మాన్పించుటకు తల్లి అనేక యుక్తులు పన్నుట లోకసామాన్యము. ఇందులో పరమ లక్ష్యము, పాలను త్రాగించి యేడ్పును మాన్పించుటే, అంతే కదా ? అయితే ఈ ఆటలు పాటలు, ఆటబొమ్మలు, కట్టుకథలు పాలను త్రాపించి యేడ్పును మాన్పించుటకు సహాయకారులగుచున్నవి కదా ? ఆకలి తీర్చి యేడ్పును మాన్పించుటలో పై కృత్యములుకూడ ఒక ఆధారములే

కదా. అవన్నియూ చేరే ఆకలిని తీర్చినవి. దుఃఖమును దూరము చేసినవి. అటు లనే ధర్మసంస్థాపన, అధర్మనాశనము గావించుటకై లోకమాతయైన నేను ఇన్ని విధములైన నాటకము లాడవలసియుండును. ఇవన్నియూ దుఃఖనివృత్తికి, ఆనంద ప్రాప్తికి ఉపాంగములే వృథా కావు. లోకసామాన్యులు ఆదర్శమును మాత్రమే ఆధారముగ చేసుకొని అనుసరింతురు కనుక, అధికారియైన నేను, నాయకుడైన నేను, ఆచరించిననే, లోకులు దానిని అనుసరింతుట. నాయకుడు ఆచరించక లోకు లను ఆచరించమనుటలో, నాయకత్వమునకు అర్హుడు కాలేడు. అట్టి అనర్హుడైన నాయకుడు ఎప్పుడు తయారగునో అప్పుడే ధర్మనాశనము, అన్యాయ అభివృద్ధి ప్రారంభించును కావున అధికారియైనవాడు, నాయకుడైనవాడు, తాను చెప్పునట్టి వాక్యములు ఆశించునట్టి ఉత్తమస్థితిని, తాను ఆచరించి అందించవలసియుండును. ఇదే మానవ నీతి, ఇదే దైవప్రీతి. సీతకు కూడను ఈ నీతి చక్కగా తెలియును. నిమిత్తమాత్రముగా ఈ కాయములు, వియోగ, సంయోగ, సుఖ, దుఃఖ, విలాప, ప్రలాపముల ప్రకటించునే కానీ ఇవి సత్యమైనవి కావు. నా అవతార తత్వమునకు ఇవి కొన్ని నిబంధనలు, నిరూపములు. కాన నా తత్వమును నీకు తెలుపుచున్నాను. నీవు కూడనూ నీ స్థానమున కాల కర్మకారణములను దేశ కాల పాత్రను అను సరించవలసివచ్చును.

దైవ రహస్యము అన్యులకు అర్థముకాదు. కనుక నీవును నావలే కొంత నాటకమాడి, మనము వచ్చిన కార్యమును పూర్తి చేసుకొందమని తమ్మునకు దైవత్వ మును పూర్తిగా తెలిపి, సామాన్య మానవులవలె సీతాన్వేషణను ప్రారంభించిరి. ఈ అన్వేషణలో రామలక్ష్మణులు మహా విచిత్రముగ, అద్భుతముగ, ఆశ్చర్యముగ నటన చేయుదురు. ఇంతేకాదు, సీతామాతకూడ మహాపవిత్రతను ప్రకటించుచు, ప్రదర్శిం చుచు, ధైర్య సాహసములతో సత్యమునకు భయముండదన్నట్లుగా, ఘోర రాక్షసులు అదిరించి బెదరించినను లొంగక, కృంగక, పొంగక, తన దీక్షను వీడక, ఏక లక్ష్యమును సాధించు దీక్షను చాలా అద్భుతముగ ప్రకటించును.

వీరు గావించు ఈ నాటకము ప్రతి గృహస్థునకు, ప్రతి ఇల్లాలుకు ధర్మా ధర్మమును అందించును. తండ్రి, తల్లి, భార్య, భర్త, సోదర మిత్ర వాగ్దానమును, శీలమునెట్లు కాపాడుకొని సార్థకము గావించుకొనవలెనో, చక్కగా నిరూపింతురు. వేయేటికి, రామాయణమే జీవిత సర్వ సమస్యలను దూరము గావించును. మాన వత్వమును సార్థకముగా చేసుకొమనట్లు నిరూపించును.

రామాయణమునలేని నీతులు మరొకదానియందులేవు. నిత్యజీవితమున మాన

వుడు యే యే సందర్భమున యెట్లుమెలగవలెనో, యెట్లుమానవత్వమును కాపాడుకొనవలెనో, పరిపాలన గావించుకొనవలెనో, ప్రజలకు బోధించవలెనో, శాసనములు గావించవలెనో అన్నియూ ఒక్క రామాయణమునందు ఇమిడియున్నవి. ఒక్క రామాయణమును పూర్తిగా అర్థము చేసుకొనిన లోకకళ్యాణమున కెట్టి అవాంతరములు అడ్డు తగులవు.

# శ బ రి

రామలక్ష్మణులు సీతజాడను తెలిసికొనుటకై పర్ణశాలను వీడిరి. సర్వాయుధ ములు తీసుకొనిరి. పర్వతములు, కొలమలు, గుహలు శోధించుతూవెళ్ళిరి. ఎక్కడా సీతజాడలు కనుపించలేదు. అట్లే నడచుచూ వెళ్ళుచుండ ఒక మార్గ మధ్యమున వృక్షశాఖలు విరిగి పడియుండుటయు ఆ ప్రదేశమున యేదో కొంత పోరాటము జరిగినట్లును, కొన్ని ధనుర్బాణములు విరిగిపడినట్లును కనుపించెను. దానిని చూచి రాముడు, తమ్ముడా! ఇచ్చట యెవరో యుద్ధము చేసినటుల కనిపించుచున్నది అని అటూ ఇటూ వెతుకగా, గృధ్రరాజు, చాలా బలహీనుడై రామా, రామా, అంటూ కన్నులు మూసుకొనియుండిన దృశ్యమును చూచెను. రామలక్ష్మణులు సరాసరి జటాయువుని సమీపించి దాని శిరస్సున హస్తము నుంచెను.

జటాయువుకు ఆ హస్తస్పర్శ హాయినందించెను. కొంత బలము వచ్చెను. కన్నులు తెరచి చూచెను. జగన్మోహనవిగ్రహము కనుపించెను, అంత భరించలేని ఆనందము, దుఃఖము రెండునూ పొంగి పొరలెను కానీ కదలలేని స్థితిలో పడి యుండుటచే అటూ ఇటూ తిరుగలేక అట్లనే రాముని పాదములపై బడెను.

రాముడు దానిని తన తొడలపై పరుండబెట్టుకొని ఓదార్చుచుండ, అపుడు జటాయువు: ఓ నాథా! దుర్మార్గుడైన రావణుడు, దౌర్భాగ్యపు బుద్ధులకు చిక్కి, నీతి నిజాయితీని మంటకలిపి, తపశ్శక్తికి తర్పణము వదలి తల్లియైన సీతను కుక్కవలే అపహరించి నక్కవలేవనమధ్యమున రథములో వేసుకొనిపోవుచుండ, ఆ జగజ్జనని జానకి "రామా, రామా" అంటూ విలపిల్లుచుండ, ఆ విలాపము అరణ్యమునే కదిలించి నది. యెవరిదీ విలాపమని నేను చెంతకు వెళ్ళి చూడగ, సీతామాత! నేనిక భరించ లేకపోతిని. వృద్ధాప్యమయిననూ, నీ నామచింతన చేయుచు వానితో అనేక విధముల పోరాడితిని. కడకు వాని కాయమునంతయు రక్తమయము గావించితిని సీతమ రథమునుండి తీసి ఒక వృక్షచ్ఛాయయందుంచి, వానితో ఘోరమైనయుద్ధముచేసితిని.

కానీ నా ప్రయత్నమంతయూ వృథా అయెను. వాడు చక్రాయుధము తీసి

నా రెక్కలను ముక్కలుగా కొట్టెను. నే చేయునది లేక ఈ రీతిగా తమ రాకకై విలపించుచున్నాను. కంటితో చూచియూ, ఆ తల్లిని నేను రక్షించుకోలేకపోయిన దౌర్భాగ్యుడను అంటూ కంటిధారలు కార్చెను.

అంత రాముడుకూడను కొంత విచారమును ప్రకటించి "ఓ పక్షిరాజా! నీ ఉపకారమును నేను మరువను, నీ సత్కర్మయే నీకు సద్గతి కలిగించును. విచారించకుము." అని అతని రెక్కలలో చేరిన మట్టిని రాముడు తన జడలతో దులిపి శిరస్సును నిమురుచుండ లక్ష్మణుడు నీరు తెచ్చెను. ఆ నీరు రాముడు జటాయువు నోటిలో కొంత కొంత వదలుచుండ, జటాయువు నా భాగ్యమే భాగ్యమని ఆనందించి, "రామా కన్నతండ్రికికూడా లభించని ప్రాప్తి నాకు లభించెను. నీ సువర్ణ హస్తములలో నీరు గుడుచునట్టి మహాప్రాప్తి లభించెను. నీ తొడలపై విశ్రమించి నీ హస్తములలో అమృతము గ్రోలుచూ, ఆహా ఇప్పుడు నా నేత్రములు నీ ముఖపద్మమును చూచుచుండ నా ప్రాణములు పోయిన అవియూ నీలోనే చేరునుకదా! నేనెంత ధన్యుడనని అంటూ, రామా! దుర్మార్గుడైన రావణుడు దక్షిణ దిశకు పోయెను. బహుశా లంకనే చేరియుండును కాన మీరు సరాసరి లంకకు చేరి ఆ దుర్మార్గుని హతమార్చి, ఆ తల్లిని చెంతచేర్చుకొనుడు అని చెప్పుచూ, రామా అని ఒక్కపరి గట్టిగ వుచ్చరించి ప్రాణము వీడెను.

రాముడు జటాయువు ప్రాణమును తనలో చేర్చుకొని, దాని కాయమునకు తగిన అంత్యక్రియలు గావించి స్నానమాచరించి తిరిగి జటాయువు చెప్పిన గుర్తులను మనమున చిత్రించుకొని దక్షిణదిశకు నడిచిరి. ఈ విధముగ దారి నడచుచుండ అజాముఖి అను ఒక భయంకర రూపిణియైన ఒక రాక్షసి దారికి అడ్డు వచ్చి, ఆహా యెంతటి సుందరులు మీరు. మిమ్ము అనుభవించు వారెంతటి ధన్యాత్ములు. ఈనాడు నా నోము పండినది. మనోభీష్టము నెరవేరినది అని ఆ రాక్షసి లక్ష్మణుని చేయి పట్టుకొనెను. అంత లక్ష్మణుడు ఈ రాక్షసి చర్యను గుర్తించి ఇదికూడా శూర్పణఖ వంటి చిత్తము కలిగియున్నదని తలంచి దాని అంగములను ఖండించెను.

ఆ అరణ్యముకూడనూ రాక్షసులవలే భయంకరమే, అనేక క్రూర మృగములతో, భయంకర శబ్దములతో యెట్టివారికైన భయభ్రాంతులను గలిగించునదై యుండెను. ఈ విధమున రామ లక్ష్మణులు ప్రయాణము జరుపుచుండ ఒక వికారాకారమును ధరించి కబంధుడను రాక్షసుడు అడ్డుతగిలి, భూమి ఆకాశము దద్దరిల్లునట్లు నవ్వి రామలక్ష్మణులపై పడుటకు పూనుకొనగా, రాముడు ఆ కబంధుని సంహరించెను.

వాని చేతులు చాలా పొడవుకలిగి, శిరస్సు లేక తాను భుజించు నోరు కడుపు పైననేకలిగి, అమానుష్యరూపుడై అత్యంత విచిత్ర ఆకారుడై, ఆ అడవిలో అనేక విధముల ప్రాణులను హింసించుచుండెను. అట్టి రాక్షసుని సంహరించి, వనచరులకు కొంత భయభ్రాంతిని శ్రీరాముడు తగ్గించెను. ప్రాణములు వీడుటకు పూర్వము ఆ కబంధు, "ఓ నాథా! మీదర్శన, స్పర్శన, సంభాషణలతో నా శాపము, పాపము పటాపంచలయినవి. నేను ధన్యుడను" అని తెలుపుకొంటూ, "రామా, నీ కార్యమెట్టి అభ్యంతరములూ, అవాంతరములు లేక, దిగ్విజయము కాగలదు," అని నమస్కరించుచూ ప్రాణములు వీడెను.

అక్కడినుండి ఉదారచిత్తుడైన రాముడు పాదచారియై, తమ్మునితో వచ్చుచుండ వారి మధ్యకు ఒక వృద్ధస్త్రీ, నడుమువంగి, తలపండి, మసకలుకప్పిన కన్నులతో కదులుతున్న చేతులతో ఒక పండ్లబుట్ట నెత్తిన వుంచుకొని మెల్లగ నడచుచూ వచ్చుచుండెను.

ఈ సుందర రూపులనుచూచి, మునీశ్వరులు వర్ణించుచున్న ఆ రామలక్ష్మణులు వీరేనేమోననితలంచి ఒక చెట్టునీడననిలిచి, బుట్టను క్రిందబెట్టి చేతులుజోడించుకొని రామా, రామా అని స్మరించుచూ నిలిచెను. అంత లక్ష్మణుడు ఇదియూ ఒక మానవాకారమును ధరించిన రాక్షసేనని తలంచెను.

కానీ రాముడు లక్ష్మణుని తలంపు సరికాదని తెలిపి, వీరునూ ఆ చెట్టుక్రిందనే కొంత విశ్రమించుటకై ఆగిరి. దానికి అతి సమీపముననే శబరి ఆశ్రమముకూడా వుండెను. వారి కమలములవంటి కన్నులు, వారి వుంగరములవంటి ముంగురులు జడలు ధరించి, శ్యామలవర్ణులయిన ఆ ఆజానుబాహులను చూచి, ఇంక తాను భరించుకోలేక పోయినది. కడుపులో నుంచుకోలేక పోయినది.

పరుగెత్తుకెళ్ళి వారి పాదాలపైబడి, నాథా! మీరెక్కడనుండి వచ్చుచున్నారు. మీ పేరేమి అని అడిగెను. శ్రీరాముడు చిరునవ్వుతో అమ్మా, మేము అయోధ్య నుండి వచ్చితిమి. అరణ్యమున నివసించుచున్నాము. నాపేరు రాముడందురు, ఈ నా తమ్ముని లక్ష్మణుడని పిలుతురు, అని చెప్పగనే, "తండ్రీ! నా చిరకాలవాంఛ తీరెను. జన్మ సార్థకమాయెను. మీకొరకై, రాత్రింబవళ్ళు కనులు కాయలుకాచునట్లు యెదురు చూచినాను. నా ప్రయత్నము ఫలించెను. నాతపస్సు సిద్ధించెను. ఆహా నేనెంత ధన్యురాలను. ఇది నా గురుకాంక్షయే, దైవప్రేరణయే, అని ఆనందభాష్పములు రాల్చుచూ పట్టలేని ఆనందముతో బుట్టను దగ్గరతీసెను. ఇంతలో రాముడు: అమ్మా! మీ గురువుగారెవరు! అని ప్రశ్నించగనే, మతంగ మహాముని అనియూ,

ఈ అరణ్యమున, స్త్రీలకు ఆశ్రమములందు స్థానము నిచ్చుటకు యెట్టి మహనీయు డును అంగీకరించకుండుటచే వారు బోధించు బోధనలను చెట్టుచాటునుండి, పొదల చాటునుండీ వినేదాననయిు, తెల్లవారకమునుపే, ఋషులు స్నానసంధ్యాదుల నిమిత్తమై నదికి వెళ్ళు దారులను వూడ్చుచూ, రాళ్ళు, ముండ్లు యేరిపారవేయుచూ, ఈవిధముగ పరోక్ష సేవలు చేసుకొనుచూ కందమూలాదులు తిని కారడవులలో కాలము గడుపుచుండెడిదానను. నా మనస్సెరిగిన మహనీయుడు మతంగ మహాను భావుడు అమ్మా నీ కాయము పక్వస్థితికి వచ్చినది. ఈ విధముగ శ్రమపడుచుండిన కొంత అలసిపోదువు. నీవు ఆశ్రమమునచేరి విశ్రాంతి తీసుకొమ్మనమని బోధించెను.

వారి పవిత్ర ఆజ్ఞను శిరసావహించి ఆశ్రమ సేవలు చేసుకొంటూవుండగా, ఋషికాయమును వీడగోరి, ఒకదినము నన్ను దగ్గరకుపిలిచి, "శబరీ, నేవచ్చిన కార్యము పూర్తిఅయినది. నేనిక కాయమును వీడతలంచితిని, నీవు ఈ ఆశ్రమము నందే వుండుము. కొంతకాలములో శ్రీరామచంద్రుడు ఈ అడవికివచ్చును. అతనిని ఆశ్రమమునకు పిలిచి అతని సేవలుచేసి వారి పాదస్పర్శద్వారా ఆశ్రమమును పవి త్రము గావింపుము" అని ఆజ్ఞాపించెను. అట్టి పవిత్ర గురుమూర్తులులేని ఆశ్రమ మున నేనేమని జీవింతును. నన్నును మీతో గొనిపొమ్మని నే ననేక విధముల ప్రార్థించిననూ గురుమూర్తి యేమాత్రము తృప్తినొందక, రామ ఆగమన నిమిత్తమై నీవిచ్చటే వుండక తప్పదని ఆజ్ఞాపించి ప్రాణములు వీడెను.

ఆనాటినుండి మీ ఆగమనమునకు అఱ్ఱులుచాచి, కన్నులువిడచి, ఈ వృద్ధ కాయముతో కాలమును గడుపుచున్నాను, ఓ రామా! ఓ నాథా! ఓ ఆర్తత్రాణ పరా యణా, ఓ ఋషి మానససంచారీ! ఈనాటికి నానోము పండెను. గురుసంకల్పము ఫలించెను. కొన్ని అడుగుల దూరమునందే ఆ ఆశ్రమము కలదు. నాతో దయచేసి పావనము గావింపుడు అని పాదములపై బడెను. సహజ ప్రేమస్వరూపుడగుటచే, శబరి భక్తి ప్రపత్తులకు ఆనందించి రాముడు లక్ష్మణునితోకూడి మతంగ ఆశ్రమము నకు వెళ్ళెను.

ఆహా! ఆశబరి ఆనందమునకు హద్దులుమీరెను, గట్టులుతెగెను. నడువలేని నారీమణికి వేయియేనుగుల బలమువచ్చెను. చకచక నడచుచూ నదికివెళ్ళి చల్లనినీరు తీసుకొనివచ్చి, తాను రుచిచూచి తెచ్చిన ఫలములను రామలక్ష్మణుల ముందుపెట్టి, వారి ముఖకమలములను, తనివితీరా చూచుచూ, రామ పాదములను కడిగి శిరస్సుపై ప్రోక్షించుకొని, నీరు త్రాగి స్వామీ నాకోరిక తీరినది. ఇక నేను దేనినిమిత్తమై బ్రతుకవలెను? రామదర్శన నిమిత్తమై బ్రతికితిని, రాములను చూచితిని, ఇక ఈ

ప్రాణమును తమ పాదములందు చేర్చుకొనుడు. తమ చరిత్ర మునులచే ఉపాగముగా విన్నాను, నేటికి కన్నాను, ధన్యనైనాను. అని ప్రార్థించెను.

రాముడు ఆమె అందించిన ఫలములు అత్యంత ప్రీతితో ఆరగించుచూ, అమ్మా నీ మనస్సెంత మాధుర్యమో నీ ఫలములూ అంత మాధుర్యముగనున్నవి. నిజముగా ఇవి చెట్లు ఫలములుకావు. అడవిచెట్టు ఫలములు ఇంత మధురముగనుండవు. నీ జీవిత వృక్షమునందలి మనోఫలములే యివి. అని ఫలముల రుచి వర్ణించుచూ ఆరగించుచుండ లక్ష్మణునికి చాలా ఆనందమాయెను.

కారణము, సీతావియోగము కలిగిన దినమునుండి రాముడు ప్రీతితో తనకు తాను అందుకొని ఫలమును భుజించినది తాను చూడలేదు. లక్ష్మణుడు యెంతో బలవంతముతో రామునకు వలిచి, అందించుచుండుటచేత, అదియూ ఒకటో అర్థమో తినుచుండెనే కానీ ఆకలి తీరునట్లు, లక్ష్మణునికి తృప్తి కలిగించునట్లు తినలేదు. ఈనాడు ఈశబరి చెట్టుచెట్టు క్రిందపడిన ఫలములను రుచిచూచి మట్టితుడిచి పరిశుద్ధముగా మధుర ఫలములనే దాచిపెట్టి రామునినిమిత్తమై నిత్యము యెదురుచూచి కడకు రామప్రసాదమనే భావముతో తానారగించి, తిరిగి క్రొత్త ఫలములను యేరి దాచివుండెడిది. ఆ అలవాటుతో శబరి ప్రేమరసమును ఆ ఫలరసముతో యేకపరచటము చేత, అతి మధుర రసముగా ఆ ఫలములను రామచంద్రుడు ప్రీతితో తృప్తి తీర ఆరగించుచున్నాడని లక్ష్మణుడు అమితానందపడెను. శబరి భక్తిని మెచ్చుకొనెను, ఆమె వృద్ధాప్యములో వున్న దైవరసమును అర్థముచేసుకొని ఆనందించెను.

శబరి చేతులు జోడించుకొని ఓ నాథా! నేను నీచజాతిలో జన్మించిన స్త్రీని, మందమతిని, మూర్ఖురాలను, ఏవిద్యను లేని అజ్ఞానిని, నేనేమని వర్ణింతును. అధమాధములలో అధమురాలను, అశక్తురాలను, మాటల పొందిక తెలియదు. తెలివితేటలు శూన్యము, తపశ్శక్తిలేదు. కేవలము దైవప్రీతితప్ప అన్యశక్తులలో అతి అడుగున పడిన నన్ను ఆదరించి, ఆనందమందించిన నీ కరుణ అపారము. నీకరుణే నన్ను అనుగ్రహించెను తప్ప నాభక్తిశక్తులు కావు. అని అనేకవిధముల రామచంద్రుని ప్రేమ, దయలను వర్ణించుచూ వచ్చెను.

ఈమాటలు వింటున్న రాముడు శబరి శిరస్సును నిమురుచూ, అమ్మా! నాకు భక్తిఒక్కటే ప్రధానముకానీ అన్యవిద్యలు, తెలివితేటలు, జన్మ, వంశాలు నేను లెక్కచేయను. సమస్త తపశ్శక్తులకంటే ప్రేమపూర్వకమైన భక్తియే నాకు మధురము, నేను దానినిమాత్రమే ఆశింతును జలములేని మేఘమువలే, ఫలములేని వృక్షమువలే, పాలివ్వని గోవువలే, భక్తిలేని మనుజుడు యెంతటివాడైననూ నాకు,

భగవత్ ప్రీతికి, అతిదూరమైనవాడే. ఓ శబరీ, నవవిధ భక్తిమార్గములయందు యే ఒక విధమైన మార్గము నవలంబించినను చాలు. అయితే నీవు నవవిధ మార్గము లనూ అవలంబించితివి. ఇక నీకంటే అధికులు నాకు యెవ్వరునూ కనుపించలేదు.

హృదయము స్థానమునుండి వచ్చిన, ప్రవహించుచున్న, నీ నిర్మల, నిశ్చల, నిస్స్వార్థ ప్రేమ ప్రవాహమే నన్ను అన్ని విధములా తృప్తిగావించెను. స్వప్నమందైననూ నీవు పరులను దూషించలేదు. ఇట్టి స్వచ్ఛ చిత్తముకంటే మించిన చిత్తము వేరొకటిలేదు. మంచికి పొగడి, చెడ్డకు కృంగి కృశించే చంచల స్వభావము నీకు అతి దూరము. నీవు అన్నివిధముల ధన్యురాలవు. అని ఈ ప్రకారము రాముడు ఉపదేశించిన వచనములను శబరి వింటూ రామా, దైవమనస్సునకు ప్రీతిగావించుట దానికంటే భక్తునకు మరొక మార్గము లేదుకదా? యెవరు ప్రీతిపడిననూ పడకపోయిననూ నీప్రీతిని బడయుటకంటే నాకు వేరు స్వర్గమెందునూ లేదు.

నాథా! నీమనస్సునకు తృప్తి గావించుటకంటే నాకు కావలసినది వేరొకటిలేదు. ఈనాటికి నాతండ్రి, నాపరమాత్మ, నా ప్రాణనాథుడు, జగన్నాథుడు, లోకనాథుడు, విశ్వనాథుడు నాకు ప్రసన్నుడయ్యెకదా! ఓ జానకీవల్లభా! అని వర్ణించగనే జానకిని జ్ఞప్తికి తెప్పించెను. అంత రామలక్ష్మణులు, శబరీ! ఇంతసేపూ యే విచారమునూ లేక ఆనందములో మునిగినదమ్మా తిరిగీ విచారమునకు గొనిపోతివా! అని రాముడు పలుకగనే, శబరి దిగ్గున తలయెత్తి నాథా! యేమంటివి నా అపరాధము క్షమింపుడని పాదాలపై బడెను. అంత రాముడు, శబరీ జానకి సమాచారము నీకేమైనతెలియునా? ఆమెనుగురించి నీవేమైననూ వినియుంటివా? అని అడుగగనే, "రామా! జానకిని యెరుగనా, రామతత్వ మెరిగిన ప్రతిస్త్రీ జానకి తత్వమెరుగక వుండదు. ఆ మహా సాధ్వీమణి, పవిత్రారత్నము, స్త్రీజాతి జ్యోతి, ఆతల్లి ఎంతటి అదృష్టవంతురాలో, ఆమె రామనీడయేకదా? రామా, మతంగమహర్షి తెలిపిన సీతాతత్వమును మీకు విన్నవింతును, మీకు తెలియనిదికాదు, అడిగితిరిగనుక విన్నవింతును.

రాముడు రాక్షససంహార నిమిత్తమై యేదోఒక నెపమును కల్పించుకొని మంథరా - కైకలందు మాయను ప్రవేశింపజేసి, సీతారామలక్ష్మణులు అయోధ్యను వదలి అరణ్యములో ప్రవేశించిరనియు, వారు కొంతకాలము దండకారణ్యమందలి ఋషులను అనుగ్రహించి వారి తపఃసాధనలకు అడ్డుతగులు రాక్షసులను హతమార్చి ఋషి ఆశ్రమములను కాపాడుచూ వుండ, రాక్షససంబంధమైన రావణునితో కొంత సంబంధము యేర్పరచుకొనుటకై కొన్ని కృత్రిమ నాటకములాడుననియూ ఆ నాటకములో రావణుడు సీతాపహరణముగావించునటుల రాముడేసంకల్పముచేయుననియూ,

రావణుడు ఆపహరించిన సీత నిజసీతకాదనియూ, అయితే లోకదృష్టికి ఆమెయే సీతగా రూపొందునినియూ, ఈ నెపముతో రాముడు సీతాన్వేషణ సలుపుచూ మన ఆశ్రమము ప్రవేశించుననియూ అపుడు నీకు మహాభాగ్యము చేకూరుననియూ తెలిపెను.

అంతియేకాక మన ఆశ్రమమునువీడి మన ఆశ్రమమునకు సమీపమున నున్న ఋష్యమూక పర్వతముపై అన్నతో ద్వేషము చేసుకొని అరణ్యవాసము గావించు చున్న సుగ్రీవునితో స్నేహము గావించుకొని అతనిద్వారా, సీతాన్వేషణ సలిపి, రావణ సంహారము జరుపుననియూ తెలిపెను. లీలానాటక సూత్రధారియైన నీచర్యను వారానాడే తెలిపెను. నీనటన లోకనటన, నీ సంకల్పము లోకకల్యాణము. అంతా నీ సంకల్పమేతప్ప వేరుకాదు. నీ సంకల్పములేక యే చిన్న కార్యముకూడా జరుగదు.

నాధః యేమి తెలియనివానివలే నటించుచూ, సీతనిమిత్తమై విచారించునటుల నటనచేయుట పామరులు, ఆత్మవిశ్వాసులు, నాస్తికులు ఇది సామాన్య దృష్టితో చూతురేమో కానీ దైవత్వమును తెలుసుకొన్నవారు, ఆత్మవిశ్వాసముకల సాధకులు, భక్తులు నీ నటనలను నమ్మరు. సర్వమునకూ నీవే కర్త. నీ సంకల్పమునకు విరుద్ధముగా నడచుటకు యెట్టివారికీ చేతకాదు. మంచియైనను చెడు అయిననూ వారి వారిలోని భావములుకూడా ఆయా సమయమునకు తగిన రీతిగా నీవే సంకల్పింతువు కానీ వారు ఏ మాత్రమూ కర్తలు కారు. అజ్ఞానులు కొందరు మేము మా పనులకు కర్తలమని భావింతురు. అదే అజ్ఞానము.

రామా, నా అతిభాషణ క్షమించి నన్ను అనుగ్రహింపుము." అని పాదములపై బడెను. అంతలో యోగాగ్ని ఆమె దేహమును భస్మముగావింప ప్రాణము రాముని పాదములలో చేరెను.

# సుగ్రీవ సఖ్యము

అంత రామలక్ష్మణులు శబరికి మోక్షము నను గ్రహించి మతంగ ఆశ్రమమును వీడి, శబరి భక్తి ప్రపత్తులను దీర్ఘ విశ్వాసమును వర్ణించుకొంటూ సింహముల జతవలే అరణ్యమార్గముల ప్రయాణము సలిపిరి. ఆ విధముగ ప్రయాణము సాగించి ఋష్యమూక పర్వతమును సమీపించిరి.

మంత్రులతో కలిసి ఆ పర్వతముపై సుగ్రీవుడు నివసించుచుండెను. మహా బలసంపన్నులైన సద్వంశ సార్వభౌములైన ఈ ఇరువురు అన్నదమ్ములు అటు వైపున నడచుచున్న దివ్యభావమును సుగ్రీవుడు పర్వతముపైనుండి చూచెను. తన అన్న అయిన వాలి భయముచే సుగ్రీవుడు నిరంతరము యెవరు వత్తురో- యెవరిని పంపునో అన్న దిగులుచే నిరంతరము దారులు కనిపెట్టుకోవటం జరుగుతూ వుండెడిది. వీరి నడక, వీరి తేజస్సును చూచి సుగ్రీవుడు భయపడి, హనుమంతుని పిలచి, "వీరుడా! ఆ మహావీర పురుషుల చూచితివా? నీవు ఆలసించక త్వరితముగా వెళ్ళి వారి వృత్తాంతమును తెలిసికొని రమ్ము. ఒకవేళ వారు వాలివలన పంపబడినవారయి వుండిన నీవు ముఖమును వంచుకొనుము. దానిని పట్టి నేను గ్రహింతును. తక్షణమే పర్వతమును వీడ ప్రయత్నింతును" అని అనేక గుర్తులు తెలిపెను.

అంత హనుమంతుడు గంతులు వేయుచు పర్వతము దిశకు నడచుచున్న ఆ మహా తేజోవంతులగు రామలక్ష్మణుల యెదుటనిలిచి వారికి నమస్కరించి, "ఓ తేజోరాశి కుమారులారా! మీరెవరు? మీ రూపములు మహారమణీయముగా వున్నవి. సుకుమారులుగా కనుపించుచున్నారు. మీరు మానవమాత్రులుగా లేరు, కేవలము సాక్షాత్ నరనారాయణులుగా దిగివచ్చినటులున్నది. ఈ భయంకరారణ్యమున వంటరిగా తిరుగుటలోని మీ భావమును తెలుపుదురా?" అని వినయముగా, గౌరవముగా వారిని ప్రశ్నలువేయ మొదలుపెట్టెను. ఇతని వినయవిధేయతలను గ్రహించి

రామచంద్రుడు చిరునవ్వు నవ్వి, "మారుతీ వీరా! మేము అయోధ్యాధిపతి యగు దశరథ మహారాజునకు పుత్రులము. పితృవాక్య పరిపాలన నిమిత్తమై మేము అరణ్యమును ప్రవేశించితిమి. ఇతడు నా తమ్ముడు, ఇతనిని లక్ష్మణుడనియూ, నన్ను శ్రీరాములనియూ పిలుతురు. మాతో నా ధర్మపత్ని కూడను వచ్చెను. విధివశాత్తు మేము చిత్రకూట పర్వతముపై నివసించుచున్న సమయమున, మేము పర్ణశాలలో లేని సమయమును చూచుకొని యెవడో రాక్షసుడు ఆ ఇల్లాలును అపహరించెను. ఇపుడు ఆమెను వెతుకుచూ మేమిటు తిరుగుచున్నాము" అని ఉన్నది ఉన్నటుల రాముడు తమ రాకకు కారణమును తెలిపెను.

అంత! రామచంద్రుడు ఓ వీర హనుమా! మా పూర్వోత్తరముల చెప్పితిమి. నీ పూర్వోత్తర విషయము మేము వినగోరుచున్నాము. హనుమంతుడు వీరి వృత్తాంత్తము తెలిసికొని, వీరు తన ప్రభువులని గ్రహించి, వారి పాదములపై బడి నమస్కరించి లేచి, నేత్రములనుండి భరించలేని ఆనందముతో బాష్పములు వీడుచు, చేతులు జోడించుకొనగా, నోట మాట రాలేకపోయినది.

తుదకు ధైర్యమును తెచ్చుకొని, "ఓ నాథా! నేను ఒక బుద్ధిహీనుడను, జ్ఞానహీనుడను అగుటచే మిమ్ములనట్లు ప్రశ్నించితిని. నా అపరాధములను క్షమించుడు. ఓ రాజాధి రాజా! సాధారణ మనుజుల వలే మీరు నా పూర్వోత్తరములను ప్రశ్నించుట ధర్మమా? నేను మీ మాయకు బద్ధుడనగుటచేత మిమ్ములను గుర్తించ లేక పోతిని ఓ ప్రభూ! నా ప్రభువులు సమర్థులు, ఎన్నడయినా సేవకుడు స్వామి కంటే అధికుడగునా? నాథా! సకల జీవులు మీ మాయచే మోహితులగుదురు. నేనొక మాట చెప్పనెంచితిని. దానికి నానాథుడు ప్రమాణము. నేను నానాథుని భజించటము తప్ప అన్యమెరుగను. నాధుని బలము చూచుకొనే సేవకుడు ప్రవర్తించును. పోషించుటకు శిక్షించుటకు ప్రభువు నిలిచియుండ సేవకునికి భయమెందుకు" అని తన నిజస్వరూపమును ధరించెను. ఆ రూపమును రాముడు చూచి పరమానందముతో కౌగిలించుకొని, హనుమంతా! నీవు లక్ష్మణునితో పాటు ప్రధాన ప్రియుడవు, అని అతనిని చెంతకులాగుకొనెను; శిరస్సును వీపునూ నిమురుచూ ఓ హనుమంతా! అన్యగతి నెరుంగక నన్ను సేవించు సేవకులే నా కధికప్రియులు, అని రాముడు తెలిపిన క్షణమే. ఓ నాథా! సుగ్రీవుడు వానరులకు రాజు. అతడు అనేక కారణాల చేత అన్నఅయిన వాలితో విరోధము కలిగి, రాజ్యమునుండి తరుమబడుటచేత అతడు ఈ పర్వతమునందు నివసించుచున్నాడు. అతడు కూడా తమ దాసుడే, అతడు మీ స్నేహమునకు తగినవాడు. మీరు వానర రాజున కభయమిచ్చి అతని దైన్య

మును పోగొట్టుడు. అతను సీతాన్వేషణ నిమిత్తము కోట్ల కొలది వానరులను నలు దిశల పంపి, తగిన విజయమును సాధించగల సమర్థుడు, అని సుగ్రీవుని అనేక రాజనీతులను గుణగణములను వివరించెను.

సుగ్రీవునితో స్నేహము చేయు నిమిత్తమై శ్రీరామలక్ష్మణులను హనుమంతుడు తన భుజములపై నెక్కించుకొని క్షణములో పర్వతముపైకి యెగసెను. రామలక్ష్మణులను దర్శించిన మాత్రముననే కృతార్థుడనయితినని సుగ్రీవుడు చాలా ఆనందించెను. వీరి వృత్తాంతమువారునూ, వారి వృత్తాంతమును వీరును వివరముగ అర్థము చేసుకొనిరి; ఆదరించుకొనిరి. అన్యోన్యమయిన సంబంధమును కల్పించుకొని, సుగ్రీవుడు రామలక్ష్మణుల పాదాలకు నమస్కరించి, సత్కరించెను. సుగ్రీవుని పరిస్థితిని, నీతిని పురస్కరించుకొని చక్కగా అర్థము చేసుకొని రాముడు సుగ్రీవునికి అభయమునిచ్చెను. సుగ్రీవుడు కూడా, రామసేవలో తన ప్రాణమునైననూ అర్పితము గావింతునని వాగ్దానము చేసెను.

ఈ ప్రకారము వారిరువురూ అగ్నిసాక్షిగా స్నేహమును గట్టుకొనిరి అగ్ని సకల జీవుల హృదయములలో నుండును. మనోవికారములు పుట్టినయెడల వానిని దహించును. రామాయణమున కగ్ని ప్రధానము. అగ్నిహోత్రుని ప్రసాదముతో రాముడు పుట్టెను. అగ్నిసాక్షిగా సీతను పెండ్లాడెను. అగ్నే లంకను దహించెను. అగ్నియందే సీత శక్తి దాచబడెను. అగ్నియందే సీతను వాపసు తీసుకొనెను. అగ్నియందు పరిశుద్ధమయిన స్వర్ణమువలె అగ్నిద్వారా రాముని హృదయము పరిశుద్ధమయినదన్న సూచన, జ్ఞానమే రాముడు, ధర్మమే రాముడు. ఆ కారణములచే సుగ్రీవునికూడా అగ్నిసాక్షిగా స్నేహము చేసుకొనెను. అప్పుడప్పుడు లక్ష్మణుడు రాముని వృత్తాంతమును సుగ్రీవునకు తెలుపుతూ వుండెడివాడు.

సీత, మిథిలాధిపతి కూతురు. మథింపబడిన వంశమగుటచే వానికి మిథిల వంశమని సార్థక నామము. కనుక ఆమె విశేషమయిన మథనము జరిగిన కానీ లభించదు, అని లక్ష్మణుడు సుగ్రీవునకు సీతయొక్క వృత్తాంతమును కూడా విపులముగా తెలిపెను. అది విని సుగ్రీవుడు కంటిధారలు కార్చుచూ, "ఓ నాథా ! ఒకనాటి దినము నేను మంత్రులతో కూడి ఆలోచనలు జరుపుచుండగా ఆకాశ మార్గమున పుష్పక విమానము వెళ్ళెను. అందునుండీ, రామా, రామా అను పలుకులు వినుపించెను. మేము ఆ వింతను చూచుచుండ ఆమె వస్త్రమున ఆభరణములుకట్టి ఈ పర్వతముపై చూచుచున్న మా వైపునకు ఆ గంటు విసిరినది. అది యేదో ఆభరణముల మూటగుటచేత, భద్రముగా దాచితిమి. బహుశా రావణుడే ఆమెను గొని

పోయెను. ఆ దుర్మార్గుడు చేయనది ఒక్కటీ లేదు." అని సుగ్రీవుడు రావణునిపై పండ్లు పట పట కొరికెను. అంతలో రాముడు సుగ్రీవా యేదీ ఆ ఆభరణముల మూటను తెప్పించుము అని ఆజ్ఞాపించెను.

సుగ్రీవుడు స్వయముగనే లేచి గుహలో దాచిన ఆ మూటను తెచ్చి రాముని ముందు పెట్టెను. ఆ మూటకట్టిన వస్త్రము వనవాసమునకు బయలుదేరినపుడు పిన తల్లి ఆమెపై విసరిన నారవస్త్రము. దానిని గుర్తించిన తక్షణమే లక్ష్మణుడు కంటి ధారలు కార్చెను. అతనిని చూచి సుగ్రీవ, హనుమంతాదులు కొంత విచారించిరి, రాముడు ఆ మూటను విప్పి చూచి ఆ ఆభరణములు సీతవేనా అని లక్ష్మణునకు చూపెను.

లక్ష్మణుడు అన్ని నగలు సీతవవునో కాదో నాకు తెలియదు. యేనాడూ సీత ఆభరణములను తాను కన్నెత్తి చూచినవాడు కాడు. ఒక కాలి అందెలు మాత్రము ఏరి "అన్నా, ఇవి తల్లి యొక్క అందెలే. నాకు సందియము లేదు. నిత్యమూ తెల్ల వారి, వారిపాదములకు నమస్కరించు సమయముననూ వనవాసములో ముందు మీరూ, మీ వెనుక సీత నడచుచున్న సమయముననూ నేను వెనుక నడచుచూ ఆమె పాదములనే చూచుచూ ఆమె పాదములనే అనుసరించుచుంటిని కనుక వీటిని బాగా గుర్తించ గలిగితిని" అని అన్నాడు. కొంతసేపు సీతను స్మరించుచూ, రామ లక్ష్మణులు విచారించినటుల నటన చేయుట చూసి సుగ్రీవుడు, హనుమంతుడు వారిని వోదార్చిరి.

సుగ్రీవుడు వారి విచారమును చూడలేక, "నాథా ! విచారించకుడు. నేటి నుండే తగినవుపాయములు పన్ని సీత జాడలు తెలిసికొని క్షణములో రావణుని హతమార్చి, సీతను తమకప్పజెప్పుదును. ఇది నా ప్రతిజ్ఞ" అని రామునకు వాగ్దానము చేసెను. సుగ్రీవుడు చేసిన వాగ్దానమునకు రాముడు సంతసించి, అంతలో ఓ సఖుడా ! నీవు ఈ అడవిలో నివసించుటకు కారణము విపులముగా తెలుపమని రాముడు కోరగా, సుగ్రీవుడు తన తల్లిదండ్రు లెవరో, తన నిజనివాసమేదో, తన అన్నకూ, తనకూ విరోధము కలుగుటకు కారణమేమో, అన్నియూ పూసగ్రుచ్చి నటుల తెలిపెను.

తన చరిత్రనంతనూ విని రాముడు, ఇంచుమించు తన చరిత్రకు సమీపము గనే యున్నదని తలంచి, భార్యావియోగముననందును రాజ్యభ్రష్టులగుట యందును, ఇరువురూ ఒక్కటేననియూ, అందునా సుగ్రీవుని మాటలనుపట్టి అతను నీతి నిజాయితీలు గలవాడని గుర్తించి, తమ్ముని భార్యను అన్న అపహరించటము కోతి

జాతికి విరుద్ధమని, ఇట్టి ధర్మవిరుద్ధమయిన మార్గమును అవలంబించుచున్నాడని వాలి శిక్షార్హుడని గుర్తించెను.

అంత రాముడు మీ జన్మ వృత్తాంతమును వినగోరుచున్నానని తెలిపెను. సుగ్రీవుడు, నాథా! నా వంశముయొక్క పూర్వోత్తరమంతయూ తమపాదముల చెంత వుంచకోరుచున్నాను, ఆలకింపుడు అని ఒకనాడు సృష్టికర్త ఒక చిన్న కోతి రూపమును సృష్టించెను. అతను మహాబలవంతుడు కానీ చంచల స్వభావుడగుటచేత కోతి తనతో సమానుడయినప్పటికినీ చంచలుడగుటనే అతనికి 'ఋక్షరాజు' అని పేరు పెట్టెను. ఆ వానరుడు బ్రహ్మకు నమస్కరించి స్వామీ! తమ ఆజ్ఞ యేమని ప్రార్థించెను. అప్పుడు బ్రహ్మ వానరా నీవు అడవిలో స్వేచ్ఛాసంచారము గావించుము. ఫలములు స్వేచ్ఛగా భుజింపుము, నీ చేతికి చిక్కిన రాక్షసులను సంహరింపుము.

అపుడు ఋక్షరాజు దక్షిణ దిశకు బయలుదేరి వెళ్ళెను. ఒకనాడు ఆ వానరుడు వనములో సంచరించుచుండి ఒక కొలనులో నీరు త్రాగుటకై వెళ్ళెను. ఆ కొలనులో నీటియందు తన ప్రతిబింబమును తాను చూచి, ఆ జలములో యెవరో తనవలే ఒక శత్రువు దాగినాడని భావించి విచారింప దొడంగెను. ఆ క్రోధమును భరించలేక నిరంతరమూ ఆ గుండము చుట్టూ తిరుగుచూ వుండెను.

అతడు చేసెడి పనులన్నింటికి జలమునుండి ప్రతిధ్వని ప్రతిఫలించుచుండెను. ఆ వెంటనే పెద్దగ గర్జించెను. అంత నీటిలోని ప్రతిబింబము కూడా పెద్దగ గర్జించెను. ఇక పట్టలేక వానరుడు గుండములోనికి కుప్పించెను. ఆ క్షణమే తాను స్త్రీగా మారిపోయెను. ఆమె గట్టునకు వచ్చి దైవమా యేమి ఈ విచిత్రము అని సూర్యుని వైపున తిరిగి, ప్రార్థించుచూ, ఇంద్రుని మనసారా స్మరించుచుండ, ఇంద్రవరప్రసాదముచే ఒక కొమారుడును, సూర్యుని వర ప్రసాదముచే ఒక పుత్రుడునూ కలిగిరి. ఇంద్రుని ప్రసాదమైన బిడ్డకు వాలి అనియు, సూర్యవరప్రసాదమైన బిడ్డకు సుగ్రీవుడనియు వారికి నామము లేర్పడెను.

ఈ ఇరువురు పుట్టిన తక్షణమే స్త్రీ రూపము వీడి ఋక్షరాజయ్యెను. అతను ఈ బిడ్డలను వెంటపెట్టుకొని బ్రహ్మను ప్రార్థించెను. బ్రహ్మకు తన యావచ్చరిత్రనంతయూ చెప్పుకొనుచూ స్మరించెను. అంత, ఓయీ! వాలిసుగ్రీవులారా! మీ రన్నదమ్ములిరువురూ దక్షిణదిశకు బొండు. మీరు కిష్కింధా నగరములో నివసించుడు. చరాచర జగన్నాథుడు, అనేక నాముడయిన శ్రీరాముడు రఘువంశమున దశరథమహారాజునకు జన్మించి తండ్రి ఆజ్ఞ ననుసరించి వనమునకు వచ్చి అనేక అఘా

నుష్య చర్యలను, కేవల మానవునివలే లీలలు సలుపుచూ తిరుగుచూ, మీరున్న కిష్కింధకు చేరును. అపుడు అతనితో స్నేహమేర్పడి అతని దర్శన స్పర్శన సంభాషణాదులతో మీ జన్మ సార్థకంబౌను అని చెప్పెను.

రామచంద్రా: బ్రహ్మ అశరీర వార్తలను మేము ఇరువురము విని, సంత సించితిమి. మేము యే జప తప యజ్ఞ యాగాది కర్మల నేవియూ చేయలేదు. వారి అనుగ్రహ ప్రభావమే మా సర్వశక్తి సామర్థ్యములు. అంత మా మనస్సు లందు ఆ శబ్దబ్రహ్మకు నమస్కరించి కిష్కింధకు చేరితిమి, ఆ అడవిలోని రాక్షసు లను సంహరించితిమి.

ఒకనాడు మయుడను రాక్షసునకు మాయావి, దుందుభి అను కొమారులిరు వురు కలిగిరి. వారు మహా రణవీరులు. వారిలో మాయావి మహాయుద్ధము చేయు టకు మమ్ములను సమీపించెను. నిశిరాత్రి సమయమున మా నివాస సమీపము నకు వచ్చి బొబ్బ పెట్టెను. శత్రువు పొగరుపోతు తనమును మా అన్న అయిన వాలి సహించెడివాడు కాడు. ఆ క్షణమే లేచి వాలి వాని వద్దకు వచ్చెను. అపుడు వాడు వాలిని చూచి పారిపోయెను. వాలి తన బలముతో వానిని వెంబడించెను. అంత వాడు పారిపోయి ఒక గవిలో ప్రవేశించెను.

నేను కూడనూ అన్న అయిన వాలి వెంట వెళ్ళితిని. వాలి నన్ను పిలిచి "తమ్ముడా ! నేను వానిని హతమార్చుటకై యిందులో ప్రవేశింతును వాడు తిరిగీ వెనుకకు రాకుండుటకై నీవు ఈ ద్వారము దగ్గర కాచియుండుము. అని చెప్పెను. యెంత కాలమని, నేను ప్రశ్నింపగ, పదునైదు దినములైననూ సరే, నీవు వుండుము. ఒకవేళ పదునారవ దినమునకు నేనురాని పక్షమున వాడు నన్ను సంహ రించెనని తలంచి వెనుకకు మరలుము అని చెప్పి మా అన్న గవిలో ప్రవేశించెను. అయితే నేను ముప్పది దినములు నిలిచియుంటిని. అంత ఆ గుహనుండి రక్తపు వాసన వచ్చెను. ఆ వాసన నా అన్న అయిన వాలి వాసనని నేను కని పెట్టితిని.

ఇక వుండి లాభము లేదని నేను ఆ రాక్షసి తిరిగి బైట రాకుండుటకై ఒక పెద్ద గుండును ఆ ద్వారమునకు అడ్డుపెట్టి విచారించుచూ నా నివాసమునకు చేరి అక్కడనుండి నేను నా సహచరులతో అన్నయొక్క వృత్తాంతము తెలుపుచూ విచా రించుచూ, వాలి మహాబలశాలి, అట్టి బలశాలి మాయావి రాక్షసిచే చంపబడిన, ఆ మాయావి నన్ను లెక్కచేయునా అని నా ప్రాణము యే క్షణములో తీయునో అని అదురు బెదురులతో కాలము గడుపుచుంటిని. పురవాసులు సహితము భయభ్రాంతికి

గుర్తియైరి. అంత వారందరూ చేరి మా కెవరైనా నాయకుడుండవలెను కదా, తమ అన్నగారైన వాలి మరణించెను కనుక ఆ స్థానమున తమరే నిలిచి మమ్ము రక్షించుడని కోరిరి. నా కట్టి నాయకత్వముపై యిష్టము లేకపోయెను.

అయిననూ ప్రజలు బలవంతపరచి నన్ను నాయకునిగా నియమించిరి. ఇది జరిగిన రెండు మూడు దినములకే అన్న అయిన వాలి మాయావిని సంహరించి విజయవంతుడై నగరమును ప్రవేశించెను.

నేను నాయకుడగుటచే, వాలి భరించలేనంతటి క్రోధమును పూని తాను అతనిని నేను హతమార్చి నాయకత్వమును చేపట్టవలెనను వుద్దేశముతో గుహకు పెద్ద గుండును అడ్డుపెట్టి వచ్చినటుల భావించి, ఆనాటినుండీ నాపై ఒక విధమైన వైరమును బూనెను. నన్ను శత్రువుగా భావించి ప్రతి చిన్నవిషయమునందును నన్ను హీనాతిహీన నివలే అవమాన పరచుచూ వచ్చెను. నా సర్వబాధ్యతలు తీసుకొని, నన్నొక పనిమనిషివలే కూడా తలంచక నన్ను ఆ భవనమునుండి వెలుపలకు పంపెను. నా భార్యను తన స్వాధీనము చేసుకొనెను.

ఈ విధముగ జరుగుచుండ ఒకనాడు, నన్ను చంపివేయవలెనని ప్రతిజ్ఞ పూని నాతో పోరాడెను. అతని బలమునకు నే తాళలేక పోవుటచే కిష్కింధ వదలి రావలసి వచ్చెను. కొందరు నా అభిమానులు నా బాధలు చూచి నాకు కొంత సహాయముచేయుచున్న మంత్రులను, నా అనుచరులను కిష్కింధలో వుండరాదని కఠినముగా శాసించెను. అందువలన వారు కూడ నాతో కిష్కింధ వదలి వచ్చిరి.

నా భార్య నాతో రావాలని యెన్నియో ప్రయత్నములు చేసిననూ, ఆమెను హింసించి తన భార్యగా స్వీకరించి అందు వుంచుకొనెను, అని సుగ్రీవుడు చెప్పుచూ కంటిధారలు కార్చుచుండ, శ్రీరాముడు ఓదార్చి మరొకతూరి వాగ్దానము చేసి తనను రక్షింతునని చెప్పెను.

చేయునది లేక నేను ఈ పర్వతమున నివసించుచున్నాను. ముని శాపముచేత వాలి ఈ పర్వతమునకు రాలేనందున మేము ఇక్కడైననూ యింతటి ధైర్యముగా జీవింపగలుగుచున్నాము. లేకున్న ఈపాటికి అతని చేతులలో చచ్చియుండెడి వారము" అని సుగ్రీవుడు పలుకగనే, అతని వచనములు రాముడు విని, "సఖుడా! శాపమునకు కారణమేమి" అన్నాడు. "ఓ నాథా! మాయావి సోదరుడైన దుందుభి మహాశూరుడు. వానితో సమానమగు బలవంతుడు మరొకడు లేకపోయెను. వాని బలమును వాడు పరీక్షించుటకై పర్వతములతో, సముద్రములతో పోరాడెడివాడు. ఒకనాడు పర్వతములతో నాకంటె బలశాలి లోకముననే లేడని గర్వించుచుండ, అశ

రీరవాణి. "దుందుభీ ! నీవట్లు విఱ్ఱవీగకుము, నీ కంటే బలవంతుడొకడు కలడు. అతడు పంపా సరోవరమున వాలి అను నామముతో నాయకత్వమును పూని స్వేచ్ఛా విహారమును సలుపుచున్నాడు" అని చెప్పెను. ఆ మాట వినుటతోటనే, కిష్కింధను ప్రవేశించి మహిషరూపమును ధరించి గర్జించుచు డెక్కలతో భూమిని చీల్చుచు, తొణుకు బెణుకులు లేక ధీమని వచ్చెను.

వాడు భూమిని మర్దించుటచే వృక్షములు విరిగి నేల కూలుచుండెను. వాని సింహనాదము హృదయములను కదిలించుచుండెను. ఈ విధముగ ఆర్భాటము చేయుచుండ, చంద్రుని పట్టుటకు రాహువు వేంచేసినటుల, వాలి ప్రవేశించి వానిపై పడెను. వారి వికృతరూపములు చూచువారలకు రెండు మదపుటేనుగులవలె కనిపించెను. వారు మల్లయుద్ధము ప్రారంభించిరి. ఈ విధముగ నాలుగు యామములు పోరాడిరి. తుదకు వాలి రాక్షసుని పొడిచి చంపెను. ఆ వేటుతో వాడు గిరగిర తిరిగి పర్వతమువలె నేల కూలెను.

వాని కళేబరము నేల కూలగనే కొన్ని వృక్షములు దాని క్రింద విరిగిపడెను. అంత వాని కళేబరమును రెండు వ్రక్కలు చేసి దక్షిణోత్తరములకు ఒక్కొక్కదానిని విసిరెను. అట్లు వాని కళేబర భాగమును పారవేయుటచే ఆ భాగము మునీశ్వరునిఆశ్రమములోపోయిపడెను. ఆశ్రమమంతయూ వానిరక్తబిందువులు చిమ్మెను. జపతపాదులు గావించుకొను ఆశ్రమవాసుల దేహములయందు దుందుభి రక్తబిందువులు పడుటచేత, మతంగ మహర్షి స్నానమునాచరించి వచ్చి చూచునరికి, ఆశ్రమమునందెందు చూచినా రక్తబిందువులే. ఒక మహాభయంకరమైన దేహములోని అర్థభాగము ఆశ్రమము ఆవరణములో పడియుండుట తాను సహించుకోలేకపోయెను. తన శిష్యులు ఆనందములో మునగవలసినవారు రక్తములో మునిగి మహా అసహ్యమయిన భావాలలో చాలా బాధపడుచుండుట, మరింత సహించుకోలేకపోయెను. ఈ విధమైన పాపకార్యమునకు పూనుకొన్న వారెవరో అని, కొంత విచారించి, పట్టలేని కోపముతో ముందూ వెనుక విచారించక, ఆలోచింపక ఇక ఆ పాపాత్ముడైన వాలి ఈ పర్వతమును ప్రవేశించిననూ ఈ పర్వతము వైపు చూచిననూ శిరస్సు రెండు ముక్కలయి పోవుగాక, అని ఆ మహర్షి శపించెను.

ఆ మునిశాపమునకు భయపడి వాలి ఈపర్వతము దిశకే రాబోడు. ఆ ధైర్యముచే నేను ఈ పర్వతమున నిర్భయుడనై భార్యా వియోగముతో బంధు వియోగముతో చింతించుచూ కాలము గడుపుచున్నానని సుగ్రీవుడు తన వృత్తాంతమునం

తయూ రామునకు విన్నవించెను. అంత రాముడు వాలి చేసిన, చేయుచున్న పాప ములను సహించుకోలేకపోయెను.

ధర్మవిరుద్ధమైన కార్యములు శ్రీరాముడు చూడలేక పోయెను, వినలేక పోయెను. కేవలము పశుబలమును ఆధారముగా తీసుకొని ధర్మబలమును దైవబల మునూ విస్మరించి ప్రవర్తించే వాలి గతిని చూతునని సుగ్రీవునికి ధైర్యము చెప్పి పదునాలుగు లోకములు అడ్డువచ్చిననూ తన ప్రతిజ్ఞ నిలబెట్టుతాననియూ, ఒక్క బాణముతో వాలిని నేల కూలదోతుననియూ శపథము చేసెను. మిత్రుని దుఃఖమును శత్రు అసందర్భ ప్రలాప ప్రవృత్తులను చూచి సహించుకొను వాని మొఖము చూడరాదు. తాత్కాలిక అనుకూలములను నెరవేర్చుకొనుటకు అభీష్టములను తీర్చు కొనుటకు, పెడమార్గముల పడద్రోయుటకు, ప్రయత్నించు వానిని మిత్రునిగా యెన్నుకొనుట సరియైన మిత్రత్వము కాదు.

పరస్పరానురాగముండవలెను. హృదయమునగానీ, మనసునగానీ, వాక్కున గానీ, కడకు ముఖములో కానీ ప్రేమలేని వాడు కుమిత్రుడని గ్రహించవలెను. అట్టివారి హృదయము, కపటము, మలినము. మూర్ఖ సేవకుడు, లోభియగు రాజు అపవిత్రుడు. అపవిత్రురాలగు భార్య, లేక భర్త, కపట మిత్రుడు, ఈ నల్వురూ శూలముల వంటి వారు, ఓ సఖుడా! సుగ్రీవా! నీవు విచారించకుము. నా యథాశక్తి మనోవాక్కాయములతో నీకు సహాయము చేయగలను. వాలెంతటి బలశాలియయిన నేమి నా బలము నీవెరుగవు కనుక వాని బలమునే నీవు తలంచుచూ కొంత సందే హింతువేమో. ప్రప్రథమమున నా బలమునుకూడా నీవు పరీక్షించ గోరుదువేని, నీ మనోబలమును పొందగోరుదువేని, నీవు యేమి కోరెదవో కోరుకొమ్ము. అందులో నా బలము ప్రకటింతును. నీకు ధైర్యసాహసములనందింతును, వాలితోపోరాటము నకు పూనుకొందును, అని రాముడు సుగ్రీవుని వీపు నిమురుచు, ధైర్యమును అందించుచూ పలుకుచున్న పలుకులు, సుగ్రీవుని యెంతో తృప్తిపరచెను. అంత సుగ్రీవుడు తన ధైర్యము నిమిత్తము శ్రీరాముని శక్తిని చూడ గోరి, రామచంద్రా! ఒకానొక సమయమున నేనూ మా అన్న పరిహాస నిమిత్తమై బలాబలములు పరీ క్షింపగోరి సప్తతాళముల నొక్క బాణముతో వరుసగా పడద్రోయుటకు పూనుకొం టిమి. చంద్రమండలాకారముగ నున్న ఆ తాళములను నేను మూడు మాత్రమే కూలద్రోయగలిగితివి వాలి పంచ తాళములు ఒక్క బాణముతో కూలద్రోసెను. అతనిబలము అంతటిది. దానికి మించి యుండిననే ఆ బలశాలిని, కూలద్రోయ వీలగునని చెప్పి, రాముడుయెన్ని తాళములను కూలద్రోయునో చూడగోరుచున్నానని ప్రార్థించెను.

అంత, సప్త తాళములు ఒక్క వరుసన నున్న వాటి చెంతకు గొంపోయి, రామచంద్రుని వాటిని కూలద్రోయమని కోరగా, ఈ తాళములు వాలి కూలద్రోసిన వాటికంటే ఒక్కొక్కటి నాలుగైదు రెట్లు అధిక విశాలమైనవి కనుక, ఇందులో రెండింటిని కూలద్రోసిననూ వాలి బలమునకు మించిన బలమనే చెప్పవచ్చునని వారిలో వారు ఊహించిరి. వాటినిచూచి రాముడు చిరునవ్వుతో, సుగ్రీవా, ఈ తాళములు నా దృష్టిలో అత్యంత అల్పములు, అని సునాయాసముగా అంబును తీసి, ఒక్క వేటుతో తాళములను కూలద్రోసెను. అది వెనుక నున్న పర్వతములలో దూరబడి బండలను కూడా పగులగొట్టెను.

ఈ దృశ్యమును చూచిన సుగ్రీవుడు రాముని పాదములపైబడి నమస్కరించి రామచంద్రా నూరు వాలులుచేరిననూ ఈకార్యములు సాధించలేరు. ఇంతశక్తి సంపన్నుడు నాకు మిత్రుడగుట నా జన్మము తరించినది. ఒక వాలి దూరమయినా నూరు వాలులు నాకు మిత్రులయినట్లు నే తలంచుచున్నాను. నా అపరాధమును క్షమించుము. తమను పరీక్షింపగోరుట నా అల్పత్వముయొక్క లక్షణమనే సిగ్గుగావున్నది. సాక్షాత్ పరమాత్మనే మిత్రుడుగా భావించుట, చేరుట నా భాగ్యమే భాగ్యము. ఈ నాటితో నా విచారము తీరెను. నేను కిష్కింధను చేరగలనను ఆశ అంకురించెను. నా సతీసుతులతో నేనుసుఖజీవనముచేయగలననుఆశ నన్నెంతయో ఆనందపరచినది.

అయితే అదియెన్నినిమిషములలో,అదియెన్నిగడియలలో,యెన్నిదినములలో, యెన్ని వారములలో అని మాత్రము నన్ను కలవరపరచుచున్నది. అది రామేచ్ఛ. అతని అనుగ్రహమే, యే నిమిషమున సంకల్పించునో అని నాకు శ్రీరాముడు తప్ప అన్యమార్గము లేదని మనసున దృఢపరచుకొని రామునికి నమస్కరించి "రామా! నీ యిష్టము. నీ కృప ఏ నిమిషమున నన్నీబాధనుండి విముక్తుని గావింతువో" అని ప్రార్థించుచూ కూర్చొనెను. అంతేకాదు. నేను ఇంతవరకూ వాలి నా పరమ శత్రువని తలంచి భయపడుచుండెడివాడను. ఈనాటితో వాలి నాకు శత్రువు కాదు, పరమమిత్రుడని, హితుడని తలంచుచున్నాను. అతని మూలముననే నేను ఈ పర్వమున నివసించుట మూలకారణము. ఈ కారణముచేతనే తమ రాకను గాంచితిని, తమతో మైత్రిని చేసుకొంటిని. ఇన్నింటికీ వాలే కారణముకాన అతనిని నేటినుండి హితునిగా తలంతునని చెప్పెను.

ఓ రామా! స్వప్నమందు ఒకనితో పరమద్వేషమును పూని అతనితో అనేక విధముల పోరాడి లేచిన తోడనే, మేల్కొనిన తోడనే, అది మిథ్యయనితోచిన రీతిగ అటులనే మీ దర్శనము కాక పూర్వము, స్వప్నము వలే అజ్ఞానవశాత్

వాలిపై ద్వేషమును పూని, అతని చర్యలన్నియూ విరుద్ధమయినవై నన్ను అనేక విధముల కలతపెట్టెను. మీ దర్శన ప్రాప్తి లభించటం మీతో సంభాషణలు సల పటంచేత నేను నిద్రనుండి మేల్కొనినట్లు, అజ్ఞానమునుండి మేల్కొని, పవిత్ర పాదముల స్పర్శచేత జ్ఞానోదయము నొందితిని.

ఈ తమసేవాభాగ్యము నాకు లభించుటకు పూర్వము నా ద్వేషాసూయలచే వాలితో విరోధము చేసుకొని, కడకు క్రుంగి కృశించి సరియైన సమయము లభిం చునా అనిపరితపించిన నా తాపమే తపముగామారి, నా క్రోధము ప్రేమగా తిరిగెను. నాథా! మీరు కటాక్షించిన, నాకు రాజ్యమక్కర లేదు, ఆలుబిడ్డలు వారి వారి ప్రాప్తానుసారము వారు బ్రతుకగలరు. వారి చింతయూ నాకువద్దు. నిరంతరము తమ సేవ చేసుకొంటూ తమ వెంట నుండుటకు అనుజ్ఞ ఇచ్చిన చాలునని ప్రార్థించెను.

అంత, సుగ్రీవునిశిరస్సు నిమురుచూ రాముడు నాయనా! నీవు పలుకు వచన ములు సత్యములే. రాజ్యములు, సుఖదుఃఖములు, కోపతాపములు, వస్తువాహనాదులు, మంచిచెడ్డలు, స్వప్నదృశ్యములు, దైవసన్నిధి దైవభావములే శాశ్వతస్థానములు. కానీ, నావాగ్దానము నాప్రతిజ్ఞ నిష్ప్రయోజనము కాదుకదా? ఎటులయిననూ నీకు రాజ్యమువచ్చును, దానిని యేలకతప్పదు. నేడు వాలితో యుద్ధము చేయక తప్పదు. సిద్ధముగమ్ము, అనిచెప్పి ధనుర్బాణములనుధరించి, రాముడు సుగ్రీవుని వెంటబెట్టు కొనగా రామలక్ష్మణులు బయలుదేరిరి.

హనుమదాదులను ఆ పర్వతముపైనే వుండుటకు అనుమతించెను. దారిలో సుగ్రీవునకు చెప్పవలసినవన్నియూచెప్పి, పురముయొక్క సింహద్వారమువద్దకు వెళ్ళి కేకవేయుమని రాముడు ఆజ్ఞాపించెను. రామాజ్ఞ ప్రకారము, సుగ్రీవుడు కిష్కింధపుర సింహద్వారము సమీపించి భూమి దద్దరిల్లునట్లు కేకవేసెను. ఆకేక వినిన తక్షణమే తోకత్రొక్కిన పామువలె బుస్సునలేచి వాలి తనతమ్మునిపై యుద్ధమునకు సిద్ధపడెను.

అంతలో భార్యయగు తార వాలి పాదములు పట్టుకొని, పూర్వము అంగదుడు చెప్పిన మాటలను వాలితోచెప్పి, నాథా వారి స్నేహమును ఆశించిన అన్నదమ్ములు సామాన్యులుకారు. వారు మహాబలులు. ఇంతకాలము అణగివుండిన సుగ్రీవుడు ఈనాడు ఇంత ధైర్యముగా యుద్ధమునకు సిద్ధపడినాడన్న, వారి బలములను బాగుగా యెరిగి వారి సహాయమును పొందివచ్చెనేతప్ప, ముందూ వెనుక యోచించకరాలేదు. రాజపుత్రులగు ఆ రామలక్ష్మణులు దైవశక్తులతో కూడినవారు, వారిపై యుద్ధము చేయుట మీకు మంచిదికాదు, అని చాలా బ్రతిమిలాడెను ఆమె దీనాలాపములువిని

వాలి పక్కన నిల్వెను. ఓభయస్థురాలా! శ్రీరాముడు సమదర్శియని చెప్పియుంటివి. అటులయిన అతడు మమ్మిలనిరువురిని సమముగ భావించును. నేను అతనికేమీ అపకారము చేసియుండలేదుకదా; అట్లుకాకున్న రాముడు నన్ను సంహరించెనని తలంచు; నా జన్మమే సఫలమగును, అంతేకదా! ఒకవైపున వాలివాక్యములు తారకు సంతోషమును కలిగించిననూ మరొకవైపు పతి యెడబాటును తాను సహించుకోలేక అతనిని మరింత ప్రాధేయపడుతూ, నాథా! స్త్రీ నిషేధించుట అపశకునముకదా! అని యెంతో చెప్పిననూ, యుద్ధసమయమున శకునములు పనికిరావు, ప్రాణములు కోల్పోవుటయో లేక శత్రుప్రాణములు తీయుటయో జరగవలెను. అంతేకానీ ఈ విధమైన వాటిని లెక్కచేయనని తారను వెనుకకునెట్టి, మహాక్రోధుడై యుద్ధమునకు సింహద్వారమును సమీపించెను. సుగ్రీవుని ఒక్కనిమాత్రమేచూచి వాలి మండిపడి, కుప్పించి సుగ్రీవునిపై బడి ముష్టియుద్ధము ప్రారంభించెను. వాలి వేయు పిడిగుద్దులకు సుగ్రీవుడు భరించలేక పోయెను. పారిపోవుటకు సిద్ధమయ్యెను. కానీ వాలి తన బలమును ప్రవేశపెట్టి కాళ్ళతో, చేతులతో బాధించుటచేత తానిక ఒక క్షణమైననూ నిలువలేక పారిపోయెను. అంత వాలితొడలు తట్టుచూ వెనుకకు వెళ్ళెను.

పారిపోవు సుగ్రీవుని రామలక్ష్మణులు అనుసరించిరి. పర్వతము చేరిన తరువాత, సుగ్రీవుడు చాలా నిరాశతో, బాధతో, దిగులుతో రామునకు నమస్కరించి, స్వామీ! తామెందుకు ఇంత నన్ను పరాభవముచేసితిరో అర్థమగుటలేదు. తాము సహాయము చేతురను కొండంత ఆశతో వెళ్ళితిని. తమ అంబు యేక్షణము వాలిపై పడునో అని క్షణక్షణము ఆ ధైర్యముతో పోరాడితిని. కానీ ఇక నే తాళలేక పారిపోవలసి వచ్చెను. మాఅన్న మహా బలవంతుడు, ఆ గ్రుద్దులను నేను భరించలేకపోతిని, అని విచారించెను. అంత రాముడు, సుగ్రీవా! విచారించకుము. కారణము వినుము. మీరిరువురూ ఒకేవిధముగా నుండుటచేత, సమానరూపులు, సమానబలులు అగుటచేత, నే నతనిని చంపలేకపోతిని, అని రాము డన్నాడు.

అనగా అందులోని అంతరార్థము వాలికూడా తనపాదభక్తుడే, వా డూనా హితుడే! నీవెట్లో తానూ అట్లే నాదయను ఆశించినవాడు అను అర్థముతో ఇరువురూ సమానముగనేకనుపించితిరి. అని రాముడుఅన్న పదములోని అంతరార్థము సుగ్రీవుడు అట్టిఅంతరార్థము తెలుసుకొనలేక, "రామా! యిన్ని యెరిగిన నీకు వాలెవరో, సుగ్రీవుడెవరో యుద్ధమున కనుగొనలేకపోతివా! ఇది నేనమ్మను. కారణమేదియో యుండును. లేక నా పురుషార్థమును నే గావింపవలెనను ఉద్దేశము, తమలో వుండి యుండవచ్చును. అదట్లు జరుగవలెనని జెప్పియుండిన, నేను ప్రారంభమునందే

తగినరీతిగా యుండియుండెడివాడను. రాముడు చూచుకొనునుగదా అని యెంతో అలక్ష్యముగా వుంటినని వగచెను. ఈవిధముగ నిరాశ నిస్పృహకు గురియైన సుగ్రీవుని చెంతచేర్చి, అనేకవిధముల వోదార్చి సుగ్రీవుని దేహమును తన అమృతహస్తములతో నిమిరెను. అతనికి తగిలినదెబ్బలు క్షణములోమాయమై బాధ యేమాత్రము లేక హాయిగా తోచెను.

సుగ్రీవుడు పరమాశ్చర్యముతో, "రామచంద్రా! సర్వము నీ హస్తమందే యున్నది. ఈసృష్టి స్థితిలయములు మీ స్వాధీనము. అట్టిమీరే నాకు చిక్కినపుడు ఈ రాజ్యాధికారవాంఛ నాకక్కరలేదు. మీకృపలో ఇదియేపాటిది"అని తీవ్రవైరాగ్యము బయలుదేరెను. కానీ రాముడు అతనిమాటలను లెక్కచేయక, ఈమాటలు తాత్కాలికపు ప్రతిబింబములు, నాశక్తిసామర్థ్యములను దర్శించు సమయమున కలుగు ఉపశాంతి వచనములు. నేను వాటిని లక్ష్యమందుంచను. హృదయ శాంతివచనములే నాకు లక్ష్యము, అనేకమంది పరమభక్తులుగా వుండువారు దైవముయొక్క లీలాశక్తులను వర్ణించు సమయాన సర్వమును మరచి, తనకంటే వేరు అధికమగునది లోకమున లేదని తలంతురు. కొంత తడవైన, లేక మనోవాంఛలు విఫలమైన, దానికి విరోధమైన భావములతో తాను చూచినవన్నియూ సత్యమా, కాదా, అను అనుమానములకు గురియగుదురు. ఇది ఆస్తికలోకమున కనబడు పొరలు, తెరలు. ఇవి నేను తలంచను, నీవు తిరిగి మీఅన్నతో పోరాడుటకు సంసిద్ధుడు కావలసినదే అని బలవంతపెట్టెను.

అయితే సుగ్రీవుడు లోలోన వగచుచూ రాముడు ఈపరి తప్పక వాలిని వధించునను ధైర్యముతో రాముని వచనములు గట్టివిగా వుండుటచే నిరుత్సాహమునకు చోటివ్వక ముందునడచెను. అంత రాముడు లక్ష్మణునితోచెప్పి వనపుష్పములను తెప్పించి ఒకమాలగాకూర్చి దానిని సుగ్రీవునిమెడకు వేయించెను.

ఇందులోని అంతరార్థము, పూర్వము తారదగ్గర వాలి రాముడు సమదర్శియని చెప్పియుండెను. పూర్వము సమదర్శిగ నుండుటచేతనే వానిని కొట్టలేకపోయెను. ఇప్పుడు వాలికంటే సుగ్రీవునిపై అధికప్రేమ కలదను చిహ్నమును నిరూపించుటకు హారము అధికంగా వేయించెను. ఇరువురూ సమమేకానీ హారమధికము. అదే ప్రేమమాల. కంఠమున ధరించమని రాముడు సుగ్రీవునికి బోధించెను. ప్రేమకు మరణములేదు. కారణము, ప్రేమ స్వార్థరహితము. ఈవిధమైన ధైర్యసాహసాలు అందించి సుగ్రీవునితో కేకలువేయించి రామలక్ష్మణులు చెట్టుచాటున నుండిరి. వాలి భూమి దద్దరిల్లునట్లు పరుగిడి వచ్చుచుండ సుగ్రీవుడు అదురుచు, బెదురుచూ, రాముని

చింతించుచూ యుద్ధమునకు సిద్ధమాయెను. పురుషార్థమును సార్థకము గావించుకొను టకై సుగ్రీవుడు దేహమున బలమున్నంతవరకూ పోరాడెను.

బలము క్షీణించి, అలసిపోయేస్థితికి వచ్చిన తక్షణమే రామాఅని ఒక్కతూరి కేకవేసెను. రాముడు భక్తసంరక్షణదీక్ష గలవాడగుటచే బాణమును ప్రయోగించెను. వాలి దురభిమానుడుకనుక వాని హృదయమును ఛేదించెను. ఆదెబ్బతో వాలి గిరగిర తిరిగి నేలబడెను. అంత రాముడు వాలినిసమీపించి తన దివ్యదర్శనమునందించెను.

పడినవాలి మహాబలశాలి, ధైర్యశాలి అగుటచేత, లేచికూర్చొని చేతులు జోడించుకొని, ఆ శ్యామల శరీరుని, ఆ రాజీవలోచనుని కండ్లార చూచుచూ, ఆనంద బాష్పములు విడుచుచూ భరించలేక, "ఓరామా! ఇంతటి దివ్యమంగళ విగ్రహుండవై సాక్షాత్ పరమేశ్వరుడవై ఇంత విషమకార్యము నేలచేసితివి? నాతోచెప్పి నన్ను వధించియుండిన నేనెంత సంతసించి యుండెడివాడను. సుగ్రీవుడు చేయునట్టి హిత మును నేను చేయలేకపోదునా? కాదుకాదు, ఇందులో యేదియో కారణము లేక పోలేదు.

కారణములేని కార్యము భగవంతుడు చేయడు. బాహ్యదృష్టితో చూచినంత వరకూ మన భావములకు విరుద్ధముగా కనుపించును, అంతర్‌దృష్టితో చూచినపుడే, అది సత్యరూపమును ధరించును. పరమాత్మయొక్క చర్యలు లోకదృష్టితో చూడ కూడదు; అతడు గుణాతీతుడు, కనుక గుణాతీతమైన దృష్టితోనే చూడవలసివుండును.

గుణాతీతుని కార్యములు గుణదృష్టితో చూచిన విరుద్ధముకాక మరేమగును. అని మహా మేధావియైన వాలి చక్కగా విచారించి, రామునితో "ఓ నాధా! నీశక్తి సామర్థ్యములు నేనెరుగుదును. ఒకబాణముతో ఒకవాలినేకాదు, విశ్వమునే హత మార్చగలవు! విశ్వమునే సృష్టించగలవు! కానీ నన్ను మీరు వధించుటలో నేను చేసిన పాపమేమియో తెలిసికొనగోరుచున్నాను. నా అపరాధమెట్టిదో గుర్తించగోరు చున్నాను. ధర్మసంస్థాపన మొనరించుటకై నీవు లోకమున నరాకారమును ధరించి తివి కదా? వేటకానివలే చెట్టుచాటునదాగి నన్ను కొట్టుటలోవున్న అంతరార్థమేమో తెలిపిన నేను కృతార్థుడనయ్యెద"నని ప్రార్థించెను.

అంత రాముడు, వాలిచెంత కూర్చొని, "వాలీ! నాచర్యలు స్వార్థరహిత మయినవని నీకుతెలుసు. కేవలము సీతాన్వేషణ నిమిత్తమై సుగ్రీవుని స్నేహము గావించితినను దురభిప్రాయమును వీడుము. నీవే తెలిపితివికదా ధర్మసంస్థాపన నిమిత్తమై వచ్చిన నరాకారుడని, నీవుచేయు అధర్మ, అక్రమ, అన్యాయములను చూచుచూ వుండుట అపకారమందువా ఉపకారమందువా, ధర్మమందువా, అధర్మ

మందువా; తమ్మునిభార్య, చెల్లెలు, కోడలు, కొమార్తె సమానులు. వారలను పాప దృష్టితో చూచినవాడు మహాపాపి.

అట్టి పాపాత్ముని సంహరించుటలో యెట్టి పాపమూలేదు. నీవు సత్యమును గుర్తించక, సుగ్రీవుడు విన్ను చంపగోరి గుహకు గుండును వేసెనని తలంచి అతనిపై వైరముపూనుట, యెంతటి అన్యాయము? నీవు పదిదినములని చెప్పిననూ తాను ఒకనెల నీకొరకై కాచి నీఆజ్ఞమీరక, కడకు నీరక్తపు వాసనను గమనించి అన్నను రాక్షసుడు హతమార్చెనని విచారించుచూ, విధిలేక ఆ రాక్షసునితో పోరాటము నీకే చేతకానిపక్షమున, ఇక నాచేత యేమగునని, సుగ్రీవుడు తలంచి ఆ రాక్షసుడు వెనుకకు రాకుండుటకై ద్వారమునకు గుండును నూకి వచ్చెను; పురప్రజలు నిర్బంధముగా ప్రభువుకావాలని పట్టుపట్టి అతనిని యెన్నుకొనిరి.

ఇందులో సుగ్రీవుని తప్పేమున్నదో యోచించలేకపోతివి. ప్రేమతో ఆజ్ఞను జవదాటక సత్యమార్గమును అవలంబించిన తమ్మునిపై నిష్కారణముగా, దురభిమానుడవై అతనిని పగపట్టి అడవిపాలుచేస్తివి, ఇది తప్పందువా లేదా? పోనీ అతనిని పంపునపుడు అతనిభార్యను అతనితో పంపిఉండవలెను. కుమార్తెవంటి తమ్మునిభార్యను నీభార్యగా యెన్నుకొనుట పాపమందువా లేదా? ఇంతకంటే పాపము మరొకటి కలదా?

అందులో ప్రభువైన నీవు, పరిపాలకుడవైన నీవు, ఈవిధమైన పాపాలకు గురియయిన, ఇతరులను శిక్షించు అధికారము నీకెక్కడిది. యథారాజా తథాప్రజా, అన్నట్లు పాలకులెట్టివారో ప్రజలట్టివారుగా వుందురు. ఈపని పాలకుడగు నీకు మరింత పాపపు పనికదా?" అని ప్రీతితో తనతప్పులను తనకు అద్దములో చూపించినట్లు వ్యక్తపరచెను.

ఈప్రకారము రాముడు పలికిన పలుకులను చక్కగావిని ఆలోచించి, తన దోషమును తాను గుర్తించి, "ఓ నాథా! మీయెడల నా చమత్కారము వ్యర్థమయ్యెను. నా విన్నపము వినుము. నేను పాపాత్ముడనుకాదు. నేను పాపాత్ముడనే అయివుండిన, అంత్యకాలమున సాక్షాత్ పరమాత్మ చేతులారా దెబ్బతిని, పరమాత్ముని చూచుచూ అతని దివ్యవాక్యముల శ్రవణము చేయుచు, ప్రాణములు వీడుట పాపాత్ములకు సంభవించునా? ఇట్టి భాగ్యమును పాపాత్ములకు పరమాత్మ అనుగ్రహించునా? అని వాలి ప్రేమోత్సాహములతో భక్తి ప్రపత్తులతో జ్ఞానివలే పలికిన పలుకులు రామునినెంతో ప్రసన్నుని గావించెను.

అంత రాముడు వాలియొక్క నిజవైరాగ్యమును లోకమునకు తెలుపగోరి,

ఓ వాలీ! నీ ప్రాణముల నిచ్చెదను. నీకు జరామరణములులేక చేతును. కాయమును నిలబెట్టుకొనుము, అని తన హస్తమును వాలి శిరస్సుపై పెట్టి ఆశీర్వదించుచుండ వాలి, "ఓ కృపాసముద్రుడా! నా విన్నపమాలకింపుము. ఆజన్మాంతము అనేక యత్నములు చేసినను ప్రాణప్రయాణ సమయము రాకతప్పదు. అట్టి సమయమున మునీశ్వరులకు సహితము నీ నామము వారి ముఖమునుండి వెలువడదు. అట్టి నీ అనుగ్రహముచే, నా పుణ్యఫలముచే, మీనామము, మీరూపము, మీసంభాషణము, మీస్పర్శ ఇన్ని ఈ అంత్య సమయమున నాకు అనాయాచితముగా లభించినవి. వీటిని నేను దుర్వినియోగము గావించుకొన్న ఇక నేను యెంతకాలము బ్రతికి యేమి ప్రయోజనము. కావున ఈ కాయమును నిలబెట్టుకొనుటలో, యెట్టి ఘనకార్యమును సాధించలేను.

ఓ నాథా! వేదములుసహితము న-ఇతి, న-ఇతి, అని పలుకుచుండ, నాఅదృష్ట వశమున ఇది కాదు ఇదికాదుఅని త్రోచి కడపటికి ఇది, ఇది అను చివరి నిష్కర్ష స్థానమేదియో అదే నా హస్తమునకు చిక్క నేను దీనిని వదలుకుందునా ? కల్ప వృక్షమును వీడి, కానుగ చెట్టును కోరునట్టి మూర్ఖుడుండునా ? వాలి బ్రహ్మ మానస పుత్రుడని, మహా బలశాలి, జ్ఞాని అని పేరుగాంచిన ఈ ప్రాణము, తుచ్ఛకాయ ములపై భ్రాంతిని అభివృద్ధి గాంచుకొనను, అపకీర్తికి గురి చేసుకొన్నవాడనగు దును. అంతేటికి ఆత్మ తృప్తిలేక చేసుకొన్న అన్యతృప్తులు-అల్ప తృప్తులేకదా ?

నాథా! నా వాక్యములలో నీ దర్శనముతో భేదదృష్టి పోయెను. అనన్యదృష్టి ప్రాప్తించెను. నా పాపఫలములు నశించెను. ఈ కాయమున చేసిన పాపములు ఈ కాయముతోడనే పోనిమ్ము. మరొకకాయమును రానివ్వకుము అని ప్రార్థించుచు, కొమారుని పిలిపించి వీడు ఇంతకాలము ఈ కాయమునకు కామపుత్రుడుగా పెరిగెను. వీడు మహాబలవంతుడు, గుణవంతుడు, వినయ విధేయతలలో మహా గుణశీలుడు. ఇట్టివానిని నేటినుండి నీ ప్రేమపుత్రునిగా చూచుకొమ్ము.

వీనిని నీ హస్తములందుంచితిని" అని కొమారుని చేయిపట్టుకొని రాముని చేతికి అందించెను. రాముడు అంగదుని ప్రక్కన చేరి అతని ఆదరించి ఆశీర్వదించి చెంతకు చేర్చుకొనెను. ఆ దృశ్యమును చూచుచూ వాలి ఆనందబాష్పములు విడు చుచూ కన్నుమూసెను. కంఠమునుండి పుష్పము జారి క్రిందపడినను గజమునకు లక్ష్యముండదుకదా ? అటులనే వాలి అలక్ష్యముగా యోచన చేయక తనప్రాణములు వీడెను

పంపా పురవాసులు, వాలి మరణవార్త విని మహా దుఃఖముతో విలపించుచూ

గుంపులు గుంపులు చేరిరి. వాలి భార్య అయిన తార, పరివారముతో వచ్చి వాలి కళేబరముపై బడి స్పృహతప్పి పడెను. ఆమె వియోగబాధను భరించలేక విలపించు చున్న విలాపము రాళ్ళను సహితము కరిగించునట్టిదై యుండెను. శిరోజములు పీడి పోయెను మధ్య మధ్య స్మారకమువచ్చి లేచి ఆ మోమును చూచుచూ, ఓ నాథా! యెన్నియో విధముల నేను హితమును బోధించిననూ వినకపోతివిగదా. పతికి యే సతియైననూ హితమును లక్ష్యమందుంచుకొనే బోధించునుకదా. సతికంటే పతికి హితమైనవారు మరొకరుండరుకదా! యే మహనీయులైననూ కొంత స్వార్థము నైననూ లక్ష్యమందుంచుకొని హితము చేయుదురు. సతిఅట్లు కాదుకదా, పతి క్షేమమునే లక్ష్యమందుంచుకొని చేయును కదా!

"అయ్యో నాథా! విధికృతమువలన నా బోధనలు నీ మనస్సుకు పట్టలేదు, నాథా! ఈ కొమారుని నే నెట్లు కాపాడుకొందును, "నిన్ను హతమార్చినవారు ఈ కొమారుని మాత్రము విడతురా?" ఇక మాకు త్రోవ చూపువా రెవరు? నాథా! మమ్ముల విడనాడి పరలోకమునకు పోవుటకు మనసెటులొప్పెను? ఇక నేను ఎవరి కొరకు జీవించవలెను అని అంటూ ఓ రామచంద్రా, ప్రాణసమానమైన నా పతిని పరలోకమునకు పంపి, మమ్ములను పరుల పంచలపడి జీవించమని అందువా? ఇది నీ బోటి గుణశాలికి, ధర్మమూర్తికి తగునా; నీవునూ మేలు కోరుదువేని, మా దుఃఖమును తీర్చ తలంతువేని, నన్ను నా కొమారుని అతనితోపాటు పంపుము. బలవంతుని సంహరించిన నీ బాణము అబలను చంపలేకపోదు," అని రాముని పాదములపై పడెను.

అంత రాముడు, "ఓ తారా! ఎందులకు విలపింతువు? వీరపత్ని అయిన నీకు ఈ విలాపము కీర్తినందించదు. శాంతిని చేకూర్చదు. శరీరము లనిత్యములు. ఇది నికృష్టము. వాలియే ఈ కాయమును తుచ్ఛముగా భావించెను. ఏనాటి కైననూ కాయములు కూలక తప్పదు, రాలక తప్పదు. పరమలక్ష్యము నిమిత్తము కాయము కానీ లక్ష్యమును వీడిన కాయము, బొగ్గుతో సమానము, పోనీ ఆత్మ నిమిత్తమని దుఃఖించుచున్నావా? ఆత్మనిత్యమైనది. దానికెట్టి పరిణామములువుండవు. యెట్టివారికైననూ ఆత్మతత్వము తెలియనంతవరకే కాయముపై భ్రాంతి. దేహ భ్రాంతి అజ్ఞానము, ఆత్మభ్రాంతి జ్ఞానము. మట్టిలో మాణిక్యము లభించినటుల, మాంసపు దేహములో దేహి లభించుచున్నాడు. దేహి నిమిత్తము దేహము కానీ, దేహము నిమిత్తము దేహి రాడు, క్షణభంగురమైన, మలినమైన, దుర్గంధములతో, మలమూత్రాదులతో నిండిన ఈ దేహమును యెట్టివాడైననూ ఒకానొక దినము

పీడక తప్పదు. ఆ కాయముతో సాధించునట్టి కార్యమే మానవత్వమునకు శోభ నందించును. మీ పతి, మహా ఘనకార్యములు చేసెను. పరిపాలనలో తాను అను చరులను, నమ్మినవారలను ప్రాణసమముగా చూచుకొనెను. రాక్షసులను హత మార్చెను. దైవభక్తి మెండు. యెటుతిరిగి తన సోదరునకు అపకారము చేసెను. అదొక్క పాపము తప్ప మరే పాపమును చేయలేదు.

ఆ పాపమునకు తగిన ఫలమే నా చేతులలో ప్రాణములు వీడెను. కనుక, ఆ పాపము కూడా పరిహారమయినది. ఇక నీవు చింతించకూడదు " అని అనేక విధముల తారకు జ్ఞానోదయమగునట్లు బోధించెను. ఇక ఆలస్యము మంచిది కాదు అని తారను వెనుకకు వెళ్ళమని సుగ్రీవునితో వాలికి జరుపవలసిన ఉత్తరక్రియ లను జరిపించెను. అంగదుని ప్రేమగా చూచుచుండవలెనని సుగ్రీవునకు హితము చెప్పెను. అన్ని కార్యములు జరిపించి లక్ష్మణుని నగరమునకు పంపి, సుగ్రీవునికి అధికార స్థానమును అందించెను. అంత, హనుమదాదులు, శ్రీరామఆజ్ఞను శిరసా వహించి నగరమున ప్రవేశించి సుగ్రీవునికి మంత్రులుగా కార్యక్రమములు కొనసాగించిరి.

సుగ్రీవుడు అధికారమును చేపట్టిన తక్షణమే వానరుల నాయకులను పిలి పించి, సీతాన్వేషణకు తగిన యేర్పాట్లు గావించుటకు ఆజ్ఞాపించెను. తగిన అను కూలములు చేయ ప్రారంభించమనెను. పరిపాలన బాధ్యత చేజిక్కెనని సంతోషము లేక, అన్నను చంపుకొంటినే అనుబాధ అతనిని లోలోన చాలా బాధించ మొదలు పెట్టెను. కోపము మహా పాపకార్యములను సహితము చేయించును; ద్వేషమును పెంచి, ప్రేమనే చంపును. ఛీ : కోపద్వేషములు, యెంతటి గతికి తెప్పించెను. మా అన్న రాముని కొనియాడిన వచనములు, నా గుండెను చీల్చుచున్నవి. అన్నలో ఇంతటి భక్తి ప్రపత్తులుండునని కలనైననూ తలుపలేదు. అతని జ్ఞానము అపారము, క్రోధము అంతటి జ్ఞానమును కప్పివైచి, క్రూరత్వమును అభివృద్ధి పరచి దివ్యత్వమును చంపుచున్నది. కామక్రోధములే జీవితాన్ని కడగండ్ల పాల్జే యును, అను విచారించుచూ పరిపాలనా విధానమును లక్ష్మణునిద్వారా అన్నియూ తెలుసుకొని శ్రీవారిని సుగ్రీవుడు నగరమున ప్రవేశించమని పలువిధముల ప్రార్థించి ననూ, రామచంద్రుడు పితృవాక్య పరిపాలనా నిమిత్తము పదునాలుగు సంవత్సర ములు నగరమును ప్రవేశించనని గట్టిగా తెలిపెను. సుగ్రీవుడు నాయకులతో సమా వేశముజరిపి ఇది వర్షఋతువనియూ, వర్షములు అధికముగా నుండుననియూ, వానరులు చలికివానకు తాళరనియూ, గ్రీష్మఋతువు వచ్చిన వెంటనే తీవ్రమైన

అన్వేషణ కొనసాగింతుమని నాయకులు తెలిపిన విషయములను రామలక్ష్మణులకు మనవి చేసుకొనెను. అంత రాముడు ఉన్న సత్యమును గుర్తించి అట్లే కానిమ్మని రామలక్ష్మణులు ఋష్యమూక పర్వతముపై నివసించుచుండిరి.

చేయునది లేక కుండపోతగా కురియు వర్షములవత్తిడిచేత రామలక్ష్మణులకు సకాలమున ఫలము, దుంపలు సహితము కరువయ్యెను. వెలుపల వచ్చుటకే లేకపోయెను. సూర్యకాంతి అపురూపము. ఈ స్థితిని చూచుచూ మధ్య మధ్య లక్ష్మణునకు ఉపదేశములు చేయుచుండెను. రాముడు, "లక్ష్మణా ! కుపుత్రుడు పుట్టినందున కులధర్మము నశించును. ప్రచండవాయువు వీచినందున కుసుమములు చెదరును. దుర్జన సాంగత్యమువలన జ్ఞానము నశించును. సజ్జన సాంగత్యమువలన జ్ఞానము వికసించును. అటులనే మేఘములచే నొకప్పుడు సూర్యుడు కప్పబడును. మరియొకపుడు మేఘములు వీడినందున సూర్యుడుప్రకాశించును" అనిఇట్లు అన్నియూ జ్ఞానసంబంధమైన వాక్యములలో కాలమును గడిపిరి.

గ్రీష్మఋతువు గడచెను. వర్షములు నిలిచెను. శరదృతువు ప్రారంభించెను. పృథ్వీయంతయూ పచ్చని గడ్డితో శోభించెను. వర్షాకాలమునకు వృద్ధాప్యము వచ్చినటుల గడ్డిపువ్వులు పుట్టెను. సంతోషముచే లోభము క్షీణించినటుల అగస్త్యోదయమున జలము శోషించెను. కామ మోహాదులు క్షీణించినందున మనస్సు నిర్మలమగు విధమున నదీ సరోవరజలములు నిర్మలమయ్యెను, "లక్ష్మణా, ఒకపరి సుగ్రీవుని హెచ్చరించుట మంచిది" అని రాముడు ఆజ్ఞ చేసెను.

లక్ష్మణుడు ఆమాట విని, నిత్యము వచ్చిపోవు హనుమంతునికి ఈ విషయము సుగ్రీవునితో తెలుపమని హెచ్చరించెను. హనుమంతుడు రామకార్యములో చాలా జాగ్రత్తగా యుండుటచేత సుగ్రీవుని చాలా తీవ్రముగా హెచ్చరించెను. వానర నాయకులను పిలిపించి తగిన యేర్పాట్లు గావించెను. అంగదుడు, హనుమంతుడు, వానరులతో వెళ్ళుటకు అంగీకరించిరి. అందరికి సుగ్రీవుడు తగిన బలమును ధైర్యమును అందించి, శ్రీవారి కార్యమును సాధించవలెనని ఉత్సాహముతో, వారిని నలుదిశలా పంపెను వానరుల బాధ్యతంతయూ హనుమంతునకే అప్పచెప్పెను. హనుమంతుడు అందరూ ఒకపరి సుగ్రీవునకు జై అనియు, శ్రీరామచంద్ర ప్రభువుకు జై అని అనేక విధముల ఉత్సాహమును ప్రకటించుచూ గంతులు వేయుచూ హనుమంతుడు యేర్పరచిన రీతిగా ఒక్కొక గుంపు ఒక్కొక దిశకు బయలుదేరెను.

# సీతాన్వేషణము

హనుమంతుడు తూర్పునకు తన పరివారమును తీసుకొని పోయెను. సుకషేనుడు, మైందవుడు తమ పరివారములతో వెళ్ళిరి. వీరు గంధమాదనము, సుమేరు పర్వతము, అర్జున పర్వతము, నీలగిరి పర్వతములను వానిలోని గుహలను పరిశోధించిరి. వెతుకుతూ వెతుకుతూ ఉత్తర సముద్రతీరమును జేరిరి. ఈ విధముగ వానరులు, నిద్రాహారములుమాని రామకార్యనిమిత్తమై తమ ప్రాణములైననూ అర్పితము గావింతుమని చిన్నవాని మొదలు పెద్దనాయకుని వరకూ, ఒకేదీక్షతో రామ, రామ, రామ అంటూ వనములు, కొండలు, గుహలు, నదులు, పల్లములు, లోయలు, ఒకటేమిటి, మానవులు చొరరానటువంటి ప్రదేశములన్నింటినీ గాలించుచూ వచ్చిరి. మార్గమధ్యలో అడ్డువచ్చిన రాక్షసులను హతమార్చుచూ ఒక సరోవరమును చేరిరి. అక్కడ స్వయంప్రభ అను ఒక స్త్రీ తపముచేయుచుండెను. వారు ఆమెకు దూరమునుండి నమస్కరించిరి. అంత ఆమె కన్నులుతెరచి వారలనుచూచి ఓ వానరులారా ! మీరు అలసినటుల కనుపించుచున్నారు. చాలా బడలియుంటిరి అని ఆమె ఫలములనందించి కొంత విశ్రమింపుడని కోరెను. అంత ఆమె ఆజ్ఞ ప్రకారము ఫలములుభుజించిరి. ఆమె చెంతకూర్చొనిరి. ఆమె స్వవృత్తాంతము వారితో చెప్పనారంభించెను. ఓ వానరులారా, రాముడు నివసించు స్థానమునకు నే పోతున్నాను. నా పేరు స్వయంప్రభ. నేనొక గంధర్వుని కూతురను; హేమ అను అప్సరస నాసఖి; నేను తపము నాచరించుచుండ బ్రహ్మ నాకు ప్రత్యక్షమై నాకు కావలసిన వరమును కోరుకొమ్మనెను. అంత నేను భగవంతుడు మానవాకారుడై మానవమాత్రునివలేసంచరించుట దర్శించవలెననికోరుకొంటిని. అంత నీవీ స్థానమున తపమాచరించుము, ఈ ప్రదేశమునకు మహాబలవంతులగు వానరులు రాగలరు వారివలన మానవాకారమును ధరించిన రాముని వృత్తాంతమును వినగలవు.

తదుపరి రాముని దర్శించగలవు, అని వరమిచ్చెను. ఆహా ! ఆ వరము

యొక్క ప్రథమ, ద్వితీయ చిహ్నములు నేడు పూర్తిఅయినవి. మొదటిది మహా వీర వానరులు నాచెంతకు వచ్చుట, రామ నివాసస్థానమును రామకథా విధానమును తెలుపుట రెండవది. ఇక రామదర్శనము మాత్రమే కొదువ. అది కూడనూ అయి నటులనే తృప్తి చెందుచున్నాను, అని ఆనందబాష్పములు విడుచుచూ ఆ స్త్రీ తన సంతోషమునకు హద్దులులేని ఆనందమును భరించుచుండ, వానరులుకూడా అమి తానందపడిరి. అంతలో ఆ స్త్రీ కన్నులు మూసుకొని యొకపరి యోచించి, వానరు లారా! ఒక సముద్రతీరమున దివ్య పట్టణములో సుందరమైన వనమున సీత ఏకాంతముగ విలపించుచున్నది. తప్పక మీరు చూతురు, విచారించకుడు అని ఆశీర్వదించెను.

అంత వానరులు గంతులువేసి, "ఆహా! మనకు సుగ్రీవుడిచ్చిన వ్యవధి రెండు దినములలో గడచిపోవును; కానీ, సీతను చూడ లేకపోతిమి, అని అంగ దాది వానరులు విచారించిరి, కన్నీరుకార్చిరి. సముద్రతీరమునుచేరి, దానిని దాటు టకు యెవ్వరికీ చేతకాక ఇసుక దిన్నెలపై గుంపులు గుంపులుగా కూర్చొని విచా రించుచుండిరి. అంగదుని దుఃఖమును చూచి, జాంబవంతుడు పలువిధములుగా వుపదే శించెను. "మన ప్రయత్నములో యెట్టి లోటునూ లేదు; శక్తి లోపము లేక, అన్న పానాదులు సహితము ఆశించక, క్షణమైనను వృధాపరచక, సీతను వెతుకుచునే యున్నాము. మన ప్రభువు సుగ్రీవుడు మన ప్రయత్నములను చూడకున్ననూ, శ్రీరాముడు చూచుచునే యున్నాడు; కనుక, రాముడట్టి శిక్షను మనకు అందించరు. భయపడనక్కరలేదు. అతనికార్యము కనుక, అతని నామమును స్మరించుచూ, మన ప్రయత్నము మనము చేతము," అని కొంత ఓదార్పుమాటలు పలికెను.

ఇంతలో సహోదరునకు తిలోదకములనిచ్చు నిమిత్తము ఒకపెద్ద వృద్ధపక్షి అక్కడికి వచ్చెను. అంత వానరులు దాని చుట్టూ చేరి, వీడు రాక్షసుడా, యెవడని విచారించుటకు ప్రారంభించిరి. అంత ఆ పక్షి, "వానరులారా! నా పేరు సంపాతి, నేనును జటాయువును సోదరులము. చిన్నతనములో మేము పందెము వేసుకొని, సూర్యుని సమీపించుటకు మీదికెగసితిమి. సూర్యవేడిమిని సహించలేక నా తమ్ముడు తిరిగి వచ్చెను నేను దురభిమానముచేత పట్టినపట్టును విడువక మీదికెగురుచుంటిని. ఈ విధముగ అనేకపర్యాయములు చేయుటచేత నా రెక్కలు కాలి విరిగి పోయెను. అంతరిక్షమునుండి దబ్బున క్రిందపడితిని.

ఆ దారిని చంద్రముడను ముని వెళ్ళుతూ, నా దురవస్థను చూచి జాలి పడెను. అనేకవిధములు నతడు నాకు జ్ఞానోపదేశము చేసెను. అతని ఉపదేశముచే

నాకు దురభిమానము నశించెను. "ఓ పక్షిరాజా ! నా మాట వినుము : త్రేతాయుగ ములో శ్రీమన్నారాయణుడు నరాకారుడై అవతరించును; అతని భార్యను రావణుడు అపహరించును; అతని భార్యను వెతకుటకు వానరసైన్యము వచ్చును. ఆ దూత లైన వానరులను చూచి, నీవు పవిత్రుడవగుదువు, అప్పుడు నీ రెక్కలు నీకు యథారీతిగా వచ్చును, అనియూ అపుడు సీత వృత్తాంతము వానరులకు తెలుపు" అనియూ ముని ఆదేశించెను ఈనాడు నా అదృష్టమువలంది, నా సోదరుడయిన జటా యువునకు తర్పణములచేయ ఇటకరుదెంచితిని. మీరు నాకు మునీంద్ర వచనములను స్మరణకుతెప్పించితిరి. స్మరణకేమిటి, వారి వచనములు నెరవేరెను.

అంత వానరులు, ఆతురతతో సంపాతీ ! నీ చరిత్ర నటుంచి మాకు గడువు సమీపించుచున్నది. కనుక సీతజాడను, సీత చరిత్రమును తెలుపు" మని ప్రార్థిం చిరి. ఓ వానరులారా ! వినుడు ! ఒకనాడు నాకు అమితమైన ఆకలివేయుచుండ, నా కొమారుడైన సుపర్షుని పిలచి, నాయనా, త్వరలోవెళ్ళి యేదైన ఆహారమును తెమ్ము. నాకు వృద్ధాప్యము. పైగా రెక్కలు లేవు కాన నేను తాళజాలనని బ్రతిమి లాడగ, కొమారుడు అడవికి వెళ్ళెను. యెంతకాలము చూచిననూ కొమారుడు రాక పోయెను. నా విచారము అధికమాయెను, ఆకలి మాడ్చివేసెను.

కడకు కుమారుడు మృగమాంసమును తీసుకొని అలసివచ్చెను. ఆకలిచేతను, అజ్ఞానముచేతను ధరించలేక ఆలస్యముగావచ్చెనే అను నిరాశచే కోపమును పట్ట లేక కొమారుని శపించుటకు పూనుకొంటిని. అంత సుపర్షుడు నారెండు కాళ్ళను పట్టుకొని, నాన్నా ! నేను కాలమును ఒకక్షణమైననూ వృధా పరచలేదు. నా విన్నప మాలకింపుము. నన్ను క్షమింపుము అని మాంసమును పెట్టెను.

అది తిని కొంత ఊపటకలిగిన తరువాత, ఆలస్యమునకు కారణమడిగితిని. అపుడు, తండ్రీ నేను వనమునకు వెళ్లినపుడు యిరువది భుజములును, పది శిరస్సు లును గల పురుషుడొకడు మార్గమున బోవుచుండెను, అతని చెంత చక్కని స్త్రీ కలదు. ఆమె సౌందర్యము వర్ణనాతీతము, ఆమె రోదన వినలేకపోతిని. అంత వాడొక జంతువని భావించి మొదట వానినిపట్టితిని, తదుపరి లోనవున్న ఈ సుందర స్త్రీని చూచితిని. ఆమె రామా, రామా, రామా అనుపదమును తప్ప అన్యవచనము ఆమె నోటినుంటి రాలేదు. ఈ విధమైన పోరాటముచేత కాలము విలంబమయ్యెను," అని తెలిపెను.

ఈ మాటలు వినగనే, "అయ్యో ! నాకు రెక్కలు లేకపోయె కదా ? వృద్ధా ప్యమువేరే ప్రాప్తమయ్యె కదా" అని నాలో నేను దుఃఖించి నిజముగా వాడెవడో

రాక్షసుడు అని తలంచి, "నాయనా ! ఆ దశకంఠుడు యేదిశకు పోయెను ?" అని ప్రశ్నించ, దక్షిణదిశకు పోయెనని చెప్పెను. "అయ్యా ! వారు ముని చెప్పినటుల రావణుడే ! ఆ స్త్రీ సీతామాతయే ! ఇందులో యేమాత్రము సందియములేదు. అపహరించి కుక్కవలె, నక్కవలె దొంగగా గొనిపోయెను," అని పండ్లు కొరికితిని.

"అంతకంటే నేనేమి చేయగలను" అని జరిగినదానిని తెలిపెను సంపాతి. "మునీశ్వరుని వచనములనుపట్టి ఆమెను వెతకుటకు వానరులువత్తురు అని నిమిష నిమిషమును లెక్కించుచుంటిని. ఈనాటికి నాజన్మ ధన్యమయ్యేను. మిమ్ములను దర్శించగలిగితిని," అని ఆనందముతో ఉన్మత్తుడాయెను. "ఓ వానరులారా ! సముద్రతీరమున త్రికూట పర్వతముపై లంకానగరము కలదు. ఆ నగరములో అశోకవనమను సుందరమైన ఉద్యానవనము యున్నది. అందులో సీత దుఃఖించుచూ వుండును. మీ రాకకై యెదురు చూచుచున్నది. కనుక మీరు దక్షిణ దిశకు వెళ్ళుడు," అని చెప్పెను. ఆమె అశోకవనమున చెట్టు క్రింద దుఃఖించుచున్నది. మీకెట్లు తెలిసెనని అంగదుడు ప్రశ్నించగా, "నాయనా, ఆ గృధ్రముల దృష్టి 400 యోజనముల దూరమువరకు ప్రసరించును. నాకు వృద్ధాప్యములేకున్న మీకు నేనెంతో సహాయమును చేసియుండెడివాడను. వానరులారా,నూరు యోజనములు దాటగల బలవంతుడు, బుద్ధిమంతుడు రామకార్యమును సాధింపగలడు. మీ గుంపులో అట్టివాడుండినయెడల మీ కార్యము సిద్ధించును." అని అనుచుండ సంపాతి రెక్కలు కొంత యెగురునట్టి రీతిగా కదిలిక చిన్నెలు కనుపించెను. సంపాతి పరమాశ్చర్యముతో కొంత రెక్కలను కదిలింప గలిగెను. కొంత యెగుర గల్గెను.

మునివాక్యములు సత్యరూపమును ధరించెను. "వానర వీరులారా ! మీరు రామకార్యమున కెంతయో ఉత్సాహముగ నిద్రాహారములు మాని, ఏకైక భక్తి శ్రద్ధలతో జీవితమును ధారపోయుచున్నారు. అట్టి మీకు రాముడే సర్వశక్తులను అందించి తన కార్యమును చేయించుకొనును. అతనిని మనసార తనివితీరా చింతించడమే మీరు చేయవలసిన ప్రధానకార్యము. తప్పక సముద్రమును దాటగలరు. సీతను చూడగలరు, రామ మనసునకు తృప్తి గావించగలరు. భగవత్ తృప్తి మీ జన్మమును సార్థకము గావించును. దైవమునే తృప్తి గావించునట్టి జన్మమే జన్మము; వాని జీవితమే లెక్కలోనికి వచ్చునది. మిగిలిన జన్మములు తిండికి చేటు, భూమికి బరువైనవే తప్ప వేరు ఫలముండదు, అని చెప్పుచూ పైకి యెగిరెను.

చూచుచున్న వానరులు అతని శక్తికి సంతసించి ఆశ్చర్యపడిరి. "మూకం కరోతి వాచాలం పంగుం లంఘు యతే గిరిం"అన్నట్లు రామనామము యెట్టికార్యము

నైనమూ చేయించును. రెక్కలు లేని సంపాతి ఆకాశమున యెగురుటకు రామనామమే కారణమన్నది సంపాతి వచనముల ద్వారా వానరులు చూడగలిగిరి. దీనిని ఆధారము చేసుకొని, వానరులు వారి వారి బలములను పరీక్షించుకొనిరి.

కడకు జాంబవంతుడు వానరులతో "మిత్రులారా! నాకు వృద్ధాప్యము వచ్చినది. పూర్వపు బలము క్షీణించినది. యేదో రామకార్యమను సంతోషముతో రామానుగ్రహముతో ఇంత మాత్రమైననూ వుండగలిగితి, తిరుగాడ గల్గుచున్నాను. పరమేశ్వర త్రివిక్రమావతార సమయమున నేను పూర్ణ వయస్సులో నుంటిని, అని అనుచుండ, వానరులందరూ యువరాజైన అంగదుని చుట్టూ గూడి, ఇట్లు పలికిరి, "ఓ రాజా! ఉపాయము నాలోచింపుడు, మనలో సముద్రమును దాటగల బలవంతుడెవరో, తమరే నిర్ణయించుడు, తమ ఆజ్ఞ శిరసావహించి ముందు ప్రయత్నములు చేతుము, అని పలికిన తోడనే, అంగదుడు సమావేశ పరచి, యెవరెవరి శక్తి యెంతటిదో తెలుసుకొన గోరెను.

వికటుడు లేచి, రాజా! నేను ముప్పది యోజనములను దాటగలను అని చెప్పెను. నీలుడు, "రా ! నేను నలువది యోజనములు దాటుదునే కాని తరువాత ఒక అంగుళమైన ముందుకు పోలేను." అని తన శక్తిని తాను నిరూపించెను. దుర్ధరుడు లేచి రాజా! నేను ఏబది యోజనములు సునాయాసముగా దాటుదును," అని తెలిపెను. అంతలో చేతులు చాచి, విఱ్ఱవీగి, "నేను అరువది యోజనములు దాటుదునని" నలుడు పలికెను.

ఈ రీతిగ ముచ్చటించుచుండ, అంగదుడు "ఓ వానరులారా! నేను సముద్రమును దాట గలుగుదు కానీ, తిరిగి రాగలనో లేదో అను సందేహము; వట్టి దాటుట మాత్రమే కాదు అచ్చట రాక్షసులతో పోరాడవలెను కదా? ఆ పోరాటములో నా బలము అణగిపోవును. రాకపోకలకు, పోరాడుటకు తగినంత బలము లేదు," అని తాను నిరుత్సాహ పడిన తక్షణమే, నాయకులైన వానరులు లేచి, "ఓ రాజా! మీరు యువరాజు! మీకు సామర్థ్యము వుండిననూ, లేకపోయినను, విచారాంశము కాదు. మీరు స్వయముగా వెళ్ళుట ఉచితము కాదు. రాజధర్మములకు విరుద్ధము ఆ పనిని నీ సేవకులు చేయగలరు. ఇన్ని కోట్ల మంది తమ సేవకులుండ తమను ప్రవేశ పెట్టుట మాకు నీతి కాదు కనుక తామీ కార్యవిషయమున మరొకరిని నియమించు"మని జాంబవంతుడు మున్నగువారు ప్రార్థించెను.

అంత అంగదుడు అటూ ఇటూ చూచి, ఓయీ వాయుపుత్రా, నీవు శ్రీరామ బంటువి; మహాభక్తుడవు. ప్రథమ పరిచయమును గావించు కొన్నవాడవు. నీ శక్తి

యు క్తి భ క్తుల చేతనే సుగ్రీవుడైన రాజునకు మైత్రి గావించితివి. అట్టి నీవు రామ కార్యములో మౌనముగా వుండుటలోని అంతరార్థమేమిటో మాకర్థమగుటలేదు," అని అనేక విధముల వాయుపుత్రుని వర్ణించెను. "నీవు సాధింపలేని కార్యముయేదీ ఒకటి వుండదు, బుద్ధిమంతుడవు; బలవంతుడవు; గుణవంతుడవు; హనుమంతుడవు. నీ శ క్తిని నీవు యోచించుకొమ్ము" అని అంగదుడు కొనియాడెను.

అంగదుని మాటలు అతనికి పూర్వపు శ క్తిని అందించెను. దిగ్గున లేచి, "వానర సోదరులారా! మీరు నా రాక కెదురు చూచుచూ, ఇచ్చటనే నిలిచియుండుడు. మీరు ఇంతకాలము వనములు, అడవులు, పర్వతములూ తిరిగి విశ్రాంతి లేక అలసి యున్నారు. ఇక్కడనే కందమూలాదులు భక్షించుచూ, విశ్రాంతి తీసికొనుడు. నేను ఇప్పుడే సముద్రమును దాటి లంకలో ప్రవేశించి సీతను చూచి వచ్చెదను. రామ కార్యము కంటే నాకు కావలసినది మరొక్కటిలేదు. అతని అనుగ్రహమునకు పాత్రుడనగుట కంటే జన్మకు అన్యసార్ధకత యేమున్నది?" అని అందరికి నమస్కరించి అంగదుని అనుమతిని పొంది, "జై రామ!" అని, వానరులు జయ జయ ధ్వనులు సలుపుచుండ, మనసున రామచంద్రుని ఒక పరి స్మరించి, సముద్రమును దాటుటకు కుప్పించి యెగసెను.

హనుమంతుడు కుప్పించి లంఘించిన వేగమునకోర్వలేక పర్వతముపై నున్న వృక్షములు విరిగి అవి కూడను అంతరిక్షమున కెగసెను. అతను యెగిరిన వేగము నకు తాను నిలిచిన పర్వతము కూడ అడుగునకు దిగిపోయెను. అంతపైన వెళ్ళు తున్న హనుమంతుని చూచి సముద్రము తనలో తానిట్లు భావించెను. ఈ హను మంతుడు రామదూత, రామకార్యార్థమై బయలుదేరెను! ఆహా! యిత డెంతటి అదృష్ట వంతుడో కదా? రామకార్యమును జయము గావించునంతటి భ క్తి శ క్తులు గలిగిన ఈ హనుమంతుడు రామసేవకులలో ప్రధానుడను సార్థక నామమును అందుకో గలడని," ఆనందించెను.

సముద్రమున దాగిన మైనాకమను పర్వతము ఆవేగముగ వెళ్ళుచున్న హను మంతుని చూచి నీటినుండి పైకి లేచి హనుమంతుని రామకార్యములో తాను కూడా సేవాభాగ్యమును అనుభవించవలెనని భావించి, "వాయుపుత్రా! ఇంత దూరము ఒకే వేగమున వెళ్ళుట శ్రమ కావచ్చును. కాన, నా తలపై కొంత విశ్రమించుము. నాకు మీ రామసేవలో కొంత భాగమును కలిగించుము" అని ప్రార్థించెను. హనుమంతుడు మైనాకముయొక్క ప్రార్థనను మన్నించి, దానిని చేతితో స్పృశించి, అతనికి నమ స్కరించి, "ఓ మైనాకమా! రామకార్యార్థమై నేను వెళ్ళుచున్నాను; ఆ కార్యము

పూర్తి అగువరకూ ఆహార నిద్రలు నాకవసరములేదు. విశ్రాంతి యుచితముకాదు" అని రామనామమును స్మరించుచూ కాలహరణము చేయనని నేరుగా లంకకు తన వేగమును కొనసాగించెను.

మార్గమధ్యమున సురస అను నాగమాత, సింహిక అనే రాక్షసి అనేకవిధ ముల ఆటంకములు పెట్టిననూ, లెక్కచేయక వారలనుజయించి ఒడ్డుచేరెను. అక్కడ ప్రవేశించి సముద్రతీరముననున్న ఉద్యానవనములు, వినోదభవనములు, హనుమంతుని మైమరపించెను. పరమానందమునందెను. ఆ వనములోని వివిధ పక్షుల గుంపులు రంగులు రంగులుగల వివిధజాతులు హనుమంతుని మనసును భ్రమింప జేసెను. ఆ సమీపముననున్న ఒక సుందరమైన పర్వతమును అవలీలగా యెగిరి కూర్చొనెను. ఇదియంతయూ నా శక్తిసామర్థ్యము లేమాత్రమూకాదు. ఇదంతయూ శ్రీరామ కృపాకటాక్షమేనని తనలో తలంచెను.

వింతవింతైన భవనములు, పొడవైన రాజభటులు, ఉద్యానవనములు స్వర్గమునే మరిపింపజేసెను. ఒకక్షణము ఇది వైకుంఠమా, లంకయాఅన్న సందేహము హనుమంతునిలో ప్రవేశించెను. ఎటుచూచినా బలరూపులైన రాక్షస సైన్యము వీధులలో సంచరించుచుండెను. కామరూపుణులయిన రాక్షసస్త్రీలు స్వేచ్ఛావిహారము సలుపుచుండిరి. దేవ, నాగ, గంధర్వ, మనుజకన్యలు వేలకువేలు రావణుని ఆధీనములో పరితపించుచూ, భయముతో వణకుచూ, కాలము గడుపుచుండిరి. ఈవిధమైన సంచలనమునుచూచి, హనుమంతుడు తన నిజరూపమున ప్రవేశించుట మంచిది కాదని లోతలంచి సూక్ష్మరూపమును ధరించి పురములో ప్రవేశించెను.

లంకానగరమును కాపాడుచుండిన రాక్షసి, అనగా లంకలో యెవ్వరినీ క్రొత్త వారిని ప్రవేశించక చూచుకొనుచుండిన రాక్షసి; దానిపేరు లంకిణి. అది వింతైన రూపమును దాల్చిన హనుమంతునిచూచి, "ఓరీ! ఎవరు నీవు? నీవెక్కడినుండి వచ్చితివి, లంకలో ఇట్టి ఆకార మృగములు నేనింతవరకూ చూడలేదు. ఒకవేళ వెలుపలనుండి ప్రవేశించెనా అనుటకు చుట్టూ జలమయమైన సముద్రము, నిన్ను చూడ నీవు సామాన్యునివలె కనుపించుటలేదు. సముద్రము నెట్లు దాటితివి? నన్ను ధిక్కరించి యెటుపోయెదవు? నిలునిలుమని" లంకిణి గర్జించెను. హనుమంతుడు ఆ లంకిణి మాటలను లెఖ్ఖచేయక, విననివానివలె తన తోకను ఈడ్చుకొంటూ ముందుకు నడచుచుండెను. యింతలో లంకిణి మరింత గట్టిగ ఓయి మూర్ఖుడా నా మాటలు వినిపించుటలేదా? అని గర్జించెను.

అప్పటికీ హనుమంతుడు యేమీ లెక్కచేయక తనలోతాను నవ్వుకొనుచూ

ముందుకు నడువసాగెను. లంకిణి ఓర్పునుపోగొట్టుకొని, "హే వానరమా! నాఆజ్ఞను ధిక్కరించి వెళ్ళువాడు నాకు ఆహారముగా కావలసివచ్చును. క్షణములో నిన్ను నమిలివేయగలను, జాగ్రత" అని ఆ సూక్ష్మాకారము ధరించిన హనుమంతుని పట్టుకొనుటకై వెళ్ళెను. అంత హనుమంతుడు మారుమాటాడక ఒక్కతూరి తన పిడికిడితో ఆ లంకిణిని గ్రుద్దెను. ఆగ్రుద్దుతో లంకిణి స్పృహతప్పి నేలమీద కూలెను. లంకిణీ ముఖమునుండి రక్తము తీవ్రముగా కారమొదలిడెను.

కొంతసేపయిన తరువాత లంకిణి స్పృహ తెప్పించుకొని తిరిగీ హనుమంతునిపై పడి అతనిని పట్టుటకై ప్రయత్నించెను. మరి రెండవగ్రుద్దు వీపుపై గ్రుద్దిన తక్షణమే లంకిణి కదలలేకపోయెను ఆ యేటుతో కొంత జ్ఞానముకూడకలిగి, కదంలేని స్థితిలో లేచికూర్చొని, చేతులు జోడించుకొని, "ఓయీ ఆశ్చర్యరూపుడా! పూర్వము రావణునకు బ్రహ్మదేవుడు వరములనిచ్చి నిష్క్రమించు సమయమున నన్ను చూచి ఇట్లనియె.

"ఓ లంకిణీ! యెపుడు నీవు వానరుని గ్రుద్దువలన వ్యాకులము చెందెదవో, నీబలము నిర్వీర్యమగునో, నీశక్తినశించునో, అపుడేరావణునకు మరణకాలమాసన్నమగునని తెలిసికొనుము. ఇంతేకాదు. ఆ వానరుడు భగవత్ కార్యనిమిత్తమై, దైవాజ్ఞను శిరసావహించి లంకలో ప్రవేశించును. అతనిరాక లంకలోని రాక్షసుల హతమార్చుటకే అన్న సత్యమును గుర్తించు. ఆనాటినుండి రాక్షసుల వినాశకాలమాసన్నమయినదని తలంచు," అని బ్రహ్మ నాతో పలికెను.

కనుక ఓ వానరా! నేను యెంతయో పుణ్యాత్మురాలను. నాదృష్టి పవిత్రమాయెను. భగవంతుడు పంపిన దూతను చూడగల్గితిని. అంతేకాక ఆదూత హస్తముచే నేను, నా శరీరము పావనమాయెను. ఆహా ఆగ్రుద్దు ఎంత హాయిగావున్నది, యెంత తీయగవున్నది అని హనుమంతుడు కొట్టిన స్థానమును సారెసారెకూ నిమురుకొంటూ యెంతో ఆనందించుచుండెను.

ఇంతలో లంకిణి మాటలను లెక్కచేయక వర్ణనలకు పొంగక, దూషణలకు క్రుంగక రామ నామమును స్మరించుచూ హనుమంతుడు లంకలో ప్రవేశించెను. కానీ, ఈలంకలో జానకి వృత్తాంతము చెప్పువారెవరు అని హనుమంతుడు తనలో తాను తలంచుచూ, సీతను గుర్తించుటెట్లుఅని సూక్ష్మరూపములో వృక్షములపై వుండి బజార్లలో అటుఇటూ తిరుగు భయంకర రాక్షసులను గుర్తించుచూ వారలకంటబడక యెన్నెన్ని విధములుగనో ప్రవర్తించుచుండెను. ఇంతలో ఒక హరిమందిరము వంటిదానిని ఒకదానిని చూచెను. దానికి ముందూ వెనుకా తులసివనము వేయబడి

వుండెను. ముఖద్వారముపై హరినామము వ్రాయబడివుండెను. ఆ గృహము సాక్షాత్ దైవనిలయముగనే కనుపించెను.

ఏమి ఈవింత? లంకలో ఏమిటి హరినామము! వ్రాయబడుటేమిటి? ఇది యేదో పవిత్రమైన గృహమువలేనున్నది అని యెట్లూ యెవ్వరికీ తెలియనిరీతిగా సూక్ష్మరూపమును ధరించి ఆభవనముపై కూర్చొని లోనికితొంగిచూచెను. అప్పుడే పడకనుండి అటుఇటు పొర్లుతూ ఒకవ్యక్తి హరినామమును స్మరించుచూ లేచెను. ఆమాటలు వినగనే హనుమంతునకు పరమానందమాయెను. లంకలో సహితము హరినామము తలంచువారున్నారని సంతోషము కలిగి కొంత ధైర్యముతో విచ్చల విడిగా సంచరించ మొదలిడెను. ఇతనెవరో సత్పురుషునివలే కనిపించుచున్నాడు.

ఇతనిని ఆశ్రయించిన తల్లి సీతజాడలు తెలియగలవనికూడా తలంచెను. అంతేకాక నేను హరి దాసుడను, ఇతనూ హరిదాసుడు. మా యిరువురికి స్నేహము సులభముగా యేర్పడగలదు. అని పూర్ణ ధైర్యముతో, తన ఆకారమును మార్చు కొని ఒక బ్రాహ్మణ వేషముతో విభీషణుని యింటిలో ప్రవేశించెను. ఆ బ్రాహ్మ ణుని చూచి విభీషణుడు ఈ నూతన బ్రాహ్మణు డెవడో అని కొంత యోచించి యెవరైననేమి బ్రాహ్మణుడుకదా అని అతనికి నమస్కరించెను. అంత హనుమం తుడు సంభాషణ ప్రారంభించెను.

ఇంతలో విభీషణుడు, ఆ బ్రాహ్మణుని, స్వామీ! తమరెవ్వరు? యెక్కడి నుండి యేతెంచితిరి. వీధులలోని రాక్షసులను యేరీతిగా తప్పించుకోగలితిరి అని అనేకవిధముల రాక్షసుల చర్యలను వర్ణించుచూ, హనుమంతుని ధైర్యసాహసము లను వర్ణించుచూవచ్చెను. ఇంతలో హనుమంతుడు "నేనొక హరిదాసుడను, నాపేరు హనుమంతుడు, రామచంద్రుడు పంపగావచ్చిన దాసుడను," అని రాముని గుణగణ ములు వర్ణించెను. ఆమాటలు వింటూవుండినంతసేపు విభీషణుని కంటినుండి ఆనంద ధారలు ప్రవహించెను. నేడెంత సుదినము, నాదెంతభాగ్యము. తెల్లవారగనే ఇట్టి శుభవార్త వినగలిగితిని, అని తనలోతాను వుప్పొంగిపోవుచుండెను.

ఈ దృశ్యమునుచూచి హనుమంతుడు రామానుగ్రహమేనని తలంచి ఈ భయంకరమైన లంకలో ఇట్టి నిర్భయుడైన హరిదాసుడుకూడా ఒకడున్నాడుకదాఅని తలంచి, అయ్యా మీరీలంకలో ఎట్లు జీవించుచున్నారు, బ్రతుకగలిగినవారు అని ఆ విభీషణుని హనుమంతుడు ప్రశ్నించగా, విభీషణుడు అంతాదైవకృప, ఎంతకాలము జీవించాలని తాను సంకల్పించునో అంతకాలము జీవించక తప్పదు. ప్రకృతికి ప్రభు వైన దేవుని నామమును ఎవ్వరూ ధిక్కరించలేరు. మార్చలేరు. దంతములమధ్య

నాలుక జీవించుటలేదా? ఇది ఎవరి సంకల్పము. కాని నా(శితునకై మీరు ఆశ్చర్య పడనక్కరలేదు. మీరేపనిబూని ఇచ్చటకు వస్తిరో విన్నవించుడని విభీషణుడు చేతులు జోడించి ప్రార్థించెను.

ఇట్టి సజ్జన సాంగత్యము ఏదోఒక ఘనకార్యసిద్ధి చేకూర్చును అని అనేక విధముల చక్కని మాటలనాడుచున్న విభీషణునిచూచి, హనుమంతుడు తనలోతాను పొంగిపోవుచూ క్షణక్షణమునకూ, రామా, రామాఅని పలుకజొచ్చెను. ఇట్టి మిత్రుని చెంత నేవిక ఎట్టిగుట్టును పెట్టుకొనుట మంచిదికాదని తలంచి, మనసువిప్పి మాట్లా డుట మంచిదని ఎంచి, అయ్యా, మీపేరేమి? ఈలంకలో మీరేమి చేయుచున్నారని వినయముతో ప్రశ్నించిన హనుమంతుని వాక్యములకు, విభీషణుడు అయ్యా! నేనొక దౌర్భాగ్యుడను, రావణుని సోదరుడను, నాపేరు విభీషణుడు. స్వేచ్ఛగా హరి నామమును చేయలేని దుస్థితిలో వున్నానని చెప్పగనే,

హనుమంతుడు తనకోర్కె తీరినదని తలంచి, ఒక్క గంతువేసి, నేను రామదూతను, సీతాన్వేషణ నిమిత్తమై లంకలో ప్రవేశించితినని చెప్పగనే, విభీష ణుడు హనుమంతునకొక నమస్కారముచేసి, "అయ్యా, నారాముడెక్కడ, అతనిని నే దర్శించవీలగునా, నాప్రభువు కార్యనిమిత్తమై వచ్చితివా? అయ్యో! నీవెంత ధన్యుడవు, పుణ్యుడవు. నేనతనిని చూచునట్టి ఉత్తమగుణములు నాలో లేకపోయె కదా! నావంశము రాక్షసవంశము, ఎట్టి సాధనలూ చేయలేదు, తపస్సు చేయునంతటి స్వాతంత్ర్యుడనుకాను. ఏ అధికారములేని నన్ను రాముడు చూచునా, అతని అను గ్రహము నేను అందుకొనగలనా? అని రామదర్శనార్థమై విలపించుచున్న విభీష ణుని పరితాపము హనుమంతుని హృదయాన్ని ద్రవింపజేసెను. అందులకు హను మంతుడు విభీషణుని ఓదార్చి,

"విభీషణా, రామచంద్రుడు నీ హృదయమునుమాత్రమే చూచునుకాని, నీ వంశ, కులమత సాధనాది అంగములను చూడడు; భావప్రియుడు శ్రీరాముడు, నీ భావశుద్ధికి తప్పక అనుగ్రహించును, దర్శనమిచ్చును, యోచింపకుము. ఈ విష యమున నాకు నేనేసాటి, మరొకరు ఎందులకు? నేనా కోతిజాతికి చెందినవాడను, చంచలత్వములో పుట్టినయిల్లు పెట్టినపేరు. వేదశాస్త్రాలు నాకేమాత్రము తెలియవు. తపస్సు ఎట్టిదో నేనెరుగను. జపధ్యానాలు నేచేయలేదు. నన్నెట్లు అనుగ్రహించెను. నాలోని భావమును ప్రేమనుమాత్రమే చూచి నన్ను చెంతచేర్చెను. అటులనే నీ భావమును ప్రేమనుమాత్రమే చూచి అనుగ్రహించును. ధైర్యముగా నుండుము"ని హనుమంతుడు విభీషణుని అనేకరకముల ఓదార్చెను.

అనంతరం మతడు సీతనుగురించి హనుమంతునికి సవివరముగా తెలిపెను. అంత హనుమంతుడు విభీషణుని అనుమతి తీసుకొని, సీతను చూచునంతవరకు నాకెట్టి ఆహారపానీయములు వలదని ముందుకు పోవచూచెను. అంత విభీషణుడు శాంతముతో హనుమంతుని కొంత శాంతపరచి, ఆవసరపడుట మంచిదికాదు, లంక లోని విషయములను చక్కగా తెలుసుకొని ముందుకు పోవుట మంచిదని, లంకలోని మర్మములన్నియూ విడివిడిగా హనుమంతునికి తెలిపి, వెళ్ళుటకు అనుమతినిచ్చెను.

హనుమంతుడు సీత వున్నదన్న వార్తనిని, ఎక్కడవున్నది అను విషయ మును మరచి అనేక గృహములు శోధించెను. అంతఃపురములలో అనేకవిధముల భోగభాగ్యాలతో ఉన్మత్తులై పడిన వారలను చూచెను. సీత యిట్టి భోగభాగ్యముల నొల్లదన్న సత్యాన్ని గుర్తించి, రాముడు చెప్పిన అన్నివిధముల గుణగణములను దృష్టియందుంచుకొని ఒక్కొక్క స్త్రీని చూచుచూ వెళ్ళెను. ఎక్కడా సీతజాడ కను పించలేదు. నిరాశ, నిస్పృహలతో తిరిగి పర్వతముపై కూర్చొని ఎన్నివిధములు గనో యోచించి సీతను చూడక నేను రామునెట్లు జూతును. అట్లు వెనుకకు వెళ్లుట కంటే ఈ సముద్రమునందే పడి నాప్రాణములను కోల్పోదును, నాజీవితము వృథా, అని తనపై తనకు విసుగుపడుచూ వుంటూవుండగా.

దూరమున ఏదోఒక సుందరమైన వనము కనుపించెను. క్రిందికిదిగిచూడగ ఆ ఎత్తైన భవనములమధ్య ఆ వనమెక్కడో ఏమోనని తెలియకపోయెను. తరువాత చేయునదిలేక తిరిగి విభీషణుని ఇంటికివెళ్ళెను. అక్కడ విభీషణుడు రామనామము చేయుచూ కాలము గడుపుచుండెను. ఇతని రాకనుచూచి విభీషణుడు ఆప్యాయముతో చెంతకువచ్చి, హనుమంతా సీతను చూచితివా? అని ప్రశ్నించెను. హనుమంతుడు నిరాశతో తన ఆతురతను వెలిబుచ్చెను. అంత విభీషణుడు, హనుమంతా, అశోక వనమను ఒక సుందరమైన ఉద్యానవనము కలదు. అందులో అనేకమంది బలమైన రాక్షసులమధ్య సీత రామచింతనతో కాలము గడుపుచున్నది. నాసతి, పుత్రికలిరు వురూ ఆదేవి సేవ చేసుకొంటూ వున్నారని దానికి తగినమార్గములు విడిగాతెలిపెను. అంత మారుతి ఒక్క క్షణమైననూ అక్కడ గడుపక అశోకవనము చేరెను. మార్గ మధ్యములో ఈ రూపాన్ని చూచినవారందరు విచిత్రముగా కేకలువేయ దొడగిరి.

దానిని చూచి హనుమంతుడు తన కార్యమునకు భంగము కలుగునేమో అని తలంచి అతి సూక్ష్మరూపమును ధరించి చెట్లకొమ్మల, ఆకులమాటున దాగుకొంటూ అశోకవనము చేరెను. ఒక వృక్షముక్రింద నిద్రాహారములులేక, కృంగి, కృశించి, శల్యావస్థయందుండిన ఒకస్త్రీని చూచెను. ఆమెచుట్టు బలమైనరాక్షసులు భయపెడుతూ

వప్పించుటకు అనేకమాటలు చెప్పుచుండిరి. ఇంతలో పెద్ద భేరీలు వాయించుచూ ఒకదర్బారు వచ్చెను. వారివెనుక సర్వాలంకార భూషితుడై ఒకడు రాజువలేవచ్చెను. అనేక సుగంధపు ద్రవ్యములతో ఆభరణములతో వస్త్రములతో దాసదాసీలు నూర్లకు వచ్చిరి. ఈ దృశ్యమంతయూ చెట్టుపై ఆకులమధ్యనుండి చూచుచూ హనుమంతుడు గమనించెను.

రావణుడువచ్చి తనను ప్రేమించమని అనేకవిధముల బ్రతిమిలాడటము, భయపెట్టటము, చెంతనున్న వారలకు హెచ్చరించటము చూచెను. అందులకు ఆ కృశించినస్త్రీ తలయెత్తి అయిననూ చూడక, మూర్ఖుడా, చండాలుడా, నాపైన రామ చంద్రునకు తప్ప అన్యులెవరికీ అధికారము లేదనియూ నాదేహము అతని చింత లోనే భస్మము గావింతునుగానీ మరొకరీతిగా దారి తప్పనన్నది బాగా గుర్తించ మని కఠినసూక్తు లాడుచున్నది విని, హనుమంతుడు ఈమెయే సీతఅని దృఢము చేసుకొని మనసు సమాధాన పరచుకొనెను.

కొంతసేపయిన తరువాత రావణుడు నిరాశతో, ఉద్రేకముతో, భయపెట్టి ఒక నెల గడువునిచ్చి వెళ్ళెను. అతనితోపాటు అతని పరివారముకూడా వెళ్ళెను. వారందరూ వెళ్ళిన తరువాత, సీత తల పైకెత్తి రామా, రామా, ఇంకనూ దయ రాలేదా? నన్నెందులకిట్లు చిక్కులపాలు చేయుచున్నారని యేడ్వ మొదలుపెట్టెను.

# సీతా దర్శనము

ఇంతలో త్రిజట అను ఒక రాక్షస స్త్రీ సీతచెంతనే కాపలా గాచుచుండెను. ఆమెకు రామ చరణారవిందములందు అమిత ప్రీతి, భక్తి కలదు. అంతే కాదు, ఆమె కొంత విషయజ్ఞానములతో పాటు దైవజ్ఞానము కూడనూ కలది. ఆమె రాక్షస స్త్రీలతో కలసి, "ఓ సఖులారా! రాత్రి నాకొకస్వప్నము వచ్చెను. జానకిని సేవించి, మొదలు ఆమె కటాక్షమును సాధింపుడు. కలయొక్క వివరములు సావధానముగా వినుడు. ఒక వానరుడు మన లంకా పట్టణమునకు వచ్చి రాక్షసులను సంహరించి పట్టణమును దహించెను. రావణుడు దిగంబరుడై గార్ధభము నెక్కి దక్షిణ దిశకు పోవుచుండెను. వానికి శిరస్సు ముండనము చేయబడెను. వాని చేతులు నఱకబడెను. లంకారాజ్యము విభీషణునకు పట్టము కట్టిరి.

రామ నామమును నగరమంతటా చాటిరి. తదుపరి ఇంతే కాదు రాముడు సీతకు వర్తమానమును పంపెను. రాక్షసులారా! ఇది నిజము. నాకేనాడునూ స్వప్న మన్నది రాదు, రాలేదు. ఒకవేళ వచ్చెనా, అది సత్యము కాక తప్పదు, సత్యము కాని స్వప్నము ఈ త్రిజటకు రాదు. అధిక దినములు కూడా జరుగవు. ఇక 4, 5 దినములలో ఈ రీతిగా జరిగితీరును," అని త్రిజట స్వప్నవృత్తాంతమును చెప్పెను. రాక్షస స్త్రీలు ఈ విషయమును విని సీతాదేవికి నమస్కరించిరి. అనంతరము ఆ రాక్షస స్త్రీలు నలువైపులవారివారి డ్యూటీలు, పనులు వారు నిర్వర్తించుటకు వెడలి పోయిరి.

అంత జానకి త్రిజటనుచూచి "త్రిజటా, శ్రీరాములే నిన్నుపంపెనుకాబోలు. నిజముగా నీ బోటి స్త్రీ ఈ లంకలో వుండుట చేతనే నాబోటి స్త్రీలు మానసంరక్షణ గావించుకో గలుగుచున్నారు. లేకున్న నాబోటి వారలగతి యేమైయుండెడిదో. వింటివి కదా, మీ రావణుడు పలికిన పలుకులు. ఒక నెల దినములు గడువుపెట్టెను. ఈ నెల దినములలో నా రాముడే రాకున్న నేను అనగా ఈ దేహము ముక్కలు ముక్కలతో ఛీ కాకుల గ్రద్దల పాలో కాగలదు. నేను రాముని సతినై కడకు నా

దేహము యిట్టి దుస్థితికి గురియైన నే భరించలేను. దానికి పూర్వమే యేదైన ఉపాయము చెప్పుము. నేను దేహము త్యాగము గావింతును" అని త్రిజటతో విలపించుచూ చెప్పుట హనుమంతుడు వినలేకపోయినాడు.

అంత త్రిజట సీతకు నమస్కరించి, "తల్లీ, విచారించకుము. రాముడు సామాన్యుడు కాడు. అతని ప్రతాపము, పరాక్రమము, ఈ లోకములలోకాదు మరే లోకములో కూడను, యెవ్వరికినీ రాదు, లేదు, రాబోదు. నిన్నతడే కాపాడును త్వరలో అతడు వచ్చి నిన్ను చేగొనును. అధైర్య పడకుమ"ని ప్రీతివచనములు చెప్పి, గృహమునకు వెళ్ళెను. ఈ సుసమయములను ఆధారము చేసుకొని, హనుమంతుడు చెట్టునుండి అతి సమీప కొమ్మలపైకి దుమికి, సీతకు ముందు నిప్పు కణమువంటి ముద్దుటుంగరమును క్రిందకు విడచి రామ నామమును గానము చేయబూనెను. సీత, ముందు పడిన ఆ ముద్దుటుంగరమును చూచి, పరమాశ్చర్యపడి ఇది నిజమా లేక కలయా, లంకలో శ్రీరాముని సువర్ణ వ్రేలునకు ధరించిన ఈ స్వర్ణ ఉంగరము కనుపించుటేమిటి? ఇది రాక్షసమాయయా లేక నా భ్రమయా అని. తనలో తాను తర్కించుకొని, యేమైననేమి నా రామచంద్రుని ఉంగరమని తెలిసియూ నేను స్పరించకుండిన యెంతటి పాపము, అని తక్షణము ఆ ఉంగరమును తన చేతితో తీసుకొని కన్నుల కద్దుకొని ఆనంద బాష్పములు రాల్చుచు, రామా నీ దర్శనమును ఈ ఉంగరముద్వారా ఇచ్చుచున్నావా? అని తలయెత్తి పైకి చూచినతోడనే ఒక చిన్న వానరుడు, రామా, రామా అని స్మరించుచుండినటుల కనుపించెను.

తక్షణము త్రిజట చెప్పిన కథ జ్ఞాపకము చేసుకొని, ఆహా నా సుదినములు సమీపించుచున్నట్లున్నది. పది నెలలుగా రామనామమే వినని ఈలంకలో నేడు రామనామమును స్మరించు జీవుని చూడగల్గితిని. రామ ముద్దుటుంగరమును అందుకోగలిగితిని, అని పొంగిపోయెను. అంతటితో తన ఆనందమును పట్టుకోలేక పోయెను. ఏనాడూ పరులతో పలుకైనా పలుకని సీత, ఆ వానరాకారమును చూచి, ఓ వానరా, నీవెవడవు, ఈ ఉంగరము నీకెక్కడిది, అని ప్రశ్నించెను. లోలోన రాక్షసుల మాయలను అనేకముగాచూచి, అనుభవించుట చేత, వానరుని అంత త్వరలో నమ్మలేకపోయెను.

అనేక విధముల వానరుని ప్రశ్నింప మొదలుపెట్టెను. మధ్య మధ్య రామచంద్రుని, క్షేమవార్తలను అడుగుచూ, కంటిధారలు కార్చెను. ఈ విధముగ హర్ష విషాదములచే డోలాయమానమగుచున్న సీతను చూచి హనుమంతుడు తనకు రామునకు కల్గిగిన సంబంధ బాంధవ్యమును లోన యిముడ్చుకోలేకపోయినాడు.

రాముని పుట్టుపూర్వోత్తరములను తన జీవిత చరిత్రనూ, పూసగ్రుచ్చి నటుల చెప్పెను. ఆ చరిత్ర వింటూవుంటే సాక్షాత్ రామచంద్రుడు నిజముగా ఆమె కంటిముందు నిలచినట్లుగా ఆమె రామునితో అయోధ్యలో, అరణ్యములో వుండి నట్లుగా తన తనువునేమరచి ఆనందించెను. సీత, ఇంతలో లోకస్పృహకువచ్చి, వో వానరా యిన్ని చెప్పితివి. కానీ నీవు వానరునిగావుండి యింత కఠినమైనలంకలో ఎట్లు జొరబడితివి; రాక్షసులచేతచిక్కక ఎట్లు నన్ను నీవుచూడగల్గితివి, అని అతని శక్తిసామర్థ్యములను పరీక్షించగోరెను

అంత హనుమంతుడు, "తల్లీ నాదేమీలేదు, నేను రామబంటును, దాసుడను అంతా రాముడే చేయించుచున్నాడు. అతనులేక క్షణమైననుకూడ నిలువలేను. నేనొక బొమ్మను. అతడు ఆడించునటుల ఆడువాడనేకాని నాదేమున్నది," అని రాముని వేవిధముల వర్ణించుచూ భక్తిప్రపత్తులు శ్రవణానందముగా వివిపించెను. కానీ యింకాకొన్ని పరులకుతెలియని కొన్నిసన్నివేశములు రాముడు, హనుమంతునితో తెలిపియుండెను. ఒకవేళ సీత నిన్ను నమ్మకపోవచ్చును కాన అట్టి సహజమును ఆధారము చేసుకొని ఈ అమూల్యమైన విషయములు సీతకు జ్ఞాపకము చేయుమని ముందే రాముడు తెలిపియుండెను.

ఇపుడు ఆ సమయమును ఆధారముచేసుకొని హనుమంతుడు, "తల్లీ, జానకీ! కాకాసురుడు తమను హింసించగా తమకు శ్రీరాముడు గావించిన సహాయము, కాకాసురుని వధించుటకు చేసిన ప్రయత్నములు జ్ఞాపకము చేయమని చెప్పెను" అనగానే సీత గొల్లునయేడ్చి, "హనుమంతా, నా రాముడు ఆనాడు నన్నన్నివిధముల కాపాడి, నేడు ఎందులకింత తామసము చేయుచున్నాడు. రాముడు కరుణాసముద్రుడుకదా! నా విషయమున అతని కరుణ కఠినమాయెనా? అయ్యో, ఇది నా పొరపాటు. రామచంద్రుడు దయామయుడు, లోకనాటకమున తాను చేయవలసినరీతిగా తాను చేసి చూపించుచూ చేపించుచుండవలసి వచ్చినది. కానీ హనుమంతా, నీవు సామాన్యుడవై వుండవు! సామాన్యులతో రామచంద్రుడు ఇంత గాఢమైన స్నేహముచేయడు. తన అంగుళీయకమును పంపడు, నీవెంతటి అదృష్టవంతుడవో, ఒక్కసారి నీ పూర్ణరూపమును చూపుమని" కోరెను.

అంత హనుమంతుడు క్రిందికిదిగి సీతముందు చేతులు జోడించికొని మహా ఆకారమును చూపగనే, సీత జడిసి, ఇది కేవలము రావణుని మాయయా అని తలంచి కన్నులు మూసుకొనెను, వెనుకకు తిరిగెను. ఆ అనుమానమును గ్రహించి హనుమంతుడు, ఓతల్లీ; నేను రావణుడనుకాదు, రాక్షసుడనుకాదు, పవిత్రమంగళ

స్వరూపుడైన శ్రీరాముని బంటును; అతనే నాప్రాణము. నేను సత్యమును వచించు చున్నాను. నీవు నమ్మవను ఉద్దేశముతో శ్రీరాముడు తన వ్రేలియందలి వుంగరమును నా హస్తమందుంచి సీత నమ్మకమునకు ఆధారముగా దీనిని తీసుకొనిపొమ్మని ఆజ్ఞచేసెను. నాతోపాటు సుగ్రీవుడు, జాంబవంతుడు, అంగదుడు ఇంకా వేలాది వానరవీరులు వచ్చిరి. నేనుమాత్రమే రామానుగ్రహముచే సముద్రమును దాటగలిగితిని. మిగిలినవారు ఆవలి వొడ్డున నున్నారు.

తమను ఈ కిరాతక రాక్షసుడు గొనివచ్చిన విషయము, శబరి, జటాయువు వలన వినగలిగితిమి. సంపాతివలన మూడుదినములకు మునుపేవిని తమను దర్శించి నంతగా ఆనందము నందితిమి. రామలక్ష్మణులు ఈవార్తను వినుటకై కాచియున్నారు. శెలవిచ్చిన తక్షణమే వెనుకకువెళ్ళి ప్రభువులకు తమ క్షేమవార్త నందింతునని తెలుపగనే, హనుమంతా! తిరిగి నీవు వత్తువోలేదో? ఇంకా ఒకదినముండి రాముని సుక్షేమవార్తలు తెలిపి నన్నానందపరచుము, అని కోరగనే, ఇంతలో రాక్షసులు వారి వారికి నియమించిన పనుల నిమిత్తమై గుంపులు గుంపులుగా వాలియుటచేత, తిరిగి హనుమంతుడు సూక్ష్మరూపమును ధరించి, వృక్షముపై వెళ్ళి కూర్చొనెను.

సీత హనుమంతుడు చెప్పిన మాటలన్నింటిని మననముచేసుకొనుచూ తనలో తాను ఆనందించుచూ, అప్పుడప్పుడు ఆ వానరుని చూచుచూ వుండెను. ఆనాడు అసలు నీరైనా త్రాగక రాక్షసులు తెచ్చిపెట్టిన ఫలజలములైననూ ముట్టక విలపిల్లుచున్న దృశ్యమును హనుమంతుడు చూడలేకపోయినాడు. కాపలా గాచుచున్న క్రూర రాక్షసులు సీతను ధిక్కరించుచున్న కఠినవాక్కులను భరించలేక మధ్యమధ్య పట్టలేని కోపముతో పండ్లు కొరుకుచుండెను. విధిలేక సీత ఆజ్ఞకోసమని వేచియుండెను. కొంతసేపయిన తరువాత సరమ అనగా విభీషణునిభార్య, తన కొమార్తె అయిన త్రిజటతోవచ్చి, సీతకు నమస్కరించి, అమ్మగారి క్షేమవార్తలను విచారించిరి. వారు సీతకు అనుకూలురగుటచేత, త్రిజటకువచ్చిన కల నిజమయినదని, సీత వానరుడు వచ్చిన వృత్తాంతము తెలిపెను.

త్రిజట, సరమ, ఇరువురూ ఎంతో ఆశ్చర్యముగా సీతను పరిపరివిధముల విషయములను తెలవియ్యమని కోరగా చెట్టుపైనున్న వానరుని చూపించి, అతడు తెచ్చిన వుంగరమునుకూడా వారలకు చూపెను. వారిరువురు ఆవుంగరమును కన్నుల కద్దుకొని ఆనందించిరి. ఇంతలో సీతకు ఏకాంతసమయము ఏర్పడగనే, వానరుడు దిగివచ్చి, తల్లీ మీరు విచారింపకుడు, నా వీపుపై కూర్చొనిన నేను క్షణములో రాముని సన్నిధిని చేర్తును అని అనేకవిధముల ప్రతిమిలాడెను.

అందులకుసీత, "హనుమంతా, నీపలుకులే నన్నెంతోఆనందపరచుచున్నవి, విరహసముద్రములోమునిగిపోవుచూతపించుచున్ననాకు నీ తీయని ఆదరణపలుకులు, పడవలవలే సహాయము గావించినవి. నేను పరపురుషుని అంటనన్న విషయము నీకు తెలియదా? అట్టి నేను నీ వీపుపై ఏవిధముగా కూర్చొనగలనో యోచింపుము," అని సీత సూటిగా నాటుకొనిపోవుమాట ఎంతో హనుమంతుని హృదయములో గ్రుచ్చుకొనిపోయెను. "అమ్మా! నేను నీ కొమరుడనుకదా. తల్లిని వీపుపై కూర్చొన బెట్టుకొనుటలో తప్పేమున్నది, దోషము లేదుకదా" అని పరిపరి విధముల ప్రార్థించెను.

అందులకు సీత, "హనుమంతా, నీకు, నాకూ మన భావములు మాతా పుత్ర భావములు కావచ్చును. లోకమేమనునో యోచింపుము. లోకమునుకూడా మనము చూడవలెనుకదా. ఆదర్శవంతమైన జీవితాన్ని నిరూపించునట్టి వ్యక్తులుగా మనము మెలగవలెను కానీ అన్యులచే ప్రేలు చూపించుకొను పనిచేయరాదు. ఆత్మతృప్తిలేని పనులను నేనంగీకరింపను. నా ప్రాణముపోయిననుసరే, రాముడే నన్ను గొనిపో వలెను, కానీ అన్యుల సాయము నాకక్కరలేదు. అంతియేకాక నన్నింతటి రీతుల బాధపెట్టిన ఈకిరాతుని హతమార్చుటకు నా రాముడేసరి. అతనే ఈ లంకకువచ్చి రావణునిచంపి ఈ సీతను చేపట్టుటలో ఒక పరాక్రమము. కానీ, రావణుడు దొంగ వేషమును ధరించి మోసపుచ్చి నన్ను తెచ్చెను. రాముడు ధర్మస్వరూపుడు, నీతి నియమములను పాటించువాడు, సత్యవాక్య పరిపాలుడు. అట్టి రాముడుకూడా తన దూతను పంపి రావణునకు తెలియకుండా సీతను తెప్పించుకొనెనన్న వార్త శ్రీరాము నకు కీర్తినివ్వదు. ఇట్టి పనికి పూనుకొనుట రామద్రోహముకాగలదు. కాన మోసపు మార్గములను కానీ, టక్కరి చర్యలను కానీ మనము అవలంబించకూడదు. రామ గౌరవము మన ప్రాణము. రామకీర్తి మన హృదయమూర్తి. వాటిని కాపాడునట్టి పనులను చేపట్టుట మంచిది. నీవాక్కులు నాకంత తృప్తిని చేకూర్చుటలే"దని హను మంతుని వాక్కులను ధిక్కరించిన సీత వాక్యములకు హనుమంతుడెంతయో సంత సించి, సీతయొక్క గుణగణములను తనలో తానెంతయో కీర్తించుకొని ఆనందించి, "తల్లీ, నన్ను క్షమింపుము. తమ బాధను శ్రీరాముని విరహము కాదనను. కండ్లారా చూచినవాడ నగుటచేత ఎంత త్వరగా తమను శ్రీరామునిచెంత చేర్చ వీలుండునో అంత త్వరితంగా చేర్చవలెనను ఆతురతచే నేనట్లుప్రార్థించితిని. తప్పైన క్షమింపు" మని మరీమరీ నమస్కరించెను.

అంత, సారెసారెకూ సీత, రామలక్ష్మణులు క్షేమమేనా? మగవారలకేమి?

వారెట్లయినసనూ భరించగలరు, స్త్రీలనువిడచిపుండగలరు. ఆడవారిదే అధమజన్మము. పశులనువిడచి పడతులు జీవించుట మహా ఘోరము. అని మగవారిని మధ్యమధ్య విస్తారములాడుచుండుట చూచి, హనుమంతుడు, తల్లీ! రామలక్ష్మణులు క్షేమమే కానీ, మిగిలిన మగవారలతో వారినిపోల్చ న్యాయముకాదు. క్షణక్షణమూ సీతను తలంచుచూ అన్నపానాదులు సహితము స్వీకరించక పున్నారు తల్లీ. ఏదో లక్ష్మణుని బలవంతముతో కొంత పానీయమును ఫలములను స్వీకరించుచున్నాడుకానీ, రాముడు బుద్ధిపూర్వకంగా ఒక గుటికెడు నీరు త్రాగిన సమయాన్నికూడనూ నేచూచిఎరుగను. దుఃఖించకు; వారలను సంశయించకు తల్లీ. లక్ష్మణుడు అన్నగారి ప్రాణమునకు ప్రాణమై ఒకవైపు తమ వియోగమును, మరొకవైపున రామదుఃఖమును భరించలేని వారయి మొండిబండవలే ధైర్యముతో రాముని కంటిరెప్పవలే చూచుకొంటూ ధైర్యమును తెలుపుచూ కాలము గడుపుచున్నారు.

ఈ పదినెలలూ నిద్రనెరుగరు, తిండినెరుగరు అని హనుమంతుడు విషాద కరమైన శ్రీరామచంద్రుని వియోగ సమయములను వివరించుచుండ సీత, తెలియని దానివలె నటించుచూ నిజముగా శ్రీరామచంద్రునకు నాపై యింతప్రేమయా, యింత దయయా, అని ఆశ్చర్యపడినట్లు నటించుచూ, మధ్యమధ్య వెగటుగా మగవారలు మగవారలనే వర్ణింతురు. మెచ్చుకొందురు. ఆడవారి బాధలు వారలకెట్లు తెలుసునని నిందాస్తుతులను చేయుచుండెను. ఒక్కొకపుడు హనుమంతుడు చెప్పుచుండిన విషయములను నమ్మలేక పోవుచుండెను. హనుమంతుని శక్తిసామర్థ్యములు చాలా చూచుచూ, హనుమంతునితో శ్రీరామచంద్రుడు మైత్రిగావించిన విచిత్ర ఘట్టమును హనుమంతుడు చెప్పగా సీత మిగుల ఆనందపడెను. సీతకు హనుమంతుని వచనములు దృఢనమ్మకమును కలిగించెను.

సారెసారెకు, హనుమంతుడు "తల్లీ, యెందుకింత ఖేదము పుత్రునిమీద. కాలమెందుకు వృధావ్యథలతో గడుపుదురు. నావీపుపై కూర్చొనిన క్షణములో శ్రీ రామసన్నిధికి చేర్తునని" చెప్పుచుండ, సీత యెన్నివిధముల నీతులను తెలిపినసనూ వినని హనుమంతుని ఆతురతను గమనించి, సీత సూటిగా "హనుమంతా, నీవు శ్రీరామ ఆజ్ఞను శిరసావహించువాడవుకదా అనినది, అదివిని హనుమంతుడు తల్లీ నా ప్రాణమునైననూ విడతును కానీ రామాజ్ఞ మీరను అని ప్రమాణపూర్వకముగా యెదగొట్టుకొనగా, అట్లుఅయిన, శ్రీరాముడు నన్నుచూచి రమ్మనిమాత్రమే. సెలవిచ్చెను కానీ తీసుకొని రమ్మని సెలవిచ్చెనా, బాగుగాయోచించమని సీత జవాబు చెప్పగనే, హనుమంతుని నోరు కట్టివేయబడెను. తల్లీ క్షమించుము. నేనంతటి

లోతునకు యోచించనందుకు మరొకతూరి క్షమాపణ కోరుకొందునని అప్పటినుండి ఆమాట నుపయోగించుట మానివేసెను.

ఇక తను కాలమును వృథాచేయుట మంచిది కాదని హనుమంతుడు తలంచి యెంతోత్వరగా సీత సుక్షేమవార్త రాముని కందించుట మంచిదని సీత అనుమతిని కోరెను. ఆమె క్షేమముగా వెళ్ళి త్వరగా రాముని స్వయముగావచ్చి నన్ను గొని పొమ్మనమని కంటిధారలుకార్చుచూ చెప్పిన పలుకులు హనుమంతుని హృదయాన్ని కరిగించెను, కదిలించెను. అంత హనుమంతుడు, తల్లీ అతిశీఘ్రకాలములోనే వానర సైన్యముతో రామచంద్రుడు లంకను ముట్టడించి రాక్షసులను హతమార్చి తమను అయోధ్యకు చేర్చుకొనునని వాగ్దానమొసగెను.

అంత సీత, "హనుమా, వానరులు సామాన్యులు. ఈ బలమైన రాక్షసులను సంహరించగలరా ? ఇంత మాయాశక్తులను కలిగిన ఈ రాక్షసులను రామలక్ష్మణులు ఇరువురు యేమిచేయగలరు? ఇది కలలోనివార్త, కడకు నాప్రాణములు కోల్పో వుటే యగును. మిమ్ములను ఇంతమందిని ఈ యుద్ధములో చంపుటకంటే, నా ప్రాణములు వీడుట మంచిదికదా ?" అని విలపించుచున్న సీతను చూచి.

"అమ్మా సీతామాతా ! తమరట్లు భావించవలదు. మేము రామదూతలము. అతని నామమునే మా సర్వబలముగా తలంచినవారము. రామనామము తప్ప అన్య ప్రాణములు మాకులేవు. కాన ఈ రాక్షసులనే కాదు. ఇంకా వేయిరెట్లు రాక్షసుల నైననూ ఒక్క మావానరులే చంపగలరు, జయించగలరు. మేము సామాన్యరూప ములు ధరించుటచే తమరు మా శక్తిసామర్థ్యములను శంకించుచున్నారు. చూడ"మని హనుమంతుని సువర్ణపర్వతముతోసమానమైన ఆకారమును చూపగనేసీత, ఆశ్చర్య పడి హనుమంతా చాలింపుము. నీరూపమును అదుపులో వుంచుకొనుము. రాక్షసులు చూచిన తిరిగి నిన్ను వెనుకకు వెళ్ళనివ్వరు, అని భయపడునటుల నటించెను. అంత హనుమంతుడు సీతకు నమస్కరించి తన ఉగ్రరూపమును శాంతపరచుకొని సూక్ష్మ రూపమును ధరించి వెనుకకు బయలుదేరెను.

సీతయొక్క పరిస్థితి, హనుమంతుని హృదయములో శాశ్వతముగా ముద్రించు కొని సీతను వీడలేక వెనుకకు తిరిగెను. వెనుకకు వచ్చు సమయమున ఒక ఫలవన మును ప్రవేశించి కడుపారా ఫలములు భుజించి మిగిలిన ఫలములను క్రిందరాల్చుచూ వచ్చెను. ఆ దృశ్యమును కాపలాకాయు రాక్షసుడు చూచి దానిని అదిలించ పూను కొనెను. అంత హనుమంతుడు ఆ కాపలా రాక్షసుని ఒక గ్రుద్దుతో క్రింద పడ వేసెను. అంత ఆ కాపలారాక్షసి యెట్లో ధైర్యముచేసుకొని పరుగెత్తి తన పై అధి

కారిగావున్నవానికి తెలిపి, వాడు తన అధికారికి, ఈరీతిగా కడకు ఈవార్త రావణుని చెవిపడెను.

అది వినగానే రావణునికి అశుభముగాతోచెను,భరించుకోలేకపోయెను, కోపము మిన్నుముట్టెను. కొన్ని వందలమంది రాక్షసులను వానరునిపైకి పంపెను. వారిచేత కాకపోవుట చూచి వానరుని పట్టుటకై బాగా శక్తిసామర్థ్యములుకల వారలను చక్కని తరిఫీదుఅయిన వారలను కొన్ని ఆయుధములతో కొన్ని వేలమందిని పంపెను. అన్ని వేలమందికూడనూ వానరుని యేమాత్రము కదిలించలేకపోయినారు. హనుమంతుడు ఒక చిన్న తుంటకఱ్ఱ తీసుకొని రామరామ అంటూ, వేసిన ఆయుధాలను ఆచిన్న చెట్టుకఱ్ఱతో వెనుకకు కొట్టుచుండుట చూచి రాక్షసులు ఆశ్చర్యపడుటయేకాక ఇత నెవ్వరో దైవదూతగా వున్నాడనియు, ఇది యేదోలంకకు ప్రమాదమునే తెప్పించున నియు, భయపడి లోలోన కుములుచూవచ్చిరి. రావణునకు ఈసమాచారము చెప్పుటకు ధైర్యమును కోల్పోయిరి, యెన్నోవిధముల రాక్షసులను లెక్కకుమించి పంపిరి. కానీ ఫలితము లేకపోయెను. ఒక్కతూరి హనుమంతుడు గర్జించగా ఆ శబ్దమునకే కొన్ని నూర్ల రాక్షసులు మరణించిరి. భూమి దద్దరిల్లెను, భవనముల ప్రతిధ్వనులు మిన్ను ముట్టెను. చేయునదిలేక సైన్యమునకు అధికారియైనవారు రావణునకు ఈవార్త తెలిపి ఇతను సామాన్యుడు కాడనియూ, ఇదియేదో భయంకర పరిస్థితికే గొనితెచ్చుననియూ జెప్పెను. దీనిని వదలిన చాలా ప్రమాదపరిస్థితికే వచ్చునని గట్టిచర్య తీసుకోవలసి వచ్చుననియూ ఉన్నదున్నటుల తెలిపెను.

అంత రావణుడు అక్షయకుమారుని పంపెను. ఆ కుమారుని వెంట అనేక వేల యోధులను పంపెను. కానీ అక్షయకుమారుని, వేల యోధులను, క్షణములో హనుమంతుడు. హతమార్చెను. ఆ విచిత్ర చర్యలను చూచి లంకఅంతయూ వణకి పోయెను. యేదియో యొక బలవత్తరమైన దైవశక్తియే కానీ ఇతడు సామాన్య వానరుడు కాడని వారు గుసగుసలాడిరి. కడకు సీతాపహరణపు పాపఫలమేనని కొందరు దృఢపరచుకొని లోలోన సీతను ప్రార్థించిరి.

అక్షయకుమారుని మరణవార్తవిని రావణుడు దుఃఖముతో పొంగివచ్చు కోప మును భరించలేకపోయెను. అంతలో మేఘనాధుని పిలచి అతనికి కొన్నివేల యోధులను సహాయముగా పంపించెను. మేఘనాధుడు రథమునెక్కి భూమి ఆకాశము దద్దరిల్లునటుల నడచివెళ్ళుచుండ చూచువారలకే గుండెలు ఝల్లుమనెను. ఈసైన్య మును చూచి వానరుడు, అలక్ష్యముతో లెక్కచేయని వానివలె ఒక కొమ్మపై కూర్చొని నిర్లక్ష్యముగా వారిని చూచుచూ వుండెను.

ఇంతలో ఈసైన్యము నలువైపుల అంబుల వర్షము కురిపించిరి. వీరినిచూడ గనే కపిరాజు, పటపట పండ్లుకొరికి సింహనాదముచేసి, ఒక పెద్ద వృక్షమును వేళ్ళవరకూ లాగి ఆ వృక్షమును ఒక చేతితో పట్టుకొని నలువైపులవచ్చు అంబుల వర్షమును క్షణములో వెనుకకు కొట్టుచుండ, ఆ అంబులు తిరిగి రాక్షసులకే తగిలి కనురెప్పపాటులో అందరూ ప్రాణములను కోల్పోయిరి.

మేఘనాధుడు ఒక గ్రుద్దుతో క్రిందపడి రక్తము క్రక్కెను. అంత మేఘ నాధుడు చేయునదిలేక బ్రహ్మాస్త్రమును చేతియందుంచుకొని, నరవానరుడు, రావణు నకు మృత్యువని బ్రహ్మయే తెలిపెను గదా, అని తలంచుచుండగా, అంతలో ఇంద్ర జిత్తు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను బ్రహ్మాస్త్రమును ధిక్కరించరాదని హను మంతుడు దానినియేమియూచేయలేక గౌరవముగానమస్కరించెను. అంత ఇంద్రజిత్తు నాగపాశముతో హనుమంతుని బంధించెను. హనుమంతుడు నాగపాశమునకు బద్ధు డాయెను. వానరుడు కట్టబడెనని రాక్షసులు పరుగెత్తుకొనివచ్చి రావణునికి తెలిపిరి.

కట్టబడిన ఈ వానరుని చూచుటకు లక్షలాది రాక్షసులు బారులుదీరి చూచు టకు వీధులునిండిరి. ఆ వీధులలో రావణదర్బారునకు గొనిపోవుచుండిన వానరరాజు నిర్లక్ష్యముగా యేమాత్రమూ భయభ్రాంతులు వెలిబుచ్చక రావణదర్బారునకు చేరెను. అక్కడ రావణుని శక్తిసామర్థ్యములను చూచికూడనూ యేమాత్రమూ రాజునకు తగిన గౌరవమర్యాదలు ఇవ్వకవుండుట చూచి, అధికారులు ఆశ్చర్యపడిరి. రావ ణుడు ఈ వానరుని చూచి ఫక్కున నవ్వి, అంతలో తన మరణమును చింతించి లోలోన విచారించెను.

కానీ రాక్షసుడగుటచేత మరణవార్త తననంత పీడింపలేదు. "ఒరే వానరా! నీవెవడవు, నీవుపయోగించుబలము యెవ్వరిది? యెందుచేత ఈవనమును ధ్వంసము గావించితివి? సిగ్గును విడచి ముఖమెత్తి చూచుచున్నావు. వీటికి సరియైన జవా బులు చెప్పుమని" మందలించెను. అంత హనుమంతుడు నవ్వి మిగిలిన రాక్షసులకు అర్థముకానిరీతిగా పాండిత్యభాషను ప్రవేశపెట్టి, చక్కని జవాబునిచ్చెను. నవవ్యాక రణ పండితుడు కనుక రావణుడు అర్థముచేసుకొని వారిరువురూ మాటలాడుచుండగా రెండు పెద్ద పండిత గజములు వాదించునటుల తోచెను.

అంత రావణుడు హనుమంతునిముందు చిత్రమంత్ర మహిమలను చూపెను. మాయలను సృజించెను. అంత హనుమంతుడు, "ఓ రావణా, నీసంగతి నేనెరుగు దును. నీవు సహస్ర భుజములతో పోరాడుట వినియుంటిని. నీవు వాలితో పోరాడిన సంగతియు నాకు విశదము. నాకు ఆకలి అగుటచేత ఫలములు భుజించితిని. నా

వానర స్వభావముచే వృక్షములు పడద్రోసితిని. నా స్థలములో నేనుంటిని, ఎవని శరీరమునందు వానికి అభిమానముండును. నీ భటులు పరమ దుర్మార్గులు. నీ భటులు, నన్ను హింసించుటచేత నేను వారలను సంహరించితిని. ఆత్మసంరక్షణ నిమిత్తమై నేను కలహించితిని. నీ కుమారుని అస్త్రము నన్ను బంధించెను. అంత మాత్రమున నాకు వంచనలేదు. నా స్వామి కార్యమును నేను సాధింపవలెను.

నీవు సావధానముగా వినుము. నీ అభిమానమును విడువుము, నీవు యెంత గొప్పవంశమున జన్మించితివో విచారింపుము. బ్రహ్మకు నీవు ప్రపౌత్రుడవు, పులస్త్యునకు పౌత్రుడవు. విశ్వవసువునకు పుత్రుడవు. భ్రమను విడచి ఆ భక్తభయ హరుని, ఆ ఇక్ష్వాకులతిలకుని, రఘువంశరత్నమును అగు శ్రీరాముని భజింపుము. శరణుజొచ్చుము. కాలుడుసహితము వెఱగుపడును. అతనితో వైరము తగదు.

నా మాట విని, జానకిని, నా ప్రభువునకు సమర్పించుము. శ్రీరాముని చరణారవిందములను ధ్యానముచేయుము. లంకారాజ్యమును శాశ్వతముగా పరిపాలింపుము. పులస్త్యుని కీర్తిప్రతిష్ఠలు ఆచంద్రార్కముగ, నిష్కళంకముగ వెలిగింపచేయుము. వారికీర్తికి మచ్చను కలిగించకుము. నీ మదమోహాదులు విడువుము.

ఓ రాక్షసరాజా ! పర్వతములలోపుట్టిన నదులు వర్షాకాలములో ఉప్పొంగి పొర్లి పారును. అంతలో అవి యెండిపోవును. అటులనే నీ సిరిసంపదలు శీఘ్రమున నశించును. శ్రీరాముని ఆధారముగ చేసుకొనియుండిన వారి సిరిసంపదలు వృద్ధియగును, వారికి నష్టము కలుగదు.

ఓరాజా ! నేను మనసువిప్పి చెప్పుచున్నాను. శ్రీరామునితో విరోధించిన వానిని రక్షించువారులేరు. నామాట వినుము." ఈవిధముగ హనుమంతుడు మంచి వివేకనీతులను రావణునకు బోధించెను.

అంత రావణుడు ఓ మూర్ఖుడా ! నీవా నాకు ఉపదేశించువాడవు ? ఛీ, ఛీ, నీకు మృత్యువాసన్నమయినది. లేకున్న నాయెదుట ఇంత ధైర్యముగా ఉపన్యాసము లిచ్చియుండెడివాడవు కావు. ఛీ, నోరు మూయుము అని ధిక్కరించెను.

అంత హనుమంతుడు "ఓ రావణా ! నీ వచనములే నీకు వ్యత్యస్తముగ వర్తించును. నీ మతి భ్రమించెను. క్రమముగా నీకు బోధపడును. మృత్యువు ఆసన్నమయినది. నీకో, నాకో కొన్ని దినములలోనే తేలగలదు" అని జంకుగొంకు లేక ధీరుడై మాటాడిన హనుమంతుని పలుకులకు రావణుడు ఉగ్రుడై తొడను కొట్టి ఓయీ ! రాక్షసులారా చూచుచున్నారా ? శీఘ్రము మీరు వానిని వధింపుడు అని ఆజ్ఞ పంపెను.

తక్షణమే రాక్షసులు రాజాజ్ఞ ప్రకారము వానరుని సంహరించుటకు సిద్ధమయిరి. ఆ సమయమున మంత్రులతో కూడి విభీషణుడు సభకు వచ్చెను. అతడు రావణునకు నమస్కరించి, ఓనాథా దూతను వధించుట రాజధర్మమునకు విరుద్ధము. మరొకవిధమున వానికి తగిన శిక్ష విధింపుడు, అని విభీషణుడు పలికిన పలుకులకు మిగిలిన మంత్రులు ఆమోదించి, ఇది పరమసత్యమని తెలుపగనే వారి మాటలకు రావణుడు నవ్వి, వానిని అంగవికారముచేసి పంపుడని ఆజ్ఞాపించెను. అంత చేరిన రాక్షస శ్రేష్ఠులు విచారించి వానరునకు వాలమునందభిమానము మెండు కనుక వాని వాలమునకు నూనెగుడ్డలు కట్టి నిప్పు తగిలించిన బాగుండునని సలహా యిచ్చిరి. అపుడు ఈ వానరుడు వాలము పోగొట్టుకొనిపోయి వాని స్వామిని తీసుకొనివచ్చును. అపుడు వీని పౌరుషమును, వీని ప్రభువు శూరత్వమును చూడవచ్చును అని మిగిలిన మంత్రులు చెప్పిరి.

అంత సభలోని ప్రముఖులు గుసగుసలాడిరి. వీరి మాటలు, గుసగుసలు వింటూ చూచుచున్న హనుమంతుడు ఫక్కున నవ్వెను. రాక్షసులకు మరింత కోపము హెచ్చెను. తక్షణమే నూనెగుడ్డలు తెప్పించి హనుమంతుని వాలమునకు బాగుగా చుట్టుటకు మొదలుపెట్టిరి. అంతకంతకు హనుమంతుని వాలము పెరుగజొచ్చెను.

యెన్నిబండ్ల నూనెగుడ్డలను తెచ్చినను అవి చాలకపోయెను. ఈ వింతను చూచుటకు పురము నందలి రాక్షసులు, స్త్రీ పురుషులు గుంపులు గుంపులు వచ్చిరి. ఇంతలో వాయిద్యములు ప్రమోగించిరి. కరతాళములు ప్రమోగించిరి. నగరమంతయును వీధివీధులవెంట హనుమంతుని త్రిప్పిరి.

కడకు పురమధ్యవీధిన నిలబెట్టి వాలమునకు నిప్పంటించిరి. నిప్పు తగిలినంతనే హనుమంతుడు సూక్ష్మరూపుడయ్యెను. అతని బంధనములన్నీ విడిపోయెను. వెంటనే హనుమంతుడు సువర్ణప్రాకారములపైకి కుప్పించెను. పుర రాక్షసులు భయపడిరి.

ఆ సమయమున హనుమంతుడు రామ, రామ అని అరచెను. ఆ ధ్వనిచే వాయువు ప్రచండముగ వీచెను. అట్టహాసముతో హనుమంతుడు గర్వించి తల క్రిందుగ కుప్పించి యెగుర మొదలుపెట్టెను. నిప్పుమంటలతో యెగురుచుండిన అతని తోక పొడవయ్యెను. ఒక గృహముపై నుండి మరొక గృహముపైకి దాటుచు, ఇంటింటికి నిప్పంటించెను.

లంకా పట్టణమందలి గృహములు కాలుచు కుప్పలవలే కూలి భస్మమయ్యెను. రాక్షసులు, స్త్రీలు, పిల్లలు, గృహములను వీడి ప్రాణసంరక్షణ నిమిత్తమై పరుగుబ

దీసిరి. పశువులు, గుఱ్ఱములు, యేనుగులు, కంచరగాడిదలు కట్లను ఊడ పెరుకుకొని వీధులవెంట భయంకరంగా పరువులు తీసెను. భయంకరమైన కేకలతో లంకాపట్టణమంతయూ వ్యఘ్రాతలూగెను. అయ్యో, అమ్మో, రక్షింపుడు, కాపాడుడు, అను స్త్రీ, పిల్లల కేకలు మిన్నుముట్టెను. ఆ మాటలు మండోదరి చెవులపడెను. మండోదరి ఆడవారి ఆలాపములు విని రాజభవనమునందలి సిపాయిలనుపంపి స్త్రీ శిశువులను కాపాడమని ఆజ్ఞాపించెను. అంతే కాదు, అయ్యో రావణుని మూర్ఖపు బుద్ధే ఈ రాక్షసవంశ నాశము గావించ మొదలుపెట్టెను. నేను, మరదియైన విభీషణుడూ యెన్నియో బోధించితిమి, ప్రార్థించితిమి, వినడయ్యెను. వంశ క్షయము కాగలదని మొరపెట్టితిమి, వినాశకాలే విపరీత బుద్ధిః అన్నట్లు అతని చెడుకాలము ఇన్ని విధములైన విపరీత చర్యలకు మూలకారణమైనది, అని మండోదరి తన దాసీలతో చెప్పుచూ కంగారుపడదొడగెను, విలపించెను. యెటుచూచిననూ నాలుకలు చాచుతూ ప్రజ్వరిల్లుచున్న మంటలు కనుపించెను. యెక్కడ చూచిననూ హనుమంతుడే కనుపించెను. ప్రతి గృహస్థురాలు హనుమంతుని ప్రార్థింప మొదలుపెట్టినది. విలదీపించిరి బిడ్డలను కాపాడుమని చేతులు జోడించి వేడుకొనిరి. కుంభకర్ణుని భార్య, "ఓ రామదూతా, నా పతి గాఢనిద్రలో వున్నాడు, నా గృహమును విడచిపెట్టుము, నా పతిని రక్షించుము" అని ప్రార్థించెను. లంక అంతయూ కోలాహలమయ్యెను. క్షణములో రావణునకు తెలిసెను. రాక్షసులను శస్త్రాస్త్రములతో, పిరంగులతో వానరుని ముట్టడించుడని ఆజ్ఞాపించెను. వెళ్ళిన సైన్యము ఒక్కపరి మండుచున్న వాలముతో కొట్టగనే అందరూ చెల్లాచెదరైరి. కొందరు మంటలలో పడి ప్రాణములు వీడిరి. అనేక స్త్రీలు ఓ మేఘుడా! నీవు తక్షణమే వర్షించి లంకాపురమును చల్లార్చుమని ప్రార్థించిరి.

వీరి దుర్దశ చూచి మాల్యవంతుడు విచారించెను. ఇది నిప్పుకాదు, దైవము యొక్క క్రోధాగ్ని, అథవా జానకి నిట్టూర్పులు అనిరి. కొందరు ఇది రావణుని పాపాగ్ని లంకను భస్మమొనరించుచున్నదనిరి.

కపీశ్వరుని శరీరము మహోన్నతమైనను లేశమైననూ శ్రమలేకయే గృహము నుండి గృహమునకు కుప్పించి యెగురుచుండెను. నగరమంతయూ నిప్పుమంటలు చిట, పటలను శబ్దములచే మిన్నుముట్టుచుండెను. ఈ వార్త సీత చెవిని పడెను. తలయెత్తి లంకను పరీక్షించెను. పొగతో ఆకాశముకప్పబడెను. మంటలతో అశోక వనముకూడా వేడెక్కెను. అంత సీత, అగ్నిని ప్రార్థించి, నిజముగా హనుమంతుడు శ్రీరాముని పరమభక్తుడు అతనిని రక్షించమనెను. ఆమె సంకల్పము చల్ల

నయినది. కనుక తక్షణమే అగ్నిహోత్రుడు హనుమంతునికి శీతలుడయ్యెను. పెద్దల మాటను ధిక్కరించినందుకు, దూత మాటను నిరాదరించినందుకు దాని ఫలమును రావణుడు అనుభవించెను ఒక రెప్పపాటులో నగరమంతయూ భస్మమయ్యెను. నిద్రించుచుండిన కుంభకర్ణుని గృహము, పరమభక్తుడైన విభీషణుని గృహము తప్ప అన్ని గృహములు నేల మట్టమాయెను. హనుమంతుడు లంకను పూర్తి భస్మము చేసి ఒక్క పరుగున సముద్రమున మునిగి తన వాలము నందలి మంటలను చల్లార్చు కొనెను. అంత ఒక పిల్లకోతి రూపమునుధరించి సీత వద్దకువచ్చి ఆమెకు నమస్క రించెను. ఓ తల్లీ ! మీ సెలవు ప్రకారము మీ క్షేమ సమాచారమును శ్రీరామునకు విన్నవింతును. మిమ్ములను చూచినట్లు ఒక ఆనవాలుదయచేసిన ధన్యుడనయ్యెదనని ప్రార్థించెను.

అంత సీత కొంతసేపు యోచించి, చింతించి, చూడామణిని తీసి హనుమం తుని చేతియందుంచెను. హనుమంతుడు సంగ్రహించి కన్నుల కద్దుకొని ప్రసన్నుడై సీతకు నమస్కరించెను. సీత హనుమంతుని ఆశీర్వదించి, రావణుడు నన్ను పెట్టు చున్న హింసలన్నింటిని నీవు ప్రత్యక్షముగా చూచితివి కనుక నేను ప్రత్యేకించి చెప్పునట్టి వేవియును వేరులేవు. త్వరలో నాకు శ్రీవారి దర్శనమందించమని పదే పదే నేను ప్రార్థించినటుల తెలుపుము.

ఒక్క నెలదాటక పూర్వమే లక్ష్మణ సమేతుడై లంకను ముట్టడించుమనుము. ఓ మారుతీ ఈ మూడు దినములు నిన్ను చూచి సర్వమునూ మరచి రామ వార్తలను వింటూ యెంతో ఆనందముగ వుంటిని; హృదయము చల్లబడెను. నీవు వెళ్ళిన నేనెట్లు దివారాత్రములు గడుపగలనో తోచకున్నది. జలములేని మత్స్యమువలే శ్రీవారి దర్శనము లేనందున నేను పరితపించుచున్నబాధ నా రామునకే తెలి యును. సర్వజ్ఞుడై నా రాముడు క్షణక్షణము నన్ను చూచుచునే యున్నారు. కానీ నేను శ్రీవారి నేత్రారవిందముల నేనాడు చూడగలను అని ఈ ప్రకారము పలు విధముల విలపించుచుండిన జానకిని చూచి, హనుమంతుడు ఎంతో ధైర్యవాక్యము లాడి, మరలా, మరలా, జానకి చరణములకు నమస్కరించి వెనుకకు తిరిగెను. అశోకవనము వీడుటకు పూర్వము హనుమంతుడు సింహనాదము చేసెను. అబొబ్బ చేత రాక్షసులు, స్త్రీ, శిశువులు దద్దరిల్లిరి. అంత హనుమంతుడు కాలము వృథాగడు పక క్షణములో సముద్రతీరముచేరి రాముని స్మరించి ధ్యానించి, ఒక్కతూరి ఎగి రెను. ఆనాడు కార్తీక శుద్ధ పౌర్ణమి, చల్లగ చంద్రుడు హృదయమును చల్లపరచు చుండ, రామచంద్రుని స్మరించుచూ, హనుమంతుడు సముద్రమునుదాటెను వచ్చు

చున్న హనుమంతుని దూరమునుండియే చూచుచున్న వానరులు ప్రసన్నులైరి. ముఖములు వికసించెను. వారి శరీరములు కాంతులతో నిండెను. శ్రీరాముని కార్యమును సాధించితిమని వుప్పొంగిరి. నిరాశతో మూడుదినములుగా ఎండబారిన వారి హృదయాలు చిగురులుపెట్టెను. తీరమున బారులుతీరి ఆతురతతో దగ్గరకు వచ్చుచున్న హనుమంతుని కౌగలించుకొనుటకు వుబ్బూతలూగిరి. హనుమంతుడు గట్టునకుచేరగనే లంకానగర వృత్తాంతములు సీతయొక్క క్షేమసమాచారములు అతి ఆతురతతో విచారించిరి. హనుమంతుడు సీత యోగక్షేమములు లంకయొక్క పరిస్థితిని ఉల్లాసముగ చెప్పుచూ పంపాపురమునకు వెడలిరి. అంతలో వారు సుగ్రీవుని మధువనమునకు వచ్చి దానిలో ప్రవేశించి ఫలములను భక్షించిరి.

జానకిని చూచిన తరువాత ఈ వనములో ఫలముల భక్షింపుమని పూర్వమే అనతిచ్చిన సుగ్రీవుని మాటలను స్మరించుచూ కడుపారా ఆరగించిరి. వనరక్షకులు వానరులను విరోధించిరి కానీ వానరులు వారి మాటలను లెక్కచేయకుండుటచే కాపలావాడు పరుగులెత్తి సుగ్రీవుని దగ్గరకువచ్చి విన్నవించిరి, ఆవార్తతో ఓహో! రామకార్యమునుసాధించిరను విషయమునుసుగ్రీవుడునుగ్రహించెను. జానకినిచూడక వారు ఫలమును భక్షించరు, మధువనమున ప్రవేశించరు. ఇది ఆనందోత్సవముకాన విచారించకుడని వారిని తిరిగిపంపెను. ఇంతలో వానరులు ప్రవేశించి రాజు చరణములకు నమస్కరించిరి. అంత సుగ్రీవుడు ఓ వానరులారా! ఫలమును గొనితెచ్చితిరని తలంతును అని చిరునవ్వు నవ్వగనే, వానరులు ఓనాథా మీ కృపాకటాక్షముచే కార్యమును సాధించితిమి, అయితే మహావీరుడే దీనిని సాధించెను, మా ప్రాణముల నతడే నిలబెట్టెను. నేడు మీముందు మేము ప్రాణములతోనిలిచి మాట్లాడుచున్నామన్నదానికి హనుమంతుడే కారణము. అని లంక వార్తలను, సీత యోగక్షేమములను సుగ్రీవునకు విన్నవించిరి, ఈ శుభవార్తను విని సుగ్రీవుడు మనమిక కాలహరణము చేయకూడదని, దిగ్గునలేచి శ్రీరామునివద్దకు బయలుదేరిరి.

కార్యమును సాధించుకొని వానరులు వచ్చుచున్నారని రాముడు తెలుసుకొని ఒక పెద్ద గుండుపై రామలక్ష్మణులు దూరమునుండి వచ్చుచున్న వానరులను చూచుచుండిరి. పరువులెత్తుచూ ఉల్లాసములతోవచ్చి రామచంద్రుని పాదములపై బడిరి. అంత శ్రీరాముడు మొదలు వారల యోగక్షేమముల విచారించెను. అంతట జాంబవంతుడు లేచి ఓనాథా! మీకృప కలిగినవాడే ధన్యుడు, అతడే జయుడు, అతడే సకల గుణసంపన్నుడు, వానికీర్తి మూడులోకములలో వ్యాపించును. అని హనుమంతుని అనేకవిధముల వర్ణించెను. అంత హనుమంతుడు శ్రీరామునకు నమస్క-

రించి లంక వృత్తాంతమంతయూ వివరించిచెప్పి సీతయొక్క యోగక్షేమములు ఆనంద భాష్పములతో ముచ్చటించి అతి భద్రముతో దాచితెచ్చిన చూడామణిని రాముని హస్తమునందుంచెను. అంత రాముడు హనుమంతుని కౌగిలించుకొని,

"ఓయీ వాయుపుత్రా! జానకియొక్క యోగక్షేమములు మరింత వివరించి చెప్పు"మని ఆజ్ఞాపించెను. అంత హనుమంతుడు ఓ ప్రాణనాథా! త్రికూటపర్వతము పైనున్న లంకానగరమును, దానిశోభను వర్ణించ వీలుకాదు, నాథా! సీతాదేవి అస్థి పంజరమై మీ దర్శన నిమిత్తమై క్షణములు లెక్కించుచున్నది. క్షణక్షణము మీ నామముతప్ప అన్యచింతనలేదు. కడుపుకు తిండికానీ కంటికి నిద్రకానీ ఎరగదు. మీకు అనేకపర్యాయములు నమస్కారములు తెలిపెను, లక్ష్మణుని ఎంతోతలంచెను. కంటిధారలు కార్చెను. ఆమె అవస్థ నా హృదయమును దహింపజేసెను. ప్రతిదినము తెల్లవారి సాయంకాల సమయమున రావణుడువచ్చి ఆమెను అనుచున్న శూలపోటు వంటి మాటలు నేను చెవులారావింటిని. తల్లి యేమాత్రమూ లెక్కచేయక తమ చింత యందే కృంగిపోవుచున్నది. అని రావణుడు ఆడినమాటలను వివరించెను. తక్షణమే వెళ్ళి సీతను రక్షించుమని హనుమంతుడు పాదములపైబడి ప్రార్థించెను. ఈమాటలు వింటున్న లక్ష్మణుడు ఒకప్రక్క ఉగ్రుడై మరొకప్రక్క కంటిధారలు కార్చుచూ, అన్నా ఆలస్యముచేయక వదినెను రక్షింపుడని ప్రార్థించెను. కానీ రాముడు చిరునవ్వుతో లక్ష్మణా తొందరపడకుము. అన్నింటికీ కాలము ప్రధానము. దుఃఖము లకు క్రుంగక సుఖమునకు పొంగకవుండుస్థితిని కలిగియుండవలెనని అనేకవిధముల లక్ష్మణుని శాంతివచనములతో ఓదార్చెను. అంత హనుమంతుని దగ్గరకుపిలిచి, ఓ వానరా! రమ్ము నాచెంత కూర్చొనుము, అని తన చేతులుపట్టి కపీశ్వరుని తన పాద ముల చెంత కూర్చొనబెట్టుకొని హనుమాన్! రావణుని ప్రభుత్వమెట్లున్నది, నీవు లంకను ఎట్లు దహించితివి, అని రాముడు అడుగగా, మహావీరుడు, "ఓ నాథా! మీరు సర్వజ్ఞులు, మా వానరులకు బలమేపాటిది. మేము కేవలము శాకాహారులము, చెట్టుకొమ్మలను మాత్రమే దాటగలము. సముద్రమును లంఘించుటయు, రాక్షసులను సంహరించుటయు, నగరమును దహించుటయు ఈ మొదలగు కార్యములు మీ ప్రతాపమువలననే జరిగెను. మీ నామ మహిమవలెనే చేయగలిగితిని నా ప్రయోజ కత్వము శూన్యము, మీముద్రిక నావెంట ఒకరక్షగావుండి నన్ను రక్షించినదేతప్ప నాబలముకాదు. స్వామీ మీముద్రికను చూచి ఆతల్లి ఎంత ఆనందించెనో, ఇది కలయో లేక నిజముగా నారాముడు పంపెనా? అని సంశయించెను, శాంతించెను. ఆమె శోకాగ్నియే లంకను దహించినదికానీ ఈ వానరుడుకాడు. వీనిని ఒకనిమిత్త

మాత్రంగా తమరు పంపి నాచేత ఇంతటి ఘనకార్యము చేయించితిరి. ఇది భక్త వత్సలుని పరమానుగ్రహమేతప్ప అన్యముకాదు. రామా! మీకటాక్షముండిన దుస్సాధ్యములుండవు," అని నిగర్విగా పలికిన హనుమంతుని పలుకులకు రామ చంద్రుడు ఆనందించి, సోదరా! విలంబనముచేయక సమరసన్నాహము చేయుమని లక్ష్మణునికి ఆజ్ఞాపించెను. అంత జాంబవంతుడు సుగ్రీవుడు మొదలయిన వానరుల సన్నాహములుచూచి దేవతలే సంతసించిరి.

వానరయోధులు శ్రీవారి చరణకమలములకు నమస్కరించి సింహనాదములు చేసిరి. శ్రీరాముడు వారిని కటాక్షదృష్టితో చూచి ఆదరించి ఆశీర్వదించెను. పర్వతము లకు రెక్కలు వచ్చినట్లు వానరులు బలవంతులై విజృంభించి ప్రయాణముసాగించిరి. వారలు ప్రవేశింపగనే అనేక శుభశకునములుకనబడెను. వారు బయలుదేరగనే, అశోక వనమందున్న జానకిమనసున ఒకవిధమైన శుభభావము రేకెత్తెను. అనేక శుభశకున ములు కంటబడెను. రావణునకు అశుభములు ఎదురయ్యెను. జాంబవంతాదులు పర్వ తములను వృక్షములను తమఆయుధములుగా ధరించి స్వేచ్ఛానుసారముగ గంతులు వేయుచు భూమి దద్దరిల్లునట్లు కేకలువేయుచూ వెడలిరి. మధ్యమధ్య రామచంద్రప్రభు వుకుజై, అని నాదములుచేసిరి.ఇక లంకలో ప్రతిరాక్షసుడు ముందుకు ఏమికానున్నదో అని ఎవరికి వారు లోలోన దిగులుపడి జరిగిన ప్రమాదమును తలంచుచూ, ముందింకెట్టి ప్రమాదము వాటిల్లునోఅని కృంగి కుములుచుండిరి. రాక్షసుల వంశము నకు వినాశముఆసన్నమయినదని దృఢముచేసుకొనిరి. కానీ రావణునికి భయపడి రాక్షసులు వారు గుసగుసలు జరిపిరి.

# విభీషణ శరణాగతి

నగరమునకు రామదూతయైన వానరుడు వచ్చి, ఇంతటి పని చేసెకదా! ఇక ప్రభువే వచ్చిన యెంత అనర్థము పుట్టునో అని, ఇంతవాడు దూత అయినపుడు ప్రభువెంతటివాడో కదా! ఈ ప్రకారము రాక్షసులు యెక్కడ గుంపుచేరినా ఈ మాటలే ముచ్చటించుచుండెడివారు.

వారి మాటలు చెలికత్తెలు విని మందోదరికి చెప్పిరి. ఆమె మనసు వ్యాకులత జెందెను. ఇది నిజమేనని తాను కూడా తలంచి, యేకాంతముగా తన భర్త ఉల్లాసముగా నున్న సమయమును గమనించి చేతులు జోడించుకొని "నాథా! సర్వజ్ఞునితో విరోధము వలదు. రాముడు సామాన్య మానవుడుకాదని నీవే అనేక పర్యాయములు తెలిపియుంటివి; శూర్పణఖ ముక్కు చెవులు కోసినపుడే నీ సైన్యమేమి చేయలేక పోయెను. కేవలము ఒక రామలక్ష్మణులనే లక్షలాది రాక్షసులు కదిలించలేకపోయిరి. ఇపుడు మహాబలవంతులైన వానర వీరులు తోడుగా లక్షలాది మంది వెంటవుండ, మన రాక్షసులు యేమి చేయగలరు? దూతనే బంధించలేని దౌర్భాగ్యము మన రాక్షసులది. దూతయే యింతటి కార్యమును ఒనర్చినపుడు ఇక లక్షలాది వానరులు యెంతైనా చేయగలరు. కాన, నా ప్రార్థన మన్నించి, మంత్రి సహాయముతో, లేక, మీ సహోదరుడైన విభీషణుని సహాయమునిచ్చి రాముని భార్యను పంపివేయుము. ఆ జానకి సామాన్యమయిన స్త్రీ కాదు. మహాపతివ్రత; దివ్యశక్తి స్వరూపిణి. అట్టి వారిని హింసించుట నీకు మంచిది కాదు. నా మాట విని, సీతను రాముని కప్పజెప్పుము. నీకును మన రాక్షస జాతికిని, శుభము కలుగును. సర్పములు మండూకములను వలే, రామ బాణములు రాక్షసులను మ్రింగివేయును. నీ మొండిని విడచి, అహంకారమును త్యజించి, హఠమును దూరమునెట్టి, సీతను రామునకు సమర్పించుము. అతనితో శీఘ్రము సంధిచేసుకొనుము."

అని పాదములు పట్టి ప్రార్థించుచున్న మందోదరిని మూర్ఖుడయిన రావణుడు

చూచి, ఫక్కున నవ్వి, "ఓసీ! అబలా! స్త్రీలు సహజముగనే భయస్వభావులు. వారి మాటవలన, శుభములు అశుభములగును. వానరులు మన గుమ్మమునకు వచ్చిన మన రాక్షసులు వారిని భక్షించకుందురా. నాపేరు విన్నంత మాత్రమున దేవతలే గడ గడ వణకుచుండ నీకెందుకింత భయము, లోపలకు పొమ్మ" అని గర్జించి మూర్తీభవించిన దురభిమానముతో సభలో ప్రవేశించెను.

అతను వెళ్ళగనే, మండోదరి ఆహా! విధికృతము విపరీతముగ నుండెను. నాకేమి దుర్గతి వచ్చునో కదా? నేనేమి చేయగలను అని పడకగదికివెళ్ళి అనేక విధములు విచారముతో పరుండెను.

సభలో ప్రవేశించిన రావణుడు మంత్రులను పిలిచి "ఓయీ! మీ మీ అభిమతములు తెలుపుడు. రామదూత వచ్చి గావించిన దుర్గతి మీకు తెలిసినది కదా, ఇక ముందు ఏమి కానున్నదో మనము ఏమి చేయవలెనో భయమును వీడి అభిప్రాయములను తెలుపు"దని కోరగా, మంత్రులు ఒకరిముఖములు ఒకరు చూచుకొంటూ నవ్వి వూరకుండిరి. ఆనాడు కుంభకర్ణుడు మేల్కాంచెను. వారు సభకు వచ్చి అరే, మూడు లోకములలో నావంటివారు లేరు, నా యెదుట నిలువబడదగినవాడు కలడా, యెవ్వడో చిన్న వానరుడు లంకలో ప్రవేశించి గృహములు భస్మము గావించెనట. ఛీ, ఛీ, మీరందరూ యెట్లు వానిని వదలితిరి అని పండ్లు పట పట కొరుకుచు ఇంటికి వెళ్ళెను. ఇంతలో అతికాయుడు లేచి, రాజా! మీ ఆజ్ఞానుసారము గావింతుము. మీ కటాక్షముండిన లోకములో మనుజులను వానరులను నిశ్శేషముగ సంహరించెదను, పెక్కుమాటలేల? అని హుంకరించెను. ఇంతలో కాయరూపుడగు మేఘనాధుడు లేచి, మహాప్రభూ! నా ప్రతాపము లోక విఖ్యాతము. దేవతలే నా స్వాధీనులు, వారలకంటె బలవంతులు లోకమున లేరు కదా? ఇక నరవానరుల మాట జెప్పనేల అని ప్రగల్భము లాడెను.

ఈ విధముగా కుంభకర్ణుని పుత్రులైన పాషండులు, పొగరుపోతులు, కుంభినీకుంభులు మిగిలిన ప్రకంపనుడు ఇత్యాది వీరులు గర్జించిరి. మధ్యలో మహోదరుడు లేచి తొడలు కొట్టుకొనెను. పండ్లు పట పట కొరికెను. ఇట్లు ఆ సభలో ఒకరి తరువాత ఒకరు వారి వారి ప్రతాపములు ప్రగల్భములు, పలుకుచుచూ లోలోన భయపడుచూవున్ననూ రావణుని ప్రసన్నునిగావించు నిమిత్తమై ఈరీతిగా ప్రతాపముతో పలికిరి.

ఇంతలో మకరాక్షుడు లేచి సార్వభౌమా! నేను బ్రాహ్మణ వేషము ధరించి రామలక్ష్మణులను భోజనమునకు పిలిచి వారు గృహమున ప్రవేశించగనే, వారిని

గట్టిగ పట్టుకొనెదను. ఈ ఉపాయము మీకిష్టమైన నేను ఈ ప్రయత్నము చేయు దునని పలికెను.

ఈ విధముగ మంత్రులుచెప్పిన వాక్యములు రావణునకు హితముగనుండెను. ఇంతలో విభీషణుడు సభలో ప్రవేశించి, రావణునకు నమస్కరించి ఆసనముపై కూర్చొనెను. అంత, రావణుడు తమ్మునిచూచి, సోదరా! ఈ సరవానర విషయములో నీ అభిప్రాయమేమని అడిగెను. అంత విభీషణుడు, "కృపాళూ! నాకు తోచినరీతి చెప్పెదను. తాము సావధానముగా వినగోరుచున్నాను. నన్ను మన్నింపుము. ఓనాథా! మీరు సద్గతిని, సత్కీర్తిని, శుభములను, సుఖమును గోరినయెడల పరస్త్రీ ముఖ మును చూడగూడదు. పదునాలుగు భువనములకు అధిపతియగువాని నొకజీవుడేమి చేయగలడు? ఎదిరించి జీవించునా? అట్టివారికేమి శుభములుకలుగును. ఎన్ని గుణము లున్ననూ లోభగుణమున మనుజుడు రాణించడు. రాజా! కామక్రోధాదులు, అధమ మార్గమునకు ద్వారములు.

శ్రీరాముడు సామాన్యుడుకాడు, కాలునకు కాలుడు, అనామయుడు, అజాడు. అట్టివారితో వైరమువిడచి వారిని సేవించుట మంచిది. వారిసతియైన జానకిని వారికి సమర్పించుము, వారి కటాక్షమును సంపాదించుము. మీ చరణములకు నమస్కరించి మాటిమాటికీ విన్నవింతును" అని ఈప్రకారముగ విభీషణుడు చెప్పిన వచనములకు మాల్యవంతుడను వృద్ధమంత్రి సమ్మతించెను. అతను లేచి, ఓ మహారాజా! మీ తమ్ముడు చెప్పిన మాటలు నీతియుక్తములు, వానిని మీరు మన్నించుట శ్రేయస్సు అని తెలిపెను.

వీరి యిరువురి మాటలకు రావణుడు వుగ్రుడై మీరిరువురు మూర్ఖులు, మీ రెంతగా పరమశత్రువులను శ్లాఘించెదరు. మీరీసభలో వుండతగినవారుకారు, అని వీరిని సభనుండి వెడలగొట్టుడు అని ఆజ్ఞాపించెను. అంత మాల్యవంతుడు దిగ్గున గద్దెదిగి గృహమునకు నిష్క్రమించెను. పిమ్మట విభీషణుడు అన్నకు నమస్కరించి చేతులు జోడించుకొని, "రాజా! ప్రతి మనుజుని హృదయములో, సుమతియూ, కుమతియూ నివసించునని వేదశాస్త్రములు చెప్పును. సుమతి యుండినపుడు సకల సంపదలుండును, కుమతి యుండినపుడు సకలవిపత్తులు కలుగును. మీ హృదయ ములో కుమతియుండును. అందుచేత మంచిమాటలు, హితవు గోరినవారిని మీరు శత్రువులుగ భావింతురు. రాక్షస కులమునకు కాళరాత్రివంటి సీతమీద మీకు దయ కలదు; అదియే మీ కుబుద్ధి. నేనొక వరముకోరుచున్నాను. నామాట మన్నించి శ్రీరా మునికి సీతను సమర్పించుడు, మీకు సకలకల్యాణములు కలుగును" అనిప్రార్థించగా,

రావణుడు దిగ్గనలేచి, ఓరీ మూర్ఖుడా! నీకు మృత్యువు సమీపించినది. నా వలన నీవింతకాలము జీవించియుంటివి. ఇపుడు నీకు శత్రువులు ఉపకారులా? వారి మీద నీకింత అభిమానమెందులకో అర్థముకాకున్నది. నా భుజబలముచేత సాధింప బడని మనుజుడొకడు లోకమునకలడా? నా అన్నముతింటూ, నా గృహమున నివశించుచూ, నా నీడన జీవించుచు, శత్రువులను భూషింతువా? కండలనుపెంచిన కూటికుండకు చేటు వచ్చినట్లాయెను. నీవా తపశ్శాలులవద్దకు పోయి నీ నీతులను వారికి చెప్పుము. అని పాదములచెంతకూర్చున్న తమ్ముని శిరస్సును కాలితో తన్నెను. ఎన్ని తన్నినను విభీషణుడు మాటిమాటికి రావణుని పాదములుపట్టి, "ఓ రాజా! రాముడు సత్యసంకల్పుడు, నీకువలే నీ అనుచరులకుకూడా కాలము సమీపించినది. నేను ఇపుడేవెళ్ళి శ్రీరాముని శరణుజొచ్చెదనని నా దోషములేదు," అనిచెప్పి విభీషణుడు వెడలెను.

రామా, రామా అని ఉచ్ఛ్వేశ్వారుచూ సముద్రమునుదాటి ఇవతలి ఒడ్డునకు వచ్చెను. అతని యాగమనమునుచూచి అతడు రావణుని దూతఅని తలచి వానరులు సుగ్రీవునితో చెప్పిరి. అంత విభీషణుని కటకములో ప్రవేశింపకుండ నిరోధించిరి. అతని వృత్తాంతమును శ్రీవారికి విన్నవించిరి. ఓ రామా! రావణుని తమ్ముడు మిమ్ములను దర్శించుటకు వచ్చెను అని సుగ్రీవుడు తెలుపగనే, రాముడు సుగ్రీవా నీ అభిప్రాయమేమి అని ప్రశ్నించెను. అంత సుగ్రీవుడు రాక్షసుల మాయలను తెలిసికొనుట కష్టము. వారు కామరూపులు, ఎందులకు మీవద్దకు వచ్చెనోతెలియదు, నాకును అంగదునకు మిత్రభేదము చేయుటకు వచ్చినట్లున్నది. వానిని తక్షణము బంధించుట మంచిది అని సుగ్రీవుడు తెలిపెను. "ఓ సఖుడా! నీమాట సత్యము. శాస్త్రానుసారము పలికితివి. అయినను నా ప్రతిజ్ఞ వినుము. నీమాటకుప్రతికూలముగ నుండును; శరణాగతులను రక్షించెదనని నా ప్రతిజ్ఞ. శరణాగతులు మనకు శత్రువు లయినను వారిని విడిచిపెట్టుట యనుచితము కోటి బ్రహ్మహత్యా పాపము చేసిననూ నన్ను శరణుజొచ్చినఎడల నేను వానిని విడిచిపెట్టను. ఒకవేళ మనకు మిత్రభేదము చేయుట కతనిని మనవద్దకు రావణుడు పంపినను, అంతమాత్రమున మనకు వచ్చిన భయమేమియూ లేదు.

ఒకవేళ భయపడి నాశరణుజొచ్చినఎడల నా ప్రాణసమానముతో వానిని రక్షింతును కాన త్వరగా అతనిని లోనికి గొనిరమ్ము" అని సుగ్రీవునకు ఆజ్ఞఇచ్చెను. అంత హనుమంతుడు ఒక్క క్షణమునవెళ్ళి విభీషణుని తోడ్కొనివచ్చి రామునిముందు పెట్టెను. రాముని ముఖారవిందమును గాంచగనే, ఆనందబాష్పములు నేత్రమునుండి

ధారలై ప్రవహించెను. విభీషణునికి నిలువలేకపోయెను. నాథా! అవిరాముని పాదముల పైబడి రక్షింపుము, రక్షింపుము. నేను తమదాసుడనుఅని మొరపెట్టుకొనెను. ఓదేవ రక్షకా! రాక్షస వంశములోపుట్టి, రాక్షసుల పరిపాలించు రావణుని తమ్ముడను, నాపేరు విభీషణుడు. నేను మహా పాపసంభవుడను, తమోగుణప్రధానుడను. గుడ్లగూబ చీకటిని ఆశించినటుల, నేను తమస్సునే ఆశింపువాడను. మీరు శరణాగత రక్షకులు, మీ పొత్తుకోరి వచ్చితిని. మీరుతప్ప నాకు మరొకరుక్షకులు లేరు అని ఈప్రకారము శ్రీరామునిముందు నిలిచి దీనుడై అతివినయముతోప్రార్థించు విభీషణుని చూచి రాముడు ప్రసన్నుడై అతనిని దగ్గరకు చేర్చుకొని వెన్ను నిమురుచు, జాలి వచనములతో అనేక శాంతివచనములాడి "నాయనా! విభీషణా! విచారించకు. నా దర్శనముచేత నీ నిశాచరత్వము నశించెను, నాకు లక్ష్మణ సుగ్రీవాదులెట్టివారో నీవునూ నాకు అట్టివాడవు, అని రాముడు పలుకగనే విభీషణునకు భయముపోయెను. అంత శ్రీరాముడు ఓ లంకేశా, మీ పరివారమంతయూ కుశలమేనా! అనేక కోట్ల రాక్షసులమధ్య నీవెట్లు జీవించితివి, నీభక్తి ప్రపత్తులనెట్లు నిలబెట్టుకొంటివి అని అనేకవిధముల ధర్మ, కర్మలగురించి శ్రీరాముడు ప్రశ్నించెను.

అంత, విభీషణుడు, ఓ రఘునాథా! మీరు ధనుర్బాణములుధరించి హృదయములో ప్రవేశించువరకూ కామాదుల బాధ తగిలియుండును. ఎంతవరకు శ్రీవారి స్వరూప జ్ఞానోదయము కలుగదో అంతవరకే కామక్రోధాదులు రాగద్వేషాదులగు నట్టి గుడ్లగూబలకు తగిన అజ్ఞానాంధకారము జీవుల హృదయముల నావరించియుండును. ఓనాథా! మీ చరణముల దర్శించుటచేతను, స్పర్శించుటచేతను నాజన్మ సఫలమైనది. నా భయశోకములు నశించెను. నేనేనాడూ శుభకర్మల నాచరించియుండ లేదు. అట్టి మీరు నన్ను కౌగిలించుకొంటిరి. యేమి నా భాగ్యము, అని నయనముల నుండి ఆనందబిందువులు జలజల కార్చుచుండు విభీషణునిచూచి,

విభీషణా! నీవు సకలగుణ సంపన్నుడవు, లేకున్న నా దర్శన స్పర్శన సంభాషణలు కలిగి యుండెడివికావు, అని శ్రీరాముడు పలుకగనే, విభీషణుడు అపారమగు సంతోషమును బొందెను. పునః పునః అతడు శ్రీరాముని పాదములపై బడుచుండెను. అంత శ్రీరాముడు విభీషణా నీవుత్వరితముగావెళ్ళి, సముద్రస్నానము గావించిరమ్మని ఆజ్ఞాపించెను. విభీషణుడు స్నానమునకు వెళ్ళెను. ఇంతలో వానరశ్రేష్ఠుడైన హనుమంతునిపిలిచి నీవువెళ్ళి కొంత సముద్రజలమును గొనిరమ్మని ఆజ్ఞాపించెను. విభీషణుడు స్నానమాచరించి రామపాదములపై వ్రాలెను అంత హనుమంతుడు తెచ్చిన సముద్రజలమును శ్రీరాముడు తన హస్తమున నిడుకొని

చెంత కూర్చొనియున్న విభీషణుని శిరస్సుపై ప్రోక్షించి నీకు లంకారాజ్యమున కభిషేకము చేసితినని పలికెను. అంత విభీషణుడు రామా నాకారాజ్యమెందుకు, తమ పాదారవిందములయందు స్థానము లభించిన చాలునని పలుకగా, లేదు నీవంగీకరించక తప్పదని, అని రాముడు శాసించెను. తమ ఆజ్ఞ శిరసావహించానని విభీషణుడు చేతులుజోడించి లేచి నిలిచెను. అంత వానర వీరులు తమకుతాము ఆశ్చర్యపడుచూ రాముని శరణాగతవత్సలతను తలంచుచూ లోలోన ఆనందించిరి.

శ్రీరాముడు సేనాధిపతిని చూచి, "ఓ కపీశా ! ఈ విభీషణుని మీతో చేర్చుకొనుడు, ఇతనిని వేరుగాభావించక మీ సఖునిగా భావించుడు. ఇతడు నావాడు." అని ప్రియవచనములు పలికెను.

ఇంతలో అందరూ ప్రయాణమై, సముద్ర తీరమునకు వెళ్ళిరి. అంత ఆ సముద్రమును చూచి రాముడు, దీనిని దాటుటెట్లని ప్రశ్నించగనే, అనేక వానరులు అనేక విధముల జవాబులిచ్చిరి. విభీషణుడులేచి, "ఓ నాథా ! సముద్రుడు మీకుల గురువు; సగరపుత్రులవలన అది పుట్టెను. మీరు సంకల్పించిన, యెట్టి ప్రయాస లేకుండ వానరులు దానిని దాటగలరు," అని చెప్పెను.

ఇంతలో రావణుడు పంపిన దూత, విభీషణుని కంటబడెను. అతనిని తీసుకొని రాముని చెంత నిలబెట్టెను. అంత రాముడు యెట్టి జవాబును ఇవ్వకుండుటచే, వానరులు వానిని బంధించి సుగ్రీవుని కడకు తీసుకొని పోయిరి. అచట సుగ్రీవుడు వాని అంగముల ఛేదింపుడు అని ఆజ్ఞ యొసగెను. అంత వానరులు, వానిని అనేక బాధలుపెట్టిరి. ఆ బాధలను భరింపలేక, వాడు మొరబెట్టుకొనెను. "ఓ వానరులారా ! రామునితోడు, నాకు ముక్కు చెవులు మాత్రము కోయక విడుపుడు" అని ప్రార్థించెను. వాని మొర లక్ష్మణుడు విని, వానిని అక్కడికి గొనిరమ్మని ఆజ్ఞాపించెను. అతనితో లక్ష్మణుడు శాంతవచనములాడి, దూతను హింసించుట మంచిది కాదని తెలిపి, ఒక ఉత్తరము వ్రాసి, వానిచేతికిచ్చి, "ఓరీ ! ఈ యుత్తరమును రావణునికిచ్చి వేయుము, ఈ నోటిమాటలను వానితో చెప్పుము : "ఓరీ కులఘాతకుడా ! నేటికైననూ నీ హృదయమును మార్చుకొని రాముని పాదములపై బడుము; క్షమించగలడు. ఊరక వంశమునే నాశము చేసుకొనకుము ! లేకున్న నీ కాలము సమీపించినది," అని కఠినముగా లక్ష్మణుడు చెప్పి వెనుకకు వెళ్ళమని ఆజ్ఞాపించెను.

అంత ఆ దూత బ్రతికితినని సంతసించి "రామచంద్ర ప్రభువుకు జై" అని నామ రూపమును స్మరించుచూ లంకకు చేరి జరిగిన వృత్తాంతమంతయూ తెలిపి,

రాముని సుందర విగ్రహమును అనేక విధములు వర్ణించి లక్ష్మణుడు అందించిన జాబును రావణునిచేతి కిచ్చెను.

రావణుడు విభీషణుని క్షేమసమాచారములు విచారించెను. కానీ ! వానికి మృత్యువు సమీపించినది. యవధాన్యమునకు పురుగు పుట్టినట్లు ఆ నిర్భాగ్యుడు లంకారాజ్యమును విడిచి నా శత్రువును శరణజొచ్చెను.

"ఓరీ శుకా! ఎట్లు నీకు వారి దర్శనమయ్యెను. నా తేజోబలములను వారికి విన్నవించితివా ? వారి తేజోబలములను వివరముగా తెలుపుము" అని రావణుడు దూతను అడిగెను.

వాడు చేతులు జోడించుకొని యిట్లు విన్నవించెను, "ఓ నాథా ! మీరు కటాక్షించి శాంతముతో నా మాటలను వినుడు. ఎపుడు మీ సోదరుడు శ్రీరామునితో సఖ్యము చేసుకొనెనో, అపుడే నీ తమ్మునకు శ్రీరాముడు లంకా పట్టము కట్టెను. నేను తమ దూతనని తెలిసికొని వానరులనేకములు నన్ను బాధించిరి. నేను రాముని మీద ఒట్టు బెట్టినందున నా ముక్కు చెవులను భేదించక విడిచిపెట్టిరి.

వేయి ముఖములతోనయినను నేనా వానర బలమును దళమును వర్ణించలేను; రంగు రంగుల వానరులును, జాంబవంతులును కలరు. వారిని చూచినను వారిని తలచినను, భయము కలుగును. నీ కొమారుని చంపి పట్టణమును దహించిన వానర దొక్కడు, ఏపాటి బలము వానికి కలదు ! శ్రీరాముని ప్రతాపమువలన అత్యల్పుడగు వానరుడు సహితము మహాబలవంతుడయ్యెను. అనేక నామములు కల వానర యోధులు కలరు. అనేక యేనుగుల బలము ఒక్కొక్కనికి కలదు. ద్వివిద, మైంద, నీల, నల, అంగద, వికట, దధిముఖ, కేసరి, కుముద, గజ, గవాక్ష, జాంబవంత, ఈ మహాబలులు సేనాధిపతులు, వారందరూ సుగ్రీవునితో సరిసమాన బలవంతులు. ఇంకను వారితో సరిసమాన బలవంతులైన వారు లక్షలకు కలరు. లెక్కకెక్కువైన వానరులను లెక్కించ సాధ్యముకాదు. వారందరూ అతి పరాక్రమవంతులు, తృణమువలే మూడు లోకములను క్షణములో సాధించగలరు, జయించగలరు.

ఓ ! రాజా ! వారు పదునెనిమిది పద్మముల వానరులని వినియుంటిని. వారికి వేరు వేరు సేనాధిపతులు కలరు. ఓ ! రాజా ! యుద్ధములో నిన్ను జయింపలేనని అధైర్యపడిన వానరుడొకడు వారిలో గనపడడు. ఈ పట్టణముపై దుముకుటకు సిద్ధపడి చేతులు నలుపుకొనుచున్నారు. ఇంతవరకు శ్రీరాముని ఉత్తరువులేదు. సముద్రుడు మార్గమిచ్చినను లేకపోయినను వారు సముద్రమును పాషాణములతో గట్టి వారి కార్యమును సాధించుటకు సిద్ధముగనున్నారు. రావణుని ఒక్కక్షణములో నలిపి

భస్మము గావింతుమని వానరులు అనేక విధముల పండ్లు కొరుకుచున్నారు వారి గర్జనలు, వారి వీరాలాపములు వినిన భయము కలుగును. రావణుని పేరు వినగనే వృక్షములు వేళ్ళవరకు భూమినుండి లాగి, బంతులవలే యేసరలేయుచున్నారు లంకా నగరమును భక్షించుటకు వ్యుత్పాతలూగుచున్నారు. వానరభల్లూకములేమహాశూరులు.

అందులకుతోడు శ్రీరాముడు యజమానుడు. కోటి కాలాంతకులను ఒక్క-క్షణమున మ్రింగగలరు. ఇక, శ్రీరాముని తేజోబలమును బుద్ధిని శతసహస్ర శేషులు సహితము వర్ణించి చెప్పలేరు. ఒక్క- బాణముతో సముద్రమునే శోధించ గలడు. నీ తమ్ముడు పూర్వము చెప్పినటుల, అతడు పరమ కృపాళుడు."

అని శుకసారణుడు చెప్పిన వచనములను రావణుడు విని, ఫక్కు-న నవ్వి, ఓరీ ! అతడింత బుద్ధిమంతుడా ? అతని సైనికులు వానరులా, విభీషణుడు పిరికి పంద. వాని మాటలను నమ్మి నీవునూ ఆ మూర్ఖుని వర్ణించుచున్నావా ? ఆకోతుల బలతేజోసంపన్నతలను గురించి ఇంత వర్ణించుటలో అర్థములేదు. నీ బకవాదము చాలింపుము; ఇంత బలవంతులా ఈ వానరులు ! ఛీ, ఛీ ! చాలు ! చాలు ! ఇంతకు పూర్వమే నేను సుగ్రీవుని బలమును గురించి వినియుంటిని. పిరికి పందయైన విభీషణుడు మంత్రియయియుండ శ్రీ విజయ విభూతులు శ్రీరామునకు లభించవు.

ఈ ప్రకారము రావణుడు పలికిన పలుకులకు శారణుడు లోలోన ఈతని విపరీత బుద్ధికి చింతించి చేతులు జోడించుకొని నిలిచెను. అంత రావణుడు సారణుడు అందించిన ఉత్తరమును వెగటుగా నవ్వుచూ చించి చూచెను. తరువాత దాని మంత్రి చేతికి అందించి, "ఓరీ ! మూర్ఖుడా ! పెక్కు- మాటలవలన ప్రయోజనము లేదు ! తీతువ పక్షి తన పిల్లలను రక్షించుటకు బాదములను మీదికెత్తి ఆకాశము పడకుండా కాపాడును. ఈ తపశ్శాలురు, ఈ అర్భకులు మాటలతో బెదరించుచుండిరి. మాటలతో నన్ను జయించగలరా;" అని గర్జించుచున్న రావణుని చూచి, శుకుడు "ఓ నాథా ! ఇదియంతయూ సత్యము. ఆ ఉత్తరములో వ్రాయబడిన సంగతులను లెస్సగా విచారించి నీ అభిమానమును విడచిపెట్టుము నా మాటను మన్నింపుము; శ్రీరామునితో వైరము జాలింపుము అతని స్వభావ మతికోమలము, అతడు త్రిలోకాధిపతి ! నీవు అతనిని సమీపించినయెడల అతడు నిన్ను రక్షించును, నీ అపరాధములను మన్నించును. జానకిని అతనికి సమర్పించుము. నా విన్నపములను మన్నింపుము" అని అనేక విధములుగా బ్రతిమిలాడెను. రావణుడు విని కండ్లెఱ్ఱ చేసి "నేను అపరాధిగాయెంచితివా?మూర్ఖుడా! నేను వెళ్ళి ఆ అర్భకునిశరణుజొచ్చుమని పలికితివా? ఎంతటి ధైర్యము!" అని గర్జించి తనకాళ్ళతో అతనిని తన్నెను.

అంత ఆ శుకుడు లంకను త్యజించి రాముని చరణముల వద్దకు వెళ్ళెను. అంత వానరులు తిరిగి ఈ దూతనుచి అనేక విధముల ఉద్రేకమును అణచుచూ కొని రామాజ్ఞ కొరకై వేచిరి. సుగ్రీవుడు ఈ వచ్చిన శుకుని రామసన్నిధికి గొంపోయిరి. శుకుడు రాముని పాదములపై బడి తన వృత్తాంతమంతయూ చెప్పుకొని విభీషణునివలే, తానునూ శరణు జొచ్చుచున్నాననియు తనను కాపాడవలెననియు పరి పరి విధముల ప్రార్థించెను. అంత శ్రీరాముడు కరుణస్వభావుడు కనుక తక్షణమే వానరవీరులను రప్పించి శుకుడు కూడా మాలో ఒక సోదరునిగా భావించుడని ఆజ్ఞాపించి శుకుని మన్నించెను. శుకుడు ధన్యుడనైతినని శ్రీరాముని అనేక విధముల వర్ణించెను శ్రీరామలక్ష్మణులకు నమస్కరించి ధన్యు డాయెను.

అంత లక్ష్మణుని పిలిచి ధనుర్బాణములు తీసికొని రమ్మని అగ్నిబాణముచే సముద్రుని శోషింపజేయుదును. మూర్ఖులకు వినయమును, కుటిల స్వభావులకు ప్రీతియు, స్వాభావిక కృపణులకు నీతిబోధనలను, మమకారము కలవారలకు జ్ఞానమును, లోభులకు వైరాగ్యములను, కోపస్వభావులకు శాంతమును, కామాతురలకు హరికథలును, వూషరక్షేత్రమున బీజములు చల్లిన విధమున వ్యర్థములు." ఈ ప్రకారము శ్రీరాముడు పలికి ధనుస్సు నెక్కుపెట్టి బాణమును సంధించెను.

శ్రీరాముని పరాక్రమమును చూచి లక్ష్మణుడు భయపడెను. రాముడు బాణములను సంధించునప్పటికి సముద్రునకు గుండెలు వేడి పుట్టెను. మీన మకరములు మొదలగునవి వ్యాకులపడెను. సముద్రుడు భయపడెనా అన్నట్లు జలము శోషించెను. సముద్రుడు రామచరణములకు నమస్కరించుచున్నాడా అన్నట్లు అలలు ఒక దానిపై నొకటివచ్చి శ్రీరాముడు కూర్చున్న స్థానమునకువచ్చి పాదములస్పర్శించెను.

అంత యొక అశరీరవాణిలో, "నాథా! మీ కటకములో నల నీలులని ఇరువురు సేనాపతులు కలరు. చిన్నతనములో వారికి ముని శాపము దగిలెను. ఆ శాపమిప్పుడు ఆశీర్వచనములయ్యెను. పూర్వపు వృత్తాంతము ఆలకించుడు" అని సముద్రుడే అశరీరవాణిగా ఈ క్రిందరీతిగా తెలిపెను. "నదీతీరమున ఋషుల ఆశ్రమము కలదు. చిన్నతనములో వీరా ఋషులు తపస్సుచేయుచుండినపుడు వారి సాల గ్రామములు అపహరించి వాటిని నీటిలో విసరివేయుచుండిరి అపుడు ఋషులు కోపించి వారిని శపించిరి. ఓయీ! బాలకులారా! మీరునీటిలో వేయుచుండిన వస్తువు లన్నియూ నీటిపై తేలి కదలకయుండుగాక. నీరు ప్రవహించినను వస్తువులు మాత్రము నీటిపై తేలియాడును గాక, అని శపించిరి. కాన వారు నీటిలో వేసిన ప్రతి రాయియూ తేలియాడును. అందులో మీ నామము తేలియాడునట్లిది కనుక

దానిపై మీ నామము వ్రాసి వేయించుము. పర్వతములుకూడ నాపై తేలియాడును. నేనుకూడా సహాయము చేతును. సత్యాన్వేషణలో ప్రకృతిసహాయపడగలదు" అని చెప్పగా, శ్రీరాముడు సంధించిన బాణము వెనుకకు తీసుకొనుటకు వీలుకానందున ఒక వనము వైపున ప్రయోగించెను. ఆ బాణ ప్రభావము వలన ఆ ప్రదేశము జల శూన్యమయ్యెను. ఆ ప్రదేశము ప్రకృతి సంపదలతో నిండెను.

మంత్రులను పిలచి, విలంబనము చేయక సేతువు నిర్మించుడని ఆజ్ఞాపించెను. హనుమంతుడు రామా, తమనామమే జీవులకు భద్రమైన సేతువు. దానికి మించి నది మరేమున్నది అని పలికెను. జాంబవంతుడు, ఓ నాథా! మీ ప్రతాపమనునట్టి బడబాగ్నిచే ఈ సముద్రము శుష్కించును. యుద్ధమున మాచే సంహరింపబడిన రాక్షసుల భార్యల దుఃఖముచే తిరిగీ ఈ సముద్రము నింపబడును. కనుక వారి జలము ఉప్పుగ నుండును అని చేతులు జోడించి చెప్పెను. శ్రీరాముడు ఈ మహ వీరుల వచనములువిని చిరునవ్వు నవ్వెను.

జాంబవంతుడు నలుని, నీలుని బిలిచి అశరీరవాణిగా సముద్రుడు చెప్పిన మాటలను వారికి మరొకతూరి జ్ఞప్తికి తెప్పించెను. శ్రీరాముని ధ్యానించుచు పర్వ ములు, గుండ్లు, బండలు తెచ్చి సముద్రమున పడవేయుడు, అని ఆజ్ఞాపించెను; వానరులు ఆమాట వినగనే గంతులువేయుచు కొండలు చెండువలె యెత్తి, రామా, రామా అంటూ బారులుదీరి సాగరమున వేయదొడగిరి; మధ్య మధ్య పెద్ద పెద్ద వృక్షములు వేరులవరకు పెకలించి సముద్రమున దొర్లించిరి. ఆనా డంతయూ విశ్రాంతిలేక ఆహారము సహితము తీసుకొనక, వానరవీరులుతెచ్చిన పర్వతములను గుండ్లను నలుడు, నీలుడు, తమహస్తములతో అందుకొని దారినినిర్మించుచూవచ్చిరి.

ఆనాడు పూర్తి పదునాలుగు యోజనములు సేతువు నిర్మించిరి. రాత్రి బాగా విశ్రాంతి తీసుకొని, తెల్లవారి బ్రహ్మమహూర్తముననేలేచి, శ్రీరామ ప్రభువునకు జై అని గర్జించి నలుమూలలా పరుగిడి, పర్వతములనుతెచ్చి తీరమున బడవై చిరి. ఆనాడు ఇరువది యోజనములు మూడవ దినము ఇరువదియొక్క యోజన ములును, నాల్గవ దినమున ఇరువదిరెండు యోజనములును ఐదవదినమున ఇరువది మూడు యోజనములును, మొత్తము నూరు యోజనములు అయిదుదినములలో నలుడు, నీలుడు అత్యంతఉత్సాహముతో విశ్రాంతి అన్నది ఆశించక రామకార్యము ప్రధానమను లక్ష్యముతో రాముని స్మరించుచూ దర్శించుచూ, పూర్తిగావించిరి.

# లంకా ప్రవేశము

తాను సంకల్పించుకొన్న నూరు యోజనములు సేతువు పూర్తి అయినదని సుగ్రీవునిద్వారా శ్రీరామునికి తెలిపిరి. ఆ వార్త విని రామలక్ష్మణులు సంతసించిరి. వానరులకు తెచ్చిన పర్వతములను యెక్కడవి అక్కడ పడవేసి విశ్రాంతి తీసుకొనుడని శ్రీరాముడు సుగ్రీవునితో ఆజ్ఞ పంపెను. రామాజ్ఞ ప్రకారము, ఇంకా పర్వతములు, గుండ్లు తెచ్చుచున్న వానరులకు సుగ్రీవుడు తెలిపెను. ఆ సమయమున హనుమంతుడు అతిదూరమునుండి ఒక పర్వతమును తీసుకొనివచ్చుచుండెను. అతను శ్రీరామ ఆజ్ఞను విని అది ఆ బృందావనము వద్ద పారవేసెను. అంత ఆ పర్వతము గొల్లున యేడ్చెను. అయ్యో, నేను రామకార్యములో పాల్గొనక పోతిని కదా అని.

ఈ వార్త హనుమంతుడు శ్రీరాములకు తెలుపగా శ్రీరాముడునవ్వి, పాపము, రామకార్యములో పాల్గొనుటకు పర్వతములు సహితము ఉవ్విళ్ళూరుచుండెను కదా! అని సంతసించి, హనుమాన్, నీవు శీఘ్రముగ వెళ్ళి ఆ పర్వతమును విచారించవలదని తెలుపుము. ద్వాపరయుగమున ఆ పర్వతమును నేను యేడు దినములు నా హస్తమునందుంచుకొందును. ఈ వార్త విని పర్వతము ఆనందమని పలికెను. ఆ పర్వతమే ద్వాపరమున గోవర్ధన పర్వతముగా రూపొందెను.

శ్రీరాముడు ఐదవ దినమున సముద్రతీరమునకు వచ్చి సేతువు చూచి ఆనందించెను. ఓ వానర వీరులారా! మీ సేవ వర్ణనాతీతమైనది. మీ భక్తిప్రపత్తులు నన్నెంతయో మగ్నుని గావించుచున్నది అని పలుకగనే, విభీషణుడువచ్చి "స్వామీ, రేపటి దినము మనము లంకను ప్రవేశించవలసియుండును. దీనికి నా ప్రార్థన ఒకటి మన్నించుడు" అని ప్రార్థించగా, అది యేదియో తెలుపమని శ్రీరాముడు కోరెను. రావణుడు, శివపూజాధురంధరుడు. అతనికి శివుడన్న పరమప్రేమ, కాన తమహస్తములద్వారారావణుడుమరణించును, అదిసత్యము. కానీ, అతనిజ్ఞాపకార్థముగ మనము లంకను ప్రవేశించుటకు పూర్వము, సేతువును దాటుటకుపూర్వము, లంకకు

ప్రయాణము సలుపకపూర్వమే ఒక శివలింగమును తమ హస్తములద్వారా ప్రతిష్ఠించిన ఉత్తరోత్తరా లంకలో ప్రవేశించువారు రాముడు ప్రతిష్ఠించిన లింగేశ్వరుని స్మరించి పూజించి లంకలో ప్రవేశించు అదృష్టము వారల కందించవచ్చును కనుక, రామలింగేశ్వరులను పేరుతో ఖ్యాతిజెందుననియూ, కాలాంతరములో మన సేతువు కూలిపోయిననూ దాని గుర్తుగా నిరూపించుట కూడా తటస్థించుననియూ కోరగా శ్రీరాముడు సంతసించి నీ యిష్ట ప్రకారమే గావింతును. ఉత్తరోత్తరా నీవే లంకకు రాజువు కాగలవు కనుక నీకు సంతోషము కలిగించుటలో నేనెంతేనియూ, యేపనికైననూ సంసిద్ధమని పలికెను.

అంత సుగ్రీవుడు వానరులను పిలిచి ప్రతిష్ఠకు తగిన వసతులు గావించమని కోరెను. హనుమంతుని పంపి శివలింగమును ముచ్చటయిన దానిని తెప్పించెను. శ్రీరాముడు సముద్రజలముచే దానిని అభిషేకము గావించి, ప్రాణప్రతిష్ఠ చేసెను. రాముని హస్తముతో స్పర్శించగనే అదే ప్రాణప్రతిష్ఠ. అంతకంటే వేరు మంత్రములు లేకున్న ఆ రామవాక్యమే మంత్రము. ఈ రీతిగా రామనామము మిన్నుముట్టెను. వానరులు జైజై ధ్వనులతో మంత్రములు చెప్పిరి. రాముడు లక్ష్మణ సుగ్రీవాదుల సహాయముతో లింగమును ప్రతిష్ఠ చేసెను.

అంత వానరులు, రాముని మదియందు స్మరించి సేతువుపై బారులుదీరి నడచిరి. ఆ వానరుల పటాలముల ఒయ్యారము చెప్పుటకు శక్యము కాదు. రామలక్ష్మణులు సేతువుపై నిలిచి ఇరుప్రక్కల సముద్రమును చూచెను. ఆ కరుణా సముద్రుని చూచి, జలసముద్రుడు ఆనందముతో పొంగెను. జలచరములు అలలపై తేలియాడెను. రామచంద్రుని దర్శించుటకై జలములోని జంతువులన్నియూ తమ తమ స్వభావములు వీడి తదేక దృష్టితో రాముని దర్శించెను.

వానరులు ముందు వెళ్ళి లంకకు ప్రవేశించుటకు ముందే ఒక శిబిరమును యేర్పాటు చేసిరి. వానర సైన్యము సముద్రమును దాటి లంకను చుట్టూ ముట్టడించినారన్న వార్త క్షణములో లంకలోని వారలందరికీ తెలిసెను. తరువాత రామలక్ష్మణ విభీషణ, సుగ్రీవాదులు మెల్లగా నడచి లంక సింహద్వారమును చేరిరి. అంత రామాజ్ఞను గైకొని వానరులు గంతులు వేయుచు వృక్షములు పెరికి ఫలములు తిని వాటిని లంకలో విసరిరి. పాషాణములను తీసి లంకలోనికి దువ్విరి. వంటరిగా పారా చేయుచున్న రాక్షసులను గొంతులు పట్టి ఆడించుచుండిరి. ఈ రీతిగా వారి చేష్టలు మితిమీరెను.

ఈ వార్త రావణునికి తెలిసెను. పూర్వము రావణునికి దశకంఠములున్ననూ

ఒకే కంఠముతో మాట్లాడెడివాడు. ఈ వార్త వినగనే దిగులొంది రాక్షసులను పిలిపించి పది కంఠములతో గర్జించ మొదలు పెట్టెను. దశముఖములతో మాట్లాడుట ఒక అశుభము; తనకు తెలియకనే ఆ రీతిగా గర్జించుట జరిగెను. పది ముఖములలో నుచ్చరించునపుడు అతనికి మృత్యువు సమీపించునని పూర్వము శాపము కలదు. అది స్మరించి రావణుడు కొంత తనలో తాను దిగులపడెను. తానెంత అరికట్టుటకు ప్రయత్నించిననూ పది కంఠములు పలుకజొచ్చెను. ఈ ఆశ్చర్యమును గమనించిన రాక్షసులు, తమ అంత్యకాలము ఆసన్నమయినదని దృఢము చేసుకొని తమ తమ ఆలుబిడ్డలతో దుఃఖించి నేడో రేపో మన జీవితములు అంత్యములగుచున్నవని ఇష్టములను నెరవేర్చుకొనిరి.

"వినాశకాలే విపరీత బుద్ధిః" అన్నట్లు రావణుడు తన శాప వృత్తాంతము తెలిసియూ ఈ శాపము నన్నేమి చేయునని తలంచి అంతఃపురములోనికి వెళ్ళెను. అంతియే కాదు; తన రూపమే మార్పుజెందెను. ఈ విధమైన భీతి, భ్రాంతిని మంత్రులు చూచి దిగులొందుదురేమో అని రావణుడు తనలో తాను కృంగిపోయెను. తన సోదరికి గావించినటుల నా దశముఖములందును ముక్కు చెవులు కోయుదురేమో, దశకంఠములు తెగకోయుదురేమో, అని లోలోన తలంచెను.

అంతఃపురములో మండోదరి చూచెను. రావణుని రూపురేఖలను చూచి, రావణుడు పూర్తిగా దిగులొందినటుల కనుపించుట గుర్తించెను ఈ సమయమున హితోపదేశము చేయుట మంచిదని తలంచెను. తక్షణము రావణుని చేతులు పట్టుకొని మృదుమధుర వచనములతో, "నాథా! కోపమును విడచి నా మాటలు సావధానముగా ఆలకించుడు. యెవరిని బుద్ధిచేతను, శక్తిచేతను సాధింపగలరో, అట్టివారిని విరోధముచే సాధించుటకు పూనుకొనుట మంచిదికాదు. అట్టి పవిత్రులతో విరోధము మంచిదికాదు. రామునితో మీరు పోరాడలేరు. సూర్యునకు మినుగురుగునకు పోలిక చెల్లునా? నా మాట విని ఇప్పటికైనను జానకిని తీసుకొనిపోయి రామునకు సమర్పించి అతనికి నమస్కరించి క్షమాభిక్షను కోరుము. నా మాట వినుము, నీ జాతిని పాడుచేసుకొనవద్దు. నీ వల్ల లంకను నాశనము గావించుకొనవద్దు. స్త్రీ బాల వృద్ధులను బలి గావించవద్దు.

నీ భక్తి ప్రపత్తులకు ఇది తగినది కాదు. ఈ క్రూర కృత్యముచే నీ ఆరాధన దైవమైన ఈశ్వరుడుకూడా నీకు విరోధి కాగలడు. మంచి కార్యముల చేత దైవము ప్రసన్నుడు కాగలడు. ఇట్టి పాపకార్యములు దైవమును మెప్పించవు" అని అనేక విధముల చెప్పెను.

"ప్రాణనాథా! శ్రీరామచంద్రుడు సామాన్యుడుకాడు, మధుకైటభులను సంహరించెను. హిరణ్యాక్ష, హిరణ్యకశిపులను వధించెను అతడే బలిచక్రవర్తిని బంధించెను. సహస్రబాహువులుకల కార్తవీర్యార్జుని గర్వమును అపహరించెను. ఇరువది భుజములుగల మీరెంత వారు, ఆ లోకారాధ్యుడు సకల మంగళస్వరూపుడు. భూభారమును హరింప రాముడై అవతరించునని బ్రహ్మ మీకు తెలిపినటుల, ఒకానొక సమయమున మీరే నాతో తెలిపియుంటిరి కదా. ఇన్ని తెలిసియూ మీరెందులకు ఈ మార్గమును విడువక, సత్యమును గుర్తించక యున్నారు? త్వరలో మీరు ఆ త్రిలోక సుందరిని, మహా సాధ్వీమతల్లిని, పతివ్రతా శిరోమణిని, జానకిని, ఆ ప్రభువునకు అర్పించి, కొమారునకు పట్టము కట్టి, రామ సన్నిధిలో మన జీవితమును ప్రశాంతముగా గడుపవచ్చును. మీ సోదరు డెంతటి ధన్యుడో, రామసన్నిధిచేరి అతని చల్లని నీడలో కాలము గడుపుచున్నాడు. ఇప్పటికి కాలము మీరలేదు. తక్షణమే మీరు పరుగిడిపోయి లంక కేతెంచుచున్న శ్రీరాముని పాదములపై బడి క్షమాభిక్షను వేడుము."

అని కంటిధారలు కారుచుండ దీనయై పాదములపట్టి ప్రార్థించుచున్న మండోదరిని చూచి కంటినీరుతుడుచుచు, "ఓ ప్రియురాలా, ఇంత బేలవయ్యెదవేల, యెందుల కింత అధైర్యము, లోకములో నాకంటె బలవంతుడు లేడు. అష్టదిక్పతులను నా భుజములతో జయించితిని. కాలుడు సహితము నా సమీపమునకు రాజాలడు. నీవు దిగులొందకుము. నా బలపరాక్రమములను నీవు సరిగా గుర్తించక అబలుడైన రాముని వర్ణించుచున్నావు" అని భార్యను ఓదార్చి హజారమునకు వచ్చి సింహాసనాసీనుడైన రావణుని చూచి మండోదరి విసుగుజెంది,

ఛీ, యెంతటి మూర్ఖుడు. దురభిమానమును పీడనివారి గతి ఈ రీతిగనే యుండును. మంచిమాటలు మనసున చేరవు. విషజ్వరము వచ్చిన వానికి మధుర పదార్థములు సహితము విషముగనే కనుపించును. విషమనే అనిపించును. అటులనే దురభిమానమను విషజ్వరముతో పీడించు రావణునికి నా అమృతవచనములు రుచించకున్నవి. నేనేమి చేతునని తనలోతాను రాబోవు ప్రమాదమును అనేకరకముల తలంచుచూ ఆ ఘోరమునుచూచి మరణించుటకంటే దానికి పూర్వమే నేను ప్రాణములు వీడిన మంచిదనితలంచి రాముని చింతించుచూ శయ్యాగృహమున ప్రవేశించెను.

సింహాసనమును అధిష్ఠించిన రావణుడు మంత్రులనుపిలిచి సమరసన్నాహాములకు తగిన ఆలోచనలు జరిపెను. రాక్షసులారా! వానరులు, జాంబవంతులు, మను

జులు మనము భుజించు కబళమునకు సరిపడరు. మీరు దిగులొందక, భయము పలు కక, యుద్ధమునకు సిద్ధముకండు," అని గర్జించిన రావణుని మాటలకు ప్రహస్తుడు లేచి చేతులు జోడించుకొని,

"రాక్షసులారా! నీతిమార్గము తప్పకుడు. ఈ మంత్రుల బుద్ధి మహాస్వల్పము. ఓ రాజా! ఈ మంత్రులు నీ చిత్తమున కనుకూలముగ వచింతురు. అంతమాత్రమున శుభము కలుగదు. ఒక్క వానరుడు సముద్రమును దాటివచ్చి యెన్ని చిత్రవిచిత్ర ముల జేసెనో, ఆనాడు నీ మంత్రులు, నీ సైన్యము యేమి చేయగలిగెను? ఈ రాత్రించరులకు అప్పుడు క్షుద్బాధ లేకపోయెనా? ఆ వానరుడు లంకానగరమును దహించునప్పుడు, ఈ మంత్రులేల వానిని భుజింపలేకపోయిరి. ఓ రాజా! నీ మంత్రులు చెప్పుమాటలు నీకు ప్రస్తుతము హితముగ దోచినను, వానివలన ఉత్త రోత్తరము నీకు కీడు మూడును.

తెప్పగా విచారించుము. నిరాయాసముగా సముద్రమును బంధించి వానర సైన్య ముతో దాటి వెడలివచ్చి సువేలాచలముమీద విడిది చేసియుండిన శ్రీరాముని మనుజ మాత్రుడను నీ అభిప్రాయమును వీడి, నోటికి వచ్చినట్లు వాగుటమాని, మంత్రుల ప్రగల్భాలను చెవిని చేర్చక, నేను పిరికిపందనని భావించక, నా మాటలను విశ్వ సించి సమయము మీరకముందే తక్షణము సీతను నీవే స్వయముగా తీసుకొని పోయి శ్రీరామునకు అర్పించి, శరణుజొచ్చిన, లంకను మనము కాపాడుకొన్నవార మగుదుము. మనజాతిని మనము నిలబెట్టుకొన్నవారమగుదుము. ఇదియే మన విజయ మని భావించి ముందుప్రయత్నములు సలుపుము. నీకునూ కీర్తి ఆచంద్రార్కంగా నిలుచును. సూర్యచంద్రాదులుండు వరకు నిలుచునట్టి చెడ్డపేరును సంపాదించుకొన వద్దు," అని ప్రార్థించెను.

ఆ విధముగ ప్రహస్తుడు ఆడిన మాటలకు ఉగ్రుడై గర్జించి ఘూంకరించి, "ఒరేమూర్ఖుడా, ఈబుద్ధి నీకెవరు చెప్పిరి ? వెదురు పొదలో అగ్నిపుట్టినట్లు నా వంశ ములో నీవు పుట్టితివి " అని పండ్లు పటపట కొరికి కర్ణకఠోరమైన వాక్యములు పలికి తన కాలితో తన్నెను. తండ్రి గర్వమును, దురభిమానమును అనేక విధముల తూలనాడి, చేతులారా వంశమును నాశనముగావించు దుర్బుద్ధి నీకు వినాశమునకే పుట్టినదని ప్రహస్తుడు గట్టిగ వాదించి చేయునదిలేక లోలోన దుఃఖించెను. మరణ కాలమాసన్నమయిన వారికి యెంతటి దివ్యమైన ఔషధములూ పనిచేయవు. అటు లనే హితవాక్యములు నా తండ్రికి అపథ్యమయ్యెను. అని తల్లిచెంతకు వెళ్లి రావ ణుని మూర్ఖగుణమును తల్లితోచెప్పి ఇరువురూ చేయునదిలేక శ్రీరాముని స్మరించిరి.

వానర సైన్యము సువేలాచలముమీద చక్కగా ఒక శిబిరమును నిర్మించి రామలక్ష్మణులకు మెత్తని గడ్డిఆసనాలు అమర్చి, దానిపై ఆకులు, పుష్పములతో చక్కని పరుపులు అమర్చిరి. దానిపై శ్రీరాములు మూర్తీభవించి కూర్చొనెను. కొంత సేపయిన తరువాత సుగ్రీవుని తొడపై శిరస్సుంచి శ్రీరాముడు విశ్రమించెను. ఇరు వైపులా ధనుర్బాణములుంచెను. వానరులు చేతులు నలుపుకొంటూ రావణుని అంత మొందించుట కొరకు రామాజ్ఞకై కాచుకొనియుండిరి. అదృష్టవంతుడగు హనుమంతుడు, అంగదుడు, పాదములు వత్తుచుండిరి. లక్ష్మణుడు పాదములచెంత ధనుర్బాణములను నడుముకు కట్టుకొని తదేకదృష్టితో రామచంద్రుని చూచుచుండెను.

ఇంతలో శ్రీరాముడు తూర్పుదిశకు చూచెను. చంద్రుడు ఉదయించుచుండెను. ఓ సఖులారా! చూచితిరా ఆ చంద్రునియందు యేదో మచ్చ కనుపించుచున్నది. అని అడుగగా ఒక్కొక్కరు ఒక్కొక్కరీతిగా జవాబు చెప్పిరి. హనుమంతుడు నాథా! అందులో నాకేమియు కనుపించుటలేదు. అది శుద్ధమైన అద్దము, మీ ముఖమునకు చెమటగా వుండినందున మీ ముఖబింబము నాకు అందులో కనుపించుచున్నదని చెప్పెను.

ఆరాత్రి అంతయు ఈ విధముగ వానరులతో రామచంద్రుడు ఆనందవచనములతో గడిపెను. తెల్లవారగనే శ్రీరాముడు సముద్రమున స్నాన సంధ్యాదులు సలిపి, మంత్రులను పిలిచి యేమిచేయవలెనో వారితో ముచ్చటించెను. అంత, అందరూ యేకోన్ముఖులై అంగదుని రావణుని దగ్గరకు రాయబారముగా పంపుట మంచిదని నిర్ణయించుకొనిరి.

అంత అంగదుని పిలిచి, "నాయనా! నీవు గుణవంతుడవు; బలవంతుడవు నీవు రామకార్య నిమిత్తము రావణుని దగ్గరకు వెళ్ళిరమ్ము! రావణునికి హితమును గరపుము! ఉద్రేకముగా వచనములు ఉపయోగించవద్దు," అని చెప్పవలసిన సంధి మాటలు చెప్పెను.

అంత అంగదుడు, రామునకు నమస్కరించి, చేతులు జోడించుకొని, "నాథా! మీరు కటాక్షింపుడు. మీ కార్యము చేయునట్టి అదృష్టము నాకు కలుగుట నా భాగ్యము. అందులో ఏమైననూ సరే, తమకు నా ప్రాణములే అర్పించుతాను," అని పలికిన అంగదుని పలుకులకు శ్రీరాముని హృదయము కరిగెను. తక్షణము రాముడు అంగదుని కౌగిలించుకొని శిరస్సును నిమురుచు, ఆశీర్వదించెను.

అంగదుడు అత్యంత ఉత్సాహముతో రాముని స్మరించుచూ బయలుదేరి, లంకలో ప్రవేశించెను. మహాధైర్యముతో అంగదుడు అడ్డుతగిలిన వారిని ప్రక్కన

నెట్టుచూ, రాజనగరమున ప్రవేశించెను. అచట వుండిన రావణుని కుమారుని చూచెను.

అంత, రావణుని కుమారుడు "ఓ వానరా! నీ వెవడవు" అని అడుగగా "నేను రాములవారి దూతను" అని అంగదుడు జవాబు చెప్పెను. అంత రావణుని కొమారుడు అంగదుని కాలితో తన్న ప్రయత్నించెను. అంత, అంగదుడు వాని కాలుపట్టి గిర గిర త్రిప్పి నేలగొట్టెను! ఈ దృశ్యమునుచూచి రాక్షసులు భయపడి ఈ వానరుడు మహాబలవంతుడని తలంచి యెవ్వరేమియూ చేయజాలకపోయిరి. అంతకు పూర్వము లంకనుదహించిన వానరుడు మరీ వచ్చెనని తెలిసికొనిరి. క్షణములో లంకఅంతయూ కోలాహలము బయలుదేరెను

అంగదుడు యెటువైపు తిరిగిననూ అటువైపున గుంపులుగుంపులు రాక్షసులు నిలుచుకొని భయభ్రాంతులై చూచుచుండిరి. అంగదుడు ప్రశ్నించక పూర్వమే అతనికి దారి విడచి తప్పుకొనుచుండిరి. అంత అంగదుడు నిర్భయముతో రావణునిసభలో ప్రవేశించెను. అంత అతి త్వరితముగా ఒక దూత వెళ్ళి అంగదుని ఆగమనమును గూర్చి రావణునికి విన్నవించెను. అంత ఆ దూతను తన సమ్ముఖమునకు తీసుకొని రమ్మని రావణుడు ఆజ్ఞాపించెను. ఒక దూత వచ్చి అంగదుని రావణుని సన్నిధికి తీసికొనిపోయెను. వెళ్లిన అంగదుడు రావణుని చూచి చైతన్యముగల ఒక నల్లని పర్వతమని తలచెను! ఇరువది భుజములు ఒక వృక్షశాఖలనుగా భావించి నిర్భయముగా అతని చెంతకు వచ్చెను. అంగదుని చూచి ఆ సభలోని రాక్షసులందరూ లోలోన దిగులు పడుచు, మాటాడలేని స్థితిలో వుండిరి.

అంత రావణుడు, "ఓవానరా! నీవెవడవు," అని ప్రశ్నించెను "ఓరాజా! నేను శ్రీరాముని దూతను." తరువాత రావణుడు, నీ ఆగమనమునకు కారణమేమని అడుగగా, "ఓ రావణా, పూర్వము నా తండ్రికి నీకు స్నేహముండెడిది; నీ మంచినిగోరి నీకు మంచి బుద్ధులు చెప్పుటకై రామాజ్ఞను బడసి వచ్చితిని" అని సావధానముగా అంగదుడు పలికెను. "ఓ రావణా! అభిమానము చేతనో, మోహము చేతనో లేక రాజమదాంధము చేతనో, నీవు ఆ జగదంబను ఆ లోకమాతను, జానకిని తీసుకొని వచ్చితివి. అది మంచి పని కాదు; యేదో జరిగినది జరిగిపోయెను. నేటికైననూ నీవు సత్యమును గుర్తించి, నేను చెప్పినటుల ప్రవర్తింతువేని నీ యపరాధములను శ్రీరాముడు క్షమించగలడు. తక్షణము నీవీ పనికి పూనుకొమ్ము. లేకున్న నీ చేతులారా నీ వంశమును రాజ్యమును మట్టిపాలు గావించుకొందువు" అని అంగదుడు తెలుపగా, "ఓరీ వానరాధమా! నీవు మూర్ఖుడవు, నేను దేవశత్రువునని నీకు తెలి

యదు కాబోలు: నీ పేరేమి? నీ తండ్రి పేరేమి: నీకూ నాకు గల సంబంధమేమి? కన్నులు తెరిచి చూడుము" అని గర్జించగా, అంగదుడు ఫక్కున నవ్వి, "ఓ రాక్షస రాజా: నా పేరు అంగదుడు; నా తండ్రి పేరు వాలి; మీరిరువురకూ సఖ్యముండెను." అంగదుని వచనము రావణుడు విని నిశ్చేష్టుడయ్యెను. "సత్యము: సత్యము: వాలి అని ఒక వానరుడు పూర్వకాలమున వుండెను. వాని కొమారుడవా నీవు ? ఓరీ ; అంగదా, నా వంశమును ధ్వంసముచేయుటకే నీవు నిప్పుగా బయలుదేరితివా?" అని రావణుడు వెగటుగా మాట్లాడెను.

అంత అంగదుడు రావణుని మాటలకు ఫక్కున నవ్వి, ఓ రావణా: నీకు అంత్యకాలము సమీపించినది; త్వరలోనే, వాలి చెంతకు పోగలవు. శ్రీరామునితో విరోధించుటవలన లభించు క్షేమమునుగురించి వాలి నీకక్కడ వివరముగా తెలుప గలడు. ఇరువది నేత్రములు, ఇరువది చెవులు వుండియూ, నీవు గ్రుడ్డివాడవు ; చెవిటివాడవు: అజ్ఞానాంధకారములో నీకు నువ్వే గొప్ప అని గర్వించుచున్నావు. యే కులమును నీవు రక్షించ తలంచితివో ఆ కులమును నేను నశింపజేయ తలంచి తిని: పాతకీ: కిరాతకా: మదాంధుడా: రాక్షసా: అని అనేక విధముల అంగదుడు పండ్లు కొరుకుచూ తూలనాడిన కఠోర పదములు విని, రావణుడు దిగ్గున గద్దెనుండి లేచి, "ఓరీ, కులపాతకుడా: ఓరీ మర్కటమా: రాజమార్గ ధర్మములను గుర్తెఱింగిన వాడను కనుక నీ మాటలను సహించితిని. జాగ్రత్తగా మాట్లాడుము" అని యొడలు త్రిప్పెను.

ఆ వికారమునుచూచి అంగదుడు, ఓరీ రాక్షసరాజా: నీ ధర్మమును, నీ శీల మును, నీ రాజనీతిని వినియుంటిని: నీ ధర్మము ఎంతటి ఘనకార్యము చేసెనో యోచించుము. పరస్త్రీని దొంగిలించుట, నీ అన్న కుబేరుడు వంపిన దూతను నీ కన్నులముందు భక్షించుట, ఇవన్నియు రాజనీతులు: సిగ్గులేక మాటాడుచూ లేని నీతులను వుచ్చరించుచున్నావు. దూతగా వచ్చిన వానరుని తోకకు నిప్పంటించిన రాజనీతి నీది: ఇది రాక్షసధర్మము. నీకు రాజనీతి అని స్మరించుటకుకూడా హక్కు లేదు, మహాపాపివి" అని అంగదుడు విచ్చలవిడిగా జంకులేక ప్రత్యుత్తరము ఇచ్చు చుండుటచేత సభలోని వారందరూ తమలో తాము భయభ్రాంతులై యేమి జరుగునో అని దద్దరిల్లిరి.

ఇంతలో రావణుడు "ఓరీ వానరా: నాతో యుద్ధము చేయదగిన వీరుడు ఒక్క డైననూ మీ కటకములోకలడా? నీ ప్రభువు భార్య వియోగము చేత నీరసించెను; అన్నగారి దుఃఖమును చూచి చూచి అతని తమ్ముడు కృశించెను. ఇక, సుగ్రీవుడు?

నాతో పరస్పర విరోధము కలిగించుకొని నదిఒడ్డున నిలిచిన రెండు పక్షులవలే కూలుచుంటిరి. మీరిరువురకు రాజ్యకాంక్ష తప్ప అన్యవాంఛలు లేవు. ఇట్ల మీరు నాతో పోరాడగలరా? నా తమ్ముడు పిరికిపంద; ఇక జాంబవంతుడు, వయోవృద్ధుడు; నలుడు, నీలుడు శిల్పకళా ప్రవీణులు; వారికి కత్తి పట్టుటయే తెలియదు" అని పలుకగనే, అంగదుడు పక్కున నవ్వి, ఓరీ రావణా! ఒక పిల్లకోతి నీలంకకు నిప్పు పెట్టెనని చెప్పినను యే మూర్ఖుడు ఆ మాటను విని నమ్మును? ఆ పిల్లకోతి మహా వీరుడు కాదని నీ వనుచున్నావు. నీతో యుద్ధము చేయగల వీరుడు మా కటకములో లేడని నీ వనుట నాకు కోపములేదు. స్నేహము కానీ వైరము కానీ సరిసమానముతో చేయవలెనని, ధర్మశాస్త్రము కలదు. సింహము కప్పను చంపిన యెడల యెవరు శ్లాఘించెదరు! శ్రీరాముడు నిన్ను సంహరించుటకు ప్రయత్నించుట వారి మర్యాదకు లోపము. నీ వంటి క్షుద్రుని సంహరించుట వారి పరువుకు తక్కువ; క్షత్రియ ధర్మము మహా కఠినము. నీవు పరస్త్రీని అపహరించితివి, నీవు మహా పాపివి. నిన్ను కోతులే చంపవలెను; మహాపాపియే కోతులతో చచ్చును." అని అంగదుడు అనిన మాటలకు రావణుడు నవ్వి, ఓరీ, వానరా! వానరులు వారి యజమానుని చిత్తము గనుకొని సిగ్గుని విడిచి నాట్యము చేయుచుందురు. యే ఆట ఆడమని యజమానుడు చెప్పిన వారా ఆట ఆడుదురు. "ఓరీ!అంగదా! స్వామిచిత్తముకని పెట్టి సంచరించుట మీజాతి లక్షణము" అనివెగటుగామాట్లాడు రావణుని వచనములను వింటూ అంగదుడు "ఓరీరావణా! జంతువులను గురించిమాత్రమే నీవుతెలుసుకొంటివి గానీ,ప్రభువుని దైవమునుగురించినీవు తెలుసుకొనలేకపోతివి. నీపరాక్రమమునీరాజనీతి మాకు మావానరు డిదివరకే విపులముగా తెలిపెను. నీకుమారుని చంపి, వనములు చెల్లాచెదరుచేసి, లంకను భస్మముగావించి, వనములు ధ్వంసము చేసిననూ నీవతనికి తగినశిక్షచేయలేక విడిచిపెట్టితివి; నీహృదయమంత నరళమనియే నేనింతకఠోరముగా ప్రసంగించితిని. నీకు సిగ్గులేదు, రోషము లేదు! నీతిలేదు, నిజాయితీలేదు. ఇంక విభీషణుని పిరికిపంద అని పండ్లు కొరుకుచున్నావు! నీ బ్రతుకు భూభారము; నీ గుణములు వూరి కుక్కలకు కూడా వుండవు. నీకంటే కుక్కలు మేలని నీవు తెలిసికొనలేక పోవుచున్నావు అని మర్యాద చూడక పలుకుచున్న అంగదుని పలుకు విని రావణుడు, "ఓరీ అంగదా! యెవడు స్వభుజపరాక్రమముచే కైలాస పర్వతమును మీదికెత్తెనో, యెవడు పుష్పములకుబదులు శిరస్సులతో శివుని పూజించెనో, యెవని శూరత్వము శివునకుతెలియునో యెవరినామమును తలచినమాత్రానగుండెలుకదలునో, ఆ శూరుడే, ఆరణధీరుడే, ఈ రావణుడు సుమా! నీ ప్రగల్భములను కట్టిపెట్టుము".

అప్పుడు అంగదుడు, "ఓరీ! దురభిమానీ! నీవు అధిక మాటలాడక శ్రీరాముని భజింపుము, శరణుజొచ్చుము. లేకున్న రామబాణముతో నీ శిరస్సులు బంతులవలే క్రిందపడును; వానరులు వాటితో క్రీడింతురు. నేను సుగ్రీవుని దూతను. శ్రీవారి ఆజ్ఞ లేకపోవుటచేత, వారి ప్రతిష్ఠకు భంగము కలుగునని భయపడుచుంటిని. లేకుండిన అవలీలగా నిన్ను క్షణములో సంహరించి సముద్రమున పడవేసియుండెడివాడను," అని ఉగ్రుడయ్యెను. సింహమువలే రెండుచేతులను భూమిమీద కొట్టెను. రావణుడు గిరగిర తిరిగిపడి సవరించుకొనెను. భూమి అదురుటచేత రావణుని పది కిరీటములు క్రిందకూలెను. నాలుగు కిరీటములను అంగదుడు తీసుకొని శ్రీవారి వద్దకు పంపెను. వాటినిచూచి వానరులు విచిత్రముగా వారి వారికి తోచినటుల వాటిని వర్ణించుచుండిరి అంతలో రాముడు చూచి వానరులారా అవి రావణుని కిరీటములు, అంగదుడు అక్కడినుండి విసరుటచేత అవి రాహుకేతువులవలె గ్రహములవలే యెగిరివచ్చుచున్నవి, అని సమాధాన పరచెను.

అంతలో రావణుడు రాక్షసులకు ఆజ్ఞాపించెను. "ఈ వానరుని విడువక పట్టి బంధించుడు, భక్షించుడు" అని పలుకుచూ లోనికి పోబోయెను. ఆ దృశ్యమును చూచి అంగదుడు, "ఛీ సిగ్గులేక అదరిపోవుచున్నావు. ఎందులకు ఈ శౌర్యము! ముక్కు మూసుకొని సముద్రమున మునిగి ప్రాణములు వీడవచ్చును. స్త్రీ చోరుడా! మందమతీ! కామార్తుడా! యుద్ధములో నీ నాలుకను పెరికి కాకులకు అందించగలను! జాగ్రత," అని పండ్లు పటపట కొరుకుచుండగా, రావణుడు ఓరీ రాక్షసులారా! వీని పాదములు పట్టి నేలపై పడత్రోయుడు, శిరస్సును బ్రద్దలుచేయుడు, అని పలుకగనే మేఘనాథుడు దిగ్గునలేచి, వాని పాదములు గట్టిగపట్టి లాగిరి. యెంతమంది వచ్చి లాగిననూ అసలు అంగదుని పాదమును కదిలించలేక పోయిరి.

వారు సిగ్గుపడి చేయునదిలేక కూలబడిరి. తరువాత దేవకంతకుడు అనేక విధములు అంగదుని పాదమును కదిలించుటకు ప్రయత్నించెను. కానీ, వానియత్నము కూడా విఫలమయ్యెను. అప్పుడు రావణుడు స్వయముగ అంగదుని పాదము పట్టి వానిని పడత్రోయ ప్రయత్నించెను. వీలు కానందున అంగదుడు ఫక్కున నవ్వి, "రావణా! నీవు పట్టవలసినది రామపాదము; దానిని పట్టుము; నీకు ముక్తికలుగును." అని కాలును వదిలించుకొనగనే, రావణుడు ఆ తీవ్రతకు నేలపైబడి మూర్ఛిల్లెను. కళాకాంతులు నశించెను; సిగ్గుచే రావణుడు పగటిచంద్రుని కాంతివలే, తేజోహీనుడాయెను.

ఈ దృశ్యమునుచూచి అంగదుడు, నేనిక వానితో అధికంగా పోట్లాడుట

మంచిదికాదు. రాముడు నన్ను బుద్ధులు నేర్పమని మాత్రమే ఆజ్ఞయొసగెను కాన వాడు మంచిమాటలకు లొంగడు. మూర్ఖమును విడువడు. దీనికి యుద్ధమే తగిన చికిత్స, అని తలంచి శ్రీరాముని చరణసన్నిధికి వెళ్ళెను. విషయములు రామునకు విన్నవించెను.

సిగ్గుచేతను అంగదుని బలపరాక్రమములకు వెరచి భయముచేతను, రావణుడు అంతఃపురమునందు ప్రవేశించెను. అపుడు రావణుని కళాహీనమైన మోమునుచూచి, మండోదరి, "నాథా! ఇప్పటికైననూ నామాటవిని నీ మూర్ఖమును వీడుము. రాము నితో విరోధించుట రాజ్యమునకే కీడు కలుగును. లక్ష్మణుడు గీచిన గీటునే నీవు దాటలేకపోతివి. నీ శక్తిసామర్థ్యములు వారిచెంత యెందుటాకులవంటివి; అతని దూత లనే సాధించలేని నీ అనుచరులు కోట్లకొలది వానరులను జయించగలరా? అంగదుని పాదమునే కదిలించలేని మీరు, అంతమంది వానరులను పట్టగలరా? యిన్ని అనుభ వించియూ, మీరెందులకింత మూర్ఖపు పట్టును పట్టుచున్నారో నాకు బాధగావున్నది. నీ కుమారుని చంపెను, లంకను భస్మము చేసెను, వనములు ధ్వంసము గావించెను. అనేకమంది రాక్షసులను బంతులవలె యెగురవేసి చంపెను. అపుడు నీ శక్తిసామర్థ్య ములు విద్రించుచుండెనా? వట్టి ప్రగల్భములు వానరులను యేమీ చేయజాలవు.

"నాథా! నా వచనములను మన్నింపుము. శ్రీరాముని మనుజమాత్రునిగా భావించుటలో చాలా పొరబడుతున్నావు. అతడు జగన్నాథుడు, మహావీరుడు. అతని బలపరాక్రమములు మారీచు డెరిగెనుకదా! వాడు జెప్పిన విషయములను మరొకతూరి స్మరింపుము! జనకునిసభలో అనేక రాజులు కూర్చొనియుండ, నీవునూ నీ బలగర్వ ముచే ఆ సభలో ప్రవేశించియుంటివి. నీవు శివధనుస్సును కదలించలేకపోతివి. శ్రీరాముడు అట్టిదానిని అవలీలగాత్రుంచి రెండుముక్కలుగాచేసి పారవేసెను. ఇది నీవు కంటితోచూచిన బలము కదా? ఇన్ని చూచియూ నీవు మూర్ఖమును విడవ కున్న నీకు వినాశకాల మాసన్నమయినదనే తోచుచున్నది.

కాకాసురుడు అజ్ఞానముచే, నీవలే మూర్ఖముచే గావించిన అనర్థమునకు అత నేమి గతినొందెనో మీకు తెలియదా? నీ చెల్లెలగు శూర్పణఖకు ముక్కు చెవులు కోసివేసెను; అప్పుడు నీవేమి చేయగల్గితివి? సిగ్గులేక ఇంకా 'నా బలము,' 'నా శౌర్యము' అని గర్జించుచున్నావు. ఒక్క బాణముతో వాలిని చంపెను! వాలి సామాన్యుడా! వానర సైన్యముతో వచ్చి సుచేలాచలముపై విడిదిని గావించెను. రాముడు మహా ధర్మమూర్తి. లేకున్న, నీ క్షేమమునుకోరి దూతనుపంపెను. అతను యెన్నియోవిధముల శాంతిమార్గమున నిన్ను సంధికి ప్రయత్నించుచున్ననూ నీవు

నీ దురభిమానము వీడక, రాముని ధర్మతత్త్వమును విచారించక, పరమ పవిత్రుని గుణములను యోచించక, నీకు నీవే నీరాజ్యమును పతనము గావించుచున్నావు.

నేడు మీ సభలో ప్రవేశించిన అంగదుని మీరు యేమి చేయగలిగితిరి; అతని కంటే యెంతో బలశాలులు, వారి వానరులలో, వేలకు లక్షలకు కలరు! నా మాట విని మీరు మీ రాక్షసభావములు వీడి, రాముని శరణుజొచ్చుడు." ఈ విధముగ పూర్వపు వృత్తాంతములను జ్ఞాపకము చేయుచూ, పలికిన పలుకులు రావణునికి బాణములవలె హృదయమున నాటుకొనెను.

అంత ప్రాతఃకాలమయ్యెను. సభలో ప్రవేశించి మూర్తీభవించిన దురభిమానముతో సింహాసనము నధిష్ఠించెను. అంగదుడు చెప్పిన మాటలూ మండోదరి పలికిన వచనములు తలలో గిఱ్ఱున తిరుగుచుండెను. భూమి ఆకాశము తిరిగినటుల వానిలో అనేకఆలోచనలు, భయము కలిగెను.

కానీ వినాశకాల మాసన్నమగుచుండుటచే, తనకు మంచిబుద్ధులు పుట్టవు. కనుక, విద్యుజ్జిహ్వుడను రాక్షసుని పిలిచి, "ఓరీ! నీవు నీ మాయాశక్తిచేత రాముని శిరస్సుని ధనుర్బాణములను తీసుకొనిరమ్ము! వానిని చూచి జానకి, నిజమనితలంచి దుఃఖించును" అని ఆజ్ఞాపించెను. ఆ మాటలు విని విద్యుజ్జిహ్వుడు దిగ్గున లేచి వెళ్ళెను. వాడు మాయధనుర్బాణములను మాయారాముని శిరస్సును రచించి రావణునికిచ్చెను. అది నిజముగా రాముని శిరస్సుతోను రాముని ధనుర్బాణములతోను సమానముగ నుండుట గ్రహించి, రావణుడు సంతోషించి, దిగ్గునలేచి అశోకవనమునకు వెళ్ళి, వానిని జానకి యెదుటనుంచి, "ఓ సీతా! ఎవరి గుణములను దివారాత్రములు గానము చేయుచుంటివో వానిశిరస్సును ధనుర్బాణములను చూడుము. వానర సైన్యములను నిశ్శేషముగ సంహరించితిని; లక్ష్మణుడు ప్రాణములు దప్పించుకొని పారిపోయెను; నీకు నమ్మకము కలుగుట కొరకు రాముని శిరస్సును, ధనుర్బాణములను తీసుకొని వచ్చితిని. వాని చూడుము." అని ముందుపెట్టగనే, క్షణమున విచారము కలిగిననూ తరువాత, రాముని శిరస్సును త్రుంచువాడు పదునాలుగు లోకములోకూడా లేడనితలంచి, ఇవి కేవలము తన్ను బెదిరించుటకు గావించు మాయ నాటకములని తాను తెలుసుకొని, వానిమాటల నేమాత్రము లెక్కచేయక, "ఓరీ రావణా! నీకు వినాశకాలము సంభవించినది! సమీపించినది! కాకున్న ఈ రీతిగా నీకు దుర్బుద్ధులు పుట్టియుండవు. నా రాముని సమీపించుటకు కూడా నీకు అధికారము లేదు! అట్టి నీవేమి రాముని వధించుటేమి? కలలోకూడనూ ఇట్టిస్థితి సంభవించదు. ఇవి నీమాయల్లూ నాటకములు," అని చీవాట్లు పెట్టుచుండగనే, నలువైపుల జయజయ

శబ్దములు వినిపించెను. "రామ ప్రభువుకు జై" అనుచూ కేకలువేయుచూ వాన రులు లంకను నలుమూలలా ముట్టడించిరి. ఆ శబ్దములు విని రావణుడు. రిష్వాస బయలుదేరి, సభకు వచ్చెను. అంతలో విభీషణునిభార్య సరమ సీతవద్దకు వెళ్ళి, తల్లీ ! రావణుడు చేయునవన్నియూ మాయలు; రాముని శిరస్సును ఖండించుటకు యెవరి తరముకాదు. రాముడు తన వానరసైన్యముతో ఇప్పుడే లంకను ప్రవేశించి నాడు. వానరులు జయజయ ధ్వనులతో లంకను చెల్లాచెదరు గావించుచున్నారు."

శత్రువుల సమాచారమును అంగదునిద్వారా విని మంత్రులను బిలిచి లంకా నగరమునకు నాలుగు ద్వారములు కలవు. ఏ విధముగ వాటివి ముట్టడించ వలెనో ఆలోచించమని రాముడు ఆజ్ఞాపించెను. రామాజ్ఞను అనుసరించి కపిరాజును భల్లూకరాజును రాక్షసరాజును కలిసి శ్రీరామునికి నమస్కరించి, వానర సైన్యమును నాలుగు భాగములుగ విభజించిరి. యధాయోగ్యముగ సేనాపతులను వారు నియ మించి యూథపతులను పిలిచిరి. వారు సింహనాదము జేసి యుద్ధమునకు నడచిరి. శ్రీరాముని స్మరించుచూ వానరులు పర్వతములను వృక్షములను శిలలను పట్టుకొని వెడలిరి రాక్షసుల నెదిరించిరి. లంకా నగరము దుర్గమము, అభేద్యము అయినను శ్రీరాముని అనుగ్రహమున నిర్భయముగ లంకలో ప్రవేశించిరి. పూర్వద్వారమున నలుడును, దక్షిణభాగమున అంగదుడును, పశ్చిమభాగమున మహావీరుడు, ఉత్తర భాగమును కాపాడుచుండిన దశకంఠునితో శ్రీరాముడే పోరాడెను. వానరులకు రణ భేరులు లేవు, కేవలము రామనామమే సర్వభేరులతో సమానముగ మిన్నుముట్టెను.

లంకా నగరములో అత్యంత కోలాహలము పుట్టెను. ఆ హాహాకారములు రావణుడు విని దురభిమానమును విడిచిపెట్టక ఈనాడు రాక్షసులకు గొప్ప విందు అని నవ్వుచూ పొగరుపోతువలే గర్వించుచుండెను. మేరుపర్వత శిఖరముల నావరించిన మేఘములవలె రాక్షసులు కోటబురుజులు నావరించియుండిరి. రణభేరు లను మ్రోగించిరి. ఒక వైపున 'రావణునికి జై' అనియు, మరొకవైపున 'శ్రీరామ ప్రభువుకు జై' అనియు, బొబ్బలిడి యెదుర్కొనిరి. నగరప్రాకారముల మీద నుండి రాక్షసులు, శిలలను వృక్షములను విసరుచుండిరి. అవి క్రింద పడక పూర్వమే వానరులు వాటిని చేతులతోపట్టి వాటినే రాక్షసులపై వెనుకకు విసరుచూ వచ్చిరి.

రామానుగ్రహమున వానర బలమధిక మయ్యెను. యెక్కడ చిక్కిన రాక్షసులను అక్కడే హతమార్చుచూ వచ్చిరి. ప్రచండ మారుతము వీచినపుడు మేఘముల బృందము నలువైపుల చెదరినట్లు, వానరుల ప్రతాపమువలన రాక్షసుల సైన్యములు విరుగబడి దిక్కులు పట్టెను. లంకానగరములో హాహాకారములుపుట్టెను.

రాక్షస స్త్రీలు వృద్ధులు, పిల్లలు, రావణుని అనేక విధముల దూషింప మొదలు పెట్టిరి. కొందరు రాక్షసులు యుద్ధముమాని తమతమ కుటుంబములతో ప్రాణరక్షణ గావించుకొనుటకు పరుగులిడిరి అట్టిదృశ్యమునుచూచి రావణుడు పండ్లుకొరికి, "పిరికి పందలారా ! యుద్ధమునుండి వెనుచూపి పరుగిడువారిని నా చంద్రాయుధముతో ఖండింతును !" అనిపలుక, అంత కొందరు భయమొంది విధిలేక యుద్ధమున పాల్గొనిరి. వానరులిరువురు వీరావేశముతో రాక్షస సైన్యములో ప్రవేశించి రామచింతన చేయుచు రావణుని దుర్గములో ప్రవేశించిరి. రావణుని దుర్గమును నేలకూల్చిరి.

ఒక బంగారుతోరణ స్తంభమును వూడబెరికి మారణహోమము చేయనారంభించిరి. ఒక్కొక్క రాక్షసుని వారు మర్దించి శిరములు త్రుంచి పారవేయ మొదలు పెట్టిరి. త్రుంచిన శిరస్సులన్నియూ రావణుని యెదుట వచ్చి పడుచుండెను. ఈ ప్రకారముగా వానరులు శత్రుసైన్యముపై భుజబలము చూపించి సునాయాసముగా సంహరించి సైన్యమునుదాటి శ్రీరామునివద్దకు వచ్చిరి. అంతలో రాత్రి ప్రారంభమాయెను. రాక్షసబలము అధికమాయెను. రావణకి జై అనుచూసింహనాదము చేసిరి. వానరులు తిరిగి యుద్ధమునకు ప్రవేశించిరి.

వానర రాక్షస సైన్యంబులు తాకెను. రాక్షస సైన్యము విరుగబడెను. ఆకంపుడును అతికాయుడును రాక్షసమాయ బన్నిరి. వారిమాయవలన క్షణములో గాఢాంధకారము నలువైపుల వ్యాపించెను. రక్తము ధూళిశిలలు వర్షమువడెను. ఈ గాఢాంధకారముచే వానరులకు ఒకరుకొకరు కనుపించక, యెవరు రాక్షసులో, యెవరు వానరులో అన్నది తెలియకపోయెను. ఈ కారణముచే వానరులు కొంత దిగులొందిరి. ఈ విధమైన స్థితినిచూచి రామా రామా అని వానరులు మొరబెట్టిరి. ఈ వార్తవిని రాముడు, అంగద హనుమంతుని పిలచి, రాక్షసులుచేసిన మాయని తెలిపెను. వారు కోపించిరి. అపుడు రాముడు దయదలచి ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. ఆ అస్త్రముతో రాక్షసులమాయ వీడిపోయెను. రణరంగమంతయూ తెలివి దాల్చెను. మాయచీకట్లు మాయమయ్యెను.

దశదిశలు ప్రకాశించుటవలన వానర భల్లూకములు పూర్వపుశ్రమను మరచి ఉత్సాహముతో యుద్ధమును ఆరంభించిరి. అంగద హనుమంతులు గర్జించి యుద్ధము చేయుచున్న స్థలములను రాక్షసులువిడిచి పరుగులెత్తిరి; పరువులిడుచున్న రాక్షసులనుపట్టి కాళ్లు పట్టి సముద్రపుదిశకు విసరుచూవచ్చిరి. కళేబరములను సముద్రములో త్రోసిరి. ఈ విధముగ శత్రుసైన్యములను వానరులు విరుగగొట్టి సింహనాదము చేసిరి. ఇంతలో చీకట్లు నలువైపుల వ్యాపించెను రాక్షసులు లంకలోప్రవే

శించిరి. వానరసైన్యము తిరిగి శ్రీరామునివద్దకు వచ్చెను. శ్రీరాముని కటాక్షదృష్టి ప్రసరించిన మాత్రమున వానరులశ్రమ అంతయు శాంతించెను.

ఇది యిట్లుండ లంకలో రావణుడు మంత్రులను పిలిచి వారితో ఇట్లు చెప్పెను. మంత్రులారా ! ఈ దినమున అనేక రాక్షసులు హతులయిరి. సహస్ర సైన్యమును వానరులు సంహరించిరి. ఇకపై మనము చేయవలసిన ఉపాయమును ఆలోచించుడు, అని రావణుడు ఆజ్ఞాపించగనే రావణుని మాతామహుడు, రావణుని తండ్రికి సహితము మంత్రిఅయిన మాల్యవంతుడను రాక్షస వృద్ధమంత్రి లేచి, రావణునకు అనేక నీతి మార్గముల నుపదేశించెను. "ఓ రావణా ! నా మాట శాంతముగా ఆలకింపుము, నన్ను క్షమింపుము, జానకిని తీసికొనివచ్చినది మొదలు దుశ్శకునములు కనబడుచున్నవి. వాటిని వేరువేరుగాచెప్పశక్యముకాదు. మహాపురుషుడైన శ్రీరాముని ప్రతాపమును, వేదములు కూడనూ వర్ణించజాలవు. అట్టి విరాట్పురుషుని నెదిరించుటవలన శ్రేయస్సు కలుగదు. తమరు శాంతముగా ఆలోచించుట మంచిది. ఆ మహాపురుషుడే హిరణ్యకశిపు, హిరణ్యాక్షులను సంహరించెను. కాలస్వరూపుడై దుష్టులను సంహరించును. అతను సకలగుణధాముడు. అతనితో నీకు వైరము వలదు. రాజా ! లంకను కాపాడుము. సీతను శ్రీరామునకు అప్పజెప్పుము. కాలహరణము చేయుట మంచిదికాదు" అని నమస్కరించెను.

మాల్యవంతుడు పలికిన పలుకులు బాణములవలె రావణుని హృదయమునకు తగిలెను రావణుడు ఉగ్రుడై ఓరీ ! నీవు కాలునిముఖములో ప్రవేశింప దలచినట్లు తోచును. నీవు వృద్ధుడవు గనుక క్షమించితిని. లేకుండిన ముక్కలు గావించి యుండెడివాడను, జాగ్రత. నా యెదుటనుండి లేచిపొమ్ము ! అని బుసలు కొట్టెను. రావణుని అహంకారమును, అజ్ఞానమును మాల్యవంతుడు లోలోన నవ్వుకొని ఈ దుర్మార్గుని అంత్యగడియలు ఆసన్నమగుచున్నవి. లేకున్న మంచిమాటలు హృదయమునకు చేర్చుకొనక విపరీతబుద్ధులకు వికారచేష్టలకు గురితియ్యచున్నాడు. అని చింతించెను. అప్పుడు మేఘనాధుడు లేచి, తండ్రీ మీరు విచారించకుడు. రేపు ప్రాతఃకాలమున నా రణకౌతుకమును చూడగలరు. నేను చెప్పుచున్నదానికంటె అధికంగా పనిచేసి చూపించెదను అని రావణునితో చెప్పెను. మేఘనాధుని వచనములు రావణుని కొంత శాంతపరచెను, సంతోషపరచెను. రావణునకు ధైర్యోత్సాహములు పుట్టెను. కొమారుని దగ్గరకు చేర్చుకొని అతనిశిరస్సుని ముద్దాడి, కొమారుని ధైర్యసాహసాలను కొనియాడెను. అర్ధరాత్రి కావచ్చెను. అంత సభను చాలించి యెవరి బసకువారు వెళ్ళిరి. వెళ్ళిరే కానీ, కంటికి నిదురలేదు, కడుపునకు తిండి

చేరదు, యే నిమిషము యేమి ప్రమాదము వాటిల్లునో అను ఆందోళన అందరి యందు వ్యాపించెను. దిగులుతో కుములుచుండగనే అరుణోదయమయ్యెను.

వానర భల్లూకములు నగరమును నలువైపులా ముట్టడించెను. లంకలో కోలాహలము చెలరేగెను. వానరుల కేకలు భూమి దద్దరిల్ల చేసెను. గర్జనలు మిన్నుముట్టెను. రాక్షసవీరులు కూడను విధిలేక శస్త్రాస్త్రములను ధరించి యెదురు తిరిగిరి. నగర ప్రాకారములనుండి వారు పర్వతములను విసరుచుండిరి. రాక్షసులు కోట్లకొలది చేరి శస్త్రాస్త్రములను ప్రయోగించిరి. ప్రళయకాల మేఘములవలె రాక్షసులు కూడా గర్జించిరి. వానరులు విసరిన పర్వతముల దాడికి రాక్షసుల శరీరములు జర్జరీభూతమయ్యెను.

# సంజీవినీ పర్వతము

వానరులు నగరమున ప్రవేశించుచున్నారన్నవార్తవిని, మేఘనాధుడు రౌద్రాకారుడై ఆయుధములను ధరించి బయలుదేరెను. రాక్షసులు రణభేరులను మ్రోగించిరి. "ఇంద్రజిత్తు" అతిరధశ్రేష్ఠుడు: వానింజూచి వానరులు పరుగెత్తిరి. పరుగులెత్తు వానరులను మేఘనాధుడు రౌద్రాకారుడై వీరాలాపములాడుచు, బాణములను సంధించి ఆకర్ణాంతము వాటినిలాగి బాణములను ప్రయోగించెను. రెక్కలుకల కాలసర్పములవలే ఆ బాణములు నలువైపుల పరుగులెత్తెను; అంత వానరులు వాని ఎదుట పడుటకు భయపడిరి; నిరుత్సాహులైరి. యుద్ధము చాలించి మరలిరి. కొందరు ఆ బాణముల బారికి నేలకూలిరి; మూర్ఛిల్లిరి. ఈ వానర సైన్యముల వ్యాకులమును జూచి, హనుమంతుడు కోపించి వానిమీదికి (అనగా మేఘనాధునిమీదికి) కాలునివలే పరుగులెత్తెను.

చెంతనున్న పర్వతమునుయెత్తి వానిపై విసరెను. కాలాంతకునివలే వచ్చుచున్న ఆ పర్వతమును మేఘనాధుడుచూచి అంతరిక్షమునకు ఎగిరెను: అంత వాని రధమును రథాశ్వములను సారథియు దానిక్రిందపడి నలిగిపోయిరి. అంత మేఘనాధుడు రాక్షసమాయలను అనేకముగపన్నెను. ఒకచిన్నపాము గరుత్మంతుని బెదరించిన విధమున వాడు హనుమంతుని బెదరించెను.

అంతటితో మానక, అంతరిక్షమునుండి మేఘనాధుడు నిప్పులను వర్షించెను. రక్తవర్షమును కురిపించెను. పట్టపగలు గాఢాంధకారమువ్యాపించెను. ఎవనిహస్తము వానికి కనబడలేదు. ఈ విధమైన మాయలచేత వానరులు మరింత వ్యాకులబడిరి; వానరులకు నేటితో తమజీవితములు అంత్యమగునని భావించిరి.

జరుగుచున్న ఈ రాక్షస మాయలనుచూచి శ్రీరాముడు లోలోననవ్వి, వానరులు అధైర్యపడుచున్నారని గుర్తించి, ఒక్క బాణమును ప్రయోగించెను. అంత ఆ రాక్షసునిమాయ మటుమాయమయ్యెను. సూర్యోదయమువలన అంధకారము వీడునట్లు రాక్షసునిమాయ వీడిపోయెను. వానరులను శ్రీరాముడు కటాక్షదృష్టితో చూచెను.

అంత వానరులశ్రమ శాంతించెను. వారు ప్రబలులై యుద్ధమునకు వెడలిరి. ఒక్కా తూరి "శ్రీరామచంద్రప్రభువుకు జై" అని జైజేలు కొట్టుచూ రణమున దుమికిరి. వారిని విరోధించుటకు శక్యము కాకపోయెను.

దీనికితోడు శ్రీరామాజ్ఞ ప్రకారము లక్ష్మణుడు ధనుర్బాణములుపట్టి హనుమంతునితోకూడి మేఘనాధునితో యుద్ధముజేయుటకు వచ్చెను. లక్ష్మణుడు మేఘనాధు నెదుర్కొనెనని రావణుడు విని తన కుమారునికి బలమైన మరికొంతమంది రాక్షసులను సహాయనిమిత్తము పంపెను. వానరులకు వృక్షములు, శిలలే ఆయుధములు. ఇట్లు ఉభయ సైన్యములు ఉద్దండపరాక్రమంబున విజృంభించి ద్వంద్వ యుద్ధము చేయుచుండిరి. వానరులు పిడికళ్ళతోగుద్ది నోటితో రాక్షసులను కొరికి, అదిమి చంప మొదలుపెట్టిరి. తలలు తెగగొట్టిరి. భుజములు వూడబెరికిరి. వానరులు చేయు ధ్వనులు నవద్వీపములలో నిండెను. శిరములులేని రాక్షస మొండెములు పరువులెత్తుచుండుటచూచి వానరులు నవ్వుతూ మరొకవైపున ఆశ్చర్యపడుతూ కేకలు వేసిరి. రణభూమిమీద లంకలోని జనసంచారపు రహదారులమీద రక్తమునిండెను; ప్రవహించెను.

లక్ష్మణుడు మేఘనాధుడు భయంకరముగ పోరాడిరి. వారి పోరాటములో ఒకరికొకరు సమానముగాకనుపించెను. ఇంద్రజిత్తు మాయోపాయములుపన్ని లక్ష్మణుని జయింప తలచెను. కాని వానిప్రయత్నములు వ్యర్థములయ్యెను. లక్ష్మణుడు ఉగ్రుడై ఇంద్రజిత్తు రథమునుకూల్చి రథసారథిని చంపెను. అంత ఇంద్రజిత్తు ఇంతటితో తన ప్రాణములు పోవునని తలంచి దేదీప్యమానముగ వెలుగుచున్న బ్రహ్మదత్తమగు మహాశక్తినితీసి లక్ష్మణుని హృదయమునకు తగులునట్లుగా గురి చూచి దానిని ప్రయోగించెను. అది ఎదురుతిరిగివచ్చి లక్ష్మణుని హృదయమునకు తగిలెను. వెంటనే లక్ష్మణుడు మూర్ఛిల్లెను. అంత వాడు నిర్భయుడై నేలపడిన లక్ష్మణుని చెంతకువచ్చెను. మేఘనాధునితో సమానముగా బలవంతులువచ్చి లక్ష్మణుని శరీరము నెత్తుటకు ప్రయత్నించిరి. కాని వారి ప్రయత్నములు నిష్ఫలమయ్యెను. కోట్లకొలది రాక్షసులు వచ్చిననూ అది సాధ్యముకానిది. కారణము ఆది శేషుని ఎత్తుటకు తగిన బలవంతులు కలరా? కడకు ఎందరువచ్చిననూ లక్ష్మణుని దేహమును కదిలించలేకపోయిరి. శ్రీరాముని కటాక్షముకలవారే లక్ష్మణుని కదిలించ గలరు.

ఇంతలో సాయంసమయమయ్యెను. ఉభయసైన్యములు, వారివారి కటకములకు విశ్రమించెను. శ్రీరాముడు వానర సైన్యమునుచూచి లక్ష్మణుడేడి అనిప్రశ్నిం

చెను. ఇంతలో హనుమంతుడు మూర్ఛిల్లిన లక్ష్మణుని దేహమును భుజములపై వేసుకొని రామారామా అంటూ వచ్చెను. అతని రాకను గమనించి శ్రీరాముడు కొంత కంగారుపడినటుల నటించెను. హనుమంతుడు తెచ్చిన లక్ష్మణుని దేహమును తన తొడపై పరుండబెట్టుకొని అనేకవిధముల ఆ దేహమును పరీక్షించుచుండెను.

ఇంతలో జాంబవంతుడు నాధా! కాలహరణముచేయక లంకలోవున్న సుషేణుడను వైద్యుని రప్పించుట మంచిదని కోరెను. ఈమాట వినగనే హనుమంతుడు సూక్ష్మరూపమునుధరించి లంకలో ప్రవేశించెను. ఇంతలో నేను పిలచిన సుషేణుడు వచ్చునోలేదో, అని తనలోతాను తలంచి, యేమైననేమిఅని సుషేణుని గృహమునే వూడబెరికి యెత్తుకొనివచ్చెను. అంత సుషేణుడు రామునికి నమస్కరించి ఔషధముపేరును అది లభించు పర్వతముపేరును చెప్పెను. దీనిని తెచ్చుటకు తగినవారెవ్వరు అని విచారించుచుండగనే హనుమంతుడు శ్రీరాముని చరణారవిందములకు నమస్కరించి అనుజ్ఞయొసగమని కోరెను. అంత రాముడు అనుమతి నిచ్చెను.

ఇంతలో సుషేణుడు రామసన్నిధిన కలడనువార్త నొక చారునిద్వారా రావణునకు తెలిసెను. రావణుడు కాలనేమితో తెలిపెను. అంత కాలనేమి "రావణా! నీ కన్నెదుటనే వాడు నీలంకను తగులబెట్టెనుకదా; అట్టి హనుమంతుని విరోధించుటకు నాకేమి శక్తికలదు. ఇప్పటికైననూ మించిపోలేదు. శ్రీరాముని జయింతుసన్న నీభ్రాంతిని నీవు వదలుము. శ్రీరాముని చరణముల నాశ్రయింపుము. అందువలన నీకు మేలుకలుగును. నీ అహంకారమును, మదమును విడచిపెట్టుము" అని రావణునకు హితోపదేశముజేసెను. అంత రావణుడు కోపించి వానిని ధిక్కరించెను. నా ఆజ్ఞప్రకారము చేతువా లేక నిన్ను హతము గావించమందువాఅని గర్జించగనే కాలనేమి శ్రీరాముని చేతులలో చనిపోవుట మంచిది, వీనిచేతులలో చచ్చుటెందులకని తలంచి ప్రయాణమయ్యెను.

మాయవన్ని దారిలోనొక సరోవరమును కల్పించి ఋషివేషముధరించి ధ్యాననిష్ఠుడై కూర్చొనెను. అంత హనుమంతుడు యుద్ధమునుండి విడివికివచ్చి విశ్రాంతియైననూ తీసుకొనక రామాజ్ఞను శిరసావహించి ఔషధమునిమిత్తమై పరువులిడినందున అలసిసొలసి దాహమువేసి దారిలో ఈ సుందరవనమును ఆశ్రమమును చూచి కొంత దాహముగ్రోల విశ్రమించి వెళ్ళుదమని ఆ ఆశ్రమములో ప్రవేశించెను; మునికి నమస్కరించెను. ఇంతలో ఆ కపటవేషదారి శ్రీరామునిగుణగణములు గానముచేయ నారంభించెను. హనుమంతుడు ఆశ్చర్యపడి తానుకూడనూ రామనామమును స్మరించెను. ఇంతటిలో కపటవేషధారియైన కాలనేమి, వానరా, రామరావణు

లకు యుద్ధము జరుగుచున్నది. నిత్యము నేను ఇక్కడనుండియే చూచుచున్నాను. తప్పక రామునకు విజయముకలుగును. ఇందులకు సందియములేదు. హనుమంతుడు ఆవార్తతో సంతసించి తాను దాహముతో బాధపడుచుండినట్లు తెలుపుకొనెను. అంత స్వకమండలములో చల్లనిపానీయము కలదనిచెప్పి నీటినిత్రాగుటకు హనుమంతునికి అందించెను. అంత హనుమంతుడు స్వామి ఈకొద్దినీరు నాకేమాత్రము దాహమును తీర్పజాలదు అని విన్నవించెను.

అంత కాలనేమి చెంతనేయున్న ఒక సరోవరమునుచూపి అందులో నీశ్రమ తీరా స్నానముచేసి జలమును త్రాగిరమ్మనమని చెప్పెను. ఆ మాటలకు హనుమంతుడు సమ్మతించి సరోవరము దగ్గరకుపోయెను. అతను సరోవరములో చల్లనినీరు త్రాగనెంచి తన పాదములను సరోవరములోపెట్టెను. ఇంతలో ఒక మకరమువచ్చి వానరుని పాదములుపట్టెను. ఆతక్షణమే హనుమంతుడు ఆ మకరమును ఝళిపించి చంపెను. మకరము ఆ శరీరమునువిడిచి ఒక దివ్యపురుషునిగా ఎదుటనిలచెను. ఈ దృశ్యమునుచూచి హనుమంతుడు ఆశ్చర్యపడి నీవెవడవు అని ప్రశ్నించెను. అంత ఆ మహాపురుషుడు, ఓ రామదాసా! మీ దర్శన స్పర్శలవలన నా పాపము నశించెను. నా శాపము మరలెను.

నేనును, కాలనేమియు పూర్వజన్మలో గంధర్వులము. దేవేంద్రుని సభలో గానము చేయుచుంటిమి. ఆ సమయమున దూర్వాసుడు అను మహాముని సభలోనికి వచ్చెను. అతని రూపురేఖలను చూచి నవ్వితిమి. అందుచేత నతడుకోపించిరాక్షసులై పుట్టుదని మమ్ములను శపించెను. మేము విచారించి అతని పాదములుపట్టి ప్రార్థించగా, ఓయీ! మీరిరువురు రాక్షసులై లంకానగరములో జన్మించెదరు. త్రేతాయుగ చతుర్థపాదములో శ్రీరాము డవతరించును. అప్పుడు మీ లంకలో గొప్ప యుద్ధము జరుగును. ఆ యుద్ధములో శక్తి తగిలి లక్ష్మణుడు మూర్ఛిల్లును. సంజీవి పర్వతమును తీసుకొనివచ్చుటకై హనుమంతుడు ఆ మార్గమున వెళ్ళును. అతని వలన మీ శాపవిమోచనమగును, అని అతడు కరుణించి మాతో జెప్పెను.

ఓ వీరుడా! సమీపముననున్న సుందరవనములోనివసించు ముని, మునికాడు. ముని వేషముతో నున్న రాక్షసుడు. అతడే కాలనేమి. నా మాట నమ్ముడు, అని గంధర్వుడు బోధించెను. తదుపరి హనుమంతుడు కపట ముని దగ్గరకు వచ్చి, ఓ గురుస్వామీ! ప్రథమమున మీరు గురుదక్షిణను స్వీకరింపుడు అనెను.

ఇంతలో నీరు త్రాగుటకై వెళ్లిన హనుమంతుడు ఇంత ఆలస్యము చేయుటకు కారణమేమని రాక్షసమాయతో విచారించి, తన గుట్టును ఆ కొలనులో వున్న

నా మిత్రుడు తెలిపెనేమో అని సందేహముతో విచారించుచున్న ఆకపటముని చెంతకు వచ్చి నిలిచిన హనుమంతుని చూచీ చూడనట్లుండెను. హనుమంతుడు వీని గుట్టును గుర్తించి తన వాలమును కన్నులు మూసి కూర్చొనియున్న ఆ కపట సన్యాసి మెడకు చుట్టి గిర గిర త్రిప్పి నేలగొట్టెను. అంత ఆ కాలనేమి రామా, రామా అంటూ ప్రాణములు వీడెను.

హనుమంతుడు కపటరాక్షసుని ప్రక్కకునెట్టి ద్రోణపర్వతమునకు వెడలెను. అతడు సంజీవి పర్వతమును చూచెను కానీ ఓషధులనతడు గుర్తు పట్టలేకపోయెను. ఆలస్యము చేయుట రామాజ్ఞ దాటినట్లగునని తలంచి ఆ పర్వతమునే హస్తమందుంచుకొని అయోధ్యానగర మార్గమునవచ్చెను. ఆ నిశీథ సమయమునభరతుడు రామ చింతన చేయుచు యేకాకిగా విచారించుచుండెను. అంతలో హనుమంతుని నీడ భరతునిపై పడెను. భరతుడు ఆ నీడ ఏమిటీ అని తలయెత్తిచూడ, పెద్ద పర్వతమును హస్తమందుంచుకొని వేగముగా యెగిరిపోవు ఒక కోతిని చూచి ఇది యేదో రాక్షస రూపముగా నున్నదని తలంచి, ఈ రాక్షసుడు ఇతరులకు యే ఉపద్రవమునూ కలిగించక మునుపే వాని రూపుమాపుట మంచిదనితలంచి చెంతనేయున్న బాణమును చేతపట్టి ప్రయోగించెను. ఆకర్ణాంతము ధనుస్సులాగి అతడు బాణమును విడిచెను. ఆ బాణము తగిలినంతనే హనుమంతుడు హా రామా! అని అరచెను. ఆ రామశబ్దమును విని భరతుడు దిగ్గునలేచెను. క్రిందపడిన వానరుని చెంతకు వెళ్లి అతని వృత్తాంతమును తెలిసికొని, దుఃఖించి హనుమంతుని కౌగిలించుకొని తన తప్పును క్షమించమని కోరి కన్నీరు కార్చెను. మనోవాక్కాయముల నేను హృదయపూర్వకముగ శ్రీరాముని చింతించుచే సత్యమయిన ఈవానరుని రక్షించి యధారీతిగా శక్తి నిచ్చుగాక అని ప్రార్థించెను.

భరతుడు ఆ రీతిగా విలపించి శపథముచేసిన వెంటనే హనుమంతుడు బాధ నుండి లేచి యధారీతిగా నిలిచెను. తదుపరి భరతుని పరీక్షించుటకు హనుమంతుడు ఇట్లు పలికెను: జై రామచంద్ర ప్రభువుకు జై. జై జై రఘురాంజీకి జై, అని పలికెను. అంత భరతుడు తనదుఃఖమును ఆపుకొనలేక భోరున యేడ్చి, ఓ కపీశ్వరా! మా సీతారామలక్ష్మణులు కుశలమా, మా తల్లి జానకీదేవి క్షేమమా, అని ఆనంద బాష్పములు కార్చుచూ అడిగెను. అంత వానరుడు జరిగిన యావత్ వృత్తాంతమంతయు భరతునకు తెలిపెను. జరిగిన విషయములను చింతించుచూ లక్ష్మణుని మూర్ఛ విని భరతుడు నేలకూలెను. తరువాత లేచి, హనుమంతా, నా పొరపాటును క్షమించి ఈ సమయములో నేను నిన్ను నిలబెట్టుట మంచిది కాదు. శీఘ్రముగా సంజీవిని

తీసుకొని పొమ్మనమని ఆజ్ఞాపించెను. అంత హనుమంతుడు భరతునకు నమస్కరించి పర్వతమును యెత్తెను. హనుమంతుడు కనుపించునంతవరకూ భరతుడు కన్నురెప్పవాల్చకచూచి, రామ క్షేమసమాచారము నేటికి తెలిసెను కదా అని ఒక వైపున ఆనందమును, సీత, లక్ష్మణుల పరిస్థితులను స్మరించి దుఃఖమును, భరించ లేక ఇంటికి వెళ్లి తల్లులకు ఈ వార్తను తెలిపెను.

తల్లి సుమిత్ర కొంత చింతించిననూ, తరువాత రాముడు కలడు కదా, అని ధైర్యమును వహించెను. తనలో తాను సుమిత్ర సంతోషించెను. నాగర్భమున పుట్టిన కుమారుడు, రామకార్య నిమిత్తమై తన దేహమును వినియోగించెను కదా, అంతేచాలును. నాజన్మ సఫలమయ్యెను. కానీ, ఈ సమయమున లక్ష్మణుని మూర్ఛ రామునినెంత బాధపెట్టెనో, తమ్ముని వియోగమునకు శ్రీరాముడెంత విచారించెనో, అని తలంచి శత్రుఘ్నుని చూచి, నాయనా! నీవు రాముని సహాయమునకు పొమ్ము, అని సుమిత్ర పలికెను. శత్రుఘ్నుడు సహితము దిగ్గునలేచి అంతకంటే మహా భాగ్యమా అని సంసిద్ధమయ్యెను. ఇంతలో భరతుడు, రామాజ్ఞ లేక నిన్ను పంపుట మంచిది కాదు, నీవిపుడు వెళ్లిన రాముడు అసంతృప్తి పడును కాన, అతని ఆజ్ఞను శిరసావహించుట మన కర్తవ్యము అని వోదార్చెను.

ఇచ్చట లంకాపట్టణమున శ్రీరాముడు లక్ష్మణుని కాపాడుచుండెను. ఇంతలో అర్ధరాత్రియు గతించెను. వానరులందరు రాముని బరివేష్టించి యుండిరి. రాముడు మానవ మాత్రునిగా, ఓ వానరులారా! అర్ధరాత్రి గతించెను. ఇంతవరకూ హనుమంతుని జాడ కనబడదు. ఒకవేళ ద్రోణగిరి మార్గము తెలియక మార్గము తప్పి కంగారుపడుచుండెనా, నా తమ్ముడు దీర్ఘ మూర్ఛయందున్నవాడు, అని లక్ష్మణుని చూచి అతని మోమును ముద్దిడుకొని, "తమ్ముడా, యేనాడును ఇంతకాలము నన్ను చూడక వుండినవాడవుకాదు కదా, నిద్ర అన్నదిలేక నిరంతరము నన్ను కనిపెట్టుకొని యుండువాడవు, నిన్నటినుండియు నన్ను వోదార్చువారులేక నీ పలుకులు వినక నేనెట్లు భరించగలను," అని అనేక విధముల పామరునివలే పలుకజొచ్చెను. ఇంతేకాక, "ఓ తమ్ముడా నా నిమిత్తము నీవు తల్లిదండ్రులను, సతిని విడచి నాతో వనమునకు వచ్చితివి, పడరానిపాట్లు పడితివి. నా కష్టములను లేశమైనను చూడలేక పోతివి. నీ స్వభావము కోమలము, నా కొరకై యెండకుయెండి, వర్షమునకు తడిచి, చలిబాధలనోర్చి, వేళవేళకు ఆహారము లేక, చిక్కిన ఆహారమును నాకందించి నీవు పస్తు పరుండెడివాడవుకదా! లక్ష్మణా, అట్టి నీప్రేమను పదురెండుగంటల నుండి అనుభవించలేకపోతిని కదా. తమ్ముడా, ఒక్కపరి కన్నుతెరచి నన్నుచూడు," అని

గడ్డముపట్టి ప్రాధేయపడునట్లు పలుకుచుండిన శ్రీరామునిచూచి కంటినీరు పెట్టని వానరుడు కనిపించలేదు. కొందరు వానరులు ఈ వియోగబాధను చూడలేక పర్వతములుయెక్కి, వృక్షములుయెక్కి హనుమంతుని జాడలను చూడదొడగిరి.

ఇంతలో హనుమంతుడు సంజీవిపర్వతమును పట్టుకొని ప్రత్యక్షమయ్యెను. కరుణారసముతో వీరరసమువచ్చి కలిసినట్లు హనుమంతుడువచ్చి వానరులతో కలిసెను. వచ్చిన హనుమంతునిచూచి వానరులు, ధన్యులము ధన్యులము, నీవు తెల్లవారక మునుపే రానియెడల మేము సముద్రమునపడి ప్రాణములువీడి యుండెడివారము. లక్ష్మణ వియోగబాధ భరించలేము. మా ప్రాణముల కాపాడితివి, నీఋణము మేమెట్లు తీర్చుకొందుము. ఇంతలో శ్రీరాముడు సంజీవిపర్వతమును తీసుకొనివచ్చిన హనుమంతునిచూచి పరమానందభరితుడయ్యెను. అంత సుషేణుడు నాలుగు విధముల (విశల్యకరిణి, సంధానకరిణీ, సావర్ణకరిణి, సంచారకరిణి,) ఈ నాలుగు మూలికలు లక్ష్మణునికి తగిలించెను. ఆ తక్షణము దిగ్గునలేచి లక్ష్మణుడు కూర్చొనెను. అతనినిచూచి రాముడు పరమానందముతో కౌగిలించుకొని, ముద్దాడి తమ్ముడా తమ్ముడా ఇంతకాల మెందుపోతివి. అని ఆనందబాష్పములను విడచుచూ బ్రహ్మానందమున మునిగెను.

ఇది ఇట్లుండ, ఈ సంజీవిపర్వతవాయువు తగిలినందున చచ్చిపడియుండిన వానరులందరు లేచి కూర్చుండిరి. వానరులందరూ ఆ లేచిన వానరులను కౌగిలించుకొని వారునూ బ్రహ్మానందమందిరి. హనుమంతుని పేవిధముల కొనియాడిరి.

అంత లక్ష్మణుని ఆశీర్వదించి సుషేణునికి రావణునిద్వారా ఎట్టి ఆపదా, కీడు కలుగకుండా కాపాడుదునని శపధముచేసి, హనుమంతునికి ఆజ్ఞాపించి, తన గృహముతోపాటు సంజీవినికూడా సుషేణునికిఇచ్చి లంకలో యథాస్థానమున దింపి రమ్మనమనెను. హనుమంతుడు ఆనందముతో గంతులువేయుచు తమ ప్రభువు, తమ సోదరవానరులు బ్రతికినందుకు పరమానందముతో సుషేణుని కొనియాడి అతనికి అనేకవిధముల కృతజ్ఞత చెప్పుచూ, లంకలో అతనిని యథాస్థానమును చేర్చెను.

తెల్లవారెను. లంకలో యుద్ధభేరీలు మ్రోగెను. వానరులు అమితోల్లాసముతో రామకటాక్ష బలమును చింతించుచు, అనేక యేనుగుల బలముగా వారు గంతులు వేసిరి. బలవంతుడగు ధూమ్రాక్షుడు ఆనాడు యుద్ధమునకు సిద్ధమాయెను. వచ్చిన ధూమ్రాక్షుని మహావీరుడు ఢీకొని రెండవదినము వధించెను. పిమ్మట అకంపనుడు

యుద్ధమునకు వచ్చెను. అతడు మహావీరుడు, పలువిధములుగ భయంకరమైన యుద్ధము చేసెను.

అతనికి యెదురుగా అంగదుడు పోరాడి ఆకంపనుని చంపెను. ఆకంపనుని మరణవార్త వినగనే ప్రహస్తుడు ఉగ్రుడై ఘీంకారముచేయుచు వచ్చెను. అతనిని నీలుడు యెదుర్కొని ఘోరయుద్ధము గావించి, రాముని స్మరించి, కుప్పించి యెగసి సంహరించెను. ప్రహస్తుడు నేలకూలగనే మహోదరుడు గర్జించుచూ వచ్చెను. అతనిని చంపుటకై సంసిద్ధముగావుండిన హనుమంతుడు మహావీరుడై గర్జించుచు పండ్లు పటపట కొరుకుచు మహోదరునిపై పడి అతనిని ముక్కలు ముక్కలు చేసెను.

కుంభకర్ణుని కుమారులైన కుంభనికుంభులు అనేకమంది రాక్షసవీరులతో యుద్ధమున అయిదుదినములు వానరులతో పోరాడిరి. ఆరవ దినమున కుంభనికుంభులు వీరస్వర్గము నందిరి. ఈ ఘోరమునుచూచి, లంకయందలి రాక్షసులు భయభ్రాంతులై తమప్రాణములు యేనిమిషమున కోల్పోదుమోఅని దిగులుపడి దాగుకొనుటకు పారిపోయిరి. వానరులను శరణుజొచ్చిరి, రావణుని అనేకవిధముల తూలనాడిరి, మండోదరి దగ్గరకు వెళ్ళి మొరబెట్టుకొనిరి. మండోదరి కూడనూ రావణుని దుర్బుద్ధికి చింతించి రాముని ప్రార్థించెను. ఇంతలో మహా యోధుడగు మకరాక్షుడు యుద్ధము చేసెను. అతనిని లక్ష్మణుడు యెదుర్కొని సంహరించెను. లక్ష్మణునిచే ఇట్టి సంఘటన జరిగిన తోడనే వానరులు జయజయ శబ్దములు జేసిరి. మహాయోధులందరూ నేలకూలిరన్నవార్తవిని రావణుడు విలపించెను.

కుంభకర్ణునిచెంతకు పరుగిడి అనేక ప్రయత్నములుచేసి అతనిని మేలుకొలిపెను. అనేకమంది రాక్షసులువెళ్ళి కుంభకర్ణుని కర్ణముల చెంత భేరీమృదంగములు వాయించిరి. కదలని కుంభకర్ణునిచూచి కోపించి రావణుడు అనేక ముష్టియుద్ధము వారలను రప్పించి గదలతో ముష్టితో తొడలపై కొట్టించెను. అంత కుంభకర్ణుడు కన్నులుతెరచి చూచెను. రావణుడు తనగోల చెప్పుకొనెను. కొడుకుల మరణవార్త వినిపించెను.

తన కొడుకులైన కుంభనికుంభుల మరణవార్త వినగనే మూర్ఛిల్లి, మేలుకొనిన కొలువినలే కండ్లెఱ్ఱచేసి, "ఓరీ మూర్ఖుడా! జానకి జగజ్జనని; ఆమెను దొంగలించి నందున నీకు శుభములు కలుగునా? నీవు చేసినపని యేమాత్రమూ సహించరానిది, నీ దుర్బుద్ధిచే లంకనే నాశముచేసుకొనుచున్నావు. ఇకనైననూ అభిమానము వీడి శ్రీరాముని శరణుజొచ్చుము. నీకు శుభము కలుగును. పరువు మర్యాదలను విడచి ధర్మమును తూలనాడి పరస్త్రీని అపహరించుట రాజధర్మమా! ఇది పరమార్థమా?

నీకు తగిన ఫలము వచ్చెను. రావణా! శ్రీరాముడు సామాన్యుడుకాడు, మోహముచే కామాంధురాలై శూర్పణఖ తన స్వార్థమునకుదిగి తన పన్నాగము నెరవేర్చుకొనక పోవుటచే ఆ కామాంధురాలు తగిన శిక్ష అనుభవించి, నిన్ననూ రెచ్చగొట్టి ఈకిరాతక చర్యలను చేయించెను. ఆడదాని వాంఛలను విశ్వసించి న్యాయాన్యాయములను విస్మరించి, చేతులార చేటుతెప్పించుకొంటివి, ఛీ," అని రావణుని తూలనాడెను.

అంత రావణుడు తన తప్పును కప్పిపుచ్చుకొని ఈ ఆపత్సమయమున నన్ను విడుచుట న్యాయముకాదు. నీవు యెట్లయిన మా యుద్ధమునకు సిద్ధముకమ్ము. నా ప్రాణముల కాపాడుమని, రావణుడు పరిపరివిధముల కుంభకర్ణుని ప్రతిమాలెను. విధిలేక సోదరాభిమానముతో యుద్ధమునకు సిద్ధమయ్యెను. కడవలు కడవలు కల్లు, బుట్టలు బుట్టలు మాంసముతెచ్చి ముందుపెట్టిరి. అంత కాలహరణము చేయక కుంభకర్ణుడు ఆ మాంస మధ్యపానములు ముగించి రణరంగమునకు బయలుదేరెను.

అతను వచ్చుటచూచి విభీషణుడు వాని యెదుటకువెళ్ళి పాదములకు నమస్కరించి తన పేరు చెప్పుకొనెను. తమ్ముడైన విభీషణుని లేవదీసి కౌగిలించుకొనెను. అప్పుడు విభీషణుడు సోదరా ? రావణుడు నన్ను సభలో కాళ్ళతో తన్ని అవమానము చేసెను. నేను పూర్వోత్తరముల నాలోచించి అతని కెన్నియో హితోపదేశములు చేసితిని, ధూర్తులైన మంత్రుల మాటలను విశ్వసించి నన్ను వారల ముందు భరించలేని అవమానపు మాటలాడెను. తాను భరించలేక నేను శ్రీరాముని శరణు జొచ్చితిని నేను దీనుడనని తెలుసుకొని, వారు సర్వజ్ఞులు కనుక, నన్ను స్వీకరించిరి. "ఓయీ, తమ్ముడా, రావణునకు మృత్యువు సన్నిహితమైనది. అందుచేత నెట్లు వాడు హితోపదేశములను మన్నించును. నిశ్చయముగ నీవు ధన్యుడవు, రాక్షసకులమునకు విభూషణము వంటివాడవు. ఆ సుఖసాగరుని, ఆ రఘుకుల రాముని నీవు సేవించుటవలన రాక్షసకులమంతయూ పవిత్రమయ్యెను. ఇక నీవు శ్రీరాముని సేవింపుము," అని కుంభకర్ణుడు తమ్ముని దీవించి, తమ్ముడా, నా పక్షము శత్రుపక్షమని విచారించక, నేను యుద్ధము చేయవలెను. నాకు సహితము కాలము సమీపించెను. నా మతము రావణునకు తెలియును. నీవు స్వపక్ష, పరపక్షమనుభేదమును విడచి శ్రీరాముని సేవింపుమనెను. ఇట్లు విభీషణుడు కుంభకర్ణుని దీవెనలను తీసుకొని రాముని వద్దకు వచ్చి, ఓ నాథా ! ఆ పర్వతాకారుడు, ఆ రణధీరుడు, కుంభకర్ణుడు మీతో పోరాడుటకు వచ్చెను, అని చెప్పెను.

విభీషణుని మాటలు వానరులు విని భరించలేని క్రోధముతో నిప్పులు గ్రక్కుచూ మహావీరుడు కుంభకర్ణుని మీది పరుగెత్తిరి. వృక్షములు, పెద్దపెద్ద శిలలు

కుంభకర్ణుని పైకి వానరులు విసర మొదలుపెట్టిరి. కానీ, వాని మనస్సు మొత్తము చలించలేదు. దేహము కదిలించలేదు. మదగజమును కంటిరెప్పతో కొట్టినట్లు ఆ ఆకారుని ఈ వానరులు యే మాత్రమును కదిలించలేకపోయిరి. ఇంతలో మహావీరుడు హుంకరించి కుంభకర్ణుని నొక్క గ్రుద్దు గ్రుద్దెను. ఆ గ్రుద్దుతో వ్యాకుల పడి వాడు సొమ్మసిల్లెను. అంతలో తెలివితెచ్చుకొని లేచి మహావీరుని బలముగా గ్రుద్దెను. ఆ గ్రుద్దుతో మహావీరుడు నేలకూలెను. ఇంతలో నలనీలులు కలిగించు కొని కుంభకర్ణునితో పోరాడిరి. కానీ కుంభకర్ణుని బలమునకు తాళలేకపోయిరి. వానరులు భయపడిరి, యెదుట నిలువలేకపోయిరి. సుగ్రీవ, అంగదాదులు సహితము సొమ్మసిల్లి నేలపడిరి. అంతలో కుంభకర్ణుడు సుగ్రీవుని చంకలో ఇరికించుకొని తీసుకొనిపోయెను. కపిరాజుని పట్టుకొనుటవలన వానరసైన్యమును జయించినట్లు కుంభకర్ణుడు తలంచెను.

ఇంతలో వాయుపుత్రుడు తెలివితెచ్చుకొని సుగ్రీవుని వెతుకుటకు ప్రారంభించెను. సుగ్రీవుడు మూర్ఛనుండిలేచి, కుంభకర్ణుని చంకనుండి తప్పించుకొనుటకు అనేకవిధముల ప్రయత్నము చేయుచున్న దృశ్యమును గాంచెను. ఈ లోపల హనుమంతుడు కూడను సమీపించెను. సుగ్రీవుడు అంతలో కుంభకర్ణునినుండి వేరై, అతనితో యుద్ధము ప్రారంభించెను. ఈ విధముగ యుద్ధముచేసి కుంభకర్ణుని ముక్కు చెవులను సుగ్రీవుడు కొరికివేసెను. పెద్ద శరీరము అగుటచే శ్వాస వెళ్ళుటకు వీలుకాక కుంభకర్ణుడు నానా అవస్థలు పడెను. ఇంతలో "రామజయం." "రామజయం" అంటూ వానరులు వేలకువేలుచేరి వృక్షములు,పర్వతములు వర్షము కురిపించిరి. కుంభకర్ణుడు ఉగ్రుడై వానరులపై దుమికి, అనేకమంది వానరులను పట్టి భక్షించెను. మరికొంతమంది అతని చేతులలో నలిగిపోయిరి. ఈ విధముగ వానర సైన్యమును చెల్లాచెదరు చేసెను.

ఈ దృశ్యమునుచూచి శ్రీరాముడు, లక్ష్మణుడు మొదలగు వారలతో "ఇక సహించజాలను ! నేనే స్వయముగ యుద్ధమునకు దిగక తప్పదు ! లక్ష్మణా ! ఆ అక్షయ తూణీరముల నిటుతెమ్ము." అని పలికెను. రామాజ్ఞను శిరసావహించి లక్ష్మణుడు అక్షయ తూణీరములను అన్నకు అందించెను. కోదండము ధరించి, సింహమువలే, శ్రీరాముడు యుద్ధభూమికి నడచుచుండ, లక్ష్మణ, సుగ్రీవ, హనుమంత, జాంబవంత మొదలాది వానరులు అతనిని అనుసరించిరి. రాముడు రెక్కలు గల కాలసర్పములవంటి బాణములను ప్రయోగించెను. ఆ బాణములు వాయువేగమున నలువైపుల ప్రసరించెను. కోట్లకొలది రాక్షసవీరులను, యోధులను సంహరిం

చెను. శ్రీరాముని బాణముల ధాటికి తాళలేక రాక్షసులు పారిపోయిరి. అంత విడచిన బాణములు తిరిగి వచ్చి రాముని తరక సంచిలో ప్రవేశించెను.

అంత శ్రీరాముడు రాక్షసులను అంతమొందించెనని తెలుసుకొని కోపోద్దీపితుడై సింహనాదముజేసి కుంభకర్ణుడు తిరిగి యుద్ధమునకు వెడలెను. వానిని చూచి వానరులు పరుగులిడిరి. చేయునది లేక రాముడు బాణము వానిపై విసరెను. అది వెళ్ళి కుంభకర్ణుని భుజములను ఖండించెను.

రెక్కలు లేని మందరపర్వతమువలె, భుజములు లేని కుంభకర్ణుడు ప్రకాశించెను. సింహనాదము చేయుచు రామునిమీదికి పరుగెత్తుకు వచ్చెను. అంత రాముడు ఆకర్ణాంతము ధనస్సు లాగి వాని ముఖమునిండునటులు బాణములు ప్రయోగించెను. అయినను కుంభకర్ణుడు నేలబడక, నిలిచివుండుట చూచి రాముడు మఱొక బాణమును విసరెను. ఆ బాణముతో కుంభకర్ణుని శిరస్సు తెగి క్రిందపడెను. రావణునకు ఈవార్త తెలియగనే మణిని పోగొట్టుకొన్న సర్పమువలె చాలా దుఃఖించెను. భూమి కంపించెను.

తలలేని కుంభకర్ణుని దేహము పరుగిడుచుండుట చూచి, రాముడు మరొక బాణము ప్రయోగించి ఆ మొండెమును రెండు ముక్కలు చేసెను. అంత వాని శరీరమునుండి వెడలిన కాంతి రామునిలో చేరెను. జపతపములు లేకయే రాక్షసుడు ముక్తి నొందెను. ఈ ప్రకారము ఆ జగదేకవీరుడు రణరంగమున ప్రకాశించుచుండెను. రాముని ముఖారవిందమున స్వేద బిందువులు శోభించెను. కుంభకర్ణుని రక్తబిందువులు రాముని శరీరముపైపడి కమలముపై నీరు నిలిచినటుల కాంతితో ప్రకాశించెను.

అంత సాయంసమయమయ్యెను. ఉభయపక్షములవారునూ, హోరాహోరిగా పోరాడి విరమించిరి. రామానుగ్రహముతో వానరబలము అధికమయ్యెను. తృణములవలన అగ్ని ప్రజ్వరిల్లు విధమున వానరులు విజృంభించిరి. అహోరాత్రములు రాక్షసులు నశించిరి. రావణుడు అనేక విధముల విలపించెను. మాటి మాటికి తమ్ముని శరీరమును హృదయమునకు హత్తుకొనుచూ యేడ్వసాగెను. మేఘనాధుడు వచ్చి అనేక విధముల తండ్రిని ఓదార్చెను. "రేపటి దినమున నా ప్రతాపమును చూపింతును; ఒక్క క్షణములో వానర సైన్యమును రూపుమాపుదును. నేటి దుఃఖమునకు మించిన ఆనందమును అందింతును," అని వ్యర్థమగు మాటలనెన్నియో చెప్పజొచ్చెను.

ఇంతలో తెల్లవారెను. వానర భల్లూకములు నగరమును ముట్టడించెనని

చారులద్వారా తెలిపెను. దానిని గుర్తించి రాక్షసులలో వీరులు శూరులు అయిన వారెందరో యుద్ధమునకు సిద్ధమై వచ్చిరి. ఎవరి బలములు వారు వినియోగించ మొదలు పెట్టిరి. ఆనాడు ఇరుపక్షములవారి యుద్ధము వర్ణనాతీతము. మేఘనాధుడు మాయారథము నారోహించి అంతరిక్షమున కెగసెను. అంతరిక్షమునుండి ప్రళయ కాల మేఘమువలె గర్జించెను. వానిగర్జన వినిన వానరులు భయమున తృళ్లిపడిరి. భూమి దద్దరిల్లెను. అంత ఒకక్షణములో మాయాసీతను కల్పించి దానిని రథము మీద పెట్టుకొని, రణరంగమునకు వచ్చెను. దానిని మొదలు వాయుపుత్రుడు చూచెను. అంతలో మేఘనాధుడు "ఓరీ హనుమా ! యెవరినిమిత్తమై మీరు యుద్ధ ము చేయుచుంటిరో ఆ జానకిని చంపుచున్నాను. చూడుము ! ఈమె సంహార ముతో యుద్ధము సమాప్తి కాగలదు," అని పలికి కత్తిని తీసి ఆ సీతను రెండు ముక్కలు చేసి క్రిందికి విసరెను.

అంత హనుమంతుడు పట్టలేని కోపముతో వానరయోధులను పిలిచి మీ ప్రాణములపై ఆశలువదలి యుద్ధముచేసి రాక్షసుల హతమార్చుడు. అని హెచ్చరించెను. అంత వానరులు ఘోరముగా యుద్ధముచేసిరి. వానరుల బారికి రాక్షసులు నిలువ లేక లంకలో ప్రవేశించిరి. ఆ క్షణముననే హనుమంతుడు రాముని చెంతకు పరుగిడి వచ్చి మేఘనాధుడు చేసిన, దుర్వ్యాపారమును తెలిపెను.

శ్రీరాముడు ఆ మాటను వినగనే విచారించినట్టుల నటన చేసెను. అది మాయ సీతయని రామునికి తెలియకపోలేదు. కాని సామాన్య మానవునివలె కొంత లీలగావించెను. అంత లక్ష్మణుడు కూడనూ విచారపడి సీత లేనప్పుడు మనకీ యుద్ధమేల అని అట్టి లోకమాతలేని ఈ లోకము నాకెందుకని లక్ష్మణుడుకూడా దుఃఖించెను.

ఈ వార్తవిని విభీషణుడు వచ్చి శ్రీరామునకు నమస్కరించి, "ఓ నాధా ! తమకు తెలియనిదికాదు. ఇది అంతయూ అసత్యము. అతి జాగరూకతతో జానకి కాపాడబడుచుండును. రావణుడు తప్ప మరొకడు తేరిచూడలేడు. మిమ్ములను మోహింపజేయుటకు మేఘనాధుడు మాయ సీతను కల్పించి దానిని సంహరించెను. మా రాక్షసులలో ఇట్టివి సర్వసామాన్యము. ఈ విషయము నాకు బాగుగా తెలియును." అని రామలక్ష్మణులకు చెప్పెను. అంత రాముడు లక్ష్మణుడు సంతసించి రాక్షసుల మర్మములను గుట్టుపెట్టుకొనక తెలిపిన విభీషణుని మెచ్చుకొనిరి. ఈ సత్యమును తెలుసుకొని హనుమంతుడు ప్రచ్ఛన్న రూపమునుధరించి లంకలో ప్రవేశించి జానకిని చూచివచ్చెను. జానకి క్షేమసమాచారమును హనుమంతుడు రాఘవులకు తెలిపెను.

అంత వానరులు సంతసించి, యుద్ధమునకు నడచిరి. మేఘనాధుడు తిరిగి వచ్చి యుద్ధము చేయనారంభించెను. ఈ సమయమున బాణములు, పరిఘలు, కృపాణములు, పరశులు, ప్రచండ పాషాణములు మొదలగువాటిని వాడు వర్షించెను. పట్టు, కొట్టు; అను భయంకరశబ్దములు వానరుల చెవుల పడుచుండెను. కాని యెవరు వారిని కొట్టుచుండిరో వారికి తెలియదు. వానరులు భీభత్సులయిరి. ఎటువైపున వెళ్ళుటకు వారికి తోచలేదు. ఇంతలో మహాబలవంతులగు నలుడునూ, నీలుడునూ, అంగదుడునూ, హనుమంతుడునూ సహితము దిగులుపడిరి. ఆ మేఘనాధుడు లక్ష్మణ, సుగ్రీవ, విభీషణులపై బాణములను ప్రయోగించెను. వారల శరీరములు చిల్లులు పడెను. వాటికి లేశమైననూ భయపడక వారు ఎదురు తిరిగి యుద్ధముచేసిరి.

అంత వాడు (మేఘనాధుడు) శ్రీరామునితో యుద్ధముచేయ నారంభించెను. సర్పములవంటి బాణములు అతనిపై మేఘనాధుడు ప్రయోగించెను అంత లీలామానుష సూత్రధారి ఖరదూషణాంతకుడు అగు రాముడు ఆ సర్పాస్త్రమునకు కట్టుబడెను. యుద్ధమునకు గౌరవము వచ్చుటకు శ్రీరాముడు నాగాస్త్రముచే బంధింపబడెను. ఇది శ్రీరాముని సుగుణచరిత్రము, మనోవాక్కాయములచేత అతని చరిత్రమును తర్కించుటకు శక్యముకాదు. శ్రీరాముడు బంధింపబడుటచేత వానరులు చికాకుపడిరి. భయభ్రాంతులకు గురియైరి. దీనిని మేఘనాధుడు చూచి దుర్వచనములు బలుకుచూ ప్రత్యక్షమయ్యెను. ఆ సమయమున జాంబవంతుడు వానిని జూచి "ఓరీ! దుష్టుడా! నిలువుము" అని గర్జించెను. అతని మాటకు మేఘనాధుడు మండిపడి, "ఓ నీచుడా! నీవు వృద్ధుడవు. నిన్ను విడచితిని, ఛీ! నీ మాటలు నాకేమి లక్ష్యము అని జాంబవంతుని తిట్టి, జాంబవంతునిపై ఒక త్రిశూలమును ప్రయోగించెను ఆ వచ్చుచున్న త్రిశూలమును జాంబవంతుడు యెగిరి పట్టుకొని దానిని తిరిగి మేఘనాధుని మీదనే బలముతో విసరెను. అది సూటిగా మేఘనాధుని హృదయమున గుచ్చుకొనెను. దానితో మేఘనాధుడు గిరగిర తిరిగి నేలకూలెను. అంత జాంబవంతుడు మేఘనాధుని పాదము పట్టుకొని గిరగిర నేలకొట్టెను. "ఓరీ! నేను వృద్ధుడనా! ఇప్పుడు నీకు నా బలము బాగుగా తెలియును." అని త్రిప్పి త్రిప్పి కొట్టెను.

కానీ వానికి మరణము రాలేదు. దానిని జాంబవంతుడు చూచి, బాగా త్రిప్పి లంకలోనికి విసరెను. పడిన మేఘనాధుడు తెలివి తెచ్చుకొని తన ప్రతిజ్ఞను పూర్తి చేయలేదు కదా అని తండ్రి ముఖము చూచుటకు సిగ్గుపడెను. ఆ స్థలమును విడచి, "నికుంభిలా" అను ఒకస్థలము లంకలో నొక యుపవనము, అక్కడ రాక్షసులనేక తపములుచేసి వరముల బొందిరి. అక్కడికి వెళ్ళెను. విభీషణుని నలుగురు మం

త్రులు గుప్త వేషముతో తిరుగుచుండిరి. ఈ వృత్తాంతమును తీసికొనివచ్చి విభీషణునికి తెలిపిరి.

అంత విభీషణుడు శ్రీరాముని చెంతకు వచ్చి ఓ నాథా! ఇప్పుడొక సమాచారమువింటిని. మేఘనాధుడు దుర్మార్గుడు, మాయావి, దేవకంటకుడు, ఇప్పుడువాడొక పాప యజ్ఞము చేయుచుండెను. వాని యజ్ఞమే సంపూర్తియైన యెడల వానిని జయించుటకష్టమనెను. శ్రీరాముడు విభీషణుని మాటలనువిని సంతోషించి అంగద హనుమంతులనుపిలిపించి ఓయీ తమ్ములారా మీరందరూ లక్ష్మణునితోకూడి వెళ్ళి యజ్ఞమును భంగముచేయుడు." ఓ లక్ష్మణా! నీవు వానితో యుద్ధముచేసి వానినిజయింపవలెను. దేవతలందరూ దుఃఖించుచుండిరి," అని శ్రీరాముడు ఆజ్ఞాపించగనే, విభీషణుడు, సుగ్రీవుడు జాంబవంతుడు యీ ముఖ్వురు కూడను అనేకమంది సైన్యమును కూర్చుకొని లక్ష్మణునితో సహాయముగావెళ్ళిరి. లక్ష్మణుడు ధనుర్బాణములనుధరించి అక్షయ తూణీరములను కట్టుకొని శ్రీరామునకు నమస్కరించి రాముని స్మరించుచు వెడలిరి.

అంగదుడు, నలుడు, నీలుడు, మైందుడు మొదలగు యోధులు హనుమంతుని వెంట నడచిరి. నికుంభిలా స్థలమునకు వారు చూచి వెళ్ళునప్పటికి మేఘనాధుడు మహిష మాంసమును రుధిరమును హోమము చేయుచుండెను. ఇంతలో వీరు యజ్ఞమును ధ్వంసము చేయనారంభించిరి. అయిననూ వాడు దీక్షను విడువక యుండెను. అప్పుడు వారు వ్యాజస్తుతి చేయనారంభించిరి. అప్పటికిని వాడు లేవక యుండెను. ఇదే సమయమని వారు మేఘనాధుని జుట్టుపట్టుకొని వానిని పాదములతో తన్నిరి. అప్పుడు వాడు దిగ్గునలేచి త్రిశూలము పట్టుకొని వారిమీదికి వెళ్ళెను. అంగదుడు, హనుమంతుడును వాని నెదుర్కొనిరి. వారిని వాడు త్రిశూలముతో కొట్టెను. ఆ దెబ్బతో వీరు నేలకూలిరి.

అంత లక్ష్మణుడు ఆ త్రిశూలమును రెండు ముక్కలుగా దునిమెను. ఇంతలో వాయుపుత్రుడునూ, అంగదుడునూ తెలివితెచ్చుకొని వానిని కొట్టిరి. ఆ దెబ్బలకు వాడేమాత్రమూ లొంగలేదు. వాటిని లక్ష్యము చేయలేదు. అంత లక్ష్మణుడు మృత్యుతుల్యమగు బాణమును వానిపై ప్రయోగించెను. పిడుగువంటి లక్ష్మణుని బాణములను వాడుచూచి అంతర్ధానమయ్యెను! అనేక మాయావేషములను వేసి దొంగయుద్ధము చేయుచుండెను. అంత లక్ష్మణుడు సహించక అమోఘములగు బాణములను సంధించి, శ్రీరాముని ప్రతాపమునుస్మరించి విడచెను. ఆ బాణము వాని హృదయమును భేదించి వానిప్రాణములు తీసెను. రామా, లక్ష్మణా అనుచు ప్రాణములు వీడెను. వాడు అంత్య సమయమున రామలక్ష్మణులను స్మరించుటచేత

అంగదుడు, హనుమంతుడు, విభీషణుడు మేఘనాధుని కొనియాడిరి. నిరాయాసముగా వాని కళేబరమును మహావీరుడు ఎత్తిపట్టుకొనివచ్చి లంకాద్వారమువద్ద పెట్టి వచ్చెను. లక్ష్మణుడు శ్రీరాముని చెంతకువచ్చి నమస్కరించెను. శ్రీరాముడు ప్రసన్నాననుడై తమ్ముని జూచి మేఘనాధుని మరణవార్తనువిని తమ్ముని ముద్దాడెను. విభీషణ, హనుమంత, నల, నీల, అంగదులను చెంత చేరుకొని రాముడు వారల కౌగిలించుకొని వారల దేహములను స్పృశించెను. అంత వారిబాధలు మటుమాయమై గాయములు ఎండిపోయెను. శ్రీరాముని ప్రసన్నతను చూచి వానరులు సంతోషించిరి. శ్రీరాముని కటాక్షదృష్టి వానరులపై పడెను; వారల శ్రమ అంతయూ క్షణములో నివారణ మయ్యెను.

ఇంతలో మేఘనాధుని మరణవార్త మేఘనాధుని భార్య అయిన సులోచనకు దాసీలద్వారా తెలిసెను. రావణుడు దుఃఖముతోమునిగి క్రోధముతో పండ్లుకొరికి, ఇంతకాలము ఈ చిన్నకార్యమును మేఘనాధుడూ, కుంభకర్ణుడూ సాధించగలరని తలంచితిని, వారి వారి పురుషార్థమును నేను కన్నులార చూచితిని; వానరులచేత మేఘనాధుడు సంహరింపబడుట నాకు సిగ్గుచున్నది. వానరులచేత చంపబడువారు యేపాటి వీరులు. "ఓ కులవధూ, నీవు శోకమును విడచిపెట్టుము. నేను వారివంటి వీరుడనని తలంచకుము. ఒక నాలుగుగడియల కాలములో నీవు శాంతించగలవు. నా బలపరాక్రమములను ఘోర సంగ్రామములో జూడగలవు. నీ భర్తను చంపిన శత్రువుల శిరస్సులనుద్రుంచి తీసుకొనివచ్చెదను. ఇందులకు సందేహము లేదు." అని సులోచన చెంతకుపోయి ప్రగల్భముల నాడెను, కోపముచే మండిపడిపోయెను.

అంత ఆ సౌశీల్యవతియైన సులోచన, "హే దశాననా! ఇంకనూ శత్రువులను జయింపగలనను ఆశకలదా ? మీరు మహా మోహాంధకారమున బడియుంటిరి. మామగారితో ప్రతిభాషలాడుట పాపమనితలచి వారితో వాదించుట విరర్థకమని గ్రహించి నాలోనేను మింగియుంటిని. మీ రోషమే ఈ లోకములోని రాక్షసుల నాశమునకు మూలకారణము. మీరు శ్రీరాముని జయించలేరు. ఇది సత్యము, సత్యము" అని దిగ్గునలేచి యేడ్చుకొనుచూ మండోదరివద్దకు వెళ్ళెను.

అత్త చరణములుపట్టి నా యీ దుర్గతికి నీ పతియే కారణమనియూ నీకునూ నేడోరేపో ఇట్టి దుర్గతి రాక తప్పదనియూ కఠినవాక్కు లాడదొడగెను.

అంత మండోదరికూడను రావణుని దుర్బుద్ధికి విచారించి, సులోచన చెప్పిన వాక్యములు పరమ సత్యములనియు విలపించెను. మండోదరి సులోచనలు శ్రీరాముని గుణగణములు వర్ణించి సీతయొక్క సౌశీల్యమును కొనియాడి కడకు

శ్రీరామదర్శనమైననూ మనకుకలిగిన జన్మ సార్థకమగునని తమలో తాము చింతించిరి.

రావణుడు కోడలయిన సులోచన దుఃఖమును చూడలేకపోయెను. ఆమె మాటలు శూలములవలె హృదయమున నాటుకొనిపోయెను. విపరీతముగా దుఃఖించి అంతటి కుమారుని కోల్పోతినికదాఅని నేలకూలి తలనుకొట్టుకొనుచూ విలపిల్లెను. ఇక తాళలేక శివాలయమునకు వచ్చి ప్రార్థించెను. అంత మంత్రులువచ్చి "ఓ రాజా! యెందులకు వ్యర్థముగ విచారించెదరు. ఆకాశముమీద మేఘములవలె ధనము, పుత్రులు, పతులు, సతులు మొదలగునవన్నియూ నశ్వరములు. మేఘములోని మెరుపువలే జీవనము క్షణభంగురము. ఈసంగతి తెలిసికూడను మీరింత మోహమున మునుగుట మంచిదికాదు. ముందుస్థితిని విచారింపుడు. శత్రువులను నశింపజేయుటకు తగిన యుపాయమును జూడుడు." అని యెన్నియో విధముల ఓదార్చిరి.

# అహిరావణుడు

అంత నాలుగు గడియలు రాత్రి గతించెను. అంత రావణుడు ఇరువది చేతులు జోడించుకొని శివునికి నమస్కరించెను. ఇంతలో పాతాళములోనుండిన అహిరావణుని మనసు భ్రమించెను. ఎందుచేత రావణుని మనసు వ్యాకులమయ్యేను అని వాడు చింతించి మనస్సున అనుమానించి, లోకమంతయూ వానికి వశము వానిని జయించు వీరుడులేడు అని చింతించెను. నిజముగా వాడు కామదదేవిని తప్ప మరి యొకరిని ఉపాసింపడు: ఆ దేవిని ధ్యానించెను, రావణుని జాడను ధ్యానమున కని పెట్టి రావణుడు వుండిన శివదేవాలయము దగ్గరకు వచ్చెను. అహిరావణుడు తన పేరు చెప్పుకొని రావణునకు నమస్కరించెను.

అహిరావణుడు తండ్రిని చూచి విచారమునకు కారణము లడిగెను. రావణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసినదిమొదలు నేటివరకూ జరిగిన విషయములు చెప్పెను. ఆ మాటలు విని అహిరావణుడు చింతాక్రాంతుడై, "ఓ రావణా, లోకములో నీతిమార్గము సర్వ జనాదరణీయము. ఆ మార్గమును విడిచి అధర్మమార్గము ననుసరించుటవలన భయము కలుగును. పూర్వోత్తరములను విచారించక నీవు వైరమును ప్రకటించి యుద్ధమునకు దిగితివి. అందువలన నీ వంశమును నీవు నాశము చేసుకొంటివి. మనుజుని ప్రతాపమును, ప్రభావమును నీకు తెలియదు. అందరికంటే గొప్పవానిని నీవు మిక్కిలితక్కువవానిగ భావింతువు. నేనీ మాటలను చెప్పదగదు. నేను రామలక్ష్మణులను హరించి పాతాళమునకు గొనిపోదును. అక్కడ నా కామదదేవికి బలియిత్తును రాక్షస వంశమునకు సంపూర్ణ యశస్సును తీసుకొని వత్తును, అని రావణునకు చెప్పి, రావణునకు నమస్కరించి, దేవిని స్మరించి శ్రీరాముని కటకమునకు వచ్చెను.

అహిరావణుడు స్వమాయాబలముచేత వానర సైన్యములను గాఢాంధకారముతో కప్పెను. ఎవనిహస్తము వానికి కనబడనంత చీకటి క్రమ్మియుండెను. వానర యోధులు జాగరూకులై యుండిరి. వారి కటకములో ప్రవేశించుటకు కాలుడు సహితము వెనుదీయును. అపుడు ఒక యుపాయమును మహావీరుడుపన్ని తోకనుపెంచి

దానితో గుండ్రముగా ఒక మహోన్నతమగు కోటనుకట్టెను. కుండలము కట్టియుండిన సర్పరాజువలే అతడు కుండలాకారముగ దానిని కట్టెను. పర్వతమువలే మహోన్నతముగ దానిని నిర్మించెను. ఆకోట సింహద్వారమువద్ద మహావీరుడుకూర్చొనెను. అహిరావణుడు ఆ చిత్రమునుచూచి మనస్సులో దిగులుపడెను. ఒక వుపాయమయినను వానిబుద్ధికి తోచలేదు.

అప్పుడు వాడొక కపటవేషమును ఆలోచించి విభీషణుని వేషమును ధరించెను. మెల్లిగ మహావీరుని దగ్గరకువచ్చెను. మహావీరుడు స్వభావసిద్ధముగ మహాప్రతాపుడు. కపటవేషమువేసిన అహిరావణుడు ఓ సఖుడా! నేను రామునివద్దకు వెళ్ళవలెను. నేను దీనికిపూర్వము శ్రీరాముని ఆజ్ఞనుగైకొని సంధ్యావందనము చేయుటకు వెళ్ళియుంటిని, సంధ్యావందనమయ్యెను. శ్రీరామదర్శన నిమిత్తము వెళ్ళవలెను. తక్షణమే వెళ్ళకున్న స్వామిఆజ్ఞను మీరినవాడనగుదును కనుక నన్ను త్వరలో లోపలకు విడువుము అని కపటపుమాట లాడెను. ఆమాటలు సత్యమని మహావీరుడునమ్మి నిజముగా విభీషణుడే అని తలంచి మహావీరుడు లోనికివిడిచెను. అంత అహిరావణుడు లోనికివెళ్ళెను. ఆ సమయమున అలసి, నలుడు, నీలుడు, సుగ్రీవుడు, తదితరయోధులు నిద్రించుచుండిరి. శ్రీరాముడుకూడను పండుకొనియున్న లక్ష్మణునిమీద హస్తము పెట్టుకొని నిద్రించుచుండెను.

కపట విభీషణునివేషమునుధరించివచ్చుచున్న అహిరావణుడు రామునిదృష్టికి రాకపోలేదు. కానీ లీలామానుష విగ్రహుండు, రాక్షస సంహారనిమిత్తమై అవతరించెను కనుక రావణుని సంతతినంతయూ హతమార్చవలెను. అందువలన ఏమీ తెలియని వానివలే సామాన్య మానవులకు గోచరమగురీతిగా ఈ నాటకములు ఆడదొడగెను. ఏఏ కాలమునకు ఏఏ ప్రదేశముల ఎవరెవరిని హతమార్చవలెనో, ఎవరితో ఎవరిని చంపించవలయునో, అది అన్యులతరముకాదు. అందువలన తన నాటకము తన వ్యూహములోనే జరుపవలెను.

ఇదియిట్లుండ ప్రవేశించిన కపటవేషధారియైన అహిరావణుడు మోహన మంత్రము జపించి వానరయోధులను నిద్రయందుముంచి రామలక్ష్మణులను పాతాళ లోకమునకు బంధించి తీసుకొనిపోయెను. కొంతకాలములోనే వానరయోధులు లేచి చూడ రామలక్ష్మణులు లేరు. వారు పరుండిన స్థానము మహా లోతైనగోయగా ఏర్పడియుండెను. దీనినిచూచి వానరయోధులలో, హాహాకారము పుట్టెను. చంద్రుడు లేని రాత్రివలే జలములేని కమలములవలే కళాహీనులై పడిరి.

వానరులు వెలవెలబోయిరి. ఒక్కొక్క రొకదిశ వెతుకుటకు బయలుదేరిరి.

సముద్రపు గట్టునకు వెళ్ళిరి. కటకముచుట్టూ ఎన్నోవిధములవెతికిరి. రామలక్ష్మణుల జాడయే కనుపించలేదు. దుఃఖాక్రాంతులయిరి. ధైర్యమును విడనాడి శోకసంతప్త మానసులై "రాక్షసులందరూనశించిరి ఒక్క రావణుడుమాత్రమే మిగిలెను. ఆదురభి మాని ఒక్కడే హతశేషుడు. అయ్యో ఈ దౌర్భాగ్యమునకు గురియైతిమే" అని పలువిధముల వానరులు వానరయోధులు విలపించిరి. సుగ్రీవుడు మూర్ఛిల్లెను. ఈ సమాచారము ఇంతవరకూ విభీషణునికి తెలియదు. విభీషణుడెక్కడ అని వెతుకు చుండ అతడు సంధ్యవార్చుకొని తడిగుడ్డలతో సముద్రమునుండి వచ్చుచుండెను. అతనినిచూచి వానరులు మహాదుఃఖముతో రామలక్ష్మణులు కనుపించలేదన్నవార్తను తెలిపి, రోదన చేసిరి.

విభీషణుడుకూడను క్షణమువిచారించి తరువాత రాక్షసులమాయలు తనకు బాగుగా తెలియునుకనుక, "విచారింపకుడు. రండి. కటకమునకు వెళ్ళుదమ"ని వారిని ఓదార్చి కటకమునకు వచ్చెను. మహావీరుని అడుగగా మీరే దీనికిపూర్వము వచ్చి నా అనుజ్ఞపడసి లోనికి వెళ్ళితిరికదాఅని నిర్భాంతవచనము లాడెను. అది గమనించి విభీషణుడు, "ఓ వానరులారా! విచారించకుడు. ఈమాయలు, రావణుని కౌమారుడైన అహిరావణునకు బాగుగాతెలియును. వాడు పాతాళమున నివశించుచున్నాడు. ఈభూమి యొక్క లోయనుచూడ తప్పక వాడే శ్రీరామలక్ష్మణులను పాతాళమునకుగొనిపోయి యుండును. ఇందు సందియములేదు," అని దృఢముగా పలికెను.

నావేషమును ధరించవలెనన్న వాడుతప్ప మరియొకడు ధరింపలేడు. వాడు మహామాయావి. ఆలస్యముచేయక మనలో యెవరైనా బలవంతుడు పయనమైవెళ్లట మంచిదని కోరెను. అటూఇటూచూచి, విభీషణుడు ఓ హనుమంతుడా! నీ బలపరాక్రమములు లోకవిదితములు. నీవు శీఘ్రముగాపోయి ఆ కృపాసాగరుల నిరువురినీ తీసుకొనిరమ్మని అని ఆ పాతాళమునకు పోవు మార్గములన్నియు వివరించెను. అంత సుగ్రీవుడు అంగదుడు జాంబవంతుడు హనుమంతుని అనేకవిధముల అడుగుకొనిరి. అంత హనుమంతుడు "మహారాజా, శెలవు," అని సుగ్రీవునితో ఆజ్ఞతీసుకొని వానర యోధులకూ, వానరులకూ మరేమాత్రమూ భయపడకుడనియూ, ఎవ్వరైననూసరే, ప్రాణములు పోయిననూసరే, రాక్షసులతోపోరాడుడు. క్షణకాలములో రామానుగ్రహ ముండిన శ్రీరామలక్ష్మణులతో మీముందు నిలుతును అని జైరామ జైరామ అని గర్జించి వెడలెను.

అతను వెడలివెడలి అలసి ఒక చెట్టుక్రింద కూర్చొనెను. ఆ వృక్షముమీద నివసించెడి రెండు జంటపక్షులు ఒకదానితోఒకటి సంభాషించుచుండెను. పక్షిభాష

ఎరిగినవాడగుటచే హనుమంతుడు ఆ వాక్యములను శ్రద్ధగా వినదొడగెను. అందులో మగపక్షి, "ఓ ప్రియురాలా అహిరావణుడు శ్రీరామలక్ష్మణులను నిన్నటిదినము తీసుకొని వచ్చెను. వాడు నేడే తనదేవియైన కామదకు వారిని బలియిచ్చుటకు అన్నియూ సిద్ధము చేసుకొనుచున్నాడు. బలియిచ్చిన తరువాత ఆ కళేబరములను పారవేయును. పవిత్రమైన ఆ దేహమును మనము తినవచ్చును. ఈనాడు మనకు పండుగదినము" అని చెప్పుచుండెను.

మహావీరుడువిని దిగ్గునలేచి శ్రీరాముని స్మరించుచూ, తోకత్రొక్కిన పాము వలే రౌద్రుడయి, నా రామప్రభువులు ఇప్పటి కేమయివుందురో ఆలస్యము చేయ రాదని రివ్వునఎగిరి పాతాళమునదిగెను; అహిరావణుని నగరమును ప్రవేశించెను.

కానీ ద్వారమువద్ద మకరధ్వజుడను వానరుడు నిలిచియుండెను. వాడు ఈ మహావీరుని ఎదిరించెను. కడకు వాని పుట్టుపూర్వోత్తరములునెరింగి మంచిమాటలతో శ్రీరామలక్ష్మణుల విషయమును తెలుసుకొనెను. ఈనాడు ప్రొద్దుగుంకులోపల రామలక్ష్మణులను దేవికి బలియిచ్చుటకు అన్నియు సిద్ధముచేసెనని మకరధ్వజుడు చెప్పెను.

అంతలో హనుమంతుడు ఓయీ వారు నివసించు స్థలమేది అని అడుగగా మకరధ్వజుడు అన్నివిధముల వివరములు తెలిపెను. కానీ "నేను ప్రభుపుకార్యమున నియమించబడితిని కనుక నాకేబాధలు సంభవించిననూ నిన్నుమాత్రము లోపల విడువను, మన జాతి అభిమానమునుచూపి నిన్ను లోపవిడిచిన నేను మనజాతికే అప్ర తిష్ఠ కలిగించిన వాడనగుదును. నీకు నీ రామప్రభువెంత ప్రధానమో నాకు నాప్రభు వైన అహిరావణుడు అంత ప్రధానము. కాన మనయిద్దరికి ఎంత సన్నిహిత సంబం ధమున్ననూ, ప్రభువాజ్ఞమీరను కాన నీవు నన్ను జయించి లోపలకు వెళ్ళవచ్చు" నని మకరధ్వజుడు నీతివాక్యములాడెను. అందులకు హనుమంతుడు సంతసించి, యుద్ధమునకు సిద్ధమై అనేకవిధముల వానితో పోరాడెను.

కడకు కాలహరణముచేయుట మంచిదికాదని తలంచి హనుమంతుడు మకర ధ్వజుని తన వాలముతోచుట్టి దూరముగావిసిరి, లోన ప్రవేసించెను. ఆసమయమున ఒక మాలాకారుడు పుష్పమాల తీసుకొని లోనకు వెళ్ళుచుండెను. ఇది మంచిసమయ మని హనుమంతుడు అణురూపమును ధరించి, ఆమాలలోచేరి కించిత్ భారమైననూ లేక అతితేలికగా ఎవరికీ కనుపించక, అనుమానమునకు అవకాశములేక, రాక వుండునట్లు అందులో చేరెను.

ఆ పూలమాలను, అహిరావణుడు దేవినిపూజించి మెడలో వేసెను. అనేక

విధముల పదార్థములతో దేవికి నైవేద్యముచేసెను. చేసిన నైవేద్యములన్నింటినీ మహావీరుడు నోరుతెరచి భుజించెను. దీనినిచూచి చుట్టుచేరిన రాక్షసులందరూ నేడు దేవి మహారాజునకు ప్రత్యక్షమయినదని సంతసించిరి. మహారాజుసహితము ఈనాడు నాభాగ్యము పండెనని ఆనందించెను. ఇంతలో శ్రీరామలక్ష్మణులు బలిపశువులకు అలంకారములు చేసినట్లు వారినిఅలంకరించి అటుఇటు రాక్షసులు పట్టుకొని బలి పీఠమునకు తీసుకొనివచ్చుచుండ మహావీరుడు చూచెను. రామునే చింతించుచూ లోలోన నమస్కరించెను. ఇంతలో రామలక్ష్మణులను దేవిముందు నిలబెట్టి వారి కుత్తుకలమీద కత్తులుపెట్టించి మహా బలవంతులైన రాక్షసులను సిద్ధపరచెను.

"దేవికి మంగళహారతి యిచ్చిన తక్షణమే ఆజ్ఞాపింతును. మీరు బలియిచ్చుటకు సర్వవిధములా సిద్ధముగా వుండుడు," అని ఆ రాక్షసులకు అహిరావణుడు ఆజ్ఞాపించెను. లీలామానుష విగ్రహులైన రామలక్ష్మణులు దేవిమెడలో నైవేద్యమును భుజించినవాడు హనుమంతుడని తెలిసికొని లోలోన సంతసించుచుండిరి. చిరునవ్వులు చిందులు త్రొక్కుచున్న ఆ రామలక్ష్మణులనుచూచి అహిరావణుడు రౌద్రుడై, క్షణ కాల జీవితమునకు ఇంతటి ఆనందమా, పడుడు, కొన్ని నిమిషములలో యమరాజ్యమున ఆనందింతురు, అని కఠినమైన వాక్కులు ఆడుచూ, ఆ దుర్మార్గుడు వారలను లక్ష్యముచేయక చులకనగా పలుకుచుండెను.

ఇంతలో రాక్షసపురోహితుడు లేచి, రాజనీతి ననుసరించి శ్రీరామలక్ష్మణులకు వారి రక్షితులను తలంచుటకు అవకాశము ఇవ్వవలెనని అహిరావణునితో తెలిపెను. అంత ఆ రాక్షసుడు లేచి ఓరాజకుమారులారా! మీహితమును కోరువా రుండిన వారిని చింతించుడు, కాలము సమీపించినది అని గర్జించెను. అప్పుడు రామలక్ష్మణులు ఒకరి ముఖము నొకరు చూచుకొని చిరునవ్వులు నవ్విరి.

ఆ సమయమున మహావీరుడు గర్జించెను. అతని మేఘగర్జనను రాక్షసులువిని దేవి ప్రత్యక్షమైనదని హడలిపోయిరి. ఇంతలో పెద్ద నోరుతెరచి, ఓరీఅహిరావణా! నీవు చేయుపని ఏమాత్రము సరియైనదికాదు. కపటవేషమును ధరించి ఈదేవదేవుని తెచ్చితివి. ఇట్టి దుర్మార్గపుపని దేవిమాత్రము అంగీకరించునా? వాయువు వీచినపుడు జలము అల్లకల్లోలమగునట్లు దురభిమానులగు రాక్షసులు భయముచే చలించిరి. ఒక్కక్షణములో భయంకరరూపమును ధరించి మహావీరుడైన హనుమంతుడు ఆదేవి చేతియందుంచిన పదునైన ఖడ్గమును చేతపట్టి అహిరావణుని ముక్కలుముక్కలు జేసెను. కానీ వానిదేహము వజ్రదేహము. ఎన్నిపర్యాయములుకొట్టిననూ ముక్కలు వలె విరుగును కానీ తిరిగి అతుకుకొనుచుండెను. కడకు రాముని మదిలోతలంచి

జై రామ అని శిరస్సును ఒక చేతియందుంచుకొని మరొకచేతిలో గొంతునుకోసి హోమగుండములో వేసెను.

ఇంతలో మకరధ్వజుడు ఎదురయ్యెను. తక్షణము ఆఅహిరావణుని శిరస్సున నున్న కిరీటమును మకరధ్వజుని తలపై పెట్టి అతనికి రాజ్యాభిషేకముచేసి నిరంత రం రామలక్ష్మణులను చింతించుచుండుమని మకరధ్వజునకు ఉపదేశించి, శ్రీరామ లక్ష్మణులను తన రెండుభుజములమీద కూర్చొనబెట్టుకొని ఒక్కయెగురులో లంకను చేరెను. వేయికన్నులతో ఎదురు చూచుచుండిన వానరయోధులు, వానరులు, విభీష ణాదులు రామలక్ష్మణులనుచూచి పట్టలేని ఆనందమొందిరి.

సుగ్రీవుడువచ్చి రామలక్ష్మణులకు నమస్కరించి, హనుమంతుని కౌగిలించు కొని మా ప్రాణములను కాపాడిన మహావీరుడవు. నీ ఋణమును మేము ఏరీతిగాను తీర్చుకొనలేమని వర్ణించిరి. వానరులందరూ హనుమంతుని వేయివిధముల పొగడిరి. అతనిని ఎత్తుకొని ముద్దాడిరి, కౌగిలించుకొనిరి; వారల ఆనందమునకు అంతులేక పోయెను. అంత విభీషణుడు ఆనందభాష్పములు విడుచుచూ "శ్రీరామా, నీ లీల లనంతములు. నీకార్యము నీకుతప్ప అన్యుల కర్థముకాదు. పాతాళలోకముననున్న రాక్షసులనుకూడా హతమార్చ సంకల్పించి ఇంత నాటకమాడుచున్నావు," అని వర్ణిం చుచూ నమస్కరించెను.

రామలక్ష్మణులను హనుమంతుడు తెచ్చుకొన్నాడన్నవార్త రావణునికి తెలిసెను. తన కుమారుడైన అహిరావణుడుకూడా హతుడయ్యెనని తలంచి విలపించెను, నేల కూలెను. వాని నేత్రములనుండి నీరు కాలువలై ప్రవహించెను. అపుడు మందోదరి రావణునివద్దకువచ్చి పలువిధముల అతనిని వోదార్చెను. కానీ వాడు యేమాత్రమును ఆమె మాటలను లెక్కచేయక రౌద్రుడై ధైర్యము తెచ్చుకొని దిగ్గునలేచెను. ఆ సమయమునకు ఒకమంత్రి అతనిదగ్గరకు వచ్చెను. అతనిపేరు సింధురనాధుడు. వయోవృద్ధుడు, మహాజ్ఞాని. అతను దీనికిపూర్వము యెల్లప్పుడు విభీషణునివద్ద వుం డెడివాడు. అతను అనేకవిధముల నీతివాక్యముల చెప్పనారంభించెను. అతని జ్ఞానోప దేశములు ఆ రావణుని చెవిలోబడలేదు. అంతటితోపోక అతనికి ఆ వాక్యములు పరమ అసహ్యముగా తోచెను. ఇంపుగా లేకపోయెను.

అతనిచేష్టలకు మంత్రి విచారించి, వినాశకాలే విపరీతబుద్ధిః. ఇతనికి వినాశ కాల మాసన్నమయినది కనుక హితవాక్యములను యిష్టపడకున్నాడని తనలోతాను తలంచి, రావణుని ప్రాపంచరీతుల వోదార్చెను. అంత రావణుడు ఇక నా వంశమే నాశమయ్యెకదా. హతశేషుడెవ్వడూ లేకపోయెను అని విచారించెను.

ఇంతలో వృద్ధమంత్రి, మహారాజా! ఎందుల కట్లనుచున్నారు. నరాంతకుడని ఒక కుమారుడున్నాడుకదా. అతడు డెబ్బదిరెండుకోట్ల రాక్షసులకు ప్రభువు. దూతను పంపి వానిని పిలిపించుము. నీ శత్రువులను నిశ్చయముగ సంహరించును, అని మంత్రివర్యుడు చెప్పిన మాటలనువిని రావణుడు సంతసించెను. అంత ధూమకేతు డను దూతను రప్పించి, నీవు మహాచతురుడగు నా కొమారుని తీసికొనిరమ్ము అని వాని వూరుపేరులు వివరముగాచెప్పి పంపెను. రావణుని ఆజ్ఞప్రకారము దూతవెళ్ళి జరిగిన వృత్తాంతమంతయూ నరాంతకునకు చెప్ప వాడు మండిపడి తక్షణమే బయలుదేరి వచ్చెను.

వచ్చిరావడముతోడే వానరసైన్యము పైబడెను. అంత హనుమంతుడు నరాంతకునిచూచెను. "ఓయీ ధూమకేతూ! ఇట్లు పరుగెత్తి వచ్చినవాడెవడు? అతని శరీరమంత భయంకరముగ నున్నదేమిటి?" అని నరాంతకుడు అడిగెను. ధూమ కేతువు "స్వామీ, అతడే హనుమంతుడు, మహావీరుడు, బలవంతుడు. మీ సోదరుల నందరినీ హతము చేసినవాడును, లంకను భస్మమొనరించినవాడును అతడే" అని తెలిపెను. అంత నరాంతకుడు మండిపడి, ధనువునకు బాణము సంధించెను. అంత మహావీరుడు వాటిని బట్టుకొని రెండు ముక్కలుగ ఖండించెను. వానిగుండెను ముష్టితో పొడిచెను. వానిని గిరగిరత్రిప్పి రసాతలమునకు విసిరివేసెను. తరువాత కోట్లకొలది వాని సైన్యమునుకొట్టి సముద్రమున త్రోసెను. రథములు, సారథులు చూర్ణములైరి.

ఈ ఘోరమైనవార్త రావణునకు తెలిసి నిలువునా కూలిపోయెను. ఇంతటి ఘోరయుద్ధము జరుగునని కలనైనా తలంచలేదు. నరాంతకుని నేలకూల్చిరన్నవార్త లంకకంతటికీ భీకరమైన వార్తగా చెలరేగెను. మహాపండితులు వచ్చిరి. రావణుని అనేకవిధముల ఓదార్చిరి. హితోపదేశములు చేసిరి. వారు చెప్పుమాటలు ఏవియూ రావణుని తలకు చేరలేదు.

మూర్ఛనుండి లేచెను. కోడలైన నరాంతకునిభార్యయయిన బిందుమతినిచూచి ఆమె రోదనవిని భరించలేని దుఃఖముతో మండిపోవుచున్న కోపముతో దేహమునే మరచెను. ఈవిధముగ విలపించుచుండగనే తెల్లవారెను. నాలుగు సింహద్వారముల వద్ద వానరులువచ్చి యుద్ధమునకు సిద్ధముగానున్నారన్న వార్త వినెను. రావణుడు రాక్షసయోధులను పిలిచి వారితో ఇట్లు ప్రసంగించెను. "ఓయోధులారా! యుద్ధము చేయుటకు మీగుండెలు జారినయెడల మీరిప్పుడే యుద్ధమునుండి మరలుట యుచి తము. యుద్ధముచేయుచూ సగములో మీరు పారిపోయిన మంచిదికాదు. అట్లు చేసితి

రేని నేనోర్వను. నా చేతులతో మీ ప్రాణములు తీయుదును," అని ఈ ప్రకార ముగా చెప్పి వాయువేగమువంటి రథమును సిద్ధముచేసెను. రణభేరులు మ్రోగుచుండెను. చీకట్లను వ్యాపింపచేయుచుండెను. కాటుకకొండలో యనునట్లు అతులిత బలవంతులగు రాక్షసవీరులు వెడలిరి. అప్పుడు దుశ్శకునములు కనబడెను. భుజబలముచే గర్వించిన రావణుడు వానిని లెక్కచేయలేదు.

చేతులలోనున్న ఆయుధములు విరిగి క్రిందబడెను. రథముపైనుండి రథికులు నేలపడిరి. గజాశ్వములు రోదనచేసెను. నక్కలు, కుక్కలు శోకారాగములుతీసెను. రావణుని మృత్యువు సమీపించెనని ఎరిగిరి లంకలోనివారందరూ. కాలునిదూతవలె గ్రుడ్లగూబ అరచెను. రాక్షసుల రథ, గజ, తురగ, పదాతులతోకూడిన చతురంగ బలములు యుద్ధమునకు నడచెను. ఆ సైన్యము నడచుచుండ భూమి అదరిపడెను. వర్ణనాతీతముగనుండెను. నానావిధ ధ్వజపతాకములు శోభించెను. మదగజయోధులు కోట్లకొలది యుద్ధమునకు వెడలిరి. వీరవసంతుడు తన సేనలను వ్యూహముపన్ని యుద్ధమునకు నడిపించినట్లు రాక్షససైన్యములు శోభించెను. భేరీ, నఫేరీ, సహానాయి మొదలగు వాద్యములు చెలరేగెను. వీరులు సింహనాదము చేసిరి.

ఇదిఇట్లుండ, బాణములతో నెగురగొట్టబడిన తెక్కలుగల పర్వతములవలె మహా క్రూరులగు వానరభల్లూకములు కాలునివలె యుద్ధమునకు వెడలిరి. నఖములును, దంతములును, పర్వతములును వృక్షములును వానరులు తమ ఆయుధములుగ జేసికొనిరి. మదగజమువంటి రావణుని సంహరించుటకు "రామచంద్రమహారాజునకు జయమగుగాక" అని వానరులు సింహనాదముజేసిరి. రాక్షసులు ద్వంద్వ యుద్ధము నారంభించిరి. సరిసమానులయిన యోధులు పోరాడిరి. రావణునకుజై అని రాక్షసులు, రామజీకి జై! అని వానరులు ఘోషించిరి. ఉభయ సైన్యములు నెదుర్కొనెను. రాక్షసులు కాలునివలె రౌద్రాకారులై వానరుల దార్కొనిరి. వానరుల శరీరములనుండి రక్తము ప్రవహించెను. వానరులు రాక్షససైన్యములను మర్దించి మేఘములవలే గర్జించిరి. రాక్షసులను పండ్లతోకొరికి కాళ్ళతో తన్నిరి. రాక్షసులను గట్టిగా పట్టుకొని దవడలను చీల్చిరి. రాక్షసుల ప్రేగులనుతీసి వానరులు హారములుగాధరించిరి. రాక్షససైన్యములు విరిగిపడుట రావణుడుచూచి చేతులలో ధనుస్సులను బాణములను పట్టుకొని పరుగులెత్తుచున్న రాక్షససైన్యముల మరలించెను.

రౌద్రాకారుడై వచ్చుచున్న రావణుని వానరులుచూచి హాహాకారములుచేసి ఎదుర్కొనిరి. పర్వతములను, వృక్షములనుతెచ్చి వానిపై ప్రయోగించిరి. అవి వజ్రమువంటి వాని శరీరమును తగిలి చూర్ణమయ్యెను. రావణుడు నలువైపుల గిర

గిర తిరిగి వానరులను మర్దించెను. వానరులు భయపడి పలుదిక్కులకు పరువెత్తిరి. ఓ రామా! ఓ సుగ్రీవా, త్రాహి త్రాహి అని మొరలుపెట్టిరి. ఓ రఘువీరా రక్షింపుము. రక్షింపుము అని అరచిరి. భూనభోంతరాళములు బాణములతో నిండెను. దశదిక్కులకు వానరులు పరుగెత్తిరి. కోలాహలము నలువైపుల వ్యాపించెను వానర సైన్యములవ్యాకులమునులక్ష్మణుడుచూచి,కోపముతోతరకసమునునడుమునకుబంధించి ధనుర్బాణములనుధరించి శ్రీరామునిచరణములకునమస్కరించి యుద్ధమునకువెళ్ళెను

లక్ష్మణుడు రావణునిచూచి, "ఓరీ, దుర్మార్గుడా! వానర భల్లూకముల చంపిన నీకేమి ప్రయోజనము? కాలునివంటి నన్ను చూడుము" అని గర్జించెను. అంత రావణుడు "ఓరీ! నీవు నా పుత్రఘాతుకుడవు. అనేక దినములనుండి నిన్ను వెతకుచున్నాను. ఈ దినము నిన్ను చంపినతరువాత నాగుండెలు చల్లబడును" అని రావణుడు హుంకరించి తీక్ష్ణములగు బాణములను ప్రయోగించెను.

లక్ష్మణుడు వానిని వేయిముక్కలుగ ఖండించెను. అంత లక్ష్మణుడు సూటియైన బాణములు విసరి రావణుని రథమును, రథసారథిని చూరుచూరు చేసెను. నూరునూరు బాణముల నొక్కపరి లక్ష్మణుడు విసరుచూ వచ్చెను. అవి రావణుని ముఖమునను హృదయమునను గ్రుచ్చుకొని, ఆ దెబ్బలతో నేలకూలెను. స్పృహ తప్పెను. కానీ వాడు మూర్ఛనుండి దిగ్గునలేచి రౌద్రాకారుడై బ్రహ్మదత్తమగు ప్రచండ శక్తిని లక్ష్మణునిపై ప్రయోగించెను. అంత లక్ష్మణుడు నేలకూలెను. ఇంతలో మహావీరుడుచూచి పరుగెత్తివెళ్ళి దూర్వాక్యములను బలికెను. లక్ష్మణుని చెంతకు వచ్చెను. వచ్చిన హనుమంతుని రావణుడు ఒక్కగ్రుద్దు గ్రుద్దెను. దానితో మహావీరుడు చతికిలబడెను. కానీ నేల పడలేదు.

దిగ్గున లేచి రావణుని ముష్టితో పొడిచెను. అంత రావణుడు తన బలమును దూషించుకొంటూ, "నా పౌరుషము కాల్చనా! వానరుని పిడిగ్రుద్దు యింత బలమైనదా" అని తనలోతాను హనుమంతుని బలమును వర్ణించెను. అంత లక్ష్మణుడు దిగ్గునలేచి యెదుర్కొనెను. అంతలో రావణుడు స్పృహతప్పి పడిపోగనే సారధి రెండవ రథముపై వేసుకొని లంకకు తీసుకొనిపోయెను.

లంకలో చేరగనే తెలివికలిగి అనగా మూర్ఛనుండి లేచి పాతాళ హోమము చేయనారంభించెను. రావణు డెంత మూర్ఖుడు! రామునితో విరోధించి జయమును సాధించగలడా? వాడు తలపెట్టిన పాతాళహోమము గూఢచారులవల్ల విభీషణునికి తెలిసెను. తక్షణమే విభీషణుడు శ్రీరాముని చెంతకువెళ్ళి పాదములపైబడి "ప్రభూ! వెంటనే వానరులను పంపి, పూర్వము మేఘనాధుడు చేయుచుండినట్టుల రావణుడు

చేయుచున్న పాతాళయజ్ఞమును వానరులచేత భంగముగావింపు"డని ప్రార్థించెను. ఆ యజ్ఞమే సాంతమయినయెడల వానిని జయించుట దుష్కరము. అంత ప్రాతః కాలమయ్యెను. శ్రీరాముని ఆజ్ఞప్రకారము అంగద, హనుమంతులు యజ్ఞవాటికకు నడచిరి. కౌతుకముచేయుచు గంతులువేయుచు వానరులు లంకలో ప్రవేశించిరి. రావణుని గృహమును జొచ్చిరి. యజ్ఞదీక్షలోనున్న రావణుని చూచి, "ఓరీ! లజ్జాహీనుడా! రణమునువదలి గృహమునకు పారిపోయి ధ్యానము చేయుచూ కూర్చుంటివా!" అని హేళనచేయుచు, అంగదుడు వానిని కాలితో తన్నెను.

రావణుడు స్వార్థపరుడై యుండినందున వారిని చూడలేదు. అంత అంగద హనుమదాదులు వానిని పండ్లతో కొరికిరి. జుట్టు పట్టుకొని లాగిరి. అంత రావణుడు కాలాగ్నిరుద్రుడై మండిపడి దిగ్గున లేచి వానరుల పాదములు పట్టుకొని గిరగిర త్రిప్పి నేలగొట్ట ప్రయత్నించెను. కానీ పాదములను కదలించలేకపోయెను. అంత మరింత అవమానముతో క్రోధముతో, వానరులు రావణుడు పోరాటము. జరుపుటతో యజ్ఞము ధ్వంసమాయెను. అంత రావణుడు చింతించెను.

వానరులు రాముని చెంతకు చేరి జరిగిన వృత్తాంతము నెరిగించిరి. విభీషణుడు సంతసించెను. రావణుడు "యజ్ఞమును సాధించలేకపోతినికదా" అని నిరాశ చేసుకొని, మండిపడి యుద్ధమునకు వెడలెను. వాడు యుద్ధమునకు బయలుదేరిన క్షణముననే అనేక దుశ్శకునములు యెదురయ్యెను. గ్రద్దలు వాని శిరస్సుపై వాలెను. వాని కిరీటమును తన్నివేసెను. అయిననూ లక్ష్యము చేయక వాడు రణభేరీలను మ్రోగింప ఆజ్ఞాపించెను. రాక్షసులు క్షణములో లక్షలకు గుమిగూడిరి. రామునితో యుద్ధము చేయుటకు బయలుదేరిరి.

అంత రాముడుకూడనూ నడుమునకు తూణీరములను హస్తమున ధనుస్సును ధరించెను. ఆజానుబాహువులును విశాల వక్షమునుగల శ్రీరాముడు యుద్ధమునకు నడచెను. దేదీప్యమానముగ రణరంగమున వెలుగుచున్న శ్రీరాముని దివ్యమంగళ విగ్రహమును దేవతలు చూచి తమలోతాము వర్ణించుచూ నమస్కరించిరి. వానరులు అతి జాగ్రత్తతో రాముని అనుసరించిరి.

ప్రళయకాలమున పిడుగులను రువ్వుచూ వెడలు సంవర్తక మేఘములవలె రాక్షసుల నాశము నిమిత్తము వానర సైన్యము వారిని దార్కొనెను. ఉభయపక్షములవారు విసరుచుండిన పర్వతములు పిడుగులవలె ధ్వని చేయుచు పడుచుండెను. క్షణములో రాక్షసుల రథ, గజ, తురగములు నేలకూలెను. వేలకువేల రాక్షసులు నేలకూలిరి. రక్తము నదులై పారెను.

అంత రావణుడు "రాక్షసులందరూ హతమారిరి, నే నేకాకిని. వానర భల్లూకము లనేకులుకనుక నేనురాక్షసమాయను వి స్తరించెదను" అనిరావణుడు తనలోతాను విచారించెను. ఆ రాక్షసమాయ రాముని విడిచిపెట్టి తదితరులపై ప్రసరించెను. అంత రాముడు సంకల్పింప యెక్కడ చూచిననూ రామలక్ష్మణులు, అనేక కోట్ల వానరులు గోచరించిరి. ఈ దృశ్యమును రావణుడు చూచి తన మాయాశ క్తి యే మాత్రమూ ఉపయోగములేదని లోలోన తలంచెను.

# రావణ సంహారము

అంత రాముడు వానరయోధులను, వానరులను దగ్గర పిలిచి, "ఓ యోధు లారా! వానరులారా! మీరింతకాలము యుద్ధముచేసి అలసిపోతిరి. మీరిక విశ్రాంతి తీసికొనుడు. ఇక రామరావణ యుద్ధమును చూడుడు." అని గంభీర వాక్యములాడెను. అంతలో రావణుడు గర్జించి ఢీ! మని రాముని యెదుర్కొనెను. అంత రాముడు "ఓ మూర్ఖుడా! మొదలు నే చెప్పబోవు నీతివాక్యములు ఆలకింపుము. లోకమున మూడువిధముల మనుజులు కలరు. ఒకరు పాటలీ వృక్షమువంటి వారు. అది పుష్పించును. కానీ దానికి ఫలములుండవు. మాటలు చెప్పువారీవృక్షము వంటివారు. మాటలే కానీ కార్యము శూన్యము. రెండవ తరగతివారు రసాలముతో సమానులు, అది పుష్పించి ఫలించును. అటులనే వారు మాటలు చెప్పి కార్యమును చేయుచుందురు. ఇక మూడవ తరగతివారు పనసచెట్టుతో సమానము. దానికి పుష్పము లుండవు కానీ అది ఫలించును. అటులనే వారు మాటలు చెప్పక కార్యములు చేయుచుందురు. నీవు వట్టి మాటలు ప్రగల్భములాడుచున్నావు. కానీ నీ నీతిలేని పరిపాలన నీజాతికే కీడుచేసెను" అని పలికెను. అంత రావణుడు "ఓయీ! నీవు నాకు బోధించెదవా!" అని అనేక దుర్వాక్యములాడి పిడుగువంటి బాణములను ప్రయోగించెను. అంత రాముడు ఆగ్నేయాస్త్రము విడచెను. అది రావణుని బాణములను నాశము గావించెను. కోట్లకొలది చక్రములు, త్రిశూలములు రావణుడు రామునిపై విసరెను. కానీ దుష్టుని మనోరథము వ్యర్థమయ్యెను. రాముడు ధనుస్సులాగి బాణములను ప్రయోగించెను. సర్పములవలె ఆ బాణములు మహా వేగముగ వెళ్ళెను.

రాముడు ఖండించుకొలది వానికి శిరస్సులు పుట్టుచుండుట రాముడు గమనించెను రావణుడు తన మరణముసంగతి మరచి గర్వించి, గర్జించెను. క్రింద పడిన రావణుని శిరస్సులు, "రాముడేడీ, లక్ష్మణుడేడీ, సుగ్రీవుడేడీ" అంటూ నేల పడి దొర్లుచుండెను; ఉన్న శిరస్సులు విభీషణుని దూషించ మొదలుపెట్టెను. "ఓరీ తమ్ముడా! రాజ్యమునుకోరి రాముని శరణుజొచ్చి సోదరుని మరణవార్తకై వేచి

యుంటివా?" అని నానావిధముల తూలనాడెను. "ఓరీ! నీవు విరాగివి కానీ వీరు డవుకాదు. ఛీ,పొమ్ము నీ ముఖము చూడరాదు" అని కేకలు వేసెను. ఇట్లు అనేక పర్యాయములు నేలపడి లేచి వీరుడై భయంకరయుద్ధము గావించెను. అతని వీరత్వ మును లక్ష్మణ, సుగ్రీవ, అంగదాదులు మెచ్చుకొనిరి; ఆశ్చర్యపడిరి.

కడకు రాముడు ఇక కాలహరణము చేయరాదని తలంచి పాపాత్ముని పాప కర్మలు దినదిన ప్రవర్థమానమగుచున్నవని భావించిరి. ఇంతలో నల నీలాది వానర యోధులు, పాషాణములు వానిపై విసరిరి. ఇంతలో చీకటి క్రమ్ముకొనెను. అందరూ యుద్ధము చాలించిరి.

ఆ రాత్రి త్రిజట జానకివద్దకు వచ్చి రామరావణ యుద్ధమును గురించి వివరించెను. రాముడు ఎన్నిసారులు శిరస్సులు, భుజములు త్రుంచిననూ తిరిగి పుట్టుచూ వచ్చుచున్నవి. ఎన్ని శిరస్సులు వూడిననూ మరలా అన్ని శిరస్సులు పుట్టు చున్నవని తెలుపగనే సీత ముఖము వెలవెల బోయెను సీత చింతతో దుఃఖించెను. ఈ విచిత్రమును చూచి త్రిజట, "తల్లీ! మీరు విచారించకుడు, రాముడు త్రుంచి ననూ వాని శిరస్సులు తిరిగివచ్చుటకు కారణము వానిహృదయములో జానకి రూపము కలదు" అని త్రిజట చెప్పుటచేత జానకికి హర్షవిషాదములు కలిగెను. అంత త్రిజట, "ఓ రాజకుమారీ! నీవు సంశయమునువిడచిపెట్టుము! వానికిచావు త్వరలోనే కలదు రామునకు జయము కలదు. రాముడు బాణము విడచునపుడంతయూ నిన్ను స్మరించుచున్నాడు. అందువలన రాముని బాణము వానిని యేమియూ చేయ జాలకున్నది. కాన నీవు విచారించకుము. నిన్ను మరిపించు గడియలు రానున్నవి. ఎపుడు నిన్ను రావణుడు మరచునో అపుడు వాని చావుతథ్యము. అదియూ సమీ పించుచున్నది," అని త్రిజట తెలిపెను.

రెండవ దినము రావణుని మాయా ప్రభావమువలన వికృతిరూపములుగల ప్రేత పిశాచ గణంబులు ధనుర్బాణములు ధరించి ప్రత్యక్షమయ్యెను. యోగిను లొక హస్తముతో కత్తి పట్టుకొని, రెండవ హస్తముతో మనుజుల తల పుఱ్ఱెలుపట్టు కొని రక్తము పానము చేయుచు నాట్యమాడుచు, గానము చేయుచు, కొట్టు పట్టు అను శబ్దములు చేయుచుండిరి. వానరు లెటువైపున పరుగెత్త అటువైపున మండు చుండిన మంటలు వారియెదుట నిలుచుండినట్లు గోచరమయ్యెను. ఈ ప్రకారము వానర భల్లూకములు వ్యాకులపడిరి. అంతటితో విడువక వానరులపై ఇసుక వర్ష మును కురిపించెను. వానరులు పడుచున్న వ్యాకులమును చూచి రావణుడు సింహనా దము చేసెను. లక్ష్మణ, సుగ్రీవాది వానరయోధులు నిశ్చేష్టులయిరి. "హా రామా!

హా రామా!" అని యోధులు మొరపెట్టిరి. ఈ మాయాప్రభావముచే అనేక హనుమంతులు పర్వతములు పట్టుకొని ప్రత్యక్షమై శ్రీరాముని నలువైపుల ముట్టడించిరి. ఆ మాయా హనుమంతులు వాలములను పైకెత్తి రాముని పట్ట ప్రయత్నించిరి. దశదిశలా వారి వాలములు కనుపించెను.

కానీ శ్రీరాముడు శ్యామలశరీరుడై దేదీప్యమానముగ ప్రకాశించుచుండెను. ఇది రావణుని మాయాజాలమని రామునికి తెలుసు. అందుచే రాముడు ఈ రావణుని పిచ్చిచేష్టలనుచూచి తనలోతాను నవ్వుకొనుచూ వాడు చేయువాటిని యేమాత్రమును లక్ష్యముచేయక ఒక్క బాణమును ప్రయోగించి వాని మాయా జాలమును రూపుమాపెను. ఆ మాయ రూపుమాసిన తక్షణమే వానర భల్లూకములు చాలా సంతసించిరి. సూర్యోదయమున వెంటనే మబ్బులు మాయమయినటుల రామ బాణము ప్రయోగించగనే రావణమాయలను మబ్బులు అంతర్ధాన మాయెను. అంత వానరులు శైలపాషాణములు పట్టుకొని రావణునిపై విసరుటకు కుప్పించి యెగిసిరి. అంతలో రాముడు ఒక సూటియైన బాణమును విడిచెను. అది కాంతులుగ్రమ్ముతూ వెళ్ళి రావణుని శిరస్సులు ఖండించెను. అంత మరలా ఆ శిరస్సులు మొలచుచుండెను. ఈ రీతిగా రాముడు ఖండించడం తిరిగి మొలచడం ఇది రామునకు ఒక వినోదముగ ఆటవలె కనుపించెను. లాభము వచ్చిన కొలది లోభమధికమగు విధమున వాని శిరస్సులు ఖండింపబడుచుండెను. రామరావణ యుద్ధమునకు మరొకటి సాటిలేక పోయెను. "గగనం, గగనాకారం, సాగర స్సాగరోపమః" ఆకాశమునకు ఆకాశమే ఉపమానము, సాగరమునకు సాగరమే ఉపమానము; రామరావణ యుద్ధమునకు, రామరావణ యుద్ధమే ఉపమానము.

రామరావణ యుద్ధము పదునెనిమిది దినములు జరిగెను. రామునకు ఇది శ్రమగా కనుపించలేదు. ఒక కళావినోదముగ నుండెను. కారణం. పదునాలుగు సంవత్సరములు పూర్తిఅగుటకు కాలము ఉండినందున ఇది యొక ఆటగా రాముడు రావణునితో ఆడెను. రాముడు సంకల్పించిన రావణుడు ఏపాటివాడు ? పదునెనిమిది దినములు గడువగనే రాముడు తీక్ష్ణమగు బాణమును సంధించెను. ఆ సమయమున, అన్నియూ రావణునకు అశుభములే కనుపించెను. నక్కలు, గాడిదలు మొదలగునవి మొరపెట్టెను. ఖగమృగములు ఆర్తనాదము చేసెను. అంతరిక్షము నుండి ఉల్కాపాతములు పడెను. దశదిశలా అగ్నిమంటలు ప్రజ్వరిల్లెను. మండోదరి హృదయము కంపించెను. లంకలోని అన్నిదేవాలయములలోని విగ్రహములు కన్నీరు పెట్టెను. ప్రచండ వాయువులు భయంకరముగ వీచెను.

ఈ ఉత్పాతములను జూచి అంతరిక్షముననున్న దేవతలు జయజయ శబ్దములు చేసిరి. అంత రాముడు ఆకర్ణాంతము నారినిలాగి యేకకాలమున ముప్పదియొక్క బాణములను విడిచెను. కాలసర్పములవలె ఆ బాణములు వెడలెను. ఒక బాణము వాని నాభిప్రదేశమున నుండిన అమృతకలశమును శోషింపజేసెను. మిగిలిన బాణములు ముప్పది వాని శిరస్సులను బాహువులను ఖండించెను. క్రిందపడిన మొండెము, శిరస్సులు, బాహువులు, నాట్యమాట మొదలిడెను. కొంతకాల మట్లు చలించి చైత్ర శుద్ధ చతుర్దశినాడు రావణుడు స్వర్గస్థుడాయెను.

అంత దేవదుందుభులు మ్రోగెను. రావణుని తేజస్సు రామునిలో లీనమయ్యెను. ఆ చిత్రమునుచూచి వానరయోధులు ఆశ్చర్యపడిరి. పదునెనిమిదిదినములు రాముడు చూపిన బలపరాక్రమములను వానరులుచూచి ఆశ్చర్యపడి, జయజయ ధ్వనులు చేసిరి. రావణుని మరణవార్తను విని మండోదరి నేలకూలెను. ఆమె దాసీలతో కళేబరము దగ్గరకు వచ్చి ఆ శిరస్సులను చేర్చి ప్రాణేశ్వరునకు సంభవించిన దుర్గతికి చాలా విలపించెను. రావణుని ప్రతాపములను అనేక విధముల వర్ణించెను. ఓ నాథా బ్రహ్మసృష్టి అంతయూ మీకు వశమయిఉండెనే. అష్టదిక్పాలకులు మీకు నమస్కరించుచుండిరి కదా? కానీ ఎన్ని శక్తులుండి యేమి ప్రయోజనము? ఎన్ని తపస్సులు చేసి యేమి ఫలము? ఎంత బలపరాక్రమముండి ప్రయోజనమేమి? రామవిముఖులయితిరి కనుక మీకీపాట్లు తగినట్లు వచ్చెను. కామమును వశమునందుంచుకొనని కాలులైననూ కడకు ఈ రీతిగా బాధపడక తప్పదు. కామాంధునకు ఈ కఠిన శిక్ష తప్పినది కాదు. కాముడు మాత్రమే రాముని విస్మరించును. ఓ రావణా, శ్రీరాముడు రాక్షసవనమును దహించుటకే అవతరించెను. అతడు సాధారణ మానవ మాత్రుడు కాడని నేనెన్నియో పర్యాయముల చెప్పితిని. కానీ నీ ప్రారబ్ధము నిన్ను విడువక వెంటాడెను. నీ దేహబలముపై, బుద్ధిబలముపై ధనజనబలముపై నీవు ఆధారపడి భ్రమించితివి. మీరా కరుణాసముద్రుని శరణు జొచ్చి రాక్షస వంశమును కాపాడుమని పాదములంటి ప్రార్థించితిని. నా మాట వినరైతిరి. మీరు నిరంతరము పరులకు ద్రోహము చేయుటకే చింతించితిరి కానీ, పరుల పుపకారమునకు ఏ నాడునూ ప్రయత్నించలేదు. కాయమూ నిరంతరము పాపములలో మునిగిపోయెను. అట్టి నీకు రాముడు సాకేతలోకము నిచ్చెను. అదియూ నీ భాగ్యమే. లేకున్న రామ హస్తములో ప్రాణములు వీడుట అందరికీ సులభము కాదు కదా, అందరికి ప్రాప్తిరాదు కదా? ఆ శ్రీరాముడు మీ సంహారార్థమే అవతరించెను. రాక్షస వంశనాశమునకు రాక్షసరాజే రాజబాట తీసుకొనెనను వార్త శాశ్వత

ముగా విలిచిపోయెను కదా. ఇది నీవు సాధించినది. ఇది నీ పరిపాలనా చాతుర్యము.

నీ తపః ఫలము ఇంతేనా! రామచంద్రా, కర్మఫలము తప్పినది కాదను వాక్యమును నిరూపించితిరా? ఇంతకన్ననూ వేరు నిదర్శనము మరొకటేమి కలదు? ఇది ప్రత్యక్ష నిదర్శనము అని మందోదరి విలపించుచున్ననూ జ్ఞానముచే శ్రీరాముడు పరబ్రహ్మమని తెలుసుకొనెను. ఈమె జ్ఞానమునకు సురులు, మునులు సంతోషించిరి. మందోదరి విలపించుచున్న దృశ్యమును చూచి విభీషణుడు కూడా దుఃఖించెను. మందోదరి చెప్పినవన్నియూ వాస్తవములని యొప్పుకొనెను. అంత రామలక్ష్మణులు విభీషణుని దగ్గరకు వచ్చి వోదార్చి, విభీషణా, రావణునను తగిన పరలోక క్రియలాచరింపుము అని ఆజ్ఞాపించెను. శ్రీరాముని ఆజ్ఞ ప్రకారము దేశకాల పాత్రలననుసరించి విధి పూర్వకముగ రావణునకు పరలోకక్రియలు చేసెను. మందోదరి, తదితర సతులువచ్చి, తిలోదకము లిచ్చిరి.

అంత విభీషణుని చెంత చేర్చుకొని పలువిధముల వోదార్చి జరుగవలసినది జరిగెను కానీ విరుద్ధమైనదేదియూ జరుగలేదు. తన పాపము, శాపము పండి పరిపక్వమయ్యెను. దానికి విచారించి ప్రయోజనములేదు అని చెప్పి, తమ్ముడైన లక్ష్మణుని జాంబవంతుని అంగదుని పిలిచి నీలనలాదులను కూడ తోడుచేసి, మీరందరూ లంకలోనికి వెళ్ళి విభీషణునికి పట్టము కట్టిరండని ఆజ్ఞయొసగెను. తండ్రి గారి ఆజ్ఞానుసారము రేపటికి పదునాలుగు వర్షములు నిండును కాన త్వరగా వెళ్ళుడని చెప్పెను. అంత విభీషణుడు రాముని పాదములు పట్టుకొని, "రామా, ఈ రాజ్యమునాకెందుకు. తమ పాదారవింద సామ్రాజ్యమునందుంచుకొనుము. నేటినుండి లంక తమది, అయోధ్యతో లంకనొక అంగముగా భావించుడు" అని ప్రార్థించెను. అందులకు రాముడు అంగీకరించక అనేక విధముల రాజనీతిని బోధించి రామాజ్ఞ తప్పదని చెప్పగ, అటులయిన తమ హస్తములచే నాకు రాజ్యమును అప్పగించుడు అని విభీషణుడు ప్రార్థించగా, తండ్రి ఆజ్ఞను పదమూడు సంవత్సరముల, పదకొండు నెలల ఇరువదితొమ్మిది దినములు నెరవేర్చి ఒక్క దినములో నా వ్రతమును భంగము చేసుకొనుట పాడికాదు. మా తండ్రి ఆజ్ఞానుసారము నేను పట్టణమున ప్రవేశించరాదన్న విషయము నీకు తెలియును కదా. కాన నా ఆశీర్వాదములు అందుకొని నీవు లంకలో పట్టాభిషేకము గావించుకొమ్మని దీవించి పంపెను.

అంత రామాజ్ఞను శిరసావహించి లక్ష్మణ, సుగ్రీవ, అంగద, నలనీలాదులు బయలుదేరి లంకను చేరి విభీషణునకు రాజ్యతిలకమును బెట్టిరి. అంత విభీషణుడు

చేరిన వానర వీరులకు నమస్కరించి మీ సహాయముననే నా జీవితమంతయూ సార్థకము గావించుకొందును. ఇది అంతయు శ్రీరాముని ప్రసాదము. అతని యేజంటుగనే నేనీ రాజ్యమును పాలింతును. కానీ, ఇది నాది కాదు. నేను రామార్పితమైతిని అని రావణుడు రావణుని పుత్రులు, యోధులు గావించిన క్రూర సంగ్రామమునకు చింతించి, అంతా రామ లీలగా భావించెను. అందరూచేరి రాముని చెంతకు వచ్చి నమస్కరించిరి.

అనంతరం శ్రీరాముడు హనుమంతునితో ఓ మహావీరా! నా కార్యనిమిత్తము నీవు లంకలోనికి వెళ్ళి నా సమాచారమును జానకికి విన్నవించి, ఆమె యోగక్షేమములు తెలుసుకొనిరమ్ము, అన్నాడు. మహావీరుడు లంకలోనికి ప్రవేశించి జానకిని దర్శించి ఆమెకు నమస్కరించెను. అంతలో ఆమె ఈ మహావీరునిచూచి ఇతని రాముని దూతగా తలంచి, ఓ వీరుడా! శ్రీరామలక్ష్మణులు వానరసేనలు క్షేమమేనా? కృపాసాగరుడైన నా రాముడు కుశలమేనా? అని అడిగెను. మహావీరుడు ఆ మాటకు నమస్కరించి తల్లీ! అన్ని విధములా శ్రీరామచంద్రుడు క్షేమమే. వారు రావణుని సంహరించి విభీషణునికి శాశ్వతమగు రాజ్యము నిచ్చిరి. అంత జానకి రామవిజయమును రావణ పరాజయమునువిని సంతసించి ఆమె ప్రసన్నురాలై దేహము పులకరించి ఆనందబాష్పముల రాల్చుచూ, ఓ కపీశ్వరా! ఈ శుభవార్త నందించినందులకు నేను నీకేమియ్యగలను? నీ వాక్కునకు సమాధానమైన వస్తువులులేవు. అందులకు హనుమంతుడు, తల్లీ! మీ ఆనందమునకు, మీ ప్రసన్నతకు నాకీ దినమున మూడు లోకముల రాజ్యము లభించినంత ఆనందమాయెను. నేడు శత్రువుని జయించి తమ్మునితో కూడిన నిరామయుడగు రామప్రభువును చూచుటకంటే భాగ్యమేమి కలదు. అని నమస్కరించెను. అంత జానకి వానరోత్తమా, నేను ఈ పదినెలలు రామచంద్రుని వియోగ దుఃఖమున మునిగినందున బైటప్రపంచము ఏమియూ కనుపించలేదు. నేడు ఏమివారమో ఏమితిథియో తెలియదు. యేమైన నేడు మంగళకరమైన వార్తను తెలిపితివి కనుక ఈనాడు మంగళవారమనే పిలుతును. నీవీవార్త నందించినందుకు ఈ దినము నిన్ను పూజించు దినముగా ఆశీర్వదింతును అని సీత పలికెను. హనుమంతుడు ఇది మహాప్రసాదమని చేతులు జోడించి సీతకు నమస్కరించెను. కాని సీత కంటిదారలు కార్చుచూ హనుమంతా ఆ కోమలశ్యామల శరీరుని శ్రీరాముని దర్శనమును నాకు శీఘ్రముగ లభించునట్లు ప్రయత్నము చేయుము. జరిగిన యుద్ధమంతయూ నానిమిత్తమే కదా. నన్నుచేరే నిమిత్తమేకదా. నన్ను శీఘ్రములో శ్రీరాముని చరణములవద్ద చేర్చుమని దీనతతో తెలుపుకొనెను. అంత ఆమెబాధను సహించ

లేక రివ్వునయెగిరి శ్రీరాముని పాదములచెంతవ్రాలి జరిగిన వృత్తాంతమంతయూ శ్రీరామునకు విన్నవించెను. శ్రీరాముడు హనుమంతుని మాటలువిని అంగద విభీషణాదులను పిలిచి హనుమంతునితో వెళ్ళి సీతను ఆదరించి పిలుచుకొని రమ్మని ఆజ్ఞాపించెను. ఆ తక్షణమే వానరయోధులు హనుమంతునితో అశోకవనమునకువెళ్ళి విభీషణుని ఆజ్ఞానుసారము సీతకు స్నానాదులు చేయించి పీతాంబరములు కట్టించి అనేక ఆభరణములతో అలంకరించ ప్రయత్నించిరి. కాని సీత వాటినన్నింటినీ తిరస్కరించి నా శ్రీరామచంద్రుడే నా భూషణములు, అతని దర్శనమే నా స్నానము, అతని నమస్కారమే నా పీతాంబరము. నాకు రావణుని వస్త్ర వాహనాదులు అక్కరలేదని చెప్పెను. ఆమె ఇష్టప్రకారము గావించుడని తిరిగి విభీషణుడు తెలుపగ, సీతారామ సందర్శనము నిమిత్తము తహతహలాడుచున్నదని దాసీలు తెలిపిరి. వెంటనే పల్లకిని తెప్పించి ఆమెను అందులో కూర్చుండబెట్టి వానరులు తీసుకొని వచ్చిరి. సీతను సందర్శించుటకై, లంకలో మిగిలిన రాక్షసస్త్రీలు, వానరులు అనేకవిధముల దారిలో బంతులుదీర్చిరి. ఒకరిపైనొకరుయెక్కి అమ్మనుచూచుటకు ప్రయత్నించిరి. పల్లకీలో కూర్చుండిన జానకి ఇటుఅటు చూడక రాముని స్మరించుచూ తల క్రిందికి వంచుకొని, రామదర్శనమునకు ఆతురతపడుచూ వెళ్ళెను. కొంతదూరము ఉండగనే సీత పల్లకినిదిగి తన నాథునిచెంతకు నడచి వెళ్ళుట ధర్మమని, ఆమె పల్లకిని నిలిపించి అందునుండి దిగి, నెమ్మదిగా నడచి రాముని దర్శనమునకు బయలుదేరెను. ఆమెనుచూచి వానరులు నమస్కరించి సీతారామచంద్రునకు జైజై అని జయధ్వనులు చేసిరి. తీరా రామునిచెంతకు రాగానే శ్రీరాముడు ఆజ్ఞాపించెను. ఆమెను ఇప్పుడే తన చెంతకు తెచ్చుటకు వీలులేదనియూ, ఆమెను అగ్నిపరీక్ష గావించవలసియున్నదనియూ తెలిపెను. ఈ మాటతో వానరులు క్రుంగిపోయిరి.

రామాజ్ఞప్రకారము యెండిన పుల్లలను తెచ్చుటకు బయలుదేరిరి. పూర్వము రావణ యుద్ధసమయమున పెద్దపెద్ద పర్వతములను సహితము అవలీలగా నెత్తిన వానరులకు ఎండిన చిన్నచిన్న పుల్లలే మహాభారముగానుండెను. కారణము సీతాదేవికి ఇట్టిపరీక్షయా అని వారిలోవారు విచారించిరి. లోకరీతిగా సీత సుశీలఅని రామునకు తెలుసును. కానీ లోకమును తృప్తిగావించు నిమిత్తము రాముడు ఈ లీలా నాటక మాడ దొడగెను. అని విభీషణ, అంగద, సుగ్రీవాదులకు తెలుసు. మరొకరీతిగా చూడ, అరణ్యములో నుండినపుడు జానకి శక్తిని అగ్నిహోత్రునిదగ్గర దాచెను. లంకలో నింతవరకు నివసించిన సీత, మాయసీత. శక్తిరహితమైన దేహము మాత్రమే. సీత నిజస్వరూపము అగ్నియందుండుటచేత తన నిజశక్తిని చేర్చుకొని

వచ్చుటకై సీతను అగ్నిలో ప్రవేశింపజేసెను. ఆమె అంతఃకరణ నిర్మలమైనదని లోకులకు తెలియుట కామె అగ్నిలో ప్రవేశించెను. దీనినిచూచి సీత ఆనందించెను. లక్ష్మణుడు బాధపడెను. కానీ, లక్ష్మణుని శాంతపరుచుటకై సీత ఓ లక్ష్మణా వివాహ కాలమున బ్రాహ్మణులు అగ్నిహోత్రమును వెలిగించి వివాహము చేయించిరి. ఇప్పుడు నాకగ్నిలోనుండి పునర్జన్మము కలుగును. పిమ్మట నేను ప్రభువును వరింతును. నీవు ధర్మమునాలోచించి అగ్నిహోత్రము వెలిగింపుము, అనిజానకిచెప్పెను. విరహమును,వియోగమును, ధర్మమును, న్యాయమును, చాతుర్యములను సూచించు జానకివచనముల నతడు విని కన్నీటినికార్చి చేతులను జోడించుకొని నిలువబడెను. కాని ఒక మాటయినను చెప్పలేకపోయెను. అతడు శ్రీరామునకు భయపడి యూరకుండెను. అతడు రామ ముఖలక్షణమునుచూచి కాష్ఠమును పేర్చి నిప్పంటించెను. ప్రబలముగా మండుచున్న నిప్పునుచూచి జానకి సంతోషించెను. ఆమెకు లేశమయినను భయము లేకపోయెను. "ఓ హుంతాశనుడా! మనోవచన కర్మలచే నేను శ్రీరామచంద్రులను తప్ప మరెవరిని నా మనస్సులో ధ్యానించి యుండలేదు. ఓ పావకుడా! నీవు సకలజీవుల హృదయములలో నివసించియుందువు. శ్రీఖండచందనమువలె నీవు నాకు శీతలుడవగుము," అని శ్రీరామప్రభువును స్మరించి అగ్నిలో ప్రవేశించెను. శ్రీఖండచందనమువలె అగ్నిహోత్రుడు శీతలుడయ్యెను. అగ్నిదేవుడు బ్రాహ్మణ రూపమును ధరించి వేదవిదితమగు జానకిని నిజమగు సీతను వెంట తీసుకొనివచ్చి క్షీరసముద్రుడు మహాలక్ష్మిని విష్ణుమూర్తికి సమర్పించిన విధమున ఆమెను శ్రీరామునకు సమర్పించెను. నూతనముగ వికసించిన నీలనీరజము ప్రక్కను, బంగారు పద్మపు మొగ్గవలె సీత రాముని ఎడమప్రక్కన శోభించెను. దేవతలు సంతోషించిరి. దేవదుందుభులు మ్రోగెను.

అంత విభీషణుడు నగరములోనికివెళ్ళి దివ్యవస్త్రములు, నవరత్నములు, పుష్పకవిమానమునబెట్టి వానిని తీసికొనివచ్చి శ్రీరాముని యెదుట పెట్టెను. అప్పుడు శ్రీరాముడు, ఓ సఖుడా! ఈ విమానముపై బెట్టిన వస్త్రాద్యలంకారములను పట్టుకొని అంతరిక్షమునకు కుప్పించి నీవు వానిని వర్షింపుము అనెను. విభీషణుడు ఆ ప్రకారము గావించెను. వానరులు వారివారి మనసు తోచినటుల దానిని గ్రహించిరి. ఆ మణులనుచూచి వానరులు ఫలములని భ్రమించిరి. వానిని నోటిలో పట్టుకొని రాళ్ళని తెలుసుకొని విసర్జించిరి. వానరుల చేష్టలనుచూచి సీతారామలక్ష్మణులు నవ్విరి. వానర భల్లూకములు వస్త్రాలంకారములను ధరించి రామునివద్దకు వచ్చిరి. అనేక రంగు రంగుల వానర భల్లూకములనుచూచి పరమానందభరితుడయ్యెను. వారిని ఆదరించి

ఇట్లు సంభాషించెను. ఓ వానరులారా, మీ బలముచేతనే నేను రావణుని సంహరించితిని. విభీషణునికి రాజ్యము నిచ్చితిని. ఇక మీరు మీమీ స్వగృహములకు నిష్క్రమింపుడు. సదా మీ వెంటనే ఉందును. భయపడవలదుఅని అందరినీ అభయహస్తముచే ఓదార్చెను. శ్రీరాముని వచనములువిని ప్రేమాతిశయముచే వ్యాకులులై చేతులను జోడించుకొని ఓ నాథా! మీ మాటలు మీకే వర్తించును. మీ మాటలవలన మా మనసులు భ్రమించుచున్నవి. మేము దీనులము, మాకు నాథులుమీరే, మీరు త్రిలోకాధిపతులు ఎన్నడైనను మశకము గరుత్మంతునకు సహాయము చేయగలదా? సూర్యుని చిన్న ప్రమిదదీపము చూడగలదా? అని రామునికి నమస్కరించి కంటి ధారలను కార్చిరి.

కాని రామఆజ్ఞ ప్రకారము వానరభల్లూకములు రామరూపమును మనస్సులో ధ్యానించుచు, హర్ష విషాదములతో కూడినవారై అనేకవిధముల విన్నపములు చేయుచు వెడలిరి. జాంబవంతుడు, నలుడు, నీలుడు, సుగ్రీవుడు, హనుమంతుడు, విభీషణుడు మొదలగు మహావీరులు, యోధులు ప్రేమచే పరవశులై మాట చెప్ప లేక కన్నీరు కార్చుచుండిరి. తెప్పవేయక వారు శ్రీరాముని ముఖమును చూచుచు నిలువబడిరి. వారి ప్రేమాతిశయములను శ్రీరాముడు చూచి వారిని విమానముపై కూర్చుండ పెట్టుకొనెను.

# అయోధ్యా విజయము

ఉత్తర దిక్కునకు విమానము తిరిగెను. విమానము పైకి ఎగిరినపుడు పెద్ద కోలాహలము పుట్టెను. "శ్రీరామచంద్రునికి జై, సీతారామలక్ష్మణులకు జై" అని వానరులు ఘోషించిరి. ఆ విమానములో మహోన్నతమగు చక్కని సింహాసన మొకటి కలదు. దానిపై శ్రీజానకీ శ్రీరాములు కూర్చుండిరి. సుమేరుపర్వత శృంగముపై మేఘముల మెరుపువలె వారు దేదీప్యమానముగ మెరసిరి. అంత పుష్పకము వేగముగా నెగిరెను. శ్రీరాముడు సీతను చూచి, "ఓ జానకీ! ఇదిగో రణస్థలము. ఇచ్చటనే లక్ష్మణుడు మేఘనాధుని సంహరించెను. అని యుద్ధభూమియొక్క గుర్తులన్నియూ పైనుండి చూపుచూ వచ్చెను. వానరులుకట్టిన సేతువునుకూడా చూపుచూ వానరుల ప్రతాపమును, భక్తిశ్రద్ధలను అనేక విధముల వర్ణించెను. అతి వేగమున విమానము దండకారణ్యమునకు వచ్చెను. అంత విమానమును దింపి అగస్త్యాది మహామునుల ఆశ్రమములవద్దదిగి శ్రీరాముడు సీతాలక్ష్మణ వానరయోధుల సహితము అగస్త్యులవారిని దర్శించి అతని నమస్కరించి సెలవుతీసుకొని విమానము అధిష్ఠించి చిత్రకూట పర్వతమునకు వచ్చెను. అచ్చట నివసించుచున్న మునులను దర్శించి సీతకు కిష్కింధా నగరమును పైనుండియే చూపించి వేగముగా పోవుచున్న విమానమునుండి పావన యమునానదిని, గంగానదిని చూపించెను. వాటిని చూచి సీత, మనస్సులో నమస్కరించెను. అంత వారు తీర్థరాజమగు ప్రయాగను దర్శించిరి. అక్కడినుండియే శోభాయమానముగ వెలుగుచున్న అయోధ్యనుకూడను దూరమునుండి చూచిరి. అంత రాముని ఆగమనమును చూచి నిషాదపతి క్రిందనుండి నమస్కరించెను. అంతలో విమానము నదీతీరమున దిగెను. పరుగెత్తుకొని వచ్చి రాముని పాదములపైబడి నిషాదముడు కంటిధారలచే ఆనందమును భరించుకొనలేక రాముని కౌగిలించుకొనెను. సీతారామలక్ష్మణులు నిషాదముని ఆశీర్వదించి గంగలో స్నానమాచరించి నావను తెమ్మని నావనెక్కి అవల దాటిరి. పుష్పకమును కుబేరుని దగ్గరకు వెనుకకు పంపెను,

ఇంకను నగరమును ప్రవేశించుటకొక దినమవశేషముండెను. అపుడు శ్రీరాముడు హనుమంతునితో "ఓ మహావీరా! నీవు బ్రాహ్మణరూపమును ధరించి అయోధ్యా నగరమునకు శీఘ్రముగా వెళ్ళుము, మా క్షేమమును భరతునకు తెలుపుము. అతని క్షేమసమాచారములు తీసుకొని రమ్ము" అనెను. ఆ మాటలను విని హనుమంతుడు వెంటనే వెడలెను. శ్రీరాముడు సీతాలక్ష్మణయోధుల సమేతుడై భరద్వాజాశ్రమమును చేరెను. అంత శ్రీరాముని ఆ మునిరాజు స్తుతించెను. సత్కరించెను.

రాముని వియోగముచేత ఆబాలవృద్ధులు స్త్రీ పురుషులు నిద్రాహారములు మాని కృశించి నీరసించియుండిరి. నగరమంతటను వారి దీనాలాపములు వినపడెను. ఎచటనుండిన వారచటనే యుండిరి. ఒకరివద్దకు ఒకరు వెళ్ళుటకు శక్తి లేకను, ఇష్టము లేకను నగరములో ఎచ్చట చూచిననూ విషాదము కనుపించెను. ఇంతలో శ్రీరాముడు నగరములో ప్రవేశించనున్నారన్న వార్త నగరమంతటా వ్యాపించెను. భరతుని దక్షిణ హస్తమును నేత్రమును అదరెను అంత భరతుడు శుభవార్త రానున్నదని సంతసించెను. భరతుడు ఒక్కదినము మాత్రము కలదని తలంచుచూ, దుఃఖించుచూ, ఎందుచేతఇంతవరకూ ఒక్కవార్తనైననూ శ్రీరాముడుపంపకున్నాడని చింతించి లక్ష్మణుడెంత ధన్యుడు, ఎంత పుణ్యాత్ముడు. శ్రీరాముని చరణకమలములను అతడు సేవించుచుండును కదా ? నేను కపటిననియు కుటిలుడననియు స్వామి తెలుసుకొని నన్ను నగరములో విడచి వెళ్ళెను. స్వామి మనసు మృదుమధురము. అతడు దీనబంధువు, కృపాళుడు. తప్పక రేపటిలో వచ్చునని తలంచుచుండగనే మహావీరుడు హనుమంతుడు బ్రాహ్మణ వేషమును ధరించి భరతునకు కనుపించెను. భరతుని చూచి మహావీరుడు ఆశ్చర్యపడెను. అతని శరీరము కృశించి నీరసించెను. అతని శిరోజములు జటలల్లుకొనెను. అతని నేత్రముల వెంబడి నీరు కారుచుండెను.

భరతుడు నిరంతరము రామనామమును స్మరించుచుండెను. ఈ విధముగ నుండిన భరతునిజూచి హనుమంతుడు పరమానంద భరితుడయ్యెను. హనుమంతుని శరీరము పులకరించెను. అనేకవిధముల అతడు చింతించి, అమృతోపమాన వాక్యములను భరతుని చెవిలో చెప్పెను. "ఓ భరతుడా! ఎవని వియోగమును సహింపలేక అహోరాత్రములు నీవు దుఃఖించుచుంటివో ఎవని గుణగణముల అహర్నిశము నీవు జపించుచుంటివో ఎవరు దేవతలను మునులను రక్షించెనో, ఎవడు సర్వధర్మ పరిపాలకుడో అట్టి శ్రీరామమూర్తి సురక్షితముగా సీతాలక్ష్మణులతోకూడి విజయము చేసెను. అతడు శత్రువులను హతమార్చెను. అతని ప్రతాపమును దేవతలు కొన్ని

యాడిరి" అని ఆనందబాష్పములతో హనుమంతుడు చెప్పెను. దాహముచే దప్పిన మనుజుడు జలమునుచూచి సంతసించిన విధమున హనుమంతుని అమృతవాక్కులను విని భరతుడు ఆనందించి "ఇది నా భ్రమయా లేక నిజముగా జాగ్రత్తతో వినుచున్నానా? అయ్యో ఇది భ్రమయెట్లగును? ఈ శుభవర్తమానము తెచ్చిన మీరెవరు? మీరు ఎక్కడనుండి వచ్చితిరి," అని ఆ హనుమంతుని కౌగిలించుకొని ఆతురతతో అడిగెను.

అంత హనుమంతుడు "ఓ భరతా! నేను వాయుపుత్రుడను. నా పేరు హనుమంతుడు. నీవు మరచితివి కాబోలు. ఆనాడు సంజీవి పర్వతమును గొనిపోతూ నేలకూలిన వానరుడను శ్రీరాముల పాదసేవకుడను." అని జవాబిచ్చినతోడనే ఆ మాటలు వినిన భరతుడు అత్యాదరముతోలేచి సంతోషమును పట్టలేకపోయెను. నేత్రములనుండి ఆనందబాష్పములు జలజల కారెను. శరీరమునే మరచెను. "ఓ కపివర్యా! నా దుఃఖమును మటుమాయము చేసితివి. నిన్ను చూచుట తోడనే నామది శాంతించెను. ఏమి నా భాగ్యము. ఈనాడు రామదూతను చూచితిని" అని మాటి మాటికి "నా రామచంద్రుడు క్షేమమేనా? నా తల్లి జానకి ఎట్లున్నది. ఓ వానరా! నీకేమి ప్రత్యుపకారము చేయగలను. నీవు చెప్పిన శుభవర్తమానమునకు తగిన ప్రత్యుపకారము లోకములో మరొకటి నా బుద్ధికి తోచుటలేదు. అందుచేత నేను నీ ఋణమును దీర్చలేను. రాముడు ఏడీ? ఎచ్చటనున్నాడు. అతడు చేసిన ఘనకార్యములను నాకు వినిపింపుము" అని అత్యంత ఆతురతతో అడుగుచున్న భరతుని చూచి, హనుమంతుడు భరతుని భక్తిప్రపత్తులకు ఆశ్చర్యపడి అతని పాదములకు నమస్కరించి "భరతా! రాముడు అయోధ్యకు సమీపముననేయున్నాడు. కొన్ని నిమిషములలో నీవు చూడగలవు. అతని కార్యములు వర్ణనాతీతములు, నీకు తెలియనివి కావు. శ్రీరాముడు నిన్ను నిరంతరమూ తలంచుచునే యుండెడివాడు. నీబోటి పుణ్యాత్ముడును, నీబోటి బుద్ధిమంతుడును, సకలగుణసంపన్నుడునునగు తమ్ముడు లోకములో మరియొకడు లేడ"ని జగన్నాధుడు శ్రీరాముడు శ్రీముఖముతో చెప్పెను. అందుకు వ్యతిరిక్తము కలుగునా?

అంత భరతుడు ఆ మాటలు విని పట్టలేనంత సంతోషముతో "శ్రీరాముడు నన్నిట్లు వర్ణించెనా? నేనెంత అదృష్టవంతుడను" అని హనుమంతుని గాఢంగా ఆలింగనము చేసుకొనెను. ఇక కాలహరణము చేయకూడదని భరతునిదగ్గర సెలవుతీసుకొని హనుమంతుడు రాముని వద్దకు బయలుదేరెను. భరతుని సర్వవృత్తాంతమునూ రామునకు వినిపించెను.

ఇక భరతుని రెండుకాళ్ళు ఒకచోట నిలువలేదు. నంది గ్రామమునుండి సరాసరి అయోధ్యానగరమునకు వచ్చి వసిష్ఠులవారికి నమస్కరించి శ్రీరాముని వృత్తాంతమును తెలిపి అనంతరము అంతఃపురములోనికి ప్రవేశించి శ్రీరాముడు సీతాలక్ష్మణులతోకూడి సురక్షితముగా నగరములో ప్రవేశించబోవుచున్నాడని ముగ్గురు తల్లులతో ఆనందబాష్పములుకార్చుచూ పట్టలేనిఆనందముతో గంతులు వేసెను. ఆ మాటలువిన్న తల్లులు త్రుళ్ళిపడి దిగ్గున లేచిరి.

తక్షణముభరతుడు "ఈశుభవార్తను నగరమంతయూ చాటుమ"నిఆజ్ఞాపించెను. కొన్ని క్షణములలో ఈ వార్త నగరమంతయూ వ్యాపించెను. ప్రజలు, స్త్రీలు, పురుషులు, పిల్లలు, వృద్ధులు నలుప్రైపుల పరుగులు తీసిరి. వీధులన్నియూ అలంకరింప మొదలుపెట్టిరి. స్త్రీలు రకరకముల పుష్పముల ప్రోగుచేయ మొదలుపెట్టిరి. భరతుడు సుమంత్రాది మంత్రులను కులగురువులైన వసిష్ఠాది గురువులను, ముగ్గురు తల్లులను, పండితులను, పురజనులను, చతురంగ బలమును వెంటబెట్టుకొని తమ్ముడు శత్రుఘ్నునితో కూడి సంతోషముతో శ్రీరాముని దర్శించుటకు వెడలెను. అనేక పుర స్త్రీలు శ్రీరాముని దర్శించుటకు మేడల నెక్కిరి.

శ్రీరాముడు అయోధ్యా నగరముయొక్క శోభనుగూర్చి వానరులకు చెప్పుచుండెను. "ఓ సుగ్రీవా! ఓ అంగదా! ఓ విభీషణా! అయోధ్య పరమ పవిత్రమైనది; సుందరమైనది," అని అనేక విధముల అయోధ్యను వర్ణించుచుండగా భరతుడు చతురంగబల సమేతుడై వ్రాలెను. ప్రజలు, పండితులు, తల్లులు శరత్కాల రాకా చంద్రునిచూచి సముద్రుడు పొంగిన విధమున శ్రీరామచంద్రుని చూచి సంతోషించిరి. వారి కోలాహలము మిన్నుముట్టెను. తల్లులు భరించలేని ఆనందముతో కొమారుని కౌగిలించుకొని మైమరచిరి.

సీతారామలక్ష్మణులు తల్లులకు నమస్కరించిరి. ఉభయుల ఆనందమునకు అంతులేక పోయెను. రాముని వియోగ దుఃఖముతో కృశించి నీరసించియుండిన భరతునిచూచి శ్రీరాముడు ప్రేమతో దగ్గరతీసుకొని అనేకవిధముల భరతుని వర్ణించెను. వసిష్ఠ, జాబాలి వామదేవాది మహర్షులనుచూచి పాదములకు సీతారామలక్ష్మణులు నమస్కరించిరి. మహాఋషులు సహితము శ్రీరాముని దర్శించి ఆనందబాష్పములను నిలుపుకోలేకపోయిరి. పండితులు శతమానం భవతి, శతమనంతం భవతి, శతమైశ్వర్యం భవతి, శతం దీర్ఘమాయుః. అని మిన్నుముట్ట దీవించిరి.

భరతుడు శత్రుఘ్నుడు శ్రీరామ చరణారవిందములకు సాష్టాంగ దండ ప్రణామములాచరించిరి. శ్రీరాముడు ఎంత లేవమన్ననూ పాదములపై పడిన సోదరులు

లేవలేకపోయిరి. అంత లక్ష్మణ శ్రీరాములు ఇదుపురినీలేపి సోదరులను కౌగిలించుకొని ఒకరినొకరు చూచుకొని అనందబాష్పములు విడుచుకొనిరి. ఆనందములో వారల సౌందర్యములు తేజఃపుంజము దేదీప్యమానముగా వెలసెను. అన్నదమ్ములు నలువురూ ఒకే విధముగా కనుపించిరి. మూర్తీభవించిన సౌందర్యరాసులుగా తోచిరి. వియోగ దుఃఖమునుమరచి సంయోగ ఆనందసాగరమున మునిగిరి.

అంత విభీషణ, సుగ్రీవ, నల, నీల, అంగద, హనుమంతాదులు సుందరములగు శరీరములను ధరించిరి. వారినిచూచి పురజనులు చాలా ఆనందించిరి. భరతుని వ్రతమును సుశీలతను పురజనులు వేనోళ్ళకొనియాడిరి. పురజనుల భక్తిప్రపత్తులను చూచి శ్రీరాముడు మెచ్చుకొనెను. అంత వానరులను విభీషణుని పిలిచి వారలకు సోదరులను గురువులను పరిచయము చేసెను. అంత మువ్వురు తల్లులనుచూపి వీరు మా తల్లులని పరిచయము చేసినతోడనే అందరూ నేలవ్రాలి నమస్కరించి మహా ధన్యులు, సాక్షాత్తు పరమాత్మణ్ణే కన్నతల్లులెంత పూజనీయులని వారల ఆశీర్వాదములు ఆశించిరి. అంత కౌసల్యాదేవి "వానరులారా! మీరు నా బిడ్డ శ్రీరామునితో సమానులు. మిమ్ముల శ్రీరాముడు ఎప్పుడు మరువకుండ కాపాడును గాక," అని దీవించెను.

అంత అందరూ ఆయారీతిగా నిర్ణయించిన రథములలో కూర్చొని నగరమున ప్రవేశించిరి. బంగారు పాత్రలను వసంతముతోనింపి పురజనులు తమతమ ద్వారములవద్ద నిడిరి.

గృహమునకు జెండాలు కట్టిరి. రాజవీధుల పన్నీరుచల్లిరి. రాముని వియోగముతో వాడిన పురజనుల ముఖములు రామచంద్రుని చూచిన తక్షణమే సూర్యోదయమునుచూచిన కమలములవలె వికసించెను. వారి ముఖములు కళకళలాడెను. జయ జయ ధ్వనులు మిన్నుముట్టెను.

పురవీధులలో రాముని రథము ప్రవేశించెను. వీధులు కిటకిటలాడెను. మంగళహారతులు ఆకాశమున చుక్కలవలె నెటుచూచినా కనుపించెను. పన్నీరులు చల్లిరి. పుష్పవర్షములు కురిపించిరి. ప్రజలయొక్క ఆనందము హద్దులు తెగెను. ఈ విధముగా నలుగురు సోదరులతో ముప్పురు తల్లులతో జానకీదేవినికూడి శ్రీరాముడు పురవీధులలో వెళ్ళుతూ ఉండుట చూచినవారి కన్నులెంత ధన్యములో వారెంత పుణ్యులో అని వేనోళ్ళ వారిలోవారు పొగడుకొనిరి.

# శ్రీ రామ పట్టాభిషేకము

అంత రాజభవనము చేరిరి. అంతఃపురస్త్రీలు, పరిచారకులుమహదానందముతో పాదములుకడిగి స్వాగతము చెప్పిరి.

చేరినతోడనే వసిష్ఠులవారు బ్రాహ్మణులనుపిలిచి ఈ శుభదినమున, ఈ శుభ నక్షత్రమున, శుభయోగమున, శుభకరణ శుభలగ్నమున శ్రీరామచంద్రుడు పట్టాభిషిక్తుడగును. కనుక మీరందరూ దయచేయుడని ఆజ్ఞాపించెను. అంత బ్రాహ్మణులు "శ్రీరామ పట్టాభిషేకము జగన్మంగళదాయకము. విలంబనముచేయక రాముని లలాటమునకు పట్టముకట్టుడు అనిచెప్పిరి. అపుడు వసిష్ఠులవారు సుమంతుని పిలిచి, "మంత్రివర్యా! రాముని పట్టాభిషేక మహోత్సవము కనుక, శీఘ్రముగ చతురంగ బలముల నాయత్తము జేయుమని" యాజ్ఞాపించెను.

ఆమాటలు వినిన సుమంతుడు ఆనందముతో పొంగిపొరలి కొన్ని క్షణముల లోనే అందుకు తగినఏర్పాట్లు జేసెను. గజములను, అశ్వములను రథములను అలంకరించిరి. సింహద్వారమువద్ద అన్నింటినితెచ్చి నిలబెట్టిరి. పదాతులును, రౌతులును సింగారించుకొని విచ్చుకత్తులను ధరించి పంక్తిదీర్చి బరాబరులు చెప్పుచుండిరి. మంగళద్రవ్యముల తీసికొనివచ్చుటకు సేనలను నలువైపులపంపి సుమంతుడువచ్చి గురుచరణములకుమ్రొక్కి అన్నియు సిద్ధముగానున్నవని మనవిచేసెను. అయోధ్యా నగరముయొక్క మహోత్సవ శృంగారము చూచుటకు రెండుకన్నులు చాలవు. రామచంద్రుడు సేవకులపిలిచి, వచ్చిన సుగ్రీవ, విభీషణ, అంగద, నీల, నలులకు స్నానాదులు తగినఏర్పాట్లు గావించుమని ఆజ్ఞాపించెను. అతని ఆజ్ఞను శిరసావహించి సేనలు నలువైపుల పరుగెత్తి వారలకు సర్వసౌకర్యములతో అన్ని అనుకూలములు చేసిరి.

అంత రాముడు భరతునిచేరదీసి స్వహస్తములతో భరతుని జడలనువిడదీసెను. దగ్గర నిలువబడి మువ్వురన్నదమ్ములగు భరత, లక్ష్మణ శత్రుఘ్నులచే రాముడు

మంగళస్నానముల జేయించెను. పిమ్మట రామచంద్రుడు గురువుగారి ఆజ్ఞగైకొని జటలను విప్పుకొని మంగళస్నానము చేసెను. వీరిట్లు మంగళస్నానము లాచరించు చుండ,కౌసల్యాది తల్లులు ముప్వురు సీతాదేవికి మజ్జన మాచరించిరి. ఆమె శిరస్సున కట్టిన జటలను మూవురుఅత్తలు నెమ్మదిగావిడతీసి పీతాంబరములుకట్టించి సర్వాలంకారములతో జానకిని అలంకరించిరి. శ్రీ మహాలక్ష్మివలె సీతాదేవివచ్చి శ్రీరాముల వారి పార్శ్వము నలంకరించెను.

కోడలిని కొమారునీజూచి తల్లులుముప్వురు బ్రహ్మానందమును పొందిరి. "నేటికికదా మా జన్మము ధన్యమైనది. మాఅభీష్టము సఫలమయ్యెను. మాకన్నులు పండెను," అని తలచుకొంటూ లక్ష్మీనారాయణులవలె బ్రహ్మతేజముతో వెలుగు చున్న ఆసీతారాములనుచూచి మైమరచిరి. ఆనందమును ఆపుకోలేకపోయిరి వసిష్ఠుల వారు శ్రీరామచంద్రుని దివ్యమంగళ విగ్రహమునుచూచి భ్రమించెను, ఆనందించెను. "ఈమహద్భాగ్యము నాకు ఏనాడు లభించునాఅని కాలమునకై వేచియుండిన గురువు గారి మనోభీష్టముకూడనూ నేటికి ఫలించెనని వసిష్ఠులవారు లోలోన పట్టలేని ఆనందమును పొందెను. సేనలనుపిలిచి రత్నఖచితమయిన సింహాసనమునుతెచ్చి హజారములో నుంచుడ"ని ఆజ్ఞాపించెను. ఆ సింహాసనముయొక్క సొగసు వర్ణనాతీతము. దాని కాంతులు సూర్యకాంతులవలె నుండెను. చూచువారల కన్నులు మిరు మిట్లు కొలిపెను. వసిష్ఠాది మహాఋషులకు బ్రాహ్మణులకు శ్రీరాముడు నమస్కరించి,తల్లులకు నమస్కరించి, పురజనులకు, పెద్దలకు,సభకు ఒక్కపరి నమస్కరించి సింహాసనము నధిష్ఠించెను. సీతారాములు గద్దియ నెక్కిరి. వారుభయుల జూచి ఋషులు, మునులు, మహానుభావులు, ప్రజలు సంతసించిరి. బ్రాహ్మణులు వేద మంత్రములు బఠించిరి. ప్రజలు మిన్నుమిట్టునట్లు జయజయ శబ్దముల పలికిరి. వైశాఖ బహుళ సప్తమినాడు శ్రీరామచంద్రుడు పట్టభద్రుడయ్యెను. బ్రాహ్మణుల సెలవునుగైకొని శ్రీరాముని లలాటమునకు వసిష్ఠులవారు పట్టముగట్టిరి. మాటిమాటికి కుమారునిజూచి కౌసల్య పరమానందము నొందెను. ఇక సోదరులైన లక్ష్మణ భరత శత్రుఘ్నుల ఆనందమునకు అంతులేదు. వారు చామరములుపట్టి ఛత్రమునుపట్టి సీతారాములకు సేవకులుగా నిలిచిరి. "ఇట్టి భాగ్యము మాకెప్పుడు ప్రాప్తించునా" అని తపస్సు చేయుచుండిరి. వారితపస్సు నేటికి ఫలించెనని పరమానందమొందిరి. ఆకాశమున దుందుభులను మ్రోగించిరి. గంధర్వులు పాటలు పాడిరి. అప్సరసలు నాట్యమాడిరి; విభీషణుడు, సుగ్రీవుడు, అంగదుడు, హనుమంతుడు, జాంబవంతుడు, నలుడు, నీలుడు, దధిముఖుడు, ద్వివిదుడు, మైందుడు మొదలగు వానర ప్రముఖు

అందరూ ధనుర్బాణములను, డాల్కత్తులను శక్తితోమరములను ధరించి ఇరువైపుల పంక్తిదీర్చి వినయవిధేయతలతో ఆనందమును అనుభవించిరి.

నాడు పార్శ్వమున సీతతోకూడి శ్రీరాముడు సింహాసనము నధిష్ఠించి కోటి మన్మథుల లావణ్యము నపహరించెను. ఆ రఘుకుల తిలకమునుచూచి దేవతలు మోహించిరి. ఋషులుకూడను మోహించిరి. రాముడు కనకాంబర కేయూరములను మకరకుండలములను ధరించి త్రిజగన్మోహనాకారముతో ప్రకాశించెను. ఆ దర్శనము చూచినవారు ధన్యులు. వారేపుణ్యులు. పూర్వము సముద్రుడు రావణునకు ఒక రత్నమాల బహుమతి చేసియుండెను. ఆమాలను పట్టుకొని విభీషణుడులేచి శిరస్సువంచి సీతాదేవికి అందించెను. ఆమె చేతియందు అందుకొనెను. ఆ మాల యొక్క కాంతిజ్యోతులు సభామందిరము నంతయూ మిరుమిట్లు కొలిపెను.

అంత సీత శ్రీరాముని ముఖమును చూచెను. ఆమె అంతరంగమునుగ్రహించి శ్రీరాముడు "సీతా! ఈ సభ్యులలో నెవరియందు నీకు దయకలదో వారికి దానిని బహుమతి చేయుమని చెప్పెను. అంత సీత క్షణము యోచించి హనుమంతునివైపు చూచెను. ఆమె కృపాదృష్టిజూచి హనుమంతుడు జోహారులనుచు వచ్చి సీతయెదుట శిరస్సువంచి నిలచెను. ఆ హారము సీత స్వహస్తముతో హనుమంతుని కందించెను. దాని ప్రకాశమును అన్నివైపులా త్రిప్పిత్రిప్పి చూచుచూ హనుమంతుడు అపరిమితానందముతో "ఇందులో ఏమి విశేషమున్నదో" అని చూడగోరెను. మాలను త్రెంపి, ఒకొక రత్నమునేతీసి నోటిలోపెట్టుకొని కొరికి చెవిదగ్గర పెట్టుకొనిచూచి మరుక్షణముననే ఆ ముక్కలను పారవేయుచుండెను. ఈవిచిత్రమునుజూచి సభికులు నిశ్చేష్టితులయిరి. అంత మిగిలిన రత్నములయందు కూడా ఏమీలేదని క్రిందపార వేసెను. ఆసభలో అతనిని మందలించువారెవ్వరును లేకపోయిరి అందరూ తమలో తాము గుసగుసలాడిరి.

"ప్రేమతో దయతో సీతాదేవి అందించిన విలువగల వజ్రాలహారమును ఈ రీతిగా చేసిన ఈ కోతియెవరా" అని తమలోతాము హనుమంతుని నిందించిరి. కానీ బైట చెప్పలేకపోయిరి. "ఎంతోవిలువైన వజ్రాలమాలను ఈరీతిగా అవమాన పరచెగదా, నా మాలకింతటి దురవస్థ వచ్చెనా"అని విభీషణుడుకూడా లోలోన చాలా విచారించెను. ఈ విధముగా సభలోని వారందరూ ఒకొకరు ఒకొకరీతిగా నూహలు పెంచుకొనుటచే కొంత అసంతృప్తి కలిగెను. అందులో ఒకరాజు ధైర్యముచేసి లేచి, "ఓ! మహావీరా ఆ రత్నములనెందులకు త్రుంచితివి! ఇది నీకు సరియా, ఇందులో అంతరార్థమేమియో మాకు తెలిపి మమ్ముల శాంతిపరచుము" అని అడిగెను. అంత

హనుమంతుడు అతని వచనములువిని, "ఓ రాజా! ఈ నీలమాణిక్యములో పవిత్ర మైన రామనామమున్నదా లేదా అని జూడగోరితివి. కానీ అందులో రామనామము కానరాలేదు. రామనామములేని మాల రాళ్ళతోసమానము అని దానివి నేలవేసితివి" అని ప్రత్యుత్తరమిచ్చెను. "అయ్యా! హనుమంతా! ప్రతి పదార్థమునందునూ రామ నామముండవలెననియా నీ అభిప్రాయము. ఇది అసాధ్యముకదా?"అని రాజుతర్కిం చెను. అందులకు హనుమంతుడు రామనామములేని పదార్థములవల్ల లాభమేమిటి? అట్టి పదార్థము నాకక్కరలేదు." అని మహాబలుడైన హనుమంతుడు రాజు వచనము లను ఖండించెను.

రాజు తిరిగి "హనుమంతా! మంచిదే రామనామములేవిదానివి నీవుధరించవు. సహించవుకదా? అట్లయిన నీ శరీరములో రామనామమున్నదా? దానిని నీవు నిరూ పించగలవా"అని గట్టిగా నిలదీసి అడుగగా హనుమంతుడుపక్కునసవ్వి "చూడుము" అని తన దేహమునుండి ఒక వెంట్రుకనుతీసి రాజు చెవిదగ్గర పెట్టెను. అది "రామ రామ" అను శబ్దమును ఉచ్చరించుటచూచి రాజు పరమాశ్చర్యముతో హనుమంతు నికి నమస్కరించి తనను క్షమించమని కోరెను.

అంత రామమూర్తి హనుమంతుని కౌగిలించుకొని "హనుమంతా! నేను నా పట్టాభిషేక సమయమున నీకేమి బహుమతినివ్వగలను? నీకు ఇవ్వదగిన బహుమతి నాదగ్గర వేరేమియూలేదు. నన్ను నేను యిచ్చుకొందును; గైకొనుము"అని తన దేహమును హనుమంతుని బాహువులకు అప్పజెప్పెను. ఈదృశ్యమునుచూచిసభికులు జయజయధ్వనులు చేసిరి. "హనుమంతునివంటి వ్యక్తి లోకమున లేడ"ని కొని యాడిరి. హనుమంతుని భక్తిప్రపత్తులను వర్ణించిరి. అంత రాముడు లేచివచ్చిబైట క్రిక్కిరిసి రామదర్శనమునకై వేచియుండిన ప్రజలకు తన మంగళ స్వరూపమును దర్శింపజేసెను. ప్రజలు ఆ సుందర స్వరూపునిచూచి బ్రహ్మానందమొందిరి. వచ్చిన వారలందరికీ భోజనాదుల ఏర్పాట్లు చేయించెను. విరివిగా ధన, కనక వస్తువాహ నాదులు గృహములు, బట్టలు దానముచేసెను. ఈ వైభవమునుచూచి వానరులు విభీ షణుడు పరమానంద మగ్నులైరి. అహోరాత్రములు గమనికలేక రామునివానరులు, విభీషణుడు ఆరుమాసములు సేవించిరి.

ఆరుమాసములు వారిదృష్టిలో ఒక దినముగా గడచిపోయెను. వారు గృహము లను, వారి కుటుంబములను, రాజ్యములను మరచిపోయిరి.

తుదకు రాముడు ఒకనాడు సఖులనందరినీ హజారములో సమావేశముచేసి వారినందరినీ ఉచితాసనములపై ఆశీనులగావించిమృదుమధురవచనములతో "ఓ సఖు

లారా!మీరు నావిషయములో విశేషముగా శ్రమపడితిరి.మీయెదుటమిమ్ములను స్తుతించుట సంభావితముకాదు. మీ గృహములను విడచి, మీ ఆలుబిడ్డలను విడచి, ఆస్తిపాస్తులను త్యజించి, నానిమిత్తమై పాటుపడితిరి. మీకంటె నాకు వేరుమిత్రులులేరు. అందుచేత మీయందు నాకు విశేషము దయ, ప్రేమ కలదు. నా తల్లిదండ్రులకంటె, నా సోదరులకంటె, నా రాజ్యముకంటె, నా ప్రజలకంటె కడకు జానకికంటె మీరే నాకు ప్రియులు. ఇది నా నిశ్చయము. కాన మీరు మీమీ గృహములకు పొండు. నన్ను మీ హృదయములందు ప్రతిష్ఠించుకొని భక్తిశ్రద్ధలతో సేవించుడు. మీవెంటనే జంటనే, యింటనే కంటనేయుండి కనుపించుచుందును, కరుణించుచుందును" అని దయా ప్రేమవచనములు పలికిన రామచంద్రునిచూచి వానరులు, విభీషణుడు, తమ దేహములు మరచిరి. "తామెచ్చటనున్నామా" అన్నది వారికి తోచలేదు. నిలువు గ్రుడ్లు పెట్టుకొని కంటిధారలు కార్చుచూ నిలుచుండిరి. ఒక్క మాటైనను చెప్పలేక పోయిరి. నోరులు ఆడుచుండెను. అంత, రామాజ్ఞ ప్రకారము దివ్యాభరణములు, వస్త్రములు సేవకులు తీసుకొనివచ్చిరి. వాటిని లక్ష్మణ భరతశత్రుఘ్నులు అందించి వారినే "ఈ వానరులకు స్వయముగా అలంకరింపు"డని ఆజ్ఞాపించెను. లక్ష్మణ, భరత శత్రుఘ్నులు రామాజ్ఞ ప్రకారము వానరవీరులకు విభీషణునకు చక్కగా పీతాంబరములతో అలంకరించి ఆభరణములు కంఠములందు వేసిరి. కానీ వానరులు ఏమి చేసినను కదలక మెదలక స్తంభించి నిలిచి కంటిధారలు కార్చుచూ వారిదృష్టి శ్రీరాముని పాదములపై కేంద్రీకరించియుండిరి. చేయునదిలేక అందరూ శిరస్సులు వంచి నమస్కరించిరి. అంత రాముడు వారలను లేవదీసి కౌగిలించుకొనెను.

"ఓ వానరులారా ! మిత్రులారా ! మీకు నా సారూప్యముక్తి నిచ్చితిని. కొంతకాలము మీరు మీమీ కర్తవ్యములను నిర్వర్తింపుడు ! మీమీ బాధ్యతలను మీరు ఆచరించుడు, రాజ్యపాలనచేయుడు. రాజసుఖముల ననుభవింపుడు" అని అనేక ప్రకారములవారికి బోధించి పొమ్మని శలవిచ్చెను. భరత శత్రుఘ్నులు వానరుల భక్తిని మెచ్చుకొనిరి. రామాజ్ఞ ప్రకారము కొంతదూరము లక్ష్మణ భరత శత్రుఘ్నులు కూడా వానరులవెంట వెళ్లి సాగనంపుటకై బయలుదేరిరి. వారందరు రథములలో వెనుక దృష్టిని పెట్టుకొని అయోధ్యనే చూచుచూ, కంటిధారలు కార్చుచూ, పోవుచుండుటచూచి లక్ష్మణ భరత శత్రుఘ్నులు వారి బాధను చూడలేక పోయిరి. వారి భావములలోని అంతరార్థమును గుర్తించి వారిని వేయివిధముల పొగడిరి. నదినిదాటించి లక్ష్మణ భరత శత్రుఘ్నులు తిరిగి అయోధ్యచేరిరి. వారితో హనుమంతుడు వెనుకకు వచ్చెను. అనేక విధముల ప్రార్థించి సుగ్రీవుని సెలవు తీసు

కొని ఒక పదిదినములు శ్రీరాముని సేవించివత్తునని భరించలేని వియోగముతో, ఎంతవలదన్నను, లక్ష్మణుని వెంట అయోధ్యకు చేరెను.

ఒక దినమున శ్రీరాముడు సోదరులతోను ప్రియుడగు హనుమంతునితోను కలసి యొక ఉద్యానవనమును చూచుటకు వెడలెను. ఆ వనము పుష్పములతోను, ఫలములతోను నిండి యుండెను. అక్కడ శ్రీరాముడు ఒక ఉన్నతాసనముపై కూర్చొనెను. సోదరులు ప్రక్కప్రక్కన కూర్చొనిరి. అపుడు సోదరులు శ్రీరాముని ఏవో కొన్ని ప్రశ్నలు అడగ సంకోచించిరి. వారు హనుమంతుని చూచి వారల మనోభావములను అతనికి తెలిపిరి. హనుమంతుడు ప్రశ్నవేసిన యెడల శ్రీరాముడు స్వయముగా ప్రత్యుత్తరము నిచ్చునని వారు తలంచిరి. సర్వాంతర్యామి అయిన రాముడు గుర్తెరిగి "ఓ హనుమంతుడా ! ఏమి నీవు తెలుసుకొనగోరు చుంటివి, అడుగుము" అని రాముడు పలికెను. అంత "ఓ దీన రక్షకా, తమ్ముడు భరతుడు మిమ్ముల నొక ప్రశ్న అడగతలచెను. కానీ అతడు సంశయపడుచుండెను. మీ యెదుట అతడు సిగ్గుపడుచున్నాడు" అని హనుమంతుడు చేతులు జోడించి నమస్కరించి విన్నవించెను. "ఓ వాయుపుత్రా ! నా స్వభావము నీకు తెలియునుకదా ! నాకు భరతునకు యే విధమైన భేదము లేదుకదా" అని శ్రీవారు చెప్పిరి. శ్రీరాముని వచనములను భరతుడువిని వారి పాదములకు మ్రొక్కి "ఓ ప్రణతార్తిహరా, ఆలకింపుము. నా తప్పులు క్షమించి నన్ను రక్షింపుము. ఏ సందేహములు నాకు లేవు, స్వప్నమందైననూ శోకమోహములులేవు. ఇదంతయూ నీ కరుణాకటాక్షము. ఓ స్వామీ ! నీవు సకలగుణ సంపన్నుడవు. సత్పురుషులకు దుర్మార్గులకు గల తారతమ్యమును వివరించి చెప్పుము" అని ప్రార్థించెను.

"ఓ తమ్ముడా ! వేద పురాణములలో చెప్పిన విధమున సత్పురుషుల గుణములు అనంతములు. చందన తరువునకును గొడ్డలికిని యెట్టి సంబంధము కలదో సత్పురుషులకు దుర్మార్గులకు అట్టి సంబంధముకలదు. చూడుము. గొడ్డలి చందనతరువును నరికినను దాని సుగంధమును గొడ్డలికిచ్చును కదా. ప్రాణమును దీసుకొన వచ్చినదానికి సహితము అది సుగంధము నిచ్చును. అందుచేత శ్రీగంధము సర్వజన సమ్మతము. దేవతలు దానిని శిరస్సుపై ధరింతురు. హితవుజేసిన వృక్షమున కపకారము జేయుటవలన గొడ్డలికి వచ్చిన పాట్లు చూడుము. దానిని నిప్పులో కాల్చి సుత్తితో కొట్టుచుందురుకదా. ఈ ప్రకారమే ఖలులు సత్పురుషులకు దుఃఖము నిచ్చెదరు. అయినను సజ్జనులెప్పుడును వారికి ఉపకారమే చేయుచుందురు. దీనిఫలమేమిః సజ్జనులు స్వర్గమునకు పోదురు. అనగా నిరంతర మానందముగ నుందురు. దుర్జనులు

నిరంతరము అసంతృప్తితో, దుఃఖములతో కుములుచుందురు. వారలు నరకయాతనల ననుభవించుచుందురు. నిందలు నిష్టూరములతో పైకి ఉల్లాసముగా కనుపించినను లోలోన కృశించుచుందురు.

సత్పురుషుల గుణములను చెప్పెదను వినుము. వారు విషయాసక్తులుకారు. సకల గుణశీలసంపన్నులు. ఇతరుల సుఖమునుచూచి సంతసించి వారల దుఃఖము లనుచూచి దుఃఖింతురు. వారు సమదర్శకులు; వారికి శత్రువులులేరు. వారికి శత్రుబాధలే లేవు. వారు జ్ఞానవిజ్ఞాన వైరాగ్యసంపన్నులు. వారల చిత్తములు కోమలములు, దీనుల యందు వారికి దయమెండు. త్రికరణశుద్ధిగా వారు నా పాదములను సేవింతురు. వారికి మానాభిమానములన్నవి ఉండవు. వారు నిరంతరము పరోపకారమును చేతురే కాని స్వార్థమును కలయందైననుకోరరు. వారల ప్రవర్తన సరళము. వారల హృద యములు శీతలములు. వారు త్యాగశీలులు. ఎల్లప్పుడూ వారు సంతోషముగనే యుందురు. తమ్ముడా, యీ లక్షణముల నెవ్వడు కలిగియుండునో అతడు ఆత్మ స్వరూపుడు అని తెలిసికొనుము. ఆత్మస్వరూపుడేమిటి, నేనే వారు వారేనేను అని గ్రహింపుము. వారలకు దూషణ భూషణములు సమానము.

ఇక దుర్జనుల లక్షణాలను చెప్పెదను వినుము. వారల సాంగత్యమును అన్ని విధములా విడిచిపెట్టవలెను. వారల సహవాసము వలన దుఃఖము ప్రాప్తించును. పరుల సంపదలనుచూచి వారి హృదయము లెప్పుడును పరితపించును. పరదూషణ విని వారు సంపదవచ్చినట్లు తలంచి సంతసింతురు. అరిషడ్వర్గములు వారిని ఆశ్ర యించియుండును. ఆశ్రయులు చెప్పినట్లు వారు సంచరింతురు. వారికి దయాదాక్షిణ్య ములు శూన్యము. కుటిలులు, కారణములేకయే పరులతో కలహింతురు. ఉపకారము చేసిన వారితోసహా వారు విరోధించెదరు. వారిమాటలు, వారికార్యములు, వారిబోధన ములు, యిచ్చుపుచ్చు కొనుటయు సర్వమూ అసత్యములు. వారి హృదయములు కఠోరములు. నెమలి పైకిచూచుటకు చక్కగా నుండును. దానికేక వినసొంపుగా నుండును. అయిననది పాములను భక్షించునుకదా. అటులనే దుర్జనులని తెలిసి కొనుము. పరహింస పరాయణులు, పరదారాసక్తులు, పరనిందారతులు. ఈ పాప కర్ములు పాపాత్ములు మనుజాధములు. వారికి యముని భయములేదు. ఇతరులు అభి వృద్ధినొందుటచూచి, విని, పసిపట్టినట్లు వారు తలనొప్పిచే బాధపడుచుందురు. ఇత రుల విపత్తులజూచి వారు సంతసింతురు. పరుల కష్టములనుచూచి దేశమునకు రాజయి నట్లు వారు సంతోషింతురు. వారలకు స్వార్థముతప్ప అన్యపరోపకారమన్నది స్వప్న మందైననువుండదు. వారి హృదయము కామక్రోధాదులకు పుట్టినిల్లు. వీరికి తల్లి

దం(డులని, గురువులని, పెద్దలని, లక్ష్యము లేదు. సత్పురుషులన్నను, భగవంతు డన్నను, వారలకు తలనొప్పివచ్చును. వారు మందమతులు, అవగుణధాములు, కామాంధులు. వీరిని అధికముగా కలియుగములో చూడవచ్చును. ఓ తమ్ముడా! పరోపకారము కంటే ధర్మము మరొకటిలేదు. పరహింసకంటే అధికమగు పాపము లేదు. ఇదియే వేదపురాణముల సారము, ఇదియే సత్పురుషుల మతము. మనుజులై పుట్టి పరహింసచేయువారు నీచయోనులయందు పుట్టి చచ్చుచుందురు. మనుజులు అజ్ఞానాంధకారమునబడి అనేక పాపములు చేయుచుందురు. ఇట్టివారికి నేను ప్రారబ్ధ కర్మ స్వరూపుడనై కాలాంతరమున ప్రత్యక్షమగుచుందును. అట్టి వారిని సంసార ములో పడత్రోసి వారిని శుభ, అశుభకర్మల ననుభవింప చేయుదును.

ఓ భరతా ! దేవతలును మునులును మహాత్ములును శుభ అశుభములనిచ్చు నట్టి కర్మలను విడిచిపెట్టి సదా వారు నన్ను భక్తితో భజించెదరు. వారు నిష్కామ్య ముగ కర్మల నాచరించెదరు. కామ్య తపస్సులను, కామ్యకర్మలను చేసినయెడల వాటి శుభాశుభ ఫలముల ననుభవించుటకు దేహమునుధరించిజీవులు సంసారములోనికి రావలెను. ఏ కర్మలు చేసినను వాటిఫలము నపేక్షింపక వాటి నొనరించిన యెడల మనుజునకు జ్ఞానము కలుగును. భక్తిప్రపత్తులు అభివృద్ధిగాంచును వాటిమూలమున వాడు ముక్తిని సామీప్యమును అనుభవించును.

ఈ విధముగా సజ్జన దుర్జన లక్షణములను మీకు విశదపరచితిని. ఈ లక్షణ ములను తెలుసుకొనినవాడు సంసారసాగరములోబడి మునిగియుండడు. "తమ్ముడా! అనేక విధములగు సుగుణ దుర్గుణములన్నియూ మాయా సంకల్పితములని తెలిసి కొనుము. ఈ రెండు గుణములను లక్ష్యము చేయనివాడు సజ్జనుడు, మహాత్ముడు. అతనే ఆత్మస్వరూపుడు. ఈగుణముల రెండింటికి వశుడగువాడు మూర్ఖుడు. అదియే అజ్ఞానము." ఈ ప్రకారము రాముడు తమ్ములకు వివరించెను. శ్రీరాముని యుపదేశ ములు వారువిని స్వాస్థ్యము పొందిరి. వారి హృదయములు ప్రేమతో ఉప్పొంగెను. మాటమాటకివారు రామునకు శిరస్సువంచి నమస్కరించిరి. అందరికంటే అధికముగా హనుమంతుడు బ్రహ్మానందమొందెను. అనంతరము తమ్ములతోకూడి హనుమంతు నితో సహా శ్రీరాముడు రాజమందిరమునకు పోయెను.

ఈ విధముగా శ్రీరాముని దినచర్య నడచుచుండెను. మరొక దినమున పుర జనులకు, గురు, బ్రాహ్మణులకు వర్తమానము పంపెను. వారలందరు కొలువుకూట ములో సమావేశమైరి. వారు సుఖాసనముల నధిష్ఠించిరి. అప్పుడు వారినిచూచి శ్రీవా రీవిధముగా వారితో ప్రసంగించిరి.

ఓ పురజనులారా! ఓ గురు బ్రాహ్మణులారా! నమస్కారము. నా మాటలను శాంతముతో సాంతముగా వినుడు. స్వార్థపరుడనై నేను దురభిమానముతో ప్రసం గించుట కాదు. నేను మీరాజునని చెప్పుటయు కాదు. మిమ్ముల చెడు మార్గముల

సంచరింపుడని బోధించుటయు కాదు. నా మాటలు మంచివని మీకు తోచిన యెడల ఆ ప్రకారము సంచరింపుడు. నా మాటలను విని వాటి ప్రకారము నడచుకొనువాడే నా స్నేహితుడు. వాడే నా తమ్ముడు. నేనొక తప్పుమాట చెప్పినను, మీరు వెను దీయక, నా తప్పును నాకు చూపుడు. అన్ని జన్మల కంటె నరజన్మము దుర్లభము అని వేదపురాణములును, మహనీయులును చెప్పిరి, చెప్పుచున్నారు. ఎంతో పుణ్యము చేసియుండిన కాని నరుడై పుట్టడు. అది దేవతలకు సహితము దుర్లభము. నరజన్మము మోక్షమునకు ద్వారము. సకల సాధనములకు రాధారి మార్గము.

తమ్ములారా! ఈ శరీరము విషయభోగముల ననుసరించుటకుకాదు. సర్వభోగ ములననుభవించుటకు కాదు. ఇవి అన్నియు క్షణభంగురములు. వీని మూలమున జనుడు మరల సంసారములోనికి వచ్చును. అందుచేత యీ భోగములన్నియును దుఃఖములకు కారణములు. ఈ విషయ భోగములందాసక్తి కలవాడు మూర్ఖుడు. విష యములు విషమువంటివి. అమృతమును విడిచి విషమును గోరుటతగునా? అటుల విషమును గోరువాడు మంచివాడు కాడు. చింతామణిని విడిచి గాజుపెంకును అభిల షించినట్లు కనబడును. నరశరీరమును ధరించి మానవుడు సంసారసాగరమును దాట లేక పోయినయెడల వానివంటి దౌర్భాగ్యుడును, మందమతియు లేడు. వానివంటి ఆత్మఘాతకుడును ఉండడు. అందుచే మనుజులై పుట్టినవారు సర్వులయందు దైవము ఆత్మస్వరూపుడై ఉన్నాడన్న సత్యమును గ్రహించి జనసేవ చేయుచూ అదియే దైవసేవగా భావించి దైవ ఆజ్ఞలను శిరసావహించి, దైవార్పిత భావముతో సర్వ కర్మలు గావింతురు, ఆచరింతురు.

ప్రజలారా! ఇహ పరలోక సుఖముల ననుభవింపగోరువారు నా మాటలను లక్ష్యములో నిడుకొని వానిని మరువక సంచరించుతారు. అన్ని మార్గములకంటె సంసారమును దాటుటకు భక్తిమార్గమే సులభము, మనోహరమైనది. సంసారమును దాటుటకు జ్ఞానమార్గము కష్టము. ఆ మార్గమున అనేక విఘ్నములు కలుగును. మనో విగ్రహము దుర్లభము. జ్ఞానమార్గమున నడచినవానికి భక్తిలేని యెడల నాకుప్రియుడు కాడు. భక్తివంటిది మరొకటి లేదు. దానికి స్వతంత్రము కలదు. దానివలన సకల సుఖములు కలుగును. సత్సాంగత్యము లేనియెడల భక్తి కలుగదు.

ఓ జనులారా! మీకు మరొక రహస్యమును చెప్పుచున్నాను, వినుడు. శివకేశ వుల కేవిధమగు భేదములు లేవు. భగవంతుడు ఒక్కడే అని విశ్వసింపుడు. రూప నామములు వేరువేరుగానీ దివ్యాత్మ ఒక్కటే. అది అందరి యందునూ సమముగనే యున్నది అనిన రాముని అమృతోపమానమగు వచనములను విని పురజనులు శ్రీ రామచంద్రునకు శిరస్సులు వంచుకొని నమస్కరించిరి. ఓ స్వామీ! మా ప్రాణముల కంటె నీ మీదనే ఆశమెండు. నీ మూలమున మా శరీరములు దృఢముగ నుండెను. మా గృహములలో నిత్యమంగళములు జరుగుచుండెను. ఇది అంతయు నీ ప్రభా

వము. అన్ని విధముల మా దుఃఖముల బోగొట్టి మమ్ముల దరిజేర్చితివి. ఓ మహా రాజా! నీవు తప్ప మాకు నీవలె బోధించువారెవరు? మా తల్లిదండ్రులు స్వార్థపరులే కానీ మరొకరు కారు. మావలన నీకు ప్రయోజనములేదు. మమ్ములను పరలోకము నకు పోదగినట్లు మమ్ములను శిక్షించితివి. అదియే మాకుజాలును. ఓ రాక్షసాంతకా! నీవునూ నీ సేవకులూ లోకమునకు ఉపకారులు. స్వప్నమునందైననూ ఇట్టిమిత్రుని, ప్రభువుని, తల్లిని, తండ్రిని చూడలేము అని ప్రజలు వేయివిధముల విన్నవించిరి. వారి విన్నపములు విని శ్రీరాముడు ప్రసన్నుడయ్యెను. శ్రీవారి శెలవుగైకొని ప్రజలు వారి వారి గృహములకు బోయిరి. ప్రజలు నిరంతరము శ్రీవారి ప్రసంగ మును స్మరించుచూ కాలము గడిపిరి. అయోధ్యలో ప్రతి గృహస్థునకు ఒక్క పువ్వులతోట కలదు. అతడు దానిని జాగ్రత్తగా కాపాడును. యెల్లప్పుడూ అచట వసంతఋతువులో వలె అన్ని కాలములలో ఆ చెట్లు పుష్పించి ఫలించును. సదా భ్రమరములు ఝుంకారము చేయుచుండును. మంద సుగంధ శీతలవాయువులు వీచు చుండును. అనేక విధములగు పక్షులను బాలురు పెంచిరి. అవి చక్కని ధ్వనులు చేయుచుండును.

రాముని రాజ్యకాలములో వివిధ పురజనుల సిరిసంపదలను సహస్ర శేషులైనను వర్ణింపలేవు. అంతటి ధర్మముగ రాముడు రాజ్యమును పాలించెను. శ్రీరాముడు అనేక అశ్వమేధయాగముల నొనరించెను. కోట్లకొలది బ్రాహ్మణులకు దానములనిచ్చి, వారిని తృప్తిబొందించెను. వేదమార్గ ప్రవర్తనుడును, ధర్మరక్షకుడును గుణాతీతుడునగు శ్రీరాముడు సకల గుణసంపన్నురాలగు సీతాదేవి, ధర్మ మార్గము నవలంబించి మెలగుచుండిరి. తాపత్రయములు రామునికాలములో నశించెను. జనులు పరస్పరానురాగము కలవారై యుండిరి. వేదములలో చెప్పబడిన ప్రకారము వారివారి కుల ధర్మముల ననుసరించి ప్రవర్తించిరి. తపములు, దానములు, యజ్ఞములు జ్ఞానమును ఈ నాల్గు ధర్మములను యధావిధిగ లోకములో జరుగుచుండెను. స్వప్నమందైనను ప్రజలు పాపచింతలు చేసెడివారు కారు. స్త్రీ పురుషులు, వృద్ధులు, బాలురు సర్వులూ శ్రీరామ చింతను నిరంతరము చేయుచుండెడివారు. ఏ విధమగు పీడలునూ కానరావు దరిద్రులును, దుఃఖితులును, దీనులును, మూర్ఖులును, కురూపులును ఇట్టి మనుజులు రాముని కాలమున కానరాలేదు. అందరును సర్వలక్షణ సంపన్నులు. ఒకరికి డాంబికము లేదు. మతొకరికి అసూయలేదు. అందరూ ఆత్మ జ్ఞానులు. ధర్మరతులు. దయాదాక్షిణ్యములు కలవారే. ఒకరి సుగుణములను మతొక్కరు మెచ్చుకొనుచుండిరే కాని అసూయకు చోటిచ్చెడివారుకారు. లేక అహంకార మునకు తావిచ్చెడివారు కారు.

సప్తద్వీపములతో కూడిన భూమండలము యావత్తును సముద్రము వరకును రాముని యేక ఛత్రాధిపత్యము క్రింద నుండెను. ఈ సామ్రాజ్యమునకు శ్రీరాముడే

స్వరాట్టు. రామరాజ్యములో సామదానములు పూర్ణించి యుండెను. భేద దండములు కానరావు. దండము యతీశ్వరుల చేతిలో మాత్రమే కనపడును. భేదము రాగము లోను నృత్యములోను కనుపించును. నిగ్రహము ఆత్మ నిగ్రహములో కనుపించును. శత్రువులే లేని సమయమున వారిని నిగ్రహించుట యెట్లు ? నిరుపమానమగు వాపీ కూప తటాకములు అనేకములు ఆ నగరమున కలవు. వాని నిర్మల జలములేమి, వాని చక్కని రేవు లేమి, వాని సొగసు చూసి మునులు, ఋషులు ఆనందించెడి వారు. సిగ్గు పడెడివారు. నానా రంగులుకల కమలములు ఆ సరోవరములలో విక సించి యుండెను. వాని యొద్దుల అనేకపక్షులు ధ్వనులు చేయుచుండెడివి. శుకపిక పారావతములు మధుర స్వరములతో గానము చేయుచుండెడివి ఆనగరము స్వర్గమున కంటే అధికముగ నుండుటచే అందరూ దానినిచూచి భ్రమించిరి.

ఒక దినమున సకల సుఖధాముడగు శ్రీరాముని దర్శించుటకు వశిష్ఠుడు రాజ మందిరమునకు వచ్చెను. అర్ఘ్య పాద్యములనిచ్చి శ్రీరాము డతనిని సత్కరించెను. ఆ మునిరాజు చేతులు జోడించి హే కృపాసింధూ ! నా మనవి ఒకటి కలదు. మీ లీలామానుష చర్యలు కన్నులారా కాంచుచుంటిని. నా మనస్సున గొప్ప సందే హము పుట్టెను. నీ ప్రభావము అపారము. వేదములకు సహితము నీ సంగతి బాగుగా తెలియదు ఓ స్వామీ ! నేను నిన్నెటుల వర్ణించగలను ? పురోహిత కర్మ నీచమైనది. వేదపురాణ శాస్త్రములు పురోహితవృత్తిని దూషించుచున్నవి. యజమా నుని శుభా అశుభ కర్మలలో సగము పురోహితుని వంతుకు వచ్చును. కనుక నది ద్రోహము. మొదట ఈ పురోహితకర్మ స్వీకరించుటకు నేను సమాధానపడలేదు. అప్పుడు బ్రహ్మ నన్నుచూచి నాయనా ! నీకు రాబోవు సంగతి తెలియదు. తప్పక నీవా పనిని చేయుము. అందువలన ముమ్ముందు నీకు లాభము కలుగును. పర బ్రహ్మము రఘుకులమునం దవతరించును. అని నొక్కి చెప్పి నన్నాపనికి మెడలు వంచెను. అందుచేత దానికి నేనొడంబడితిని. యే సత్పదార్థము బొందుటకు యాగ యజ్ఞ, జప తపములు మొదలగు వానిని చేయుచుందురో నే నా సత్పదార్థమును వానిని చేయకయే సులభముగా బొందగలిగితిని. ఈ సత్కర్మలకు పరమార్థమే లక్ష్యము. ఇంతకంటే నే మంచిమార్గమును నే ననుసరింతును. ఓదేవదేవా! జపములుతపములు యజ్ఞములు నియమాలు వ్రతములు ఇవిఅన్నియు వేదవిదితకర్మములు. జ్ఞానము, భూత దయ, దమము, శిష్టాచార ప్రవర్తన వీటివలననే నీ సన్నిధి లభించును. ఓ నాథా ! నేనొక వరము గోరుకొందును. తమరు కటాక్షించి దయచేయుడు. యెన్ని జన్మ లెత్తినను నీ పాదారవిందములయందు భక్తి తక్కువ కాకుండా నుండుగాక ! అని వశిష్ఠుడు శ్రీవారిని ప్రార్థించెను. పిమ్మట రాముని అనుజ్ఞ గైకొని వశిష్ఠుడు స్వగృహమునకు బోయెను. పరమ పవిత్రమైన శ్రీరాముని మనోహరమగు చరి

త్రను గానము చేయుచుండిరి ప్రజలు. వ్రతములు, యాగములు చేసినను జ్ఞాన వైరాగ్యముల కలిగియుండినను ప్రేమలేనియెడల రాముని దర్శనము దొరుకదు. జ్ఞాని తపస్వి, శూరుడు, కవి, పండితుడు, సకల గుణరాశి. వీరిలో నెవరిని లోభము బాధించలేదు. ధనమదముచే నెవరు తప్పు మార్గములు తొక్కలేదు. అధికార బల ముచే నెవడు చెవిటివాడు కాలేదు. యవ్వన జ్వరముచే బాధపడని వాడేడీ? మమ కారముచే కీర్తి బోగొట్టుకొనని వాడేడీ? మత్సరమను మచ్చలేని వాడేడీ? శోక మనునట్టి వాయువుచే కంపము నొందని వాడేడీ? చింతయను సర్పముచే కరువ బడని వాడేడీ? ఆతను శ్రీరాముడే వీటి కేటికీ కట్టుబడక, అన్నింటికీ మించి, అతీ తుడై ఆత్మరూపుడై నిలిచినవాడు భగవంతు డొక్కడే.

ఈ లోకములో మాయయొక్క ప్రచండ సైన్యములు తిరుగుచుండును. కామాదులు యోధులగు భటులు. దంభము, పాషండము మొదలగునవి సేనాపతులు. ఆ మాయ రఘునాధుని దాసి. ఆమె మిధ్య. అయిననూ రఘునాధుని కటాక్షములేని యెడల దాని బంధములు వీడవు. తజ్ఞాయమాన కటాక్షమె దానిని వీడగొట్టును. యే మాయ చరాచర జంతుజాలము నాడించుచున్నదో, యే మాయయొక్క ప్రభావ మును గుర్తెరిగినవారు లేరో, అట్టి మాయ యొక నటివలె దాని అనుచరులు కామాదులతో కూడి భగవంతుని భ్రూవిలాసము ననుసరించి నాట్యము చేయును. శ్రీరఘురాముడు సచ్చిదానందమూర్తి, ఘనశ్యాముడు. పుట్టుకలేనివాడు అట్టి పర మాత్మయందు మాయ లేశమైనను యుండదు.

అయోధ్యానగరములో నిత్యోత్సవములును, నూతన వినోదములును జరుగు చుండెను. అనుదినము శ్రీరాముడు దానములకింద ధనమును వినియోగించెను. ఒకరినొకరు నిందించుకొనకూడదు. దుర్భాష లాడరాదు. ప్రతి గృహమునందు దినమూ వేదపారాయణము, పురాణ శ్రవణం జరుగుచుండెను. ఎవరి కులధర్మ ముల ననుసరించి వారుసంచరించిరి. కానీ, పరకులములను తిరస్కరించువారు కానీ, చిన్నబరచుట కాని రామపరిపాలనతో ఎక్కడనూ కానరాదు. రామునకు ప్రజల యందు దయాను రాగములు పెరిగెను. రాముని కాలములో భక్తి శ్రద్ధలతో భర్త లకు స్త్రీలు శుశ్రూష చేయుటచూచి దేవతా స్త్రీలు సహితము సిగ్గు పడెడివారు. ఆ నాటి భర్తలు కూడను వారికి తగిన వారైయుండిరి భార్యలకు కంటినీరు తెప్పిం చెడివారు కారు. సతిపతులు ఇరువురు అర్థదేహములుగా భావించి ఒకరినొకరు అను సరించి, అన్యోన్య అనుకూలముగా మెలగెడివారు. అసత్యములు రామ కాలమున యెట్టి సమయమునందైననూ ఆడుటకు పూనుకొనెడివారు కారు. తల్లిదండ్రుల ఆజ్ఞలు, గురువుల ఆజ్ఞలు, బాలబాలికలు మన్నించుచుండిరి. అందరూ దేవేంద్ర భోగముల ననుభవించిరి, కుబేరునితో సమానముగా ధనధాన్యములు సమృద్ధిగా

నుండెను. శరత్కాల చంద్రబింబమును చూచి, చాకోరములు సంతసించునటుల అంతఃపురస్త్రీలు రాముని చూచి ఆనందించెడివారు. శ్రీరాముని దివ్యమంగళ విగ్రహమును కన్నులారచూచి భరత లక్ష్మణ శత్రుఘ్నుల మనసున కాప్యాయము కలిగెడిది.

రాముని ప్రభుత్వములో లోకమంతయు సంపూర్ణ కళలతో నిండియుండెను. పాపమను మాటలేదు. మునీశ్వరులు నిర్భయముగ వనములలో సంచరించుచుండిరి. రాజునకు ప్రజలకు అన్యోన్యానురాగము పెరిగెను. భూమి అంతయు శోభాకరముగా నుండెను. వనములు కళకళలాడెను. పక్షులు, మృగములు స్వాభావిక విరోధమును విడిచి, పరస్పర మైత్రితో మెలంగెను. రామరాజ్యములో వైరమను మాటలేదు. అందరూ పరమ సఖ్యముగా నుండిరి. ప్రతి వ్యక్తి శ్రీవారి ప్రభావమును వర్ణించుటలో యెంతయో ఉల్లాస పడుచుండెడివారు.

ఒకనాడు హజారములో శ్రీరాముడు తమ్ములతో సింహాసనము నధిష్ఠించి యుండెను. ఆ సమయమున ఒకబ్రాహ్మణుడు దుఃఖించుచు రాజసభకువచ్చెను. అనేక నిష్ఠూరవాక్యములను అతడు పలికెను. మొరపెట్టుకొనెను. అయ్యో ! లోకములో సూర్యవంశపురాజుల కీర్తి ప్రతిష్ఠలు నేటితో అంతరించెను. శిబి, రఘు, దిలీప, సగర మహారాజుల ప్రతాపమును వారి కీర్తి నెవరెరుంగరూ ? వీరి కాలములో ఇట్టి విపరీతములు జరిగి యుండెనా ! యెన్నడైన తండ్రి బ్రతికియుండ కుమారుడు చనిపోవునా ? ఇది యెన్నడైనా కలదా ? ఈనాడు ఈ విపరీతముల జూచితిని; అని బ్రాహ్మణుడు విలపించెను. అతని దుఃఖమునకు కారణము సర్వాంతర్యామియైన రాముడు గమనించి, బ్రాహ్మణుని వచనములను విని కొంత విచారించెను. యే కారణముచేత అతని కుమారుడు మరణించెనో దానిని తెలుసుకొనుటకు చింతించెను. అది రాజ్య పరిపాలనా విధానములోని దోషము కాదనియును దుచ్చింతనా ప్రభావము ఈ విధమగు దుర్మరణమునకు హేతువని తలంచిరి. అట్టి దుచ్చింతలు రానీయక ప్రజలలో చేరనీయకుండుటకు తగిన కట్టుదిట్టములు కావించెను. ఇట్టి చిన్నచిన్న విషయములు కూడనూ అతిజాగ్రత్తగా గమనించి, స్వార్థమును ప్రక్కకు నెట్టి ప్రజా క్షేమమే తన క్షేమముగను, ప్రజలే తన దేహముగను, ప్రజలు తమ రామచంద్రుడే వారల గుండెలుగను భావించిరి. ప్రజా ప్రభువులయొక్క సన్నిహిత సంబంధము దేహగుండెలుగా భావించి జీవించెడివారు; పాలించెడివారు. ప్రజల అభీష్టముల కేనాడును విరుద్ధముగ చింతించడు శ్రీరాముడు. ప్రజలు కూడను ప్రభువుయొక్క ఆజ్ఞను స్వప్నము నందైనను జవదాటరు. అట్టి ఆనాటి రామరాజ్యము కొన్ని సంవత్సరములు ప్రశాంతముగ జరిగెను.

రాముడు సాక్షాత్ నారాయణుడు. అతని పరిపాలననే ప్రపంచ శోభ. లోక కళ్యాణమునకు సత్య ధర్మములే సరియైన పాలకులు.

# సీతా పరిత్యాగము

దేశములోనూ, నగరములోనూ చారులు గూఢముగా సంచరించి ప్రతిదినము సాయం సమయమునకు నగరమునకువచ్చి, యావద్వృత్తాంతమును ప్రభువునకు విన్నవించుట యాచారముగలదు. ఆ యా చారులు చెప్పిన వృత్తాంతములను రాజమూర్తి వినుచుండెను. వారిలో నొక డొకవిధమున రాజువద్దకువచ్చి నమస్కరించి నిలువబడి యుండెను. గానీ యే సమాచారము చెప్పక మౌనము ధరించెను. వానిని రాముడు తర్కించిననూ వాడు పలుకక యూరకుండెను. అంతట ధైర్యము నవలంబించి రామునితో నిట్లు చెప్పెను. "ఓ మహారాజా! నామాట మన్నింపుము, నన్ను క్షమించుము, ఒక చాకలివాడును, వాని భార్యయు కలహించిరి. 'ఓసీ! నేను రాముడను కాను, ఇంతకాలము నీవు పరుల గృహములో నివసించుచుంటివి కనుక నా గృహమునుండి లేచిపొమ్ము' అని వాడు భార్యను పొమ్మనెను" ఆమాట బాణము వలె రాముని హృదయమునకు దగిలెను.

ఆరాత్రి రామునకు నిద్రలేదు. ఆ విషయమే రామునకు మనసున మెదలుచుండెను. అర్థరాత్రి వేళలేచి, విచారించుచూ "నేను రాజ్యము చేయుచుండ ఒక యుగము గతించెను. ఇంక కొన్ని సంవత్సరములు రాజ్యము చేయవలెను," అని ఆ కృపాసాగరుడు విచారించుచు, "ఆహా! నేను జానకిని విడిచిపెట్టవలెను. వేదమార్గము లను నిలబెట్టవలెను" అని అతడు నిశ్చయించెను. అతడు జానకివద్ద కొచ్చి సంతోషముతో ముచ్చటించెను. రాముడు చిరునవ్వులు నవ్వి, ఓ జానకీ! ఇంతవరకు నీవు నన్నొక వరము నడుగలేదు. అయిననూ నీకొకవరము నిచ్చెదను. నీ పవిత్రధామమునకు పొమ్ము అని చెప్పెను. ఆ తక్షణము జానకి శ్రీవారికి నమస్కరించి సూక్ష్మ రూపమున వైకుంఠమునకు పోయెను. ఆ వృత్తాంతము చరాచర జంతుజాలమునకు తెలియదు. మాయాసీత మాత్రము శ్రీరామునియొద్ద నిలిచియుండెను.

ఆ మాయాసీతనుచూచి ఓ సీతా! నీవు వరమునడుగుము అని రాముడు పలికెను. ఓ నాథా! నాకు ముని ఆశ్రమములో విహరించవలెనని కోరిక కలదు అని

ఆమె చెప్పెను. ముని కన్నెలకును, మునిపత్నులకును తగిన వస్త్రాద్యలంకారములు నామె మూటకట్టెను. రాముడు తథాస్తు, రేపు ప్రాతఃకాలమున నీవు ప్రయాణ మగుము అని చెప్పెను.

ప్రాతఃకాలముననే రాముడు మేల్కాంచెను. యాచకజనులు శ్రీరాముని గుణ గణములను గానముచేయుచుండిరి, శ్రీవారి ముఖకమలము వికసించెను. భరతలక్ష్మణ శత్రుఘ్నులు రామునివద్దకువచ్చి వారి చరణములకు నమస్కరించిరి. అన్నదమ్ము లతో అతడు మాటాడక యూరకుండెను. శ్రీరాముని ముఖము వెలవెలబోవుచుండెను. అతని శరీరనవకము చెడిపోయెను. అతని ప్రతి అవయవము శంకను దోపించెను. అతని వ్యాకులమునకు కారణము తెలియక వారు ముగ్వురూ గడగడ వడకిరి. అతని మనోవ్యాపారము వారికి నగోచరము.

శ్రీరాముడు కడకు విచారమును ప్రకటించుచూ నిట్టూర్పులను విడిచి, తమ్ము లతో నిట్లు ప్రసంగించెను. "ఓ తమ్ములారా, నా మాటను కాదనక జానకిని వనము లలో విడిచిపెట్టిరండు. ఆ మాటలు వినినంతనే వారు నిశ్చేష్టులైరి. వారి శరీరములు మండెను. వారి హృదయములు దహించిపోయెను. ఈ మాటలు శ్రీరాముడు హాస్య మునకు చెప్పెనో లేక నిజముగ జెప్పెనో వారికి సందేహము కలిగెను. ఆముగ్వురు తమ్ములు వ్యాకులము బొందిరి. శత్రుఘ్నుడు వెక్కివెక్కి యేడ్చెను. లక్ష్మణ భరతులు కంటిధారలు కార్చుచూ నిశ్చేష్టులై నిలచిరి. నోటిమాట రాకపోయెను. పెదవులు చేతులు అదరిపోయెను.

కడకు చేతులు జోడించుకొని రామునితో ఇట్లు విన్నవించెను శత్రుఘ్నుడు "శ్రీవారి వచనములు మాహృదయములను ఛేదించెను. జానకిలోకమాత. ఈసంగతి జనులకు తెలియును. మీరు లోకతంత్రులు, సకలజీవుల హృదయములలో నివసించు చుందురు. సచ్చిదానంద పురుషులు. ఏ కారణముచేత జానకిని విడిచిపెట్టుచున్నారు. త్రికరణశుద్ధిగా ఆమె నిత్యానపాయినికదా! ఓ రాక్షసాంతకా! మీరు సర్వజ్ఞులు. ఆమె ప్రస్తుతము గర్భమును ధరించెను. ఇట్టి స్థితియందు ఆమెను వంటరిగా విడచుట పాడియా అని పొరలివచ్చు దుఃఖమును ఆపుకొనలేక గోడున ఏడ్చుచూ శత్రు ఘ్నుడు విన్నవించెను. ఓ తమ్ముడా! నీవు నామాట నుల్లంఘించినయెడల నాప్రాణ ములు ఈ శరీరమున నిలచియుండవు. మీకు మంగళమగుగాక ఓ తమ్ములారా! నామాటప్రకారము ప్రాతఃకాలమున జానకిని వనమునకు దీసుకొనిపొండు అని శ్రీరాముడు శిరస్సు వంచుకొనెను. దుఃఖించునట్లు నటనచేసెను.

కర్ణకఠోరమగు శ్రీరాముని వచనములను విని భరతుడు ఓనాథా, నేను బుద్ధి

హీనుడను. నా విన్నపము ఆలకింపుము. మనసూర్యవంశమునకు లోకములో పేరు ప్రతిష్ఠలుకలవు. తండ్రి దశరథమహారాజు, తల్లి కౌసల్య, మీరు, స్వయము త్రిలోకాధిపతి. మీ పేరుప్రతిష్ఠలు లోకప్రసిద్ధము. మీకీర్తిని వేదములును, శేషుడునుగానము చేయుచుండును. జానకి సకలశోభాన్వితురాలు. అమంగళమును నశింపజేయును, సకల శుభమంగళముల నిచ్చును. ఆమె మహా పతివ్రత. ఆమె ఛాయను గ్రహించిన మాత్రమున స్త్రీలు సద్గతిం బొందగలరు. అట్టి జానకి మిమ్ములను విడచి వనములో విహరింప గలుగునా? ఒక నిమిషము మిమ్ములను విడచి జీవించియుండగలదా? నీరులేకుండా మత్స్యములు జీవింపగలవా? సకలగుణ సంపన్నురాలు, ఆ జ్ఞానస్వరూపిణి జానకి వంటరిగా జీవించుట దుర్లభము.

ఈ ప్రకారము భరతుడు చెప్పిన మాటలనువిని శ్రీరాముడు తమ్మునితో ఓయీ! భరతా! నీవు నీతియుక్తమగు మాటలు పలికితివి. రాజు రాజనీతిప్రకారము ధనమును, ధర్మమును కాపాడవలెను. ప్రజల బాలించుటలోవారికి క్షోభపెట్టకూడదు. అత్యానురాగములతో వారిని రక్షింపవలెనుఅని, దూతచెప్పిన మాటల నతడు తమ్ములతో వ్యక్తపరచెను. ఓ తమ్ములారా! మన వంశమునకు గొప్ప కళంకమువచ్చెను. మన వంశములో అనేక రాజులు గతించిరి. ఒకరికంటె ఒకరు సుప్రసిద్ధులు. వారి కీర్తిప్రతిష్ఠలు లోకవిదితము. భూలోకములో వారలను యెరుగనివారులేరు. వారు ప్రాణములైననూ విడిచిపెట్టిరి కానీ ఆడినమాటను తప్పలేదు. మన వంశమునకు మచ్చలేదు. ఒకవేళ మచ్చ వచ్చినపుడు ప్రాణమును విడిచిపెట్టక యుండినవాడు నీచుడని తెలిసికొనుడు అని చెప్పగా తమ్ముడు నాధా! మన జానకికి లేశమైననూ కళంకములేదు. అగ్నిహోత్రమునుండి జానకి వెడలివచ్చెను. జానకికి మచ్చగలదని దేవతలుగాని, మునులుగానీ స్వప్నమందైననూ చెప్పరు. ఈ విషయమును తెలియక జానకి పాపాత్మురాలని తలంచినవారు రౌరవాది నరకములలో కోట్లకొలదీ కల్పాంతరముల వరకు బాధల ననుభవింతురు అని భరతుడు కొంత ఆవేశపూరితములైన మాటలు ఆడినంతనే శ్రీరాముని రౌద్రరూపమును, కోపారుణ నేత్రాంతములను లక్ష్మణుడుచూచి భయపడి భరతుని వెనుకకు దూరెను.

ఓ లక్ష్మణా! విచారమును, మూర్ఖత్వమును విడిచిపెట్టి లోకులు పలికిన మంచి చెడుగులను గ్రహింపుము. నాఆజ్ఞ నుల్లంఘించి ప్రత్యుత్తరమునిచ్చినఎడల నా జన్మాంతము విచారింపవలసి యుండును. జానకిని రథముపై గూర్చుండబెట్టుకొని గంగానదీ తీరమున విడచిపెట్టి రమ్ము. సాంద్రారణ్యములో నిర్జన ప్రదేశములో ఆమెను దిగబెట్టుము.

శ్రీవారి మాటలువిని లక్ష్మణుడు నిరాశ చేసుకొని మృత్యువునకు సిద్ధపడి ప్రయాణమయ్యెను. భోజన పదార్థములను, వస్త్రములను రథముపైనా జానకిని కూర్చుండబెట్టి లక్ష్మణుడు వెడలెను. శ్రీరాముని ధర్మపత్ని అత్యుత్సాహముతో ప్రయాణమయ్యెను. లక్ష్మణమూర్తి మొఖము చిన్నబోయిఉండుటచూచి సీతమనసు వ్యాకులమయ్యెను. ఆమె మొఖమునుండి వొక మాటైననూ వెడలలేదు. మణిని నష్టపడిన సర్పమువలె ఆమె లోలోన అణచుకొనెను.

వారు గంగాతీరమునకు వచ్చిరి. ఆ కారడవినిచూచి వారు భయపడిరి. లక్ష్మణుడు భయపడుటచూచి సీత వెలవెలబోయెను. సీతకు తాను మాయసీతనని తెలిసియూ లోకమునకై ఆమె నటనచేయ మొదలుపెట్టెను. ఓ లక్ష్మణా! ఇచ్చట ముని ఆశ్రమము లేవియూ కనబడకున్నవే, ఎచ్చటికి నన్ను తీసుకొనిపోయెదవు. ఈ అడవిలో నానావిధ క్రూరమృగములు, సర్పములు మొదలగునవి విచ్చలవిడిగా సంచరించుచున్నవికదా! ఈ ప్రదేశములో జనసంచారమయిననూ కనుపించుటలేదు. లక్ష్మణా నాకు భయమగుచున్నది.

ఈ ప్రకారముగ సీత విలపించెను. లక్ష్మణునిమనసు జాలిపడెను. అంత ఓ రామచంద్రా! ఎంతపని చేసితివి అని లోలోన స్మరించి సీతనుజూచి ధైర్యము నవలంబించి దాహముచే నా ప్రాణములు వెడలుచున్నవి అని ఎంతోబాధపడెను. అతని మనస్సంకటమునుచూచి సీత చాల కంగారుపడెను. లక్ష్మణుని కృతనిశ్చయమును తెలిసికొని ఆకాశవాణి లక్ష్మణా జానకిని విడిచి నీవు అయోధ్యకుపొమ్ము. సౌభాగ్యవతియగు సీత జీవించును అని పలికెను. ఆమాటలు విననందున అతనికి ధైర్యమువచ్చెను. అతడు చేతులు జోడించుకొని సీతకు నమస్కరించి దుఃఖపడి, తల్లీ నేనేమీ చేత, శ్రీరాముని ఆజ్ఞ జవదాటలేక పోవుచున్నాను. నేను మహా కిరాతకుణ్ని, నిన్ను ఈ కారడవిలో విడచిరమ్మని అన్నగారిఆజ్ఞ అని, ఉన్నదిఉన్నట్లు చెప్పి రథమును వెనుకకు త్రిప్పెను. లక్ష్మణుని చూపులు వెనుకకే తిరిగిపోయెను. సీత, "లక్ష్మణా! నన్ను అరణ్యములో విడచిపోవుచున్నావా? నాకెవరు దిక్కు" అని సామాన్య స్త్రీలవలె ఆమె విలపించెను. చేయునదిలేక ఆమె మాటలు శూలములవలె లక్ష్మణుని కర్ణరంధ్రముల పొరచుకొని పోవుచున్ననూ రామాజ్ఞను నెరవేర్చక తప్పదని మనసును పాషాణముగా చేసుకొని లక్ష్మణుడు నగరమునకు చేరెను.

సీత మూర్ఛిల్లినట్లు నటనచేసెను. అంతలోలేచి ఓ రామచంద్రా, పుట్టినదాది నా జీవితము దుఃఖముల పాలబడెను. యెన్ని దుఃఖములు వచ్చిననూ నాప్రాణము

బొందిని విడచిపెట్టవు అని ఈవిధముగ విలపించెను. ఆ సమయమున గంగానదిలో స్నానముచేసి వాల్మీకిమహర్షి ఆమార్గమున ఆశ్రమమునకు బోవుచుండెను. ఆ మాటలు అతనిచెవిలోపడి ఈ భయంకరారణ్యమున స్త్రీకంఠము వినుపించుచున్నదే అని అటూఇటూ వెతకుచూ ఆమెయున్న ప్రదేశమునకు వచ్చెను. ఆమె వాల్మీకి మహామునిని గుర్తుపట్టి స్వవృత్తాంతమును అతనితో జెప్పెను. ఓ మునిరాజా! నేను జనకచక్రవర్తి కుమార్తెను, శ్రీరామచంద్రుని భార్యను, ఈ విషయము లోక ప్రసిద్ధము. వారు నన్ను విడనాడుట కారణము తెలియదు. విధికృతము తప్పించుకొనుటకు శక్యమా? ఓ మునివరా! లక్ష్మణ నన్ను తీసుకొనివచ్చి విడచిపెట్టెను. ఇందుకు కారణము నాతో చెప్పలేదు. అని ఈప్రకారము సీత చెప్పిన వృత్తాంతమును వాల్మీకి మహామునివిని ఆమెనోదార్చి, ఓ కుమారీ! నీతండ్రి మిథిలాపతి యగు జనకుడు నామిత్రుడు, శిష్యుడు. నాయందు భక్తివిశ్వాసములు కలవు. ఓకుమారీ, నీవేమీ చింతించకుము. ఇది నీతండ్రి గృహముగా భావించుము. నీకు శుభము కలుగును. పునః నీకు రామునిసంయోగము కలుగును అనిచెప్పెను. జానకిని తన బిడ్డగాభావించి ఆమెను గంగానదిలో స్నానము చేసిరమ్మని ఆజ్ఞాపించెను. ఆమె స్నానమాడి శుచిఅయి వాల్మీకికి నమస్కరించెను. అంత ఆమెను ఆశ్రమమునకు తీసుకొనిపోయి అనేకవిధముల ధైర్యము గలిగించెను. ఆమెకు కందమూలాదులు సమర్పించెను. ఆమెమహాసీయుని బలవంతముతో కొంత భుజించెను. అప్పటినుండి శ్రీరాముని ధ్యానముచేయుచూ ఆశ్రమ కార్యక్రమములో ఆశ్రమవాసులతో శాంతముగా కాలము గడుపుచుండెను. ఆమెకు చిత్రవిచిత్ర కథలు చెప్పుచూ వినోదములు చూపించుచూ ఆమె దుఃఖమును మరిపించుచూ ఉండిరి.

లక్ష్మణుడు సీత చింతతోనే కన్నులు కాయలుకాయునట్లు విలపించుచూ నగరముచేరి ఈ విషాదగాథను ముప్వురు తల్లులు తెలుపగ వారు గొల్లుమనియేడ్చి జానకికి గొప్ప ఆపద వచ్చెనని వారు ఆమె గుణగణములను పొగడుచూ అట్టి మహా సాధ్వీమణి కెంతటి గతియో అని కుమారుని ఒకవైపు నిందించుచు ఉండిరి. రాజనగరమునందు కానీ, అంతఃపురమునందు కానీ ఎచ్చట చూచిననూ రోదనమే వినబడుచుండెను. స్త్రీ బాల వృద్ధులు అందరూ శ్రీరాముని నిందించుచూ అట్టి తల్లికి ఇట్టి శిక్షయా అని విచారించని వారులేరు. ఆ కోలాహలము రాముడువిని లక్ష్మణునితో కూడి మందిరములో ప్రవేశించి బైట ప్రజలకు కనుపించకయుండెను. తరువాత అంతఃపురమునకు పోయి వారల నోదార్చి వారలకు జ్ఞానమును ఉపదేశించెను. ప్రజలకు రాజనీతిని గురించి ప్రజలే ప్రధానముకానీ బంధుమిత్రులు కారు. ప్రజలే

బంధువులు, ప్రజలే నా మిత్రులు అని, అట్టి గుణముకలవారే పరిపాలకుడని వారికి అనేకవిధముల నచ్చచెప్పెను.

అంత సీతావియోగముతో ముప్పురు తల్లులు విలపించి కృశించిరి. కడకు ప్రాణము వీడిరి. ఆ ముప్పురు తల్లులు యోగాగ్నిచే శరీరములను దహించి పరమ పదమునకు వెళ్ళిరి. ఆ నల్వురన్నదమ్ములు వారల మరణములకు దుఃఖించి వేదోక్త ప్రకారము వారికి తగిన యుత్తరక్రియలను నిర్వర్తించిరి. తల్లుల పేర్ల చెప్పిషోడశ మహాదానములు విచ్చిరి. అనంతరం శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులు వారి వారి పరిపాలనా విధానమును ప్రజల తృప్తిని అనుసరించి చూచుకొనుచుండిరి.

అంతలో శ్రీరాముడు అశ్వమేధయాగము ఒకటి చేయవలయునని కోరిక కల దని దానివలన సకల దుఃఖములను నశించునని, తలంచి అంగదాదులకు వర్తమానము పంపెను. తమ్ములతో, మంత్రులతోకూడి గురువుగారి గృహమునకు వీడెను. గురువు చరణములకు నమస్కరించిరి, గురువు వారల నాదరించెను. మృదువచనములతో వారి యోగక్షేమముల విచారించెను. పురాణకథలను ఇతిహాసములను గురువుగారు ఉపదేశించెను. అంత శ్రీరాముడు, ఓ నాధా, నా మనోరధమొకటికలదు. దానిని మీరు పూర్తి చేయవలెను అని నమస్కరించి విన్నవించెను. అది యేమని వశిష్ఠుల వారు ప్రశ్నించగా, నేనొక యజ్ఞమును సంకల్పించితిని, దానివలన పురజనులు సంతసింతురు. నేటి విచారము బాపి కొంత నగరమును శాంతపరచును. అది అశ్వమేధ యాగము. దానివి ప్రజలు కూడను చూడగోరుచున్నారు. మీకు భయపడి, భరతుడా విషయమును మీతో చెప్పుటకు శంకించెను. సమయము జూచి నేనే స్వయముగ చెప్పతలంచితిని. మీ ఆజ్ఞను శిరసావహించి ఆ ప్రకారము సంచరించెదము. ఈ ప్రకారము రాముడు వినయ విధేయతలతో విన్నవించిన వాక్యములను గురువు విని సంతోషించెను. ఓ రామా! నీ అభీష్టము సిద్ధించును. ఓ భరతా! లెమ్ము. అందుకు తగిన యేర్పాట్లు గావింపుము అని వశిష్ఠులవారు పలికిన పలుకులవలన అన్నతమ్ములును, మంత్రులును మొదలగు వారు సంతోషించిరి. వీరనేక విధముల గురువును స్తుతించిరి. వారి చరణములకు నమస్కరించి బ్రాహ్మణులు అనేకులు భరతుని వెంట నడచిరి.

సుమంతుడు పురజనులను సేవకులను బిలిచి నగరమును, రాజమార్గమును, అంగడివీధులను సింగారింపుమని ఆజ్ఞాపించెను. అచ్చటచ్చట మంటపములు నిర్మింపురవియు జెప్పెను. మంత్రి ఆజ్ఞానుసారము వారు వారి వారి పనులు అతిశీఘ్రముగా నెరవేర్చిరి. ఆనగరము కలకలమనుచుండెను. సేవకులు, మంత్రులు రాముని

దగ్గరకు వచ్చి మీ ఆజ్ఞ ప్రకారము, మునీశ్వరులకు వర్తమానము పంపితిమి అనిరి. అంత ఈ వార్తను గురువుగారికి తెలిపెను. ఓ రామా! జనక చక్రవర్తికి వర్తమానము పంపుము. వారు నీ యజ్ఞమునకు సకుటుంబసమేతముగా దయచేయగలరు. అని మృదుమధురముగా వశిష్ఠుడు తెలిపెను. ఓ రామా! మునీశ్వరులకు, బ్రాహ్మణులకు, మహర్షులకు, శుభలేఖలు వ్రాయుము అని పలికెను.

అంత శ్రీరాముడు గురువుగారితో కూడ అయోధ్యా నగరమును చూచుటకు బయలుదేరెను. ఇరువురు అయోధ్యానగర సింగారమును చూచి సంతోషించిరి. అంతలో సేవకులు దేశదేశములు పోయి ఆయా దేశాధిపతులకు శ్రీవారి శుభలేఖల నందజేసిరి. ఒక సేవకుడు మిధిలాపురమునకు వెళ్ళెను. జాంబవంతుడు, అంగదుడు, సుగ్రీవుడు, విభీషణుడు, నలుడు, నీలుడు మొదలగు వానరపుంగవులు విజయము జేసిరి. మునీశ్వర పుంగవులు గుంపులు గుంపులుగా నగరమునకు వచ్చిరి. వారలను యధాన్యాయముగ సత్కరించి ఆదరించిరి. వారికి తగిన బసలు యేర్పాటుజేసిరి.

విశ్వామిత్రుడు వచ్చెను. రాముడు వారిని ఆదరించి సత్కరించిరి. అగస్త్యుడు కూడనూ వచ్చెను; వారలకు తగిన వసతులు యేర్పరచి యుంచిరి. దేదీప్యముగ వెలుగుచుండిన యజ్ఞశాలను వారు చూచి ప్రసన్నులయిరి. మిధిలాపురమునకు పోయివుండిన సేవకుని చూచి ఆ నగరవాసులు సంతసించిరి. జనక చక్రవర్తితో సేవకుడు విన్నవించెను. ఆ వర్తమానము జనకుడు విని దిగ్గునలేచి కూర్చొనెను. అతని శరీరము పులకరించెను. అతని నేత్రములవెంట ఆనందబాష్పములుకారెను. అంత జనకుడు ఆ సేవకుని, శ్రీవారు తమ్ములతోగూడ క్షేమమా అని అడిగెను. ఓ నాధా! ఈ లేఖవలన సర్వమూ విశదమగును అని వాడు నమస్కారము చేసెను. లేఖను చక్రవర్తికి అందించెను. వాని కంఠము గద్గదమైపోయెను. మాట చెప్పలేక పోయెను. చక్రవర్తి యవస్థ నెవరు చెప్పగలరు. రాజనగరులో జయజయ శబ్దములు పుట్టెను. రాజబంధువు లందరూ ప్రసన్నులైరి. ఆ శుభలేఖ చక్రవర్తి పలుమారు చదివెను. అతడు సంతోషించి సేవకుని పిలిచి "ఓయీ! ఈ శుభవర్తమానము నగరములోనూ, పురజనులలోనూ, గ్రామములలోనూ చాటింపుము. దశవిధ వాయిద్యముల మ్రోయింపుము అని ఆజ్ఞాపించెను. అంత మంత్రిని పిలిచి అతనికి శుభలేఖను ఇచ్చెను. అతడు దానిని గైకొని నేత్రముల కద్దుకొని, వినయ పూర్వకముగా దానిని చదివి సంతోషించెను. అతడు శ్రీరామచంద్రుని స్మరించి భక్తి శ్రద్ధలతో ఆనంద బాష్పముల రాల్చెను.

నగరములో ప్రతిగృహమునందును మంగళ కలశములను నిలబెట్టిరి. రాజు

అనేక దానముల నిచ్చెను. ఆ జనకపట్టణము సకల సంతోషములతో తులతూగు చుండెను. దేవతలు జనక చక్రవర్తిని చూడ వచ్చిరా అన్నట్లు తోచెను. జనకుడు అయోధ్యానగరమునకు పయనమైవచ్చెను. దారిలో శతానందుని గృహమును దర్శించెను. ఈ శుభవార్త, తన గురువునకు విన్నవించెను. అతనుకూడా పరమానందము నొంది, చతురంగబల సమేతుడవై శీఘ్రముగా అయోధ్యను చేరుకొమ్ము అని దీవించెను. నగరమును కాపాడుటకై యోధులను నీమించి, ఒక పల్లకిలో గురువగు శతానందుడును, మరొక పల్లకిలో జనకచక్రవర్తి కూర్చొని దండుతో వెడలునపుడు భూమికంపించెను. ఆమహాయోధులు, అతిరధులు, మహారధశ్రేష్ఠులును ఎవరు లెక్కపెట్టగలరు. ఆ కూర్మముతో ఆదిశేషుడు కృంగెను. ఈ ప్రకారము చక్రవర్తి మునులతో ప్రయాణము సాగించి రెండు దినములలో అయోధ్యానగరమును సమీపించెను.

శ్రీవారు చక్రవర్తి ఆగమనమునువిని వారికి ఎదురుగావెళ్ళిరి. వారు పరస్పరానురాగములతో గలసిరి. విశాల స్థలములతో వారికొక కుటీరమును ఏర్పాటుగావించి యుండిరి అది అతి సుందరముగను, సరయూతీరమున చక్కని వనములో స్వర్గ భవనమా అన్నట్లుండెను. ఇతర దేశాధీశులను సత్కరించుటకు ముగ్గురు తమ్ములనూ వియోగించెను. శ్రీవారు జనకునివద్దకువచ్చిరి శ్రీవారు చక్రవర్తికి నమస్కరించి అతనివద్ద కూర్చొనిరి. జనకుడు పరమానందభరితుడయ్యెను. అతడు శ్రీవారి శిరస్సును ముద్దాడి మృదుమధురముగా ప్రసంగించెను. శ్రీరాముడు తగినవిధముగా సమాధాన మొసగెను. వారి పరిచర్యలకు సేనలను నియమించెను. తదుపరి మంత్రిని భరతుని పిలిచి చక్రవర్తిని సేవించుటకు భరతుని నియమించెను.

అంత పదివేల శిష్యులతోకూడి వశిష్ఠులవారు రామునివద్దకు వచ్చెను. ఓరామ చంద్రా! నామాట వినుము, వేదపురాణములు, సకలశాస్త్రములు ఘోషించుచున్నవి. మహాపురుషులు సహితము చెప్పుచున్నవి. ధర్మపత్ని వినాగా యజ్ఞముచేసిననూ సిద్ధిలేదు కనుక జానకిని రప్పించుము. ఆమె యజ్ఞమున కావశ్యకము. ఈప్రకారము మునిరాజు చెప్పిన మాటలకు రాముడు ఆశ్చర్యపడి సత్యాసత్యములు చెప్పక మౌనము ధరించి యూరకుండెను. ఓ మునిరాజా! నాప్రతిజ్ఞకు భంగము కలుగకుండా నా కులమునకు అప్రదిష్ట రాకుండా మీరు కార్యమును నిర్వహింపవలెను. నేను రెండవ వివాహము చేసుకొనను. జానకిని రప్పించుటవలన అప్రదిష్టవచ్చును." ఈ ప్రకారము శ్రీరాముడు విన్నవించెను. అపుడు వశిష్ఠుడు గొప్పగొప్ప ఋషులను పరికించి సంప్రదించెను. జానకిని రప్పించక తప్పదని అందరునూ పట్టుపట్టిరి.

అయితే సర్వధర్మ పరాయణుడు, సర్వదేవతా స్వరూపుడు, సర్వశాస్త్ర పారంగతు డైన శ్రీరాముడు కొంత యోచించి రత్నఖచితమగు బంగారుసీతను నిర్మించవచ్చును. సర్వశాస్త్రములు దీనిని అంగీకరించును. ఇందుకు ఎట్టి అభ్యంతరము వుండదని గట్టిగా చెప్పెను. అందుకు మునులు, గురువులు, సర్వజ్ఞులైన వారందరూ కాదనలేక పోయిరి. రాముడు సకల ధర్మసార స్వరూపుడు. అతనిని వంచించగలమా అని వారిలోవారు ఆశ్చర్యపడి అందుకు సమ్మతించిరి. ఒకదినములో సువర్ణసీతను చేయించి సర్వ ఆభరణములతో అలంకరించిరి. ఆ రూపమునుచూచి వచ్చినవారం దరూ నిజమగు సీతయని భ్రమించిరి. జానకియే ఆ ప్రతిమను చూచిన ఆశ్చర్య పడెడిది అని వేనోళ్ళ కొనియాడిరి.

సువర్ణ సింహాసనముపై వ్యాఘ్రాసనము వేసుకొని శ్రీరాముడు దానిపై కూర్చొనెను. పక్కనే బంగారుసీతను ఉంచుకొనిరి. అందరూ ఆ దృశ్యమునుచూచి సాక్షాత్ సీతయే వచ్చినదని ఆశ్చర్యపడిరి. సభఅంతయూ నమస్కరించెను. వశిష్ఠుల వారు జనబాహుళ్యమునుచూచి సేవకులనుపిలిచి ఓయీ సేవకులారా మీరీజనులను యధావిధముగా సత్కరింపుడు. వారు కోరిన పదార్థములను వారికిచ్చి వారిని తృప్తి పరుపుడని ఆజ్ఞాపించెను. గురువాజ్ఞ ప్రకారము సేవకులు శ్రీరామాజ్ఞ గైకొని అనేక వసతిగృహములు నిర్మించిరి. వారివారి మర్యాదల ప్రకారము సభికుల నుచి తాసనములపై భరతుడు కూర్చుండబెట్టెను. వారివారి భాగ్యమును, వారివారి అదృష్ట మును వారే కొనియాడిరి. ఐదువేల మహాయోధులు, ఐదువేల వేదాధ్యాయన సంప న్నులను యజ్ఞమును రక్షించుచుండిరి.

మాఘశుద్ధ విదియనాడు శ్రీరాముడు యజ్ఞముచేయ నారంభించెను. ఆదినమున అతడు యజ్ఞదీక్షలో ప్రవేశించెను. ఓరాజా! యజ్ఞపశువు దెప్పింపుము, వేదములో చెప్పబడిన లక్షణములు, దానికి కలవో లేవో చూడవలయును అని వశిష్ఠులవారు పలికిరి. గురువుగారి ఆజ్ఞపొంది, లక్ష్మణుడు సంతోషించి వారి చరణములకు నమస్కరించి అత్యుత్సాహముతో అశ్వశాల కతడువెళ్ళి యజ్ఞపశువును సింగారిం చెను. దాని వీపునకు రత్నఖచితమగు జీనును కట్టెను. నల్లనిచెవులను శ్వేతవర్ణము గల గుర్రముచూచి సూర్యుని గుర్రము సహితము సిగ్గుపడెను. ఆ గుర్రమును స్వయముగా మన్మధుడు సింగారించినట్లు కనబడెను. దాని శోభను వర్ణించుటకు శక్యముకాదు. సాక్షాత్సూర్యనారాయణమూర్తి రూపమును ధరించి వచ్చినట్లు అశ్వము ప్రకాశించెను. నీలమాణిక్యములతోకూడిన నెమలి పింఛమును దానిశిరస్సు నకు కట్టిరి. అంతరిక్షమున నక్షత్రమువలె ఆపింఛము తళతళ మెరిసెను. చతురు

లగు సేవకులు దానివెంట నడిచిరి. మెరుపువలె ప్రకాశించుచుండిన పట్టుత్రాడును దానిమెడకు తగిలించిరి. ఏడువేల మహాయోధులు రణధీరులు,శూరులు, అశ్వములపై నెక్కి లక్ష్మణునితోకూడి శ్రీరామునివద్దకు వచ్చిరి.

దిగ్విజయము నిమిత్తము విశ్వామిత్రుడు చెప్పినప్రకారము శ్రీరాముడు దానిని పూజించెను. షోడశ మహాదానముల నిప్పించెను. అభిషేకముచేసి సువర్ణపట్టమును వ్రాసెను. అందులో ఈవిధముగానుండెను. అయోధ్యానగరమున ఒకవీరుడు కలడు. అతడు శత్రుసంహారకుడు. అతనినిజూచి దేవేంద్రుడు సహితము భయపడెను. ఈ గుర్రము అతని యజ్ఞపశువు. బలవంతులు దానిని పట్టుకొనుడు లేక ఆ వీరునకు మీరు పన్ను చెల్లింపుడు, కాదేని వనములకు పొండు" ఈ ప్రకారము శ్రీరాముడు పట్టమువ్రాసి దాని ముఖమునకు కట్టెను.

ఇనవంశోత్తముడగు శ్రీరామునివద్దకు భార్గవాది మునులు వచ్చిరి. లవణాసురుని వృత్తాంతమును వారుచెప్పిరి. మహామునులు ఆ వృత్తాంతమును విని దుఃఖించిరి. వారిమాటలకు చింతించెను. ఆతక్షణము అతడు తనతూణీరమును తెప్పించెను. అందులో అమోఘమైన బాణమునుతీసి శ్రీరాముడు శత్రుఘ్నున కిచ్చెను. ఓయీ తమ్ముడా! నా మంత్రమును జదివి, నీవీ బాణమును వానిపై ప్రయోగింపుము. సకల దేశాధిపతులను జయించిరమ్ము అని ఆశీర్వదించి పంపెను. పిమ్మట శ్రీరాముడు విభీషణుని పిలిపించెను. అతడు శ్రీహరి చరణములకు నమస్కరించెను. ఓవిభీషణా! లవణాసురుని వృత్తాంతమును వివరముగా తెలుపమని కోరెను. అతడు చేతులు జోడించుకొని వివరములు ఉన్నదున్నట్లు తెలిపెను.

విభీషణునకు మారుతల్లి కలదనియు, ఆమెకు ఒక కుమార్తె కలదనియును, ఆమెపేరు కుంభీనస, ఆమెను రావణుడు మధుదానవునకిచ్చి వివాహము చేసెననియు, వాడు దానిని పరిగ్రహించెననియు ఆయన చెప్పెను. కాలాంతరమున దానిగర్భమున లవణాసురుడు పుట్టెను. వాడు శివునుద్దేశించి ఘోరమగు తపము నాచరించెను. ఓ నాథా! శివుడు వాని తపమునకుమెచ్చి వానికొక త్రిశూలమును యిచ్చెను. "ఓయీ! లవణాసురుడా! ఈ త్రిశూలము ధరించినవానిని యుద్ధములో వోడించుటదుర్లభము," అని శివుడు దాని ప్రభావమును వానితోచెప్పెను. వాడు నాటినుండీ దాని బలాబలము వలన సురాసురులను, నరనాగులను లక్ష్యముచేయక విచ్చలవిడిగా సంచరించుచున్నాడు. వాడు సకలజీవులను వెంట దరుముచుండెను. వానిచే జయింపబడని జీవులు లోకములో గనబడరు, అని ఈప్రకారము విభీషణుడు చెప్పిన వృత్తాంతమును శ్రీరాముడు విని నవ్వెను.

రామునకు తెలియని దేదియునులేదు. అయితే మాయామానుష వేషధారియై ఆ త్రిశూలమును తానే శివరూపములో అనుగ్రహించినదే, అని తనలోతాను నవ్వు కొని శత్రుఘ్నుని ఆదరించి తన దివ్యాంశము అతనిలో ప్రవేశపెట్టెను. శ్రీరాముని ఆజ్ఞప్రకారము మూడువేల రణభేరులు ధణధణమని మ్రోగెను. ఆ శబ్దమునువిని భూమి కంపించెను. గజతురగములు ధ్వనిచేసెను. సైన్యము శంఖములు పూరించి శత్రుఘ్నునివెంట నడచిరి. లవణాసురునిపట్టణమును ముట్టడించిరి. సైన్యపుయొక్క శబ్దములువిని లవణాసురుడు కోపముచేమండిపడి, అరువదివేలమంది రాక్షస యోధు లచే గర్జించుచూ కలియపడిరి. వాడు అనేకమాయలను పన్నిననూ విడువక వాని సైన్యము పకాపికలయ్యెను. కడకు లవణాసురుని కొడుకులు కలియబడిరి. వారిని శత్రుఘ్నుని కుమారులైన సుబాహుడు యెదుర్కొని లవణాసురుని కొమరులనిద్దరినీ వీరస్వర్గమున కంపెను. కడకు శత్రుఘ్నుడు రామనామమును స్మరించి రామబాణ మును సంధించి ప్రయోగించెను. వాడు దానితో వ్యాకులపడి ప్రాణములను విడిచి పెట్టెను. దేవతలు జయజయధ్వనులుచేసి శత్రుఘ్నుని దీవించిరి.

అంత శత్రుఘ్నుడు యమునానదికి నమస్కరించి, చతురంగ సైన్యముతో ఉత్సాహముగా వెడలిరి. ఈ ప్రకారముగా వారు నలుదిశలు గ్రుమ్మిరి. వాల్మీకి మహర్షి నివసించు ఆశ్రమమున బొడగాంచిరి. ఆ ఆశ్రమములో జానకి పుత్రులిరు వురూ సూర్యునివంటి ప్రచండ పరాక్రమవంతులు కలరు. ఆ పుత్రులు గుఱ్ఱమును జూచి దాని లలాటమున నుంచిన పత్రము చదివి దానిని బంధించిరి. తరకసమును నడుమునకు గట్టుకొని ధనుర్బాణములను ధరించి వారు యుద్ధమునకు సిద్ధముగ నుండిరి.

ఆ గుఱ్ఱమును సంరక్షించుచుండిన సహస్రవీరులు కుమారులవద్దకు వచ్చిరి. వృక్షమునకు బంధింపబడిన గుఱ్ఱమునుచూచి వారా కుమారులు, బాలకులని తెలిసి కొని శాంతించిరి. "ఓ కుమారులారా! మీ తల్లిదండ్రులు ధన్యులు. మీరాగుఱ్ఱమును విడచి మీ గృహములకు పొండు" అనిరి;

"ఓయీ వీరులారా! యుద్ధమునకువచ్చి భిక్షము నడుగుట యుచితమా! అట్లు యాచించుటవలన క్షత్రియ కులమునకు మచ్చవచ్చుకదా" అని పిల్లలు హీనముగా మాట్లాడుటచూచి రక్షకభటులు "ఓయీ శూరులారా! క్షత్రియకులమునకు మచ్చ తీసుకొనివచ్చుట మంచిదికాదు! జాగ్రత్తగాచూచి, మాట్లాడుడు" అని కొంత వీర వచనములుపలికిరి. అందులకు పిల్లలు పక్కుననవ్వి "అయ్యా, మీవంటి బలహీను లను గుఱ్ఱమును సంరక్షించుటకు పంపిన వారెంత వీరులోకదా! మీకు బలము లేని

యెడల మీ గృహములకుపొండు" అని కుశలవులు పలికిన కర్ణకఠోరమగు పలుకులు యోధులువిని వారు బాలురని తెలిసియు వారిని యెదుర్కొనిరి.

లవుడు ధనుస్సును ధరించి ఆడుచూ పాడుచూ బాణపరంపర ప్రయోగించి ఆ వీరుల శరీరములు చిల్లులుపొడిచెను. ఆ శూరులు నేలపడి మూర్ఛిల్లిరి. కొందరు పరుగున శత్రుఘ్నుని కడకువచ్చి "ఓ మహారాజా! ఇరువురు కొమరులు మునిబాలకులు మన గుఱ్ఱమును బంధించి మన యోధుల ననేకుల సంహరించిరి," అని మొఱపెట్టుకొనిరి. ఆ మాటలకు శత్రుఘ్నుడు కోపించి చతురంగ బలమును మోహరించి కుశలవులపైకి నడచెను.

అతిరథ శ్రేష్ఠులగు కుమారుల నతడు చూచి సిగ్గుపడెను. ఈ ఇరువురూ బాలురు కదా! వీరితో నెట్లు యుద్ధము చేయగలను అని చింతించెను. "ఓ ముని బాలులారా! మీరు గుఱ్ఱమును విడిచి గృహములకు పొండు. మీరు పూజనీయులు కనుక మీతో యుద్ధము చేయరాదు." అనిశతృఘ్నుడు వారికి బోధించెను. "ఓరాజా! మీపేరేమి? మీ నగరమేమి? మీరు సైన్యముతో వనమున యేల సంచరించుచున్నారు? యే కారణముచేత మీరీ గుఱ్ఱమును విడిచి పెట్టితిరి? యెందుచేత దాని లలాటమునకు పట్టముకట్టితిరి? ఓరాజా! మీకు బలపౌరుషములు లేనియెడల మీరు పట్టమును తీసి గుఱ్ఱమును విడచి గృహమునకు పొండు" అని ఈ ప్రకారము కుశలవులు పలికిన సూటిమాటలకు శతృఘ్నుడు తలవంచుకొనెను. శస్త్రాస్త్రముల కట్టుమని వీరుల కాజ్ఞాపించి అతడు ముసిముసి నవ్వులు నవ్వెను. "ఆహా! యెంత బలవంతుడీ రాజు! చప్పట్లకు సింగము భయపడునా!" అని కుశలవులు పక్కున నవ్విరి. గురువగు వాల్మీకిని స్మరించి ధనుర్బాణములను ధరించిరి.

కుశలవులు శరపరంపరుల అతని రథముపై వర్షించి అతని శరీరమునందు చిల్లులు పొడిచిరి. అతని యోధులు నేలబడిరి. మూర్ఛిల్లిరి. ఆ కుమారులు ఒక్కొక్క వీరుని పిలిచి వారిని సంహరించిరి. కొందరు పిరికి పందలు పరుగెత్తుక శ్రీరాముని వద్దకు వెళ్ళిరి. ఆ వృత్తాంతమును శ్రీవారికి విన్నవించిరి. ఆ బాలకుల గుణగణములను శౌర్య పరాక్రమములను వర్ణించి చెప్పిరి. యుద్ధము చేయువారు ముని కుమారులు కారని శ్రీరామునికి తెలిసియూ, గుట్టును బైట పెట్టక ముని కుమారులనే భావమును పైన ప్రకటించుచూ ఆ మునికుమారులతో యుద్ధముచేయుట యెట్లు అని చింతించి "ఓ వీరులారా! అయిననూ చేయక తప్పదు. మీరు లక్ష్మణునితో యుద్ధమునకు వెడలుడు" అని బలాత్కారముగ వారలను పంపెను. అంతేకాక ఆ బాలురను బంధించి ఇటు తీసుకొని రండు అని, వారు మునికుమారులు కనుక యే

విధముగను వారిని చంపకూడదు వారు వధార్హులు కారు అని ఈ ప్రకారము శ్రీరాముడు ఆజ్ఞాపించెను.

అంత లక్ష్మణుడు చతురంగ బలములతో దండెత్తెను. అతడు ఆ యుద్ధ భూమికి వచ్చెను. మూర్ఛపడి యుండిన ఆ యోధులను చూచెను. విస్మయపడి ముని కుమారులతో ఇట్లనెను: "ఓ బాలులారా ! గృహములకు పారిపోవుడు. సూర్యవంశపు రాజులు దేవబ్రాహ్మణుల రక్షించెదరు. మీరు బ్రాహ్మణ కుమారులు, మీతో పోరాడుట మాకు శ్రేయస్సుకాదు. మీరు నా కన్నులయెదుటనుండి వెళ్ళిపొండు ! మిమ్ము లను చూచిన నా శరీరము క్రోధముచే మండుచున్నది" అని లక్ష్మణుడు చెప్పిన మాటలను కుశలవులు విని ఫక్కున నవ్విరి. "ఓ రణధీరుడా ! నీ తమ్ముని దుర వస్త చూచి నీ గృహమునకు వెడలి పొమ్ము" అని వారు పలికిరి.

ఆ మాటలు లక్ష్మణుడు విని మూర్ఛిల్లి యుండిన తమ్ముని జూచి ధనుస్సును సంధించెను. ఆ మునికుమారులతో పోరాడుట సూర్యకులాచారమునకు విరుద్ధమని లక్ష్మణుడు విచారించి సంకోచించెను. "ఓ బాలులారా ! మీకు బుద్ధిలేదు; మీరు కేవలము బాలురు; మీతో పోరాటమువలన లాభములేదు; కనుక మీకు తోడు పడు వారిని తీసుకొని రండు." ఇట్లు లక్ష్మణుడు చెప్పుచుండినను అతని మాటలను లక్ష్యము చేయక కుశుడు తీవ్ర బాణమును ప్రయోగించెను. ఆ బాణమునకు భూమి కంపించెను. ఆ బాణము అంతరిక్షమున వ్యాపించెను. సూర్యబింబము మొరుగపడెను. కుశలవుల ప్రతాపమును సహించలేక లక్ష్మణుడు కోపించి వారి నెదుర్కొనెను. అతడు రథములను నిలువబెట్టి, నిశ్చింతముగ యుద్ధము చేయ నారంభించెను.

కుశలవులు అతని బాణములను ఖండించిరి. అన్నదమ్ములిరువురూ అతి చమత్కారముగ యుద్ధము చేయుచుండిరి. అపుడు లక్ష్మణుడు ఒక గదను మహావేగముతో ప్రయోగించెను. ఆ గద తగిలినందున కుశుడు వ్యాకులపడెను. అందుచేత అతడు మూర్ఛిల్లపడెను. లవుడు కోపించి వచ్చుచుండిన లక్ష్మణుని వక్షస్థలముపై ఒక బాణమును ప్రయోగించెను. ఆ బాణము తగిలినను లక్ష్మణుడు బలవంతుడు కనుక నేలమీద పడలేదు. అనంతరము లవ–లక్ష్మణులు మల్లయుద్ధము చేసిరి. వారు పట్టును విడువక సమానముగ పోరాడిరి. అనేక మాయోపాయములచే నొకరినొకరు గ్రుద్దుకొనిరి. పూర్ణబలమును చూపించి వారు పోరాడిరి. లవుడు లక్ష్మణుని పిడుగువంటి గ్రుద్దుగ్రుద్దెను. లక్ష్మణుడు అందులకు వ్యాకులపడి లవుని గ్రుద్దుకు మెచ్చుకొనెను. లక్ష్మణుడు శ్రీరాముని స్మరించి కుశునిపై ఒక బాణము విడచెను. ఆ బాణము తగిలి కుశుడు మూర్ఛిల్లెను.

కుశుడు వాల్మీకిని సీతను స్మరించి మూర్ఛనుండి లేచి యుద్ధమునకు వెడలెను. అతడు ధనుర్బాణములను ధరించి ముందుకు వచ్చి లక్ష్మణునిచూచి మండిపడెను. అతడొక తీవ్ర బాణమును సంధించి లక్ష్మణునిపై ప్రయోగించెను. మేఘనాధునిపై ప్రయోగించిన బాణములను లక్ష్మణుడు ప్రయోగించినమా అవి కుశలవులకు ఆడు మాదిరిగా తోచినవి. అంత లక్ష్మణుడు అహా ! ఈ వుపద్రవము సీతా వియోగమువలన సంభవించెను. నా శరీరమును విడచిపెట్టిన గానీ ఈ దుఃఖముపోదు, అని దుఃఖించెను.

ఆ సమయమున వాల్మీకి ఉపదేశించిన బ్రహ్మాస్త్రమును కుశుడు సంధించెను. మూడు లోకములు గడగడ వణకెను. దానిని లక్ష్మణుని హృదయమునకు తగులునట్లు సంధించి విడచెను. ఆ బాణముతో లక్ష్మణుడు మూర్ఛిల్లెను; అంతే దూత శ్రీరాముని సమీపించి, ఈ ఘోరమైన వార్తను తెలిపెను. భరతుడు చింతాక్రాంతుడై చేతులు జోడించుకొని, "ఓనాధా ! సీతను విడచి పెట్టినందుకు మనము తగిన ఫలమును అనుభవించుచున్నాము" అని విచారించెను. అంత శ్రీరాముడు తమ్మునితో "యేమి ? నీకు యుద్ధము చేయుట భయమేసి ఈ విధమైన నెపమును పూనితివా మంచిది ! అట్లయిన నేనే స్వయముగా యుద్ధమునకు బోగలను, నారధమును సిద్ధము జేయుము. ఇంతటితో యజ్ఞము జాలింపుము ! నేను వెళ్ళి ఆ బాలుర పూర్వోత్తరములను విచారింతును. తమ్ముడా ! నా పూర్వపు మిత్రులకును, సఖులకును వర్తమానము పంపుము. హనుమంతుని యుద్ధమునకు తీసుకొని రమ్ము" అని చెప్పి శ్రీరాముడు యుద్ధ భూమికి వచ్చెను.

అక్కడ రక్త కాలువను చూచి ఆశ్చర్యపడెను. ఆ సమయమున కుశలవులు మహావీరులు రణ స్థలమునకు వచ్చిరి. వారిరువురనూ చూచి వానర యోధులు భయపడిరి. అపుడు హనుమంతుడు ధైర్యముతో "ఓ బాలులారా ! మీ వంటి బలవంతులగు కుమారుల గనిన తల్లిదండ్రు లెవరు ? వారు ధన్యులు." ఈ మాటలకు కుశలవులు మండిపడి అతనితో "ఓయీ ! వానరుడా ! నీకు శక్తిలేని యెడల వెనుకకు పొమ్ము. అధిక మాటలు ఆడకుము," అనెను. ఆ మాటలకు భరతుడు పౌరుషము తెచ్చుకొని, "ఓ వీరులారా ! శస్త్రాస్త్రముల ప్రయోగింపుడు" అని భరతుడు ఆజ్ఞాపించెను. అంత వానరులు వృక్షములు, పర్వతములు పట్టుకొని రువ్విరి. లవుడొక బాణమును ప్రయోగించి వానిని చూర్ణము చేసెను. కొంతకాలములోనే రాముని చతురంగ బలము విరిగిపడెను. రక్తము ప్రవహించెను. మహాయోధులందరూ ప్రాణము విడచిరి. కడకు భరతుని కూడ మూర్ఛిల్ల చేసిరి.

అంత రాముడు చతురంగ బలసమేతుడై రౌద్రాకారుడై రణరంగమునకు వచ్చి కుమారుల నిరువురనూ చూచి బాణములను ప్రయోగించలేక, వారిని రప్పించి వారితో "ఓ బాలులారా ! మీ తల్లిదండ్రు లెవరు ? ఎచ్చట నివసించెదరు ? మీ దేశముపేరేమి?" అని అడిగెను. అపుడు లవుడు "ఓ రాజా ! ఈ మాటల వలన ప్రయోజనమేమి ? మీ అన్నదమ్ములకు నలుగురికీ ఒకే సాంప్రదాయ మన్నమాట! ధనుర్బాణములు సంధించి యుద్ధము చేయుము ; వావివరస లడుగుటకు పెండ్లింటి విందు కాదు కదా ఇది" అంత రాముడు, "బాలకులారా ! మీ దేహములు అతి కోమలములు. మీ నామములు వంశములు తెలుసుకొనినగానీ నేను మీతో పోరా డను," అని పలికెను. "ఓ రాజా ! మా తల్లి జనక చక్రవర్తి కూతురు జానకి. వాల్మీకిముని మాపోషకుడు. మా తండ్రిపేరునూ, మా వంశముపేరునూ మాకు తెలి యదు. మేము కుశలవులము. మేము వనవాసులము." అని వారిరువురు చెప్పిరి.

వారు తన కుమారులని తనకి మొదలే తెలిసియుండినప్పటికినీ ప్రాపంచిక ముగా ఇపుడు తెలుసుకొనినటుల నటించి, "ఓయీ ! కుమారులారా ! వెనుక నుండి నా సైన్యము వచ్చును. వారితో యుద్ధము చేయుడు'' అని వెనుకకు తిరిగి మూర్ఛి ల్లిన అంగద, జాంబవంత, హనుమంతులను మూర్ఛ నుండి లేపెను. ముందుకు నడియబోవు దానిని చాటించుటకై మూర్ఛిల్లిన, లక్ష్మణ, భరత శత్రుఘ్నులను మూర్ఛనుండి లేవదీసెను. వచ్చిన సైన్యముతో "ఓ సేనలారా ! కీర్తి మర్యాదల నిలబెట్టుటకై యుద్ధము చేయుడు.'' అంత వెనుకనుండి లవకుశులు ధనుర్బాణము లను పట్టి సేనలతో యుద్ధము చేయుచుండిన ఆ బాలురను జూచి రాముడు తనలో తాను ఆనందించెను.

అంత వానరవీరులు ఒకవైపున యేమియు చేయజాలక, వీరలను జయించు వారు పదునాలుగు భువనములందునూ లేరని వారిలోవారు తలంచుచూ వూర కుండిరి. ఇంతలో కుశుడు రాముని మీదకు వెడలెను. అంత రథములోని రాముడు మూర్ఛిల్లెను. కుశుడు రథములపై అశ్వములపైయున్న అలంకారములు తీసికొని కుశలవులు హనుమంతుని బంధించి వెంటబెట్టుకొని గృహమునకు వెడలిరి. చక్కని వస్త్రములను, భూషణములను ధరించి వానర భల్లూకములను వెంటబెట్టు కొని గుఱ్ఱముతో కూడి కుశలవులు జానకిని సమీపించి ఆమెకు నమస్కరించిరి. తెచ్చినవాటిని ఆమెకు కానుకగా సమర్పించిరి. వానరులను భూషణములను జానకి చూచి దిగ్భ్రాంతి జెందెను.

# అవతారనాటక సమాప్తం

అంతలో వాల్మీకిమహర్షి చింతాక్రాంతుడై వచ్చెను. అతడు జానకికి, జరిగిన వృత్తాంతమంతయూ విన్నవించెను. అతడు హనుమంత, జాంబవంతుల బంధనము లనువిప్పి "ఓ బాలులారా! ఎంతపని జేసితిరి. రామలక్షణ, భరత, శత్రుఘ్నులను పడత్రోసి వచ్చితిరికదా?" అని విచారించెను. ఆ మాటలువిని "అయ్యో! కుమారు లారా, మీ వలన వంశమునకే మచ్చవచ్చెను. ఇక నిదానించక సహగమనమునకు సిద్ధముచేయుడు; నేనిక జీవించను" అని సీత మొఱపెట్టెను. వాల్మీకిమహర్షి సీతను వోదార్చి ఆమెకు ధైర్యము జెప్పిరి; అతడు కుశలవులను తీసుకొనివచ్చి రణస్థల మునుచూచి ఆశ్చర్యపడెను.

శ్రీరాముని రథమును, గుఱ్ఱములను గుర్తుపట్టి అతని చరణములకు వాల్మీకి నమస్కరించెను. ఆతురతతో రాముడు దిగ్గునలేచి కూర్చొనెను. కుశలవులు అతని యెదుట నిలువబడియుండిరి. వాల్మీకిమహర్షి శ్రీరామునితో "ఓ నాథా! నా జన్మము సఫలమయినది. నేనెంత ధన్యుడను" అని విన్నవించి, లక్ష్మణుడు సీతను, వనములో విడచిపెట్టిన వృత్తాంతమును, కుశలవుల జననమును శ్రీరామునికిజెప్పెను. "ఓ నాథా! కుశలవులు నీ కుమారులు; పంచభూతముల సాక్షి వీరు నీ కుమారులు. ఈ మాటలు విని శ్రీరాముడు కుమారులను కౌగిలించుకొని శిరస్సులను ముద్దాడెను. అంత మృత వానరులు, యోధులు రామునను గ్రహముచే లేచిరి. లక్ష్మణ భరత శతృఘ్నులు సహి తము ఆ బాలురను ముద్దాడిరి. లక్ష్మణుడు జానకివద్దకు వెళ్ళెను. రాముడు లక్ష్మణుని పిలిచి "ఓ తమ్ముడా! నామాటవినుము. నీవు జానకినిసమీపించి శబధమును గురించి ఆమె ఉద్దేశమును కనుగొనుము," అని చెప్పెను.

అతడు జానకిని సమీపించి ఆమె చరణములకు నమస్కరించెను. శ్రీరాముని యిచ్ఛానుసారము జానకి శబధమును చేయుటకు సిద్ధపడి లక్ష్మణునితోకూడి రామ సన్నిధికి వచ్చెను. ఆమె సభ్యులచూచి సత్యముగా ఇట్లు ప్రమాణముచేసెను. "ఓ

దేవతలారా! పంచభూతములారా! మనోవాక్కాయ కర్మలచే శ్రీరాముని తప్ప మరి యొక పురుషుని స్వప్నమందైననూ నేను ధ్యానించి యుండలేదు. ఓ తల్లీ! భూదేవి! నన్ను నీలో గలుపుకొమ్ము", అని జానకి ప్రార్థించి శ్రీరాముని పాదములకు నమస్కరించెను. తక్షణమే పటపటమని భూదేవి బ్రద్దలయ్యెను. ఆ బిలమునుండి ఒకదివ్య సింహాసనము వెడలెను. దానిపై భూదేవి మూర్తిభవించి ఆమెచేతులుచాచి జానకినెత్తుకొని దీవించెను. "ఓ జానకి! పుట్టినదిమొదలు నేటివరకు నీవు దుఃఖపడని దినములులేవు. యెల్లప్పుడూ నీవు కన్నీరు కార్చుచుంటివి రావమ్మా! నా యింటనే సుఖముగ నుండుము" అని పలికెను. ఒకనిమిషములో వారిరువురూ తిరోహితు లయిరి. ఆమెఖ్యాతి మూడులోకములకూ వ్యాపించెను.

లక్ష్మణాది అనుజులు కన్నులారా జూచుచుండిరి. వారు కన్నీరు గార్చిరి. రాముడు విచారించునటుల నటన సలిపెను. జానకి నామనోవ్యాపారము ననుసరించి వెడలెను. ఆమె నా మనస్సు గ్రహించి సంచరించెను. ఇక మేము మా వైకుంఠ ధామమునకు వెడలవలయును. అని చింతించి కొంత దుఃఖించినటుల నటన సలిపి తమ్ములతో, కుమారులతోకూడి రాజధానికివచ్చి యజ్ఞము సమాప్తముజేసెను. అతడు చేసిన షోడస మహాదానములు యెవరునూ వర్ణించలేకపోయిరి.

శ్రీరాముడు, జనక చక్రవర్తిని సత్కరించి కుమారులను పరిచయము చేసెను. మనుమలనుచూచి పరమానందపడెను. అతడు మహాజ్ఞాని కనుక దివ్య దృష్టితో సీతయొక్క దివ్యత్వమును గుర్తించి, వారు కనుక జరిగిన దానికేమాత్రమూ చిత్తవిచిత్తమునూలేక ఆశ్చర్య అద్భుతములనూ వెలిబుచ్చక జరుగవలసిన రీతిలో జరిగినదని చలించని మనస్సుతో, భ్రమించని దృష్టితో తనకిట్టి భాగ్యము లభించెను కదా అని ఆనందించెను.

జనకుడు అమితానందముతో మిథిలా పురమునకు వెడలెను. గురువులూ, బ్రాహ్మణులూ రాముని వర్తమానము ప్రకారము రాముని సన్నిధికి వచ్చిరి. ఈ ప్రకారము యజ్ఞము జూడ వచ్చినవారు స్వగృహములకు సంతోషించుచూ నిష్క్రమించిరి.

తరువాత అయోధ్యానగరమునకు కుమారులబిలిచి వారలకు రాజధర్మముల నుప దేశించి వారలకు రాజ్యపట్టముగట్టెను. భరతునికుమారుడు తక్షునకు దక్షిణ రాజ్యము నిచ్చెను. భరతుని రెండవ కుమారుడు పుష్కరునకు పుష్కరనగర రాజ్యమునిచ్చెను. ప్రస్తుతమున రాక్షసులను సంహరించి నగరములను వారు స్థాపించిరి. లక్ష్మణుని కుమారులు మహాబలవంతులు, శూరులు. చిత్రకేతుడు, చిత్రాంగదుడు. వీరు రణ

ధీరులు. పశ్చిమ రాజ్యమున రాక్షసులను సంహరించి, నగరములను వీరు స్థాపించిరి. వేరువేరు పేర్లుగల రెండు నగరములను రాముడు, లక్ష్మణుని కుమారులకు పట్టము గట్టెను. అందరికీ రాజధర్మముల నుపదేశించెను.

అయోధ్యానగరమును కుశునకిచ్చి పట్టము గట్టుటచేత లవునకు ఉత్తరఖండ భూములు సకల సంపదలకు నిధానము. అచ్చట లవ పురమును రాజధానిగాజేసి (అనగా లాహోర్) దానిని లవునకు పట్టము కట్టెను.

గోవులు, భూములు, వస్త్రములు, ధనము, గృహములు, ఈవిధముగా శ్రీరాముడు వారివారికి చాలినంత ఇచ్చెను. ఇంతలో శ్రీరాముడు స్వధామమునకు బోవు చున్నాడన్న వార్త పురజనులు విని రాముని దగ్గరకు వచ్చి మా విన్నపములు ఆలకింపుమని ప్రార్థించి, మమ్ములనుకూడా తమతో మీ లోకమునకు తీసుకొని పొందు యని ప్రార్థించిరి. శ్రీవారు అందులకు మంచిదని సమ్మతించి, వారి అనురాగమునకు, ప్రభుభక్తికి సంతసించెను. కిష్కింధా రాజ్యమును అంగదున కిప్పించెను. సుగ్రీవుడు, జాంబవంతుడు, విభీషణుడు, నలుడు ఈ మొదలగు దేవతాంశ సంభూతులు, కోట్లకొలది వానరులు, ఆ సమయమునకు శ్రీరాముని దగ్గరకు వచ్చిరి. అంత వారందరినీ పిలిచి విభీషణా! నీవు లంకా రాజ్యమును పరిపాలింపుము. అంతమున నీకు నా సన్నిధి లభించును అని దీవించెను.

జాంబవంతా! ద్వాపర యుగాంతమువరకు నీవు భూలోకములో నుండుము. అపుడు నేను కృష్ణావతారుడనై నీతో పోరాడగలను. అపుడు నీవు నన్ను గుర్తింతువు అని దీవించెను. తరువాత లక్ష్మణుడు పురజనులతో స్వయముగా సరయూ తీరమునకు వచ్చి చేరిరి. రాముని దక్షిణవైపున భరతుడును, వామమున శత్రుఘ్నుడును, వారివెనుక మంత్రులు, పురజనులు క్రమముగా నడచిరి. భరతుడు శ్రీవారిలో లీనమయ్యెను. శత్రుఘ్నుడు జలములను స్పర్శించి పద్మములో ప్రకాశించుచూ శ్రీపతిలో లీనమయ్యెను.

అంత ఈ పుణ్యభూమికి వచ్చినవారును, పవిత్రమగు సరయూనదిలో స్నానము చేసినవారును నన్ను చేరగలరని ఆశీర్వదించెను.